# ఆంధ్రవాసిష్ఠ రామాయణము

(వాల్మీకి విరచిత యోగవాసిష్ఠమున కనువాదము)


గ్రంథకర్త :

అద్వైత వేదాన్త శిరోమణి, మీమాంసా విశారద,

మల్లావఝుల వెంకటసుబ్బరామశాస్త్రి

వైస్ ప్రిన్సిపాల్, విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల, వరంగల్.



ప్రథమ ముద్రణము (1000)

1960

శ్రీ

# ఆంధ్ర వాసిష్ఠ రామాయణము

卐

ఈ గ్రంధ ముద్రణమునకు

ప్రధాన సాహాయ్యకులు

గాయత్రీ పీఠాధిపతులు

శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామి

బందరు



ప్రథమ ముద్రణము
1000 కాపీలు

మూల్యము :
8—0—0

## సమర్పణము

శ్రీ
సద్గురు చరణ సరోజములకు.

గ్రంథకర్త.



శ్రీ గీతా పవర్ ప్రెస్, వరంగల్.



॥ श्री शृङ्गेरी श्री जगद्गुरु संस्थानम् ॥

श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य पदवाक्यप्रमाणपारावारपारीण यमनियमासन प्राणायाम प्रत्याहारध्यानधारण समाध्यष्टांग योगानुष्ठाननिष्ठ तपश्चक्रवर्त्यनाद्यविच्छिन्न श्रीशंकराचार्य गुरुपरम्पराप्राप्तषड्दर्शनस्थापनाचार्य व्याख्यान सिंहासनाधीश्वर सकलनिगमागमसारहृदय सांख्यत्रयप्रतिपादक वैदिकमार्ग प्रवर्तक सर्वतन्त्र स्वतन्त्रादि राजधानी विद्यानगर महाराजधानी कर्णाटकसिंहासन प्रतिष्ठापनाचार्य श्रीमद्राजाधिराज गुरुभूमंडलाचार्य ऋष्यशृंगपुरवराधीश्वर तुङ्गभद्रातीरवासि श्री मद्विद्याशंकर पादपद्माराधक श्रीजगद्गुरु श्री चन्द्रशेखरभारतीस्वामि गुरुकरकमल सञ्जात ॥

## श्री जगद्गुरु शृङ्गेरी श्रीमदभिनव विद्यातीर्थ स्वामिभिः ॥

अस्मदत्यन्त प्रियशिष्य ब्रह्मश्री मल्लावझल वेंकटसुब्बरामशास्त्रि विषये श्री मन्नारायण स्मरणपूर्वकं विरचिता आशिषः समुल्लसन्तुतराम् ॥

बाल्य एव यथासंप्रदायं अद्वैतवेदान्तशास्त्रं जैमिनीयं दर्शनं च सम्यगधीत्य शास्त्रानुसारं धर्ममाचरन्तो भगवन्तमुमाकान्तमाराधयथ यूयमिति विदित्वा प्रसीदामो वयम् । भाग्यनगरात् प्रस्थाय वरंगलनगरे द्वित्रदिनानि निवासः कृतोऽस्माभिः । तन्नगर विराजमान - विश्वेश्वर - संस्कृतान्ध्र - कलाशाला-ध्यापक - पदमधितिष्ठन्तो यूय अस्मद्दर्शनावसरे युष्मद्विरचितं ज्ञानयोग वासिष्ठ रामायणस्य आन्ध्रानुवादरूप "आन्ध्र वासिष्ठ रामायणमु" नामकं ग्रन्थं तत्र तत्र वाचयित्वा अनुवादशैलीं पर्यचाययत । मुमुक्षूणां तत्वबुभुत्सूनां च परममुपकारकमिदं रामायणमिति सर्वत्र प्रसिद्धम् । अतिविस्तृतं ग्रन्थमिमं आन्ध्रभाषया अनूद्य संस्कृतानभिज्ञानां तत्वबुभुत्सूनां आन्ध्राणां महान्तमुपकारं अकुरुतेति विश्वसिमः ॥ अनुवादोऽयं नितरां सरलः सरसश्च । अद्वैतवेदान्तशास्त्रविदां युष्माकमयमनुवादः सर्वात्मना शास्त्रमनुवर्तत इतिप्रमोदस्थानमेतत् ॥ आन्ध्र वाशिष्ठ रामायणमिदं विशिष्टशिष्टजनादरमवाप्य प्रथतां ग्रन्थप्रणेतारो यूयं चिरमभिवर्धध्वमिति च आशास्महे ॥

स्तम्भाद्रिः खिम्मम्<br>
शार्वरि ज्येष्ठशुद्धष्टमी ॥

ఓమ్

# "శ్రీ శృంగేరీ శ్రీ జగద్గురు సంస్థానమ్"

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య, పదవాక్య ప్రమాణపారావార పారీణ, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠ, తపశ్చక్రవర్త్యనాద్య విచ్ఛిన్న శ్రీ శంకరాచార్య గురుపరంపరాప్రాప్త షడ్దర్శన స్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల నిగమాగమ సార హృదయ సాంఖ్యత్రయ ప్రతిపాదక, వైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర ఆది రాజధానీ విద్యానగర మహారాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య శ్రీ మద్రాజాధి రాజగురు భూమండలాచార్య ఋష్యశృంగపురవరాధీశ్వర తుంగభద్రా తీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీ జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీ స్వామి గురుకరకమల సంజాత

# శ్రీ జగద్గురు శృంగేరీ శ్రీ మదభినవ విద్యాతీర్థ స్వాములచే

మా కత్యంత ప్రియశిష్యుడగు బ్రహ్మశ్రీ "మల్లావఝల వేంకట సుబ్బరాయ శాస్త్రి విషయమున, శ్రీమన్నారాయణ స్మరణ పూర్వకముగ జేయబడిన ఆశీస్సులు మిక్కిలి ప్రకాశించుగాక"

బాల్యమునందే సంప్రదాయానుసారముగ అద్వైత వేదాన్త శాస్త్రమును, జైమినీయ దర్శనమును బాగుగ జదివి శాస్త్రానుసారముగ ధర్మము నాచరించుచు, మీరు భగవంతుడగు పరమేశ్వరుని యారాధించుచుంటిరని విని మేము సంతసించితిమి. హైదరాబాద్ నగరము నుండి బయలుదేరి మేము వరంగల్ నగరమున రెండు మూడు రోజులు నివసించి యుంటిమి. ఆ నగరమునందలి "విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలాధ్యాపక పదము నలంకరించియున్న మీరు, మమ్ము దర్శించు సమయమున, మీచే రచించబడిన, "యోగ వాసిష్ఠ రామాయణ"మునకు ఆంధ్రానువాదరూపమయిన "ఆంధ్ర వాసిష్ఠ రామాయణము" అను గ్రంథమును అచ్చటచ్చట జదివి వినిపించి అనువాద శైలిని పరిచయము చేసిరి. ముముక్షువులు తత్త్వబుభుత్సువులగు వారల కీగ్రంథము పరమోపకారకమని ప్రసిద్ధి జెందినది. అతి విస్తృతమగు నీ గ్రంథమును ఆంధ్ర భాషలో ననువదించి సంస్కృత భాషానభిజ్ఞులు, తత్త్వ జిజ్ఞాసువులు అగు నాంధ్రులకు మహోపకారమును జేసిరని విశ్వసించుచున్నాము. ఈ యనువాదము మిక్కిలి సరలము సరసమునయి యున్నది. అద్వైత వేదాన్త శాస్త్రవేత్తలగు మీ యొక్క యనువాదము సంపూర్ణముగ శాస్త్రము ననుసరించుచున్నదని మిక్కిలి సంతోషము. ఈ యాంధ్ర వాసిష్ఠ రామాయణము, విశిష్ట శిష్టజనుల యాదరము నొంది ప్రసిద్ధి జెందుగాకయనియు, గ్రంథ ప్రణేతలగు మీరు చిరకాల మభివృద్ధిని గాంతురుగాక యనియును మేము ఆశించుచున్నాము.

శార్వరి జ్యేష్ఠ శుద్ధ
అష్టమీ

# పండితాభిప్రాయము



న్యాయవేదాంత విద్యాపారీణ, తర్కరత్న, దర్శనాలంకార
శ్రీయుత బులుసు అప్పన్నశాస్త్రిగారు (భట్నపల్లి)

మానవుడు చతురశీతి జంతు సంతానములోఁ బరమ పురుషార్థాధికారిగాన సర్వోత్కృష్టుడు. అట్టి మానవత్వమును బొందియుగూడ నెవడు పరమ పురుషార్థాఽసంబంధియైగాని తత్ప్రయోజక ధర్మ సంబంధములేనివాడైగాని, తద్ధర్మ ప్రయోజకార్థకామ సంబంధములేనివాడైగాని యగుచో నట్టివాని జన్మము నిరర్థకమగుటయే గాక, యనేక సుకృత దుష్కృత వాసనా సంవలితమై, అనాద్యవిద్యాప్రవృత్త సంసృతి ప్రవాహానుచ్ఛేద సంపాదకమై, దుర్భరానర్థ పరంపరాప్రాపకమే యగును. అట్టిమానుష జన్మము, పుంస్త్వ, విప్రత్వ, వైదికధర్మమార్గ పరత్వ, విద్వత్త్వ, ఆత్మానాత్మ విచార, స్వానుభవ, బ్రహ్మాత్మనావస్థాన, భవబంధ విముక్తులు, పూర్వపూర్వముత్తరోత్తరమునకు సాధనములై విలసిల్లుచున్నవి. ఇట్టి కార్యకారణ భావాపన్నమైన ముక్తి యనేక జన్మసుకృత పరిపాకముచేగాని లభింపనేరదు. ఈ యభిప్రాయమునే శంకర భగవత్పాదులు "జంతూనాం నరజన్మ.............లభ్యతే" అను శ్లోకమున ననుగ్రహించియుండిరి. ఇందు పరమ పురుషార్థమగు మోక్షమునకు పరమసాధనము బ్రహ్మసాక్షాత్కారము. దానికి సాధనము వేదాంత విచారము. దానికి సాధనము సంన్యాసరూపనివృత్తి ధర్మమునగును. దానికి సాధనమగు వైరాగ్యము కలుగవలెనన్నచో చిత్తశుద్ధి యావశ్యకము అట్టి చిత్తశుద్ధికై నిష్కామకర్మానుష్ఠాన రూపప్రవృత్తి ధర్మమావశ్యకము. కాన ముముక్షువు లధికారానురూపముగ నిట్టి వైదికధర్మమార్గపరులై యుండవలెనని సూచించిరి. ఈ వైదిక ధర్మమును "ద్వివిధో హి వేదోక్తో ధర్మః ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ" అని యిట్లు గీతా భాష్యమున వివరించియుండిరి. ఈ వేదధర్మమును సాకల్యముగ నిరూపింపదలచి త్రైకాలిక జ్ఞానసంపన్నులును, ఆదికవియునగు వాల్మీకి మహర్షి కోకిలము నారదోపదేశామృతము నాకంఠము ద్రావి లోకానుకంపతో కవితాశాఖ నధిరోహించి పంచమ స్వరముతో గానముచేసెను. ఆ గాన ప్రపంతి రెండువాయలై యందొక్కటి ప్రవృత్తిధర్మావిష్కృతమై "శ్రీమద్రామాయణ" రూపమునను వేరొకటి నివృత్తిధర్మావిష్కృతమై "యోగవాసిష్ఠ" రూపమునను లోకమును పునీతమొనర్చుచున్నవి. దీనిని నాకత్యంత ప్రియమిత్రులును "పూర్వోత్తర మీమాంసా విద్యాపారీణులునగు" బ్రహ్మశ్రీ మల్లావఝల వెంకటసుబ్బరాయశాస్త్రులుగారు భవతీప్సువులగు యాంధ్రలోకము ననుగ్రహించుతలంపుతో వ్యావహారిక భాషలో గద్యానువాదముతో ననువదించిరి.

శాస్త్రవిషయము విస్పష్టమగునట్లాంధ్రీకరించుట దుర్ఘటమైనదైనను వీరియాంధ్రీకరణ మెట్టి క్లిష్ట శాస్త్రీయ విషయములనైన సుస్పష్టమొనర్చుచున్నదని మనఃపూర్వకముగా నాయానందమును వెలిబుచ్చుచుంటిని. ఆధ్యాత్మిక విషయ ముకురములనదగు యీ గ్రంథస్థ ప్రకరణములలోదోచు శంకా కళంకముల దుడిచివైచుటకై ప్రకరణాంతము లజూపిన "గమనికలు" సమ్మార్జన పటములువలె నత్యంతోపయుక్తములై యున్నవి. ఇందు అద్వైతమత గురుపరంపరలో ప్రథముడగు నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావ నిర్గుణ నారాయణపరబ్రహ్మము శ్రీరామావతారరూపమున సాధన చతుష్టయ సంపన్నుడగు శిష్యుడగును, రెండవస్థానమలంకరించిన పరమేష్ఠిచే నుపదిష్టమైన విషయము నాధారముగ జేసుకొని తృతీయులగు వసిష్ఠులుపదేష్టలుగను నిర్దేశింపబడుటచే నాగ్రంథ ప్రాశస్త్య ప్రామాణ్యముల విషయమై వేరెచెప్పుటదివ్వెచే సూర్యుని జూపటయేయగును. మరియు నిందలి వసిష్ఠ శ్రీరాముల గురు శిష్యభావముచే "నిర్గుణ పరబ్రహ్మమయే మాయావశమున జీవత్వభ్రాంతిలోబడి సంసారియై బ్రహ్మవేత్తయగు గురువరుని యుపదేశమున దన్నుదా దెలిసికొని ముక్తుడగును" అను అద్వైత సిద్ధాంత రహస్యము సూచితమగుచున్నది. మరియు నీ గ్రంథరాజము ఉత్తమ, మధ్యమ, మందప్రజ్ఞులందరకును యథాధికారముగ నత్యంతోపకారకమగునని నా నిశ్చితాభిప్రాయము. శ్రీ శాస్త్రులుగారీవిధముగనే ఆవశ్యకములగు అద్వైత ప్రతిపాదక గ్రంథముల ననువదించి యాంధ్ర సోదరులకత్యంతోపకృతిని గావించి వారిప్రశంసలకు పాత్రులగుటకై సర్వేశ్వరుని ప్రార్థించుచుంటిని.

ఇట్లు

"న్యాయవేదాన్త విద్యాప్రవీణ, తర్కరత్న, దర్శనాలంకార"

**బులుసు అప్పన్నశాస్త్రి**

ఫట్నపల్లి, తూర్పు గోదావరిజిల్లా.

ది. 14-9-60





శ్రీగాయత్రీ పీఠాధిపతులు

శ్రీశ్రీశ్రీ విద్యాశంకర భారతీస్వామివారు

# శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామి వారి ఆశీః పూర్వక ప్రస్తావన.

సంస్కృత వాఙ్మయములోనెల్ల అసందిగ్ధముగ అద్వైతమును ప్రతిపాదించు గ్రంథములలో మొట్టమొదటిది ప్రధానమయినది ఉత్కృష్టమయినది యోగవాసిష్ఠమే. యోగవాసిష్ఠము లేక వాసిష్ఠ రామాయణము అను గ్రంథము శ్రీ రామచంద్రమూర్తికి వసిష్ఠ మహర్షి చేసిన అద్వైత బోధ, శ్రీ రామచంద్రమూర్తి 16 సంవత్సరములలోపు వయస్సులో నుండగా యాత్రలు సేవించి వచ్చిన తరువాత వర్ణింప నలవికాని వైరాగ్యము ముముక్షుత్వము కలుగగా కులగురువులు జీవన్ముక్తులు బ్రహ్మ మానస పుత్రులునగు వసిష్ఠులవారు ఈ గ్రంథములోని బోధను జేసి రామచంద్రుని గూడ జీవన్ముక్తునిగాఁ జేసినారు. దీనిని బట్టి శ్రీరాముని దరిమిలా చరిత్రలోని వ్యవహారమంతయు జీవన్ముక్తుని వ్యవహారమేకాని అజ్ఞాని వ్యవహారము కాదని స్పష్టమగుచున్నది. శ్రీరామచంద్రునివంటి ఉత్తమ శిష్యునికి వసిష్ఠులవంటి ఉత్తమ గురువులు చేసిన బోధయే యీ గ్రంథము అనుటలోనే ఈ గ్రంథము యొక్క ఔత్కృష్ట్యము చెప్పకయే వ్యక్తమగుచున్నది.

ఈ గ్రంథమునకు పూర్వము సంస్కృత వాఙ్మయములో వేదములు వాని అంతిమ భాగములగు ఉపనిషత్తులు ఉన్నవి. ఆ ఉపనిషత్తుల సిద్ధాంతము అద్వైతమే అని శ్రీ శంకర భగవత్పాదులవారు తమ అమూల్యమగు భాష్యములో స్పష్టము చేసినప్పటికిని వారి తరువాత వచ్చిన మతకర్తలు విశిష్టాద్వైత పరముగను, ద్వైతపరముగనుగూడ భాష్యములను రచించి యున్నారు. మన జ్ఞాన గురు పరంపరలో మొదటి గురువు సదాశివుడు— లేక పరమేశ్వరుడే. ఆ పరమేశ్వరుని ఉచ్ఛ్వాస రూపమే వేదములు ఉపనిషత్తులు. వారి ప్రథమ శిష్యుడు నారాయణుడు, ఆ నారాయణునికి శిష్యుడు పద్మభవుడు లేక బ్రహ్మ. ఆ బ్రహ్మయొక్క మానస పుత్రుడై శిష్యుడైన వాడు వసిష్ఠ మహర్షి, మొదటి గురువైన సదాశివుని బోధ ఉపనిషత్తులయి యుండుటచేతను వారి తరువాతవారయిన నారాయణ బ్రహ్మల బోధలఁదెలియజేయు గ్రంథ మేదియు మనకు గోచరింపక పోవుట చేతను బ్రహ్మకు శిష్యులయిన వసిష్ఠులవారు తమ యోగ వాసిష్ఠములో అద్వైత సిద్ధాంతమునే స్పష్టముగ ప్రతిపాదించుట చేతను, ఉపనిషత్తులలోని బోధకూడ అద్వైతమే అయి యుండవలెనని స్పష్టమగుచున్నది. ఒకే గురు శిష్య పరంపరలోని వారి బోధలు పరస్పర విరుద్ధములుగ ఉండనేరవుగదా! ఆ పరంపరలోని వారే యగు గౌడపాదులవారు తమ మాండూక్యకారికలలోను, శంకర భగవత్పాదులు తమ భాష్యములలోను స్పష్టముగను అసందిగ్ధముగను అద్వైత సిద్ధాంతమునే చాటి యున్నారు. కనుక అద్వైత సిద్ధాంతమును అసందిగ్ధముగ ప్రతిపాదించిన మొట్టమొదటి గ్రంథము యోగవాసిష్ఠమే అనుటలో యెట్టి సంశయము ఉండనేరదు.

ఈ గ్రంథములో 6 ప్రకరణములున్నవి. అవి (1) వైరాగ్య ప్రకరణము (2) ముముక్షు ప్రకరణము (3) ఉత్పత్తి ప్రకరణము (4) స్థితి ప్రకరణము (5) ఉపశమ ప్రకరణము (6) నిర్వాణ ప్రకరణము అనునవి. రామునికి కలిగిన వైరాగ్యము, ముముక్షుత్వము మొదటి రెంటిలోను వివరింపబడి, జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి లయములు తరువాతి మూడు ప్రకరణములలో విశదీకరింపబడి, చివరి ప్రకరణములలో అద్వైత బోధ గావింపబడినది. ప్రతి ప్రకరణములోను, చక్కని దృష్టాంతములతోను, ఉపమానములతోను, ఉపపత్తితోను, కథలతోను, విషయము 32,000 శ్లోకములలో సులభముగా బోధింపబడుటచేత ఇంత సుబోధకమగు గ్రంథము ఇంకొకటి లేదనిన అతిశయోక్తి కానేరదు. ఇది ఈ గ్రంథములోని బోధయొక్క వైలక్షణ్యము. ఈ గ్రంథములోని బోధ బ్రహ్మవిద్యయే కనుక ఇట్టి అమూల్యమగు విద్యను అధికారియైన వానికే చెప్పవలెను. దీనికి అధికారి యెవరనగా, నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము, అను నాలిగింటిని గలవాడే అధికారియని ఉపనిషత్తులలో స్పష్టీకరింపబడినది. అందుకనే "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అను మొదటి బ్రహ్మ సూత్రము మీద శ్రీ శంకర భగవత్పాదులవారు భాష్యమును రచించుచూ "అథ" అను శబ్దమునకు అర్థముపై సాధన చతుష్టయ సంపత్తి కలిగిన తరువాత అని అధికారి నిరూపణము ఉపనిషద్వాక్యములను బట్టియే గావింపబడినది. ఈ నాలిగింటిలోను ప్రధానమైనవి వైరాగ్యము, ముముక్షుత్వము అయి యున్నవి. వైరాగ్యమునకు పూర్వ రంగ సాధనము నిత్యానిత్య వస్తు వివేకము, ముముక్షుత్వమునకు పూర్వరంగ సాధనము శమాదిషట్క సంపత్తి, కనుక వైరాగ్య ముముక్షుత్వములున్నవారు, సాధన చతుష్టయ సంపత్తికలవారే. రాముడు అట్టి సంపత్తి కల అధికారియే అని నిరూపించుటకై వసిష్ఠులవారు మొదటి రెండు ప్రకరణములలోను వైరాగ్య ముముక్షుత్వములను వివరించి యున్నారు. అట్టి అధికారియైన వానికి యెదురుగా ప్రత్యక్షముగా ప్రపంచము గోచరించుటచేత, అట్టి జగత్తు యొక్క స్వరూప స్వభావముల బోధ చేయుటకై అట్టి దాని ఉత్పత్తి స్థితి ఉపశమనములను 3, 4, 5 ప్రకరణములలో విశదీకరించి దాని మిథ్యాత్వమును స్పష్టీకరించినారు. ఇక చివర మిగిలిన నిర్వాణ ప్రకరణములో కేవలము అద్వైత సిద్ధాంతమును చాటియున్నారు. భగవద్గీతలో కూడ శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు చేసిన బోధ బ్రహ్మవిద్యయే కనుక అట్టి బోధను గ్రహించుటకు అర్జునుడు అధికారియే అని నిరూపించుటకై గీతలోని మొదటి విషాద యోగము (అనగా గీతలోని మొదటి అధ్యాయము రెండవ అధ్యాయములో మొదటి 10 శ్లోకములు) లో అర్జునుని వైరాగ్యమును ముముక్షుత్వమును వ్యక్తపరచియున్నారు. ఆ పై అధ్యాయములో జగన్మిథ్యాత్వమును జీవ బ్రహ్మైక్యమును బోధించి అద్వైత సిద్ధాంతమును గీతలలో చాటి యున్నారు. బ్రహ్మ సూత్రములలో కూడ మొదటి సూత్రములోనే అధికారి నిరూపణము గావించి తరువాత గ్రంథములో అద్వైత సిద్ధాంతమును వ్యక్తపరచినారు. ఇట్లు అధికారి నిరూపణముతో కూడిన అద్వైత బోధ వాసిష్ఠములో చేయబడినదని స్పష్టమగుచున్నది.

భాగము మాత్రమే ఆ రామాయణముగ అవతరించినది; వేదములోని జ్ఞానకాండను బోధించు ఉత్తర భాగము లేక వేదాంతము అను ఉపనిషత్తులు ఆ పూర్వ రామాయణముగా అవతరించ లేదు కనుక ఆ పూర్వ రామాయణము వేదమునంతను వ్యక్తము చేయుచున్నదనుటకు వీలు లేదు. అందుకనే జ్ఞానకాండను బోధించు వాసిష్ఠ రామాయణము అను ఈ ఉత్తర రామాయణముకూడ వాల్మీకియే రచించి ఆ శ్లోక భావమును సార్థకము చేసినాడు. దీనిని బట్టి తేలిన దేమనగా, వేదము రామాయణముగా అవతరించినదంటే వాల్మీకి రామాయణముగను వాసిష్ఠ రామాయణముగను రెండు రామాయణములుగాను అవతరించినదని అర్థము. ఈ రెండు రామాయణములు కలిస్తేనే సంపూర్ణ రామాయణము అనిన్నీ, వాసిష్ఠ రామాయణ బోధ లేకుండా వాల్మీకి రామాయణ బోధ అసంపూర్ణము అన్ని తెలుచున్నది. ఇట్టి అమూల్యమైన గ్రంథమునకు తగినంత ప్రచారము లేకపోవుట శోచనీయము. సుమారు 35 సంవత్సరముల క్రిందట ఆంధ్ర దేశములో సుప్రసిద్ధ అద్వైత వేదాంత పండితులు కీ॥ శే॥ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛాయనులుగారు విజయవాడలో 21 దినములు యోగవాసిష్ఠమును అంతను అందరికి తెలియులాగున ప్రవచనము గావించి ప్రచారములోనికి దెచ్చిరి. సుప్రసిద్ధ వ్యాకరణ పండితోత్తములును, సర్వతంత్ర స్వతంత్రులునగు శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు బందరులోను, సుప్రసిద్ధ తర్క వేదాంత పండితోత్తములగు శ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారు విజయవాడలోను యోగవాసిష్ఠమును అందరికి తెలియులాగున ప్రవచనము గావించి ప్రచారములోనికి దెచ్చిరి. ప్రపంచములోని మానవులకు తగిన ఉపాయము అద్వైతానుభవమువల్లనే తప్ప ఇంకొక విధముగ లేదని శ్రుతియుక్తి అనుభూతులవల్ల నిరూపింపబడినది కనుకను, అట్టి అద్వైత భావము సుగమముగ అందరికి బోధపడుటకు యోగవాసిష్ఠము తప్ప మరొక గ్రంథము లేదు కనుకను ఈ గ్రంథము బాగా ప్రచారములోనికి తేవలెనని నాకు సంకల్పము కలిగినది. ఇట్టి పరిస్థితులలో మన దేశములో పూర్వ మీమాంసా శాస్త్రములోను ఉత్తర మీమాంసా శాస్త్రములోను గొప్ప పండితులును ప్రఖ్యాత విద్వాంసులగు శ్రీ మల్లావఝ్ఝుల వెంకట సుబ్బరామశాస్త్రిగారు తమకు సుపరిచయోగ వాసిష్ఠమును తెలుగు భాషలోనికి అందరికి తెలియులాగున అనువాదము చేయవలెనని సంకల్పముకలిగి కొంతవరకు రచించినట్లు నాతో చెప్పి నాకు చదివి వినిపించగా ఆ రచనము చాలా బాగున్నది. ఇట్లు నా భావములు వారి భావములు ఏకీభవించినందులకు నాకు చాలా సంతోషము కలిగి వారిని ప్రోత్సహించగా వారును చాలా ఆనందించిరి. అంతట నీ గ్రంథమును మా పీఠమునుంచి ముద్రింపించ నిశ్చయించుకుని యథావకాశముగ తోడ్పడితిమి. శ్రీ సుబ్బరామశాస్త్రిగారు ఆ రెండు శాస్త్రములలో గొప్ప పండితులగుటచే శాస్త్ర విమర్శనాపటిమ, రచనా సామర్థ్యము కూడ కలిగిన ధీశాలురు. అందుచేత వారి ఆంధ్రానువాదము అధ్యాత్మ విషయములో జిజ్ఞాసువులగు జన సామాన్యమునకు అందుబాటులోనికి వచ్చి అందరిని తృప్తిపరచగలదని విశ్వసించుచున్నాను. శ్రీ శాస్త్రిగారికి శ్రీ గాయత్రీ మహాదేవి అనుగ్రహమున సకల శ్రేయస్సులు కలుగుగాక—

ఇత్యేషా నారాయణ స్మృతిః.



గ్రంథకర్త

ఓమ్

# ఉపోద్ఘాతము

ఆస్తికాగ్రేసరులారా!

మహామాయావిలాసినీ విలాసమగు నీ సంసారమున జనన మరణ వ్రాతములతో మునిగి తేలుచున్న జీవకోటి నుద్ధరించుటకు ధర్మ ప్రబోధము గావింపనెంచి, మహాకవి వాల్మీకి రామాయణ మను నాదికావ్యమును రచించెను. ధర్మము రెండు విధములు. 1. ప్రవృత్తిధర్మము 2. నివృత్తిధర్మము. అని - శ్రౌతస్మార్త రూపమగు కర్మకాండ యంతయు ప్రవృత్తిధర్మము. సర్వకర్మ సన్న్యాసపూర్వక జ్ఞానము నివృత్తిధర్మము. ఈ రెండును వైదిక సమధిగమ్యములు. శ్రీ మహావిష్ణ్వవతారుడగు శ్రీరాముని చరిత్ర పై రెండు ధర్మములకును నాదర్శప్రాయము. కనుకనే వాల్మీకిమహర్షి పైరెండు ధర్మములను నిష్కృష్టముగ నిరూపింపదలచి, రామాయణమును. "పూర్వ రామాయణము" "ఉత్తర రామాయణము" అని రెండుగ విభజించెను. ఇందు పూర్వ రామాయణము, శ్రీరామచరిత్రాత్మకము. ఉత్తర రామాయణము "యోగవాసిష్ఠ"మను నాధ్యాత్మిక గ్రంథము పూర్వ రామాయణమునందు బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండలు అను నారు కాండలు గలవు. ఉత్తర రామాయణమునందు, వైరాగ్య, ముముక్షు ఉత్పత్తి, స్థితి ఉపశమ, నిర్వాణము లను నారు ప్రకరణములు గలవు. ఇవిగాక పూర్వ రామాయణమునకు, ఉత్తరకాండ యనునది మరొక కాండగలదు. ఉత్తర రామాయణమునకు, (యోగ వాసిష్ఠమునకు) నిర్వాణోత్తర భాగమని మరొక ప్రకరణము గలదు. ఈ పూర్వోత్తర రామాయణముల గ్రంథసంఖ్య 56 యాభై ఆరువేల శ్లోకములు. ఇందు పూర్వ రామాయణము (24) ఇరువది నాలుగువేల శ్లోకముల గ్రంథము. ఉత్తర రామాయణము (32) ముప్పది రెండువేల శ్లోకముల గ్రంథము. ఉత్తర రామాయణమంతయు, శ్రీరామ వశిష్ఠుల సంవాద రూపమగుటవలనను, విశిష్య అష్టాంగయోగ, జ్ఞానయోగములను బోధించుట వలనను, "యోగవాసిష్ఠ"మను పేరును వడసెను. ఈ రెండును గలసిననే రామాయణము సంపూర్ణమగును.

ఏలయన ! వేదము పై రెండు ధర్మములను బోధించుచున్నది. "ఏష విగ్రహవాన్ ధర్మః" అను ప్రమాణము శ్రీరాముడు కృత్స్నధర్మ స్వరూపుడని చెప్పుచున్నది.

శ్లో. వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా.

వేదవేద్యుడగు పరమాత్మ దశరథపుత్రుడుగ జన్మింప, వేదము వాల్మీకి నుండి రామాయణ రూపముతో నావిర్భవించెనని దీని యర్థము. దీనిని బట్టి

శ్రీరాముడు పరమాత్మ రూపుడనియు రామాయణము, వేద రూపమనియును స్పష్టమగు చున్నది. ఇట్టితటి ప్రవృత్తి నివృత్తి ధర్మములను రెంటిని బోధించినపుడే రామాయణము వేదరూప మగును గాని, కేవల ప్రవృత్తి ధర్మమును బోధించి నంతమాత్రమున కానేరదు. వాసిష్ఠ రామాయణముతో గలసినప్పుడే రామాయణము నివృత్తిధర్మమును బోధించిన దగును. అప్పుడే "ఏష విగ్రహవాన్ ధర్మః" అనుసూక్తియు నిస్సంకోచముగ చరితార్థమగును. కనుక వాసిష్ఠముతో గలసియే శ్రీమద్రామాయణము సంపూర్ణమగు ననునది సుస్పష్టము.

పూర్వమీమాంసయందు ప్రతిపాదింపబడిన కర్మల ననుష్ఠించిన వారలకు చిత్తశుద్ధి కలిగి ఉత్తరమీమాంసా ప్రతిపాదితమయిన, జ్ఞానోపాసనల యందు అధికారము కలుగునట్లు పూర్వరామాయణార్థమగు ధర్మము ననుష్ఠించినవారలకు చిత్తశుద్ధి కలిగి ఉత్తర రామాయణ ప్రతిపాదితమగు ఆత్మసాక్షాత్కారమం దధికారము కలుగుటచే పూర్వోత్తర మీమాంసలకువలె పూర్వోత్తర రామాయణములకుగూడ హేతు హేతుమద్భావ మంగీకరింప నగును.

క్షత్రియకులమందు బుట్టి, రణరంగమున నిరువైపుల సేనను జూచుటచే శోకమోహముల జెంది, యుద్ధమునకు పరాఙ్ముఖుడైన అర్జునునకు తత్త్వ ముపదేశించి, శ్రీకృష్ణుడు స్వధర్మమగు యుద్ధమందు బ్రవేశపెట్టినట్లు, యువరాజయి రాజ్యము నొల్లక, భోగాభిలాషలను వీడి, విరాగుడైయున్న శ్రీరామునకు తత్త్వోపదేశ మొనర్చి వసిష్ఠుడు మరల రాజ్యవ్యవహారములందు బ్రవేశపెట్టెను. కాన నీ గ్రంధము గీతాగ్రంధమును బోలియున్న దనుటలో నందియము లేదు. అచ్చటచ్చట ఆయా పోలికలుగూడ పెక్కు గలవు. కాని గీతాశాస్త్రమునందు వలె ద్వైత, విశిష్టాద్వైతములకు తావు మోక్షశాస్త్రమగు నీ యోగవాసిష్ఠము నందు లేదు. పైపెచ్చు ఆ సందేహమును తీర్చుకొనదలంపు యున్నచో నీయది ప్రబలమగు నాధారమును, సాక్షియును గాగలదు.

ఇందు అద్వైతము స్పష్టముగా ప్రతిపాదింపబడినది. ప్రపంచ మిథ్యాత్వము నొక్కి వక్కాణించబడినది. ప్రపంచము కేవలము మనోమాత్రమనియు, భ్రాంతి మాత్రమనియు, రుజువు చేయబడినది. జ్ఞానమే ముక్తికి సాధనమని నిరూపించబడినది. అందుకు దగిన ఆధారము లెన్నియో యిందు పొందుపరచ బడినవి. వానిని దిఙ్మాత్రముగ నుదాహరింతును.

శ్లో. రామాస్య మనసోరూపం నకించి దపి దృశ్యతే।
నామమాత్రాదృతే వ్యోమ్నో యథాశూన్య జడాకృతేః ॥ఉ॥ 4-38

"న బాహ్యేనాపిహృదయే సద్రూపం విద్యతే మనః।
సర్వత్రైవ స్థితం చైతద్విద్ధి రామ యథా నభః ॥ఉ॥ 4-39

"ఇదమస్మాత్సముత్పన్నం మృగతృష్ణాంబుసన్నిభం।
రూపంతు క్షణసంకల్పా ద్వితీయేందు భ్రమోపమమ్ ॥ఉ॥ 4-40
"అవిద్యా సంసృతిశ్చిత్తం మనోబంధో మలస్తమః।
ఇతిపర్యాయ నామాని దృశ్యస్య విదుసత్తమాః ॥ఉ॥ 4-41
"ప్రకాశస్య యథాలోకః యథావాతస్య చాపలం।
యథాద్రవత్వం పయసి దృశ్యత్వం ద్రష్టరీదృశమ్ ॥ఉ॥ 4-50
"అంగదత్వం యథాహేమ్ని మృగనద్యాం యథాజలం।
భిత్తిర్యథాస్వప్నపురే తథాద్రష్టరి దృశ్యధీః ॥ఉ॥ 4-51
"తస్మాదిమాం. ప్రతిజ్ఞాం త్వంశ్రుణు రామాతిభీషణం
యా ముత్తరేణ గ్రంథేన నూనం త్వ మవబుధ్యసే ॥ఉ॥ 4-66
"అయ మాకాశభూతాదిరూపోహంచేతి లక్షితః।
జగచ్ఛబ్ద స్యనామార్థోననునాస్త్యేవ కళ్పన ॥ఉ॥ 4-67
"యదిదం దృశ్యతే కించిద్దృశ్యజాతం పురోగతం।
పరంబ్రహ్మైవ తత్సర్వం అజరామర మవ్యయమ్ ॥ఉ॥ 4-68
"పూర్ణే పూర్ణం ప్రసరతి శాంతే శాంతం వ్యవస్థితం
వ్యోమన్యేవోదితం వ్యోమ బ్రహ్మణి బ్రహ్మతిష్ఠతి ॥ఉ॥ 4-96
"నదృశ్య మస్తి సద్రూపం నద్రష్టా నచదర్శనం
నశూన్యం నజడం నోచిచ్ఛాంత మేవేద మాతతం 60
చిత్ = బుద్ధిప్రతిబింబిత చైతన్యం
"అస్య దేవాదిదేవస్య పరస్య పరమాత్మనః
జ్ఞానాదేవ పరాసిద్ధి ర్నత్వనుష్ఠాన దుఃఖతః ॥ఉ॥ 6-1
"అత్రజ్ఞాన మనుష్ఠానం నత్వన్య దుపయుజ్యతే
మృగతృష్ణాజలభ్రాంతి శాంతౌ చేదం నిరూపితం ॥ఉ॥ 6-2
"నహ్యేషదూరే నాభ్యాశే నాలభ్యో విషమేనచ
స్వానందాభ్యాసరూపోసౌ స్వదేహా దేవ లభ్యతే ॥ఉ॥ 6-7
"కించినోపకరో త్యత్ర తపోదాన వ్రతాదికం
స్వభావమాత్రే విశ్రాంతి మృతేనాత్రాస్తి సాధనం ॥ఉ॥ 6-4

అని, ఇట్లు అనేక ప్రమాణములు కలవు. గ్రంథవిస్తరభీతిచే ఇతోధికముగ ప్రమాణప్రదర్శనము చాలింతుము.

కాని యిందలి యుపోద్ఘాత గ్రంథమున అగస్తి మహాముని సుతీక్ష్ణునకు చెప్పిన

"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాంగతిః
తథైవ జ్ఞానకర్మభ్యాం జాయతే పరమం పదమ్.

"కేవలా త్కర్మణో జ్ఞానా న్నహి మోక్షోభిజాయతే
కింతూభాభ్యామ్ భవేన్మోక్షః సాధనంతూభయం విదుః."

అను శ్లోకముల నాధారపరచుకొని యీ గ్రంథము జ్ఞానకర్మ సముచ్చయ వాదమున కాధారమని కొందరు భ్రాంతి చెందుచున్నారు. ఇద్దానిని కొంత విచారింతము. ఇందు పక్షియొక్క రెక్కలకును, మానవుని జ్ఞాన కర్మలకును పోలిక నిరూపింపబడినది. ఈయది యావదంశమునందా ? యత్కించిదంశము నందా ? అని విచారింపవలయును.

లోకమునం దెచ్చటను సామ్యము (పోలిక) అన్నియంశము లందును గుదరదు. గ్రంథకర్తల కట్టి తాత్పర్యమున్ను ఉండదు. "చంద్రవత్సుందరం ముఖం" అను తావున చంద్రునకును, ముఖమునకును, వర్తులాకారము నందును, ఆహ్లాద జనకత్వమునందును. సామ్యము (పోలిక) చెప్పలయును గాని, దూరస్థత్వ, సభోగవత్వాది ధర్మములందు (దూరమునం దుండుట, ఆకాశమునందుండుట అను ధర్మములందు) సామ్యమును జెప్పుట తగదు. అయ్యది ప్రత్యక్ష విరుద్ధముకూడ నగును. కనుక ఉపమానోపమేయములందు గాని, దృష్టాంత దార్ష్టాంతికములందుగాని సరిపడునట్టి యంశములందు మాత్రమే సామ్యముమ గ్రహింపవలయును. విరుద్ధమగు నంశములందు గ్రహింపదగదు.

ఇట్లుండ ప్రకృతమున పక్షియొక్క రెక్కలకును, మానవుని యొక్క జ్ఞానకర్మలకును, ఏ యంశమునందు సామ్యము చెప్పబడిన దను విషయము విచారణీయము. ఇట్లు విచారింప "పక్షి గమ్యస్థానమును జేరుటకు రెండు రెక్కలు ఆవశ్యకము లనియు, నారెంటివలన గలిగెడి యుపకార మావశ్యక మనియును, అట్లే మానవుడు మోక్షము నందుటకు జ్ఞానకర్మలు రెండును ఆవశ్యకము లనియు, నారెంటివలన గలిగెడి యుపకార మావశ్యకమనియును జెప్పుటయే యుచితమును, అవిరుద్ధమును అగునుగాని, జ్ఞానకర్మలసముచ్చయ మును జెప్పుట ఉచితముగాదు. పైపెచ్చు విరుద్ధముకూడ నగును. కర్మలకు ఉపాసనతో సముచ్చయము కుదురునుగాని, అకర్త్రభోక్త్రాత్మజ్ఞానముతో సముచ్చయము కుదరదు. కనుక నిచ్చట ముముక్షువునకు జ్ఞానకర్మలు రెండును సాధనములనియే యర్థమునుగాని, సముచ్చిత సాధనములని అర్థముగాదు. వాటి వలన గలిగెడి యుపకారముమాత్రము ఆవశ్యకమని స్పష్టమగును. పక్షికి రెండు రెక్కలవలనను వాయుస్పందము (గాలిసంచలనము) అను నుపకారము కలుగు చున్నది. అందువలననే యది పైకెగిరిపోవ గలుగుచున్నది. ఒంటిరెక్కతో గలిగెడి గాలియొక్క సహాయమున పైకెగురలేదు. గమ్యస్థానమును చేరలేదు. అట్లే మానవునకును, కర్మలవలన చిత్తశుద్ధి యను నుపకారమున్ను, జ్ఞానము వలన అవిద్యానివృత్తి యను నుపకారమున్ను కలిగిననే ముక్తి లభించును.

ఒక్కదానివలన కలిగెడి యుపకారముచే ముక్తి లభించదు. అశుద్ధచిత్తులకు నెన్ని పర్యాయములు శ్రవణాదులు చేసినను జ్ఞానము నిరూఢముగాదు, కాన కర్మ జన్యమయిన నుపకారముగూడ అవశ్యమనియే యిచట తాత్పర్యము ఇంతియె కాని కర్మజ్ఞానములు రెండును సముచ్చితము లనుటలో తాత్పర్యములేదు.

మఱియు అద్దమునందు ముఖము విస్పష్టముగా ప్రతిఓంబించవలెనన్నచో అద్దము నిర్మలముగా నుండుట, వెలుతురుండుట, ఈ రెండును అవశ్యకములు. ఇందులో నేయొకటి లేకున్నను ఉపయోగములేదు. అద్దము నిర్మలముగ నుండుటకు మార్జనక్రియ యవసరము. వెలుతురునకు సూర్యప్రకాశకాని, దీప ప్రకాశకాని యవసరము. అట్లే మానవునకు చిత్తశుద్ధియు, అవిద్యానివృత్తియు మోక్షము నొందుటకు అవశ్యకములు కాన, చిత్తశుద్ధికొరకు కర్మానుష్ఠానమును. అవిద్యానివృత్తికొరకు వేదాంతవాక్య ప్రమాణజన్యమయిన అంతఃకరణవృత్తి యును, అవశ్యకము. ఇంతమాత్రమే యిచట వివక్షితము సముచ్చయము యిట వివక్షితము కాదు.

దృష్టాంతస్థలమున రెండు రెక్కల వలన గలిగెడి వాయుస్పందమను నుపకారము ఏకజాతీయము. దార్ష్టాంతికమున చిత్తశుద్ధి, అజ్ఞాననివృత్తి యను నుపకారములు భిన్నజాతీయములు. ఈ భేదము అనివార్యము. కనుక పైశ్లోక ముల నాధార పరచుకొని, వాని యాపాతార్ధమును మాత్రమే గ్రహించి సము చ్చయవాదము గ్రంథప్రతిపాద్య మనుట యజ్ఞానవిలసితము.

మరియు, నీశ్లోకములు ఉపోద్ఘాతమునందలివి. ఉపోద్ఘాతము గ్రంథారంభ కము. గ్రంథారంభమునందుగాని, ఉపసంహారమునందుగాని, గ్రంధమధ్యమున గాని, యీ సముచ్చయవాదము ప్రతిపాదితమైనచో, నుపోద్ఘాత గ్రంథా ను సారముగ, నీ సముచ్చయవాద మంగీకరించితీరవలసియుండును. అట్లు గ్రంథోపక్రమ పరామర్శోపసంహారములందు సముచ్చయవాదము ప్రతిపా దింపబడి యుండలేదు. పైపెచ్చు శుద్ధజ్ఞానమే ప్రతిపాదింపఁబడియున్నది. కనుక గ్రంధోపసంహార పరామర్శల ననుసరించి, యుపోద్ఘాతమునందలి యీ శ్లోకములను అన్వయించుకొనవలెను. గాని వీని నాధారముగజేసికొని గ్రంథమునంతయును తారుమారొనర్చుట మతాభిమానులకు తగునేమో కాని, నిరభిమానులగు పండితులకు తగదు.

వసిష్ఠుడు శ్రీరామచంద్రునకు జ్ఞానాంగముగ అనంసక్తి యోగమును (మనస్సంగము లేకుండుట) నుపదేశించుటలో అర్జునోపాఖ్యానమును నుదాహరణ ముగ జూపెను.

చూ. నిర్వాణ ప్రకరణము 12-వ సర్గ. 8, 9 శ్లోకములు

"పుండరీకాక్ష నిర్దిష్టాం అసంసక్తగతిం శుభాం
యామాలింగ్య మహాబాహో జీవన్ముక్తో మహామునిః
"పాండోః పుత్రోర్జునోనామ సుఖం జీవిత మాత్మనః
క్షపయిష్యతి నిర్దుఃఖం తథా క్షేపయ జీవితం. 9

(రామచంద్రా! శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశింప బోయెడి యసంసక్తి యోగము నవలంబించి, అర్జును డెట్లు సుఖముగ జీవితమును గడపునో, అట్లే నీవుకూడ నిర్దుఃఖముగ జీవితమును గడపుము, అని వీని యర్థము.)

ఆ పైని శ్రీరాముడు వసిష్ఠునితో నిట్లనెను :
"భవిష్యతి కదా బ్రహ్మన్ సోర్జునః పాండునందనః
కీదృశించ హరిస్తస్య కథయిష్య త్యసక్తతామ్. స. - 10

మహర్షీ! పాండుపుత్రుండగు నర్జును డెపుడు పుట్టగలడు? - కృష్ణు డతని కెట్టి అసంసక్తియోగము నుపదేశింప గలడు?- అని.

ఇందుకు సమాధానమును జెప్పదలచి వసిష్ఠుడు, కృష్ణార్జును లిరువురు నరనారాయణావతారు లని జెప్పి, గీతాశాస్త్రప్రతిపాదితమయిన అసంసక్తి (నిష్కామ) యోగమును యథాతథముగనే యుపపాదించెను. ఆ ప్రకరణమున జాలవరకు గీతాశ్లోకములే యుదాహరింపబడినవి.

చూ. నిర్వాణ ప్రకరణము, పూ॥

"నజాయతే మ్రియతే వా కదాచిత్ శ్లో.
నహన్యతే హన్యమానే శరీరే" స. - 25 - 36

"యఏనం వేత్తిహంతారం,..........నాయం హంతి నహన్యతే" 52 - 37
యస్య నాహంకృతోభావో..........నహంతి ననిబధ్యతే 53- 2
యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ 53-16
మన్మనాభవ మద్భక్తః 53-34
నిర్మానమోహాః జితసంగదోషాః 53-66

శ్రీ భగవానువాచ -
భూయఏవ మహాబాహో శ్రుణు మే పరమంవచః 54- 1
మాత్రాస్పర్శాస్తు కౌంతేయ 54- 2
కర్మణ్యకర్మ యఃపశ్యేత్ 54-25
త్యక్త్వా కర్మఫలాసంగం 54-28

కర్మేంద్రియాణి సంయమ్య .... .... .... 54-36
యస్త్వింద్రియాణి మనసా .... .... .... 54-37
ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం .... .... .... 54-38
నాసతో విద్యతే భావః .... .... .... 55-12
అవినాశి తు తద్విద్ధి .... .... .... 55-13
భూమిరాపోఽనలో వాయుః .... .... .... 55-18

అర్జున ఉవాచ:

నష్టోమోహస్స్మృతిర్లబ్ధా కరిష్యే వచనం తవ .... .... 58-1
అని. ఇందు గొన్నిశ్లోకములు, కొన్ని శ్లోకార్థములు, మరికొన్ని శ్లోకచరణములు.

"భవిష్యతి యదా బ్రహ్మన్ సోర్జున పాండునందన
కీదృశించ హరిస్తస్య కథయిష్య త్యసక్తతామ్"

అర్జును డెపుడు పుట్టగలడు? కృష్ణు డెట్టి అసంసక్తి యోగమును చెప్పగలడు? అను శ్రీరాముని ప్రశ్నయు, ఇందులకు వసిష్ఠుని సమాధానమున్ను. భవిష్యద్విషయకములు కనుక ఈ రెండు గ్రంథములకు (గీతావాసిష్ఠములకు) పూర్వాపరీభావమును మార్చుటకు వీలులేదు. వాల్మీకి కృతమగు వాసిష్ఠము ముందుది. వ్యాసకృతమగు గీత తరువాతిది. ఇందు సందియములేదు.

అయితే ద్వాపరమందు జరిగిన కృష్ణార్జునుల సంవాదాంశమును, త్రేతాయుగమున వసిష్ఠుడు శ్రీరామున కెట్లుపదేశించెను? త్రేతయందు జరిగిన రామచరితమును గ్రథించెడి వాల్మీకి తన గ్రంథమందు అర్థాని నెట్లుదాహరించెను? అని కొందరందురు. వారి యాశయమున నీ రెండు విషయములు, అతి విరుద్ధము లనియు, అప్రతి సమాధేయము లనియు, గాన "వాసిష్ఠ రామాయణము వాల్మీకికృతము కాదనియు, కల్పిత మనియును" కలదు.

ఇయ్యది కొంత విచారితము. పోనిండు "వాసిష్ఠము కల్పితము." "వాల్మీకి కృతముకాదు" "ఎవరో రచించి వాల్మీకి పేరుపెట్టిరి" సరే. ఈకల్పించిన వారి యాశయమేమి? ప్రపంచమును మోసపుచ్చవలెనని కదా? యుండును. అయ్యది వారు కల్పించిన గ్రంథమందు ప్రామాణ్యబుద్ధిని పుట్టించినపుడు కదా నెరవేరును. వారి గ్రంథమున ప్రత్యక్ష విరుద్ధమయిన అంశములు లేనపుడు కదా! ప్రామాణ్యబుద్ధిని వారు పుట్టింపగలుగుదురు. విరుద్ధార్థముగల గ్రంథమందు తెలిసినంత వరకు, మానవులకు ప్రామాణ్యబుద్ధి యుదయించదు కదా. ప్రపంచమును మోసపుచ్చదలచి 32 వేల శ్లోకములుగల గ్రంథమును రచించి, దానియందు విశ్వాసము కలిగించ ప్రయత్నించెడి యీగ్రంథకర్తలకు, అవిశ్వాస జనకమయిన, ఈ విరుద్ధార్థమును గ్రంథమునందు ప్రవేశపెట్టుట కూడదని

యేల తోచలేదు? ఇంతటి గ్రంథమును రచించిన వారలకు నీమాత్రము తోచదా! ఒకవేళ మీరు వారిని పోషింపదలచి యిది విరుద్ధము కాదందురా! అపుడు వాల్మీకి కృతమని యంగీకరించిన తప్పేమి? కనుక నీ గ్రంథము వాల్మీకి కృతమయినను, ఇతరులచే కల్పితమయినను, రెండు విధముల విరోధమే. ఎటులయినను దీనికి సమాధానమును అన్వేషించవలసినదే. అట్టితరి వాల్మీకి కృతమని యంగీకరించి సమాధానమును వెతకినసేమి? తమ మతమునకు విరుద్ధము (భిన్నముగా) నున్నంతనను పూర్వరామాయణ కర్త యగు వాల్మీకియందు అఖండమయిన ఆదరాభిమానము లున్నందునను, వాల్మీకిని తృణీకరించలేక వాసిష్ఠ రామాయణము వాల్మీకి కృతమని అంగీకరించలేకయు, పడెడు యగచాట్లు తప్ప వేరే ఫలిత మిందు కనిపించదు. కనుక నిది యెంతమాత్రము సముచితముగాదు.

తపస్సంపన్నులగు ఋషులు త్రికాలజ్ఞులు. వారికి జరుగబోవు విషయములు స్పష్టముగా తెలియును. జ్యోతిశ్శాస్త్రము జరుగబోవుదానిని తెలుపునని మన సిద్ధాంతము. ఇట్టితతి సమాధినిష్ఠులయిన మహర్షులకు జరుగబోవు విషయము తెలియుటలో వింతలేదు. కనుక మహాతపస్వియు జీవన్ముక్తుడును అగు వసిష్ఠ మహర్షి రాబోవు ద్వాపరమునందు జరుగనున్న కృష్ణార్జును సంవాదాంశమును దివ్యజ్ఞానముచే దెలిసికొని త్రేతాయుగమందు శ్రీరామున కుపదేశించుటలో విరోధము లేదు. బ్రహ్మగారివల్ల సర్వజ్ఞత్వమును బొంది, తపశ్శాలియగు వాల్మీకిమహాముని విషయమంతయును దెలిసికొని తన గ్రంథమందు పొందు పరచుటయు విరుద్ధము కాదు.

కాక ఇట నింకొక విషయము విచారించదగియున్నది. ద్వాపరమందలి కథాప్రస్తావము, త్రేతలో అసంగతమని దోచిన విమర్శకులకు గీతాశాస్త్రమందు గల యిట్టి విరోధ మేల తోచదు? అదేమన? కృష్ణుడు విశ్వరూపమును జూపు నాటికి అర్జునుడు (పార్థుడు) యుద్ధ మారంభించలేదుకదా? దుర్యోధనాదులు మృతిచెందలేదుగదా? అట్టితతి విశ్వరూప సందర్భమున కృష్ణుడు తన యుదర మందు చావని దుర్యోధనాదులు చచ్చి తన కోరలలో దూరి యున్నట్లును ఎట్లు కనుపరచెను? ఒకవేళ నిది యబద్ధమన్నచో మొత్తము గీతాశాస్త్రమంతయు నేమగును? అబద్ధ మనవలసినదే కదా? లేక ఇది విష్ణుమాయయన్నచో ప్రపంచమంతయు మాయకాక మరేమున్నది? ఇక శ్రీకృష్ణుడు భగవంతుడు, దేవుడు కనుక జరుగబోవుదానిని చూపగలిగె నన్నచో, బ్రహ్మమానస పుత్రుడును, మహాతపస్సంపన్నుడును, జీవన్ముక్తుడును, అగు వసిష్ఠుల మాత్రము ముందు జరుగబోవుదానిని గుర్తించి ఉపదేశించెనని యేల చెప్ప రాదు?

కనుక మహర్షులకు నిట్టివి అకించిత్కరములు. వారి కీశక్తి సహజము, అసదృశము. అట్టివారిపట్ల మనవిమర్శనలు భస్మాహుతులు (నిరర్థకములు). వసిష్ఠులెంతటివారో, వాల్మీకియు నంతటివాడే. ఇతడును మహాతపస్వి. పైపెచ్చు బ్రహ్మగారివల్ల సర్వజ్ఞత్వ వరమును పొందినట్లు పూర్వరామాయణమునందు ప్రమాణముకూడ నున్నది. కనుక నితడును వసిష్ఠుడు చెప్పినదాని నంతయును (భూతవిషయముకాని, భవిష్యద్విషయముకాని) తెలిసికొనగలడు.

అయితే వ్యాసభారతమునందలి శ్లోకములు వాల్మీకి ఉత్తర రామాయణము నందును, వాసిష్ఠరామాయణమునందలి శ్లోకములు కొన్ని వ్యాసభారతమందును కనుపించుచున్నవి కదా ? ఎవరిగ్రంధమునుంచి యెవరు సంగ్రహించిరి ? అను ప్రశ్న కలుగును. ఎవరును ఎవరిగ్రంథమునుంచియు సంగ్రహించిరని నే నన జాలను. వేలతరబడి శ్లోకసంఖ్యతో గ్రంథములను వ్రాయు మహానుభావులకు, మహాభాషాసముద్రములో నొకరి శ్లోకములు, శ్లోకార్థములు, శ్లోకచరణములును, మరొకరి గ్రంధమందు విషయము ననుసరించి చొప్పడ వచ్చును. అంత మాత్రమున వారు సంగ్రహించిరని నిర్ణయించ తగదు. కనుక వాసిష్ఠమునందు అర్జునోపాఖ్యాన మున్నంత మాత్రమున వాసిష్ఠము వాల్మీకికృతము కాదనుట యెంతమాత్రము యుచితము కాదని నాయభిప్రాయము.

ఇంక నీ పూర్వోత్తర రామాయణముల పౌర్వాపర్యమునుగూర్చి విచారింతము. దీనివలననే రెండును ఏకకర్తృకములగునా ? కాదా అను విషయము కూడ తేలిపోవును.

శ్రీమద్రామాయణమునందు వాసిష్ఠ రామాయణముయొక్క ప్రసక్తి యెచ్చటను గనుపించదు. వాసిష్ఠమునందు మాత్రము, ఉపోద్ఘాత గ్రంధములో (ద్వితీయాధ్యాయమున) పూర్వరామాయణముయొక్క ప్రసక్తి కలదు చూడుడు.
వా॥ వై॥ స్త॥ శ్లో॥ 4 నుంచి పదునైదు వరకు.—

వాల్మీకి శ్లో॥ అస్మిన్ రామాయణే రామకథోపాయాన్ మహాబలాన్।
ఏతాంస్తు ప్రథమం కృత్వా పురాఽహం పరిమర్దన॥ 4

"శిష్యాయాఽస్మై వినీతాయ భరద్వాజాయ ధీమతే।
ఏకాగ్రో దత్తవాన్ తస్మై మణిమబ్ధిమివార్థినే॥ 5

"తత ఏతే కథోపాయా భరద్వాజేన ధీమతా।
కస్మింశ్చి న్మేరుగహనే బ్రహ్మణోఽగ్ర ఉదాహృతాః॥ 6

"అథాస్యతుష్టో భగవాన్ బ్రహ్మాలోక పితామహః।
వరంపుత్ర గృహాణేతి తమువాచ మహాశయః॥ 7

భరద్వాజ ఉవాచ॥

"భగవన్ భూతభవ్యేశ నరోఽయం మేఽద్యరోచతే।
యేనేదం జనతా దుఃఖాన్ముచ్యతే తదుదాహర 8

బ్రహ్మోవాచ॥

"గురుం వాల్మీకి మత్రాశు ప్రార్థయస్వ ప్రయత్నతః।
తేనేదం యత్సమారబ్ధం రామాయణ మనిందితం॥ 9

"తస్మిన్ శ్రుతే నరో మోహా త్సమగ్రా త్సంతరిష్యసి।
సేతునేవాంబుధేః పారం అపార గుణశాలినా॥ 10

వాల్మీకి రువాచ॥

"ఇత్యుక్త్వా స భరద్వాజం పరమేష్ఠీ సుదాశ్రమం।
అభ్యాగచ్ఛత్సమం తేన భరద్వాజేన భూతకృత్॥ 11

"అవోచ న్మాం మహాసత్త్వః సర్వభూత హితేరతః॥ 12

"రామస్వభావకథనా దస్మాద్వర మునే త్వయా।
నోద్వేగా త్సంపరిత్యాజ్యః అసమాప్తే రనిందితాత్॥ 13

"గ్రంథేనానేన లోకోఽయం అస్మా త్సంసార సంకటాత్।
సముత్తరిష్యతి క్షిప్రం పోతేనేవాశు సాగరాత్॥ 14

"వక్తుం తదేవమేవార్థం అహమాగత వానయం।
కురు లోకహితార్థం త్వం శాస్త్రమిత్యుక్తవానజః॥ 15

భరద్వాజ ఉవాచ॥

"ఏతదుక్తం భగవతా యథా రామాయణం కురు।
సర్వలోక హితార్థాయ సంసారార్ణవ తారకం॥ 19

అత్రవ్యాఖ్యా = యథాపూర్వం కథోపాయ రామాయణం త్వయాకృతం తథా మోక్షోపాయ రామాయణం కురు ఇతి శేషః॥

వాల్మీకి మహర్షి రామకథారూపమును పూర్వరామాయణమును రచించి శిష్యుడగు భరద్వాజున కిచ్చెననియు, భరద్వాజుడు మేరుశిఖరముమీద బ్రహ్మ గారి యెదుట దానిని జదివి వినిపింప, బ్రహ్మ సంతసించి వరము కోరు కొమ్మనె ననియు, "పూర్వరామాయణార్థము నసుసరించి చిత్తశుద్ధి కలిగిన మానవులు సంసారదుఃఖమును తరించు నుపాయము చెప్పుమని భరద్వాజుడు వర మడిగెననియు, ఆ విషయమునందు వాల్మీకిని ప్రార్థించినచో నీకు ఆతడా యుపాయము నుపదేశించగలడని చెప్పి బ్రహ్మ భరద్వాజుని వెంట బెట్టుకొని

వాల్మీకాశ్రమమున కేతెంచి, వాల్మీకితో, మహర్షీ "నీ విపుడు వ్రాయ బూనుకున్న ఉత్తర రామాయణమును (వాసిష్ఠ రామాయణమును) గ్రంథ విస్తర భీతిచే విసుకుజెంది మానకుము" ఈ గ్రంథము లోకమున కత్యంతోప కారకము" "దీనివలన మానవులు సంసార సంకటమునుంచి తరించగలరు" కావున తప్పక నీ మోక్షశాస్త్రమును (వాసిష్ఠ రామాయణమును) పూర్తిచేయుము" అని చెప్పి బ్రహ్మదేవుడు మహార్షి ఆశ్రమములో అంతర్ధానము జెందెననియు, నీ పై శ్లోకముల యర్థము.

దీనినిబట్టి వాసిష్ఠముకంటె బూర్వమే శ్రీమద్రామాయణమును వాల్మీకి రచియించెనని స్పష్టము.

ఇక పూర్వరామాయణమును (శ్రీమద్రామాయణమును) వాల్మీకి యెపుడు రచించెను? అనునది చూతము. శ్రీమద్రామాయణము. బాలకాండ, 4 వ సర్గ యం దిట్లు కలదు.

"ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవానృషిః
చకార చరితం కృత్స్నం విచిత్రపదమాత్మవాన్" 1

"చతుర్వింశత్సహస్రాణి శ్లోకానా ముక్తవా నృషిః
తథా సర్గశతా న్పంచ షట్కాండాని తథోత్తరం" 2

"కృత్వాపి తన్మహాప్రాజ్ఞః సభవిష్యం సహోత్తరం
చింతయామాస "కోన్వేతత్ప్రయుంజీయా" దితి ప్రభుః" 3

"తస్య చింతయమానస్య మహర్షేర్భావితాత్మనః
అగృహీతాం తతః పాదౌ మునివేషౌ కుశీలవౌ" 4

"సతు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ
వేదోప బృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" 5

అని, శ్రీరామచంద్రుడు రాజ్యపాలనము నవలంబించినతరువాత వాల్మీకి యిరువదినాలుగువేల శ్లోకములు, ఆరుకాండలు గల రామాయణమును, అశ్వమేధానంతర వృత్తాంతమునగల యుత్తరకాండతోసహా రచించి, దీనిని గ్రహించి పఠించగలసమర్థు లెవ్వరాయని ఆలోచించుచుండ శ్రీరామపుత్రులగు కుశలవులు మహర్షియొక్క పాదములను బట్టుకొని రనియు, వారికా గ్రంథమును చెప్పె ననియు పై శ్లోకముల యర్థము. దీనినిబట్టి, శ్రీరాముడు రాజ్యపదము నధిష్ఠించి, కుశలవులు జన్మించిన తరువాతనే వాల్మీకి పూర్వరామాయణమును ఉత్తర కాండతోసహా రచించెనని స్పష్టమగుచున్నది.

పై రెండు ప్రమాణములను పురస్కరించుకొని విచారించినచో రాముడు రాజ్యాధికారమున కేతెంచిన తరువాతనే వాల్మీకి యీ రెండు రామాయణములను

రచించెననియు, అందు శ్రీమద్రామాయణము ముందనియు, వాసిష్ఠము తరువాత రచించెననియును నిర్వివాదాంశము.

"ఇక శ్రీరామునకు వసిష్ఠోపదేశ మెపుడు జరిగె ననునది విచారణీయము. ఈయది "విశ్వామిత్రమహాముని యాగసంరక్షణకొరకు శ్రీరాముని గొనిపోవ నేతెంచినపుడు, "ప్రకృతము శ్రీరాముడు విరాగిగానున్నటుల దశరధుడు చెప్పెననియు" తాను శ్రీరాముని పిలిపించుకొని స్వయముగ పరికించి, తనకును వసిష్ఠునకును బ్రహ్మగా రుపదేశించిన తత్త్వము నుపదేశించుమని విశ్వామిత్రుడు వసిష్ఠుని ప్రేరేపింప వసిష్ఠు డుపదేశించెననియును" వాసిష్ఠమున కలదు, దీనినిబట్టి వసిష్ఠోపదేశము, యాగసంరక్షణ, సీతాకల్యాణ, వనవాసాదిఘట్టములకు బూర్వమే యని స్పష్టము. విశ్వామిత్రాగమనము శ్రీరామునకు పదునారు సంవత్సరములు నిండని వయఃకాలమునం దనిమాత్రము రెండు రామాయణము లందును కలదు. చూడుడు = వాసిష్ఠ రామాయణము ౧వ సర్గలో

శ్లో॥ ఊనషోడశవర్షోఽయం రామో రాజీవలోచనః
న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహరాక్షసైః॥ 2

"ఇయ మక్షౌహిణీ పూర్ణా యస్యాఃపతి రహంప్రభో" అని ఇట్లే శ్రీమద్రామాయణమునందును బాలకాండ 20 వ సర్గలో రెండు మూడు శ్లోకములు కలవు. కనుక యాగసంరక్షణ, సీతాకళ్యాణ, వనవాసాది ఘట్టములకు పూర్వమే రామునకు వసిష్ఠోపదేశము జరిగెననుటలో సందియ మిసుమంతయును లేదు.

అయితే పూర్వరామాయణమునందు, విశ్వామిత్రాగమన సమయమున శ్రీరాముని నిర్వేదమును (వైరాగ్యమును) దశరథు డేల ముచ్చటించలేదు? కావున వాసిష్ఠము వాల్మీకీయము కాక పోవచ్చునని కొందరందురు. ఇదియును సముచితము కాదు. శబ్దబ్రహ్మవేత్తయగు వాల్మీకి మహాముని యొక్క గ్రంథరచనాకౌశలమే యిందుకు గారణము. ఏల యన పూర్వరామాయణ మందు గూడ దశరథునినోట నిద్దానిని సూచింపజేసినచో విశ్వామిత్రుడు శ్రీరాముని పిలిపించుకొని స్వయముగ పరిశీలించెడివాడు. ఆపైన విశ్వామిత్రుడు శ్రీరాముని నిర్వేదమునకు కారణ మడుగుట, అతడు చెప్పుట తటస్థించెడిది. అంతట విశ్వామిత్రుడు శ్రీరాముని విడచియైనను వెళ్ళవలెను, లేక వసిష్ఠునిచే బోధ యొనర్చియైనను గొనిపోవలెను. ఇందు మొదటిపక్షమున విశ్వామిత్రునకు స్వకార్యభంగము. రెండవ పక్షమున చారిత్రాత్మకమగు పూర్వరామాయణ గ్రంథము మూరాపాస్తమగుట. కనుక నిట్టి విషమసంఘటనలు లేకుండ, గ్రంథమును విభజింపదలచిన మహర్షియగు వాల్మీకియొక్క రచనామహిమయే కాని వేరుకాదు. కావున నింతమాత్రమున వాసిష్ఠము వాల్మీకీయము కాదనుట పొరపాటు.

ఇంక ప్రకృత మనుసరింతును. ఇదియొక గొప్ప గ్రంధము. ఇందలి విషయ మంతయు ఆధ్యాత్మికము, బ్రహ్మోపదిష్టము. అడుగువాడు అవతారమూర్తి యగు శ్రీరామచంద్రుడు. చెప్పెడివారు వసిష్ఠమహర్షి. ప్రేరకుడు అపరబ్రహ్మ యనదగు విశ్వామిత్రుడు. గ్రంథకర్త వాల్మీకి. గ్రంధార్థమును విని గ్రహించెడి సభ్యులు భరద్వాజాది మునులు. ఈ సామగ్రియంతయు వారికే తగును. ఇట్టి యత్యుత్తమ గ్రంధమును నాబోటి యల్పజ్ఞుడు తెనిగింపనెంచుట సాహసమాత్రము. అయినను నా గురుపాదుల యనుగ్రహమున నీయది కొనసాగునని యెంచి నే నిక్కార్యమున అడుగిడితిని. కాన నిందేమయిన గుణము లున్నచో, అవి నా గురుపాదులవి. ఉన్న పొరపొచ్చెము లన్నియు నాయవి.

ఇక భాషావిషయము :

నవయుగ మారంభమైనది. ప్రజలకు నవీన నవీన భావాలు అంకురించినవి. ప్రాచీన పద్ధతులన్నీ పలాయితములైనవి. పురాతన సంప్రదాయాలు పురుగుపట్టినవి. నవీన సంప్రదాయాలు ప్రాణ్యమైనవి ప్రాచీన గ్రంథాలు మరుగు పడినవి. నవీన నవలలు తలలెత్తినవి. నవ్యసాహితీ కళాకోవిదులు నాటకరంగం లోకి దిగారు నవ్యసాహిత్యం నవయౌవనంతో నాట్యమాడుతోంది. నారీ మణులు నయితము నవ్యభాషా సంప్రదాయాలలో నలిగిపోతున్నారు. నానాటికీ నవ్యసాహిత్య రేఖలు నలువైపులా నవ నవోన్మేషతో వెలుగుచున్నవి. ఆహార, విహార, విద్యా వినోదాలయందు అంతా నవీనతయే ప్రజానీకానికి నాణ్యంగా కనిపిస్తోంది. ఇక్కాలమున ఆధ్యాత్మిక తత్త్వంతో జిగిబిగిగానున్న ఈగ్రంధమును వ్యాకరణయుక్తమయిన గ్రాంధికభాషతో నింపినచో గ్రంధార్థము చదువరులకు చాల దూరమగును. వసిష్ఠులంతటివారు ఉపనిషత్ప్రతిపాదితమూ, సాంఖ్యయోగ నిరూపితమూ అయిన ఈ విషయాన్ని చిన్నిచిన్ని కథలనల్లి, పునరుక్తిదోషాన్ని కూడా పాటించకుండా మానవుల మనోవీథులలో విషయమును ప్రవేశపెట్టుటయే పరమలక్ష్యంగా భావించారు. అదియే నాకును ఆదర్శప్రాయమైనది. కావున నే నీగ్రంథరచనలో వ్యావహారికభాషను ఉపయోగించితిని, ఇంతమాత్రమున నేను భాషాసంస్కారమును పాటింపనివాడను కాను. వలదనువాడనూ కాను. కాలానుగుణంగా మహర్షుల భావాలను మనస్సుల జొప్పించుటయే నా పరమ లక్ష్యము. ఇంతకుముందు నేను వ్రాసియున్న "భగవద్గీతా భాష్యార్క ప్రకాశికానువాదమను" గ్రంథమందు గాని, ఇంతవరకు అముద్రితమై నాచే వ్రాయబడియున్న "ఆంధ్రమీమాంసాదర్శన" మను గ్రంధమునందుగాని, నే నీ వ్యావహారికభాషను ఉపయోగించలేదు. కావున భాషాశాస్త్రజ్ఞులు ఇందలి ఔచిత్యానౌచిత్యములను విమర్శింప బనిలేదు.

నే నీ గ్రంథమును మొదట రెండు ప్రకరణములు వ్రాసిన పిదప నొక తూరి గాయత్రీపీఠాధిపతులగు శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామివారికి విని పించితిని. వారు వెంటనే గ్రంథమునందలి యాదరాభిమానములచే గ్రంథ ముద్రణమునకు తగు సహాయ మొనర్చుటకు సహృదయతతో నంగీకరించిరి. వారి సంకల్పవిశేషముననే యీ గ్రంథ మింతవరకు ముద్రణము నెరవేరినదని నా విశ్వాసము. శ్రీ స్వామివారు గ్రంథముద్రణమున కగు (అచ్చుఖర్చు) ద్రవ్యము నొసగిరి. వారికి నా కృతజ్ఞతాపూర్వకాభినందనములు.

గ్రంథమునకు గావలసిన కాగితమునకుగాను, ముందుపట్టికలో కనుపర చిన శ్రీ ఓరుగల్లుపురవాసులగు వైశ్యశిఖామణులు నాకు ధారివిరాళము లొసగి మనసార నుపకరించిరి. వారికి కృతజ్ఞతాపూర్వక శుభాశంసలు.

నే నీ గ్రంథమును రచించి ముద్రింపించుచుంటి నను నుదంతమును ఉత్తరరూపమున దెలుప రు 120-0-0 నూటయిరువది రూపాయలు మనియార్డరు చేసి మహారాజపోషకులుగ జేరినందులకు శ్రీ పిడుపాటి పిచ్చయ్య (ఇంకొల్లు) యొక్క యౌదార్యమునకు నేను కృతజ్ఞుడను.

మరియు, ఓరుగల్లు వాస్తవ్యులగు శ్రీయుత తోట కేదారిగారి చంద్ర శేఖరంగారు, నాకు వసూలుకావలసిన ద్రవ్యము సకాలములో వసూలుకాకున్నను తాము ముందుగ వందలకొలది ద్రవ్యమును పెట్టుబడి యొసగ్ని విజయవాడనుంచి కాగితమును దెప్పించి, సకాలములో పని జరుగు నట్లెంతేని సహాయ మొనర్చిరి. వారి కుటుంబమును బరమేశ్వరుడు చిరకాల మాయురారోగ్యైశ్వర్యములతో రక్షించుగాక యని యాశింతును.

ఇట్లు,
మల్లావఝ్ఝుల వెంకటసుబ్బరామశాస్త్రి,
గ్రంథకర్త.

ఓమ్

# "శ్రీ శృంగేరీ శ్రీ జగద్గురు సంస్థానమ్"

శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్యవర్య పదవాక్య ప్రమాణ పారావారపారీణ, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠ, తపశ్చక్రవర్త్యనాద్య విచ్ఛిన్న శ్రీశంక రాచార్య గురు పరంపరాప్రాప్త షడ్దర్శన స్థాపనాచార్య వ్యాఖ్యాన సింహా సనాధీశ్వర సకల నిగమాగమ సారహృదయ, సాంఖ్యత్రయ ప్రతిపాదక, వైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యానగర మహా రాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య శ్రీ మద్రాజాధి రాజగురు భూమండలాచార్య ఋష్య శృంగపుర వరాధీశ్వర తుంగభద్రా తీరవాసి, శ్రీ మద్విద్యాశంకర పాదపద్మారాధక, శ్రీ జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీ స్వామి గురు కరకమల సంజాత, శ్రీ జగద్గురు శృంగేరీ శ్రీ మదభినవ విద్యా తీర్థ స్వామిభిః॥ అస్మదత్యంత ప్రియ శిష్య బ్రహ్మశ్రీ మల్లావఝ్ఝల వేంకట సుబ్బరామశాస్త్రి విషయే, శ్రీమన్నారాయణ స్మరణ పూర్వకం విరచితా ఆశిషాః సముల్లసంతు తరామ్॥

బాల్యా ఏవ యథాసంప్రదాయం అద్వైత వేదాంతశాస్త్రం జైమినీ యందర్శనంచ సమ్యగధీత్య, శాస్త్రానుసారం ధర్మమాచరంతో, భగవంత మమహాకాంత మారాధయధయాయమితి విదిత్వాప్రసీ దామోవయమ్। భాగ్యనగరాత్ ప్రస్థాయ వరంగల్ నగరే ద్విత్రిదినాని నివాసః కృతోఽ స్మాభిః। తన్నగర విరాజమాన- విశ్వేశ్వర సంస్కృ తాంధ్ర కళాశాలాఽ ధ్యాపకపదమధితిష్ఠంతో యూయమ్ అస్మద్దర్శనావసరే యుష్మద్విరచితం యోగ వాసిష్ఠ రామాయణస్య ఆంధ్రానువాద రూపం "ఆంధ్ర వాసిష్ఠ రామాయణము" నామకం గ్రంథం తత్రతత్ర వాచయిత్వా అనువాదశైలీ పర్యచాయయత। ముముక్షూణాం తత్త్వబుభుత్సూనాంచ పరమ ముపకారక మిదం రామాయణమితి సర్వత్ర ప్రసిద్ధమ్। అతివిస్తృతం గ్రంథమిమం ఆంధ్ర భాషయా అనూద్య సంస్కృతా నభిజ్ఞానాం తత్త్వబుభుత్సూనాం ఆంధ్రాణాం మహాంత ముపకార మకురుతేతి విశ్వసిమః। అనువాదోఽయం నితరాం సరలః। సరసశ్చ। అద్వైత వేదాంతశాస్త్ర విదాంయుష్మాకమయ మనువాదః సర్వా త్మనా శాస్త్రమనువర్తత ఇతిప్రమోద స్థానమేతత్। ఆంధ్ర వాసిష్ఠరామాయణ మిదం విశిష్ట శిష్ట జనాదర మహాప్యప్రధతాం గ్రంథ ప్రణేతా రోయూయాయం చిరమభివర్ధధ్వ మితిచ ఆశాస్మహే॥

# విషయ సూచిక

| క్రమ సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| | **వైరాగ్య ప్రకరణము** | | |
| 1 | ఉపోద్ఘాత కథ | ... | 1 |
| 2 | సూత్ర పాతనకము | ... | 2 |
| 3 | శ్రీరాముని తీర్థయాత్ర | ... | 6 |
| 4 | దివస వ్యవహారము | ... | 9 |
| 5 | శరీర కార్శ్యము | ... | 9 |
| 6 | విశ్వామిత్రాగమనము | ... | 10 |
| 7 | విశ్వామిత్ర వాక్యము | ... | 11 |
| 8 | దశరథ వాక్యము | ... | 12 |
| 9 | వసిష్ఠులు ఓదార్చుట | ... | 13 |
| 10 | శ్రీరాముని విషాదము | ... | 14 |
| 11 | శ్రీరాముని ఓదార్పు | ... | 15 |
| 12 | శ్రీరాముని మొదటి పరితాపము | ... | 16 |
| 13 | లక్ష్మీ నిరాకరణము | ... | 17 |
| 14 | జీవిత నింద | ... | 19 |
| 15 | అహంకార నింద | ... | 20 |
| 16 | మనో నింద | ... | 22 |
| 17 | తృష్ణా నింద | ... | 25 |
| 18 | దేహ నింద | ... | 27 |
| 19 | బాల్య నింద | ... | 31 |
| 20 | యౌవన నింద | ... | 34 |
| 21 | స్త్రీ నింద | ... | 37 |
| 22 | జరా నింద | ... | 39 |
| 23 | కాల నింద | ... | 41 |
| 24 | కాల విలాసము | ... | 44 |
| 25 | యమ విలాసము | ... | 45 |
| 26 | దైవ దుర్విలాసము | ... | 46 |

| క్రమ సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| 27 | పదార్థాఽనిత్యత్వము | ... | 49 |
| 28 | సర్వ పదార్థముల వైపరీత్యము | ... | 53 |
| 29 | సకలపదార్థము లందును అనాదరమును ప్రతిపాదించుట | | 56 |
| 30 | వైరాగ్య ఫలము | ... | 58 |
| 31 | శ్రీరాముని ప్రశ్న | ... | 59 |
| 32 | నభశ్చర సాధువాదము | ... | 61 |
| 33 | నభశ్చర మహీచర సమ్మేళనము | ... | ,, |

ముముక్షు ప్రకరణము

| | | | |
|---|---|---|---|
| 1 | శుక నిర్వాణము | ... | 64 |
| 2 | విశ్వామిత్రవాక్యము | ... | 67 |
| 3 | సర్గాను వర్ణనము | ... | 68 |
| 4 | పురుష ప్రయత్న నిరూపణము | ... | 72 |
| 5 | పౌరుషమును బలపరచుట | ... | 74 |
| 6 | దైవ నిరాకరణము | ... | 77 |
| 7 | పౌరుషము ప్రధానమని నిరూపించుట | ... | 79 |
| 8 | దైవ నిరాకరణము | ... | 82 |
| 9 | కర్మవిచారము | ... | 85 |
| 10 | జ్ఞానావతరణము | ... | 92 |
| 11 | అడుగువానియొక్కయు చెప్పువానియొక్కయు లక్షణము | | 96 |
| 12 | తత్త్వమాహాత్మ్య వర్ణనము | ... | 101 |
| 13 | శమ నిరూపణము | ... | 103 |
| 14 | విచార నిరూపణము | ... | 111 |
| 15 | సంతోష నిరూపణము | ... | 118 |
| 16 | సాధు సంగమ నిరూపణము | ... | 121 |
| 17 | గ్రంథ సంఖ్యాది వర్ణనము | ... | 124 |
| 18 | దృష్టాంత నిరూపణము | ... | 130 |
| 19 | ప్రమాణ నిరూపణము | ... | 141 |
| 20 | సదాచార నిరూపణము | ... | 148 |

ఉత్పత్తి ప్రకరణము

| | | | |
|---|---|---|---|
| 1 | బంధహేతు నిరూపణము | ... | 151 |

| సర్గ సంఖ్య | విషయము | పుట |
|---|---|---|
| 2 | మొదటి సృష్టికర్త చరిత్ర ... | 159 |
| 3 | బంధహేతు నిరూపణము ... | 164 |
| 4 | ఉత్పత్తి ప్రకరణార్థ కథనము ... | 169 |
| 5 | మూలకారణ దేవస్వరూప వర్ణనము ... | 173 |
| 6 | ముముక్షు ప్రయత్నోపదేశము ... | 175 |
| 7 | దృశ్యమిథ్యాత్వము ... | 177 |
| 8 | సచ్ఛాస్త్ర నిరూపణము ... | 183 |
| 9 | పరమకారణ వర్ణనము ... | 184 |
| 10 | ప్రళయమునందు మిగిలియుండెడి వస్తువులను వర్ణించుట | 190 |
| 11 | పరమార్థ వర్ణనము ... | 196 |
| 12 | జగదుత్పత్తి వర్ణనము ... | 200 |
| 13 | స్వయంభూ ఉత్పత్తి వర్ణనము ... | 203 |
| 14 | బ్రహ్మస్వరూప ప్రతిపాదనము ... | 208 |
| 15 | లీలోపాఖ్యానము ... | 215 |
| 16 | లీలా పరిదేవనము ... | 216 |
| 17 | సందేహ రాజ్యము ... | 219 |
| 18 | జగన్మిథ్యాత్వము ... | 222 |
| | మండపోపాఖ్యానము ... | 225 |
| 19 | వసిష్ఠుడను బ్రాహ్మణుని మృతి వర్ణనము ... | 226 |
| 20 | వసిష్ఠుడు పద్ముడనినిరూపించుట ... | 228 |
| 21 | విశ్రాంత్యుపదేశము ... | 231 |
| 22 | విజ్ఞాన వర్ణనము ... | 239 |
| 23 | లీలా సరస్వతులు జ్ఞానదేహముతో ఆకాశమున కేగుట | 242 |
| 24 | గగన వర్ణనము ... | 243 |
| 25 | భూలోక వర్ణనము ... | 244 |
| 26 | సిద్ధ దర్శనము ... | 245 |
| 27 | లీల యొక్క జన్మాంతర వర్ణనము ... | 248 |
| 28 | గిరిగ్రామ వర్ణనము ... | 251 |
| 29 | పరమాకాశ వర్ణనము ... | 253 |

| క్రమ సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| 30 | విచిత్ర బ్రహ్మాండ వర్ణనము | ... | 256 |
| 31 | యుద్ధ ప్రేక్షకులతో నిండిన నభోవర్ణనము | ... | 259 |
| 32 | యుద్ధారంభ వర్ణనము | ... | 261 |
| 33 | ప్రథమ యుద్ధము | ... | 262 |
| 34 | యుద్ధమును జూచెడి ప్రజల పలుకులు | ... | ,, |
| 35 | రణ వర్ణనము | ... | 263 |
| 36 టు 39 | యుద్ధవర్ణనము | ... | 263 |
| 40 టు 41 | భ్రాంతి, విచారము | ... | 271 |
| 42 | స్వప్న పురుష సత్యత్వ నిరూపణము | ... | 275 |
| 43 | అగ్నిదగ్ధమయిన గృహాదులను వర్ణించుట | ... | 279 |
| 44 | అగ్నిదాహమును రాత్రియుద్ధ వర్ణనము జగద్బ్రహ్మ వర్ణనము | | 280 |
| 45 | సత్యకామ సత్యసంకల్పములను వర్ణించుట | ... | 284 |
| 46 | విదూరథ నిర్యాణము | ... | 286 |
| 47 | విదూరథ సింధురాజుల సమాగమము | ... | ,, |
| 48 టు 49 | ఆయుధ యుద్ధ వర్ణనము | ... | 287 |
| 50 | విదూరథ మరణము | ... | 290 |
| 51 టు 52 | సింధురాష్ట్ర వర్ణనము | ... | 291 |
| 54 | మరణ విచారము | ... | 297 |
| 55 | జీవుని సంసారగతి వైచిత్ర్యము | ... | 303 |
| 56 | విదూరథుడు యమపురి కరుగుట | ... | 311 |
| 57 | స్వప్నవస్తు విచారము | ... | 317 |
| 58 | పద్మరాజు జీవించుట | ... | 323 |
| 59 | పద్మని నిర్వాణము | ... | 326 |
| 60 | లీలోపాఖ్యాన ప్రయోజనము | ... | 327 |
| 61 | జగత్స్వరూప వర్ణనము | ... | 335 |
| 62 | దైవశబ్దార్థ నిరూపణము | ... | 337 |
| 63 | చిత్తవికార వర్ణనము | ... | 339 |
| 64 | ఉత్పత్తి బీజాంకుర నిర్ణయము | ... | 340 |
| 65 | జీవ విచారము | ... | 342 |

| క్రమ సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| 66 | సంసార స్థితి | ... | 343 |
| 67 | సత్యోపదేశము | ... | 344 |
| 68 | సూచికోపాఖ్యానము | ... | 351 |
| 69 | విషూచికా మంత్రి కథనము | ... | 352 |
| 70 | సూచీ వ్యవహార వర్ణనము | ... | 353 |
| 71 | సూచీ పరిదేవనము | ... | 357 |
| 72 | సూచీ తపః ప్రభావము | ... | 360 |
| 73 | నారదుడు సూచీ తపోవైభవమును వర్ణించిచెప్పుట | ... | 361 |
| 74 | సూచీ తపః పరిపాక వర్ణనము | ... | 363 |
| 75 | సూచి (కర్కటి) పూర్వశరీరమును పొందుట | ... | 364 |
| 76 టు 77 | కర్కటి న్యాయజీవనము | ... | 366 |
| 78 | కర్కటి భయంకరోక్తులు | ... | 368 |
| 79 | కర్కటి రాజమంత్రులను ప్రశ్నించుట | ... | ,, |
| 80 | రాక్షసిప్రశ్నలకు మంత్రి సమాధానము చెప్పుట | ... | 375 |
| 81 | రాజు రాక్షసిప్రశ్నలకు సమాధానమును జెప్పుట | ... | 382 |
| 82 | కర్కటీ కిరాతరాజుల స్నేహము | ... | 395 |
| 83 | కందరా పూజనము | ... | 399 |
| 84 | మనోంకురోత్పత్తి వర్ణనము | ... | 400 |
| 85 | ఐందవోపాఖ్యానము | ... | 404 |
| 86 | ఐందవుని సమాధానము | ... | 406 |
| 87 | పదిబ్రహ్మాండముల వర్ణనము | ... | 408 |
| 88 | ఐందవుని నిశ్చయ కథనము | ... | 409 |
| 89 టు 90 | కృత్రిమేందాహ్యల అనురాగ వర్ణనము | ... | 410 |
| 91 | జీవావతరణ క్రమము | ... | 414 |
| 92 | మనోమాహాత్మ్య వర్ణనము | ... | 418 |
| 93 టు 94 | ప్రపంచోత్పత్తి వర్ణనము | ... | 420 |
| 95 | కర్మకర్తలకు అభేదమును ప్రతిపాదించుట | ... | 425 |
| 96 | మనస్సంజ్ఞా విచారము | ... | 432 |
| 97 | చిదాకాశ మాహాత్మ్యము | ... | 437 |

| క్రమ సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| 98 | చిత్తాఖ్యానము | ... | 439 |
| 99 | చిత్తోపాఖ్యానమునందలి తాత్పర్యార్థము | ... | 441 |
| 100 | చిత్తోత్పత్తి కథనము | ... | 443 |
| 101 | బాలకాఖ్యాయిక | ... | 446 |
| 102 | వసిష్ఠోపదేశము | ... | 447 |
| 103 | చిత్త మాహాత్మ్యము | ... | 449 |
| 104 టు 105 | ఇంద్రజాలోపాఖ్యానము | ... | 451 |
| 106 | ఇంద్రజాలోపాఖ్యానమున చండాలీ వివాహము | ... | 453 |
| 107 | ఆపద్వర్ణనము | ... | 455 |
| 108 | అకాండ దుర్భిక్ష వర్ణనము | ... | 455 |
| 109 | చండాల జన్మ నివృత్తి | ... | 456 |
| 110 | చిత్త వర్ణనము | ... | 457 |
| 111 | చిత్త చికిత్సా వర్ణనము | ... | 459 |
| 112 | చిత్తోపాయ కథనము | ... | 460 |
| 113 | అవిద్యా వర్ణనము | ... | 461 |
| 114 | దోషపరిహారోపదేశము | .... | 462 |
| 115 | సుఖదుఃఖ భోక్తృత్వోపదేశము | ... | 465 |
| 116 | సాధక జన్మావతారము | ... | 466 |
| 117 | అజ్ఞానభూమికా వర్ణనము | ... | 468 |
| 118 | జ్ఞానభూమికోపదేశము | ... | 470 |
| 119 | సువర్ణోర్మ్యుపదేశము | ... | 472 |
| 120 | చండాలీ శోచనము | ... | 475 |
| 121 | చిత్తాభావప్రతిపాదనము | ... | 476 |
| 122 | స్వరూప నిరూపణము | ... | 480 |

విషయసూచిక సమాప్తము.



సచ్చిదానంద పరమాత్మనేనమః

# ఆంధ్ర వాసిష్ఠ రామాయణము

## వైరాగ్య ప్రకరణము

### ౧ ఉపోద్ఘాత కథ

సుతీక్ష్ణుడనే బ్రాహ్మణుడు అగస్తి మహాముని ఆశ్రమానికి వెళ్లాడు. మోక్షానికి కారణం కర్మా? జ్ఞానమా? లేక ఈ రెండూనా అని అడిగాడు. ముని ఇలా బదులు చెప్పాడు. బ్రాహ్మణోత్తమా? పక్షి రెండు రెక్కలూ ఉంటేనే ఆకాశానికి ఎగురుతుంది. ఒంటి రెక్కతో ఎగరలేదు. అలాగే మానవుడు జ్ఞాన కర్మలు రెండూ ఉంటేనే మోక్షం పొందుతాడు. ఒక్కదానితో మోక్షం పొందలేడు. కాబట్టి జ్ఞాన కర్మలు రెండూ మోక్షానికి సాధనాలు. ఈ విషయంలో నీకొక కథ చెప్తాను విను.

పూర్వకాలంలో అగ్నివేశ్యుడనే బ్రాహ్మడికి కారుణ్యుడనే కుమారుడుండేవాడు. అతడు వేదాలూ వేదాంగాలూ బాగా చదివినాడు. చదువు చాలించి గురుకులం నుంచి ఇంటికి వచ్చి కర్మానుష్ఠానము లేకుండా ఊరకున్నాడు. తండ్రి కొడుకును చూచి, "నీవు కర్మ మానుటకు కారణమేమి"? అని అడిగాడు. నాయనా? శ్రుతులు కొన్ని చచ్చేదాకా కర్మలు చేయమంటున్నాయి. ఇది ప్రవృత్తి ధర్మమట. మరికొన్ని శ్రుతులు "ధనము, కర్మ, సంతానము" ఇవేమి

మోక్షానికి కారణాలు కావంటున్నాయి. కర్మ సన్యాసము ఒక్కటే మోక్షానికి కారణమని చెప్పుచున్నాయి. ఇది నివృత్తి ధర్మమట. ఈ రెంటిలో ఏది చెయ్యాలో నాకు తోచడం లేదు. అందువల్ల ఊరకున్నాను అన్నాడు కొడుకు. అపుడు కుమారా? నీకొక కథ చెపుతాను దాన్ని విని తరువాత నీకు తోచినట్లు చెయ్యి. అని కథ చెప్పడం ప్రారంభించాడు తండ్రి.

పూర్వం సురుచి అనే అప్సరస స్త్రీ హిమాచల శిఖరం మీద కూర్చుంది. కామ తప్తులయిన కిన్నర కిన్నరీలు గంగానదిలో జలక్రీడలాడుతున్నారు. పైనుంచి ఆకాశాన దేవదూత వెళ్లుచుండగా చూచింది. "ఎక్కడికి వెళ్లుచున్నావు? ఎక్కడ నుంచి వస్తున్నావు" అని అడిగింది దేవదూత ఇలా బదులు చెప్పాడు. అరిష్టనేమి అనే రాజు రాజ్యం అంతా కొడుకున కిచ్చి గంధమాదన పర్వతంమీద తపస్సు చేస్తున్నాడు. నేను ఆయనవద్దకు వెళ్లాను. మా దేవేంద్రుడుగారు చెప్పిన మాట ఆయనగారికి చెప్పాను. తిరిగి దేవలోకానికి వెళ్లుతున్నాను. అని అన్నాడు దేవదూత.

అయితే ఆ అరిష్టనేమి మహారాజుగారి కథ ఏమిటి? నాకు వినాలని ఉంది. కోపించకుండా చెప్పు అని అడిగింది సురుచి. దేవదూత అరిష్టనేమి వృత్తాంతం సురుచికి చెపుతాడు.

గంధ మాదనం మీద అరిష్టనేమి తపస్సు చేస్తూ ఉండగా మా ప్రభువు విమానం తీసుకుని వెళ్లి ఆయన్ని స్వర్గానికి తీసుకు రమ్మన్నాడు. నేను విమానం తీసుకొని గంధమాదనానికి వెళ్లాను. ఆ రాజపుంగవునితో మా శచీపతిగారు చెప్పిన మాట చెప్పాను. అతడు అంతా సావధానంగా విన్నాడు. ఏమేమో సందేహించాడు. దేవలోకంలో విశేషాలు ఏమిటో చెప్పుమని నన్నడిగాడు. అక్కడి పరిస్థితి తెలుసుకుంటే కాని కర్తవ్యం నిర్ణయించుకోనన్నాడు. నేను ఉన్న వాస్తవం చెప్పాను. స్వర్గంలో పుణ్యం కొద్దీ సుఖం అనుభవిస్తారన్నాను. పరుల గొప్పతనాన్ని సహించలేరన్నాను. ఒకరి నొకరు కలహిస్తారన్నాను. అసూయ కూడా పొందు

అన్నాను. తక్కువ వాళ్లను చూస్తే ఎక్కువ వాళ్లకు మహా సంతోషం అన్నాను. పుణ్యం అంతా ఖర్చుపెట్టుకుని తుదకు స్వర్గాన్ని విడిచి భూలోకానికి వెళ్ళలేక ఏడుస్తారన్నాను. అక్కడి విషయం ఇదీ అన్నాను. పైన మీ చిత్తం అన్నాను.

అరిష్టనేమికి ఇలాంటి స్వర్గం అక్కర లేదట. ఇంకా ఘోర తపస్సు చేస్తాడట. శరీర త్యాగం చేస్తానన్నాడు. నీకు నీ స్వర్గానికి దణ్ణం అన్నాడు. నన్ను పొమ్మన్నాడు. నేను విమానం త్రిప్పి తీసుకొని వచ్చినాను. విషయమంతా ఇంద్రుడు గారికి చెప్పాను. ఇంద్రుడాశ్చర్యపోయాడు. వెంటనే ఆ రాజును వాల్మీకి ఆశ్రమానికి చేర్చమన్నాడు. ఇతనికి తత్త్వం ఉపదేశించుమని వాల్మీకితో చెప్పమన్నాడు. నేను మళ్లీ గంధమాదనం చేరాను. అరిష్టనేమి ఆశ్రమం ప్రవేశించాను. ఆయన్ని తీసుకొని వాల్మీకి ఆశ్రమానికి వచ్చినాను. మా శచీపతిగారు చెప్పిన మాట వాల్మీకితో చెప్పినాను. ఆ రాజు కూడా అధ్యాత్మం ఉపదేశించమని వాల్మీకిని కోరాడు. సంసార దుఃఖం పోయేది ఎలాగో చెప్పమన్నాడు. వాల్మీకి అరిష్టనేమి మహారాజును కుశలం అడిగాడు. మోక్షోపాయం అయిన వాసిష్ఠ రాముల సంవాదాన్ని వింటే నీవు కడతేరుతావన్నాడు. వాసిష్ఠ రామాయణం కథ చెప్తుతా వినమన్నాడు.

మహర్షీ ! రాముడెవరు? ముక్తుడా? బద్ధుడా? నీవు తత్త్వవేత్తవు కదా? ముందు ఇది తేల్చి చెప్పమన్నాడు అరిష్టనేమి.

రాముడు విష్ణువు. శాపవశాన రాజవేషంతో భూలోకాన అవతరించాడన్నాడు వాల్మీకి.

అయితే చిదానంద రూపుడయిన రాముడికి శాపము ఎందుకు వచ్చింది? శపించిందెవరు? అని అడిగాడు రాజు. వాల్మీకి జవాబు చెప్పాడు ఆ రాజుకు.

1. బ్రహ్మలోకంలో సనత్కుమారుడనే మహా నిష్కాముడుండేవాడు. ఒకమాటు విష్ణుమూర్తి వైకుంఠం నుంచి బ్రహ్మలోకానికి వచ్చాడు. అతనిని బ్రహ్మదేవుడు పూజించాడు. సత్యలోకంలోని

వారంతా పూజించారు. సనత్కుమారుడు ఒక్కడు మాత్రం పూజించ లేదు. సనత్కుమారుడు నిష్కాముడనని గర్వించినట్లు గుర్తించాడు శ్రీ మహావిష్ణువు. కోపం వచ్చింది. కామార్తుడవై శరజన్ముడనే పేరుతో భూలోకంలో పుట్టుమని శపించాడు సనత్కుమారుణ్ణి. సనత్కుమారుడు కూడా సామాన్యుడు కాడు. విష్ణువంతవాడు ఇతనికీ కోపం వచ్చింది. "నీ సర్వజ్ఞత్వంపోయి అజ్ఞానివై కొంతకాలం వుండగలవ"ని విష్ణువును శపించాడు సనత్కుమారుడు.

2. పూర్వం దేవదానవులకు యుద్ధం తటస్థించగా దానవులకు సహాయం చేసింది భృగుపత్ని. దానవ సంహార నిమిత్తం ఆమెను చంపినాడు విష్ణువు. అది చూచి భృగువు కోపించాడు. నీకు కూడా భార్యావియోగం కలుగుతుందని శపించాడు విష్ణుని.

3. బృంద అని జలంధరుని భార్య ఆవిణ్ణి విష్ణుమూర్తి పతి వేషంతో మోహింప చేశాడు. ఆవిడ కూడా నీకు భార్యా వియోగం తప్పదని శపించింది.

4. పయోష్ణీ నదీ తీరాన దేవశర్మ భార్య నృసింహ వేషంతో ఉన్న విష్ణుమూర్తిని చూచి భయపడి చచ్చింది. అందువల్ల నావలె నీవు కూడా భార్య వియోగాన్ని పొందుతావని శపించాడు దేవశర్మ. ఇలా ఇంతమంది శాపాన భూలోకంలో మనుష్యుడుగా అవతరించాడు విష్ణువు. అతడే రాముడు.

ఇతనికి సనత్కుమారుని శాపాన అజ్ఞానం సంభవించింది. సర్వజ్ఞత్వం పోయింది. మిగతా ముగ్గురి శాపమున మూడుమార్లు సీతా వియోగం తటస్థించింది. రావణుడు ఎత్తుకు పోయినప్పుడొకమారు, మిథ్యాపవాదంతో రెండోమారు, భూతల ప్రవేశంతో మూడోమారు.

రామ శాపానికి కారణం అంతా చెప్పాను. ఇంక నీవడిగిన మోక్ష సాధనాన్ని చెపుతానన్నాడు వాల్మీకి.

సురుచీ ఇది అరిష్టనేమి మహారాజు వృత్తాంతం నాకు తెలిసినంత వరకు అని అన్నాడు దేవదూత.

గమనిక:- పూర్వ రామాయణంలో "నచిరంత్వయివత్స్యతి" "సీత చాలాకాలం నీవద్ద ఉండదు" అని తారరామునితో అన్నట్లు కనిపిస్తుంది. అది ఆక్షేప వచనము కాని శాపవచనము కాదు.

## ౨ సూత్ర పాతనకము

అరిష్టనేమి మహారాజా? ముందు మోక్ష శాస్త్రానికి, విషయం ఏమిటో, ప్రయోజనం ఏమిటో? ఫలమేమో? అధికారి యెవడో తెలుసుకోవాలి. దీనికి అజ్ఞాని అధికారి కాడు. కేవలం జ్ఞాని కూడా అధికారి కాడు. నేను బద్ధుణ్ణి. ఆత్మ జ్ఞానంచే ముక్తుణ్ణి కావాలి. అని గట్టికోరిక గలవాడు అధికారి. పూర్వ రామాయణం ప్రవృత్తి మార్గాన చిత్త శుద్ధి కలిగించి, చిత్తాన్ని జ్ఞానానికి అభిముఖం చేస్తుంది. ఉత్తర రామాయణం అనే ఈ వాసిష్ఠ రామాయణం నివృత్తి మార్గాన మోక్షం చేకూరుస్తుంది. దీన్ని విచారించిన వాడు మళ్లీ పుట్టడు. పూర్వ రామాయణం ఉత్తర రామాయణం కలసి మొత్తం లక్ష ఆరువేల శ్లోకాలు. అందులో పూర్వ రామాయణం ఇరవై నాలుగువేల శ్లోకాల గ్రంథం. నేను మొదట దీనిని రచించి, నా ప్రియ శిష్యుడైన భరద్వాజున కిచ్చినాను. అతడు గ్రంథమంతా చక్కగా గ్రహించాడు. ఒకప్పుడు మేరు పర్వతం మీద బ్రహ్మగారి యెదుట, కథా రూపంగా ఉన్న ఇరవై నాలుగువేల గ్రంథాన్ని చెప్పినాడు. బ్రహ్మ సంతోషించాడు. వరం కోరుకోమన్నాడు భరద్వాజుణ్ణి. భరద్వాజుడు, "పూర్వ రామాయణ కథార్థమును అనుష్ఠించి చిత్తశుద్ధిని పొందిన మానవులు సంసార దుఃఖం నుంచి విముక్తులయ్యే" వరమిమ్మన్నాడు బ్రహ్మను. ఈ విషయంలో, వాల్మీకి మహర్షిని ప్రార్థించమన్నాడు బ్రహ్మ. భరద్వాజా? ఇటీవలనే మోక్షసాధనం అయిన వాసిష్ఠ రామాయణాన్ని వాల్మీకి వ్రాయ నారంభించాడన్నాడు. అది విన్న మానవుడు సముద్రాన్ని సేతువుచే దాటినట్లు, సంసారాన్ని దాటగలడని చెప్పినాడు. భరద్వాజుని వెంట బెట్టుకొని బ్రహ్మదేవుడు నా ఆశ్రమానికి వచ్చినాడు. నేను

అర్ఘ్యపాద్యాదులచే పూజించినాను. సమస్త భూతకోటి హితమును కోరినవాడు కాబట్టి ఆ బ్రహ్మదేవుడు, నాతో "ఓ వాల్మీకీ? నీవిప్పుడు వ్రాయబూనుకున్న వాసిష్ఠ రామాయణాన్ని క్రమముగాని అనుకోక పూర్తి చేయమన్నాడు, మానవ సంఘము, స్టీమరుచే సముద్రాన్ని దాటినట్లు సంకటంలో మునిగియున్న సంసారసాగరాన్ని ఈ గ్రంథం చేదాటగలదన్నాడు. ఈ మాట చెప్పటానికే తాను ఇక్కడకు వచ్చానన్నాడు. తప్పక ముగించమన్నాడు. క్షణకాలంలో మాయం అయినాడు.

బ్రహ్మదేవుడు నా ఆశ్రమానికి వచ్చాడని నాకు ఆనందం పొంగిపోయింది. నేను ఆందులో మునిగిపోయాను. తెలివితప్పింది. ఎలాగో మళ్లీ తెలివి తెచ్చుకున్నాను. ఇంతకుముందు బ్రహ్మ చెప్పింది ఏమిటని దగ్గరవున్న భరద్వాజుని అడిగాను. అతడు సవిస్తరంగా బ్రహ్మ చెప్పిందంతా నాకు చెప్పినాడు. పైగా సీతారామలక్ష్మణ భరత శత్రుఘ్నులు వారి పరివారమున్ను ఈ మహాసంసార సంకటంలో ఎలా వున్నారని అడిగినాడు భరద్వాజుడు. ఇదివరకు వారంతా సంసార దుఃఖాన్ని ఎందుకు పొందలేదని ప్రశ్నించాడు. తనకు కూడ సంసారం, తరించాలని ఉన్నదన్నాడు. దీనికి మార్గం ఏమన్నాడు. విపులంగా చెప్పమన్నాడు భరద్వాజుడు.

నేను కూడా సంసారాన్ని తరించే మార్గం చెప్తానని ప్రతిజ్ఞ చేశాను. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులూ సీతా కౌసల్యా సుమిత్రలూ వాసిష్ఠవామదేవాదులూ, అష్టమంత్రులూ, విభీషణహనుమదాదులూ. వీరంతా బ్రహ్మజ్ఞానం పొందారన్నాను. వారంతా జీవన్ముక్తులన్నాను. వారి వలె నడచుకుంటే నీవుకూడా బ్రహ్మజ్ఞానం పొంది ముక్తుడవు అవుతావన్నాను భరద్వాజునితో.

## 3 శ్రీరాముని తీర్థయాత్ర.

శ్రీరాముని ప్రారంభించి జీవన్ముక్తులస్థితి అంతా క్రమంగా చెప్పనున్నాను భరద్వాజుడు. తానుకూడ దాన్ని అలవరుచుకుని సుఖిస్తానన్నాడు. మోక్షము యొక్క లక్షణాన్ని మోక్షస్వరూపాన్ని, దాని సాధనాలను ఫలాన్ని చెప్పుతాను సావధానంగా వినమన్నాను నేను. అదృష్టమేమిటో? ఆచే

నీకు కూడా చెప్తాను. నీ సందేహము తీరుతుంది. నీవు కూడా కడ తేరుతావు. భరద్వాజా! ఆకాశానికి నలుపు రంగు లేనట్లు ఈ ప్రపంచం కూడా నిజస్థితిలో లేదు. ఇది కల్పితం. కేవలం భ్రమ. ఇలాంటి దాన్ని పూర్తిగా మరచి పోవడమే ముక్తికి సరిఅయిన లక్షణం. ఇదే దానికి అసలయిన స్వరూపము. ఆత్మసాక్షాత్కారము దీనికి సాధనము. మరోదాని వల్ల ఇది కలుగదు. ఇప్పుడు నేను వ్రాయబూనిన వాసిష్ఠరామాయణాన్ని వింటే నీకు ఆత్మజ్ఞానం కలుగుతుంది ఆకాశానికి రూపం లేదనే తెలివి కలిగినట్లు ప్రపంచం లేదని తెలివి కలగటమే మోక్షం. ఆత్మ జ్ఞానాన్ని విడచి, అనాత్మ శాస్త్రాలనే గోతులలో పడి ఇహపర సుఖాలకు బానిసలై తిరిగేవారికి ఎన్ని బ్రహ్మకల్పాలు గడచినా ముక్తిరాదు. మనోవాసనలను పూర్తిగా నాశనం చేసుకోవడమే ఉత్తమ మోక్షం. కర్మచేత ఉపాసన చేత శ్రవణమననాదుల చేత వాసనాక్షయం చేసుకోవాలి. చిత్తం నిర్మలం కావాలి. తదుపరి మోక్షం పొందాలి. ఇది దీని క్రమం. చిత్తమంటే వాసనాపుంజము. వాసనలు నశిస్తే చిత్తం లేదు, స్థూలదేహంకూడ వాసనలమీద నిలిచింది. శరీరములోని ముత్యాలన్నీ లోపలిదారం మీదనే ఆధారపడి ఉంటాయి. ఈవాసనలు, శుద్ధములు, మలినములు అని రెండురకాలు. మలినవాసనలు జన్మనుకలిగించే కారణాలు. శుద్ధవాసనలు జన్మరాహిత్యానికి కారణాలు. ఇవి అజ్ఞానమనే క్షేత్రంలో అహంకారమనే భూకామందుచే నాటి పెంచబడుతున్నాయి. కాలిన గింజలలో మొలకయెత్తే శక్తి నశిస్తుంది. శుద్ధవాసనలలో మళ్లీ జన్మయిచ్చే శక్తి నశిస్తుంది కాబట్టి శుద్ధవాసనలు (మంచిసంస్కారాలు) పునర్జన్మను ఇయ్యవు. కాని దేహమును నిలపెట్టడానికి ఉపయోగపడతాయి. కాలిన గింజలలో మొలకరించే శక్తి లేకున్నా గింజ యొక్క ఆకారముగా ఉండి ఆహార రూపంలో ఆకలిని తీర్చి దేహానికి పుష్టి యిస్తాయి. అలాగే శుద్ధవాసనలలో జన్మయిచ్చేశక్తి నశించినా, వాసనాకారంగా వుండి దేహాన్ని ఆకార మాత్రంలో నిలపెడతాయి. ఇలాంటి శుద్ధవాసనలు జీవన్ముక్తులయందుంటాయి. కాబట్టి తత్త్వజ్ఞానచేత శక్తి చంపుకొని వాసనా మాత్రంచే శరీరాన్ని ధరించినవారు జీవన్ముక్తులు. రాముడు కూడా ఇలాంటి జీవన్ముక్తుడే. వాని పరిస్థితి అంతా వివరంగా చెప్తా విను.

శ్రీరాముడు చదువంతా పూర్తి చేసి ఇంటిలో కులాసాగా ఉన్నాడు. తండ్రి దశరథుడు రాజ్యమేలుచున్నాడు. ప్రజలందరు సుఖులు. ఈ స్థితిలో రామునికి పవిత్రమయిన తీర్థయాత్ర చెయ్యాలని కోరిక కలిగింది. ఒకనాడు తండ్రి కాళ్లు పట్టుకుని బ్రతిమాలు కున్నాడు. నాన్నా! నాకు పుణ్యతీర్థాలు దేవాలయాలు ఆశ్రమాలు చూడాలని నిండా కోరికగా ఉంది. నీవు చాలామంది కోరిక తీర్చావు. నాకిది మొదటి కోరిక. దీనిని సఫలం చేయమన్నాడు రాముడు. వసిష్ఠునితో ఆలోచించి అనుజ్ఞ యిచ్చాడు దశరథుడు. శ్రీరాముడు మంచిరోజు చూచి బయలు దేరాడు చక్కగా అలంకరించుకున్నాడు. బ్రాహ్మణాశీర్వాదాలు పొందాడు. శాస్త్రజ్ఞులైన బ్రాహ్మణులను తమ్ములను వెంట పెట్టుకున్నాడు. తల్లుల ఆశీస్సులు కౌగిలింతలు అందుకున్నాడు. పురము వెడలినాడు. అప్పుడు సేవలు మంగళ వాద్యాలు వాయించారు. పురస్త్రీలు ఆసక్తితో చూడసాగారు. శుభసూచకంగా లాజలు చల్లారు. ప్రజలందరు ఆశీర్వదించారు. ఇలా బయలుదేరాడు రాముడు. పవిత్రమైన దేవాలయాలు తిలకించాడు. ఋష్యాశ్రమాలు తొక్కి చూచాడు. తీర్థాలు క్షేత్రాలు దర్శించాడు. పుణ్యనదులను సేవించాడు. కులశైలాలు దర్శించాడు. నాలుగు దిగంతాలు నడిచి చూచాడు. తిరిగి అయోధ్య చేరాడు.

గమనిక: గురూ! ఇది తత్త్వశాస్త్రం కదా? ఇందులో రాముని తీర్థయాత్ర వర్ణించడ మెందుకు వాల్మీకి? ఇకముందు మృగయా విహారము కూడా వర్ణిస్తాడు అదెందుకు? ఒక వేళ రామ చరిత్ర కాబట్టి వర్ణించా డంటారేమో? అలాగైతే శ్రీరాముని జన్మ వృత్తాంతం కూడా, వర్ణించాలిసిందేగా? ఇవన్నీ ఇక్కడ వర్ణిస్తే పూర్వ రామాయణం యెందుకు ఇంక? అని అన్నాడు శిష్యుడు.

శిష్యా! ఆశ్రమ ధర్మాలన్నీ చక్కగా ఆచరిస్తే కాని చిత్తశుద్ధి కలగదని అపుడు కాని బ్రహ్మ విద్యయందు అధికారం రాదనీ, చెప్పాడు వాల్మీకి పూర్వ రామాయణంలో. ఒక వేళ ఎవడైనా యజ్ఞ యాగాలు చేయటానికి తగిన చదువు లేకపోతుంది. వయస్సు మీరి తుంది వాడి గతి ఏమిటి? వాడికి చిత్తశుద్ధి ఎలా కలగాలి. అని సందేహం కలుగుతుంది. కాబట్టి అలాంటివాళ్లు తీర్థయాత్రలచే చిత్తశుద్ధి పొందవచ్చు అని ఇక్కడ చెప్పాడు వాల్మీకి. తీర్థాలంటే జలమయమైన యజ్ఞాలు భూలోకంలో. "ఏతేషామ

మ్మయా యజ్ఞాస్థీర్థ రూపేణ నిర్మితా॥" అని ప్రమాణం ఉంది. ఈ విషయాన్ని సూచించడానికే గాముణ్ణి పెద్ద వయస్సు కలవాణ్ణిగా చేయాలా వాల్మీకి. చిన్నవాణ్ణిగానే చిత్రించి అతనికి ఆత్మ జిజ్ఞాసను వర్ణించాడు.

మరీ ఆత్మజిజ్ఞాసకు ఐహిక సుఖవాంఛ అడ్డు. ఆ సుఖాన్ని అనుభవించకపోతే ఆవాంఛ తీరనప్పుడు దాన్ని అనుభవించి అయినా ఆవాంఛ తీర్చుకోవాలి. అవల ప్రీతి బంధకం తొలగు తుంది. శ్రవణమననాదులలో మనస్సు స్థిరంగా ఉంటుంది. ఈ విశేషం తెలుపుట కొరకే రామునికీ సృగయా గ్గన ఇక్కడ చిత్రించాడు వాల్మీకి.

## ౪ దివస వ్యవహారము

రాముడు అయోధ్య చేరగానే పురవాసులు దోసిళ్లతో పూలవర్షం కురిపించారు. రాముడు తలిదండ్రులకు నమస్కరించాడు. పెద్దలకు మ్రొక్కినాడు. వారి ఆదరాన్ని పొందినాడు. ఆమందానందంలో మునిగాడు. దశరథునకు రామునకు ఎనిమిది రోజులు ఇంట్లో సుఖంగా ఇష్టాగోష్ఠి జరిగింది. అందులో జనులు పాల్గొన్నారు. ఆనందించారు. ఇలా సుఖంగా కాలం గడుస్తూఉంది. రాముడు ప్రతి రోజూ ఉదయాన లేచి స్నానసంధ్యలు తీర్చుకుని మధ్యాహ్నం వరకు తండ్రిగారి కొలువు కూటంలో పాల్గొనేవాడు. సాయంకాలం తండ్రిగారి అనుమతిపొంది అడవికివెళ్లి క్రూరమృగాలతో వేటాడి రాత్రికి ఇల్లు చేరేవాడు. బంధు మిత్రులతో భుజించి సుఖంగా రాత్రులు గడుపుతూ ఉండేవాడు.

## ౫ శరీర కార్శ్యము

రామునకు పన్నెండేళ్లునిండానిండాయి. లక్ష్మణుడూ, శత్రుఘ్నుడూ రాముని అడుగుజాడలో ఉన్నారు. భరతుడు మేనమామ ఇంటికి వెళ్లాడు. తండ్రి పిల్లల వివాహాన్నిగురించి మంత్రులతో ఆలోచిస్తున్నాడు. ఈ పరిస్థితిలో శ్రీరాముడు శరత్కాలంలో నదీవలె క్రమక్రమంగా చిక్కిపోవుచున్నాడు. ముఖం తెల్లపడింది. పద్మాసనం వేసి కూర్చొని చెంపను చెయ్యిపెట్టుకొని విచారిస్తూ ఉండేవాడు. గోడమీద వ్రాత

బొమ్మ అయినాడు రాముడు. పరివారజనం బ్రతిమాలగా బలవంతం మీంద కాలకృత్యాలు తీర్చుకుంటూ ఉండేవాడు. అన్నగారి పరిస్థితిచూచి తమ్ములుకూడా కృశించారు. కుమాళ్ల పరిస్థితిచూచి తలిదండ్రులుకూడా దిగులు చెందారు. దశరథుడు శ్రీరాముని ఈ దిగులుకు కారణం ఏమిటని అడిగాడు. ఎన్నిసారలు అడిగినా శ్రీరాముడు బదులు చెప్పలేదు. దశరథుడు వసిష్ఠునితో ఆలోచించాడు. వసిష్ఠుడు యోచించి కారణాన్ని గుర్తించాడు. దశరథునితో ఇలా అన్నాడు. దశరథా? "మంచివాళ్లకు కొద్దికారణాన కోపం కాని సంతోషం కాని రాదు" సృష్టియో, సంహారమో, తటస్థించందే మహాభూతాలు వికారాన్ని చెందవు. కాబట్టి రాముని దిగులుకు కారణం ఉంది. అన్నాడు వసిష్ఠుడు.

## ౬ విశ్వామిత్రాగమనం

ఆయనగారి మాటవిని దశరథుడు దిగులుపడ్డాడు. పట్టమహిషులు దిగులుపడ్డారు. ప్రజలందరు దీనికి కారణాన్ని ఆలోచిస్తున్నారు. ఇంతలో విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చాడు. మాయావులయిన రాక్షసులు అతని యజ్ఞాలు ధ్వంసం చేశారు. తాను కాపాడుకో లేక పోయాడు. దశరథుని అండ చేరినాడు. విశ్వామిత్రుడు సభామంటపంలోకి వచ్చేసరికి వసిష్ఠ వామదేవాదులందరు లేచారు. దశరథుడు అర్ఘ్యపాద్యాలతో పూజించాడు. అందరూ గౌరవించారు. విశ్వామిత్రునిరాక, దశరథునకు, పద్మాకరాలకు సూర్యోదయం అయింది. అఖండానందం కలిగించింది. దశరథుడు మాటిమాటికి అర్ఘ్యపాద్యాదు లిచ్చాడు విశ్వామిత్రునికి. విశ్వామిత్రుడు దశరథుని కుశలం అడిగాడు. వసిష్ఠుని సత్కరించాడు. ఉచితాసనాలమీద అందరూ కూర్చున్నారు. వసిష్ఠ విశ్వామిత్రులు పరస్పరం మాట్లాడు కున్నారు. దశరథుడు ఎంతో వినయంతో చేతులు జోడించి ముని చెంత చేరాడు. విశ్వామిత్రా? "మీ రాక మాకు అమృత లాభం. ద్వాదశ వర్ష క్షామంలో వర్షం కురిసినట్లు. గుడ్డివాడికి కళ్లు వచ్చినట్లు. గొడ్డురాలికి బిడ్డ కలిగినట్లు. కలలోకన్నది నిజమయినట్లు. తలచింది చేకూరినట్లు. చచ్చినవాడు బ్రతికినట్లు. మీ రాక మాకు బ్రహ్మరాక అమోఘం. వీతరాగులయిన మీరు మావద్దకు రావడం

గొప్ప పుణ్యం. మీరు పరమపూజ్యులు. మీరు రాజర్షులై బ్రహ్మర్షులు కూడా అయినారు. నేను పవిత్రమయ్యాను. నా జన్మసఫలం. చంద్రుణ్ణి చూస్తే సముద్రం పొంగినట్లు నాకు ఆనందం పొంగిపోతూ ఉంది. మీకు నేనేమి చెయ్యాలో తెలియడం లేదు. దానిని నేను చేసినట్లే, అందులో మీకు సందేహం అక్కరలేదు. మీకు నావల్ల కావలసిన కార్యం నేను నెరవేర్చినట్లే మీరు భావించండి" అన్నాడు దశరథుడు. విశ్వామిత్రుడు దశరథుని మాటకు చాలా సంతోషించాడు.

## 8 విశ్వామిత్ర వాక్యము

దశరథా? గొప్ప కులములో పుట్టి వసిష్ఠుని ఆజ్ఞలో నున్న నీకు ఈ ప్రతిజ్ఞ తగును. నా మనస్సులోని మాట విను దానిని కార్య రూపంలో నెరవేర్చు. ధర్మాన్ని కాపాడుకో నేను యజ్ఞం చేయదలచి నాను. అందులో దేవతలని పూజించ దలచినపుడంతా రాక్షసులు తయారగుచున్నారు. మాంసాన్ని రక్తాన్ని వర్షంగా కురిపిస్తున్నారు. యాగాలను ధ్వసం చేస్తున్నారు. ఎన్నిసారులో మొదలుపెట్టినాను, అన్ని సారులు చెరిచినారు. నాకు విసుకుపుట్టి లేచివచ్చాను. నేను యాగదీక్షలో ఉన్నాను. ఇపుడు రాక్షసులను శపించుట వీలులేదు. దీక్షా సమయంలో కోపం కూడదు, కోపించినా అప్పుడు అది ఫలించదు. దీక్షా నియమం అంత గట్టిది. కాబట్టి నీవు నా యాగమును కాపాడాలి, నీవు శరణార్థిని కాపాడ యోగ్యుడవు. నీకు పులిపిల్లవంటి పిల్లవాడు మహాపరాక్రమ శాలి రాముడు కలడు. అతడు రాక్షసులను సంహరించగలడు. నేను కూడా రాముడికి అస్త్రవిద్యను ఉపదేశిస్తాను. అతనికి మితిలేని శ్రేయస్సు కలుగుతుంది. లోక పూజ్యుడవుతాడు. శ్రీరాముని ముందట ఖరదూషణాదులు నిలవలేరు. నీవు పుత్రస్నేహాన్ని పాటించవద్దు. నీ పిల్ల వాని పరాక్రమం నేనెరుగుదును. వసిష్ఠుడెరుగును. నీ ప్రతిజ్ఞ నెర వేర్చుము. రాముని పంపుము. ఇంక పదిరోజులున్నది నా యజ్ఞకాలం ఇందుకు నీ మంత్రులు వసిష్ఠుడూ సమ్మతిస్తారు. కాలం దాటనీయవద్దు సకాలంలో చేసిన సహాయం కొద్దిదయినా ఎక్కువ ఉపకారం చేస్తుంది సమయం మించిన తరువాత ఎంత ఉపకారం చేసినా వ్యర్థమవుతుంది అని అన్నాడు విశ్వామిత్రుడు.

# ౮ దశరథ వాక్యము

దశరథుడు ముని మాట విన్నాడు. యుక్తాయుక్తంగా జవాబు చెప్పాలి అని ఆలోచిస్తున్నాడు. క్షణకాలం నిశ్చేష్టుడయ్యాడు. తుదకు దైన్యంతో ఇలా అన్నాడు. విశ్వామిత్రా? పదునారు సంవత్సరాలు కూడా నిండని శ్రీరాముడు రాక్షసులతో యుద్ధంమాడలేడు. నాకు ఒక అక్షౌహిణీ సేన ఉన్నది. మంత్రులూ భృత్యులూ అతిశూరులు. వీరందరితో నేను వస్తాను. రణరంగంలో నిలచి యుద్ధం చేస్తాను. నీ యాగం కాపాడుతాను. పిల్లవాడికి రాక్షసుల బలబలాలు తెలియవు. ఇంతకు ముందెన్నడూ రణరంగమును చూడలేదు. తోటల్లో దొడ్లల్లో స్నేహితులతో కులాసాగా తిరగడమే రాముడికి అలవాటు. పైగా ఇప్పుడు నా దురదృష్టాన మనస్సులో ఏదో దిగులు పెట్టుకున్నాడు. అన్నం తినడు. ఆటలాడడు. తెల్లగా పాలిపోయాడు. వాణ్ణి చూచి నేను నా భార్యలు కూడా దిగులుపడ్డాము. ఈ పరిస్థితిలో రాముడు నిశాచరులతో యుద్ధం చేయడం అసంభవం. పుత్రస్నేహా నవయావనసంగల స్త్రీ సాంగత్యంకంటె గొప్పది అమృతరసంకంటె అధికం రాజ్యంకంటె సుఖం లోకంలో ధార్మికులు పుత్రుల కొరకు ఘోర తపస్సులుచేస్తారు. ధనాన్ని త్యజిస్తారు సుఖాన్ని కోలుపోతారు. పుత్రుణ్ణి విడువరు ఇది లోకానికి సహజం నేను రాముణ్ణి విడువలేను. తొమ్మిదివేల సంవత్సరములు పుత్ర కామేష్టులు చేస్తే చివరికి అశ్వమేధమనే పుత్రకామేష్టివల్ల ఈ పిల్లలు నలుగురు కలిగారు. అందులో రాముడు ప్రధానుడు. వాణ్ణి విడిచి మిగతా ముగ్గురూ బ్రతుకలేరు. నాకు ప్రేమకూడా వాడియందే ఎక్కువ. వాడు నావద్ద లేకపోతే నేను చచ్చిన వాడిక్రిందనే జమ్మ కాబట్టి రాముణ్ణి నేను పంపజాలను. నీకు రాక్షస సంహారమే ముఖ్యమయితే చతురంగ బలముతో సహా వస్తాను తీసికొని పొమ్ము. అయినా ప్రస్తుతం రాక్షసుల బలం చాలా గొప్పగా ఉంది. విశ్రవసుని కొడుకు రావణుడే నీకు శత్రువయినట్లయితే వాడితో మేము ఎప్పుడము యుద్ధం చేయలేము. పరాక్రమాలూ, సంపదలూ. కాలాన్నిబట్టి మారుతూ ఉంటాయి. ఎప్పుడూ ఒకేచోట ఉండవు. ఇది ఈశ్వర సంకల్పం. నా పుత్రుణ్ణి అనుగ్రహించు. మాబోటి మందభాగ్యులకు మీబోటి వారే

రక్షకులు. ప్రస్తుతం రావణునితో యుద్ధం దేవ దానవ గంధర్వయక్ష పన్నగ కిన్నరు లెవ్వరూ చేయజాలరు. ఇక మనుష్యుల గతి ఏమి? రావణుడు యుద్ధంలో ఇంద్రాదుల పరాక్రమాన్ని కూడా అపహరిస్తాడు. ఈ పిల్ల వాడు వాడితో యుద్ధం ఏమి చేస్తాడు? పైగా ఇది మంచివాళ్లకు కాలంగాదు. శ్రీరాముడు మహా దైన్యంలో ఉన్నాడు. మీ యజ్ఞాన్ని పాడు చేసేది మధు వనే రాక్షసుడి కొడుకు లవణుడా? సుందోపసుందుల కొడుకులు మారీచ సుబాహులా? ఎవరయినా సరే నేను రాముణ్ణి మాత్రం పంపజాలను. మీరు బలాత్కారంగా తీసికొని పోతే ముందు నేను వస్తాను. రాక్షసులు చావడం తరువాత మాట. ఇది సందేహం నాచావు నిజం అన్నాడు దశరథుడు.

గమనిక. గురూ? "షష్టి వర్ష సహస్రాణి జాతస్య మమ కౌశిక". అని దశరథుడు పుట్టిన అరవైవేల సంవత్సరాలకు ఆయునకు సంతానం కలిగినట్లు వర్ణించాడు వాల్మీకి పూర్వ రామాయణంలో. ఇందులో దశరథుడు పుట్టిన తొమ్మిదివేల సంవత్సరాలకు దశరథునకు సంతానం కలిగినట్లు వర్ణించాడు. "నవవర్ష సహస్రాణి జాతస్య మమ కౌశిక" అని. ఇది పరస్పర విరుద్ధం కాదా? ఏది నిజం? ఏది అబద్ధం?

శిష్యా? ఇందులో ఏదీ అబద్ధం కాదు. ఋషులమాటలు అబద్ధా లనుటకు వీలులేదు. మనం వాళ్ల తాత్పర్యం గ్రహించాలి. గ్రహించ లేకపోవడం మంది పొరబాటు. దశరథునకు అరవైవేల సంవత్సరాలకే సంతానం కలిగింది. కాని అందులో కొంతకాలం సంతానంకొరకు వేచి యున్నాడు. ఏబదిఒక్క-వెయ్యి సంవత్సరములు నిరీక్షించాడు. తరువాత తొమ్మిదివేల సంవత్సరాలు పుత్రకామేష్టులు చేశాడు. ఆఖరి పుత్రి కామేష్టి అశ్వమేధం. అందులో ఈ నలుగురు కొడుకులు పుట్టారు. ఈ తొమ్మిదివేల సంవత్సరాలతో కూడా కలుపుకుని దశరథునికి సంతానం కలిగింది అరవైవేల సంవత్సరాలకని అర్థం.

## ౯ వసిష్ఠుడు ఓదార్చుట

దశరథుని మాట విన్నాడు విశ్వామిత్రుడు. విపరీతంగా కోపం వచ్చింది. దశరథా? పని నెరవేరుస్తానని ప్రతిజ్ఞ చేసి ఇట్లందువా? ఇది

రఘువంశ రాజులకు యుక్తమేనా? సింహం లేడివలె సంచరించడం భావ్యమేనా? నీవు ఇలా అనడం చంద్రమండలంనుంచి నిప్పుని కిరణాలు వచ్చినట్లు. నీవు చేయలేకపోతే పోనీ. నేను పోతాను.. ప్రతిజ్ఞా భంగం చేసి నీవే సుఖంగా ఉండు. అని అన్నాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు కోపపడేసరికి భూమి గడగడ వణికింది. దేవతలు కూడా భయపడ్డారు. పరిస్థితిని కనిపెట్టినాడు వసిష్ఠుడు. (విశ్వస్యమిత్రం-దీర్ఘం ఆర్షం) సర్వ ప్రపంచానికి మిత్రుడగు కౌశికుడు దశరథునకు శత్రువు కాబోతున్నాడని గ్రహించాడు.

దశరథునితో ఇలా అన్నాడు. దశరథా? నీవు ఇక్ష్వాకువంశంలో పుట్టినావు. ధర్మమూర్తి వనిపించుకున్నావు. నీకు ధర్మం తప్పడం మంచిది కాదు. ప్రతిజ్ఞ భంగం చేసుకుంటే తానుచేసిన ధర్మం అంతా పోతుం దంటారు పెద్దలు. నీబోటివాళ్ల నడవడులు సామాన్య మానవులు అనుసరిం చేసుకుంటారు. నీవే ప్రతిజ్ఞ భంగపరచితే ఇంక ఎవరూ నెరవేర్చాలను కోరు. రాముడు ధర్మమూర్తి. శూరాగ్రేసరుడు. బుద్ధిసంపన్నుడు. తపోనిష్ఠ. అస్త్రవిద్యా రహస్యము నెరింగినవాడు. వీనిని రాక్షసులు ఏమీ చేయు లేరు. పైగా విశ్వామిత్రుడు సంరక్షకు డున్నాడు. దేవదానవు లెవ్వరూ రాము డంతటి వారు కారు. మరియు కృశాశ్వునకు జయ, సుప్రభ అని యిద్దరు భార్యలు ఉండేవారు. వారిద్దరు చెరియూాభై మంది కొడుకులను కన్నారు. ఆ నూర్గురు అస్త్రవిద్యా కోవిదులు. వారందరూ విశ్వామిత్రు నకు వశంవదులు కృశాశ్వుడు రుద్రదత్తమయిన అస్త్రమును విశ్వామిత్రున కిచ్చినాడు. కాబట్టి విశ్వామిత్రుడు అస్త్రవిద్యకు నిధి. నీవు సంకోచించ వద్దు. రాముని పంపుము. విశ్వామిత్రుడు దగ్గర ఉండగా రానలచుకున్న మృత్యువుకూడా తొలగిపోతుంది. నీకేమి భయం లేదు. తప్పక రాముని పంపమన్నాడు వసిష్ఠుడు.

## ౬ం రాఘవ విషాదము

దశరథుడు సంతోషించినాడు. రామలక్ష్మణులను తీసుకురమ్మని ప్రతిహారిని పంపాడు. ప్రతిహారి రాముని అంతఃపురానికి వెళ్లాడు. మరో

ప్రతీహారిని వెంటపెట్టుకొని దశరథునివద్దకు వచ్చాడు. రాజా ? రాముడు మనోవ్యాకులంతో ఉన్నాడు. క్షణంలో వస్తానంటాడు. మళ్లీ యేమో ఆలోచిస్తాడు. అటూ ఇటూ తిరుగుతాడు. స్థిమితంగా ఎక్కడా వుండడు అని చెప్పాడు ప్రతీహారి. దశరథుడు రాముని వృత్తాంతం తెలుసుకోవా లనుకున్నాడు. వెంటవచ్చిన ప్రతీహారిని అడిగినాడు. ప్రతీహారి ఇలా చెప్పి నాడు. దేవా ? మీ కుమారుని పరిస్థితి చాలా విరుద్ధంగా ఉంది. మాకీ, దిగులు వేస్తూ ఉంది. ఇది తీర్థయాత్ర మొదలుకొని కలిగింది. స్నానం చేయడు, దేవతార్చన చేయడు, అన్నం తినడు, అంతఃపుర స్త్రీలను చూడడు. ఆభరణాలను ప్రేమించడు. ఎంతటి రుచ్యవస్తువులనూ స్వీక రించడు. విలాస వస్తువులనుచూచి దుఃఖిస్తాడు. అతనికి సంపద, ఆపద గృహము గృహ పరికరములు, ఇవేమి పట్టవు. ఒంటరిగా ఉంటాడు. సర్వసంగ పరిత్యాగివలె ఉంది చరిత్ర – సన్యాసనం చేసి కూర్చొని ఏమో ఆలోచిస్తూ ఉంటాడు. అతని కోరిక ఏమిటో ? పని ఏమిటో ? ఆలోచన ఏమిటో అర్థం కాకుండా ఉంది. వైరాగ్యం ప్రతిరోజూ పెరుగుతోంది. శరీరం చిక్కిపోతోంది. ఈయనగారినిచూచి లక్ష్మణ శత్రుఘ్నులు కూడా ఈయనకు నకలైనారు. పైగా ఆభాస సుఖాన్ని ఇచ్చే ఈ భోగాలు మీ కెందుకని బోధిస్తూ స్నేహితులను కూడా చెడగొట్టుతున్నాడు. పదివేల మంది ఆడవాళ్లలో నిలబెట్టినా రాముని మనస్సు చలింపచేయలేము. నీటి ధారలు రాతిని పగలగొట్టలేవు అన్నట్లు ఉంది అతని పరిస్థితి: వేసవిలో ఎంత ఉంటే అంతా యాచకులకిస్తాడు. ఆయనగారి పరిస్థితిచూస్తే మాకే భయంగా ఉంది– ఏమీ ఉపాయం తోచటం లేదు. బ్రాహ్మణోత్తము లనుచూచి నవ్వుతాడు. ప్రపంచం అంతా స్వప్నం అంటాడు. రాజును మూర్ఖుడను కుంటావా ? సుఖపడను కోరుతావా ? మాకేమీ తోచటం లేదు. వర్షం లేకపోతే చాతకపక్షి పరితాపపడుతుంది– మాతా పిత్రు సతీ సుతాదులంటు ఇతడు మండిపడతాడు. దేవా మీ బిడ్డను మీరు బాగు చేసుకోండి. ఎవరినయినా మహానుభావుణ్ణి పిలుచుకోండి. మా చేతకా వటం లేదు. అని అన్నాడు ప్రతీహారి–

## ౧౧ రాముని ఓదార్పు

విశ్వామిత్రుడు ఇది అంతా విన్నాడు. దశరథా ? రామునికిది

వైరాగ్యంవల్ల కలిగిన బోధకాని అజ్ఞానం కాదు. రాముని ఇక్కడికి తీసికొని రమ్ము- పెనుగాలి మేఘాలను పారద్రోలినట్లు నేను అతని మోహాన్ని పటాపంచలు చేస్తాను. అతడు ఉత్తమ స్థితిని పొందుతాడు. నిజమయిన జ్ఞానం కలుగుతుంది. అఖండానందం ప్రాప్తిస్తుంది. మామూలు స్థితిలోకి మళ్ళీ వస్తాడు రాముడు. అని అన్నాడు విశ్వామిత్రుడు. వెంటనే దశరథుడు రాముని కొరకు మనిషిని పంపినాడు. ఇంతలో రాముడే తండ్రివద్దకు రాదలచి బయలుదేరినాడు. తమ్ములూ భృత్యులూ కూడ ఉన్నారు. దూరమున ఉండియే వసిష్ఠ విశ్వామిత్రులనూ దశరథునీ చూచినాడు రాముడు. వసిష్ఠాదులుకూడా రామున్ని చూచినారు. సకలగుణాభి రాముడగు రాముడు, విశ్వామిత్రుడు మాట్లాడు చుండగనే వేగంగా వచ్చి ముందు తండ్రికి మ్రొక్కినాడు. తరువాత వసిష్ఠ విశ్వామిత్రులకు బంధువులకు, బ్రాహ్మణులకు నమస్కరించినాడు. కొంతమందిని చూపుతోనూ, కొందరను మాటతోనూ, మరికొందరను తలవంచియూ, ఆదరించాడు. అందరి ఆశీస్సులు పొందాడు. దశరథుడు రాముని కౌగలించుకొని, శిరసున ముద్దిడుకున్నాడు. తొడమీద కూర్చుండబెట్టుకున్నాడు. నేలమీద గుడ్డ పరచి రాముని కూర్చుండబెట్టినాడు. రామునితో ఇలా అన్నాడు. రామా? నీవు వివేకివి. సర్వమంగళములకు నిలయుడవు. మూఢునివలె బుద్ధి అంతా చెడగొట్టుకున్నావు. పెద్దలూ, గురువులూ చెప్పినట్లు చేస్తే పుణ్యపదవి లభ్యమౌతుంది. అవివేకపడితే అదిరాదు. పైగా ఆపదలు సంభవిస్తాయి. నీవు ఆలోచించుకోమన్నాడు తండ్రి. వసిష్ఠ విశ్వామిత్రులు కూడా ఇలాగే అన్నారు. శ్రీరాముడు ఈ ముగ్గురి మాట విన్నాడు. తన కోరిక నెరవేరినట్లు నిర్ణయించు కున్నాడు. తన పరితాపం అంతా, విశ్వామిత్రునితో వెలిబుచ్చ నారంభించాడు.

## ౧౨ శ్రీరాముని మొదటి పరితాపము

విశ్వామిత్రా? నేను నా తండ్రియింట పుట్టిపెరిగి, విద్యనభ్యసించి, సదాచారపరుడనై మెలగితిని- సకల తీర్థయాత్రలు సేవించితిని. ఇప్పుడు నాకు వైరాగ్యం కలిగింది. నా మనస్సులో ఒక విధమయిన ఆలోచన పుట్టింది. "మానవునకు సంసారములో ఏమి సుఖం?" పుట్టుటకు

చచ్చుట, చచ్చుటకు పుట్టుట, ఇదే కదా వీరిచరిత్ర. చరాచర వస్తుజాల మంతా అస్థిరం కదా ? ప్రక్చందన వనితాది భోగజాల మంతా ఆపదలకు నిలయం కదా ? ఇవన్నీ ఇనుప శలాక (ములుకుల) ల వంటివి. ఎవరికి ఎవరితో ఏలాటి సంబంధం ? అంతా నాదినాది అని మనస్సుతో కల్పించు కోవడము తప్ప తనదేమీ లేదు. ఈ మనసుకూడా విచారిస్తే శూన్యం. ఎండమావులవంటిది. అట్టి మనస్సును నమ్మి సంచరించడం, ఎండమావుల నీటిని నమ్మి తిరుగుమృగాల చందం అవుతుంది. ప్రపంచం అంతా వట్టి మాయ. అడవి మృగాలు మోసపోయి వేటకాని గోతుల్లో పడినట్లు, మానవులు అందరూ మహామోహంలో పడ్డారు. రాజ్యంవల్ల ఫలమేమి? భోగాలవల్ల ఫలమేమి ? అని విచారించగా విచారించగా నాకు సంసారం మీద విరక్తి కలిగింది.

మహాత్మా ? లోకంలో పుట్టేది ఏది ? చచ్చేది ఏది ? జన్మజరా మరణములూ సంపద్విపత్తులూ కొంతకాలం కనిపించడం, కొంతకాలం కనిపించక పోవడం తప్ప వేరే ఏమీ తోచడం లేదు. వెదురుబొంగులు గాలి పోసుకుని ధ్వనిచేసినట్లు మనం ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో బ్రతుకు తున్నాం. ఈ సంసార దుఃఖం ఎలా తొలగుతుందా ? అని నాకు విచా రంగా ఉంది. బంధువులు అందరూ ఏడ్చిపోతారని, నేను పైకి ఏడ్చుట లేదు. ప్రపంచ వస్తువులందలి దోషాలను చూస్తే నాకు మహాదుఃఖము వస్తూ ఉంది. లోకంలో అజ్ఞానమనే రాత్రికాలంలో విషయాలు అనే దొంగలు ప్రవేశించారు. వివేకమనే సొత్తును దొంగిలిస్తున్నారు. ఈ దొంగలను విద్వాంసుడు అనే పోలీసు (రక్షక భటుడు) కాని పట్టుకో లేడు. అని అన్నాడు రాముడు.

## ౧౩ లక్ష్మీ నిరాకరణము

విశ్వామిత్రా ? ఈ ప్రపంచంలో మూఢులందరూ ధనం కంటె గొప్పది లేదనుకుంటున్నారు. ధనం అంటె లక్ష్మి. నిజంగా అదికూడా మోసంచేసేదే. అది మనిషిని చంపుతుంది. కారాగృహంలో పడేస్తుంది. నరకంలోకి తోస్తుంది. దానివల్లకూడా ఏమీ సుఖం లేదు. వర్షాకాలంలో నది అంతులేని మురికినీటి తరంగాలను ప్రవహింప చేస్తుంది. ఈ లక్ష్మి

మూఢులకు అంతులేని మనోరథ పరంపరలను కలగజేస్తుంది. ఈమెకు మనశ్చింతలు కుమార్తెలు. వారంతా దుశ్చేష్టలతో పెరిగినవారే. ఈ లక్ష్మి నిప్పుతొక్కిన కోతిలాగ ఎక్కడా ఒక్కచోట స్థిరంగా ఉండదు. అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది. ఈమె ఖర్చు పెట్టుకున్నా, దొంగ లెత్తుకు పోయినా శ్రీమంతునకు మహామంట కలిగిస్తుంది. మధ్యలో తానయినా నశిస్తుంది. తనను అనుభవించే వాడినయినా చంపుతుంది. గుణదోష విచారం లేకుండా ఎవరి చెంతయినా చేరుతుంది. ఎంత కష్టపడి సంపాదించినా ధార్మికులకు ఉపయోగపడదు. దుర్మార్గులకు ఉపయోగ పడుతుంది. ఇది (ధనము) రాజులయొక్క స్వభావము వంటిది. వారు ఎప్పుడూ దగ్గరవున్న దుర్మార్గులతో సహవాసం చేస్తారు. కాని, ధార్మికు లయిన గుణవంతులతో స్నేహం చేయరు. వారి కది స్వభావం. ధనము చెడుపనులతో పెరుగుతుంది కాని, మంచిపనులచే పెరగదు. యుద్ధము, జూదము, వ్యాపారము ధనము పెరగిటానికి సాధనాలు. యాగదానాదులు పెరుగుటకు సాధనాలుకావు. కాబట్టి ధనంవల్ల దోషాలు పెరుగుతాయి కాని గుణాలుపెరగవు. బంధువులు కాని పరాయివారు కాని డబ్బుచే కనబడినంత వరకే దయాదాక్షిణ్యములు చూపుతారు. ధనం చేకూరిన తరువాత అతి కఠినులవుతారు. ఎంతటి శూరులయినా? ఎంతటి వివేకవంతులయినా? ఎంతటి కృతజ్ఞులయినా, ఎంత మెత్తటి వారయినా? ధనం చేకూరగానే చెడిపోతారు. విశ్వామిత్రా? ధనంవల్ల ఏమీ సుఖంలేదు. ఇంకా దుఃఖాలు పెరుగుతాయి. ధనాన్ని దాచుట విపలతను దాచుకున్నట్లే. జనులు దూషించని శ్రీమంతుడూ, తనను పొగడుకొనని శూరుడూ, సమదృష్టిగల ప్రభువూ, ఈ ముగ్గురూ లోకంలో దుర్లభులు. ధనమనేది దుఃఖాలనే పాములు ఉండటానికి తావైనగుహ. అవివేకమనే ఏనుగులకు వింధ్యాద్రి. మంచి కార్యాలు అనే పద్మాలకు రాత్రి. దుఃఖాలనే కలువలకు వెన్నెల. పరమార్థదృష్టి అనే దీపానికి పెనుగాలి. భయభ్రాంతులనే మేఘాలకు అనుకూల వాయువు. వికల్పాలనే పైరుకు పొలం. వైరాగ్యమనే తీగలకు మంచు. కామాది వికారాలనే గుడ్లగూబలకు రాత్రి. వివేకమనే చంద్రు నకు రాహువు. సౌజన్యమనే పద్మాలకు వెన్నెల. ఇంద్ర ధనుస్సువలె నానా రంగులుగలది. మెరపువలె చంచలమయినది. మోసపుచ్చుటంలో

ఎండమావులకు మించినది. నీటి ప్రవాహంవలె క్షణకాలం కూడా నిల కడగా ఉండదు. కత్తి అంచువలె చల్లగా (నున్నగా) ఉంటుంది. కాని తీక్ష్ణహృదయులను ఆశ్రయించి ఉంటుంది. మెరుపువలె దీని రాకపోకలు క్షణికములు. మెరుపు జలమును ఆశ్రయిస్తుంది. ధనము జడులను ఆశ్ర యిస్తుంది. జడాశ్రయత్వము ఈ రెంటికి సమానము. చాపల్యంలో అడవి ముసలికంటె పయిచేయి దీనిది. ఇట్టి ధనంతో దుఃఖమే కాని సుఖం ఏమీ లేదని నా భావం. పైగా ఈమె (లక్ష్మి) దరిద్రమనే తన సవతి చేపట్టిన వానిని సిగ్గులేక తాను వెళ్లి మళ్లీ అతనినే అతి ఆదరముతో చేరు తుంది. ఇంత పాపిష్ఠిది మరొకటి లేదు. దీనివల్ల సుఖమనేది వట్టి భ్రాంతి.

## ౧౪ జీవితనింద

మహాత్మా ? ఆయుర్దాయము చిగురుటాకు చివరవున్న మంచు నీటి చుక్కవలె అస్థిరమైనది. అసమయంలో శరీరాన్ని విడిచిపోతుంది. అవివేకులకు ఆయుర్దాయ మంతటిది. ఆయాసకారి మరొకటిలేదు. బ్రహ్మ వేత్తలకు మాత్రం ఆయుస్సు సుఖాన్ని ఇస్తుంది. మేము పరిచ్ఛిన్నమయిన శరీరమే ఆత్మ అనే నిర్ణయంలో ఉన్నాము. సంసారం అనే మేఘంలోని మెరుపు ఆయుర్దాయము. దీనివల్ల మాకేమీ సుఖం కనిపించడం లేదు. గాలిని ఒంటికి చుట్టుకోవచ్చు. ఆకాశాన్ని ముక్కలు చేయవచ్చు. తరం గాలను మాలగా కూర్చవచ్చు. కాని ఆయుర్దాయాన్ని మాత్రం నమ్మ రాదు. ఆయుర్దాయము శరత్కాల మేఘము వంటిది. (చిన్నది) చమురు లేని దీపము వంటిది. తరంగంవలె బహుచంచలం. చంద్రబింబం ప్రతి బింబించిన తరంగాన్ని పట్టుకోవచ్చు. మెరపురాశిని గ్రహించవచ్చు. గగన కుసుమాన్ని స్వీకరించవచ్చు. ఆయుస్సును నమ్మరాదు. దురాశా పరులు ఇలాంటి అస్థిరమయిన ఆయుస్సు సుఖమని తలుస్తారు. ఎండ్రకాయ, కంచరగాడిదల, కడుపు (గర్భం) వాని కెంత సుఖమో? ఈదురాశా పరులకు కూడా ఇది అంత సుఖం. కంచరగాడిదకు పొట్టపగిలితే కాని గర్భం పయటపడదు. కాబట్టి తుదకు గర్భం దానికి దుఃఖాంతమయింది. వీళ్లకుకూడ ఇది దుఃఖాంతమే అవుతుంది. జీవితం అనేది సంసారసాగరం లో నురుగువలె అస్థిరం. దానిమీద మాకు రుచిలేదు. పొందతగినదానిని

పొందినవాడి జీవితమే జీవితం. తిరిగి దుఃఖంలేనివాడి జీవితమే జీవితం. అఖండానందాన్ని అనుభవించే వాడి జీవితమే జీవితం. చెట్లు బ్రతుకు తున్నాయి. మృగాలు బ్రతుకు తున్నాయి. పక్షులు బ్రతుకుతున్నాయి. మానవుడూ బ్రతుకుతున్నాడు. ఏమి లాభం. ఎవడి మనస్సు తత్వజ్ఞానం? వాసనాక్షయములచే నశిస్తుందో (సంకల్ప శూన్యం అవుతుందో) వాడి బ్రతుకు బ్రతుకు. తిరిగి పుట్టుక లేనివాళ్ల బ్రతుకే బ్రతుకు. మిగిలిన వారి బ్రతుకు. ముసలి గాడిదల బ్రతుకు వంటిది. దానివల్ల వాటి కేమి ఫలమో. వీరి బ్రతుకువల్ల కూడా వీరికంతే ఫలం. మహాత్మా అవివేకికి శాస్త్రం బరువు. అనురాగికి జ్ఞానం బరువు. శాంతి లేని వాడికి మనస్సు బరువు. అనాత్మ జ్ఞానికి శరీరం బరువు. బరువు మోసేవాడికి బరువు దించు కుంటే సుఖం కలుగుతుంది కాని, శరీరం సుందరంగా ఉంటే సుఖంకలగదు. ఆయుర్దాయం దీర్ఘం అయితే సుఖంరాదు. మనోబుద్ధి అహంకారాలు ఎంత చాకచక్యంగాఉన్నా సుఖంరాదు. అలాగే అజ్ఞానమనే బరువు దించు కుంటేనే ఆత్మకు సుఖంకాని శాస్త్రాలు నెత్తికెత్తుకున్నంత మాత్రాన సుఖం రాదు. ఆయుస్సు ఆపదలకు నిలయము. రోగాలనే పక్షులకు గూడు. అడవి గాలిని పాములు పీల్చినట్లు ఆయుర్దాయాన్ని రోగాలు పీల్చివేస్తాయి. ఎండిపోయిన చెట్టును పురుగులు తొర్ర చేసినట్లు దుఃఖాలు జీవితాన్ని గుల్ల చేస్తాయి. పిల్లిపేరాశతో ఎలుకను మింగటానికి ఎదురుచూచినట్లు మరణం ఆయుస్సును మింగటానికి నిరీక్షిస్తూ ఉంటుంది. ముసలితనంచేత ఆయుస్సు జీర్ణిస్తుంది. యమధర్మరాజుకు వినాశం అనే వాడు స్నేహితుడు. జరా మరణాలు బంధువులు. ఈ పరివారంతో యముడు ఆయుర్దాయాన్ని తీసికుని వెళ్లడానికి కాచుకుని ఉంటాడు. కాబట్టి ప్రపంచంలో ఆయుర్దాయం అంత అస్థిరమైంది, తుచ్ఛమైంది. దుష్టమైంది మరొకటి లేదు-

## ౧౬ అహంకారనింద

మహాత్మా? సర్వదోషాలు అభిమానంవల్ల కలుగుతున్నాయి. అహం, "అహం" అని అనుకోవడమే అభిమానం. దీనినే అహంకారం అంటారు. ఇది అన్ని అనర్థాలకు మూలకారణం, అజ్ఞానంవల్ల పుట్టిపెరుగుతూ ఉంటుంది. ఇంతటి శత్రువు మరొకటిలేదు. అనాది కాలం నుంచీ

జన్మ జరా మరణ నరకాది అనంత దుఃఖాలనుభవిస్తున్నారు మానవులు. సుఖలవములకొరకు పడరాని పాట్లు పడుచున్నారు. రాగద్వేషాలనే దుర్వ్యసనాలకు కట్టుబడుతున్నారు. ఈ అవస్థ అంతా మానవులకు దీని వల్లనే- అహంకారంవల్లనే ఆపదలు. అహంకారంవల్లనే మనోవ్యాధులు- అహంకారంవల్లనే దుష్కృత్యాలు- అహంకారంవల్లనే మనోవికారాలు- ఇది మానవులకు చిరకాలశత్రువు. ఇతడు నాపాలకూడ పడ్డాడు. కనుకనే నేను తిండి తినను. దాహం తాగను. మిగతా భోగాలు చెప్పనే పనిలేదు. సంసారమనే చీకటి రాత్రిలో అహంకారమనే కిరాతుడు మాయ అనే వల పన్నినాడు. జీవులనే మృగాలు వచ్చి పడుతున్నాయి. కొండలనుంచి మోదుగ చెట్లు బయలుదేరినట్లు సంకటమయిన దుఃఖాలన్నీ అహంకారం నుంచి బయలు దేరుతాయి. ఈ అహంకారము శాంతి అనె చంద్రునకు రాహువు. గుణాలనే పద్మాలకు మంచుగడ్డ- సమతాబుద్ధి అనే మేఘాలకు శరత్కాలం. దీన్ని నేను గుర్తించాను. విడాకులిచ్చాను. నేను రాముణ్ణి కాదు. నాకు ఏ కోరిక లేదు. దేనియందూ నా మనస్సు ప్రసరించదు. ఎప్పుడూ శాంతంగా ఉండాలి అనిపిస్తుంది. బుద్ధునివలె నాతోపాటుగానే అందరినీ చూచుకుంటూ ఉంటాను. నేను లోగడ అహంకారంవల్ల ఏమేమిచేసినా అది అంతా సారంలేనిపని. అహంకారం లేకపోవడమే సారం. ఎవడికి అహం అనే భావం ఉంటుందో వాడు ఘోర ఆపదలో ఉన్నట్లే. అదిలేని వాడు సుఖంగా ఉన్నట్లు. కాబట్టి నేను అహంకారాన్ని విడిచి నిర్భయంగా శాంతంగా ఉంటాను. ఈ భోగపుంజం అంతా క్షణ భంగురం. మహాత్మా! అహంకారాన్ని నమ్మినంతవరకు ఆశలు పెరుగుతూ ఉంటాయి. అహంకారం చావగానే తృష్ణ అనేది చస్తుంది. అహంకారమనే వింధ్యపర్వతంమీద మనస్సు అనే మదపుటేనుగు ఉత్సాహంతో గర్జిస్తోంది. దేహమనే కీకారణ్యంలో అహంకారమనే సింహం బలిసి విహరిస్తోంది. దాని విలాసమే ఈ జగత్తంతా- అహంకారమనే నటుడు, ఆశ అనే దారంతో దేహపరంపరలనే ముత్యాల హారాన్ని తయారు చేసుకుని మెళ్లో వేసుకున్నాడు. ఈఅహంకారాన్ని మూలాలో చ్ఛేదంచేస్తే మనోవ్యాధులన్నీ నశిస్తాయి. అహంకారమనే మేఘుడు లేచిపోతే, మనస్సు అనె ఆకాశంలోని మహామోహమనే మంచురాశి అంతు చిక్కదు. నాకు

అహంకారం పూర్తిగా నశించే ఉపాయాన్ని తమరు శెలవిండు— అన్నాడు రాముడు—

గమనిక:— గురూ? ఈ గ్రంథం అద్వైతానికి సంబంధించింది. ఉపనిషత్తుల సిద్ధాంతం అంతా ఇందులో ఉట్టిపడుతుంది. ఉపనిషత్తులు ఈశ్వర తత్త్వాన్ని ప్రతిపాదిస్తాయి. నిరీశ్వరవాదాన్ని ఖండిస్తాయి. అద్వైతం అచ్చగా సేశ్వరతంత్రం. రాముడూ నిరీశ్వరవాది కాడు. పూర్వ రామాయణం వ్రాసిన వాల్మీకీ నిరీశ్వరసిద్ధాంతాన్ని అంగీకరించడు. ఈ స్థితిలో ఇక్కడ "స్వాత్మనీ వజినో యథా" బుద్ధునివలె సర్వభూతములను నావలె చూచుకుంటాను. అని అంటాడేమి రాముడు? బౌద్ధులు నిరీశ్వరవాదులుగా వారి దృష్టాంతం రాముడికి తగునా? బౌద్ధులభావాలు ఇలాంటి గ్రంథాల్లో చొప్పించడం గ్రంథ ప్రామాణ్యానికి భంగంకాదూ? ఎలా ఈ సమన్వయం ?—

శిష్యా? ఇదియా నీ సందేహం. "నింద్యేష్వపి గుణోగ్రాహ్యః" అని అంటారు పెద్దలు. దుర్మార్గుల (చెడ్డవారల) యందుగూడా గుణాలు ఉంటే గ్రహించవచ్చునట. బౌద్ధులు వేదబాహ్యులయినా, నిరీశ్వరవాదులయినా, వారియందు అహింస అనే ఉత్తమ గుణం ఉంది. అందరూ తన లాంటివారే అని అనుకుంటారు బౌద్ధులు. ఎవరికీ ఎలాంటి అపకారం చేయరాదంటారు. ఏ భూతాన్ని హింసించరాదంటారు. ఇది మంచి గుణమే— దీన్ని ఉపనిషత్తులు కూడా సమ్మతిస్తాయి. అద్వైతసిద్ధాంతం కూడా ఈ అంశంలో అనుకూలిస్తుంది. కాబట్టి ఇందులో దోషం లేదు. లేకపోతే నీకింతబాధ ఎందుకు? "స్వాత్మనీ వజితో యథా" అని పాఠం మార్చుకోరాదూ. ఇంద్రియాలన్నిటినీ జయించినవాడు ఆత్మనిష్ఠుడై యున్నట్లు అని అర్థం వస్తుంది. ఇప్పుడు ఏ పేచీ ఉండదుగా—

## ౧౬ మనోనింద

మహాత్మా? పోనీ మనస్సు చిత్తం వీటి పరిస్థితిని ఆలోచిద్దాం అవేమైనా బాగుచేస్తాయేమో జీవుణ్ణి.

మనస్సు కామక్రోధాది దోషాలతో కూడుకుని పెద్దలసేవను త్రోసిరాజని (విడచి) గాలిలో తిరిగే నెమిలికన్ను యొక్క వెంట్రుకలె

(గాలిపటమువలె) ఎప్పుడూ చలిస్తూ ఉంటుంది. బాజారు కుక్క తిరిగి నట్లుగా మహావేగంగా అటూఇటూ తిరుగుతుంది. ఏమైనా ఆ తిరుగుడుకు తగిన ఫలం ఉందా అంటే లేదు. అసలు దీనికి ఏమీ దొరకనే దొరకదు. దొరికినా దానితో తృప్తిపడదు. ఒకవేళ చాలినంతగా దొరికినా ఇంకా అంతకావాలని కోరుతుంది. వెదురుబద్దలతో తయారుచేసిన కావిడిపెట్టె లో నీళ్లు పోస్తే నిండుతుందా? అంతే మనస్సుకూడా ఎప్పుడూ దురాశలనే వలలో చిక్కుకొని సుఖించదు. గుంపునుంచి చెదరిన మృగమువలే ఎప్పుడూ దిక్కులవంక పరుగెత్తుచునే ఉంటుంది. ఉత్తుంగ తరంగాలతో పొంగిపోయే సముద్రమును నిరోధించడం ఎంత కష్టమో, మనస్సును నిరోధించడం కూడా అంతకష్టం. మహాత్మా మనస్సు అనే లేడి, సంసార భోగాలనే గరికపోచలకు అలవాటుపడి, నరకములనే గోతులలో పడటం తెలియక, పరుగెత్తుతుంది. సింహాన్ని పంజరంలో పెట్టడం ఎంత దుర్లభమో? చిత్తాన్ని ఒక చోట నిలపెట్టడం అంతకష్టం. హంస నీటి నుంచి పాలను వేరు చేస్తుంది. అలాగే మనస్సు అవివేకమనే రథాన్ని యెక్కి అన్ని ఉపాధులందూ ఏకరూపంగా ఉన్న ఆత్మను వేరుచేస్తుంది. అపైన సమతాసుఖాన్ని అపహరిస్తుంది. భేదదృష్టివల్ల దుఃఖమున్నూ, సామ్యదృష్టివల్ల సుఖమున్నూ అనుభవసిద్ధం అయి ఉంది. సామ్యదృష్టి పోగానే దుఃఖం తయారవుతుంది. చిత్తం, విషయములయందు అంతు లేకుండా ఆసక్తిని కల్పించుకొని. అందులో నిద్రిస్తుంది. ఒకనాటికీ దానికి మెలకువరాదు. అందువల్ల నాకు చాలా బాధగా ఉంది. మహాత్మా? నేను భోగవాంఛఅనే దారానికే కట్టబడినాను. చిత్తమనేది అగ్నిహోత్రం. దీనికి క్రోధం పొగ. ఆలోచనలు జ్వాలలు. (మంటలు) ఈ అగ్ని నన్ను కాల్చివేస్తోంది. నిప్పుకు ఎండుగడ్డిని తగలపెట్టడం ఎంత సులభమో నేను ఈ చిత్తానికి అంత సులభం అయినాను. ఇది ఒక క్రూరకుక్క దీనికి తృష్ణ అనేది భార్య. ఇవి రెండూ నన్ను శవాన్ని పీక్కు తింటున్నట్లు తింటున్నాయి. నదీ ప్రవాహం ఒడ్డున ఉన్న చెట్లను నదిలోకి పడగొట్టినట్లు ఈ చిత్తం గట్టున ఉన్న నన్ను గోతులోకి లాగుతోంది. గడ్డిపోచను ఛండ మారుతం తీసికొని పోయినట్లు నన్ను ఈచిత్తం దూరంగా తీసుకుని వెళ్లుతూ ఉంది. మధ్యలో ఎక్కడనయినా పడవేయుటానికో, లేక ఇక్కడే కీట

పతంగాది జన్మలతో త్రిప్పటానికో తెలియకున్నది. స్వర్గం ఎక్కించి కూల త్రోస్తుందో, భూలోకంలో క్షుద్ర (నీచ) జన్మలనిచ్చి త్రిప్పుతుందో అంతుపట్టడం లేదు. నేను ఈ సంసార సముద్రం నుండి దాటాలని చూస్తూవున్నాను. సేతువు (కట్ట) చిన్ననదీ ప్రవాహాన్ని అడ్డగించినట్లు ఈ చిత్తం నన్ను అడ్డుపరుస్తూంది. క్రిందినుంచి మీదికి మీదినుంచి క్రిందకు తిరిగే ఏతము కర్రవలె ఈ చిత్తంచేత కట్టుబడి నేను క్రిందికీ మీదికీ తిరుగుతున్నాను. పిల్లవాడిని బెత్తం పుచ్చుకుని బెదరించినట్లు ఇది నన్ను బెదరిస్తోంది. పిల్లవాడికి తెలివితేటలు ముదిరితే ఆ బెదిరింపులు ఎలా సాగవో? అలాగే నాకు వివేకం కలిగితే దీని బెదరింపులు సాగవు. మనస్సు అనే పిశాచం నిప్పుకంటే వేడిది. కొండకంటె బరువైంది. వజ్రంకంటె గట్టిది. యీ చిత్తం ప్రతిపనికి జారబడుతుంది. పక్షిమాంసపు ముక్కలకు ఆశపడ్డట్లే. క్షణంలో మళ్లీ చాతకాక ముడుచుకుంటుంది. పిల్లవాడు ఆటలలో నిలిచినట్లే. ఇది విషయాలకు ఆశపడి, ఎన్నాళ్లనుంచియో అలవాటులో ఉన్న మంచిపనులను క్షణంలో మానుకుంటోంది. ఆటలు మరగిన పిల్లవాడు రెండురోజులలో ఏడాది చదివెడి చదువును మానినట్లే తాతా! యీ మనస్సు మహాసముద్రం. సముద్రం జలస్వభావం గలది. ఇది జడస్వభావం కలది. (మూఢమయినది) సముద్రంలో సుడిగుండాలు ఎక్కువగా ఉంటాయి. మనస్సులో సుడిగుండాలవంటి వృత్తులుంటాయి. సముద్రంలో పెద్ద పెద్ద పాములుంటాయి. ఇందులో కామక్రోధాలనే పాములుంటాయి. యీ సముద్రంలో పడ్డాను నేను ఎక్కడికి పోతానో తెలియదు. సముద్రంలో నీరంతా తాగటం ప్రయత్నిస్తే సాధ్యంకావచ్చు మేరు పర్వతం పెళ్లగించటం సాధ్యంకావచ్చు. నిప్పుమింగటం సాధ్యం కావచ్చు. చిత్తాన్ని నిగ్రహించటం మాత్రం సాధ్యం కాదు. అర్థాలకు (పదార్థాలకు) చిత్తం మూలకారణం. అది ఉంటేనే మూడులోకాలూ ఉంటాయి. అదిపోతే ప్రపంచంఅంతా పోయినట్లే. కొండలనుండి అడవులు తయారవుతాయి. అలాగే చిత్తంనుంచి సుఖదుఃఖాలు బయలుదేరు తాయి. ఆ చిత్తం వివేకంవల్ల సన్నగిలితే యీ సుఖదుఃఖాలన్నీ మెల్లగా జారుకుంటాయి. కాబట్టి మహాత్మా! నేను యీ శరీరమునందే చిత్తం అనే శత్రువును జయించాలనుకుంటున్నాను. మహాను భావులందరు దీన్ని

జయించే మిగతావాటి నన్నిటిని జయించారు. నాకు ఈ రాజ్యలక్ష్మి అంటే అసహ్యాం వేస్తోంది. తెల్లగా ఉండే చంద్రుడికి నల్లగాఉండే మేఘపంక్తి ఇష్టమవుతుందా ?—

## ౧౭ తృష్ణానింద

ఇది ఇట్లా ఉండనియ్యండి. ఇంక తృష్ణయొక్క చరిత్రచూతాం. ఇది చీకటి రాత్రి వంటిది. చీకటి మంచి వాళ్లు కళ్లు కప్పి ఆకాశంలో గుడ్లగూబలను బయలుదేర తీస్తుంది. ఇది కూడా ఆత్మ తత్వాన్ని కాని వివేకాన్ని కాని కప్పివేసి రాగద్వేషాలను లేపుతుంది. బురదలోని తడిసి మెత్తతనాన్ని సూర్యరశ్మి లాగివేసినట్లు అంతఃకరణంలోని దయాదాక్షిణ్యాదులను రూపుమాపుతుంది ఇది. నా చిత్తమనే అడవిలో ఇది ఒక పిశాచంలాగ తయారైంది. దీనా లాపాలతో పెరుగుతుంది. వెండిబంగారాలను చూస్తే కళకళ లాడుతుంది. నా శరీరం అనే కొండమీద ఈ ఆశ అనేది, పెద్దతరంగాలతో నదిలాగ తయారైంది. నేను కోరే మంచి మంచి గుణ సంపదను చిట్టెలుకలాగ కొట్టివేస్తుంది. నేను నీటిలో రాలిన ఎండాకువలె, గాలిలోని ఎండుగడ్డి పోచవలె ఆకాశంలోని శరత్కాల మేఘంవలె ఈ వలలోపడి నేను అసలు తావును చేరలేకపోతున్నాను. ఇది నన్ను భగ భగ మంట పెడుతూ ఉంది. అమృతంతో స్నానం చేసినా ఈ మంటలు చల్లారుతాయని నాకు తోచదు. దిక్కులన్నీ త్రిప్పుతుంది. ఏ తాంబానకు కట్టిన తాడువలె నన్ను ఇది క్రిందికీ (నరకానికి) మీదికీ (స్వర్గానికి) త్రిప్పుతోంది. ముక్కుకు తాడుపోసి యెద్దును లాగినట్లు నన్ను లాగివేస్తోంది. ఎరుకలది పిట్టలకు వలవేస్తుంది. ఇది పుత్ర మిత్ర కలత్రాదులనే వలను లోకుల మీద వేస్తుంది. ఎంత ధైర్యంతోవున్నా భయపరుస్తోంది. ఎంత చూస్తూవున్నా కళ్లు కప్పుతుంది. ఎంత సంతోషంతో ఉందామనుకున్నా దుఃఖపెటుతుంది. నల్లతాచుపామువలె మెల్లిగా తాకుతుంది తుదకు గట్టి గట్టి తగాదాలు పెటుతుంది. ఇది ఒక రాక్షసి. మహా మోసకత్తె. లేనిపోని దౌర్భాగ్యాలను తెచ్చిపెటుతుంది. తీగలు తెగిన ఓటివీణవలె, నాడీపుంజమైన శరీరంలో ఉండి ఏమీ ఆనందించదు. కొండగుహలోని పిచ్చతీగవలె తెగ పెరుగుతుంది. ముసలి

భోగము దానివలె అన్నిటికీ పరుగెత్తుతుంది. దేనిని వశపరచుకోలేదు. తుదకు ఫలం పొందలేదు. సంసార చక్రంలో లోకాలనే నాట్యశాలలో మహా చిత్ర విచిత్రంగా నాటకం వేస్తుంది, సంసారమనే అడవిలో విమలత లాగ పెరుగుతూవుంది. ముసలి నర్తకివలె పిచ్చిగంతులువేస్తుంది. అవివేక మనే చీకటిలో నాట్యమాడుతుంది. వివేకమనే వెలుతురు వస్తే ముడుచుకుం టుంది. అసాధ్యమైన దుర్గమాలలో కాలు పెటుతుంది. వర్షాకాలపు నదివలె క్షణంలో పొంగిపోతుంది. ఆకలిగొన్న పక్షి చెట్టు చెట్టుకు తిరుగు తుంది. ఇది మనిషి మనిషిని చేరుతుంది. పిచ్చి కోతివలె ఒక్కచోట ఉండదు. ఎప్పుడూ ఏదో ఒక ప్రయత్నం చేస్తూనే ఉంటుంది. అంద గాని పండుకు ఆశపడుతుంది, కడుపునిండినా తనవి తీరదు. క్షణంలో పాతాళానికీ, క్షణంలో ఆకాశానికీ, క్షణంలో దిక్కులకూ హృత్పద్మం లోని తుమ్మెదవలె తిరుగుతుంది. సంసార దోషాలలో ఇది చాలా పెద్దది. అంతఃపురంలో ఉన్నవాణ్ణి తీసుకువెళ్లి అడవిలో పారవేస్తుంది. ఉన్న వివే కాన్ని ఊరేగిస్తుంది. లేని జాడ్యాన్ని (మాఢ్యాన్ని) ప్రసాదిస్తుంది. ప్రపంచంలో జీవులందరినీ తృష్ణ అనే తాటితోటి బంతి కట్టాడు భగ వంతుడు. ఇంద్రధనస్సువలె ఇది మహా చిత్ర విచిత్ర రంగులు కలది. ఇది గుణాలనే పైరులకు పిడుగు. ఆపదలకు బాగా పంటకాలము అగు శరదృతువు. జ్ఞానమనే పద్మాలకు మంచు. చీకట్లకు హేమంతంలోని దీర్ఘరాత్రి, సంసార నాటకానికి నటి. ప్రవృత్తి మార్గమనే గూటిలో పక్షి. మనస్సులనే అడవిలో లేడి, మన్మథ గేయాలకు వీణ. వ్యవహార మార్గానికి సముద్రపు అలలు. మోహం అనే మాతంగమునకు కాలి గొలుసు సృష్టి అనే వటవృక్షానికి మంచి తీగ. దుఃఖాలనే కాలువలకు వెన్నల జరామరణ దుఃఖాలకు రత్నాలతో తయారుచేసిన పెట్టె. ఆధి వ్యాధి విలాసాలకు మదించిన భోగంది. శరీర ప్రయాస తగ్గే రోజువస్తే ఇది నశిస్తుంది. గట్టి చీకటిగల కృష్ణపక్ష రాత్రి రాక్షసుల సంచారం లేకుండటానికి తగ్గిపోయినట్లు తృష్ణ అనే మసూచిక వ్యాధి ఉన్నంతవరకు ఈ మూఢలోకం ఇలా వ్యామోహ పడుతూనే ఉంటుంది. సంసారం విషయాలను స్మరించటం మాసితే కాని ఈ మసూచిక వ్యాధి వదలదు. దీనికి చింతా త్యాగమే మంత్రము. చేప ఎరకు తగల్చింది మాంసమని

ఆశపడినట్లు ఇది కూడా కనిపించింది అంతా తనకు ఆహారం అనుకుం టుంది. సూర్యకిరణాలు యెంత గట్టి పద్మం మొగ్గనైనా పగిలి వికసించే టట్లు చేస్తాయి. రోగ బాధ ఎంతటి ధీరుణ్ణి అయినా అధైర్యపరుస్తుంది. అలాగే స్త్రీ తృష్ణ (స్త్రీవాంఛ) యెంత గంభీరుణ్ణి అయినా తలక్రిందు చేస్తుంది. ఇది వెదురుబొంగువంటిది. వెదురుబొంగు లోపల ఏమీ ఉండదు. దీనిలోనూ అంతే. దానికి కణుపులుంటాయి. దీనికీ మాట మాటికి అభినివేశాలు కణుపుల వంటివి. దానికి ముళ్లు, దీనికి విషయ చింతలు ముళ్లు. వెదురుబొంగులలో ముత్యాలుంటాయి. దీనికి ముత్యాలు మణులు అంటె యిష్టమే, మహానుభావులు ఇలాంటిదాన్ని కూడా వివే కం అనే కత్తితో కోసి వేస్తున్నారు. మహాత్మా! ఇది కత్తి వంచకంటె తీక్షణమైంది. వజ్రాయుధపు మంటలు కూడా ఇలా ఉండవు. కొలిమిలో కాచిన ఇనుము యొక్క జ్వాలలకంటె తీక్ష్ణమైంది. మెరుపుతో సమా నుడైన ధీరుణ్ణి, మహాపరాక్రమశాలిని కూడా ఒక నిముషంలో - తృణం లాగ తయారుచేస్తుంది. పాలసముద్రంలో మాధుర్య శక్తి ఉన్నట్లు ప్రపంచం అంతా ఇది నిండి నిబిడీకృతమయి ఉంది.

## ౧౮ దేహనింద

ఇది ఇలా ఉండ నియ్యండి. "జీవన్భద్రాణి పశ్యతి" అన్నట్లు శరీ రం నల్ల ఏమైనా సుఖం ఉందా అంటే అదీ కనిపించడంలేదు.

దుర్వాసనా భూయిష్ఠమయిన తడి నరాల సమూహం శరీరం. యెప్పటి కప్పుడు మరణాన్ని యెదురు చూస్తూ ఉంటుంది. ఇది కూడా దుఃఖానికి దారితీసేదే. ఇది జడము అయినా చేతనుడయిన ఆత్మయొక్క. చమత్కారాన్ని తనలోకి లాక్కొని, (చిత్తాదాత్మ్యన్ని పొంది) చేతనుని వలె మిడిసిపడుతుంది. తుదకు దీనికి మోక్షంపొందే అధికారం వచ్చిందా అప్పుడు, ఇతర జడ శరీరాలవంటిదీ కాదు. చేతనమూ కాదు. కనుకనే మూఢులు శరీరం జడమా? చేతనమా? అనే సందేహాన్ని తీర్చుకోలేక సంసారంలో మునుగుతున్నారు కాని, పురుషార్థాన్ని పొందలేక పోతు న్నారు. దీనికి ఒక నిముషం ఆనందం, ఒక నిముషం దుఃఖం. ఇంత

నీచమైంది మరొకటిలేదు. ఇది ఒక మహా వృక్షం. చంకలవరకు ఉండే భాగం స్కంధం. భుజాలు కొమ్మలు. వరసగా ఉండే దంతాలు పంక్తులు తీర్చిన పక్షులు. వాటికి ఆధారమైన అడ్డ కొమ్మలు నోటి డిప్పలు. పళ్ళు కింజల్కాలు. నవ్వు పువ్వులు. నేత్రాలు తుమ్మెదలుండే తొర్రలు. తల పెద్ద పండు. చెవ్వలు చెట్టుకొట్టే పక్షులు. చేతులూ కాళ్లూ చిగురు టాకులు బుద్ధి జీవులుకాని జీవేశ్వర్లు కాని వేళ్ళు. జీవులనే బాటసారు లకు నీడ ఈ శరీరము. ఇలాంటిది ఒకడికి నాది ఏమిటి? యింకొకడికి నాది కాకపోవడము ఏమిటి? ఈ చెట్టు మీాద ఒకడికి ప్రేమ ఎందుకు? మరొకడికి ద్వేషం ఎందుకు?

తాతా! యిది ఆయుర్దాయం అనే నదిని కాని, సంసారం అనే సముద్రాన్ని కాని దాటటానికి తెప్ప. దీనిమీాద దాటేవాడు దాటుతూ ఉంటాడు. దాటలేనివాడు మునుగుతూ ఉంటాడు. యిందులో నాది అనే అభిమానం ఏమిటి? యిది ఒక అడవి. దీనిలోని రోమకూపాలు గోతులు. అందులోని వెంట్రుకలు లెక్కలేనన్ని చెట్లు. యిది స్థిరం అని విశ్వాసం ఏమిటి? మాంసము, నరాలు, ఎముకలతో కూడిన ఈ దేహం ఒక ఓటి ఢక్క. యిందులో నుంచి బయటకు వెళ్లే మార్గం చిక్కక నేను పిల్లివలె తన్నుకులటున్నాను. శరీరం అనేది సంసారం అను అడవిలోని చెట్టు, యిందులోని చిత్తం కోతి. ఆలోచనలు పూలగుత్తులు, చిరకాల దుఃఖాలు దీని దొలిచే పురుగులు. తృష్ణ అనే ఆడ పాముకు యిది ఇల్లు. కోపం అనే కాకులకు గూడు. నవ్వు అనేది పువ్వు. పుణ్య పాపాలు ఫలాలు. బాహువులు తీగలు. చేతులు పూలగుత్తులు. ప్రాణవాయు వుచే చలించే అవయవాలన్ని చిగురుటాకులు. యింద్రియాలు పక్షులు. పిక్కలు స్తంభాలు వీటిచే యిది ఎత్తుగా కనిపిస్తుంది యౌవన లావణ్యం అనేది నీడ. కాముకులనే బాటసారులు దీన్ని సేవిస్తారు. నెత్తిమీాద మొలచిన పొడుగాటి వెంట్రుకలు గడ్డి పరకలు. అహంకారం అనే గద్ద లకు యిది గూడు. పొట్ట ఈ చెట్టు యొక్క తొర్ర. వాసనా పుంజం అనే వేళ్లతో పెనగొని పోయి ఛేదించటానికి సాధ్యం కాకుండా ఉంది. ఆయాసమే దీని వైశాల్యం. అలాంటి జువ్వ చెట్టు యిది. దీనివల్ల ఏమి సుఖం?

ఇది అహంకారం అనే గృహస్థుకు యిల్లు. ఇది పడిపోతే ఏమి? స్థిరంగా ఉంటే ఏమి. మహాత్మా? బండి కట్టిన పశువులవలె, వరుసగా ఉన్న యింద్రియాలు యీ కొంపలోని పశువులు. మాటి మాటికి పసు గత్తే తృష్ణా అనేది యజమానురాలు. కామమనే రంగు వేసుకుంది. ఈ శరీరమనే కొంప. ఇది నాకొద్దు. ముడ్డి ఎముక అనే కట్టె రాచుకోవ డంవల్ల అంతటా తొర్రలు పడి, పడిపోకుండా మాత్రం నరాలనే తాళ్లతో కట్టబడింది. అంతటా వ్యాపించిన నరాలు తాళ్లు. నెత్తురు అనేది బురద. ముసలితనం అనే తెల్లసున్నం వేయబడింది. యిందులో చిత్తం అనే భృత్యుడు అనేక చేష్టలతో పడిపోకుండా కాపాడుతున్నాడు దీన్ని. అబద్ధము అజ్ఞానము ఈ రెండూ యీ కొంపకు గట్టి స్తంభాలు. యిది నాకొద్దు. యీ కొంపలో దుఃఖాలు అనే పిల్లవాళ్ళు ఎప్పుడూ ఏడుస్తూ ఉంటారు. సుఖం అనేది నిద్రిస్తూ ఉంటుంది. దురాశలనే చెడు దాసీలకు మాత్రం తీరిక ఉండదు. మలినమయిన ప్రాపంచిక విషయా లనే కుండలు మాత్రం ఈ యింటినిండా ఉంటాయి. వాటిలో అజ్ఞానం అనే ఉప్పుతప్ప మరేమీ ఉండదు. మోకాళ్లు పిక్కలు అనే స్తంభాల మీద నిలిచి ఉంది. బాహువులనే కర్రలచే గట్టిగా కట్టబడింది. దీనికి జ్ఞానేంద్రియాలు కిటికీలు. బుద్ధి ఇంటి యజమానురాలు. మనశ్చింతలు ఆమె కూతుళ్లు. వెంట్రుకలు ఈయింటికప్పు. చెవులు దీనికి శిరోగృహాలు. పొట్టివిగా ఉండే వ్రేళ్ళు, కొయ్యబొమ్మలు. సర్వావయాలు ఈ కొంపకు గోడలు. రోమాలు గోడమీద మొలచే పచ్చగరికపోచలు. పొట్ట ఈ కొంపలోని గొయ్యి. గోళ్ళు అనే సాలెపురుగులకు తావు. ఇది ఆకలి అనే ఆడకుక్కయొక్క ఏడుపు ఎప్పుడూ ఈ కొంపలో తప్పదు. భోరున ప్రాణ వాయువుయొక్క ధ్వని నిరంతరం ఉంటుంది. ఈ కొంపకు నోరు అనేది ద్వారం. ఆద్వారంవద్ద నాలుక అనే ఆడకోతి కాచుకుంటుంది. దంతాలు తెల్లగా ఎముక ముక్కల్లాగ ఉంటాయి. చర్మం అనే తెల్లసున్నంచే నునుపుగా ఉంటుంది. మనస్సు అనే పురాతనపు ఎలుక వేసిన కన్నాలు, ఈ కొంపనిండా ఉన్నాయి. చిరునవ్వు అనే వెలుగుచే ఈ కొంప కొంచెం ప్రకాశిస్తూ ఉంటుంది. క్షణకాలం ఆనందపడుతుంది. క్షణంలో అజ్ఞా నాంధకారాలతో నిండిపోతుంది. అన్ని రోగాలకు స్థానం. ముడతలుపడి

శిథిలమయిన చర్మకు నగరం. ఆధివ్యాధులకు మహారణ్యం. మహాత్మా ఇలాంటి శరీరం అనే కొంప నాకక్కర లేదు.

ఇది పెద్ద అడవి, కడుపు పెద్ద తొర్ర (కోటరము) ఇంద్రియాలు భల్లూకాలు. ఎప్పుడూ చీకటితో నిండి ఉంటుంది. బురదలో మునిగిన ఏనుగును చిన్నపిల్లవాడు లేవదీయలేనట్లు, ఈ దేహాన్ని నేను ధరించలేకుంటున్నాను. ఈ సంపదా, యీ రాజ్యమూ, యీ శరీరమూ, యీ మనోరథాలూ, వీటితో ఏమి ప్రయోజనం? కొద్దికాలంలోనే యమధర్మరాజు దీనినంతా నశింపచేయటానికి సిద్ధంగా ఉన్నాడు. కాని దీనినిండా లోపలా వెలుపలా రక్తమూ మాంసమున్నూ కదా? ఇది నశించక తప్పదు కదా! ఇందులో రమ్యత ఏమి ఉంది? చచ్చిపొయ్యేటప్పుడు జీవుని వెంట వెళ్ళని యీ శరీరం వట్టి కృతఘ్నమయింది గదా? జీవుడివల్ల ఉపకారం పొందింది. ప్రత్యుపకారం ఏమీ చేయలేకపోగా, పొందిన ఉపకారాన్ని కూడా మరచింది. ఎందుకు దీని మీద మనకు ఆదరం? ఇది మదించిన ఏనుగుయొక్క చెవ్వు చివరవలె చంచలమయింది. ఆకుచివర వ్రేళ్లాడే నీటిచుక్కవలె భంగురమయింది. ఇది నన్ను విడువకముందే నేను దీన్ని విడుస్తాను. ఉన్న అన్నిరోజులూ, దిట్టంగా తిని, తాగి, చివరకు లేత చిగురుటాకు వాడినట్టు వాడిపోయి చచ్చి ఊరుకుంటుంది. పామరులు మాటిమాటికి అనుభవించిన సుఖదుఃఖాలను దీనితో మళ్లీ అనుభవిస్తూ ఉంటారు. ఇందులో ఏ జన్మకీ క్రొత్త లేదు. అయినా వీళ్లకు సిగ్గు లేదు. ఏమో వింతగా మురుసుకుంటారు. ఎన్నాళ్ళు ప్రభుత్వం ఏలినా, ఎన్నాళ్ళు ఐశ్వర్యాన్ని అనుభవించినా, ఇది వృద్ధిపొందదు. స్థిరంగానూ ఉండదు. ఎందుకు దీన్ని మనం పోషించటం? భాగ్యవంతుడికీ, దరిద్రుడికీ, ముసలితనం వచ్చిన వయస్సులో ముసలితనమూ, మరణకాలంలో మరణమూ, సమానాలే. ఇందులో తేడా ఏమీ కనిపించదు. సంసారం అనే సముద్రము యొక్క కడుపులో, తృష్ణ అనే రంధ్రంలో, కాయమనే తాబేలు, బాగుపడాలనే కోరిక లేక నిద్రిస్తోంది. ఈ దేహాలు అనే కట్టెలన్నీ తగలబెట్టటానికి తప్ప మరెందుకూ పనికిరావు. ఇవి సంసార సముద్రంలో కొట్టుకొనిపోతూ ఉంటాయి. ఈకట్టెలలోనే కొన్ని కట్టెలను నరులని అంటారు మూఢులు. పొడవైన దుర్బుద్ధి అనే ధారాలతో చుట్టు

కొని. క్రిందపడుటయే (అధోగతియే) పర్యవసానంగాగల యీ కాయ లతతో వివేకికి ఏమీ ఫలంలేదు. విషయాలు అనే బురదనీటిమడుగులలో మునిగి వెంటనే పెద్దదయి శీఘ్రంగా వెళ్లిపోతుంది. ఈ శరీరమనే కప్ప ఎక్కడికి పోతుందో ఎవ్వడికి తెలియదు. శరీరాలనే ఝంఝామారుత ములు, నీరసమయిన పనులు ప్రారంభిస్తాయి. రాజసమార్గంతో లేచి పోతాయి. గాలులు దుమ్ముతో బయలుదేరుతాయి. శరీరాలు రజోగుణ కార్యాలతో బయలుదేరుతాయి. గాలియొక్క రాకపోకలు తెలుస్తాయి. మనసుయొక్క రాకపోకలు తెలుస్తాయి. ఈ శరీరంయొక్క రాకపోకలు తెలియవు. శరీరములయందూ, ప్రపంచము నందునూ ఎవరికి ఆదరం ఉంటుందో, వాళ్ళు మోహం అనే కల్లుతాగి మదించినవాళ్ల క్రింద జమ. ఛీ! వాళ్లముఖం చూడకూడదు. నాకు దేహంతోనూ దేహానికి నాతోనూ సంబంధంలేదని మనశ్శాంతితో నుండువారే మానవోత్తములు. మానావ మానములతో నిండియుండి. విషయప్రాప్తితో ఆనందించే దోషదృష్టులు మానవుని మృత్యువశం చేస్తాయి. శరీరం అనే గోతిలో దాక్కొనియున్న అహంకారం అనే పిశాచిచే మనము మోసపోయినాము. యీ కనిపించే ప్రపంచంలో ఏదీనిజంలేదు. ఈతగలబడ్డ శరీరంకూడా ఇందులోదే కాబట్టి ఇదికూడా అంతే, యీ దిక్కుమాలిన దానిచే వంచించబడినాము. శరీర మనే చిగురుటాకు ఎప్పుడో అప్రియత్నంగా రాలిపోతుంది. ఇది సముద్రం లో బుడగవలె ఎలాగో నశించేదే. ఇలాంటి దానిని ఆధారంగా చేసుకొని సంసార కృత్యాలు వ్యర్థంగా స్ఫురిస్తున్నాయి. మిథ్యాభూతమయిన అజ్ఞా నంతో తయారయి, స్వప్ననగరంతో సమానమయిన యీ శరీరం మీద నాకు విశ్వాసం లేదు. మెఱపులమీద, శరత్కాల మేఘాలమీద, గంధర్వ నగరాలమీద, ఎవరికి నమ్మకం ఉంటుందో వార్లకు శరీరంమీద కూడా నమ్మకం ఉంటే ఉండవచ్చు. కాబట్టి నశించటానికి అనుకూలమయిన ప్రబలదోషాలుగల యీ శరీరాన్ని గడ్డిపరకవలె త్రోసిపుచ్చి నేను సుఖంగా ఉంటాను.

## ౧౫ బాల్యనింద

ఈ మానవ శరీరానికి బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములని నాలుగవస్థలు. యీనాలుగు అవస్థలలోను ఏవో కార్యభారాలూ, వాటి

మీద అభినివేశాలూ తప్పవు. చంచలమయిన సంసారసాగరంలో మనుష్య జన్మ మెత్తినవూ అందులో బాల్యాన్ని గడపటం మహాకష్టం. ఏపనిచేయ లేక పోవడము, ఎప్పుడూ ఏవో జబ్బులు, అన్ని ఆహార వస్తువులూ తినాలని కోరిక, బయటికి యేమాట చెప్ప లేక పోవడం. తెలివి తక్కువ, అన్ని ఆటలమీద ఆశ, దేనిమీద బుద్ధినిలకడగా లేక పోవడం. చేతకాక పోతే బిక్కముఖంతో ఏడవటం. ఇదంతా బాల్యంలో తప్పక ఉంటుంది. ఇందులో రోషం ఎక్కువ, రోదనం అధికం. దైన్యం మెండు. ఇలాంటి బాల్యం ఏనుగులకు ఆ లానం (కట్టుకొయ్య) వంటిది. చిన్నతనంలో మనశ్చింతలు బాధించినట్లు మరణావస్థలో కాని, ముసలితనంలో కాని, రోగాలు వచ్చినపుడుగాని, సంకటాలలోగాని, యౌవనంలోగాని, అంతగా బాధించవు. బాల్యంలో చేసే పనులన్నీ అతిమూఢంగా ఉంటాయి. పశు పక్ష్యాదులవంటివే అప్పటి కార్యాలు. అందరూ చివాట్లు పెట్టేవారే. అందరూ తిట్టేవారే, బెదిరించేవారే. మహాచపలావస్థ అది. దానికంటే మరణం మేలు. బాల్యంలో అజ్ఞానం ఎదురుగా ప్రతిబింబించి ఉన్న బొమ్మవలె సిద్ధంగా తయారై ఉంటుంది. కాబట్టి మనస్సు నిండా అన్నీ సంకల్పాలే. ఆ సంకల్పాలు నెరవేరకపోతే ఏమో కొంప మునిగినట్లుగా దుఃఖం. ఇలాంటి బాల్యం ఎవడికి సుఖం ?

అప్పుడు అజ్ఞానంచేత నీరంటే భయం, నిప్పంటే భయం, గాలంటే భయం, ఇంతటి భయం ఎవడికి ఏ ఆపదలో ఉంటుంది? దుశ్చేష్టలమీద, దుర్బుద్ధులమీద బాల్యంలో మహావ్యామోహం ఉంటుంది. అవే మంచి వనుకొని మొండిపట్టు పడతాడు బాలుడు. పనికిరాని పనులను కూడా మహాకుతూహలంతో ప్రారంభిస్తాడు. తుదకు అందరి చేత తన్నులు తింటాడు. ఇది వీడికేమి సుఖం? ఎప్పుడూ మనశ్శాంతి ఉండదు. ఉన్న దోషాలన్నీ బాల్యంలోనే ఉంటాయి. ఉన్నదురాచారాలన్నీ ఇందులోనే వుంటాయి. మనోవ్యాధులన్నీ ఇందులోనే తటస్థిస్తాయి. చెడుగోతులలో గుడ్లగూబలు ఎగర లేక పడియున్నట్లే. బాల్యం మంచిదనుకొనే వాళ్లను చూస్తే నాకు అసహ్యం వేస్తుంది. ఛీ ఆమూర్ఖుల ముఖం చూడకూడదు. ఏదశలో మనస్సు అన్ని పనులయందు సందేహంతో ఊగులాడుతూ ఉంటుందో, అమంగళమయిన ఆదశలో సుఖం ఏమిటి? అన్ని భూతాలకీ

అన్ని అవస్థలకంటే బాల్యావస్థలో మనశ్చాంచల్యము పదిరెట్లు ఎక్కువ. మనస్సే స్వతస్సిద్ధంగా చంచలం. చంచలమయిన వాటిలో మొనగాడు బాల్యం. ఈ రెండూ కలిస్తే వాటివల్ల అనర్థాలనుంచి కాపాడే దేవుడెవడు? బాల్యావస్థలో కూడుకున్న మనస్సునుంచి ఆడవాళ్లకండ్లు చాంచల్యాన్ని నేర్చుకున్నాయి. మెరుపుల సమూహం నేర్చుకుంది. అగ్నిజ్వాలల గుంపు నేర్చుకుంది. తరంగాలు, నేర్చుకున్నాయి. మనస్సు, బాల్యం యీ రెండూ చపలస్వభావంలో అన్నదమ్ములు. ధనికుణ్ణి మానవులు ఆశ్రయించినట్లు, దుర్వ్యసనాలన్నీ, రోషాలన్నీ, వ్యాధులన్నీ, ఆధులన్నీ బాల్యాన్ని ఆశ్రయిస్తాయి. శైశవంలో ఉన్న పిల్లవాడు ప్రతిరోజూ తనకిష్టమయిన క్రొత్త క్రొత్త వస్తువును పొందక పొయ్యేవాడా? చెప్పనలవికాని చిత్తవికారంతో మూర్ఛపోతాడు. బాల్యంలో వున్నవాడు కొద్దిదానితో స్వాధీనం అవుతాడు. కొద్దిలో మళ్లీ వికారాన్ని పొందుతాడు. కుక్కవలె ఎప్పుడూ (అమేధ్యమునే) పనికిరానివస్తువునే ప్రేమిస్తాడు. బాలునకు ఎప్పుడూ ముఖాన కన్నీళ్లుంటాయి. ఒళ్లు అంతా బురదకొట్టుకొని వుంటాడు. చిత్తం మూఢం. (మనస్సు మొద్దు) ఎండకు ఎండి వర్షానికి తడిసిన స్థలాలకీ వీడికీ ఏమీ తేడా ఉండదు. ప్రతిదానినుంచీ భయపడుట, చూచినదానినల్లా తినాలనటం, లభ్యమయ్యేదాన్ని లభ్యంకానిదాన్నీ కూడా కోరటం, బుద్ధి స్థిరంగా ఉండకపోవటం, ఇది బాల్యముయొక్క స్వరూపం. తాను సంకల్పించినవాటినీ, కోరినవాటినీ పొందలేకపోతే మహా దుఃఖిస్తాడు బాలుడు. దుష్టపనులవలన పుట్టి, వంచనోపాయాలతో పెరిగిన దుఃఖాలు బాలుడికి మితి ఉండవు. ఎండాకాలంలో గ్రీష్మంచే అడవికాలినట్లు, మనోరథాలతో బాలుడి మనస్సు ఎప్పుడూ తగలపడుడూ ఉంటుంది. స్వేచ్ఛగా తిరిగే మదపుటేనుగును, ఆలానికి (కట్టుకొయ్యకు) కట్టేసినట్లు, బాలుణ్ణి బడిలోకి పంపితిమా? ఏమేమో బాధపడతాడు. లోకాన్ని మింగచూస్తాడు. చంద్రుణ్ణి పట్టుకొన తలుస్తాడు. ఇంతటి మౌర్ఖ్యంతో వీడు పొందే సుఖం ఏమిటి? లోపల అభివ్యక్తముకాని చైతన్యముండి, పైకి శీతాతపాలను నివారించుకోలేని బాలుడికి, చెట్టుకూ తేడా ఏమిటి? ఆకలయినపుడు పక్షులు రెక్కలతో ఎగిరి ఎక్కడికయినా పోయి ఆహారం తెచ్చుకుంటాయి. బాలుడికి ఆకలయితే చేతులతో నెత్తికొట్టుకుంటూ, తల్లిచుట్టూ తిరిగి

ఏడ్చి పెట్టించుకుంటాడు. శైశవంలో గురువునుచూస్తే భయం. తండ్రివల్ల భయం. తల్లివల్ల భయం. జనులవల్ల భయం. తనకంటె పెద్దపిల్లలను చూస్తే భయం. కాబట్టి బాల్యం భయాలకి నిలయం. దీనివల్ల ఏమీ సుఖం లేదు.

గమనిక:- గురూ " తద్యథా మహారాజోవా మహాబ్రాహ్మణోవా మహాకుమారోవా అతిఘ్నీ మానందస్య గత్వా శయీత " అను శ్రుతి, బాలుడు, రాజుఅయినా, బ్రాహ్మణుడయినా, గొప్పవారి పిల్లవాడయినా, బాల్యంలో అపరిమితానందంలో ఉంటాడని చెపుతుండగా, శ్రీరాముడు బాల్యమంత దుఃఖాకరం మరొకటి లేదని వర్ణిస్తాడేమి ?

శిష్యా ? ఇందు దోషంలేదు. బాల్యంలో రాగాది విక్షేపాలు పుట్టకపోతే స్వాభావికమయిన ఆత్మసుఖాన్ని పొందటానికి వీలుఉంటుంది. ఈ ఊహతో బాల్యం రమ్యమయినదని చెప్పదలచింది శ్రుతి. ఇంతే కాని, బాల్యంలో చిత్తవిక్షేపాలు పుట్టవనికాదు. పుట్టినా ఇదే రమ్యం అనీ కాదు.

## ౨౦ యౌవన నింద

బాల్యంలోని అనర్థాలనుంచి గట్టెక్కి చల్లగా భోగవాంఛతో యౌవనాన్ని అందుకుంటాడు ఏమో సుఖపడాలని మూర్ఖుడు. అందులో అంతులేనిపనులలో మునిగిపోతాడు. రాగద్వేషాది చిత్తవృత్తులకు లోనై దుఃఖపరంపరలు అనుభవిస్తాడు. అపుడు చిత్తం అనే గుహలో నానా పిచ్చి చేష్టలూ చేసే కామం అనే పిశాచం దాగి ఉంటుంది. దానికి లొంగి పోతాడు మానవుడు. కామ పరతంత్రమయిన మనస్సు స్త్రీలకు స్వేచ్ఛా విహారాలను ప్రసాదించినట్లు, వీడికి అతిచంచలమయిన మనశ్చింతలకు స్వారాజ్యాన్ని ఇస్తుంది. చేతులో సిద్ధాంజనం వేస్తే భూమిలో నిధులు చూడటానికి కండ్లకేమీ అడ్డు ఉండదు. యౌవనం వస్తే మనస్సు కేమీ అడ్డు ఉండదు. తుదకీ చిత్తవికారాలే వీడిని వీడి యౌవనమునూ నాశనం చేస్తాయి. యౌవ్వనం అనేది మహానరకానికి బీజం దీనివల్ల బాగుపడ్డ వాడు లేడు. ఇంతగా మరో దానివల్ల చెడిపోయినవాడున్నూ లేడు.

శృంగారాది రసాలతో నిండి, చిత్రవిచిత్రములయిన వృత్తాంతాలకు ఆలవాలమయిన యౌవనమనే అడవిని దాటినవాడు మొనగాడు. ఇది భోగ సమయంలో మధురంగాను రుచిగాను ఉంటుంది. అన్ని దోషాలకు శిరోమణి, కల్లురొయొక్క విలాసాలు ఎలాంటివో దీని విలాసాలు అలాంటివి. దీని చరిత్ర అంతా అబద్ధం. నిజంలాగ కనిపిస్తుంది. క్షణంలో మోసం చేస్తుంది. స్వప్నంలో ఆడదాని సాంగత్యం వంటిది ఇది. క్షణిక రమ్యాలలో ఇది మొదటిది. చావుకు దారిచూపె, గంధర్వనగర దర్శనంవంటిది. గంధర్వనగరం కనిపించిందంటె వాడు చుక్కలపాలెం చూచాడన్నమాటే. ఇది బాణంవలె మెత్తగా చొరబడుతుంది, తర్వాత మహాబాధ పెడుతుంది. వేశ్యా స్త్రీ సంగమంవలె పైకి రమణీయంగా ఉంటుంది. లోపల అన్నీ దుర్భావాలే, అన్నీ రోగాలే. యౌవనంలో మొదలుపెట్టే పనులన్నీ దుఃఖాలిచ్చేవే, పరిణయకాలంలో కలిగేవన్నీ అరిష్టాలే. యౌవనాజ్ఞానమనే రాత్రి హృదయమందు చీకటిని పెంచుతుంది. దీనికి భీమణాకారము గల ఈశ్వరుడుకూడ భయపడుతాడు. యౌవనమునందలి మోహం, మంచిపనులను మరపిస్తుంది. వివేకాన్ని రూపుమాపుతుంది. భ్రాంతిజ్ఞానాలను ప్రసాదిస్తుంది. కార్చిచ్చుచే అడవిచెట్లు తగలపడినట్లు, యౌవనావస్థలో కాంతావియోగం అనే నిప్పుతో మండుతూ ఉంటాడు మానవుడు. వర్షాకాలంలో నదివలె, ఎంత నిర్మలమయిన మనస్సు అయినా ఈ దశలో కల్మషం చెడకమానదు. ఘనమయిన తరంగాలుగలిగి భయంకరంగా ఉండే నదిని అయినా దాటవచ్చు కాని, తృష్ణా అనే తరంగాలతో పొంగే తారుణ్యం అనే నదిని మాత్రం దాటలేము. "ఆ స్త్రీ," "ఆ స్తనాలూ," "ఆ ముఖం," "ఆవిలాసాలూ," "ఆహావభావాలూ," అని అనుకుంటూ మురుసుకుంటూనే, ముసలివాడవుతాడు నరుడు. అతి చంచలమయిన దురాశలతో బాధపడే యువకుని, ఎండుగడ్డి పరకక్రింద కట్టి సాధువులు గౌరవించకపోగా అవమానిస్తారు. అభిమానం అనే మదపు ఏనుగునకు యౌవనం అనేది కట్టుకొయ్య. ఏనుగునకు మెడనిండా ముత్యాల సరములు ఉన్నట్లు దీని మెడనిండా, కామక్రోధాది దోషాలు హారాలు. ఇది ఒక అడవి. కామక్రోధాది దోషాలు ఇందులో పాములు దుఃఖాలు చెట్లు. ఇది ఒక పద్మంలాంటిది. సుఖలవము అనేది దీని మక

రందం. కుత్సితమయిన మనోవికల్పాలు రేకులు. రాగాదులు కింజల్కాలు, దుశ్చింతలు పూగుత్తులు. ఇది ఆధివ్యాధులనే పక్షులకు గూడు. పుణ్య పాపాలు ఈ పక్షులకు రెక్కలు. ఇవి హృదయమనే సరస్తీరంలో సంచరిస్తూ ఉంటాయి. ఇది పెద్దసముద్రం. ఇందులో వికల్పాలనే తరంగాలు లెక్కలేకుండా ఉంటాయి. జరామరణ దుఃఖమే ఈసముద్రానికి చెలెలికట్ట. యావనం అనేది పెద్ద చెడుగాలి. ప్రయత్న సహస్రాలచే సాధించిన సద్గుణాలు అనే వృక్షాలను పెళ్లగించి పారవేస్తుంది. యావనమనె దుమ్ము, ఇంద్రియాలనే ముఖములమీాద పడి, తెల్లపరుస్తుంది. ఇంద్రియాలకు దోషాలను కలుగ జేస్తుంది. పాపాత్ములయొక్క ఐశ్వర్యమువలె ఇది దోషసమూహాన్ని లేవతీస్తుంది. గుణపంక్తిని నరకివేస్తుంది. నవయావనం అనే చంద్రుడు, శరీరం అనే పద్మంలో ఉండే మతి అనే తుమ్మెదను కట్టివేసి, బాధపెటతాడు. శరీరమనే పొదలో పుట్టిన యావనమనే తీగ, తీగమీాద వ్రాలిన మనస్సు అనే భృంగాన్ని మదింపచేస్తుంది. శరీరమనే మరుభూమిలో కామం అనే ఎండవల్ల పుట్టిన యావనం అనే మృగతృష్ణికను (ఎండమావులను) గూర్చి, మనస్సులు అనే మృగాలు పరుగెత్తుచూ విషయాలనే గోతులలో పడుతున్నాయి. యవ్వనం అనేది శరీరం అనే రాత్రిలో వెన్నెల. చిత్తం అనే సింహానికి జూలు. జీవితమనే సముద్రానికి తరంగం. ఇది నాకు రుచించదు. దేహమనే పొలంలో యావనం అనే శరత్కాలం కొన్నిరోజులు ఫలించి ఉంటుంది. తొందరలోనే నశిస్తుంది. దీన్ని నమ్మరాదు.

దురదృష్టవంతుని చేతినుంచి చింతామణి జారిపడినట్లు, శరీరంనుంచి యావనమనే పక్షి క్షణంలో ఎగిరిపోతుంది. వీడు ఆశపడినన్నినాళ్లు పట్టదు. యావనం ఎప్పుడు వృద్ధిపొందుతూ ఉంటుందో, అప్పుడు సంతాపంతో కూడుకున్న కామాలు పెరుగుతూ ఉంటాయి, యావనం అనే రాత్రి అస్తమించనంతవరకు, రాగద్వేషాలనే పిశాచాలు విశేషించి తిరుగుతూనే ఉంటాయి. నానా వికారాలకు తావై క్షణంలో నశించే స్వభావంగల ఈ యవ్వనాన్ని చూచి మురుసుకొనుట, చావుసిద్ధమయిన పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకున్నట్లు. అవివేకంవల్ల క్షణభంగురమయిన యవ్వనంతో ఎవడు ఆనందిస్తాడో, వాడు నరపశువు. అభిమానంతో కూడిన అవివేకంవల్ల

మదోన్మత్తమయిన యౌవనాన్ని ఎవడు అభిలషిస్తాడో, వాడు త్వరలోనే పశ్చాత్తాపపడతాడు. యౌవనం అనే సంకటం నుంచి సుఖంగా ఎవరు బయటపడతారో, వారు మహానుభావులు, వారే పూజ్యులు. వారే పురుషులు, మిగిలినవారు నపుంసకాధములు. పెద్ద తిమింగిలాలతో కూడిన సముద్రాన్ని సుఖంగా దాటుతాడు నరుడు, రాగాదులనే తరంగాలతో పొంగిపొర్లే ఈ నిందితమయిన యౌవనాన్ని దాటలేడు. మహాత్మా! వినయం చేత అలంకరింపబడి, పూజ్యులైన మునులకు స్థానమై, కరుణతో ప్రకాశిస్తూ, శాంత్యాది గుణములతో చుట్టుకోబడిన, మంచి యౌవనం ఈ ప్రపంచంలో దుర్లభం. పక్షులకు నిలయమయిన కల్పవృక్షాలచే అలంకరింపబడి దేవతలకు ఆశ్రయమై, ఫలపుష్ప సమృద్ధితో కూడిన నందనవనము భూలోకంలో ఉండటం అసంభవం కదా!

## స్త్రీ నింద

నరాలు ఎముకలతో ముడివేసుకున్న మాంసపు బొమ్మ ఆడుది. ఇందులో అంగాలు యంత్రంవలె తిరుగుతూ ఉంటాయి. దీనిలో చర్మం, మాంసం, నెత్తురు, మలము, మూత్రము మొదలగువాటిని విడిగా చూచుకుంటే ఏమీ రమ్యత కనిపించదు. ఒకవైపు వెంట్రుకలు, ఒకవైపు రక్తము స్త్రీ శరీరం. దీన్ని చూచి మానవుడు మురుసుకుంటాడు. మంచి మంచి పూలతో, సువాసనగలవై పూత ద్రవ్యాలతోను లాలనచేయబడే అవయవాలను తుదకు గద్దలూ నక్కలూ, పొర్లించి పొర్లించి, పీక్కుతింటాయి. మేరుపర్వతం యొక్క చరియమీద ఉండే గంగా జలప్రవాహంతో సమానమయిన ముత్యాలహారముయొక్క శోభ ఏ స్త్రీ స్తనమందు ప్రకాశిస్తూ ఉంటుందో, ఆ స్త్రీ స్తనమే చివరకు ఊరిచివర శ్మశానా[illegible] అన్నపుముద్దవలె రుచిగా కుక్కలచే భక్షింపబడుతుంది. రక్తమాం[illegible] కూడుకున్న అడవి గాడిదయొక్క అవయవాలు ఎలాంటివో [illegible] ప్రేమించిన స్త్రీయొక్క అవయవాలు కూడా అలాంటివే. [illegible] ఆశ ఎందుకు? కాని స్త్రీని అవిచారి రమణీయంగా భావి[illegible]ము," "రేమా అని ఆలోచిస్తుంటే అదీ కనిపించదు. శుక్తి రజ[illegible]. ఎండి భ్రమించటానికి ఇక్కడ కారణం కనిపించదు. [illegible] మెండుగా

పుట్టిస్తుందో, ఇది కూడా అన్ని వికారాలను పుట్టిస్తుంది, ఈ రెంటికీ భేదా కనిపించదు. మానవులనే ఏనుగులు ఆడువారనే కట్టుకొయ్యలకు కట్టి వేయపడి మహామోహంలో నిద్రిస్తూ ఉంటారు. వీళ్లకు యముడనే అంకుశాలవల్లకూడా వివేకం అనే మెలకువరాదు. ఆడవాళ్లు పాపకృత్యాలు అనే అగ్నులకు జ్వాలలు. వెంట్రుకలు నల్లటి పొగలు. చూడటానికి యింపుగా ఉంటాయి. అంటటానికి సాధ్యంకావు. ఈమంటలు మానవుని గడ్డిపరకను తగలపెట్టినట్లు తగలపెడతాయి. నరకంలో వెలిగే మంటలకు ఈ లోకంలోని స్త్రీలు కట్టెలు. వెంట్రుకలు విరబోసుకొని, గ్రుడ్లు త్రిప్పుకుంటూ, గుండ్రటి ముఖం వేసుకొని, తెల్లగా నవ్వుతూ, పురుషులను విలాసంగా ఆడించే ఈ కామినులు దీర్ఘమయిన యామినులు (రాత్రులు.) రాత్రులలో అంధకారం ఉంటుంది. నక్షత్రాలు ఉంటాయి. గుండ్రటి చంద్రుడుంటాడు. పూలు వికసించి ఉంటాయి. పనులను అన్నిటిని బందు చేస్తాయి. స్త్రీలు విషలతలు. పుష్పాలవలె మధురంగా ఉంటారు. చేతులు చిగురుటాకులు. కళ్లు తుమ్మెదలు. స్తనాలు పూలగుత్తులు. పొచ్చని అవయవాలు కింజల్కాలు. ఇవి పిచ్చి యెక్కిస్తాయి. మనుష్యులను చంపుతాయి. వీళ్ళు ఆడ ఎలుగుబంటు లాంటివారు. ఆడభల్లూకాలు బిలంలో వున్న సర్పాలను ఉచ్ఛ్వాసమాత్రంచేత ఆకర్షిస్తాయి. స్త్రీలు బూటకపు ఉపచారాలు అనే ఉచ్ఛ్వాసాలతో విటుల్లను ఆకర్షిస్తారు. మన్మథుడనే కిరాతుడు, ముగ్ధలయిన నరులనే పక్షులను పట్టడానికి, స్త్రీ అవయవాలనే వలలను పన్నుతాడు!) స్త్రీ అనే పెద్దకట్టుకొయ్యకు మనస్సు అనే మదపుటేనుగు, రతి అనే ఇనుపగొలుసుచే కట్టివేయబడింది. జన్మ పరంపరలనేవి, కొద్ది [illegible]టి మడుగులు, ఇందులో చిత్తమనే బురదలో పురుషులనే చాపలు తిరుగుతూ ఉంటాయి. ఈ చేపలను పట్టుకోటానికి దుర్వాసనలనే త్రాటికి, స్త్రీలు అనే యెరనుకట్టి వదిలాడు బ్రహ్మ. గుర్రాలకు గుర్రపుశాల బంధనం. ఏనుగులకు ఆలానం బంధనం. పాములకు పాము మంత్రం బంధనం. పురుషులకు స్త్రీ[illegible] బాధనం, బ్రహ్మాండం అనే భోగశాఖి స్త్రీలను ఆ[illegible]గా చేసికొని [illegible]దశను పొందింది. స్త్రీలు ముద్దులు అనే రత్నాల[illegible]. [illegible] అనే యినుపగొలుసు. వీళ్లు ఎవరు [illegible]లేదు. మాంస[illegible] వీళ్ళ అ[illegible]యవాలను చూచి నేను

ముడుసుకోను. లావాటి పురుషులందరూ ఏ స్త్రీలను లాలనచేస్తున్నారో, ఆ స్త్రీలు అవయవాలు ఊడిపోయి శ్మశానంలో దొర్లుతున్నారు. పురుషులు వీళ్లను గట్టిగా ప్రేమిస్తారు. ముఖంమీద మకరకాది పత్రములవలె అతికిపోతారు. అలాంటివాళ్లు చివరకు మరుభూమిలో ఎండిడొక్కు అవుతారు. ఎముకలు తెల్లగా నక్షత్రాలవలె మెరుస్తూ ఉంటాయి. పరాగాలు రక్తాన్ని త్రాగుతాయి. నక్కలు గద్దలు మాంసాన్ని తింటాయి. ప్రాణవాయువులు ఆకాశానికి పోతాయి. ఈ పరిస్థితి స్త్రీలకు త్వరలోనే జరుగుతుంది, ఇలాంటి చోట మోహం ఎందుకు? పాంచభౌతిక పిండం మీద బుద్ధిమంతుడికి ఇంత అనురాగం ఏమిటి? స్త్రీ చిత్తుడు ధనాశాపరుడై గుంపునుంచి చెదరిన మృగంవలె ఏ దిక్కుకు వెళ్లుదుమా అని ఆలోచిస్తూ ఉంటాడు. స్త్రీ లోలుడు తుదకు మహాదైన్యాన్ని అనుభవిస్తాడు. స్త్రీ ఉంటేనే భోగవాంఛ - స్త్రీ లేకపోతే భోగవాంఛ లేదు. స్త్రీ లేకపోతే, జగత్తు లేదు. జగత్తు లేకపోతే దుఃఖం లేదు, అంతా సుఖమే. మహాత్మా! ఆ పాతరమణీయములయిన ఈ భోగాలు నాకు రుచించవు. నేను మనశ్శాంతితో పరమపదమును పొందుతాను.

## ౨౨ జరానింద

ఇక వార్ధక్యాన్ని విచారించుకుందాం. ఆటపాటలలో ఆశ తీరని బాల్యాన్ని యౌవనం మింగుతుంది; స్త్రీసుఖం వగయిరా భోగాభిలాషలో తుదముట్టని యౌవనాన్ని వార్ధక్యం మింగుతుంది. ఈ వార్ధక్యం పద్మాలను మంచుగడ్డవలెనూ, తృణాగ్రమునందలి నీటి చుక్కను పెను గాలివలెనూ, ఒడ్డున ఉన్న చెట్లను నదీప్రవాహంవలెనూ, దేహాన్ని నాశనం చేస్తుంది. విషబిందువు మింగితే దేహానికి వికారాలు కలిగినట్లు ముసలితనంవల్ల దేహానికి వికారాలు కలుగుతాయి. ముసలితనంచే జారిపోయిన శరీరంగల పురుషులను కామినీస్త్రీలు ఒంటెవలె చూతురు. ఒంటిమీదకు జర రాగానే; ప్రజ్ఞ అనేది సవతిని చూచి సిగ్గుచెందినట్లు పారిపోతుంది, ముసలివానిని చూచి నౌకర్లు, కొడుకులు, పెళ్లాము, బంధువులు స్నేహితుల్లు అందరూ పిచ్చివాణ్ణివలె పరిహసిస్తారు. ఎండిపోయిన చెట్లమీద గద్దలు చేరినట్లు, ముసలివానిని కోరికలు మెండుగా

చేస్తాయి. ఇందులో దైన్యం మహాజాస్తి. మనస్తాపం పొందడు. ఆపదలన్నిటికీ చెలియలగు స్పృహ తాండవం ఆడుతుంది. పరలోకానికి పనికి వచ్చే పని చేయలేకపోతినికదా! అని తీరని భయాన్ని పొందుతాడు ముసలివాడు. వాణ్ణి వాడు దూషించుకుంటూ ఏమేమో దైన్యాన్ని పొందుతాడు. ఎప్పుడు నాకు రుచ్యమైన అన్నం దొరుకుతుందా అని చిత్తాన్ని మంట పెడుతుంది ఈజర. ఆశజాస్తి. తినలేడు, తింటే జీర్ణించదు.

శరీరమనే చెట్టుమీద రోగాలనే పాములతో చుట్టుకొని జర అనే ముసలికొంగ ఈ శరీరం అనే చెట్టును పీడిస్తూ అరుస్తూ ఉండే గోవుగానే, మోహమనే అంధకారాన్ని ఎదురుచూస్తూ మరణమనే గుడ్లగూబ హఠాత్తుగా వచ్చి పడుతుంది. సాయంసంధ్యవేళను చూచి చీకటివచ్చి పడ్డట్టు జరావస్థను చూచి మరణం వచ్చి వాలుతుంది. ముసలితనం పూత, శరీరం చెట్టు. దాని మీద మరణమనే కోతి హఠాత్తుగా వాలుతుంది. మనుష్యులు లేని పట్టణమైన బాగుంటుంది. కొమ్మలు కొట్టిన చెట్టయినా బాగుంటుంది. అనావృష్టిగల దేశమైనా బాగుంటుంది. కాని ముసలితనం వచ్చిన శరీరం మాత్రం బాగుండదు. ఆడగద్ద ఆమిషాన్ని (మాంసాన్ని) మ్రింగినట్టు, జరా అనేది మనిషిని క్షణంలో మింగటానికే, రొప్పుకుంటూ అరచుకుంటూ వచ్చిపడుతుంది. ఆడపిల్ల తలలో పెట్టుకోడానికి కలువ పువ్వును ఉత్సాహంతో త్రుంచినట్టు జర దేహాన్ని నాశనం చేస్తుంది; శిశిరఋతువులోని గాలివల్ల చెట్టాకులను రాలగొట్టినట్టు ఇది శరీరాన్ని తెల్లపరచి రాలగొట్టుతుంది, మంచుసోకి వాడిన పద్మంవలె ఉంటాడు ముసలితనం వచ్చిన మానవుడు; కాలమనే ఈశ్వరుడు ముసలితనంలో శిరస్సు అనే, పండుబారిన గుమ్మడికాయను గుటుక్కున మ్రింగుతాడు.

ఆయుర్దాయం అనే ప్రవాహం శీఘ్రంగా వెళ్లుచుండగా, జర అనే గంగానది శరీరమనె గట్టున ఇంద్రియాలనే ఉన్న చెట్లయొక్క వేళ్ళను తెంచుతుంది. జరఅనే పిల్లి శరీరమనే మాంసానికి అలవాటుపడి యౌవనం అనే ఎలుకను తిని మహా సంతోషిస్తుంది. దేహమనే జాంగలంలో జర అనే నక్క కూస్తుంది, ఇంత అమంగలకరమైంది మరొకటి లేదు. చుంయి

మని రగులుకుంటూ. దుఃఖం అనే పొగతో బయలుదేరే జరఅనే అగ్ని జ్వాల మానవుణ్ణి తగలపెడుతుంది. తెల్లగా పాలిపోయిన అవయవయాలు అనే పల్లవములుగల శరీరమనే తీగ, పుష్పముల బరువుచే వంగిన తీగవలె ముసలితనంచేత వంగిపోతుంది. శరీరమనే కర్పూర అరటిచెట్టును మరణ మనే ఏనుగు పెల్లగించి పారవేస్తోంది. శరీరమనే కొండగుహాలో ముందు రాబోయే జరా మహారాజుగారి యొక్క ఆధివ్యాధులనే సేన ప్రవేశిం చింది. ఈసేనను శత్రువులెవరూ జయించలేరు. జరఅనే ముసలి రాక్షసి ఆ శత్రువులను జయించింది. జర అనే మంచు కప్పిన శరీరమనే కొంపలో ఇంద్రియాలనే పిల్లలు ఏమాత్రం కదలలేక పోతున్నారు. జరా అనే స్త్రీ కర్ర అనే మూడవకాలితో దగ్గు (కాస) అనే వాద్యంతో నృత్యం చేస్తుంది. జరఅనే చంద్రోదయంతో తెల్లపడిన శరీరం అనే పట్టణంలో మరణం కలువక్షణాలో వికసిస్తోంది. జరఅనేసున్నం వేసిన, శరీరం అనే అంతఃపురంలో అశక్తి ఆర్తి ఆపదఅనే స్త్రీలు సుఖంగా ఉంటున్నారు. జర అనే మహారాజుగారు మరణం అనే మంత్రితో జంతువులను జయి స్తాడు. ఈ రాజుగారి మీద నాకు ఆదరణ లేదు. దీనిని జయించ లేక పోతే కోరికలన్ని మీద పడి తిరస్కరిస్తాయి.

## 23 కాలనింద

ఈ బ్రహ్మాండ కుహరంలో అంతులేని మనస్సంకల్పాలతోను, నీవాడు నావాడు అనే భేద బుద్ధులతోను, మూఢులు భ్రాంతి జ్ఞానా లను అంతులేకుండా పెంచుకున్నారు. ఈ అస్థిర పంజరం మీద సత్పురు షులకు ఆదరం లేదు. మూఢులకు ఉంటే ఉండవచ్చు. అద్దంలో ప్రతిఫలిం చిన పండును అజ్ఞానులైన పిల్లలు తినకోరుదురుగాని, జ్ఞానులు తినకోరరు. ఇలాంటి అస్థిర ప్రపంచంలో సుఖభావన ఉంటేదాన్ని కూడా కాలం కొరికేస్తుంది. ఎలుక దారాన్ని కొట్టినట్లే. కాలం నోట్లో పడని వస్తువే ఈ ప్రపంచంలో లేదు. ప్రళయకాల రుద్రుడు దృశ్యములయిన వస్తువు లన్నీ కబలించటానికి సిద్ధంగా ఉన్నాడు. ప్రపంచ సంహారకారుడగు కాలరుద్రుడు, సంహరించటానికి ఎంతటి వారినీ ఒక్క క్షణం కూడా నిరీక్షించడు. వీడు ప్రత్యక్షంగా కనిపించకున్నా, రోజులు, మాసాలు,

సంవత్సరాలు, యుగాలు, కల్పాలు, అనే రూపంతో ప్రపంచాన్ని అంతా ఆక్రమించి దృశ్యం అవుతూ ఉంటాడు.

ఎంత రమ్యంగా ఉన్నా, ఎంత పనులుచేసినా, మేరువు పర్వతం వలె ఎంత స్థిరం అనుకున్నా, అందరు కాలానికి లోబడేవాళ్లే. గరుత్మంతునకు ఎదురు తిరిగే పాములుండవు. దయలేని వాణ్ణి అయినా రాతివలె కఠినుణ్ణీ అయినా? పులివలె క్రూరుణ్ణయినా, రంపంవలె కర్కశుణ్ణి అయినా కాలం మింగేస్తుంది. ఎన్ని లోకాలను మింగినా దీనికి తృప్తి లేదు. ధనాన్ని హరిస్తుంది. లోకాలను నాశనం చేస్తుంది. వర్ణసాంకర్యాన్ని చేస్తుంది. దీని వేషాలకు అంతులేదు. బ్రహ్మాండం అనే రంగస్థలంలో మహానటుడు కాలం చిలుక తొడిమ నుంచి దానిమ్మపండ్లను కొరికి పడవేసినట్లు, అవ్యాకృతం నుంచి వ్యాకృతములయిన భూతాలను లాగిపారవేస్తుంది ఇది. దురభిమానాలతో పిసగొని ఉన్న జీవకోట అనే అడవిలో పుణ్య పాపాలు అనే దంతములతో మానవులనే, చిగురుటాకులను విరుచుకు తింటుంది కాలం. విశాలమైన బ్రహ్మాండం అనే అరణ్యాన్ని అంతా ఆవరించి ఉంది, దీనికి బ్రహ్మదేవుడు మూలం. దేవాదులు ఫలవృక్షాలు. కాలమనే పురుషుడు, వర్షములు, కల్పములు, కళలు, అనే తీగలను తయారుచేస్తున్నాడు. ఇందుల్లో రాత్రులు తుమ్మెదలు. పగళ్ళు పూలగుత్తులు. విసుగులేదు వీడికి. ఇది కొట్టటానికి చిక్కడు. తగవు పెట్టడానికి దొరకడు. కనిపించడు. కాని కార్యరూపంలో ఈ పనులను అన్నిటినీ చేస్తూనే ఉంటుంది. ఒక నిముషంలో ఒకదానిని లేపుతుంది. ఇంకొక నిముషంలో మరోదాన్ని మంటకలుపుతుంది. దీని దుర్విలాసాలు అనంతాలు మానవుణ్ణి మహా త్రిప్పుతుంది. గడ్డిపరకనయినా, పరాగాన్ని అయినా. దేవేంద్రుణ్ణి అయినా, మేరుపర్వతాన్ని అయినా! ఆకునయినా, సముద్రాన్ని అయినాసరే చిన్నపెద్ద అని అక్కరలేదు. సర్వం తన పొట్టన పెట్టుకోవడమే దానికి సహజం, క్రౌర్యం, లుబ్ధత్వం, దౌర్భాగ్యం, చపలత్వం, అన్ని దుర్గుణాలు ఈ కాలంలోనే ఉన్నాయి. పిల్లలు ఇంటి ముంగిలిలో రెండు చేతులతో బంతి ఎగరవేస్తూ ఆడుకుంటూ ఉంటారు. ఈ కాలపురుషుడు నభోమండలంలో సూర్యచంద్రులనే బంతులను ఎగరవేస్తూ ఆడుతున్నాడు. వీడు ప్రళయకాలంలో సమస్త భూతాల ఎముక

లను మాలగా వేసుకొని సంతోషిస్తాడు. అప్పుడు వీడి శరీరంనుంచి పుట్టిన చండమారుతానికి మేరుపర్వతంకూడా విడిపోయి పొడపొడి అయిపోతుంది.

వీడు ఒకపుడు రుద్రుడు. మరొకపుడు మహేంద్రుడు. ఇంకొకపుడు బ్రహ్మ. మరొకపుడు కుబేరుడు. తుదకు ఏమీ కాడు. చిత్రవిచిత్రము లయిన సృష్టులను నిర్మిస్తాడు. మహాకల్పాలనే వృక్షాలనుంచి, దేవగణాలు రాక్షసగణాలు అనే పండిన పండ్లను పడవేస్తాడు. కాలమనేది భూతాలు అనే దోమలయొక్క మోతగల, బ్రహ్మాండాలనే అత్తిపండ్లకు పెద్దచెట్టు కాలపురుషుడు. ఆయా ప్రాణులయొక్క శుభాశుభ క్రియలతో కూడుకొని, చైతన్యముయొక్క సాన్నిధ్య మాత్రంచే వికసించిన, జగత్సత్తా అనే కుముద్వతితో వినోదిస్తూ ఉంటాడు. అంతులేకుండా పీఠంవేసుకొని' కులశైలాలవలె ఎత్తుగా ఉంటాడు. చీకటివలె నలుపు, రాత్రులందూ' కాటుక మొదలగు వాటియందునూ, సూర్యచంద్ర కాంత మణులందు మహాకాంతి. కుడ్యకుసూలాదులందు ఈ రెండూ ఉండవు. అనంతము లయిన ప్రాణిని కాయములతోటి భూమివలె గట్టిపడింది. ఎన్ని కల్పాలు గడచినా, దుఃఖించదు. సంతోషించదు. రాదుపోదు. ఉదయించదు. అస్తమించదు. ఎప్పుడూ ప్రపంచ నిర్మాణంతో తనని తన్ను కాపాడు కుంటూ ఉంటుంది కాలం. రాత్రికాలం బురదమట్టి పగళ్లు ఎర్రతామర పద్మాల సమూహం. మేఘాలు తుమ్మెదలు దీనినంతా తనలో తాను తయారు చేసికొంటుంది కాలం. కాలం అనే లుబ్ధుడు కృష్ణపక్ష రాత్రి అనే పాతచీవురును తీసికొని. వెలుతురు అనే బంగారు ధూళిని, పర్వతాల దాకా చిమ్ముతున్నాడు. ఇంకా దిక్కోణాలలో సూర్యుడనే కాగడాను వేసి తిప్పుతూ జగత్తనే కొంపలో యేమూల ఏమి ఉందో అని వెతుకుతూ ఉంటాడు. ప్రపంచం అనే ఎండు అడవిలో పగటికాలం అనే రెప్పపాటు గల సూర్యుడనే కంటితో బాగా పండిన లోకపాలకులనే పండ్లను వెలుక్కొని తింటున్నాడు. జగత్తు అనే పాతరెల్లు కొంపలో, పొరపాటునపడిన గుణవంతులనే మణులను, లోతయిన మరణమనే పెట్టెలో, దాస్తున్నాడు. లోకంలోని రత్నాలహారం గుణాలతో (దారాలతోనే) నిండి ఉంటుంది. కాని కాలపురుషుడు దాన్ని తన మెళ్లో వేసుకోటానికి తెంచుకుంటాడు. చపలుడయిన వీడు, నక్షత్రాలు కింజల్కాలుగాగలిగి, పగళ్లు అనే హంసలు

తిరిగే రాత్రులనే కలవపూదండను ఎప్పుడూ ముంజేతికి చుట్టుకుంటాడు. కొండలూ, సముద్రాలూ, భూమి, ద్యులోకం, మొదలయిన మేకలను గొర్రెలను చంపె కటికవాడు వీడు. ఆకాశాన నక్షత్రాలు అనే నెత్తురు చుక్కలను ప్రతిరోజూ త్రాగుతూ ఉంటాడు. వీడు యౌవనం అనే తామరకొలనుకు చంద్రుడు. ఆయుర్దాయమనే ఏనుగునకు సింహం. వీడు దొంగిలించని వస్తువు ఏదీ లేదు. ప్రతివస్తువునూ పాడుచేసి మృత్యువు నోట్లో పడవేస్తాడు. లేనిదానిని ఉన్నట్లు కనపరచి రమిస్తాడు. లోకంలో కర్త, భోక్త, సంహర్త, స్మర్త. అన్ని ఉద్యోగాలు వీడివే. ఇలాంటి కాలం యొక్క బలము మానవులయందు అనుభవసిద్ధమై ఉంది.

## ౨౪ కాలవిలాసము

పరబ్రహ్మ ఒకానొకరాజు. మాయ ఈయనగారి పట్టమహిషి. వీరిద్దరి సంబంధమున కలిగిన కుమారుడు కాలమనువాడు. వీని పరాక్రమము ఊహింపనలవికాదు. వీడికి ఏ ఆపద లేదు. వీడు యువరాజ పట్టాభిషిక్తుడై విహరిస్తున్నాడు వీని చరిత్ర చెపుతా విను మహాత్మా ?

వీడు ప్రపంచం అనే అడవిలో ప్రవేశించి, అజ్ఞానులూ, దీనులూ, అయిన, భూతాలు, అనే మృగాలతో వేటాడుతూ ఉంటాడు. వీడికి ప్రళయకాలమనే మహాసముద్రము జలక్రీడలాడే కొలను. ఇందులో బడవానలం పద్మాలు. చేదు వగరు పులుపు వగయిరా భూతాలతో కూడుకున్న క్షీరాది సముద్రాలు వీడికి చలిది అన్నము. సంసారం అనే అడవిలో బెబ్బులిలాగ అన్ని భూతాలను చంపుతున్న కాలరాత్రి, ఇతనికి ప్రియురాలు. భూమి మంచినీరు త్రాగేచెంబు. దీనిలో మంచిపరిమళంగల నీరు ఉంది. ఈ కాలపురుషుడికి చంకలో ఉన్న పంజరంలో నృసింహావతారం అనేది వాజ అను పక్షిగా చేయబడింది. ఈ మహాకాలుడు భైరవుని (కాలభైరవుని) కోకిలపిల్లగా చేసికొన్నాడు. ఎప్పుడూ ధనుష్టంకారం చేస్తూ దుఃఖాలనే బాణాలను వదలుతూ ఉండే, సంహారమనే ధనస్సును నాలుగు దిశలకు త్రిప్పుతుంటాడు. అతిచంచలమయిన లక్ష్యాలనుకూడా ఛేదిస్తాడు. ఇందులో వీనికి పాండిత్యం యెక్కువ. వీడు విషయలంపటులగు జనులను

పిచ్చికోతుల్లాగా ఆడిస్తాడు. వీడిశరీరం మహా ప్రకాశమానంగా ఉంటుంది. ఇలాంటి రాజకుమారుడు ప్రపంచాటవిలో వేటాడు తున్నాడు.

## ౨౫ కాలవిలాసము

వీడికంటె మరొకడు కాలపురుషుడు, క్రియారూపుడు, ఫలరూపుడు అని రెండు రూపాలతో బ్రహ్మాండంలో నాట్యమాడు తున్నాడు. వీడే దైవమని కాలమని పిలవబడతాడు. ఫలసిద్ధియే వీడికి ఇష్టమయినరూపం. భూతకోటి అంతా దీనిగోనే పడిచస్తోంది. ఈ బ్రహ్మాండ మంతా వీడికి నర్తనాగారం. (నాట్యమాడే కొంప) ఇందుగో నృత్యంచేస్తూఉంటాడు. ఈ కాలపురుషుడే యముడనే మూడో పేరును పెట్టుకొని భయంకర మయిన కాపాలిక వేషాన్ని ధరించాడు. వీడికి నియతియనేది భార్య. దీనిమీద వీడికి అనురాగం జాస్తి. వీడికి యెదురురొమ్ముమీద శేషుడు (సర్పము.) గంగా ప్రవాహమూ ఈ రెండూ సవ్యాపసవ్యములయిన జందెములు. చంద్రసూర్యమండలాలు బంగారు వలయాలు. మేరుపర్వతం చేతిలో లీలాపద్మం. నక్షత్రాలనే చుక్కలతో చిత్రితమై, పుష్కలావర్తకాలనే అంచులుగల, ఆకాశం ఈయోగినీ స్త్రీకి వస్త్రం. ఇలాగంటి కృతాంతుని ముందర నియతిఅనే భార్య ఎడతెరపిలేని చేష్టల (పనుల)తో నాట్యం చేస్తోంది. అడ్డులేని సామర్థ్యముగల ఈ నాట్యకత్తెకు, దేవాది లోకాలు, అలంకార వస్తువులు. పాతాళలోకం దీనికి కాలు. పాపమనే దారంతో గుచ్చబడిన నరకపంక్తి అనేది దీని కాలిగజ్జెలు. చిత్రగుప్తుడు యముడనే ముఖం మీద, ప్రాణికర్మ సంస్కారాలనే కస్తూరి బొట్టును నిర్మించాడు. పగలిపోయే కొండలయొక్క ధ్వనిని వాద్యంగా చేసికొని, కల్పాంతాలలో నృత్యం చేస్తుంది. కాలం పృష్ఠభాగంలో, పింఛంవిప్పి ఆడుచుండే కుమారస్వామి నెమళ్లతోనూ, మూడునేత్రాలనే తొర్రలతో భయంకరంగా ఉండి, వ్రేళ్లాడే జడలు, వాటిమీద వ్యాపించిన చంద్ర కిరణాలు, గల ఈశ్వరునియొక్క తలలతోనూ, వికసించిన మందారపూలు పెట్టుకున్న పార్వతీదేవియొక్క కొప్పులనే వింజామరలతోనూ, ఎత్తైన కొండలవలెనున్న కాలభైరవుని ఉదరం అనే సొరకాయ బుర్రలతోనూ, ఎండిపోయిన ముడియెముకలనే వస్త్రాలతోనూ, సర్వసంహారం చేస్తూ

భయపరుస్తుంది. నానావర్ణాలయిన తలవెంట్రుకలు పద్మపత్రాలుగా ధరించి ఎగురుతూ ఉంటుంది. ప్రళయకాలంలో పుష్కరావర్తక మేఘాలు గర్జిస్తూ ఉంటే తుంబురునారదాది గంధర్వులు ఎగిరి చక్కాపోతారు. ఇదే నాట్యశాలలో దీని మొగుడు కూడా నాట్యం చేస్తాడు. చంద్రమండలం వాడికి విచిత్రమయిన కిరీటం. నక్షత్రాలతోను వెన్నెలతోను ప్రకాశించే ఆకాశం వీడికి శిరోభూషణం. ఒక చెవులో ఎముకల వికారమయిన కుండలము రెండవచెవులో మేరుపర్వతం అనే బంగారు కుండలం. ఈచెవులకే మరో కల్పంలో సూర్యచంద్రులు కుండలాలు. లోకాలోక పర్వతాలు మొలగజ్జెలు. మెరుపులు చేతిమురుగులు. మేఘాలు కట్టుగుడ్డలు. వెనుకటి సృష్టిలో చచ్చిన యములు ముసలాద్యాయుధములు పాశంతో గుచ్చబడిన జీవసంఘం వీడికి కంఠమాల. జీవులతో ప్రకాశించే మకరకాది పత్రాలుగల ఏడు సముద్రాల పంక్తి, వీడికి భుజకీర్తులు. లౌకిక వైదిక వ్యవహారాలు రోమపంక్తి. ఇలాంటి కృతాంతుడు (యముడు) కల్పాంతంలో తాండవనాట్యంచేసి, చాలించి, కొంతకాలం విశ్రమించి, మళ్లీ బ్రహ్మాండాదులను సృష్టించి, జరామరణాదులచే అలంకరించబడిన సృష్టి రూపమయిన నాట్యలీలను మళ్లీ సాగిస్తూ ఉంటాడు. ఇలా, పిల్లవాడు విసుకులేకుండా బురదమట్టితో ఆటబొమ్మను తయారుచేసినట్టు, వైదిక స్మార్త కర్మలను కృతత్రేతాయుగములందు బాగాను, కలిద్వాపరములందు ఒకమాదిరిగాను నడుపుతూ, లోకలోకాంతరాలను మాటిమాటికి నిర్మిస్తూ ఉంటాడు కాలపురుషుడు.

## ౨౬. దైవ దుర్విలాసము

విశ్వామిత్ర మహామునే! కాలాదులచరిత్ర ఇలా ఉంటే మాబోటి వాళ్లకు సంసారం మీద ఏమి ఆదరం ఉంటుంది? కాలానికీ దైవానికీ అమ్ముడుపోయినట్లు ఉంటున్నాము. దైవనిర్మితమయిన శబ్దస్పర్శాది విషయాలకు లోనై మోహపోయినాము. కాలము మానవులకు చెడు త్రోవను చూపి ఆపత్సముద్రంలో పడేస్తుంది. దేవుడు దుర్వాశలచే లోలోపల మంటపెడతాడు. ఆడది అగుటచే స్వభావచంచలయగు నియతి (అదృష్టము) ధైర్యాన్ని చెరుస్తుంది. పాములు గాలిని మింగినట్లు

క్షుముడు ఇతికృార్యుడై భూతజాలాన్ని మ్రింగుతాడు. ఎంత బాధల్లో ఉన్నవానినిగూడ వీడు దయతలచడు. బ్రహ్మాదిస్తంబ పర్యంతములయిన భూతాలన్నీ తుచ్ఛవిషయాలతో దుఃఖాన్నే అనుభవిస్తూ ఉన్నాయి.

ఆయుస్సు అతిచంచలం. (క్షణభంగురం). మృత్యుదేవత మహా కఠినురాలు. యౌవనం అస్థిరం. బాల్యం మూఢం. లోకం విషయానుసంధానంతో కలంకం చెందింది. బంధుగులు భవబంధనాలు. భోగాలు సంసార (ప్రపంచ) రోగాలు. తృష్ణలు మృగతృష్ణికలు. (ఎండమావులు) ఇంద్రియాలు శత్రువులు. సత్యం అసత్యం అయింది. మనస్సే మనస్సుకు శత్రువు. అహంకారం (అంతఃకరణ) లాంఛనప్రాయం అయింది. బుద్ధులు (అధ్యవసాయ వృత్తులు) పలచబడ్డాయి. ప్రవృత్తులు దుష్ఫలాన్ని ఇస్తున్నాయి. మనోలీలలు స్త్రీగతములయినాయి. ఆత్మయొక్క చమత్కారాలు విషయవాంఛలమీద వాలాయి. స్త్రీలు దోషాలకు పతాకాలు అయినారు. అనురాగాలు విరాగాలు అయినాయి. అలౌకికమగు ఆత్మ వస్తువు కార్యకరణ సంఘాతమగు దేహమయింది. చిత్తం అహంకారానికి దత్తమయింది. పదార్థాలన్నీ నాశగ్రస్తములయినాయి. ప్రపంచాధిష్ఠానమయిన ఆత్మవస్తువు ఎక్కడా గోచరించుట లేదు. మహాత్మా? మనస్సు మహావ్యాకులపడి లోలోపల కుళ్లుతోంది. రాగమనే రోగం హెచ్చిపోతోంది. విరాగం అడుగంటుతోంది. చూపు అంతా రజోగుణ ప్రధానమయింది. తమస్సుదానికంటె ముందుపోతుంది. సత్త్వం ప్రపంచంలో ఏమూల ఉందో కనిపించదు, ఉనికి అస్థిరమయింది. మృతి రాకకు ప్రయాణమయింది. ధైర్యంచెడింది. తుచ్ఛవిషయాలమీద రతి పెరిగింది. మతిమాంద్యాన్ని పొందింది. శరీరం నాశోన్ముఖమయింది. జర, శరీరం మీద వెలుగుతోంది. పాపం మెరుస్తోంది. యౌవనం ప్రయత్నపూర్వకంగా పారిపోతోంది. సజ్జనసాంగత్యం చాలాదూరమయింది. పుణ్యలోకగమన మనేది ఎక్కడా కనిపించదు. సత్యము తలయెత్తుటయే లేదు. మనస్సు లోలోపల మూర్ఛిల్లుతోంది. సంతోషమనేది ఎండమావులకు చేరింది. కరుణ కలకలలాడుటలో పుట్టనేపుట్టదు. నీచత్వం ఎక్కడనుంచియో పరుగెత్తుకొని వస్తూఉంది. ధైర్యం అధైర్యాన్ని చెందింది. మానవులందరూ క్రిందికీ మీదికీ రాకపోకలలో పడ్డారు. దుర్జన సాంగత్యం మహా

తేలిక అయింది. సజ్జన సాంగత్యం దుర్లభం అయింది. ప్రాపంచిక విషయాలు చావుపుట్టుకలకు బాగా అలవాటు పడ్డాయి. వాసన అనేది మానవులను సంసారంలో కట్టివేస్తోంది. భూతపరంపర ఎక్కడికి పోతోందో, ఎక్కడనుంచి వస్తోందో అంతు చిక్కటలేదు. దిక్కులు తెలియుటలేదు. దేశాలు మారిపోతున్నాయి. కొండలు పగిలిపోతున్నాయి. ఇంక మాబోటి వాళ్లమాట ఏమిటి? సద్రూపుడయిన పరమేశ్వరుడు భూమ్యాకాశాలనుకూడ మింగుతున్నాడు. ధరాదేవియే అధైర్యపడితే ఇక మాబోటి వాళ్లం ఏమిటి? సముద్రాలు ఎండిపోతున్నాయి. నక్షత్రాలు రాలుతున్నాయి. సిద్ధపురుషులు కూడా చస్తున్నారు. దానవులు కూడా రాలిపోతున్నారు. ధ్రువుడుకూడా అధ్రువం (అస్థిరం) అయినాడు, అమరులు మరణిస్తున్నారు. శక్రుడు (ఇంద్రుడు) కూడా మృత్యుదేవత యొక్క వక్త్రములచే భక్షింపబడుచున్నాడు. యముడు నియమింపబడుచున్నాడు. వాయువు అవాయువగుచున్నాడు. (వీచలేక పోతున్నాడు) చంద్రుడు శూన్యమయినాడు. మార్తాండుడు ముక్కలు అవుతున్నాడు. అగ్ని అణిగిపోతోంది. పరమేష్ఠి (బ్రహ్మ) పరిసమాప్త మవుతున్నాడు. హరి (విష్ణువు) హరింపబడుచున్నాడు. భవుడు (శివుడు) అభావాన్ని చెందుతున్నాడు. వెనుక చెప్పిన మూడు రకముల కాలము గడువు తీరిపోతుంటే నియతి (అదృష్టము) లాగుకొని తీసికొని పోవుచుండగా, అనంతమయిన బాహ్యాకాశం లీనమగుచుండగా, మాబోంట్ల గతియేమి? అవాఙ్మనస గోచరమయిన పరమాత్మ తత్త్వముచే ఇవన్నీ తనయందలి మాయాశక్తి వల్ల ఇట్లు కనపరచబడుచున్నాయి. అహం అను అభిమానమును పొంది, సర్వాంతర్యామియై ఉన్న వానిచే బాధింపబడని వస్తువేదియు లోకంలో లేదు. సూర్యుడు ఏడుగుర్రాలతో రాళ్లమీదికీ, కొండలమీదికీ, దుర్గాల మీదికీ, తోలబడుతున్నాడు. సూర్యుడుకూడా ఆ పరమాత్మకు దాసుడయినాడు. సురాసురగణాలకు స్థానమయిన భూగోళము, జ్యోతిశ్చక్రముచే చుట్టబడుచున్నది. స్వర్గంలో దేవతలూ, భూలోకంలో మానవులూ, పాతాళంలో సర్పాలూ, ఇతని సంకల్పమాత్రంచే కల్పించబడుచున్నాయి. జీర్ణింపబడుచున్నాయి. మరియు, కాముడు, జగదీశ్వరుణ్ణి జయించి, దానిచే పరాక్రమశాలియై అక్రమంగా లోకాన్ని ఆక్ర

మించాడు. వసంతుడనే మదపుటేనుగు, మదవర్షమనే పూలవర్షంతో దిజ్మండలాన్ని పరిమళింపజేసి, చిత్తాన్ని చలింపచేస్తున్నాడు. అనురాగం చెందిన స్త్రీయొక్క నేత్రములవలె చంచలమయిన మనస్సును ఎంతటి వివేకమయినను, స్వాస్థపరచుటకు, (నిరోధించుటకు) చాలకున్నది. పరుల యొక్క బాధవల్ల పరితాపంచెంది, పరోపకార తలంపుగలిగి, ఆత్మనిష్ఠచే చల్లపడిన బుద్ధితో ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్న పురుషుడే సుఖి అని నేను తలుస్తాను. జీవితమనే సముద్రంలో కాలమనే బడబాగ్నిచే బాధపడుతూ, పుట్టుచూ, చచ్చుచూ ఉండే తరంగాలను లెక్కించడానికి ఎవడికి సాధ్య మవుతుంది. మానవులందరూ అవివేకమువలన దురాశలనే పాశాలను మెడకో వేసికొని, వెనుక చెప్పిన దోషాలనే పొదలలో ఉన్న లేళ్లవలె జన్మపరంపర అనే మైదానం (అడవి) లో విచ్చలవిడిగా తిరుగుతున్నారు. ప్రపంచంలో మానవులుచేసే దుష్కర్మలచేత ఆయుర్దాయం నశించి పోతూనే ఉంది. ఇలాంటి సంసారంలో వీళ్లు ఆశించే ఫలం (సుఖం) ఆకాశవృక్షానికి అంటుకున్నలత (తీగ) వంటిది. ఎంతటి విచారపరులు కూడా దీని తత్త్వాన్ని తెలిసికోలేక పోతున్నారు.

"ఈ రోజు పండుగ" "ఇది మంచిరోజు" "ఇప్పుడు ప్రయాణము కావలె" "వీళ్లు బంధువులు" "ఇది సుఖము" అని ఇలా వ్యర్థంగా అను కుంటూనే రాలిపోతోంది మానవానీకం.

## ౨౭ పదార్థానిత్యత్వము

మహాత్మా ! ఇంకొకటి చెపుతాను వినండి. ఈ జగత్తు ఆపాతతః (పైకి) రమ్యంగా ఉంటుంది. విచారిస్తే అసహ్యం వేస్తుంది. ఇందులో దేనిమీద చిత్తం తృప్తిపడదామని వాలుతుందో అది దీనికి దొరకనే దొరకదు.

బాల్యం ఆటలతో గడుస్తుంది. యౌవనం కళత్రవిచారణతో గడుస్తుంది. జరతో శరీరం జీర్ణమవుతుంది. ఇంక వీడు పొందేదేమిటి? పరితాపమేకదా మిగిలేది. ముసలితనం అనే మంచు పట్టిన శరీరం అనే తామరతీగను, విడచి, జీవితమనే తుమ్మెద క్షణంలో లేచిపోతే, మానవు

నకు సంసారమనే సరస్సు ఎండి పోయినట్లే- దేహాలత పాకానికి వచ్చిన కొలదీ మృత్యువునకు దీనిమీద ప్రేమ పెరుగుతుంది. తృష్ణానది ఉప్పొంగి సంతోష వృక్షముయొక్క వ్రేళ్లను పెళ్లగించును. శరీరనౌక సంసార సముద్రంలో తిరుగుతూ ఇంద్రియాలనే మొసళ్లచే తల్లక్రిందులవుతుంది, తృష్ణాటవిలో కామవృక్షాలమీద మనస్సు అనే కోతులు తిరుగుతూ ఉంటాయి. కాని ఒక్క పండుకూడా వీటికి దొరకదు. ఆపదలలో దుఃఖించ కుండా, సంపదలలో గర్వించకుండా, స్త్రీ లోలులు కాని మహానుభావులు లోకంలో దుర్లభులు. ఏనుగుల గుంపుతో క్రిక్కిరిసిన రణరంగాన్ని జయించినవారు శూరులుకారు. మనస్తరంగాలతో నిండిన దేహేంద్రియ సముద్రాన్ని దాటినవారు శూరులు. లోకంలో ఏపని చేసినా ఈ సము ద్రాన్ని తరించి విశ్రాంతిని పొందలేరు. కీర్తితో ప్రపంచాన్ని నింపించు వారుండరు. ప్రతాపంతో దిగ్విజయం చేయువారుండరు. ఐశ్వర్యంతో యాచకుల గృహాన్ని పూరించువారుండరు. మంచితనంతో (సాత్విక సంపత్తితో) డబ్బు సంపాదించువారుండరు. పాతాళలోకంలో దాగినా, కొండరాళ్లతో గోడలుకట్టి వజ్రాలతో కొంపకట్టుకుని అందులోకూర్చున్నా భాగ్యవంతునకు సంపదలు రాదగినవి రాకమానవు. ఆపదలు కూడనట్లే. కొడుకులు కోడండ్రు, భార్యలు బంధుగులు, అని ఈ చుట్టరికాలు మనః కల్పితాలు. ఎంతప్రేమించినా ఎంత రమ్యంగా ఉన్నా, తుదకు మరణ కాలంలో దుఃఖాన్నే ఇస్తాయి. విషలత ఎంతకోమలంగా ఉన్నా ముట్టు కుంటే వచ్చేదిమూర్ఛయే. ముసలితనంలో మరణం ఆసన్నం అయినపుడు సంకటస్థితిలో ఉండి దుఃఖిస్తూ తాను ఏమీ పుణ్యంచేయలేదని లోలోపల కుళ్లుతాడు మానవుడు. అర్థకామాలవల్లనే సర్వధర్మాలూ నెరవేరుతాయి. అని తలచి తనకుతోచినట్లు నడచి రోజులు గడుపుకొని చివరదశలో (మరణదశలో) నేను శాంతిని పొందాలి. అనుకుంటే ఏంలాభం? దైవ వశమున లభించిన కర్మఫలాలు ఎదురుగుండా ఉంటే అవి ఎంత అస్థిరములు అయినా వాటికి మోసపోతాడు ఎంతటివాడైనా పరిణామంలో అనర్థాలు ఇచ్చినా. "ఈ పనులు చెయ్యాలి, ఆ పనులు చెయ్యాలి," అని భార్యా బిడ్డలను తృప్తిపరచటానికి ప్రాకులాడుతూ ఉండగా, జరవచ్చి మీద పడుతుంది. అప్పుడు శరీరమూ సడలుతుంది. చిత్తమూ సడలుతుంది.

చెట్లకు ఎండిన ఆకులన్నీ ఒక్కమాటుగా రాలినట్లు, వివేకంలేని ప్రాణులందరూ కొద్దిరోజులలో ఒక్కమాటు కూలిపోతారు.

ఉన్న పగటికాలమంతా అటూ ఇటూ వృథాగా తిరిగి, సజ్జన సాంగత్యంలేక, సత్కర్మాచరణలేక, ప్రొద్దుకూకు సమయానికి కొంపచేరి, రాత్రి అంతా సుఖంగా నిద్రిస్తాడు. వీడు మూఢుడు కాకపోతే మరెవడు?

మానవుడు శత్రువులందరినీ నివారించుకొని, పూర్తిగా ఐశ్వర్యం సంపాదించుకొని, సుఖాలు సేవిద్దామనుకుంటూ ఉండగా మృత్యువు వచ్చి మీద పడుతుంది. మానవులు దీనిని కానరు. లోకంలో అందరు ప్రాణులు క్షణభంగురములయిన, ప్రాపంచిక విషయాలను అర్థంలేకుండా పెంచుకుని, వాటిలో పడి గిరగిరతిరుగుతూ, మృత్యువును గుర్తెరుగరు. మన కిష్టమయిన ప్రాణాలు మగమేకలు. వీటిని నీచకర్మలనే యూప స్తంభాలకు కట్టివేసినాము. వీటిని విషయాసక్తి చేతనూ, శరీరపోషణ చేతనూ బాగా పోషించాము, బలిశాయి. తుదకు రోగాలనే ఋత్విజులు వచ్చి సంజ్ఞపనమును (చంపుట) చేయుసరికి మృత్యువుయొక్క నోట్లోపడి ఎక్కడికి పోయారో తెలియవు. జీవకోటి ఎప్పుడూ శీఘ్రంగా వస్తుంది. శీఘ్రంగాపోతుంది. ఎక్కడనుంచి వస్తోందో ఎక్కడకుపోతోందో ఎవ్వడికీ తెలియదు. స్త్రీలు మగవారల ప్రాణాలు తీయుటకు విషలతలాంటివారలు మెత్తగా మనస్సును హరిస్తారు. మానవులకు కళత్ర మిత్ర పుత్రాది సాంగత్యము తెరణాలలో మానవుల సాంగత్యం వంటిది. దీపాలు స్నేహంతో (చముఱతో) వెలుగుచుంటాయి. ఇవి చంచలంగానూ ఉంటాయి. కొంతకాలం అచంచలంగానూ ఉంటాయి. చమురు అయిపోగానే చల్లారుతాయి. ఆపైని అందులో తత్వమేమో గోచరించదు. అలాగే అనురాగంతో పెరిగే ఈ సంసార పరంపరలలో తత్వమేమీ ఉండదు. వత్తి అంతా కాలుట, చమురు అంతా అయిపోవుట. దీపం (వెలుతురు) నశించుట ఇదేకదా దీపస్థలంలో అనుభవిస్తున్నాం. ఇక్కడా అంతే (స్నేహం) అనురాగం ఖర్చుపెట్టుకు టారు తుదకు అనురాగించే రిద్దరూ ఏమవుతారో తెలియదు. ఈ సంసార చక్రము వర్షకాలపు నీటిలోని బుడగలవలె అనిత్యమయినను, మానవులకు స్థిరబుద్ధి పుట్టిస్తుంది. శరత్కాలంలో కోమలములయి, మంచి పరిమళముగల పద్మాలు హేమంతములో

దై వికంగా చెడిపోయి ఆఘ్రాణించుటకు గూడ అక్కరకురావు. అలాగే యౌవనంలో ఉండే సౌందర్యాది గుణాలన్నీ దేహానికి వార్ధక్యం వచ్చేసరికి చెడిపోతాయి. పైగా శరీరం నమ్మటానికి సాధ్యం కాకుండా సందేహంలో పడుతుంది. చిత్తానికి ఏ మాత్రం స్వాస్థ్యం ఉండదు. వృక్షములు పత్రి పష్పఫలాది సమృద్ధితో బరువునుమోసి, మానవులవలన ఉపకారాన్ని అపేక్షించక, వాళ్ళకు నీడను, పూలను, పండ్లను ఇచ్చి ఉపకారం చేస్తు న్నాయి. అలాంటివాట్లనే మనము గొడ్డళ్లతో నరకుచున్నాం. ఇక సంసారంలో అడుగడుగునకు అపరాధం చేస్తూ ఉపకారం అనే మాటయే లేని మానవుని గతి ఏమి చెప్పాలి?

పైకి ఎంతకోమలంగా ఉన్నా, లోపల అన్నీ దోషాలు గల విష వృక్షాన్ని ముట్టుకుంటే, మూర్ఛరాక మానదు. అలాగే పైకి ఎంత ప్రేమతో ఉన్నా, లోలోపల స్నేహాన్ని, భోగాన్ని పెంచే బంధుజనం యొక్క సాంగత్యంవల్ల కలిగేది మూఢత్వమే. వివేకమబ్బదు. దోషాలు లేని సంసారమూ, దుఃఖంలేని దిక్కులూ, క్షణభంగురాలు కాని ప్రజలూ, కపటంలేని క్రియలూ, అసంభవం. మనబ్రతుకు మనదృష్టిలో మనకెంత క్షణికమో, బ్రహ్మ విష్ణు మహేశ్వరులయొక్క బ్రతుకుకూడా వారిదృష్టిలో అంత క్షణికమే. వారు కల్పాంతస్థాయులని మనమనుకొందుము. మన కది దీర్ఘకాలముగ గోచరించును. వారికి మాత్రము అది అత్యల్పకాలమే యగును. కాన ఇందులో కొందరు దీర్ఘకాలపు వారినియూ, కొందరు అల్పకాలపు వారనియూ అనుకొనవలసిన పనిలేదు. అంతటా కొండలన్నీ రాళ్లే, భూమి అంతా మట్టియే, చెట్లుకొయ్యలే, మనుష్యులు మాంస రూపులే, వీటికి భేదము పురుషబుద్ధి కల్పితం. నిజంలో ఇవన్నీ వాటి వాటికి కారణమయిన భూతములయొక్క వికారాన్ని పొందినవే. కావున వికారములే. వికారములన్నీ అసత్యములే. నిర్వికారమయిన ఆత్మవస్తువు ఒక్కటే లోకంలో సత్యం. నీరు, నిప్పు, గాలి, ఆకాశమూ, పృథివీ, ఈ పంచభూతాలే ఒకదానితో ఒకటి కలిసికొని, ప్రపంచంలో నిఖిల పదార్థాలుగా కనిపిస్తున్నాయి. ఇంతకంటే వేరే జగత్తనేదిలేదు. అవివే కులు దీనినేచేతనమని అనుకుంటున్నారు. ఇది మహాఅన్యాయం. ప్రపంచం అంతా ఇలా అసత్యమయినా, మానవుల చిత్తంలో, చమత్కారమయిన

భోగపరంపరలను ఇస్తూనే ఉంటుంది ఇది. ఇందులో ఆశ్చర్యం లేదు. మిథ్యాభూతమయిన వస్తువు, కలలో చమత్కారమయిన భోగాన్ని ఇచ్చుట అనుభవసిద్ధంగా ఉంది.

పూర్వవయస్సులో భోగతృష్ణతో కాలమంతా గడపినా, ఉత్తర వయస్సులో కూడా, ఏ మాత్రం లోభలవం ఉన్నా, సర్వోత్కృష్టమయిన పరమాత్మయొక్క విచారము బుద్ధి కెక్కదు. లోకం అంతా పూర్వ వయస్సులో, గొప్పగొప్పవారి పదవిని ఆక్రమించాలని ఆసించి, ప్రియ త్నిస్తూ, రాగలోభాదులతో చిత్తాన్ని, నాశనం చేసికొని, పతనం చెందు తోంది. ఎత్తుమీద ఉన్న జంతువు (మేక మొదలగునది) దిగువన గోతు లలో కనిపించే పచ్చనినాచు, తాను భక్షించు గరికయని భ్రమించి తిరిగినట్లు, శరీరపోషణకొఱకు మాత్రమే సంపదలను నాశనం చేసికొన్న మానవులు, అతిదుర్గమమయిన అడవిలోని గోతులలో మొలచి, నీడతోను ఆకులతోను పండ్లతోను నిండియున్న చెట్లవలె నిరర్థకులు. ఈ చెట్ల సంప దను అనుభవించే వారెవరు? ఆసంపదవలన మానవులు పొందిన ఫలమేమి? కొందరు మానవులు దయాదాక్షిణ్యాదులతో సుందరమయిన చిత్తభూము లలో విహరిస్తూ ఉంటారు. కొందరు కామక్రోధాదులతో కఠినమయిన చిత్తభూములలో విహరిస్తూఉంటారు. ఇంతకీ బ్రహ్మదేవుడు దుర్మార్గుడు. అతడు ప్రతిరోజూ భయంకరములై, పైకి రమ్యంగా కనపడుతూ, పరిణా మంలో కష్టాలిచ్చే పనులను ప్రారంభించాడు. వాటితో ప్రతివారి మనస్సు అసలు విషయాన్ని మరచి ప్రవర్తిస్తోంది. కాన జనులందరూ కామా సక్తులయినారు. కౌటిల్యంలో మంచి చతురులయినారు. కలలోగూడా సుజనుడు కనిపించడు. దుఃఖసంబంధము లేనిపనియే లోకంలో ఎంత వెదకినా గోచరించదు. ఇంక జీవితం లోకంలో ఎలా గడపాలో నాకర్థం కాకుండా ఉంది. అని అన్నాడు రాముడు.

## ౨౮ సర్వపదార్థముల వైపరీత్యము

మహాత్మా! చరాచరప్రపంచం అంతా అస్థిరంగా ఉంది. స్వప్న సమాగమం అయింది. ఎండిపోయిన సముద్రాలవలె ఉన్న గోతులన్నీ

తెల్లవారు సరికి, మేఘాలతో నిండిన కొండలవుతున్నాయి. చెట్లసముదాయంతో నిండి ఆకాశాన్ని అంటి ఉన్న అడవిభూములన్నీ కొద్దిరోజులలోనే, చదును (సమానము) అయిన నేలగా గాని, లోతయిన బావులుగాగాని మారిపోతున్నాయి. ఎవడి శరీరం ఈ రోజు పట్టువస్త్రాలతోను, పూల మాలలతోను, సుగంధ ద్రవ్యాలతోను. అలంకరితమయి ఉందో, అదే మరునాడు దిగంబరమై గోతులలో పొర్లాడుతోంది. ఈ రోజున విచిత్ర మయిన పట్ణాలుగా ఉన్న ప్రదేశాలన్నీ, కొద్దిరోజులలో, అరణ్యాలవు తున్నాయి. పరాక్రమంతో రాజ్యాలు ఏలువాడు మరునాటికి శ్మశా నంలో బూడిదఅయి ఉంటున్నాడు. అరణ్యాలతో నల్లగా నభోమండలాన్ని వ్యాపించిన ప్రదేశాలన్నీ, కొద్దికాలంలో పతాకాలతో విరాజిల్లెడి పట్టణాలు అయిపోతున్నాయి. లతామయమయిన ప్రదేశాలు మరుభూము లవుతున్నాయి. నీరు మెరకభూమిగాను, మెరక, నీటి ప్రదేశంగాను మారి పోతోంది. దిక్కులూ, తృణాలూ, ఉదకమూ, సమస్తం వైపరీత్యాన్ని చెందుతోంది. యౌవనమూ, బాల్యమూ, శరీరమూ, ద్రవ్యాలూ అన్నీ రూపాంతరాన్ని చెందుతున్నాయి. జీవితం గాలిలో చిన్న దీపం వంటి దయింది. పదార్థాలశోభ మెరుపువంటిది. పొలంలో చల్లిన విత్తనపు ధాన్యం నీటిలో తడిసి, ఉబ్బుట, విడియుట, మొలకరించుట, మొదలగు వైపరీత్యాన్ని చెందినట్లు భూతాలన్నీ చాలా వైపరీత్యాన్ని చెందు తున్నాయి. ఈ ప్రపంచస్థితి. ఒక ఆడంబరంగల నాట్యకర్త్రి అయింది. ఈమె మనస్సు అనే గాలికి ఎగిరెడి, ప్రాణులయొక్క రజోగుణరాశి అనే వస్త్రాన్ని ధరించి, ప్రాణులు నరకలోకంలో పడుట, స్వర్గాని కెగురుట, భూలోకంలో తిరుగుట అనే అభినయాన్ని సాగించింది. కడగంటిచూపుల వలె చంచలమయిన వ్యవహారాలతో గంధర్వనగరాది భ్రాంతులను పుట్టి స్తోంది. అతిబిత్తరిచూపులుచూస్తూ మహానాట్యలీలలు చేస్తూంది. వెనుకటి ఆసంతోష రోజులూ, ఆసంపదలూ, ఆపనులూ, అన్నీ స్మరణమార్గంలో నిలిచిపోయాయి. మనముకూడా క్షణంలో ఆ మార్గాన్ని చేరుతాము. ఇలా పుట్టుచూ చచ్చుచూ ఉండే ఈ పాపిష్ఠి సంసారానికి అంతు చిక్కుట లేదు. పశుపక్ష్యాదులు మనుష్యులవుతారు. మనుష్యులు పశువులవుతారు. దేవతలు మానవులవుతారు. ఇందులో ఏది స్థిరం? సూర్యుడు తన కిరణ

జాలంతో రాత్రింబవళ్లనుచేస్తూ కాలాన్ని గడుపుతూ, భూతకోటియొక్క నాశకాలాన్ని ఎదురు చూస్తున్నాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు కూడా నాశాన్ని అనుసరిస్తున్నారు. పంచభూతాలు నదులూ పర్వతాలూ, దిక్కులూ, అన్నీ వినాశమనే బడబాగ్నికి కట్టెలు. ధనములూ, బంధువులూ, భృత్యులూ, మిత్రులూ, రాజ్యాలూ, అన్నీ నశించేవి కదా అని భయపడే ప్రాణికోటికి నీరసాలు అయినాయి. ఇవన్నీ వినాశమనే దుష్ట రాక్షసుడు తలపుకు రానంతవరకే రుచిస్తాయి. క్షణకాలం భాగ్యవంతుడూ క్షణంలో దరిద్రుడూ, క్షణం ఆరోగ్యవంతుడూ, క్షణంలో రోగాలపుట్ట, ఇదీ ప్రాణికోటి పరిస్థితి. ఇలాంటి వైపరీత్యాన్ని పుట్టించే జగద్భ్రాంతిలో ఎవడు మోసపోలేదు? ఆకాశం క్షణకాలం అంధకారబంధురం. క్షణంలో బంగారపు పూతపూసినట్లు వెలుతురు, క్షణకాలం మేఘాలనే నల్లకలువలతో వ్యాప్తమవుతుంది. క్షణకాలం భేరీమోతలు. ఇంకో క్షణంలో మూగవాడిమాదిరి నిశ్శబ్దం. క్షణం నక్షత్రాలూ, క్షణం సూర్యుడూ, క్షణం చంద్రికా ప్రసారం, ఇంకోక్షణం ఏమీ లేకపోవడము. ఇంత అస్థిరమయిన ప్రపంచస్థితిలో ఎంతటి ధీరుడయినా ఎవడు భయపడడు? ఆపదలూ, సంపదలూ, జన్మమరణాలూ, అన్ని క్షణికాలే కదా? ఒకే రూపంతో సుస్థిరంగా ఉండేది ఇందులో ఒక్కటీలేదు. ఘటం పటమవుతుంది. పటము ఘటమవుతుంది. ఎలాగంటే పత్తిచేలో కుండపగిలితే దాని మట్టి క్రమంగా పత్తిచెట్టుద్వారా పత్తి అయి, క్రమంగా గుడ్డ అవుతుంది. అలాగే, గుడ్డకూడా కుండ అవుతుంది. ఇలా విపర్యాసాన్ని చెందని వస్తువే లేదు. ఈ సంసారంలో షడ్భావ వికారాలు రాత్రింబవళ్లవలె మారుతుంటాయి. పిరికివాడు శూరుణ్ణి చంపుతాడు. ఒక్కనిచేతులో నూర్గురు చస్తారు. ప్రాకృత జనులు ప్రభువులవుతారు. జనసమూహం ఈ వైపరీత్యాన్ని ఎప్పుడూ పొందుతూనే ఉంటుంది. శరీరంకూడా ఏకరూపంగా ఉండదు. కొద్దిరోజులు బాల్యం. ఆపైని యౌవనం. అటుపైన జర. ఆపైన మరణం. నిలకడ ఏది? ఇంక బాహ్యవస్తువుల స్థితి ఏమి చెప్పాలి? మనస్సు క్షణకాలం సంతోషిస్తూ ఉంటుంది. క్షణకాలం దుఃఖిస్తూ ఉంటుంది. క్షణకాలం సౌమ్యంగా ఉంటుంది. పిల్లవాడు ఆటలలో విసుకుచెందనట్లు, బ్రహ్మదేవుడు కూడా చిత్రవిచిత్రమయిన ఈ

సృష్టిలో విసుకు చెందదు. మానవులు భోగ్యవస్తువులను సంపాదించు కుంటారు. వాటిని తింటారు (అనుభవిస్తారు) ఆ రుచితో మళ్లీ అలాంటి వాటిని సంపాదిస్తారు. అలాగే బ్రహ్మకూడా భూతాలను పుట్టించేది. వాట్లను సంహరించేది. వాట్లతో మళ్లీ భూతాలను పుట్టించేది. ఇదీ ఇతనిపని. ఈ జగత్తులో అవిర్భావతి రోభావములచే అన్నీ మారుతూ ఉండున్నవేకాని, స్థిరంగా ఉండేది ఒక్కటీలేదు. సంసారంలో ఉండే ప్రాణి సమూహాలనే పండ్లు అన్నీ కాలంకొద్దీ పరిపాకంచెంది సంసారమనే చెట్టు నుంచి, కాలమనే గాలికి రాలిపోతూ ఉండేవేకాని స్థిరంగా ఉండేవికావు. దీనిమీద ఏమిటి మనకింత ఆదరం అని నాకు వైరస్యం కలిగింది. అన్నాడు రాముడు.

## ఇక సకల పదార్థముల యందును

(అనాదరమును ప్రతిపాదించుట)

విశ్వామిత్రా! నాకు అన్ని వస్తువులయందూ దోషదృష్టి కలిగింది. దేని మీదా, అనుభవిద్దామనే ఆశపుట్టుట లేదు. ఎండమావులు నీరు అనే ఆశ, మృగాలకు, మరుభూములందు కలుగునుగాని, నీరుగల సరోవరము లందు కలుగదు గదా? వేపచెట్లకు క్రమక్రమంగా చేదుసుదిరినట్లు నాకు సంసారపరిస్థితి రోజురోజూ క్రమంగా వెగటు వేస్తోంది. మానవుల చిత్తాలు ముళ్లచెట్లలాగ తయారైనాయి. దౌర్జన్యం పెరిగిపోతోంది. మంచితనం (సౌజన్యం) సన్నగిలుతోంది. ఎండిన మినపకాయ పగిలినట్లు లోకమర్యాద పగిలిపోతోంది. కాని మినపకాయ పగిలేటప్పుడు చప్పుడవుతుంది. లోక మర్యాద పగిలేటప్పుడు చప్పుడుండదు. ఇంతే తేడా. ఎప్పుడూ దిగులుతో కూడిన ఈ రాజ్యాలూ, భోగాలూ కంటే చీకూచింతా లేని ఏకాంతస్థితి మంచిదనుకుంటా. ఉద్యానాలూ, స్త్రీలూ, ధనమూ, సంతానమూ నాకేమీ ఆనందం ఇవ్వడంలేదు. మనశ్శాంతి మంచిదనిపిస్తోంది. లోకం అనిత్యం, ఆశ దొడ్డది. చిత్తం చపలం. ఇంక సుఖం ఎలా మానవుడుకి? లోకంలో చచ్చినా లాభం కనిపించడంలేదు. బ్రతికినా లాభం కనిపించ డంలేదు. ఎవడి నిజరూపంలో వాడుంటే లాభం కనిపిస్తోంది. ఈ రాజ్యా లూ, భోగాలూ, ధనాలూ, ప్రియత్నాలూ, అహంకారంవల్లనే కదా

ఏర్పడేది: నాకు ఆ అహంకారమే దిగజారి పోయింది. జన్మ పరంపర అనే తోలు తాళ్ళు ఇంద్రియాలు అనేవి గట్టిముడులు. ఆ ముడులు విచ్చుటకు ప్రయత్నించే మానవులే మొనగాళ్లు. కోమలమయిన కమలాన్ని ఏనుగు కాళ్లతో గట్టిగా తొక్కినట్లు, మన్మధుడు, మానవుల మనస్తత్వాన్ని మానినీలోకంచేత మధిస్తున్నాడు. ఇప్పుడే స్వచ్ఛమయిన బుద్ధితో దీనికి చికిత్సచేయకపోతే మళ్లీ ఈ చికిత్సకు సమయం దొరకటం కష్టం. లేతలో చెట్టు గోటితో తుంచటానికి సాధ్యం అవుతుంది. ముదిరితే గొడ్డలి కావలసి వస్తుంది.

విషయాలకూ విషానికీ తేడా విచారిస్తే విషంవిషంకాదనిపిస్తోంది. విషయాలే విషమనిపిస్తోంది. విషం ఒక్కజన్మలోని దేహాన్నే నాశనం చేస్తుంది. విషయాలు అనేక జన్మలలోని దేహాలను నాశనం చేస్తాయి, ఆత్మజ్ఞానం గలవానికి, సుఖదుఃఖాలూ, బంధుమిత్రులూ, జన్మ మరణాలూ బంధములు కావు. కావున మహాత్మా! నాకు ఆత్మజ్ఞానం కలిగి, సంసార దుఃఖం తొలగేటట్లు ఉపదేశించండి. అజ్ఞానమనే అడవిని నేను ఛేదించలేకున్నాను. ఈ అడవి వాసనా పుంజంతో చుట్టుకుంది. దుఃఖాలనే ముళ్లు క్రిక్కిరిసి ఉన్నాయి. స్వర్గనరకాలు, ఆపదసంపదలూ అనే మెరకపల్లాలతో నిండి ఉన్నవి. ఇందులో పడి నేను, విషయాశలచే, అంపకోతను అనుభవిస్తున్నాను. గాలి దుమ్మును ఎగరగొట్టినట్లు, ప్రవృత్తి నివృత్తి రూపవ్యవహారము నా చిత్తాన్ని కలవరపరుస్తోంది.

సంసారం అనేది ఒకహారం. ఇందులో ముత్యాలు జీవరాసులు, తృష్ణదారం. చిత్తంమధ్యమణి. దీన్నిమృత్యువనే పాముకు (విటునకు) అలంకారంగా వేశాడు బ్రహ్మ. నేను విరాగినై సింహాంవలను కొరికినచందంగా, దీన్ని తెంచిపారేశాను మెల్లగా. నా హృదయమనే అడవిలో ఉన్న అజ్ఞానమనే అంధకారాన్ని సుఖకరమైన విజ్ఞానమనే దీపంచే (సూర్యునిచే) పోగొట్టండి మహాత్మా?

మహానుభావుల సాంగత్యం కలిగితే నశించని దురాధులు (మనశ్చింతలు) ఉండవు. చంద్రుడు ఉదయించితే రాత్రికాలంలో చీకటి పోకుండునా?

ఆయుర్దాయము గాలికి కొట్టుకు పొయ్యే మేఘాలను అంటుకున్న నీటిచుక్కవంటిది. విషయభోగాలు, మేఘాలలో మెరిసే మెరుపుతీగలవలె చంచలములు. యౌవన వయస్సుకు సంబంధించిన చిత్తవినోదాలు, నీటి వేగమువలె అస్థిరాలు. కనుక నేను శాశ్వతమయిన శాంతికొరకు నా చిత్తం మీద నేను గట్టిముద్ర వేశాను స్వామీ?

## ౩౦ వైరాగ్య ఫలము

ఇలా అనేకానర్థాలతో నిండి నిబిడీకృతమయిన సంసారమనే పాడు బావిలో జీవులందరూ మునిగి ఉన్నారని తెలిసి నామనస్సు దిగులుచెందింది. నాకు మతి తిరిగిపోతోంది. ఆవేగం పెరుగుతోంది. ఎండిపోయిన చెట్ల ఆకులవలె అవయవాలు వణకుచున్నాయి. నామదికి సంతోషం లేక, ధైర్యం చిక్కక, "కాపాడలేని మొగడుదొరకిన ఆడపిల్ల అడవిలో భయపడినట్లు" భయపడుచున్నది. సారంగాలు (లేళ్లు) గడ్డిమొలచిన పాడుబావులలో పడబోయినట్లు, తుచ్ఛవిషయాలను ఆధారపరచుకొని, మనోవృత్తులు విక్షేపదుఃఖాలలో పడుతున్నాయి.

వివేకరహితమయిన చక్షురాదింద్రియములు. కష్టభూయిష్ఠమయిన సంసారమునందే స్థిరపడుతున్నాయి. పరమార్థవస్తువుమీదికి ప్రసరించడం లేదు. జీవుడనేభర్తయందు ఆయత్తమయిన మనశ్చింత, ఉపరతిని పొందుట లేదు. ఈప్సితమయిన విషయదేశాన్ని చేరడమున్నూ లేదు. పుట్టినింట నున్న ఆడుది భర్తమీద ఆశను చంపుకోనూ లేదు. పుట్టినింట తనకోరెను తీర్చుకోనూ లేదు. పుష్యమాసంలోని తీగలు, మంచుచే కొన్ని ఆకులను విడిచియూ, కొన్ని ఆకులను ధరించియూ, ఉన్నట్లు, నాచిత్తం విషయాలను విడిచి, వాటిమీద ఉండే ఆశను మాత్రం పట్టుకొని ఉంది. ఆత్మతత్వ నిర్ణయంలేని నామనస్సు, చీకటిలో చెట్టుకొట్టిన మొద్దువలె ఉన్నది. ఆ మొద్దు స్థాణుచోరసంశయాన్ని పుట్టిస్తుంది. అది నిజమా? ఇది నిజమా అనే సంశయం తత్త్వనిర్ణయం లేని మనస్సుకు కలుగుతుంది. చిత్తం స్వతస్సిద్ధంగా చంచలం. ఆపైన భోగవాసనలతో ప్రపంచం మీద పడింది. అందు విహరించటంచేత మరింత చాంచల్యం అలవాటయింది.

అలాంటి చిత్తం ఇప్పుడు దాని చాపల్యాన్ని విడవలేకుండా ఉంది. విమానాలమీద యెప్పుడూ తిరగడం అలవాటయిన దేవతలు విమానాలను విడవలేరు. కాబట్టి మహాత్మా! పరమార్థ సత్యమయిన వస్తువేది? జన్మ మరణాయాసాలులేని వస్తువేది? దేహాది ఉపాధి సంబంధంలేని దేది? భ్రాంతి స్థానమేది? మునులు దేని నాశ్రయించి సుఖించిరి? మావలె లౌకికాలౌకికవ్యవహారములందు ఆసక్తులయిన జనకాదులు ఎట్లుఉత్తములు అయినారు? శరీరాలకు తగులుకున్న సంసారమనే బురద మానవునికి అంటకుండా ఉండే విధమేది? మీరంతా విగతకల్మషులై ఎలా జీవన్ముక్తులయినారు? సంసార విషయాలనే సర్పాలు మంచిని కలిగిస్తాయనే నమ్మిక ఎలా? మోహమనే మదపుటేనుగుచే మర్దించబడే ప్రజ్ఞయనే సరస్సు నిర్మలం అవడం ఎలా?

ఈ సంసార ప్రవాహంలో తిరిగే మానవుడు, తామరాకుమీది నీటివలె బంధాన్ని పొందకుండా ఉండడం ఎలా? మానవుడు కామాది వృత్తులకు లొంగక, పరదుఃఖాలయందు తనవలెనూ, తనదుఃఖాలయందు గడ్డిపోచవలెను మనోవృత్తిని అలవరచుకోవడమెలా? ఏ మహాపురుషుడి ఆచారాన్ని ఆధారం చేసికొంటే మానవుడు సంసారదుఃఖంనుంచి గట్టెక్కుతాడు? ఈ పాపిష్ఠి సంసారంలో ఎలా ఉండాలి? మోక్షం ఉచితమా? కర్మోపాసనా ఫలం ఉచితమా? మహాత్మా! ఈ జగత్తుయొక్క ఆద్యంతములయందుండు వస్తువును గుర్తించేటట్లు నాకు ఉపదేశించండి. నా హృదయాకాశంలో ఉండే చంద్రునియొక్క మాలిన్యం పోయేటట్లు చెయ్యండి. చంచలమయిన చిత్తము విశ్రాంతిని పొందడం ఎలా? ఈ ప్రపంచంలో గ్రహించాలిసింది ఏది? పరిత్యజించాలిసింది ఏది? ఈ సంసారమనే విషూచీవ్యాధి యే మంత్రంతో నివారణ అవుతుందో సెలవివ్వండి? నేను ఏస్థితినిపొంది పరిపూర్ణుడనై మరలి దుఃఖించనో, తత్త్వజ్ఞులయిన మీరు నాకు అలా ఉపదేశం ఇయ్యండి. పరమానందపదవిని పొందనివాడి బ్రతుకు కుక్కబ్రతుకు. దానివల్ల ఏమీ లాభం లేదు.

## ౩౧ శ్రీరామ ప్రశ్న

విశ్వామిత్రా! ఆయుస్సు ఎత్తైన చెట్టు చివర ఆకుమీద వేళ్లాడే నీటి

చుక్కవంటిది. వరిచేలలో అరచే కప్పలయొక్క మెడలోని చర్మమువలె భంగురమయింది (నశ్వరమయింది) దేహం. బంధుమిత్రుల సమాగమం వలవలె చుట్టుకుంది. వాసనా పుంజం అనే గాలి విసిరికొట్టుతోంది. దురాశలనే మెరుపులు మెరుస్తున్నాయి. మోహం అనే మంచు మేఘాలు ఆవరించాయి. సంకల్పాలనే ఉరుములు ఉట్టిపడుతున్నాయి. లోభం అనే నెమిలి అకాండతాండవం చేస్తోంది. అనర్థాలు అనే కుటజద్రుమాలు (గిరిమల్లికా మొక్కలు) మహోద్యోపుగా, నేమళంగా పెరుగుతున్నాయి. దుర్మార్గుడయిన యముడు అనే పిల్లి, ప్రాణిసమూహం అనే ఎలుకల వెంటపడింది. ఎక్కడనుండో తెలియదు. హఠాత్తుగా వచ్చిపడుతోంది. ఏమి ఉపాయం? ఏమిటిగతి? ఏమి ఆలోచన? ఎవడు ఆధారం? దుఃఖం లేకుండా జీవితం అనే అడవిలో నుంచి బయటపడడం ఎలా? ఎంతటి వివేకులూ తుచ్ఛమయిన ఈ జీవితాన్ని రమ్యంగా గడిపినవాళ్లు లేరు. ఎప్పుడూ దుఃఖాలతో నిండి ఉన్న ఈ తగలబడ్డ సంసారం ఎవడికి మాత్రం ఎలా రుచిస్తుంది? వసంతఋతువుచే భూదేవత రమ్యంగా ఉన్నట్లు, పూర్ణ కాముడయితేనే సంసారం రుచిస్తుంది. ఇందులో ఉంటూ కామకలంకిత మయిన మనస్సును అహ్లాదపరచుకోవడం ఎలా? సంసారం అనే అడవిలో తిరగడం ఎలా? రాగద్వేషాలనే మహారోగాలబాధ తప్పించుకోవడం ఎలా? సంసారాగ్నిలో కాలకుండా జ్ఞానామృతం దొరికితే బాగుండును. సముద్రంలోపడిన చేపకు నీరులేకుండా స్థితి ఉండదు. సంసారసముద్రంలో పడినవానికి వ్యవహార క్రియలు లేకుండా ఉనికిలేదు. రాగద్వేషాలు, సుఖదుఃఖాలూ లేకుండా సంసారస్థితియే లేదు. శగలేకుండా నిప్పు మంట లుండవు. సంకల్ప వికల్పరూపమయిన మనస్సుకు తత్త్వబోధలేనిదే నాశం లేదు. ఉత్తముల చిత్తాలు మహా ప్రసన్నంగా ఉంటాయి. వాళ్లు ఏం పుణ్యాం చేశారు? మహాత్మా! మోహానివృత్తికలిగే మార్గం చెప్పండినాకు. ఒకవేళ అలాంటి యుక్తి లేకున్నా, ఉన్నదానిని యే మహానుభావుడూ నాకు చెప్పకున్నా, స్వయంగా నేను చిత్తవిశ్రాంతిని పొందలేకపోయినా! నేను అన్ని కోరికలూ విడచి, నిరహంకారాన్ని పొంది, భుజించను. నీరు తాగను. గుడ్డకట్టను స్నానదానాదులలో ఏపనీ చేయను. ఏ కార్యముల యందూ ప్రవర్తించను. శరీరత్యాగంకంటే వేరేమీ కోరను అన్నీ వదలు

కొని మౌనంగా ఉంటాను. క్రమంగా శ్వాసనిరోధం చేసికొని అనర్థ హేతువైన దేహాన్ని విడుస్తాను అని చెప్పి ఊరకున్నాడు శ్రీరాముడు.

## 32 నభశ్చర సాధువాదము

రాజీవపత్రాక్షుడు, రామరాజకుమారుడు, మోహాన్ని పోగొట్టే మాట చెప్పాడు. అందరూ ఆశ్చర్యపోయారు. నేత్రాలు విప్పారినవి. అందరికీ వైరాగ్యవాసనలు ఉదయించాయి. సంసార వాసనలు అడుగంటాయి. క్షణకాలం అందరూ ఆనందవారధిలో మునిగిపోయారు. ఈ మాటలను సభలో వసిష్ఠ విశ్వామిత్రాది మునులు విన్నారు. జయంతుడు, ధృష్టి మొదలగు మంత్రులు విన్నారు. దశరథాది రాజులు విన్నారు. సామంతరాజులూ, బ్రహ్మవేత్తలూ, బ్రాహ్మణులూ, భృత్యులూ విన్నారు. పంజరంలోని పక్షులు విన్నాయి. నడకచాలించి ఆటమృగాలు విన్నాయి. నెమరువేయుటమాని గుర్రాలు విన్నాయి. కిటికీలనుంచి కౌసల్య మొదలగువారు విన్నారు. చప్పుడు చేయకుండా ఇతర స్త్రీలు విన్నారు. తోటలోని పిట్టలూ, ఇండ్లగూళ్లలోని పిట్టలూ, రెక్కలు కొట్టుకోకుండా, అరవకుండా విన్నాయి. సిద్ధులూ, గంధర్వులూ, కిన్నరులూ, నారద వ్యాసాది మునులూ, విద్యాధరాదులూ విచిత్రమయిన శ్రీరాముని మాటలు విన్నారు. సాధువాదాలతో ఆకాశంనుంచి పూలవర్షం కురిసింది. ఆకాశానికి చాందినీవలె ఉన్నది. ఈ పూలవృష్టి నక్షత్రాల పరంపరవలె ఉంది. స్వర్గస్త్రీల నవ్వువలె ఉంది. వెన్నముద్దలవలె ఉంది. మంచువృష్టి వలె ఉంది. ముత్యాలరాశివలె ఉంది. చంద్రకిరణపంక్తి వలె ఉంది. పాల సముద్రతరంగాలవలె ఉంది. ఇలా పుష్పవృష్టి పడింది. సిద్ధగణముయొక్క మాటలను సభలోని వారంతా విన్నారు. శ్రీరాముని నోట యింతటి సంతోషజనకమైన మాటలు విన్నందుకు అంతా ఆనందించారు.

## 33 నభశ్చర మహీచర సంమేలనము

పరమపవిత్రమయిన శ్రీరాముని మాటలువిని, విశ్వామిత్రాది ఋషులు ఏం నిర్ణయిస్తారో విందామని, నారదుడు, వ్యాసులు పులహుడు

వగయిరామునులు తామరపూలుగల తీగమీదికి తుమ్మెదలు వాలినట్లు మహావేగంతో, దాశరధి సభకు వచ్చిపడ్డారు. ముందు వ్యాసులు చివర నారదులు వీరిద్దరికి నడుమ భృగువు అంగీరసుడు మున్నగు మునులూ ఉన్నారు ఈ సంఘంలో. నక్షత్ర మండలంలో మేఘంవలె ఉన్నాడు వ్యాసుడు. తారాపుంజంలో చంద్రుడువలె ఉన్నాడు నారదుడు. దేవత లలో దేవేంద్రుడువలె ఉన్నాడు పులస్త్యుడు. దేవులలో సూర్యదేవుడువలె ఉన్నాడు అంగీరసుడు. ఇలా సిద్ధపురుషులగుంపు ఆకాశం నుంచి వచ్చి పడుతోంది. చూచింది రామసభ. వెంటనే లేచింది. అంతట సభశ్చరులు మహీచరులు కలిశారు. దిక్కులు వెలిగిస్తున్నారు. ఆ ఋషులునద్ద ఋషి లాంఛనలు అన్నీ వున్నాయి. వసిష్ఠ విశ్వామిత్రులు యథాక్రమంగా వారిని పూజించారు. వారుకూడా వసిష్ఠ విశ్వామిత్రులను సాదరంగా గౌర వించారు. దశరథ మహారాజు ఆదరించి గౌరవించాడు. అందరూ కుశల ప్రశ్న చేసికొని యెవరి ఆసనమును వారు అలంకరించారు.

వారందరూ, పూలవర్షంతో, మంచిమాటలతో, శ్రీరాముని పూజించారు. రాజ్యలక్ష్మీ సమేతుడయిన శ్రీరాముడు సభామధ్యమున కూర్చున్నాడు. విశ్వామిత్ర వసిష్ఠ వామదేవాదులు ఆసనారూఢు లయ్యారు. నారద, దేవపుత్ర, వ్యాస, మరీచి, దుర్వాస, అంగిరస, క్రతు, పులస్త్య, పులహ, శరలోమ, వాత్స్యాయన, భరద్వాజ, వాల్మీకి, ఉద్దా లక, ఋచక, శర్యాతి. చ్యవనాది మహామునులు, వేదవేదాంగ పారగులు మహానాయకులందరూ సభాసదులయినారు. అపుడు నారదాదులు శ్రీరామునిగూర్చి. వసిష్ఠ విశ్వామిత్రులతో ఇట్లన్నారు.

సాంగాధ్యయన సంపన్నులగు మహామునులారా? శ్రీరాముడు చెప్పినమాట చాల గంభీరమయింది. వైరాగ్య రసముతో నిండి ఉంది. అర్థనిర్ణయం కలిగి ఉంది, తత్త్వబోధతో కూడి ఉంది. పండితసభకు తగి ఉంది. స్పష్టాక్షరములు కలది. గొప్పగొప్ప భావాలుగలది. హృదయా నందకరమయింది. ఆర్యులకు అనుకూలమయింది. చిత్తచాంచల్యాది దోష రహితమయింది. అర్థస్ఫుటమయింది. వ్యాకరణ శుద్ధమయిన పదములు గలది. హితవయినది. గ్రస్తాదిదోషరహితమూ సంతోషదాయకమూ,

అయి ఉంది. ఇలాంటి మాట ఎవరికి ఆశ్చర్యం కలిగించదు? ఇలాంటి మాటను నూటికొక్కడు మాట్లాడకలుగుతాడు. కుమారా? ఇలాంటిప్రజ్ఞ నీకే తగును. నీలాంటి ప్రజ్ఞాశాలియె, లోకంలో మగవాడని పించు కుంటాడు. రక్తమాంసాది భూయిష్ఠమయిన శరీరంమీద అభిమానం కల వాళ్లు చాలమంది ఉన్నారు. వారలలో చైతన్యం సున్న. ఉంటేవాళ్లు పురుషార్థంకొరకు ప్రయత్నించేవారే. మాయామోహితులయిన అలాంటి పశుప్రాయులు సంసారాన్ని విమర్శించరు. జన్మజరామరణాది దుఃఖాన్ని తరించలేరు. రాముడివలె పూర్వాపరమును విచారించే విమర్శనా జ్ఞానం గల వాడు నూటికొకడుంటాడు. తీయమామిడి చెట్లవలె, సర్వోత్కృష్ట మయిన ఫలాన్ని పొందే మహానుభావులు అరుదు. శ్రీరామునకు ఈ వయసునందు, చక్కని విమర్శనాజ్ఞానము, చమత్కారమయిన ఆత్మ వివేకమూ కలిగింది. సులభంగా ఎక్కడానికి వీలయినవీ, ఫలములూ పల్లవములూ గలవీ, సుందరమయిన చెట్లు దేశంలో చాలా చోట్ల మొలుస్తున్నాయి. కాని మంచిగంధపుచెట్లు అలా సులభంగా అంతటా పుట్టవు. అడవిలో కాచిపూచే చెట్లు చాలా ఉంటాయి. లవంగచెట్టు ఎక్కడా కనిపించదు. శ్రీరాముని బుద్ధి చమత్కారము, చంద్రుని చంద్రికవలె ఉంది. చెట్ల పూలగుత్తివలె ఉంది. పూవుల పరిమళ రేఖవలె ఉంది. ఈ దిక్కుమాలిన సంసారంలో సారం లాగటం మహాదుర్లభం. అలాంటి సారాన్ని పొందాలని ప్రయత్నించే కీర్తిశాలులు ధన్యులు. వారేలోకంలో గణ్యులు. రాముడితో సమానుడు లోకంలో ఎక్కడా లేడు. అంతటి వివేకవంతుడూ, అంతటి ఉదారభావుడూ, ఇంక పుట్టడని మా అభిప్రాయం.

సమస్తజనులకూ చమత్కారాన్ని కలిగించే శ్రీరాముని మనోరథాన్ని, మనము సదుపదేశముచే నెరవేర్చలేకపోతే, గట్టిగా మనమే దుర్బుద్ధులమని లోకంలో పేరు బడుదుము అని అన్నారు మునులు.

వైరాగ్య ప్రకరణం సమాప్తం.





# ముముక్షు వ్యవహార ప్రకరణము

## ౧వ సర్గ. శుక నిర్యాణము

నారదాదిమునులు చెప్పిన మాటలువిని విశ్వామిత్రుడు రామునితో ఇలా అన్నాడు.

రామచంద్రా ! నీవు అసలు విషయాన్ని గ్రహించావు. నీకు తెలిసికోవలసినది ఏమీ లేదు. సూక్ష్మబుద్ధి కలవాడవు. అంతా నీవే తెలిసికొన్నావు. నీ బుద్ధి సహజంగా నిర్మలమయిన అద్దంవంటిది. దాని మీది మకిలిపోగొట్టడమే యిప్పుడు కావాలి. అదియే మూపని. ఆప్తైన వ్యాసపుత్రుడయిన శుకుని బుద్ధివలె నీబుద్ధి విశ్రాంతిని పొందగలదు.

మహర్షీ ! శుకునిబుద్ధి ఆత్మతత్త్వమునందు మొదటఎందుకు విశ్రాంతి చెందలేదు? తర్వాత ఎలా విశ్రాంతి చెందినది?

రామచంద్రా! చెపుతావిను. శుకుని వృత్తాంతం అంతా నీవలెనే ఉంది. ఒకపుడు శుకుడు తండ్రిచెంత ఉండి, లోకయాత్రను గూర్చి విచారించుచుండగా, నీవలెనే ఆయనకుకూడా వివేకం కలిగింది. వివేకబుద్ధితో విచారించుకున్నాడు. నిజం తెలుసుకున్నాడు. అద్వితీయ చిన్మాత్రవస్తువును గ్రహించాడు. కాని ఆ వస్తువునందు అతనికి నమ్మిక చిక్కలేదు. చిత్తం నశ్వరమయిన భోగాలనుంచి తన చాపల్యాన్ని మాత్రం చాలించింది. మరొకపుడు తండ్రి (వ్యాసుడు) మేరుపర్వతం మీద ఏకాంతంగా ఉండగా శుకుడు దగ్గరకు చేరాడు. భక్తితో నిలిచాడు. "నాన్నా! ఈ సంసారాడంబరం ఎలా పుట్టింది? ఎలా నశిస్తుంది? ఇది దేహానికా? ఇంద్రియాలకా? మనస్సునకా? ప్రాణానికా? లేక వీటి సముదాయానికా? లేక నిర్వికార చిన్మాత్రమునకా?" అని అడిగాడు శుకుడు.

తండ్రి ఈ ప్రశ్నలకు చెప్పదగిన జవాబును చెప్పాడు. కాని శుకుడు తండ్రి చెప్పిన జవాబును మెచ్చుకోలేదు. ఇది నాకిదివరకే తెలుసులే అని అన్నాడు.

వ్యాసుడు శుకుని అభిప్రాయాన్ని గుర్తించి, కుమారా? నాకీవిషయం అంత బాగా తెలియదు. భూలోకంలో జనకమహారాజు ఈ విషయాన్ని బాగా గుర్తించాడు. ఆయన దగ్గరకు వెళ్లితే నీకు పూర్తి సమాధానం లభిస్తుంది. అని అన్నాడు శుకుడితో–

శుకుడు మేరుపర్వతంనుంచి, భూలోకానికిచేరి, విదేహనగరాన్ని (మిథిలను) ప్రవేశించాడు. ద్వారపాలకులద్వారా తన రాకను జనక మహారాజుకు తెలిపాడు. జనకుడు శుకునిబుద్ధి పరిశీలిద్దామని ఏడు రోజులు అలాగే ఉండనీ అన్నాడు. తర్వాత లోపలకు ప్రవేశపెట్టాడు. శుకుడు ఏడు రోజులూ అతిఉత్సాహంతో బయటనే నిలపడ్డాడు. తర్వాత అంతఃపురంలో ప్రవేశించాడు. అంతఃపుర స్త్రీలు అక్కడకూడా జనకమహారాజును కనపరచలేదు. జనకుడే అంతఃపుర స్త్రీలచే భోజనపదార్థాలను పంపి, వీటిని స్వీకరించేటంతవరకు మీకు రాజు కనిపించడని అనిపించాడు. అలా మరో ఏడు రోజులు గడచాయి. ఆ భోగపదార్థాలు ఏవీ శుకుని చిత్తాన్ని ఆకర్షించలేదు. పూర్ణచంద్రునివలె నిశ్చలమయిన చిత్తంతో ఉన్నాడు శుకుడు. జనకులు శుకునిచిత్తవృత్తిని పరిశీలించి, పూర్ణకాముడని తలంచి అతనికి నమస్కరించారు.

శుకా? నీవు నిఖిలపురుషార్థ సాధనాలనూ అనుష్ఠించావు. పొందదగిన ఆత్మానందాన్ని పొందావు. ఇంక నీకు కావలసిందేమి? కుశలమేనా? ఎందుకు వచ్చావు? అని అడిగాడు జనకమహారాజు.

మహారాజా! ఈ సంసారాడంబరం ఎలా పుట్టింది? ఎలా శాంతిస్తుంది? దీన్ని యథార్థంగా చెప్పండి. అని అడిగాడు శుకుడు.

వ్యాసులు చెప్పినట్లే చెప్పాడు జనకుడు కూడా?

జనకమహారాజా! నాకీవిషయం ఇదివరకే తెలుసు. నేను స్వయంగానే తెలిసికొన్నాను. నా తండ్రిని అడిగినా ఇలాగే చెప్పాడు. మీరూ

అదేమాదిరి చెప్పారు. ఇదే సమాధానం శాస్త్రాలలోకూడా కనిపిస్తోంది. ఈ సంసారాడంబరం కామకర్మవాసనాజాలంతో నిండిఉన్న మనస్సువల్ల పుట్టుతోంది. మనోనాశంవల్ల నశిస్తోంది. ఇందులో సారం ఏమీ లేదని నా నమ్మకం. ఇది నిజమా? కాదా? మీరు తేల్చి నిజం చెప్పండి. మీ సదుపదేశంవల్ల నేను ప్రపంచంలో తిరిగే చిత్తాన్ని విశ్రాంతి పరచుకో దలచాను. అని అన్నాడు శుకుడు.

శుకా! ఇందులో ఇంతకంటే వేరే నిర్ణయం లేదు. నీవు స్వయంగా తెలిసికొన్నావు. తండ్రివల్ల విన్నావు. అఖండ సచ్చిదానంద పరమాత్మ ఒక్కడే ఈ ప్రపంచంలో సత్యమయిన వస్తువు. మానవుడు తనసంకల్పంవల్ల తాను బద్ధుడవుతాడు. సంకల్పరాహిత్యంవల్ల ముక్తుడవుతాడు. కాన నీవు తెలిసికోతగిన ఆత్మతత్త్వాన్ని గట్టిగా తెలిసికున్నావు. భోగాలను విడనాడావు. దృశ్య ప్రపంచాన్ని మరచావు. పిల్లవాడవయినా నీబుద్ధి వైరాగ్యమార్గంలో ఉంది. ఇంక నీవు వినాలసిందేమి ఉంది? నీ తండ్రి (వ్యాసులు) సర్వజ్ఞానాలకు నిధి అయినా, గొప్ప తపస్సులో ఉన్నా, నీవలె ఆయన పూర్ణజ్ఞాని కాలేదు. తండ్రిని మించిన కొడుకు అయినావు నీవు. భోగేచ్ఛను విడనాడుటలో నన్ను మించావు నీవు. పరిపూర్ణ బ్రహ్మను పొందావు. కనుక నీవు ఇంక ప్రపంచంలో పడవు. ముక్తుడవయినావు. సందేహం లేదు. అని అన్నాడు జనకుడు. శుకుడు మౌనంతో పరమాత్మ వస్తువులో నిలిచిపోయాడు. సంసారభయాన్ని వదిలాడు. నిరీహుడయి నాడు. సందేహాలన్నీ పటాపంచలయ్యాయి. సమాధికోసం సురల మేరు శిఖరానికి చేరాడు. అక్కడ పదివేల సంవత్సరాలు నిర్వికల్ప సమాధిలో ఉన్నాడు.

గమనిక:— గురూ! త్రేతాయుగంలో కదా రామావతారం. అప్పుడు రామునితో మాట్లాడుతూ, విశ్వామిత్రుడు. వ్యాస శుకుల వృత్తాంతం తెస్తాడేమిటి? వ్యాసునిజన్మ ద్వాపారంలో కదా? త్రేతలో వ్యాసులు జన్మించనేలేదే? ఇది ఎలా కుదురుతుంది?

శిష్యా! ఇదా నీ సందేహం. రామావతారం, త్రేతాయుగం వ్యాసావతారం, ద్వాపారం, ఇది నిజమే. కాని ఒక కల్పంలో ఎన్నో

త్రేతాయుగాలు, ఎన్నో ద్వాపరాలు గడుస్తాయి. ఎంతమందో వ్యాసులు అవతరిస్తారు. కాబట్టి, లోగడ ద్వాపరంలో ఉన్న వ్యాస శుకుల వృత్తాంతం కాని విశ్వామిత్రుడు ముచ్చటించింది. రాబోయే ద్వాపరంలోని వ్యాసుల వృత్తాంతం కాదు. అని ఇక్కడ సమాధానం.

## ౨ విశ్వామిత్ర వాక్యం

శ్రీరామా! వ్యాసపుత్రుడికి, బుద్ధి మలమును తుడిచి వేయుట ఎంతవరకు ఉపయోగించిందో, నీకు కూడా అంతే ఉపయోగపడుతుంది.

వ్యాసాది మునిపుంగవులారా! శ్రీ రాముడు ఆత్మతత్త్వాన్ని పూర్తిగా గుర్తించాడు. ఇతనికి భోగపదార్థాలు ఏ మాత్రం రుచించడం లేదు. ఆత్మతత్త్వాన్ని గుర్తించినందుకు ఇదియే నిదర్శనం. భోగవాసనలచే సంసార బంధం పెరుగుతుంది. దృఢపడుతుంది. భోగవాసనలు తగ్గిన కొలది బంధం తగ్గుతూ ఉంటుంది. వాసనాక్షయమే మోక్షం. వాసనా దార్ఢ్యం బంధం. మానవులకు ఆత్మతత్త్వాన్ని గురించిన ఆ పాతజ్ఞానం (సామాన్యజ్ఞానం) సాధారణంగా కలుగుతుంది. కాని విషయాలమీద వైరాగ్యం మాత్రం ఎంత తన్నుకున్నా కుదరటం కష్టం. వైరాగ్య పూర్వకముగ ఆత్మతత్త్వమును తెలిసికొన్నవాడే పండితుడు. ఇలాంటి వాడికి భోగాలు ఎంత బలవంతపెట్టినా రుచించవు. లాభ పూజా ఖ్యాతులను ఉపేక్షించక, సహజంగా విషయాలమీద వైరాగ్యం పొందినవాడే జీవన్ముక్తుడు. తత్త్వం తెలిసేటంతవరకు విషయాలమీద వైరాగ్యం కలగదు. నేలలో ఉప్పు చవుడున్నంతవరకు అక్కడ మొక్క మొలవదు. మొలిచినా బ్రతకదు. బ్రతికినా ఏపుగారాదు. కనుక, శ్రీరామునకు భోగపదార్థాలు ఎంత మాత్రం రుచించనందువల్ల, ఇతడు ఆత్మతత్త్వాన్ని తెలిసికొన్నాడని మీరు నమ్మండి. తాను గ్రహించిన వస్తువు సత్యమని పెద్దలవల్ల విన్నాడా రాముని చిత్తం విశ్రాంతిని పొందగలదు. రాముడిప్పుడు కైవల్య మాత్రమునే కోరుచున్నాడు. అందుకు తగినయుక్తిని వసిష్ఠుడుపదేశించాలి. వసిష్ఠుడు రఘువంశ రాజులకు కులగురువు. సర్వజ్ఞుడు సర్వసాక్షి. త్రికాలజ్ఞుడు.

వసిష్ఠా! "నిషదాద్రియొక్క చరియమీద, మునుల సాన్నిధ్యంలో, మనయిద్దరి విరోధం పోవాలనీ, బుద్ధిమంతులకు శ్రేయస్సు కలగాలనీ, బ్రహ్మదేవుడు మనకు ఉపదేశించిన జ్ఞానం నీకు జ్ఞాపకం ఉందా?" జ్ఞానం సంసార వాసనను రూపుమాపుతుంది. నిజము. దానినే, సుశిష్యుడయిన శ్రీరామునకు నీవు ఉపదేశించు. ఇందులో "ఫలం కొస్తి ప్రయాసమొందు" అని భయపడవలసిన పనిలేదు. రాముడు గతకల్మషుడు. నిర్మలమయిన అద్దంలో ముఖం సులువుగా ప్రతిబింబిస్తుంది, విరాగంగల సచ్ఛిష్యుడికి ఉపదేశించిందే జ్ఞానం. అదే శాస్త్రార్థం. వేదాంతిత్వం. వైరాగ్యంలేని చెడు శిష్యుడికి ఉపదేశించిన జ్ఞానం కుక్కతోలులో పోసిన ఆవు పాలవలె అపవిత్రమవుతుంది. నీలాంటి వీతరాగులు చెప్పిన తత్త్వం మీదనే బుద్ధి విశ్రాంతిని చెందుతుంది." అని విశ్వామిత్రుడు అనే సరికి, వ్యాస నారదాదులందరూ, బలే బలే అని మెచ్చుకొన్నారు.

పిదప విశ్వామిత్రుని చెంత ఉన్న వసిష్ఠ మహాముని, నిర్విఘ్నంగా ఉపదేశిస్తానని అంగీకరించాడు. సత్పురుషుల మాటలను ఉల్లంఘించుట తగదన్నాడు, నిషధాద్రియందు బ్రహ్మదేవుడు ఉపదేశించిన విషయం జ్ఞాపకం ఉందన్నాడు. ఆ జ్ఞానం శ్రీరామాదుల కుపదేశించి వాళ్ల అజ్ఞానాంధకారాన్ని పోగొడతానన్నాడు. వసిష్ఠుడు.

## 3 సర్గాను వర్ణనము

రామచంద్రా! సృష్టి ప్రారంభంలో, సంసార దుఃఖశాంతికొరకు, బ్రహ్మదేవుడు (పద్మజన్ముడు) చెప్పిన దానిని నేను నీకు చెపుతాను విను.

వసిష్ఠమహర్షీ! తమరు చెప్పబోయే మోక్షగాథ చాలా పెద్దది. అది ఇప్పుడు తేలదు. ఇప్పుడు నాకొక చిన్న సంశయం కలిగింది దీన్ని తీర్చండి ముందు. తర్వాత దాని విషయం చూతురుగాని. "శుకుడి తండ్రి గురువూ అయిన వ్యాసుడు, సర్వజ్ఞుడూ. వివేకశాలీ అని వింటాం. అతడు విదేహ ముక్తుడు కాలేదట అతని కుమారుడయిన శుకుడు విదేహముక్తుడయ్యాడట. ఏం కారణం?" అని అన్నాడు శ్రీరాముడు. ఆలోచించాడు వసిష్ఠుడు. "వ్యాసులు జీవన్ముక్తుడని జవాబు చెప్పాలనుకున్నాడు.

జీవన్ముక్తియందు రాముడికి నమ్మకం ఉందో లేదో అని సందేహించాము. అక్కడ నమ్మకం కలిగితే కాని ఈ ప్రశ్నకు జవాబు తేలదనుకున్నాడు. బంధంయొక్క స్వరూపం చెపితే కాని జీవన్ముక్తి లక్షణం బయటపడదని ఊహించాడు. సృష్టి క్రమం చెప్పుట ప్రారంభించాడు.

శ్రీరామచంద్రా! పరమాత్మ అనే చిత్ప్రకాశలో పూర్వం లీనమయిన అనంతకోటి బ్రహ్మాండాలు అనేకత్యణుకాలు, లెక్కించనలవికావు.

ఇప్పుడు జరుగుచున్న బ్రహ్మాండాలను కూడా లెక్కించలేము. పరమాత్మ అనే సముద్రంలో ఇకముందురానున్న ప్రపంచ తరంగాలను లెక్కించటం అసలేసున్న అని అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! కడచిన బ్రహ్మాండాలనూ రానున్న బ్రహ్మాండాలనూ గురించి విచారించడం ఉచితమే. వర్తమాన బ్రహ్మాండాలను గురించి విచారణ అనవసరం. వీటికి భూతకాలం, భవిష్యత్కాలం అనే రెండు గట్లు ఉన్నాయి. ఈ మధ్య ఉండే వర్తమాన బ్రహ్మాండాలు ఆ రెంటికంటే తక్కువ సంఖ్యగలవి అని తెలుస్తూనే ఉంది. ఇంకా వీటినిగూర్చి విచారణ ఎందుకు? అన్నాడు మధ్యలో శ్రీరాముడు.

తన అభిప్రాయాన్ని రాముడు గ్రహించాడని ఉత్సాహపడ్డాడు వసిష్ఠుడు. సృష్టిక్రమాన్ని చెప్పటం మొదలుపెట్టాడు.

రామచంద్రా! పశుపక్ష్యాదులలోనూ, మనుష్యులలోనూ, దేవతలలోనూ, ఎవడు ఎచ్చట ఎప్పుడు మరణించుచున్నాడో, వాడు (ఆప్రత్యగాత్మ) అక్కడనే అప్పుడే ముల్లోకాలను చూచుచున్నాడు. మరోచోట కాని క్షణంసేపు ఆలస్యంగాకాని చూడడంలేదు.

యథార్థంలో చిదాకాశస్వరూపుడయిన పరమాత్మ వాసనామయమయిన సూక్ష్మశరీరంతో, దహరా (హృదయా) కాశమందు వాసనామయం అయిన జగత్త్రయమును క్రమంగా పొందుతూ ఉంటాడు.
ఇలాగే ప్రతిప్రాణీ తనచిత్తంలో ఉన్న వాసనలకు (సంస్కారాలకు) అనుకూలంగా జన్మ ఎత్తి మరణిస్తూ ఉంటుంది. " సింహోవాప్యాఘ్రోవా యద్యద్భవంతి తదాభవంతి " అను శ్రుతి ఇదే విషయాన్ని చెపుతోంది.

చచ్చినవారూ. చస్తున్నవారూ, చావబోవువారూ, తమతమ కర్మవాసనా పరిపాకాన్ని అనుసరించి, వేరువేరుగ మనుష్య పశుపక్ష్యాది యోనిభేదముచే ప్రకాశించెడి భూతాలనే పొందుచుందురు. కనుక ఈ ప్రపంచం కేవలం సంకల్పంవల్ల తయారవుతోంది. మనోరాజ్యం, ఇంద్ర జాలం. కథలో చెప్పుకున్న విషయం వంటిది. పైత్యవాతరోగికి కనిపించిన భూకంపం వంటిది. పిల్లవాణ్ణి భయపెట్టడానికి కల్పించిన పిశాచంవంటిది. నిర్మలమయిన ఆకాశంలో నక్షత్రాలను ముత్యాలనుకున్నట్లున్నది. తాను పడవలో ప్రయాణం చేస్తుంటే ఒడ్డునవున్న చెట్లు ప్రయాణంచేస్తున్నాయి అని తోచినట్లు. కలలోకన్నపట్నము. తలపుకువచ్చిన ఆకాశపుష్పము.

ఇలాంటి ప్రపంచాన్ని చచ్చినవాడూ, పుట్టినవాడూ, తనచిత్తంలో అనుభవిస్తున్నాడు. ఇది సూక్ష్మ ప్రపంచం. దీనియందు చిరపరిచయం కలిగేటప్పటికి, పంచీకరణంచేత, దృఢపడి స్థూలం అవుతోంది. ఇహ లోకం. పరలోకం అనే వ్యవహారాన్ని పొందుతోంది. పుట్టిన తర్వాత చచ్చేలోపుగా కర్మలుచేసి, వానివల్ల పరలోకాన్ని తయారుచేసికొంటాడు మానవుడు (కల్పించుకుంటాడు) ఆవాసనలలోనే మరికొన్ని పురుష దేహాలు. పశుపక్ష్యాది దేహాలు. వాటిలో మరికొన్ని వాసనలు, వాటిలో మరికొన్ని దేహాలు. ఇలా, అరటిస్తంభంలోని మట్టలవలె సంసారంలో, తోస్తూ ఉంటాయి. నిజంలో చచ్చిన వాళ్లకుగాని, బ్రతికి ఉన్న వాళ్లకుగాని పంచభూతాలూ సృష్టిక్రమాలూ ఏమీ లేవు. అయినా ప్రపంచభ్రాంతి తప్పటం లేదు. అనాది సిద్ధమయిన అవిద్యయే ఈ నాటకాన్ని నడుపు తోంది. పరమాత్మ అనే మహాసముద్రంలో, సృష్టి ప్రళయాలనే తరం గాలు మాటిమాటికి బయలుదేరుతున్నాయి. అందులో కొన్ని కులము లోను, మనస్సులోను, గుణములోను, క్రమములోను, సాదృశ్యంకలవి (పోలికకలవి) గా ఉంటాయి. మరికొన్ని, కొన్ని అంశాలలో పోలిక ఉండి మరికొన్ని అంశాలలో పోలిక ఉన్నట్లు కనిపించవు. మరికొన్ని పూర్తిగా విలక్షణంగా ఉంటాయి.

సృష్టి ప్రవాహంలో ఈ వ్యాసమహాముని మూడవ్వ వెంట్లో వాడు అని, పురాణభారతాది నిర్మాణమునుబట్టీ, శాస్త్రజ్ఞానమునుబట్టీ, బ్రహ్మ

విద్యనుబట్టీ నేను ఊహిస్తాను. అందులో, పన్నెండుగురు మాత్రం బుద్ధిలో తేడాగాను, కులంలోను, ఆకారంలోను, ఆధికారిక చేష్టలలోను సమానంగానూ ఉంటారు.

పదిమంది అందరూ అన్నిటా సమానంగా ఉంటారు. మిగిలినవారు కులంలో కూడా తేడాగా ఉంటారు. ఇప్పుడుకూడ వ్యాస వాల్మీకాదులు, మరికొంతమంది అవతరించగలరు. భృగ్వంగిరాది ఋషులుకూడ అనేక మంది, వెనుకటివలెనూ, విలక్షణంగానూ, పుటతారు మానవులు, దేవతలు, ఋషులు వేరువేరుగా పుటుతూ ఉంటారు. చస్తూఉంటారు. బ్రహ్మకల్పంలో 72 త్రేతాయుగాలు, అందులో కొన్ని గడచాయి. ఇప్పుడు కొన్నిజరుగుచున్నాయి. ముందు కొన్ని జరుగనున్నాయి. ఇవి కొన్ని సమానంగా ఉంటాయి. కొన్ని విలక్షణంగా ఉంటాయి. నీవు, నేను, కూడా అంతే. ఇదంతా నాకు తెలుసు. క్రమంగా ఈ వ్యాసమహామునికి ఇది పదో అవతారం మేమందరం ఇదివరలో అనేకసారులు పుట్టాము. ఇంకా అనేకసారులు పుటతాము. మేము సమానంగానూ పుట్టవచ్చును. ఈవ్యాసుడు ఇంకా యెనిమిదిసారులు భారతం రచిస్తాడు. వేద విభాగంచేస్తాడు. కులానికి ఖ్యాతిని తెస్తాడు. హిరణ్యగర్భుని అధికారాన్ని పొందుతాడు. తరువాత విదేహాకైవల్యాన్ని పొందుతాడు. ఇప్పుడు మాత్రం శోకభయాలు విడచి, అహంమమాభిమానాలు చంపుకొని, జితమనస్కుడై జీవన్ముక్తుడుగా ఉన్నాడు. విత్తంలోనూ, బంధుత్వంలోనూ, వయస్సులోనూ, కర్మలలోనూ, విద్యలలోనూ, విజ్ఞానంలోనూ, క్రియలలోనూ, భూతాలు, కొన్ని యుగాలలో కొందరు సమానంగా ఉంటారు. కొన్ని ప్రతి సృష్టిలోను అనేక మార్పులు పుటుతూ ఉంటాయి. కొన్ని ఎంత కాలమైనా పుట్టవు. లయించి ఉంటాయి. ఎప్పటకీ ఈ మాయకు చావులేదు. ప్రాణిసమూహంలో అనేక రకాల మార్పులు తెచి పెటుతూ ఉంటుంది మాయ. ధాన్యరాశిని మాటిమాటికి కొలచిన కొలది ఆ కొలత పాత్రలోని గింజలు తమ పూర్వక్రమానికి మారుప చెందుతూనే ఉంటాయి. ఇదే చందం ప్రాణి సమూహంలో కూడా. కనుక శ్రీరామా! కాల సముద్రంలో సర్గాకారమయిన తరంగాలు. ఒకే

క్రిమంలో కాని, క్రమాన్ని మార్పు చెందిగాని మాటిమాటికి బయలు దేరుతూనే ఉంటాయి.

కాన నిరావరణ చైతన్య రూపుడైన విద్వాంసుడు, యోగబలం వల్ల ఆధికారిక శరీరాలు ధరించి ఉన్నా వాని ముక్తికి భంగం లేదు. వాడు జీవన్ముక్తుడనిపించుకుంటాడు. జీవన్ముక్తియే జ్ఞానమునకు ఫలం. వ్యాసుడు జీవన్ముక్తుడై ఆధికారిక పురుషుడుగా ఉన్నాడు. ఇలాంటి ఆధి కారికుడు సృష్టికొకడు అవసరం. అందువల్ల వ్యాసులు విదేహకైవ ల్యాన్ని పొందలేదు. ఈ అధికారం లేనందున శుకులు విదేహకైవ ల్యాన్ని పొందారు.

## ౪ పురుష ప్రయత్న నిరూపణము

రామచంద్రా! నిత్యముక్త స్వభావుడయిన ఆత్మను, అజ్ఞానము ఆవరించడమే బంధం: జ్ఞానము చేత దాని నాశమే మోక్షం. అజ్ఞానం పోయిన తరువాత కనిపించే వ్యవహారం ఏనోదం అవుతుంది కాని అనర్థం కాదు.

సముద్రంలోని నీరు నిశ్చలంగా ఉన్నా తరంగ రూపంలో కదు లుతూఉన్నా అదినీరే. నీటి యొక్క ధర్మానికి తేడా లేదు. అలాగేవిదేహ మునికీ, దేహంతో కూడి ఉన్న మునికీ, ముక్తిలో తేడా లేదు. ఈ ఇద్ద రికీ స్వ స్వరూపంతో ఉండడం అనేది సమానం ముక్తి విషయాధీన మయ్యింది కాదు. విషయాధీనమయితే విషయ భేదాన్ని బట్టి ముక్తి కూడ భిన్నమయ్యేది. సంసార భోగాలయందు భోక్తృత్వాభిమానం లేనివానికి భోజ్యానుభవాలు ఉండవు. కాబట్టి జీవన్ముక్తుడయిన వ్యాసమహాము నిని మనము శరీరముగలవానినిగా చూస్తున్నాం. అతని మనస్సులో ఉండే విదేహత్వ నిశ్చయాన్ని మనం గుర్తించడం లేదు. అతడు మాత్రం తన మనస్సులో విదేహముక్తుడుగానే ఉంటున్నాడు.

సదేహముక్తికీ విదేహముక్తికీ భేదమేమి? ఏ నీరు తరంగ రూపంలో పైకి లేస్తున్నదో అదే నీరు నిశ్చలంగా వున్నప్పుడున్నూ ఉంది

ఒకవేళ ఆనీటిలో తరంగదశలో చలనమూ సామ్యావస్థలో చలనాభావ మూ భేదముందని అనుకున్నా అది గాలిదికాని, నీటిదికాదు. అలాగే మోక్షకూడ సదేహముక్తి, విదేహముక్తి అనేది అజ్ఞానకల్పితంకాని నిజం కాదు. అందరియందూ అభిన్నంగాఉండే ఆత్మైకత్వమే పరమార్థం. అదే జ్ఞానఫలం. అది సిద్ధించిన తరువాత దేహమువలనకలిగే అనర్థమేమీ ఉండదు.

ప్రస్తుతం నీకు తత్త్వజ్ఞానం ఉపదేశిస్తాను. చెవులకు ఇంపుగా ఉం టుంది. అజ్ఞానాంధకారం ఎగిరిపోతుంది.

రామచంద్రా? లోకంలో ఉపాయం ఎరిగిచేసే పురుష ప్రయత్నం వల్ల అందరికీ అన్నీలభిస్తాయి. చల్లతనంకాని, ఆనందంకాని చంద్రునివల్ల నే కలుగుతుంది. అలాగే చిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి కలిగితే, జీవన్ముక్తి సుఖం గా లభిస్తుంది. ఇదంతా పురుష ప్రయత్నంవల్లనే లభిస్తుంది. వేరే విధంగా లభించదు. పురుష ప్రయత్నమే లోకంలో ప్రత్యక్షంగా ఫలమిస్తోంది. దైవంఅనేది అజ్ఞానులచే కల్పింపబడేదిగాని మరేమీలేదు. సత్పురుషులు చెప్పిన మార్గాన, మనోవాక్కాయ కర్మలు పనిచేయుటయే పౌరుషము. అదే ఫలిస్తుంది. మిగిలినదంతా పిచ్చివాడి పని.

ఎవడు దేనిని కోరుతాడో, వాడు దాని కొరకు ప్రయత్నిస్తాడు. తప్పకుండా దాన్ని పొందుతాడు. పొందలేకపోతే ప్రయత్నంనుంచి విరమిస్తాడు. ఒకానొక ప్రాణి పురుష ప్రయత్నం చేతనే త్రిలోకాధి పత్యాన్ని పొందాడు. దీని చేతనే పద్మగర్భుడు బ్రహ్మ అయ్యాడు. గరుడధ్వజుడు పురుషోత్తముడయినాడు, దీని చేతనే శంకరుడు అర్ధనారీ శ్వరుడై కైలాసాధిపత్యం వహించాడు.

పౌరుషం, ఇప్పటిదీ, వెనుకటిదీ అని రెండు రకాలు. ఇప్పటి పౌరుషం చేత వెనుకటి పౌరుషము జయింపబడుతుంది.

ప్రయత్నం గట్టిగాచేసి, ప్రజ్ఞోత్సాహములుండి అభ్యాసం చిర కాలం చేస్తే మేరు పర్వతాలు కూడా మ్రింగి వేయవచ్చు.

శాస్త్ర నియంత్రితమయిన పౌరుషం వల్ల పురుషుడు నిఖిలార్థా లను సాధించుకుంటున్నాడు. శాస్త్ర నియంత్రింతం కాకపోతే అన్ని

అనర్థాలూ పొందుతున్నాడు. శాస్త్రీయమయిన ప్రయత్నము తక్కువై నపుడు ఒక్క నీటి బిందువు కూడ గొప్ప అనిపిస్తుంది. అది యెక్కువై నపుడు చతు సముద్ర పరీతమయిన పృథివికూడ తక్కువ అనిపిస్తుంది.

కనుక రామా! లోకంలో సర్వము పౌరుష సాధ్యమేకాని, దైవ సాధ్యం ఏమీలేదు. దైవం అనగా ప్రాక్తన జన్మ యందలి పౌరుషమే కాని వేరుగాదు.

కాని కాలంలో పుడిసెడు నీళ్లు కూడా దుర్లభం కనుక గొప్ప అనిపిస్తుంది, మంచి కాలంలో సప్త ద్వీపములుగల భూమి అయినా లెక్కకురాదు.

## ౫ పౌరుషమును బలపరచుట

శాస్త్రాన్ని అనుసరించి నడచేవాళ్లకు ఏ పురుషార్థాన్ని సాధించా లన్నా ప్రవృత్తి మార్గమే శరణ్యం. నీల పీతాది వర్ణములు స్పష్టపడా లంటే, వాటి కాంతియే సాధనం. మనస్సుచే ఒకదానిని కోరి శాస్త్రీయ మయిన పనిచే దానిని సాధించకపోతే, అది సిద్ధించదు. ఆవాంఛ పిచ్చి వాడి వాంఛ అవుతుంది. ఎవడు ఎంతవరకు ప్రయత్నిస్తే వాడు అంత వరకు ఫలం పొందుతాడు, శాస్త్రీయమయిన ప్రయత్నానికి శాస్త్రీయ మయిన ఫలం. అశాస్త్రీయమయిన ప్రయత్నానికి అశాస్త్రీయమయిన ఫలం. ఈ నియమం తప్పదు. దైవం దైవం అనే వాడు కూడా నాకర్మ అనే అంటాడు. కాబట్టి దైవం అన్నా కర్మ అన్నా రెండూ ఒకటే. ఫలావస్థలోకి వచ్చిన పురాకృతకర్మ దైవం అనబడుతుంది. ప్రయత్నా వస్థలో ఉన్న ఐహిక కర్మ కర్మ అనబడుతుంది. ఇంతే తేడా. పౌరుషం ఉచ్ఛాస్త్రం, శాస్త్రీతం అని రెండు రకాలు, అందులో శాస్త్రీతమయిన పౌరుషం పరమార్థాన్ని సాధిస్తుంది:

ప్రాక్తన పురుషార్థం, ఐహిక పురుషార్థం, ఈ రెండూ ఒకప్పుడు సమానంగా ఉంటాయి. ఒకప్పుడు విషమంగా ఉంటాయి, రెండు పొట్టేళ్లవలె యుద్ధం చేస్తాయి. ఇందులో బలం తక్కువది ఓడిపోతుంది. కాబట్టి మానవుడు శాస్త్రం చెప్పిన నియమ ప్రకారం ఇప్పటి పౌరుషం (పురుషార్థం) జయించేట్లు ప్రయత్నించాలి. మన పౌరుషమూ, ఇతరుడి

పౌరుషమూ కూడా మేకపోతులవలె తగాదా పడతాయి. ఆ రెంటిలో బలంగలది జయిస్తుంది. ఒకానొక చోట శాస్త్రీయమైన పౌరుషంతో నడచేవాళ్లకు కూడ రోగాలు మొదలయిన అనర్థాలు సంభవిస్తాయి. అక్కడ అనర్థాలు కలిగించే పౌరుషం (కర్మ) ప్రబలం. అది వెనుకటిది. దాన్ని ఓడించే ఇప్పటి పౌరుషాన్ని తెచ్చుకోవాలి. గట్టిపౌరుషాన్ని వహించి, శుభకరమయిన ఇప్పటి కర్మచేత, అనర్థకరమైన వెనుకటి కర్మను ఓడించాలి. జన్మాంతర కర్మనాచేత ఈ పనిని చేయిస్తున్నదనే బుద్ధిని రూపుమాపుకోవాలి. ప్రత్యక్షమయిన ఇప్పటి కర్మకంటె పరోక్షమైన వెనుకటి కర్మ గొప్పదికాదు, పురాకృతమయిన పాపకర్మ నశించేటంత వరకు ఇప్పుడు పుణ్యకర్మను ఆచరించాలి. (పౌరుషం అంటే పురుషుని కర్మ (పని) అని యర్థము) గుణమువల్ల దోషం నశిస్తుంది. సందేహం లేదు, వెనుకటి పాపకర్మ పట్టుకుని బాధిస్తుంటే ఇప్పటి మంచి కర్మయే దానికి మందు. ఇందుకు దృష్టాంతం నిన్నటి రోజున కలిగిన అజీర్ణవ్యాధికి మందు ఈ రోజు లంకణమే. పురాకృతమయిన దురదృష్టాన్ని ఐహికమైన సుకృతం చేత తిరస్కరించి, ఆత్మతరించే శమదమాది గుణసంపదను సంపాదించాలి. సోమరిపోతులతో పోలిక ఎన్నటికీ పనికిరాదు. శాస్త్రీయమయిన ప్రయత్నమే ఇహపరాలు జయించటానికి సాధనం. బోనులో నుంచి సింహం బయటపడడానికి ప్రయత్నించినట్లు ఈ మానవుడు సంసార కుహరం నుంచి బయటపడడానికి ప్రయత్నించాలి. ప్రతి రోజూ శరీరం నశించేదని ఆలోచిస్తూనే ఉండాలి. మూఢత్వం పనికిరాదు. సజ్జన సాంగత్యాన్ని సచ్ఛాస్త్రాలనూ సేవించాలి. పుండులోని, పురుగువలె, కొంపలోని, భార్యా బిడ్డలూ, అన్నపానీయములూ, అనుభవించుచూ, వయస్సును వ్యర్థ పుచ్చరాదు. మంచి పౌరుషంచేత మంచి ఫలం పొందుతాడు. చెడు పౌరుషం చేత చెడు ఫలం పొందుతాడు మానవుడు. ప్రాక్తనమయిన శుభాశుభ కర్మకంటె దైవం వేరే లేదు. ప్రభు సమ్మతమైన ప్రత్యక్ష ప్రమాణం శ్రుతిని విడిచి, అనుమాన ప్రమాణసిద్ధమయిన దైవాన్ని నమ్మి ప్రవర్తించే వాడు, తన భుజాలు పొడుగ్గా ఉన్నాయి కాబట్టి పాములనుకొని భయపడిన వాడగును. "దైవం నన్ను ప్రేరేపిస్తూంది" అనే పాపిషివాడి ముఖంచూస్తే లక్ష్మి

వెనక్కి వెళ్లుతుంది. (మరలిపోతుంది) కాబట్టి పురుష ప్రయత్నంచేత సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించాలి. తత్త్వశాస్త్ర విచారణ చెయ్యాలి. శాస్త్ర సిద్ధమయిన ఆత్మతత్త్వాన్ని శ్రవణమననాదులచే విచారించక, భోగాభిలాషలచే చిత్తాన్ని వినోదపరచే మూర్ఖుల జన్మ నిరర్థకం. ఆత్మ తత్త్వాన్ని సాధించడానికి ఎక్కువ ప్రయత్నం అక్కర లేదు. ఉపాయం ఎరిగి చేసిన కొద్ది ప్రయత్నంచాలు. రత్న పరీక్షా కుశలులకు రాతియందు రత్నం సులభంగానే లభిస్తుంది. ఘటము ఎలా నియత పరిమాణం కలదో, పటము ఎలా నియతమయిన పరిమాణం కలదో, అలాగే పురుష ప్రయత్నం కూడా సాక్షాత్కార ఫలం అవధిగా కలదిగాని, అనంతంకాదు. ఆ పురుష ప్రయత్నం, సదాచారమూ, సత్సాంగత్యమూ సచ్ఛాస్త్రాదులచే ఫలిస్తుంది. అది దాని స్వభావము. పురుష ప్రయత్నము యొక్క స్వరూపాన్ని గుర్తించి వ్యవరించువాడు ఎన్నిటికీ వ్యర్థుడు కాడు. దీనులూ, దరిద్రులూ, దుఃఖార్తులూ అయిన నలహారిశ్చంద్రాదులు, పురుష ప్రయత్నం చేతనే దేవేంద్ర తుల్యులయినారు. చిన్నతనం నుంచీ అభ్యసించిన సచ్ఛాస్త్రసజ్జనసాంగత్యాది గుణములచే పురుషప్రయత్నం స్వార్థాన్ని తప్పకసాధిస్తుంది. అప్పటి కప్పుడు అలవరచుకున్న సత్సాంగత్యం వల్ల అంతగా లాభం ఉండదు. ఇది జీవన్ముక్తుల ఎడల ప్రత్యక్షంగా కన బడుతోంది. శాస్త్ర సిద్ధమయి ఉంది. ఇటిస్థితిలో అంతా దైవాయత్తం అని తలిచేవాళ్ళు కేవలం మూర్ఖులు.

ఆలస్యం అనే అనర్థం లేకపోతే లోకంలో ఎవ్వడు ధనికుడు కాడు? ఎవడు పండితుడు కాడు? అలసటవల్లనే సముద్ర పర్యంతమయిన భూమి పశుప్రాయులగు మానవులతోడనూ దరిద్ర శిఖామణులతోను నిండి ఉంది. కనుక అలసట చెందక, (ఆలసించక) బాల్యము నుంచియు, సత్సాంగత్యాదులను అలవరచుకోవాలి.

బాల్యము గడచిన తరువాత, యౌవన ప్రారంభం లగాయితు సజ్జనసహవాసాదుల చేత గుణ దోష విచారణ చేస్తూ ఉండాలి. అని అన్నాడు వసిష్ఠుడు శ్రీరామునితో.

ఈ విషయాన్ని వాల్మీకి భరద్వాజునితో చెప్పుచుండగా పగటి కాలంగడిచింది. సూర్యుడుఅస్తమించాడు. భరద్వాజాదిముని సభవాల్మీకికి నమస్కరించి సాయం సంధ్యాగ్ని హోత్రాను ష్ఠానములకు వెళ్ళింది. రాత్రికాలం పూర్తి కాగానే, సూర్యోదయంతో సహా సభవాల్మీకి సాని ధ్యాన్ని చేరింది.

మొదటి రోజు ప్రసంగము ముగిసినది

## ౬ దైవనిరాకరణము

వసిష్ఠ శ్రీరాములకు జరిగిన మరురోజు సంవాదాన్ని వాల్మీకి భరద్వాజునకు చెప్పడం ప్రారంభించాడు.–

వసిష్ఠుడు ఇంకా ఇలా అంటాడు. శ్రీరామునితో–

రామచంద్రా! జన్మాంతర పౌరుషముకంటె దైవం వేరేలేదు. దాన్ని వదిలేసి సాధుజన సాంగత్యంచేత సచ్ఛాస్త్రాదులచే జీవుణ్ణి తరింపజేసికో. ప్రయత్నము ఎంత గట్టిగాచేస్తే ఫలం అంత తొందరగా కలుగుతుంది. సాధారణంగా మానవులు దుఃఖ సమయంలో హా 'కష్టం" అని అనుకుంటారు. అంటే హా "దైవం" అని అర్థము. ప్రాక్తన కర్మ కంటె దైవానికివేరే ఆకారం లేదు. చిన్న పిల్లలతో బలం గలవాడికి బలంతక్కువవాడు లొంగిపోతాడు. కర్మలలో బలంగల కర్మకు బలం తక్కువ కర్మ లొంగుతుంది నిన్నటి దోషానికి, ఈ రోజు ప్రాయశ్చిత్తంమందు. అలాగే వెనుకటి పాప కర్మకు ఇప్పటి పుణ్య కర్మ విరుగుడు. ప్రాక్తన కర్మను జయించటానికి యత్నించని మానవులు వట్టి మూఢులు. పౌరుషంచేత చేసిన కర్మ దైవంవల్ల నశించిదంటే, అక్కడ ప్రాక్తన కర్మ ప్రబలం అన్నమాట, ఒక తొడిమెను అంటుకున్న రెండు పండ్లలో ఒక పండు రసం లేనిదంటె, దాన్ని అనుభవించె మానవుని యొక్క కాని, పక్షి యొక్క కాని ప్రయత్నం, ఐహికమో, జన్మాంతరీయమో చెడ్డదనాలి. లోకంలో జగత్ప్రసిద్ధమైన పదార్థాలన్నీ నశిస్తున్నాయి అంటే, అక్కడ నశింపజేసే వాడి ప్రయత్నం ప్రబలం అని అనాలి. దైవమూ పౌరుషమూ, అనేవి రెండూ, రెండు పొట్టేళ్లు. ఇవి ఎప్పుడూ తగాదా

పడుతూ ఉంటాయి. ఇందులో దేనికి బలం ఎక్కువ ఉంటే అది జయిస్తుంది. రాజవంశం అంతరించేసరికి, పురజనులూ, మంత్రిలూ కలసి పట్టి దరిద్రుణ్ణి రాజుగాచేసి, ఏనుగు మీద ఊరేగించి పట్టాభిషేకం చేస్తారు. అదంతా పౌరుల మంత్రుల ప్రయత్నమేనా? మరేమయినా వేరే దైవం అందులో ఉందా. పురుష ప్రయత్నంచేత అన్నం నోట్లో పెట్టుకొని దంతాలతో నవిలి మ్రింగుతాడు. అలాగే దుర్బలుణ్ణి బలం గలవాడు మింగుతాడు. గొప్ప పరాక్రంగలవారికి దుర్బలులు ఆహారం అయిపోతారు. వారు వీరిని యథేష్టంగా, కొయ్యనూ రాతినీవలె వినియోగించుకుంటారు. ఇదంతా వారి పౌరుష బలమే. సమర్థుని వద్ద పౌరుషం కనిపిస్తూనూ, కనిపించకుండానూ ఉంటుంది. అసమర్థుడు తన దగ్గర పౌరుషం లేకపొయ్యేసరికి, వాడి పౌరుషాన్ని దైవంగా భావిస్తాడు. బలంగల ఒక భూతంకంటె మరొక భూతం ఇంకా బలంగలది ప్రాణులలో కనిపిస్తోంది. ఇంతే కాని దైవం అనేది ఎక్కడా కనిపించదు. శాస్త్రమూ, అమాత్యులూ. ఏనుగూ, పౌరులూ, వీరి సహజ స్వభావమూ ఐకమత్యాన్ని చెంది, భిక్షుకుని రాజ్యానికి కర్త అయినాయి. ప్రజా స్థితికి భర్త అయినాయి. తప్పితే అక్కడ ఆ భిక్షుకుని యొక్క జన్మాంతర పౌరుషమయినా కారణం కావచ్చు. ఇంతేకాని ఇంతకంటె వేరే దైవం లేదు. ఐహిక పౌరుషాన్ని ప్రాక్తన పౌరుషం జయిస్తుంది. ఇక్కడ బలాబలాలు కారణాలు. సంవత్సరం పొడుగునా చేసిన కృషి ఫలం యావత్తూ వర్షం కురిసి మేఘంవల్ల చెడిపోయిందంటె, మేఘాభిమానియగు పురుషుని యొక్క పౌరుషమే అక్కడ కారణం. ఒకవేళ ఎక్కడ అయినా పౌరుషం విఫలం అయిందంటె అక్కడ ఖేదపడకూడదు. మళ్లీ ప్రయత్నించడమే దానికి మంచిది.

కాబట్టి సచ్ఛాస్త్రాభ్యాసము, సత్సాంగత్యమూ చేసి బుద్ధిని నిర్మలం చేసుకొని, సంసార సముద్రాన్ని తరించాలి. పురుషులనే అడవిలో, ప్రాక్తన పురుషార్థము, ఐహిక పురుషార్థమూ అని రెండు ఫల వృక్షాలు పుట్టాయి. ఇందులో ఏది గొప్పదో అది జయిస్తుంది.

తుచ్ఛమయిన జన్మాంతర కర్మను, ఐహికములయిన పుణ్య కర్మలచే ఎవ్వడు రూపుమాపడో, వాడు తన సుఖ దుఃఖములయందు గూడ

తాను అసమర్థుడన్నమాట. వాడు ఈశ్వర ప్రేరితుడై స్వర్గానికో నరకానికో వెళతాడు. అలాంటివాడు పశువంటె తప్పులేదు. ఎప్పుడూ శాస్త్రాన్ని నమ్మి సదాచారాలయందు విహరించేవాడు, జగన్మోహం నుంచి బయటపడతాడు. నన్ను ఒకడు ప్రేరేపిస్తున్నాడనుకొని, తన ప్రయత్నం ఏమీ లేనివాడు అధముడు. లోకంలో అనేకమంది పనులు ఫలిస్తున్నాయి. చెడిపోతున్నాయి. కాబట్టి సుఖా సుఖాలు దూరంగా ఉంచి శాస్త్ర ప్రకారం నడచుకోవాలి. శాస్త్ర సిద్ధమయిన మర్యాదను చెడగొట్టకుండా, నడచేవాడికి, సముద్రంలో రత్నాలు లభించినట్లు అన్ని కోరికలూ లభిస్తాయి. తన సుఖానికీ, తన దుఃఖం పోవడానికీ, సాధనాలుగా ఉండే పనులయందు, తత్పరుడై ప్రయత్నించడమే పౌరుషం. అది పరమ పురుషార్థ సిద్ధికి కారణమవుతుంది. గురుశుశ్రూషాద్ముల చేతనూ, సాధుసంగమం చేతనూ, సచ్ఛాస్త్రాభ్యాసం చేతనూ, ఆత్మను ఉద్ధరించుకోవాలి, పరమానంద రూపమయిన ఆత్మతత్వాన్ని తెలిసికొన్నవారు సాధువులు. ఇహ పరలోకాలు రెంటికీ హితమయిన పౌరుషమే, దేవలోకంలో అనుభవించగా మిగిలి, ఈ లోకానికి వచ్చి ఉండి, దైవం అని వ్యవహరింపబడుతోంది. ఇలాంటి దైవాన్ని మేము కాదనం. నిందించం, మూఢులు అనుకునే దైవాన్ని మేము నిందిస్తాం. వాళ్లనుకున్న దైవాన్ని నమ్మినవాళ్లు చెడిపోయ్యారు.

ఎప్పుడూ తన పౌరుషం చేతనే తాను లోకద్వయాన్ని గెలుస్తాడు. నిన్నటి దోషాన్ని ఈ రోజు ప్రాయశ్చిత్తం తప్పకుండా నశింప చేస్తోంది. కాబట్టి పురుష ప్రయత్నం ప్రధానం. చాలా అవసరం. దీనివల్ల ఫలం అరచేతిలో ఉసిరిగ పండువలె ప్రత్యక్షం. మూఢుడు ప్రత్యక్ష ఫలాన్ని విడచి, దైవమనే మోహంలో పడుతున్నాడు.

కాబట్టి రామా! నిష్ఫలమయిన దైవాన్ని వదలి నీవు పౌరుషాన్ని తెచ్చుకో. ఇదే పరమ పురుషార్థాన్ని సాధించటానికి సాధనం అన్నాడు వసిష్ఠుడు.

## 8 పౌరుషము ప్రధానమని నిరూపించుట

దేహానికి, ఆధులూ, వ్యాధులూ లేకుండా చేసికొని చిత్తాన్ని

ఆత్మతత్వం మీద ఏకాగ్రపరచాలి. జన్మరాహిత్యం కావాలంటె ఇదే మార్గం. పురుషకారం చేత దైవాన్ని మరలింప యత్నించేవాడే ఇహపరసుఖాలను పొందుతాడు. ప్రయత్నాన్ని మాని, దైవం దైవం అంటూ నమ్మి ఉండేవాళ్లు, తమకుతామే శత్రువులై, ధర్మార్థకామాలను నాశనం చేసికొంటారు. పురుషార్థాలను, వాటి సాధనాలనూ, తెలిసికోవాలి, సాధనాలను సంపాదింప ప్రయత్నించాలి. తరువాత కర్మేంద్రియాలతో ప్రవర్తించాలి. వీటి పేరే సంవిత్స్పందము, మనస్స్పందము. ఇంద్రియ స్పందమూ, అని అంటారు శాస్త్రజ్ఞులు. పురుషార్థ రూపాలు ఇవి. ఈ మూటివల్లనే ఫలసిద్ధి. సాక్షియందు ఎన్ని విషయాలు స్ఫురిస్తాయో మనస్సు అన్నిటిని కోరుతుంది. కర్మేంద్రియాలు వాటన్నిటినీ పొందాలని ప్రవర్తిస్తాయి. ఫల మెప్పుడూ పనిని అనుసరించి ఉంటుంది. లౌకిక కర్మలలో, కాని వైదిక కర్మలలో కాని, ఎంతగా పురుష ప్రయత్నాన్ని ఉపయోగిస్తామో! అంతగా ఫలం లభిస్తుంది, పురుష ప్రయత్నం లేకుండా ఫలం లోకంలో ఎక్కడా సిద్ధించడం లేదు. కాబట్టి లోకంలో పౌరుషమే ప్రధానం. పౌరుషంచేతనే బృహస్పతి దేవతలకు గురువయ్యాడు. ఇంద్రుడు దేవతలకు రాజు అయ్యాడు. దీనులూ, దరిద్రులూ దుఃఖార్తులూ, నరాధములు కూడా, పౌరుషం చేత దేవేంద్రతుల్యులవుతున్నారు. గొప్పగొప్ప భాగ్యవంతులు, తమ పురుష ప్రయత్నంలో ఉండే లోపంచేతనే నరకలోకానికి అతిథులవుతున్నారు. సంపదలందుకాని ఆపదలందుకాని, ఇతరావస్థలందుకాని, భూతకోటి తమ పౌరుషంవల్లనే మారిపోతోంది.

పౌరుషం, శాస్త్రవల్లనూ, గురువు అనుగ్రహంవల్లనూ, స్వయంగానూ మూడురకాల ఫలిస్తుంది దైవం ఇలా ఫలించదు,

చెడుపనులయందు ప్రవేశించిన చిత్తాన్ని ప్రయత్న పూర్వకంగా మంచి పనులమీదికి నడపాలి. సర్వశాస్త్రాల రహస్యం ఇదే. శ్రేయస్కరమయిన దానినీ, నాశనం లేని దానిని సాధించమనే గురువులు ఉపదేశిస్తున్నారు. పౌరుషం ఎంత చురుకుగా ఉంటే ఫలం అంత చురుకుగా లభిస్తుంది. దీనిని నమ్మి నేను పౌరుషంవల్లనే ఫలం పొందాను. దైవాన్ని

నమ్మి నేను ఫలం పొందలేదు. దుఃఖం వచ్చినపుడు మంద బుద్ధులను ఓదార్చటానికి పుట్టింది దైవం అనేది ప్రత్యక్షాది ప్రమాణాలచేత పురుష ప్రయత్నమే ఫలిస్తున్నట్లు కనిపిస్తోంది. భోంచేసేవాడు తృప్తి పొందుతున్నాడు. నడచేవాడు ఊరు చేరుతున్నాడు, మాటాడదలచినవాడే మాట్లాడుతున్నాడు. వీటన్నిటా పౌరుషమే ఫలిస్తోంది. బుద్ధిమంతులు దురంతములయిన సంకటాలనుండి పురుష ప్రయత్నంచేతనే బయటపడుతున్నారు. వ్యర్థ ప్రయత్నంవల్లకాని, అప్రయత్నంవల్లకాని బయటపడటం లేదు, ఎవడెవడు ఎలా ఎలా ప్రయత్నిస్తే, వాడు వాడు అలా ఫలాన్ని పొందుతాడు. అంతేకాని ఊరుకున్నవాడు ఫలం పొందడంలేదు. మంచి ప్రయత్నానికి మంచి ఫలం, చెడు ప్రయత్నానికి చెడు ఫలం. ఇది శాస్త్ర సిద్ధాంతం. రామా! నీకెలా తోస్తే అలా చెయ్యి. దేశకాల వశంవల్ల పురుష ప్రయత్నమే తొందరగానో, ఆలస్యముగానో ఫలిస్తూంది, దీన్నే కొందరు దైవం అంటున్నారు. ఇంతేకాని దైవం అనేది లోకంలో కనిపించడంలేదు. లోకాంతరంలో దాగిలేదు, మానుష లోకంలో చేసిన కర్మయే దైవమనే పేరుతో స్వర్గఫలాన్ని ఇస్తోంది. పురుషుడు, పుటుతున్నాడు పెరుగుతున్నాడు చస్తున్నాడు, ఇందులో, బాల్యం, యౌవనం, వార్థక్యం కనిపిస్తోంది కాని, దైవం ఏమీ కనిపించడం లేదు. పురుషార్థాన్ని సాధించే ప్రయత్నమే పౌరుషమని శాస్త్రజ్ఞులంటున్నారు. వేరే దాన్ని పౌరుషమని అనరు. ఇలాంటి పౌరుషంచేత స్వర్గం సంప్రాప్తం అవుతోంది. కాలినడకచే దేశాంతరప్రాప్తి. చేతివల్ల వస్తువును పట్టుకోవడం, ఇతరావయవములవల్ల వ్యాపారమూ, పౌరుషంచేత అవుతోంది కాని, దైవంచేత అవడంలేదు. అనర్థాన్ని పొందే పనులయందలి ప్రయత్నశీలాన్ని ఉన్మత్త చేష్ట అంటారుకాని, పౌరుషం అనరు. దానివల్ల ఫలమూ ఏమీలేదు, సజ్జన సాంగత్యం, శాస్త్రాభ్యాసంతో కూడిన వివేకబుద్ధితో చేసే ప్రయత్నమే పౌరుషం. అదే ఫల సాధనం. గురుశుశ్రూష, శాస్త్రాభ్యాసం చేసిన కొద్దీ జ్ఞానం పెరుగుతుంది, ఈ రెండూ అభ్యాస యోగంవల్ల వృద్ధి పొందుతాయి. వర్షకాలంవల్ల సరస్సు, పద్మాలూ వృద్ధి పొందినట్లు, చిరకాలభ్యస్తమైన. శాస్త్రాదులచేతనూ పురుష ప్రయత్నంచేతనూ, హితమయిన పురుషార్థం సంప్రాప్తం

అవుతుంది. విష్ణుమూర్తి పౌరుషంచేతనే దైత్యులను సంహరించాడు. లోక మర్యాదలను నిలబెట్టాడు. లోకాలు నిర్మించాడు. దైవం చేత ఏపనీ చేయలేదు. కాబట్టి శ్రీరామా నీవు మంచి స్థితికి రావాలంటే పురుషకారాన్ని ఆశ్రయించు, పురుషకారాన్ని సేవించేవారల కు దుర్దశ పట్టదు.

## ౮ దైవనిరాకరణము

రామచంద్రా! దైవానికి ఒక విధమయిన ఆకారం లేదు. మిథ్యాజ్ఞానంవలె అనిర్వాచ్యం. దీన్ని ఎలా నిరూపిస్తారో అర్థంకాదు.

వీడు ఈ పనిచేశాడు. దానికి ఈ ఫలం సంప్రాప్తమయింది. అనే మాటలే దైవమనే పేరుతో ప్రసిద్ధమయినాయి. మూఢులు ఈ విషయంలోనే దైవం దైవం అనే నిర్ణయానికొచ్చారు. తాడు తెలియక పాము అనుకున్నట్టే. కర్మను గుర్తించలేక దైవం అనుకోడం తుదకు నేను చెప్పినట్లు, పురాకృత కర్మ దైవం అనీ, ఐహిక కర్మ పౌరుషమనీ తేలినట్టే అయింది. మూఢులు అనుకునే దైవాన్ని నమ్మే దుర్మతి, "దైవాన్ని నమ్మి ఇందులో మంటలేదని" అగ్నిలో దూకితే బాగుంటుంది, వాడికి ఆ దైవం ఏంతోడుపడుతుందో తెలుస్తుంది. అంతా దైవంవల్లనేజరిగేటట్లయితే మానవుడికి వేరే పని ఎందుకూ? స్నానమూ, పానమూ. ఆచమనమూ, దానమూ, ఆతిథ్యమూ అంతా దైవమే నెరవేరుస్తుంది. మంత్రోచ్చారణాదులు కూడా వీళ్లకుపనిలేదు. శాస్త్రోపదేశంకూడా అక్కరలేదు. అంతా దైవమే ఉపదేశిస్తుంది. అలా ఎవరికైనా దైవం ఏమైనా ఉపదేశించిందా? ఏమాత్రం అయినా శరీరానికి చలనం ఉంటే ఫలం ఉంది. లేకపోతే ఫలం లేదు. నిశ్చలంగా ఉన్న శరీరం శవమే. దాన్ని దైవం ఏం చేయగలదు. శరీరం ఆకారం గలది. దైవం ఆకారం లేనిది. ఇది దానికి సహాయపడడం లోక విరుద్ధం. చేతులు, కాళ్లూ మొదలయినవి, ఆయా సాధనాలను స్వీకరించి, ఆయా పనులను సాధిస్తున్నాయి. ఆ అవయవాలు కఫవాతాది రోగాలచే, చెడిపోతే, దైవం ఏమీ చేయడం లేదు. దైవం ఉంటే అప్పుడు వాటివల్ల ఏమీ పనిచేయించదేం? కాబట్టి దైవం అనేది

ఎక్కడా అనుభవ గోచరం కావడంలేదు. కాన దైవమనేది లేదు.

కాక దైవం ఉన్నదని నిరూపించడంలో, కర్త, కరణం, మొదలగు కారక బుద్ధియా? ప్రమాణం లేక వేరు బుద్ధియా? ఇందు రెండవ పక్షంలో క్రియలయందు ఉపయోగించని దానిని దైవమని కల్పించడం వ్యర్థమగును. మొదటి పక్షంలో, కర్త్రాది కారకాలే  వమనే పేరుతో చెప్పినట్లవును.

ఒకవేళ సమానమైన పాండిత్యం కోరేవాళ్లు యిద్దరు చదువుతూ ఉంటే ఒకరికి బాగా పాండిత్యం అబ్బి, మరొకరికి అబ్బకపోతే, ఆ తేడాకు ఒక కారణం కల్పించాలి కాబట్టి మేము దానికి నిమిత్తంగా దైవాన్ని కల్పిస్తామని మీరంటారేమో? అప్పుడయినా దైవాన్ని కల్పించకపోతే, వారిద్దరిలోనూ, పురాకృతమైన పురుష ప్రయత్నంలోనే తేడా ఉందని కల్పిస్తే, మీ పుట్టి ఏం మునకపోయింది.

కాబట్టి ఆకారం లేని దైవం తోటి ఆకారంగల మానవుడికి సంబంధం అసంభవం. నిరాకారమయిన ఆకాశంతో శరీరధారులు అంటుట లేదు. మూర్తమే మూర్త పదార్థంతో కలుస్తోంది. (సంబంధించి ఉంటోంది) కాబట్టి దైవం అనేది లేదు. నిజంగా భూత కోటికి ఉపకరించే దైవం అనేదే ఉండేటట్లయితే ఈ భూత సమూహం హాయిగా పక్క వేసికొని పడుకొని ఉండేది. అంతా దైవమే చేసేది.

నేను దైవం చేత ప్రేరేపితుడనై ఈ పనిని చేస్తున్నానని అనుకోవడం ఊరక దైవ వాదులను ఓదార్చే మాటలుకాను దైవాన్ని నిలపెట్టే మాటలు కావు.

మూఢులు దైవాన్ని కల్పించారు. వారు దాన్ని నమ్మి సంచరించారు. చెడిపోయారు. ప్రాజ్ఞులు పౌరుషాన్ని ఆశ్రయించారు. ఉత్తమ స్థితిని పొందారు.

శూరులూ, బుద్ధిశాలులూ, పండితులూ, వారి పురుషాకారాన్ని

వినియోగించుకుంటారు కాని, దైవాన్ని ఎదురు చూడరే. ఏం కారణం? నిజంగా దైవం అనేది ఉంటే వాళ్లకు తెలియదు కాబోలు. అసమర్థులకు మాత్రమే దైవం ప్రత్యక్షం అవుతూ ఉంటుందేం.

కాలాన్ని గుర్తించిన దైవజ్ఞులు (జ్యోతిష్కులు) ఎవడినయినా దీర్ఘాయుర్దాయంగలవాడని నిర్ణయిస్తే, వాడి తల తెగగొట్టినా వాడు జీవించి ఉండేటట్లయితే, అప్పుడు దైవం ఉందని గట్టిగా నమ్మవచ్చు. అలా బ్రతికేవాడు లోకంలో కనిపించడు. దైవజ్ఞులు "వీడు పండితుడవుతాడని" జాతకం వ్రాస్తారు. వాడికి చదువు చెప్పించకుండా ఉన్నపుడు వాడు పండితుడయ్యేటట్లయితే వారు చెప్పే దైవం గొప్పదన్నమాటే.

విశ్వామిత్రుడు దైవాన్ని దూరంగా త్రోసి రాజని పౌరుషంవల్ల బ్రహ్మర్షి అయ్యాడు. మాబోటివాళ్లు కూడా చాలకాలం మునులై తుదకు పురుషకారంవల్లనే చిరకాలానికి ఆకాశ మార్గాన తిరిగే శక్తి సంపాదించాము.

లోకంలో దానవాధిపతులు, దైవాన్ని దూరంగా త్రోలి పురుష ప్రయత్నం చేతనే సామ్రాజ్యాన్ని సంపాదించారు. దేవతలు కూడా పురుష ప్రయత్నంచేతనే, తమ బలాన్ని వినియోగించి వినిస్తీర్ణమయిన రాక్షస సైన్యాన్ని జయించారు. దైవానికికూడా దైవం పౌరుషమేఅవుతోంది. పురుష ప్రయత్నంయొక్క నేర్పుచేతనే వెదురుబద్దలతో అల్లిన బుట్టలో నీరు చాలకాలం నిలచుచున్నది. బంధువులను పోషించాలన్నా, శత్రురాజ్యాలు ఆక్రమించాలన్నా ఇతరులను స్వాధీనపరచుకోవాలన్నా, భోగవిలాసాలు అనుభవించాలన్నా కష్టసాధ్యమైన పురుషార్థాలు సాధించాలన్నా, పురుషకారానికే శక్తి కనిపిస్తోంది, కాని దైవానికి శక్తి కనిపించడం లేదు. ఇంకా జడములయిన మణిమంత్రాదులందు ఒక విధమైన సత్తా కనిపిస్తోంది. దైవానికి అశక్తి కూడా కనిపించడం లేదు.

కాబట్టి రామచంద్రా! భ్రాంతి కల్పితమయిన దైవాన్ని విడిచి, ఉత్తమమైన పౌరుషాన్ని ఆశ్రయించు అన్నాడు వసిష్ఠుడు.

# ౯ కర్మవిచారము

శ్రీరాముడు విషయమంతా విన్నాడు. వసిష్ఠుని వాగ్ఝరీకి అడ్డు తగిలాడు. మహర్షీ పురుషకారమే స్వతంత్రమని చెప్పదలచి, దైవం లేనే లేదన్నారు ఒకచోట. ప్రాక్తన (వెనుకటి) జన్మయందలి పౌరుషమే దైవమన్నారు మరొకచోట. ఇందులో మొదటి పక్షం అవలంబిస్తే, దైవం ఉన్నదని సూచించే, లోకవేద ప్రసిద్ధి నిరాధార మవుతుంది. కాక దుర్బలమయిన దైవమే లేకపోతే, ఒకదాని ద్వారా చెప్పదగిన ప్రాబల్యాన్ని పౌరుషానికి చెప్పడం విరుద్ధమవుతుంది. ఇది ప్రబలం అంటె దీనికంటె దుర్బలం ఇంకొకటి ఉండాలి. ప్రాబల్య దౌర్బల్యాలు ఆపేక్షికాలు. రెండు వస్తువులు సజాతీయాలు లేకపోతే ఈ శబ్దాలే పుట్టవు. ప్రాక్తన కర్మే దైవం అనే పక్షంలో, "దైవం లేనేలేదను" ప్రతిజ్ఞయే కుదరదు. ఏదో రూపంలో దైవం ఉన్నట్లేకదా!

మరిన్ని ఈ జన్మలోని ప్రవృత్తులన్నీ పూర్వజన్మ కర్మ ఫలాలు. కాబట్టి, అవిదాని కనుకూలంగానే పుడతాయి. వాటికి పరస్పర విరోధం ఉండదు. పూర్వజన్మ కర్మకు, ఐహిక కర్మలు విరుద్ధాలని చెప్పడం అనుచితం, పూర్వ కర్మను అనుసరించి ,పుట్టిన ఐహిక ప్రవృత్తులకు పురుషుడు స్వాధీనమయినా, పురుష స్వాతంత్ర్యానికి భంగమే. కాబట్టి ఏవిధంగానూ, పౌరుషానికి స్వాతంత్ర్యం చెప్పడం సబబుగా కనిపించదు. మహర్షి యొక్క భావం ఏమిటో బోధపడుట లేదు, అని ఈ రహస్యాభిప్రాయం అంతా కడుపులో పెట్టుకున్నాడు శ్రీరాముడు.

చివరికి ఇలా ప్రశ్నించాడు.

మహర్షీ! "తమకు సర్వ ధర్మాలూ తెలుసు, లోకంలో, దైవం అనేది ఉన్నట్లు మిక్కిలి ప్రసిద్ధిని పొందింది. మీరు అది ఉందంటారా? లేదంటారా" ఏదో తేల్చి చెప్పండి". అన్నాడు రాముడు,

రామా! అన్ని పనులకూ పౌరుషమే కర్త, అదే ఫలాన్ని అనుభ

వించే భోక్త. దైవం అనేది దేనికీ కారణంకాదు. దైవం ఏమీ చేసేది కాదు, తినేదికాదు, కనిపించేదికాదు, ఎవరిచేతను ఆదరింప బడేదికాదు. కాబట్టిలేదు. కేవలం భ్రాంతి మాత్రం, ఫలవంతమయిన పౌరుషంచేత సిద్ధించిన శుభాశుభ ఫలాన్ని దైవమని వాడుతున్నారు లోకులు. దైవ సంప్రాప్తమయిన వస్తువు ఇష్టమయినా, అనిష్టమయినా దైవమనే అంటారు లోకులు,

తప్పక పురుషార్థాన్ని (విషయభోగాన్ని) సాధించేదాన్ని దైవమని లోకాయతికులంటారు. ఇందులో నా సిద్ధాంతం విను చెబుతాను. దైవ మనేది ఆకాశంవలె శూన్యమయింది. ఇది లోకంలో ఏవరికీ, ఏమీ చెయ్యదు. చెయ్యకుండానూ ఉండదు. వివేక దృష్టిలో ఏమీచెయ్యదు. భ్రాంతి దృష్టిలో చేస్తుంది. ఆకాశం కూడా పరమార్థంగా శూన్యం. భ్రాంతి దశలో నల్లని వస్తువు (నీలంనభః). లోకంలో ఎవరికైనా మంచి ఫలమో చెడు ఫలమో సంభవిస్తే దాన్ని చూచి, పూర్వజన్మంలో ఏడికి ఇలా కాదగి ఉన్నదని, కల్పించి, దానికి దైవమని పేరు పెటుతున్నారు లోకులు, ఇలాంటి దైవం పురాకృతమయిన పురుషకర్మ (పౌరుషము) లోనే చేరుతుంది కాని, వేరు కానేరదు, ఇది నా అభిప్రాయం. నా మనో నిశ్చయం. మిగిలిన మాటలన్నీ, దైవవాదులను ఓదార్చే మాటలుకాని, తథ్యవచనాలు కావు అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! పురాకృత కర్మయే దైవం అని మీరు పలుమారు చెప్పారు. అయితే దైవమనేది ఉన్నట్లేకదా? లేదని నిషేధిస్తారేం? ఈ నిషేధానికి ఏమిటి మీ అభిప్రాయం? అన్నాడు రాముడు.

రామచంద్రా! మంచిమాట అడిగావు. చెపుతాను విను ఉన్న విషయం. దైవం లేదనే బుద్ధి నీకే స్థిరపడుతుంది.

మానవులకు మనస్సులలో ఉండే సంకల్పాలే (వాసనలే) క్రియా రూపకంగా పరిణామాన్ని చెందుతాయి. భావం ఒక లాగను, క్రియ (పని) మరొకలాగను జరగదు. మనస్సులో ఏ భావం (వాసన) ఉంటుందో క్రియదాని కనుకూలంగానే జరుగుతుంది. ఊరికి వెళ్లాలని సంకల్పం కల

వాడు. ఊరికి వెళతాడు. పట్టణానికి వెళ్లాలని కోరికగలవాడు పట్టణానికి వెళతాడు. ఎవడికి ఏ వాసన ఉంటుందో, వాడు దానియందు ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటాడు. తీవ్రమయిన ఫలాభిలాషవలన, గట్టి ప్రయత్నంతో, చేసిన పూర్వజన్మ కర్మయే, దైవమనే మారుపేరుతో చెప్పబడుతోంది.

కర్మానుష్ఠాతల యొక్క కర్మలన్నీ ఇలాంటివే. కర్మ అనగా పరిణామం చెందిన మనోవాసనే. వాసన అనగా మనస్సే. మనస్సు అంటే పురుషుడే. అనగా పరిపూర్ణమగు ఆత్మయే. "తన్మనోఽకురుత ఆత్మన్వీస్యామితి" అను శ్రుతి మనసు పురుషుని (ఆత్మ) యొక్క వివర్తమని చెప్పుచున్నది. పురుషుడు పరమార్థంగా నిర్వికార చిన్మాత్ర రూపుడు, కాబట్టి మనస్సు లేకపోతే కర్మ లేదు. కర్మ లేకపోతే, కర్మ రూపమయిన దైవం లేదు. ఏది దైవమో అదే కర్మ. ఏది కర్మయో అదే మనస్సు. ఏది మనస్సో అదే పురుషుడు. కాబట్టి దైవం లేదని తేలింది.

మనోరూపాన్ని చెందిన జంతువు (ప్రాణి) (జీవుడు) తనకు అనుకూలమయిన దానిని గూర్చి ప్రయత్నించి, నెరవేర్చి ఫలం పొందుతాడు. ఫలం పొందగానే, దైవంవల్ల ఈ ఫలం సిద్ధించింది వీడికని లోకులు ఘోష పెడతారు. నిర్ణయించి చెప్పటానికి వీలు, కాని పురుషునకే మనస్సు అనీ, చిత్తం అనీ, వాసన అనీ, కర్మ అనీ, దైవం అనీ, సంజ్ఞలు యేర్పడ్డాయి. కాబట్టి ఈ పేరులుగల పురుషుడు దృ ఢ మ యి న వాసన (సంకల్పం) చేత నిత్యమూ ప్రయత్నిస్తూ ఉంటాడు. దాని ఫలాన్ని పొందుతాడు.

శ్రీరామా! ఇలా పురుషకారంచేతనే సర్వమూ పొందబడుతోంది. కనుక ఆ పురుషకారమే మంచిది. నిజమయింది. దైవం అనేది మిథ్య అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

అయితే మహర్షీ! నేను పూర్వకర్మవాసనా పుంజానికి పరాధీనుణ్ణి అయినాను. అది ఎలా నడిపితే అలా నడచుకోవాలి. అందువల్లనే దీనుడ్నై (పరాధీనుడనై) ఏమీ చేయలేకుండా, ఊరకున్నాను. ఏంచేసేది

చెప్పండి? పూర్వజన్మ వాసనా పుంజానికి స్వాధీనమై పోయిన మానవుడికి, ఈ జన్మలో స్వాతంత్ర్యం ఎలా ఉంటుంది? అని తెల్పాడు శ్రీరాముడు.

రామా! అలాకాదు. అందులో ఒక రహస్యం ఉంది. విను. ఈ జన్మలో ఫలం విషయమై నీకు స్వాతంత్ర్యం లేదు. కాని ముందు జన్మలో అనుభవించబోయ్యే ఫలానికి అనుకూలమయిన ప్రయత్నం చేయడంలో మాత్రం నీకు స్వాతంత్ర్యం ఉంది.

విద్యా సంపన్నమైన ఉత్తమ కులంలో పుట్టినందువల్ల, మంచి ప్రయత్నం చేయటానికి వీలయిన ప్రాబ్ధ కర్మ వాసన ఉన్నట్లు ఊహించాలి. అది దానికి విరుద్ధమయిన ఫలానికి మాత్రమే అడ్డుపడుతుంది కాని అనుకూలమయిన ఫలానికి అడ్డుపడదు.

సత్కర్మానుష్ఠానానికి అధికారంగల జన్మయందు గూడ, సత్కర్మల యందు ప్రవర్తించటానికి స్వాతంత్ర్యం లేకపోతే, కర్మ బ్రహ్మశాస్త్రము అంతా వ్యర్థం కావలసి వస్తుంది.

కాబట్టి రామచంద్రా! నీవు పూర్వజన్మ కర్మ వాసనవల్లనే నిరతిశయానం దాన్ని పొందగలవు. దానికి అధికారంగల జన్మ ఎత్తితివి. అది నీకు స్వప్రయత్నాధీనమయిన పౌరుషంచేతనే ప్రాప్తిస్తుంది.

పూర్వజన్మ వాసనా పుంజం, శుభమూ, అశుభమూ, అని రెండు రకాలు. అందులో నీకు శుభవాసనయే ఉన్నచో, దానివల్ల నీవు సులువుగా (సులభంగా) మోక్షాన్ని పొందగలవు.

అట్లుకాక అశుభవాసనయే ఉండి, అది నిన్ను సంసార సంకటంలో పడవేసే యెడల, దాన్ని బలాత్కారంగా జయించటానికి, ఈ జన్మలో శుభవాసనలను సంపాదించాలి. కర్మలను ఆచరించాలి. అప్పుడుగాని అది నీకు లొంగదు. ఎలాగంటే జన్మాంతర వాసనలు ఎప్పుడూ స్వతంత్రంగా బయటపడవు. వాటికి ఉద్బోధక సామగ్రి ఉంటేనే అవి

ఉద్రేకిస్తాయి. లేకుంటే దాగి ఉంటాయి. జన్మాంతరీయమైన అశుభ వాసన, ఉద్బుద్ధం కావాలంటే, ఈ జన్మలో కూడ నీవు దుర్జన సాంగత్యం చేస్తేనే శీఘ్రంగా ఉద్బుద్ధం అవుతుంది. లేకపోతే ఉద్బుద్ధంకాదు. ఈ దుర్జన సాంగత్యం ఆ వాసనకు ఉద్బోధక సామగ్రి అవుతుంది.

ఇది ఎట్లో. అట్లే, ఈ జన్మలో నీవు, అశుభవాసనకు విరుద్ధమైన సత్సాంగత్యాన్నీ సచ్ఛాస్త్రాన్నీ సేవించేటట్లయితే, ఈ విరోధివాసనవల్ల, ఆ అశుభవాసన అణిగిపోతుంది. క్రమంగా నశించిపోతుంది. ఇదీ ఇచ్చటి పరిస్థితి. కాబట్టి నీకు జన్మాంతరవాసనలకు పరాధీనుణ్ణి అయినా ననే బెంగ అక్కరలేదు. ఇప్పటి ప్రయత్నం లేకపోతే ఆ వాసనలు నిన్ను లొంగతీసికొంటాయి కాని, ప్రయత్నం ఉండేటట్లయితే అవి లొంగతీసికోలేవు.

ఇక నీవు "యోమనసి తిష్ఠ౯ మనసోంతరః యంమనోనవేద". అను అంతర్యామి బ్రాహ్మణాన్ని ఆధారంగా జేసికొని, నీ మనస్సులో నీకు ప్రేరకుడయిన ప్రాజ్ఞాత్మ ఒకడు (చిదాత్మ) ఉన్నాడనిన్నీ, వాడు నీ మనసులో ఉండే వాసనలను ప్రేరేపిస్తున్నాడనిన్నీ, కాబట్టి నాకు సద్వాసనలను సంపాదించుకోటానికి స్వాతంత్ర్యం ఎక్కడిదని అంటావేమో, అది కూడా నీది పొరపాటే.

అంతర్యామి బ్రాహ్మణం చెప్పే చిన్మాత్ర స్వభావుడయిన ప్రాజ్ఞుడు నీవే. నీవు జడమయిన స్థూల సూక్ష్మ శరీరరూపుడవు కావు. "నాన్యోఽతోస్తి ద్రష్టా" అను శ్రుతిద్రష్టయగు చిదాత్మ ఒక్కడేకాని, ఇద్దరు లేరని చెపుతోంది. కాబట్టి చిన్మాత్ర స్వరూపుడవయిన నీవు మరియొక చేతనునిచే ప్రేరేపింపబడుటలేదు.

మరియొక చేతనుడి చేత నీవు (ప్రేర్యుడవు) అయ్యేటట్లయితే నీకు జడత్వం అనివార్యం అవుతుంది. ఇంక చేతనత్వం ఎక్కడిది నీకు?

కాక నిన్ను ఇంకొక చేతనుడు భాసింపచేసేటట్లయితే, వాణ్ణి భాసింపచేసే చేతనుడు మరొకడు, వాణ్ణి భాసింపచేసే చేతనుడు మరో

కదూ, అని ఇట్లు అనవస్థ ఏర్పడును. కాబట్టి నీకంటె వేరుగా మరియొక చేతనుడు నిన్ను ప్రేరేపిస్తున్నాడను భయం నీకు అవసరంలేదు. కాబట్టి, ఇలా శుభాశుభ మార్గాలచే ప్రవహించే వాసనా నదిని, పురుష ప్రయత్నంచేత శుభమార్గంలో నడచేటట్లు చెయ్యాలి. అశుభ కర్మలయందు ప్రవర్తించిన నీ మనస్సును బలాత్కారంగా పురుష ప్రయత్నంచేత శుభ కర్మలయందు ప్రవేశపెట్టాలి,

చిత్తం పసిపిల్లలవంటిది. పసిపిల్లలు తల్లి కసురుకుంటే తండ్రివద్దకు వెళతారు. తండ్రి కసురుకుంటే తల్లివద్దకు వెళతారు. అలాగే రెండు మార్గాల ప్రవహించే చిత్త నదిని, అశుభ మార్గం నుంచి మరల్చితే శుభ మార్గాన ద్విగుణంగా ప్రవహిస్తుంది. శుభ మార్గం నుంచి మరల్చితే అశుభ మార్గాన ద్విగుణంగా ప్రవహిస్తుంది. చిత్తమనే బాలుణ్ణి, మెల్లమెల్లగా క్రమక్రమంగా రాగద్వేషాది వైషమ్యాన్ని రూపుమాపి, సహజమయిన సమతామార్గంలో ఉంచి, నిరోధలక్షణమయిన పురుష ప్రయత్నంచేత, ఆత్మ స్వరూపమందు, నిరోధించి, కాపాడాలి. హఠాత్తుగా ఒకేమారు నిరోధిస్తే చిత్తానికి, ఏకాగ్రత కుదరదు. కనుకనే శ్రీకృష్ణుడు "శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా" అని చెప్పాడు మెల్ల మెల్లగా మనస్సును మరల్చాలన్నాడు.

నీవు ఇదివరలో అశుభమో, శుభమో, వాసనా పుంజాన్ని సంపాదించుకున్నావు. (ప్రోగుచేసికున్నావు) ఇప్పుడు మాత్రం శుభ వాసనలను సంపాదించు. వెనుకటివి శుభవాసనలే అవుతాయా, అవీ ఇవి కలసి శీఘ్రంగా మోక్షం ఇస్తాయి. వెనుకటి వాసనలు అశుభాలు అవుతాయా అప్పుడు ఈ శుభవాసనలు వాటిని జయిస్తాయి. పూర్వ వాసనలయందు ఫలం ప్రత్యక్షమయింది కనుక, ఇప్పటి వాసనాభ్యాసం వ్యర్థమవుతుందని సందేహింప పనిలేదు. అభ్యాసంవల్ల ఈ జన్మలో కూడ నీకు వాసనలు గట్టిపడగలవు. కాబట్టి శుభవాసనాభ్యాసం అవసరం.

ఒకవేళ నీవనుకున్నట్లు పూర్వజన్మలో కూడ అభ్యాసంవల్ల వాసనలు గట్టిపడకపోయ్యేటట్లయితే, ఇప్పుడూ, ఈ జన్మలోనూ గట్టిపడవు.

అప్పుడూ నీకు సుఖమే కాబట్టి వాసనాపుంజం ఘనీభావం చెంది ఫలం ఇస్తుందనే విషయంలో నీకు సందేహమున్నా, శుభవాసనలనే వృద్ధిచేసికోవాలి కాని అశుభవాసనలను వృద్ధిచేసికో కూడదు. ఫలమున్నా, లేకపోయినా, శుభవాసనాభ్యాసంలో దోషంలేదు, అయినా నీకు ఈ సందేహం కూడా అనవసరం. అభ్యాసంవల్ల, అభ్యసింపబడేది గట్టి (దృఢ) పడుతుందనే విషయం లోకంలో పిల్లవాళ్లకు కూడా తెలుసు. చదివిన కొద్దీ పాఠం గట్టిపడుతుంది. లోకంలో ఎవ్వరికీ లేని సందేహం నీకెందుకు?

కాబట్టి, నీవు బాగుపడాలంటే, ఇంద్రియ పంచకాన్ని జయించి, గట్టి పౌరుషాన్ని తెచ్చుకొని, శుభవాసనలను, చిత్తము పరిపక్వమై, తత్వజ్ఞానం కలిగేటంతవరకు, అలవరచుకో. చిత్తం పరిపక్వమై, ఆత్మ తత్వ సాక్షాత్కారమైన తర్వాత, ఈ శుభవాసనలను కూడ, నిరోధ సమాధితో విడచిపెట్టు.

గమనిక:– శి|| గురూ! ఏమిటిక్కడ వసిష్ఠుడూ, శ్రీరాముడూ, పౌరుషం, దైవం, పౌరుషం, దైవం అనీ, స్వతంత్రం, పరతంత్రం అనీ, గందరగోళం పడ్డారు చాలా సేపు, ఏమీ బోధపడడం లేదే. తుదకు తేలిందేమిటో తెలియదు. ఏమిటి ఇది.

గు|| ఇదా! అబ్బే ఇందులో ఏం ఉందీ. వాళ్లకంటె నీ కంగారు జాస్తిగా ఉందే. దీన్ని టూకీగా చెప్పేదీ.

లోకంలో మానవులు, తాము చేసిన ప్రయత్నం ఫలిస్తే, మా పౌరుషం అంటారు. చెడిపోతే దైవానుకూలం తప్పింది అంటారు, అలాగే సమానకార్యమైన పనిని ఇద్దరూ ఒకేమాదు ప్రారంభిస్తే ఒకరికి ఫలిస్తుంది. ఒకరికి ఫలించదు. ఫలించిన వాడికి దైవం అనుకూలించినట్లూ, ఫలించని వాడికి దైవం అనుకూలించనట్లు, కూడా లోకంలో వాడుక ఉంది. దీన్ని బట్టి, వసిష్ఠ శ్రీరాములు, కార్య సాఫల్య వైఫల్యాలు, దైవం మీద ఆధారపడి ఉన్నాయా? లేక పురుష ప్రయత్నం మీద ఆధారపడి ఉన్నాయా? అని కొంతసేపు చర్చించారు.

తుదకు వసిష్ఠుడు, దైవం అన్నా, పౌరుషం అన్నా ఒకటే నన్నాడు. పూర్వ జన్మ కర్మ దైవం, ఈ జన్మలోని కర్మ పౌరుషం ఇంతే తేడా అన్నాడు. కాబట్టి దైవం కూడా పురాకృతమయిన పురుషకర్మే అని అన్నాడు. దైవానికి వేరే స్వరూపం లేదన్నాడు. నిర్వికార చిన్మాత్రుడైన పురుషుడొక్కడే యదార్థం కాన, పౌరుషమే సత్యమయింది. దైవమనేది అసత్యం. మిథ్య, భ్రాంతి కల్పితం అన్నాడు తమాషాగా వసిష్ఠుడు. ఇదీ ఇక్కడి విషయం. దీనినే అయిదారు సర్గలలో ఉక్తి ప్రత్యుక్తులతో చర్చించారు.

# ౧౦ జ్ఞానావతరణము

రామా! దైవమనగా పురాకృత పురుష కర్మ. (పౌరుషం) దాన్ని ఇప్పటి పురుష కర్మచే జయించవచ్చు. కాని నేను వైరాగ్య ప్రకరణంలో, యమధర్మరాజుకు నియతి అనే భార్య ఉందని చెప్పాను. నియతి అనగా "కానున్నవి తప్పక అగుట". ఇది చాలా బలవత్తర మయింది. దీన్ని జయించడం సాధ్యం కాదంటారు పెద్దలు.

శ్లో॥ అవశ్యం భావిభావానాం ప్రతీకారోభ వేద్యది।
తదా దుఃఖై ర్నలిప్యేరన్ నలరామ యుధిష్ఠరాః॥

అని ప్రమాణంకద్దు. తప్పక కాదగిన పదార్థాలకు ప్రతి క్రియే ఉన్నట్లయితే నలమహారాజూ, శ్రీరాముడూ, యుధిష్ఠరాదులూ, దుఃఖాల పాలు అయ్యేవారు కారు. అని దీని అర్థం. కాబట్టి మానవుడు దీనికి లొంగిపోయినా, స్వాతంత్ర్యానికి భంగమేకదా? అని నీవనుకుంటా వేమో? అది కూడా సరికాదు. చెబుతా విను. బ్రహ్మ తత్త్వం, సచ్చి దానంద స్వ ప్రకాశ రూపంతో, అంతటా సర్వసమంగా ఉంది. సమస్త పదార్థాల యొక్క సత్త (ఉనికి) ఈ బ్రహ్మ సత్తాకు సంబంధించే ఉంది. వాటికి వేరే సత్త (ఉనికి) లేదు. ఈ సత్తయే భవిష్యత్కాల సంబం ధంతో మాట్లాడితే, భవితవ్యత, అనీ, నియతి అనీ పేరును పొందుతుంది. ఇదియే, (సత్తయే) కారణ పదార్థమునందు, నియామకం అనే రూపం తోనూ, కార్య పదార్థమందు నియమ్యం అనే రూపంతోను ఉంటోంది. కారణం ఉంటే అవశ్యం కార్యం ఉండాలి. కార్యం ఉంటే అవశ్యం కార ణం ఉండాలి. ఈ నియమం తప్పదు. కారణమునందు నియామ కత్వమూ, కార్యమునందు, నియమ్యత్వమూ, ఉంటుంది. కార్యముకంటె పూర్వకాలమందు తప్పక కారణము ఉండాలి. కారణముకంటె తర్వాత కాలమందే కార్యము ఉండాలి.

ఇలా పూర్వకాల సత్తా, పశ్చాత్కాల సత్తాలే, కార్య కారణ ములందుండెడి కారణత్వ కార్యత్వములనే ధర్మాలు కాబట్టి నియతి అనగా, సర్వ ప్రపంచ కారణమయిన బ్రహ్మసత్త అని తేలింది. బ్రహ్మ

అనగా పురుషుడు. "పురిశేతే" శరీరమనే పురమందు శయనించి ఉండే వాడు కాన పురుషుడు, అనువ్యుత్పత్తిని బట్టి పురుష శబ్దము, బ్రహ్మను (పరమాత్మను) చెప్తుతోంది. "ఉత్తమః పురుషస్త్వన్యః" అని గీతా ప్రమాణం కూడా ఉంది.

కనుక బ్రహ్మ సత్తా అయిన నియతి, పురుష ప్రయత్నం అనే పౌరుషానికి అనుకూలమవును కాని ప్రతికూలం కాదు. కాబట్టి శ్రేయో దాయకమయిన పౌరుషాన్ని ఆశ్రయించి, నీ చిత్తాన్ని, ఏకాగ్రంచేసికో, నేను చెప్పే మాట విను. ఇంద్రియాలు ఎప్పుడూ ముక్తికి దిగువనుండే,- ఐహిక సుఖం మీదను, స్వర్గ సుఖం మీదనూ వాలే స్వభావంగలవి. వాటిని పురుష ప్రయత్నంచేత నిగ్రహించు. మనస్సును సర్వసమం చేసికో. తర్వాత, జ్ఞానాన్ని కలిగించేటువంటిన్నీ, మోక్షోపాయాలను ఉపదేశించేటటువంటి, రామాయణ సంహితను విను.

సంసార వాసనలను విడచి, సంపూర్ణమయిన శాంతి వైరాగ్యాలను సంపాదించుకొని వివేకయుక్తమయిన బుద్ధితో కర్మకాండ విచారం చేతనూ, ఉపాసనాకాండ విచారం చేతనూ, కలవరపడ్డ మనస్సు, నిష్కల్మషం అయ్యేటట్లు, ఆత్మను సంధానంచేస్తూ, ఇప్పుడు నేను చెప్పబోయే, మోక్షోపాయమయిన సంహితను విను. ఈ మోక్షకథను విన్నట్లయితే, పునరావృత్తిరహితమయిన సు ఖ స్థి తి ని పొందుతావు. కల్పాదియందు బ్రహ్మదేవుడు, సమస్త దుఃఖాలను రూపుమాపే, ఈ మోక్ష కథను ఉపదేశించాడు. అన్నాడు వసిష్ఠుడు.

అయితే, మహాత్మా! పూర్వం బ్రహ్మదేవుడు ఏందుకు చెప్పాడు? దీన్ని. మీరు ఎలా విన్నారు? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! అంతులేని మాయావిలాసాలకు, అధిష్ఠానమై, సర్వ వ్యాపకుడూ, సర్వాంతర్యామీ అగు పరమాత్మ సర్వజంతువుల యందూ, ప్రత్యగ్రూపంతో ఉన్నాడు. నిర్వికారుడయిన ఆ పరమాత్మ నుంచి, సూక్ష్మ భూతాలు పుట్టి, క్రమంగా, సమస్త కార్యప్రపంచాన్ని

వ్యాపించే స్వభావంగల విరాట్టు పుట్టాడు. విరాట్టు యొక్క హృదయ కమలం నుంచి పరమేష్ఠి (చతుర్ముఖ బ్రహ్మ) పుట్టాడు. ఈయన వేద వేదార్థవేత్త. దేవముని సంఘానికి నాయకుడు. ఈయనగారు సమస్త ప్రాణి సమూహాన్ని సృష్టించాగు. జంబూ ద్వీపం యొక్క కోణంలో, భారత వర్షంలో ఆ ధివ్యాధులతో కూడిన జనసంఘాన్ని సృష్టించాడు. ద్వంద్వ పదార్థాలతో బాధపడుతూ, అల్పాయుర్దాయం గలిగి ఉన్న ప్రాణి సంఘాన్ని చూచి దయకలిగింది బ్రహ్మకు. వీళ్ల దుఃఖంపోయే ఉపాయం ఏది అని, క్షణకాలం ఆలోచించాడు. ఆలోచించి సర్వసమర్థుడు కనుక, ముందు, తపస్సూ, దానమూ, ధర్మమూ, సత్యమూ, తీర్థాలూ, సృష్టిం చాడు, మళ్లీ కొంతసేపు ఆలోచించాడు. ఈ ఉపాయాలవల్ల వీళ్లకు దుఃఖం పూర్తిగా పోదనుకున్నాడు. మోక్షమే మానవులకు ఆత్యంతిక సుఖమని తలచాడు. దానివల్ల కాని జన్మ మరణ రాహిత్యం కాదను కున్నాడు. ఇది (మోక్షం) జ్ఞానంవల్లనే లభిస్తుందికాని, వేరేదానివల్ల లభించదనుకున్నాడు.

మానవులు సంసారాన్ని తరించాలంటే జ్ఞానం ఒక్కటే ఉపాయం కాని, తపస్సూ, ధర్మమూ, దానమూ, ఇవేవి ఉపాయాలు కావని నిర్ణ యించుకున్నాడు. కాబట్టి ప్రాణులకు ఆత్యంతిక దుఃఖనివృత్తి (పూర్తిగా దుఃఖం పోవుటయే) రూపమయిన మోక్షం కొరకు, గట్టి సాధనమయిన జ్ఞానాన్ని ప్రకటించాలని పట్టుదల పట్టాడు. మనసా సంక ల్పించి నన్ను (నీ ఎదుట నున్న వసిష్ఠుని) పుట్టించాడు.

నేను ఆయనగారి సంకల్ప మాత్రంచేత, మాయా వశించే, ఉపాధితో కూడా తయారై, వెంటనే తండ్రివద్దకుచేరాను. కమండలం ధరించి ఉన్న నా తండ్రిని, నేను కమండలంతోటి కూడా నమస్కరించి నాను. నాయనా కుమారా! ఇలా రమ్మని పిలచి, నన్ను ఆయనగారు కూర్చున్న కమలము యొక్క దళము (రేకు) మీద తన చేతితో కూర్చొండపెట్టుకున్నాడు. జింక చర్మమును కప్పుకున్న నా తండ్రి జింక చర్మమును కట్టుకున్న నాతో, "కుమారా" కోతివలె చంచలమయిన నీ చిత్తాన్ని ఒక్క ముహూర్తకాలం "చంద్రుడికి కలంకం అంటుకున్నట్లు

అజ్ఞానం చేరుగాక''. అని అన్నాడు. వెంటనే ఆ పరమేష్ఠి యొక్క సంకల్పానంతరం నిర్మలమయిన నా పరిపూర్ణ స్వరూపాన్ని అంతా నేను మరచిపోయాను. దైన్యం ప్రవేశించింది నాకు. తెలివి తప్పింది. దుఃఖం పొంగిపోయింది. నిశ్చేష్టుణ్ణి అయ్యాను. ఎలాగో తెలివి తెచ్చుకున్నాను. ఈ సంసార దోషం నన్ను ఎలా ఆవహించిందా? అని ఆలోచించాను. ఏమీ తోచలేదు. ఊరకున్నాను. కొంత సేపటికి నా తండ్రి నావద్దకు వచ్చి "కుమారా" ఏమి దుఃఖించుచున్నావు? దుఃఖనివృత్తికి ఉపాయం నన్ను అడుగు నేను చెపుతాను. సుఖిస్తావు అన్నాడు నాతో.

బంగారు పద్మాసనంమీద ఉన్న ఆ పరమేష్ఠిని, సంసార దుఃఖం నశించే మార్గం ఉపదేశించమని కోరాను నేను, పరమ పావనమయిన జ్ఞాన మార్గాన్ని విపులంగా చెప్పాడు నాకు. నేను దాన్ని తెలిసికొని తత్త్వావబోధవలె పరిపూర్ణ స్వభావుణ్ణి అయినాను. ఆత్మ తత్త్వాన్ని తెలిసికొని, మామూలు ప్రకృతికి వచ్చిన నాతో నా తండ్రి ఇలా అన్నాడు. కుమారా! నీవు నా శాపంవల్ల కొంచెం సేపు అజ్ఞానివయినావు. నిన్ను అడిగేవాణ్ణిగా తయారుచేసి, నీకు ఈ జ్ఞానసారాన్ని బోధిస్తేకాని, అధికారులయిన జనులు సంసిద్ధి పొందరని ఇలాచేశాను. ఇప్పుడు నీకు ఆ శాపం పోయింది. తత్త్వబోధ కలిగింది. నీవు లోగడ మలినంగా ఉన్న బంగారం అగ్నిలో శుద్ధిచేస్తే మామూలు మేలిమి బంగారం అయినట్లు తయారయినావు. ''ఇక నీవు భూలోకంలో జంబూ ద్వీపంలో ఉండే భారతవర్షం చేరుము. లోకానుగ్రహం చేయుము. అచ్చట కర్మ కాండయందు ఆసక్తి గలవారికి కర్మకాండనే ఉపదేశించు. విరక్తులై విచారణ కుశలులయిన వారికి, మోక్షదాయకమయిన జ్ఞానాన్ని ఉపదేశించు'' అని నన్ను నియమించాడు. కనుక రాఘవా! అధికారులయిన జనసమూహం ఉన్నంతవరకు నేను ఉంటాను. నాకు ఈ భూలోకంలో చేయదగిన పని ఏమీ లేదు. అయినా అమనస్కుణ్ణి అయి (సంకల్ప రహితుణ్ణి అయి) ఉంటున్నాను. శాంతవృత్తితో ఉన్నాను. అజ్ఞానుల దృష్టిలో కార్యకర్తగా కనిపిస్తాను. నా బుద్ధితో మాత్రం నేనేమి చేయడంలేదు.

# ౧౧ వక్తృప్రచ్ఛక లక్షణము

రామా! భూలోకంలోకి తత్త్వ జ్ఞానం అవతరించిన విధానం నా పుటక, నా పనీ, నా తండ్రియొక్క పనీ, అంతా చెప్పాను నీకు. తత్త్వ జ్ఞానం శ్రవణం చేయటానికి నీ చిత్తం చాలా ఉత్సాహపడుతోంది. అది నీ పూర్వపుణ్యం. అన్నాడు వసిష్ఠుడు.

శ్రీరామునికి జ్ఞానావతార కథను పూర్తిగా విపులంగా వినాలని కోరిక కలిగింది. శ్రవణం చేయటానికి అధికారి లక్షణాలను వినాలనుకున్నాడు. తత్త్వోపదేశవిధులను స్పష్టంగా తెలుసుకోదలచాడు. మళ్లీ వసిష్ఠుని అడిగాడు. స్వామీ! సృష్ట్యనంతరం, భూలోకంలోకి జ్ఞాన మార్గాన్ని ప్రవేశపెట్టడంలో, మీ తండ్రిగారి అభిప్రాయాన్ని పూర్తిగా వివరించండి. అని అన్నాడు శ్రీరాముడు.

వసిష్ఠుడు పూర్వకథనే విస్తరించి చెప్పటం ప్రారంభించాడు. రామా! నా తండ్రి అగు బ్రహ్మదేవుడు ప్రాక్తన విద్యాకర్మ వాసనా విశేషంవల్ల, క్రియాశక్తి ప్రధానుడై, సముద్రంలో, చలన క్రియా రూపంతో తరంగాలు పుట్టినట్లు, పరబ్రహ్మయందు పుట్టాడు. లోకాలనూ, ప్రాణిసమూహాన్నీ సృష్టించాడు. ప్రాణికోటియొక్క జన్మజరా మృత్యు నరకాది దుఃఖాలను గుర్తించాడు. దీనికంతా వీరి అజ్ఞానం కారణం అని గ్రహించాడు. దీనిని బట్టి ముందు వెనుక కాలంలో ఉండే సృష్టియొక్క పరిస్థితి కూడా ఇలాగే ఉంటుందనుకున్నాడు. విశేషించి, స్వర్గమోక్షాలకు సాధనాలను అనుష్ఠించటానికి యోగ్యమైన కృతయుగ కాలం గడిచిందంటే, ఈ ప్రాణుల అజ్ఞానానికి మితీమేరా ఉండదని, నిర్ణయించాడు. ప్రాణికోటి మీద దయాపరవశుడయ్యాడు. అటుపైని నన్ను పుట్టించి, నాకు పలుమారు జ్ఞానోపదేశం చేసి, లోకుల అజ్ఞానాన్ని పోగొట్టడానికి, నన్ను భూలోకానికి వదిలివేసాడు. నావలెనే సనత్కుమారుడు మొదలగువారినీ, నారదాది మహాఋషులనూ, కర్మ ...సనా, జ్ఞానమార్గాలను ఉపదేశించి, లోకాలను ఉద్ధరించడానికి, ...చి పంపాడు.

తరువాత కొంత కాలానికి, కృతయుగం నశించింది. వైదికమయిన (పరిశుద్ధమయిన) కర్మానుష్ఠానం, భూలోకంలో, క్రమంగా క్షీణించింది. దాన్ని మళ్లీ నిలపెట్టడానికీ, లోక మర్యాదలను కాపాడడానికీ, ఆయా మహర్షులు, భూమిని పరిపాలించే రాజులను ఏర్పాటు చేశారు. ఆయా రాజులు పరిపాలించడానికి వేరు వేరుగా దేశాలను పంచి ఇచ్చారు. తరువాత రాజులు పాలించడానికీ, ప్రజలు నడచుకోడానికీ, వారి వారి ధర్మాలను నియమిస్తూ స్మృతి శాస్త్రాలను అనేకములను కల్పించారు. ధర్మ కామములు సిద్ధించడానికి, ధర్మ (యజ్ఞ) శాస్త్రాలను, నిర్మించారు.

ఇలా కాలచక్రం దొర్లుతూ కొంత కాలం గడచింది. తరువాత క్రమంగా ఋషులు ఏర్పరచిన ధర్మాలన్నీ జారిపోయాయి. (నశించాయి) జనులందరూ కేవలం భోజన ప్రియులయ్యారు. విషయాభిలాషులు అయినారు. రాజులకు కూడా విషయవాంఛ అధికమయింది. ఒకరి దేశాన్ని ఒకరు ఆక్రమించదలచారు. పరస్పర కలహాలు పుట్టాయి, ఒకరినొకరు చంపుకోదలచారు. రాజులు వెనక ఎంత సమర్థులయినా అప్పటి పరిస్థితిలో, యుద్ధం లేకుండా పాలించలేకపోయారు. ప్రజలు కూడా దిగులుపడ్డారు. రాజులూ, ప్రజలూ కూడా దైన్యాన్ని చెందారు. వాళ్ల దైన్యం పోగొట్టడానికీ తత్త్వజ్ఞానం ప్రచారం కావడానికీ, మాబోటి వాండ్లం, జ్ఞానోపదేశాలు చేశాము. మొట్టమొదట రాజులకు ఉపదేశించబట్టే అధ్యాత్మ విద్యకు రాజవిద్య అని పేరువచ్చింది. అప్పటి నుంచీ లోకంలో ఆ పేరును వ్యాసాదులు కూడా వాడారు.

రామచంద్రా! రాజవిద్య, రాజ గుహ్యం అయిన అధ్యాత్మ జ్ఞానాన్ని గ్రహించి రాజులు చాలా సుఖించారు. తరువాత భూలోకంలో యశఃకాములయిన రాజులు చాలమంది గడచారు. తుదకిప్పటికి, దశరథునివలన నీవు జన్మించావు, నీ చిత్తం కూడా అతి నిర్మలమయింది. నిర్నిమిత్తంగా పరిపూర్ణ వైరాగ్యం కలిగింది నీకు. లోకంలో ఎంతటి వివేకవంతునికైనా, ఎంత సాధువుకైనా నిమిత్తము ఉండి వైరాగ్యం కలుగుతుంది. అది రాజసం. నీకు అలాకాదు. నిర్నిమిత్తంగా వివేకంతో సాత్వికవైరాగ్యం కలిగింది. భీభత్సంగా ఉండే విషయాలను చూస్తే

ఎవరికి వైరాగ్యం కలగదు? సత్పురుషులకు వివేకంచేతనే ఉత్తమ వైరాగ్యం కలుగుతుంది. ఇలాంటి వారినే మహానుభావులని అనాలి. ప్రపంచ పరిస్థితిని గమనించి విరక్తులయినవారే పురుషోత్తములు. మాయికమైన దృశ్య ప్రపంచాన్ని వివేకంవల్ల మాటి మాటికి విచారించి విడిచినవాడే ధీరుడు, అంటిన ఆధులూ, ఒంటి వ్యాధులూ కడకుచేరే, కాదూ, చూచి ఎవడు విరక్తి చెందడు? స్వతస్సిద్ధమయిన వైరాగ్యమే విరతి శయానం దాన్ని కలిగిస్తుంది, నీవు అకృత్రిమ (సహజ) వైరాగ్యాన్ని పొందావు. మెత్తనినేల విత్తనం నాటడానికి మంచిది. విరక్తిగల చిత్తం జ్ఞానోపదేశానికి అనుకూలం. పరమేశ్వరానుగ్రహంవల్ల నీ బుద్ధి వివేకానికి అభిముఖమయింది. గర్భాధానాది నలభై సంస్కారాలవల్లనూ, ఎనిమిది ఆత్మగుణాలవల్లనూ, తపో, దాన, యోగతీర్థ యాత్రాదులవల్లనూ, పాలించనశిస్తే, మానవుల చిత్తం పరమార్థ విచారంలో ప్రవేశిస్తుంది. పరమపదాన్ని పొందేంత వరకు, రాగద్వేషాలతో కూడుకొని, సంసారంలోనే తిరుగుతూ ఉంటారు మానవులు. దృశ్య ప్రపంచం అంతా నిస్సారమయిందని గ్రహించి జ్ఞానంచేత పరబ్రహ్మను పొందుతారు.

రామా! సంకల్ప భూయిష్ఠమయిన్న ఈ సంసారాన్ని జ్ఞానం లేకుండా మానవుడు తరించలేడు సుమా. మహానుభావులు జ్ఞానయోగం అనే తెప్పచేతనే సంసారసాగరాన్ని నిముషకాలంలో తరించారు. అలాంటి జ్ఞానయోగాన్ని నీవు సావధానంగా విను. సంసార భీతులన్నీ ఎగిరి చక్కాపోతాయి. జ్ఞానయోగం లేకపోతే, ఎండ, వాన, చలి, గాలి, మొదలగు ద్వంద్వ దుఃఖాలను సాధువులు సహించలేక పోయ్యేవారు. అగ్నిజ్వాల గడ్డిపరకనువలె, జ్ఞానరహితుడయిన మానవుణ్ణి ప్రపంచిక దుఃఖచింతలు తగలపెడతాయి. తత్త్వజ్ఞానిని మనశ్చింతలు ఏమీ చెయ్యలేవు. నిప్పు తడికట్టెను తగలపెట్టలేదు. ఆధి వ్యాధులనే సుడిగాలులు వీచుచూ, సంసారమనే ఉప్పు నేలలో ఎంత ఉప్పు గాలి కొట్టినా తత్త్వజ్ఞాని బాధ పడడు. ఈ గాలికి కల్పవృక్షం విరిగిపడదు.

కాబట్టి తత్త్వం తెలిసికోడానికి బుద్ధిమంతుడు ప్రయత్నంతో, ప్రమాణ కుశలుడయిన, జ్ఞానిని అడగాలి. అలాంటివాడు చెప్పిన

మాటనే గ్రహించాలి. తత్త్వం తెలియనివాణ్ణి అడిగినంతటి మూర్ఖుడు మరొకడుండడు. ప్రామాణికుడు చెప్పిన సదుపదేశాన్ని గ్రహించనంతటి నరాధముడూ మరొకడు లేడు. కాబట్టి అజ్ఞుడెవడో, తజ్ఞుడెవడో ముందు నిర్ణయించుకోవాలి. ఆ నిర్ణయం లేకుండా పిల్లవాడివలె అడిగితే, అనర్థాలు సంభవిస్తాయి. అడిగినవాణ్ణి వట్టి అధముడంటారు లోకులు. చెప్పినదానినీ, చెప్పనిదానినీ వేరుపరచి గ్రహించగల బుద్ధిమంతుడికే, అడిగినదాన్ని చెప్పాలి. ఇలాటి పరీక్ష లేకుండా అడిగినవాడికల్లా తత్త్వాన్ని చెప్పేవాడు కూడా మానవాధముడే.

రామా! తత్త్వాన్ని అడగటానికిపూనుకున్న నీవు గుణవంతుడవు. చెప్పటానికి సిద్ధపడిననేనూ గట్టివాడను. కనుకనే, మనయిద్దరికీ ఈసంబంధం తగిపోయింది. కాబట్టి నేను చెప్పేవిషయం నిజమని గ్రహించి మనస్సులో పెట్టుకో. నీవు కులంచేత, గుణాలచేతనూ, గొప్పవాడవు. తత్త్వం తెలిసినవాడవు. నీకు చెప్పినవిషయం గట్టిపడుతుంది. తెల్లగుడ్డకు చెంగాయరంగు బాగా అంటుకుంటుంది. కాబట్టి నేను చెప్పినదాన్ని గ్రహించు. చిరాభ్యాసంచేత మనస్సులో నిలుపుకో. మనస్సుకుపట్టకపోతే మళ్ళీ అడుగు. అంతేకాని చెప్పినదాన్ని వ్యర్థంచేయమాకు.

రామా! మనస్సుఅనేది మహాచంచలం. అది సంసారంఅనే అడవిలో కోతి. దాన్ని నిగ్రహించి పరమార్థాన్ని వినాలి. వివేకంలేనివాణ్ణి, అజ్ఞానంకలవాణ్ణి, దుష్టసహవాసంచేసేవాణ్ణీ, దూరంగాఉంచాలి. సాధువులను పూజించాలి. సజ్జన సాంగత్యంచేత వివేకం పుడుతుంది. భోగమోక్షాలు రెండూ వివేకం అనేచెట్టుయొక్క పండ్లు. మోక్షద్వారానికి, శమమూ, విచారమూ, సంతోషమూ, సాధుసహవాసమూ, అనినలుగురు, ద్వారపాలురు. ఈ నలుగురినీ సేవించాలి. శక్తిలేకపోతే, ముగ్గురినీ, తప్పితే ఇద్దరినయినా సేవించాలి. వీరు మోక్షరాజుయొక్క ఇంటి తలుపులను తెరుస్తారు. ఈ నలుగురిలో ఒక్కణ్ణి అయినా సేవించడం అవసరం. లేకపోతే మోక్షద్వారం తెరవబడదు. ఒక్కణ్ణి స్వాధీనంచేసికున్నా మిగిలినవారందరూ స్వాధీనం అవుతారు.

తేజస్సులలో సూర్యుడువలె, మానవులలో, వివేకంగల పురుషుడే, శాస్త్రాన్ని శ్రవణంచేయటానికీ, శాస్త్రార్థాన్ని ఆలోచించడానికీ శిరో భూషణంలాగ ఉంటాడు. (ముఖ్యుడు) తెలివిహీనులయొక్క మౌర్ఖ్యం ఘనీభవిస్తే, స్థావరత్వాన్ని చెందుతుంది. జాడ్యం ఎక్కువయితే రాయి అవుతుంది. (లకారడకారాలకు అభేదం జాడ్యం అనగా శీతంఅని అర్థం. అది ఎక్కువయితే రాయి అవుతుంది.) ఇది మంచుగడ్డనుండు ప్రసిద్ధం మంచు నీటిలోఉండే మిక్కిలి చల్లదనమే గడ్డకట్టి, కరకం (రాయి) అయింది.

నీవు మాత్రం వినయాది గుణసంపదచే నిర్మలమయిన అంతః కరణ కలవాడవయ్యావు. జ్ఞాన వాక్యాలు వినటానికి చెవులు దోరపెట్టు కున్నావు. వైరాగ్యాన్ని ఎప్పుడూ అలవరచుకోవాలి. శాంతీ, సౌజన్యమూ ఆర్జవమూ, సంపాదించుకోవాలి. వీటివల్ల చెరుపులేదు. సజ్జన సహవా సమూ, శాస్త్రాభ్యాసమూ, మొదలగువానిచేత ప్రజ్ఞను వృద్ధిచేసికోవాలి.

మూఢత్వం నశించాలంటే, కొంచెం సంస్కారంగల బుద్ధితో ఈ గ్రంథాన్ని విమర్శించాలి. సంసారం అనేది విషవృక్షం. ఇది అనేక ఆపదలకు నిలయం. అజ్ఞానిని, వ్యామోహపరుస్తుంది ఎప్పుడూ. కాబట్టి ప్రయత్న పూర్వకంగా మౌర్ఖ్యాన్ని చంపుకోవాలి. వివేకాన్ని పెంచు కోవాలి. మౌర్ఖ్యం అనేది చిత్తంలో అనేక విక్షేపాలను తయారుచేస్తుంది. దురాశలచే సర్పంవలె వంకరగా నడుస్తుంది. అగ్నిలో వేసిన చర్మం ముడుచుకుపోతుంది. మూర్ఖుని చిత్తం కూడా సంకుచిత మవుతుంది. మేఘాలు లేని చంద్రునియందు కన్ను విప్పారుతుంది. అలాగే సూక్ష్మ బుద్ధి ప్రాజ్ఞాత్మయందు వికసిస్తుంది. సూక్ష్మతమమైన వస్తువును గ్రహించ శక్తిగల బుద్ధిశాలియే లోకంలో పురుషుడనిపించుకుంటాడు. రామా! అలాంటి బుద్ధితో నీవు ప్రకాశిస్తున్నావు. నిర్మలమయిన చంద్రునితో ఆకాశం ప్రకాశిస్తుంది.

# ౧౨ తత్త్వమాహాత్మ్య వర్ణనము

రాముణ్ణి నిమిత్తంగా పెట్టుకొని లోకంలో వివేక వైరాగ్యాలు వెదజల్లాలనుకున్నాడు వసిష్ఠుడు. సంసారంలో ఉండే అనర్థాన్ని, తత్త్వ జ్ఞానం యొక్క గొప్పతనాన్ని చెప్పదలచాడు. వినటానికి రాముణ్ణి ప్రోత్సాహపరచాలనుకున్నాడు మొదలుపెట్టాడు.

రామా! నీ మనస్సు గుణాలపుట్ట. అడగటానికి మొనగాడవు. చెప్పిందాన్ని చక్కగా గ్రహిస్తావు. కాబట్టి నీకు చెప్పాలని ఉత్సాహం వేస్తోంది నాకు. రజో గుణం ఉంటే మనస్సు చలిస్తుంది. తమో గుణం ఉంటే అజ్ఞానం ఆవరిస్తుంది. ఏదీ మనస్సుకు ఎక్కదు. కాబట్టి ఆ రెంటినీ దూరంగా ఉంచి, శుద్ధ సత్త్వంతో చిత్తాన్ని పరమాత్మ యందు ఉంచి, జ్ఞానాన్ని విను. అడిగేవాడికి ఉండవలసిన గుణాలన్నీ నీలో ఉన్నాయి. చెప్పేవాడికి ఉండవలసిన గుణాలన్నీ నాలో ఉన్నాయి. సముద్రంలో రత్నాల్లాగ ఈ పొత్తు మన ఇద్దరికీ కుదిరింది. చంద్రకాంత మణికి, చంద్రకిరణ సంపర్కంచేత, చల్లదనంవలె వివేకంచేత నీ చిత్తానికి వైరాగ్యం కుదిరింది.

పద్మాలకు పరిమళంవలె, నీకు మంచి గుణాలు చిన్నతనం నుంచీ అలవాటు అయినాయి. ఇంక అసలు తత్త్వకథ చెబుతా విను. చంద్రుణ్ణి చూస్తేనే, కలువల కొలను వికసించి శుభ్రం (ధ్రం) గా ఉంటుంది. అలాగే ఈ మోక్ష కథ కూడా నీవు వింటెనే వికసిస్తుంది. ఆత్మతత్త్వ సాక్షాత్కారం కలిగి, సర్వ కర్మలూ, నిఖిల మనోవృత్తులూ అంతరించే టంతవరకు వినాలి. పరమాత్మ సాక్షాత్కారం కలిగితే, హృదయగ్రంధులన్నీ పటాపంచలవుతాయి. ప్రళయకాల సూర్య కిరణాలు సోకితే, కుల శైలాలు కూడా పగిలిపోతాయి. సంసారమనే విషూచిక (కలరా) వ్యాధి, ప్రత్యగ్బ్రహ్మైక్య బోధ అనే, గారుడ మంత్రంచేత నివారణ అవుతుంది. పరమాత్మ జ్ఞానమనే మంత్రం సజ్జన సాంగత్యంవల్లనూ, శాస్త్ర విచారణవల్లనూ లభిస్తుంది. ఫలిస్తుంది కూడా. అధికారంగల మానవ జన్మలో ఆత్మ విచారం చేస్తేనే సకల దుఃఖాలు నివర్తిస్తాయి.

కాబట్టి తత్త్వ విచారం చేసేవాళ్లను తృణీకరించరాదు. తత్త్వ విచారం చేసే పురుషుడు పాము పరిపక్వమయిన చర్మమును (కూసమును) విడిచినట్లు, శరీరాన్ని విడిచిపెడతాడు. జగత్తు అంతా ఇంద్రజాలంలాగ చూస్తాడు. సమ్యగ్ జ్ఞానం లేనివాడికి ఈ ప్రపంచం చాలా దుఃఖం.

సంసారమునందు అనురాగం చాలా చెడ్డది. (విషమం) అది పామువలె కరుస్తుంది. కత్తివలె కోస్తుంది. కుంతము (బల్లెము) వలె గది బడుతుంది. తాడువలె చుట్టుకుంటుంది. అగ్ని వలె తగలపెడుతుంది. రాత్రివలె గుడ్డి చేస్తుంది. (అంధకార పరుస్తుంది) తలమీదపడిన రాయి వలె మూర్ఛను కలుగచేస్తుంది. వివేక దృష్టిని హరిస్తుంది. మర్యాదను చెడగొడుతుంది, మోహంఅనే చీకటి బావిలో మానవులను ముంచి లేవ తీస్తుంది. సంసారి పొందని దుఃఖం ఏమీ ఉండదు.

విషయజాలం అనే కలరా వ్యాధికి చికిత్స చేయకపోతే వేల కొలది నరక దుఃఖాలను తయారు చేస్తుంది. మరీ ఇంకా సంసారంలో ఉండటం అంటే, రాళ్లు తినటం అన్నమాటే. కత్తితో నరకటమే. నిప్పుతో మంపపెట్టడమే. మంచులో పొర్లించడం. పర్వతాలనుంచి పడ వేయడం. అసిపత్రవనంలో పరుగెత్తడం. గ్రీష్మకాలాన్ని గడపటం. ఇవన్నీ ఎంత కష్టమో, సంసారం కూడా అంత కష్టం అన్నమాట. ఇలాంటి అనర్థాలతో కూడిన సంసారంలో అనాదరం కూడదు. ఇదేం చేస్తుందిలే అని అనుకోకూడదు. తప్పక అధ్యాత్మ విచారం చెయ్యాలి. తెలిసికోవాలి. శాస్త్ర విచారంవల్లకాని శ్రేయస్సు లేదు.

కనుకనే రామా! ధ్యానపరులైన మునులూ, మంత్రజపపరులైన ఋషులూ, కర్మపరులైన విప్రులూ, జనకాది రాజులూ, జ్ఞాన కవచంచేత, శరీరాన్ని కప్పుకున్నందున దుఃఖభూయిష్ఠమైన సంసారంలో ఉన్నట్లు కను పడుచున్నా సుఖంగా కాలం గడిపారు. వీళ్లు పరిశుద్ధాంతఃకరణులు. ఆత్మ సాక్షాత్కారం కలవాళ్లు మానవోత్తములు. భోగేచ్ఛ లేనివాళ్లు. కనుకనే విక్షేపరహితులు. హరి హర బ్రహ్మాదులాంటివారు. గురువును సేవించాలి. శాస్త్ర విచారం చెయ్యాలి. పదార్థాలను పరిశోధించాలి.

స్థూల సూక్ష్మాది శరీరాలు అనాత్మ పదార్థాలని గట్టి నమ్మికతో నెట్టి వెయ్యాలి. తరువాత తత్త్వాన్ని తెలిసికోవాలి. మననంచేత ఆత్మతత్త్వం మీాద అసంభావనను రూపుమాపాలి. నిదిధ్యాసనం చేత విపరీత భావనను తోసివెయ్యాలి. తత్త్వసాక్షాత్కారాన్ని పొందాలి. దానివల్ల మోహాన్ని, పటాపంచలు చెయ్యాలి. భ్రాంతి జ్ఞానాలనే మేఘాలను పారద్రోలాలి. ఆపైని ఈ ప్రపంచంలో భ్రమణం రమణం అవుతుంది. పీడనం కాదు. ఆపైన ఈ జగన్నాటకం అంతా ఆట అవుతుంది. బాధించదు.

హృదయంలో చిదాత్మ నిర్మలమయితే. శాంతి పెచ్చు పెరిగితే, బుద్ధి వృత్తులన్నీ శాంతిరసాన్ని ఆస్వాదించసాగితే, అంతఃకరణం బ్రహ్మనంద రసాన్ని ఆస్వాదిస్తూ ఉన్నట్లుగా, సర్వసమత్వాన్ని పొందితే, జగన్నాటకం ఆటకాక ఏం ఉంది? జడమయిన శరీరం రథం. ఇంద్రియ వృత్తులు గుర్రాలయొక్క చమత్కార నడకలు. మనస్సు కళ్లెం. సమాధి కాలంలో ఆనంద రూపుడుగా ఉండే పరమాత్మ, వ్యవహారకాలంలో బుద్ధి మొదలగు ఉపాధి పరిచ్ఛేదంవల్ల అణువో, సూక్ష్మమో అయి రథికుడయ్యాడు. ఈ బుద్ధితో విహరించేవాడికి లోక వ్యవహారం ఆట కాక మరేమిటి?

## ౧3 శమ నిరూపణం

రామచంద్రా! మహానుభావులంతా సంసారంలో ఇలాంటి భావంతోనే సంచరించారు. దుఃఖించరు. మంచి పొందాలనుకోరు. చెడుపోవాలనుకోరు. కాబట్టే వాటి సాధనలను గూర్చి ఎవరినీ యాచించరు. అంతా చేస్తూ ఉన్నట్లే కనిపిస్తారు. కాని ఏమీా చేసినవారుకారు. (అంతా చేస్తారు. ఏమీా చెయ్యరు.) నిర్లేపంగా ఉంటారు, శాస్త్రీయమైన కర్మజాలం ఆచరిస్తారు. లౌకికమైన సన్మార్గాన్ని అనుసరిస్తారు. కావలిసిందీ, అక్కరలేందీ అంటూలేదు వారికి. స్వస్వరూపంలో ఉండిపోతారు.

ఇతరుల దృష్టిలో, వస్తున్నట్లూ, పోతున్నట్లూ, చేస్తున్నట్లూ

మాట్లాడుతున్నట్లూ, కనిపిస్తారు, వారి దృష్టిలో రావడంలేదు పోవడం లేదు. చెయ్యడం లేదు. మాటాడం లేదు. తత్త్వ సాక్షాత్కారం (జ్ఞానం) కలిగితే, అన్ని కర్మలూ, అన్ని బుద్ధులూ నశిస్తాయి. అప్పుడు హేయోపాదేయ బుద్ధి ఉండదు. అన్ని కోరికలు నశించి, శాంతమైన (బ్రహ్మాకారమయిన) చిత్తాన్ని సంపూర్ణ సుఖం చేరుతుంది.

పూర్ణ చంద్రునియందు అమృతం అపరిమితం. ఇంత అని చెప్ప లేరు, అలాగే విక్షేపరహితమైన చిత్తంలో సుఖం ఇంత అని కొలత తీయలేము. అది కొలతకు అందదు, అపరిమితం. అప్పుడు మాయా ప్రయుక్తమైన విక్షేపాలను మానుకుంటుంది మనస్సు. వాటి వాసనలవంక కూడ చూడదు. తన సహజ చాపల్యాన్ని కట్టిపెడుతుంది. అనాది సిద్ధమైన ఆత్మ సుఖమే ప్రకాశిస్తూ ఉంటుంది అందులో. మనస్సుకు ఇలాంటి స్థితి పట్టాలంటే, ఆత్మ తత్త్వ జ్ఞానమే కారణం. మరొకటి ఏదీలేదు, కాబట్టి పురుషుడు బ్రతికి ఉన్నంతవరకు తత్త్వ విచారం చెయ్యాలి. అనగా శ్రవణం చెయ్యాలి మననం చెయ్యాలి. నిదిధ్యాసనం చెయ్యాలి. ఆత్మను తెలిసికోవాలి, శ్రవణమననాదులు అభ్యసించే సాధకుడికి, వాడి అనుభవానికీ, శాస్త్రం చెప్పించడానికీ, గురువు ఉపదేశించిందానికీ, ఏకార్థ నిశ్చయం. (ఈ మూడు ఒకటే అనే నిశ్చయం) కలిగితే, వాడికి ఆత్మ సాక్షాత్కారం నిరంతరం కలింగిందన్నమాట.) శాస్త్రార్థాన్ని ఆదరించక, సజ్జనులను తిరస్కరించినవాళ్లు మూఢులు, వాళ్లు స్వయంగా అనర్థాలకు దారితీసికుంటూరు. భూలోకంలో మానవులకు శరీరంలో ఉండే మూర్ఖత్వంవంటి వ్యాధి మరొకటి ఏదీలేదు దుఃఖపెట్టడానికి. అధివ్యాధులు ఇంతగా బాధించవు. కష్టాలూ బాధించవు. తుదకు విషం కూడా ఇంతగా దుఃఖపెట్టదు. (కొంచెం బుద్ధి సంస్కారంకల వాళ్లకి ఈ శాస్త్రంవలె మౌఢ్యాన్ని పోగొట్టేది మరో శాస్త్రం ఏదీలేదు,

కాబట్టి, ఆత్మ తత్త్వాన్ని ప్రేమించేవాళ్లు అవశ్యంగా ఈ వాసిష్ఠ రామాయణం అనే మోక్ష శాస్త్రాన్ని వినాలి, వినక పోవడం మూర్ఖం. దీనివల్ల అనివార్యమైన ఆపదలూ, అతి నీచమైన జాతులూ సంప్రాప్తం

అవుతాయి. మూఢత్వంతో, బ్రతకటంకంటె, మట్టిమూకుడు చేతబూని మాదిగ కొంపలలో బిచ్చమెత్తుకోవడం మెరుగు. అంధకారబంధురం అయిన పాడుబావుల్లో, పురుగై పుట్టి బ్రతకవచ్చు. చెట్ల తొర్రలలో కీటంగా నయినా బ్రతకవచ్చు. అతిదుఃఖకరమయిన మూర్ఖత్వంతో బ్రతక రాదు. మోక్షోపాయం అయిన ఈ వాసిష్ఠరామాయణం అనే వెలుగులో పడ్డాడా? మానవుడు, ఇంక మళ్లీ మోహం అనే అంధకారంలోకి రాడు. వివేకమనే సూర్యుడియొక్క వెలుగు సోకేంతవరకే, మనస్సు అనే పద్మం, తృష్ణవల్ల ముడుచుకుపోతూ ఉంటుంది.

కాబట్టి రామా! సంసారదుఃఖ మోక్షం కొరకు, మాబోటి బంధువులవల్ల, ఆత్మస్వరూపాన్ని తెలుసుకో. హరిహరబ్రహ్మాదులూ, బ్రహ్మర్షులూ, ఎలా ఈ లోకంలో జీవన్ముక్తులై ఉంటున్నారో, అలా ఉండు నీవు కూడా. సంసారంలో దుఃఖాలు అనంతాలు. సుఖం చాలా స్వల్పం. కాబట్టి దుఃఖంతో కూడిఉన్న ఈసుఖాలమీద నీవు ఆస్థపెట్టుకో వద్దు. వివేకంగల పురుషుడు పౌరుషం చేత, జ్ఞానం సంపాదించాలి. పరమ పురుషార్థం సాధించాలి. ఎవరి మనస్సు సర్వోత్కృష్టమయిన స్థానాన్ని ఆశ్రయిస్తుందో, వాళ్లే పరమ పురుషార్థానికి తగిన పురుషులు. (సర్వోత్కృష్టమయిన స్థానాన్ని చేరుకున్న మనస్సు గలవాళ్లే పురుషార్థాన్ని సాధించడానికి యోగ్యులు.) స్త్రీసుఖంతోటి ఆహారంతోటి సంతోషిస్తూ, రాజ్యాదిసుఖాలలో మునిగి తేలే మూఢులు, చీకటి బావులలోని కప్పలు. ప్రపంచభోగాలను అనుభవించేవారు మహా మోసం చేస్తారు. పాపానికి దారి తీసికొంటారు. ఇతరులకు దారి చూపుతారు. వదల్చుకుందామనుకున్నా వదలరు. పైకి మిత్రునివలె కనపడతారు. లోలోపల శత్రువువలె మహాపకారం చేస్తారు. ఇలాంటి వారిని కూడా సేవించే (ప్రేమించే) మూఢులు కొందరుంటారు. అలాంటి వాళ్లకు ఎన్నాళ్లు అనుభవించినా తీరని నరకరాశి తయారవుతుంది. జన్మపరంపరా సంకటముల పాలవుతారు. పలురకాల దుఃఖాలను, పలువిధాల భయాలను పొందుతారు. శాస్త్రం "సుఖం తర్వాత దుఃఖం. దుఃఖం తర్వాత సుఖం" అని చెపుతోంది. ఈ ఘటీయంత్రానికి తెంపులేదట. క్షణభంగురమట. శ్రేయస్కాముడికి ఇందులో (ప్రాపంచిక సుఖంలో) విశ్రాంతి చిక్కదట. రామా!

నీబోటి విరాగులే మహానుభావులు. లోకవంద్యులు. మోక్షార్థులు, పర వైరాగ్యాన్ని అలవరచుకొని, తత్త్వజ్ఞానం పొంది సంసారాన్ని తరించాలి. వివేకంగలవాడు ఎన్నడూ, విషంవలె మూర్ఛపెట్టే సంసారమాయలలో కనుమూసి ఉండడు. సంసారంలోపడి, రాబోయే అనర్థాలను లక్ష్యపెట్టని వాడు, ఎత్తైన కొల్లుకొంపకు నిప్పుముట్టించి దాని కెదురుగా పరున్నవాడు.

ఆవృత్తిరహితం, దుఃఖశూన్యం, వివేకలభ్యం అయిన తావు ఒకటి ఉంది. సందేహంలేదు. ఒకవేళ లేదని మీకు సందేహమున్నా, దాన్ని గూర్చి విచారిస్తే, తప్పులేదు. అలాంటి తావు ఉన్నట్లయితే, సంసారాన్ని తరిస్తారుగా తప్పకుండా. కాబట్టి ఫలం గొప్పదయినప్పుడు, సందేహంగా ఉన్నా ప్రయత్నించాలి. ఉపేక్షించరాదు. మోక్షోపాయాన్ని విచారించే వాడికి మోక్షఫలం సులువు. ఈశ్వరానుగ్రహమూ, జన్మాంతర సంస్కారమూ, లేకపోతే, అందరికీ ఆబుద్ధిపుట్టదు. కనుకనే " యావన్నానుగ్రహా స్సాక్షాత్ జాయతే పరమేశితుః । తావన్న సద్గురుం కశ్చిత్ సచ్ఛాస్త్రం వాపి విందతి॥ " పరమేశ్వరానుగ్రహం లేనంతవరకూ, గురుసేవకాని, శాస్త్రాభ్యాసంకాని, లభించదని అంటారు పెద్దలు.

స్వర్గసుఖం నశ్వరం. క్రిందకు మళ్లీ వస్తామనే ఆ శంక అందులో ఉంది. మనస్స్వాస్థ్యం ఉండదు. మనోభ్రాంతులు నశించవు. కైవల్యంలో ఈ అనర్థాలు లేవు. కాబట్టి ముల్లోకాలలో దీనికి మించింది లేదు. మోక్షోపాయాన్ని విచారించడానికి ప్రవర్తించాడా? సాధకుడు, కైవల్యప్రాప్తిలో కష్టపడడు. కైవల్యం పొందటానికి, డబ్బు ఉపకరించదు. స్నేహితులు ఉపకరించరు. బంధువులు సాయపడరు. చేతులూ, కాళ్లూ, కదిల్చి నమస్కారాలుచేస్తే లాభం లేదు. దేశాంతర గమనం ఉపయోగం లేదు. ఉపవాసాలుచేసి, శరీరేంద్రియాలు కృశింపచేసికుంటే ప్రయోజనం లేదు. శ్రవణంచెయ్యాలి. మననంచెయ్యాలి. నిదిధ్యాసనం చెయ్యాలి. ప్రపంచ, (ద్వైత) వాసనలను చంపుకోవాలి. మనస్సును జయించాలి. అఖండ బ్రహ్మసాక్షాత్కారం పొందాలి. మోక్షం రావాలి. 'నేను బ్రహ్మను' అనే వాసన ఎప్పుడూ ఉంటే అవిద్యా విక్షేపాలు ఎగిరిపోతాయి. మోక్షం వివేక సాధ్యం. వివేకమనగా దేహేంద్రియాదులకంటె ఆత్మ వేరని

గ్రహించుట. అది శ్రవణమననాది విచారంవల్ల నిశ్చితం అవుతుంది. ఏకాగ్రతవల్ల గట్టిపడుతుంది. విషయ పరిత్యాగం చేసినవాడికి ఇది లభిస్తుంది. సుఖమయిన ఆసనం వేసికొని ఆత్మ విచారం చేసేవాడు ఉత్తమ స్థానాన్ని పొందుతాడు. మళ్లీ పుట్టడు దుఃఖాలకు గురికాడు.

ఆత్మ తత్త్వం ప్రాపంచిక సుఖలవాలకు పరమావధి. సర్వోత్కృష్టమైన విశ్రాంతి స్థానం. ప్రపంచ (సంసార) వ్యాధికి పరమౌషధం. ఇహపరలోకములలో ఏ పదార్థాలూ నిత్యములు కావు. అన్నీ నశించేవే. వీటిలో సుఖంలేదు. మృగతృష్ణికలలో (ఎండమావులలో) నీరు ఉండదు. కాబట్టి ప్రతివాడూ మనో నిగ్రహాన్ని ఆలోచుంచుకోవాలి. శమసంతోషాలు అలవరచుకోవాలి. సర్వ వ్యాపక చైతన్యమునందు చిత్తాన్ని నిలపాలి. ఆనందంపొందాలి. శాంతిలేనిదే ఇది దొరకదు. కాబట్టి శమం అనే గుణాన్ని సంపాదించుకోవడం అవసరం. ఇది కూర్చుని కాని, నిల్చుండికాని, తిరుగుతూకాని, సంపాదించుకోవచ్చు. నియమాలు ఏమీ అవసరం లేదు. వివేకం అనేది ఒక పెద్దచెట్టు. శాంతి దానిపువ్వు. పరమానందం దానిపండు. ఇలాంటి కైవల్య ఫలం చిక్కిన తరువాత పొమ్మంటే పోదు. ఎంత వ్యవహారపరుడైనా రమ్మంటేరాదు. పరిపూర్ణమైన దీనికి హానోపాదానాలు లేవు. కాక, మనస్సు ప్రశాంతమై అతి స్వచ్ఛమై, ఆత్మ స్వరూపంలో విశ్రాంతమై, భ్రాంతులను చంపుకొని, కోరికలను రూపుమాపుకొని ఉంటే, ఇంక ఎలా కోరుతుంది? ఎలా వద్దనుకుంటుంది?

రామా! ఇంక మోక్షద్వారానికి, ద్వారపాలకులను చెపుతా నీకు విను. వార్లలో ఒక్కణ్ణి లోపరచుకున్నా మోక్షరాజ్యంలో ప్రవేశిస్తావు నీవు. సంసారం అనే మరుభూమి, సుఖాశ (సుఖవాంఛ) అనే దప్పికతో తిరిగే ప్రాణికి దుర్భరంగా ఉంది. అలాంటి భూమికూడా శీతకిరణుని వెన్నెలవంటి, శాంతగుణంచేత చల్లపడుతుంది. కాబట్టి శమమే పరమపదము. శమమే శివుడు. శమమే సర్వ దుఃఖోపశాంతి. శమమే భ్రాంతినివృత్తి. "అయుర్ఘృతం" "నెయ్యి ఆయుర్దాయం" అన్నట్లు సాధ్యానికీ సాధనానికీ భేదంలేదు. శాంతిగుణంచే తృప్తిపడ్డవాడికీ, గాఁగ

ద్వేషాది తాపాలు వదలి చల్లపడినవానికీ, అజ్ఞానం నశించి నిర్మలుడైన వానికీ, శత్రువుకూడా, మిత్రుడవుతాడు. చంద్రోదయంచేత, క్షీరోదములకు, (పాలసముద్రాలకు) పరిశుభ్రత కలుగుతుంది. శాంతిచేత చిత్తానికి నైర్మల్యం పెరుగుతుంది.

సత్పురుషుల యొక్క హృత్పుండరీకములనే కోశములలో శమం అనే పద్మం పుట్టి వికసించేటట్లయితే, వాళ్లు విష్ణుమూర్తితో సమానులు, అనగా రెండు హృత్పద్మములుగలవాళ్లు. విష్ణుమూర్తియొక్క హృత్పద్మమే, బాహ్యంలో బ్రహ్మగారికి ఆసనంగా ఉండే పద్మంగా విడిపోయింది. ఇలా ద్వైధీభావాన్ని చెందినందువల్ల విష్ణువు రెండు హృత్పద్మములు కలవాడయ్యాడు.

శమ విభూతులు ఆనందపరచినట్లు, ముల్లోకములలోని ఐశ్వర్యాలు కూడా ఆనందపరచలేవు. అనంతములైన దుఃఖాలు, అంతులేని ఆశ, (తృష్ణ) సహింపరాని మనోవ్యాధులూ, ఇవన్నీ శాంతచేతస్కులయందు పటాపంచలై పోతాయి. సూర్యకిరణాలు బయటికివస్తే చీకటి పలాయనం చెప్తుంది. చిత్తంలో శాంత గుణం ఉదయిస్తే ఉత్సాహం పుట్టినట్లు, చంద్రోదయం అయినా మానవులకు అంత ఉత్సాహం పుట్టదు. శాంత గుణంగల సత్పురుషుడికి పరతత్త్వం అనాయాసంగా ఆవిర్భవిస్తుంది. శమశాలి అయిన పురుషుణ్ణి చూస్తే క్రూర భూతాలు, సౌమ్యభూతాలు అన్నీ తల్లిని నమ్మినట్లు నమ్ముతాయి. మనస్సులో శాంతగుణం ఉంటే కలిగే సుఖం, స్వర్గంలో అమృతపానం చేసినా, విష్ణు లోకంలో లక్ష్మిని కౌగలించుకున్నా కలుగదు.

కాబట్టి శ్రీరామా! ఆధివ్యాధులతో భయపడి, ఆశాపాశాలచే ఆకర్షింపబడి శ్రమచెంది ఉన్న చిత్తాన్ని (మనస్సును) శాంతి అనే అమృతాభిషేకాలతో ఓదార్చు. శాంతుడై చేసిన పనియే మనస్సుకు మిక్కిలి రుచిస్తుంది. శమం అనే అమృతరసంతో నిండి ఉన్న మనస్సుకు కలిగే సంతోషాన్నిపట్టిచూస్తే, నరికిన అవయవాలు కూడా మళ్లీవాడికి మొలచినవా! అనిపిస్తుంది, శమశాలి అగు మానవుణ్ణి పిశాచాలుకాని,

రాక్షసులు కాని, దైత్యులు కాని, శత్రువులు కాని, వ్యాఘ్ర భుజంగాలు కాని ద్వేషించవు. లోహమయమైన బాణాలు, వజ్రపురాయిని భేదించలేవు. శాంతగుణం అనే అమృత కవచంచే దాచుకున్న అవయవాలుగల యోధుణ్ణి, ఉక్కు బాణాలు కూడా బాధించలేవు. శాంతగుణంచేత సమచిత్తుడైన పురుషుడు విరాజిల్లినట్లు, అంతఃపురంలో ఉన్న రాజుకూడా ప్రకాశించడు. శమచిత్తుడయిన పురుషుని చూస్తే కలిగే సంతోషం, తన ప్రాణంకంటె మిక్కుటమయిన మిత్రుడు లభించినా కలగదు. శమశాలియై, సమచిత్తతతో, సాధువృత్తిని అలవరచుకొని, లోకఖ్యాతిని పొందిన మానవుడే, సఫలమయిన జీవితంకలవాడు. లేనివాడి జీవితం నిష్ఫలం. వినీతుడూ, శాంతుడూ చేసిన పనిని లోకులందరూ అభినందిస్తారు. ఇష్టమయిన దానిని కాని, అయిష్టమయిన దానిని కాని, మంచి దానినీ, చెడు దానినీ, విన్నా, కన్నా, తిన్నా, తాకినా, హర్షవిషాదాలు (సంతోష దుఃఖాలు) లేనివాణ్ణి శాంతుడంటారు. సర్వభూతాలయందు సమబుద్ధికలవాడినీ, భావి (ఆగామి) సుఖాదులను కోరనివాడినీ, ప్రారబ్ధంచే వచ్చినదాన్ని విడిచిపెట్టనివాడినీ, ప్రయత్నపూర్వకంగా ఇంద్రియాలను జయించినవాడినీ, శాంతుడంటారు. లోపలా, వెలుపలా, నిర్మలమయిన బుద్ధిచే, ఇతరుల కౌటిల్యాన్ని తెలిసికొని కూడా, మోక్షానికి సాధనంగా, చేయతగిన కార్యాలు చేసేవాణ్ణి శాంతుడంటారు. చంద్రబింబంవలె చల్లని మనస్సుగలవాడై, మరణం అంటే భయంలేక, ఉత్సవాలంటే ఉత్సాహం (రాగం) లేక, యుద్ధాలలో క్రోధంలేనివాణ్ణి శాంతుడంటారు, హర్ష విషాదాలకు నిమిత్తమయిన ప్రదేశంలో తాను ఉన్ననూ, అచ్చట లేనివాడివలె, హర్షవిషాదాలు పొందనివాణ్ణి శాంతుడంటారు. గాఢ నిద్రలో ఉన్నవాడివలె స్వస్థుణ్ణి శాంతుడంటారు. సకల జనులయందూ, అమృత ప్రవాహంవలె, సుఖమయిన దృష్టికలవాణ్ణి శాంతుడంటారు. ప్రాపంచిక విషయాలతో వ్యవహరిస్తున్నా, వాటి మీద ఆసక్తి లేనివానిని, చల్లని మనస్సుగలవాడిని, ప్రాపంచిక వ్యామోహంలో పడనివాడినీ, శాంతుడంటారు.

దుఃఖాంతములైన ఆపదలు, ఎంత గొప్పగా తటస్థించినా, నశ్వరమయిన దేహాదులందు అహంమమాభిమానం లేనివాణ్ణి శాంతుడంటారు.

ప్రారబ్ధాధీనుడై ఎంతటి వ్యవహారగోష్ఠిలో ఉన్నా, చిత్తం నిర్వికారంగా ఉండి, రాగద్వేషాది లేపాన్ని పొందనివాణ్ణి శాంతుడని అంటారు. తాపసులలో, విద్యావంతులలో, యజ్ఞయాగాలు చేసినవారలలో, బలవంతులలో, గుణాఢ్యులలో, శాంతుడే ప్రకాశిస్తాడు. మిగిలిన యోగ్యతలన్నీ దీనిక్రింద పనికిరావు. శాంతుల చిత్తం నుంచి అఖండానందం బయులుదేరుతుంది. శీతకిరణుని నుంచి వెన్నెల బయులుదేరుతుంది. గుణ సమూహాలకు పొలిమేర శమము. పురుషులకు ముఖ్య భూషణము శమము. ఎంత సంకట స్థితిలో అయినా శమమనే గుణము, తన కళాకాంతులతో వెలుగుతూనే ఉంటుంది. శమము అమృతము ఇతరులు దీనిని అపహరించలేరు. ఆర్యులు దాచుకున్నారు దీన్ని. పరమపదమును పొందారు. రామచంద్రా! నీవుకూడా అట్టి మహానుభావుల క్రమాన్ని అనుసరించి కాపాడుకో.

గమనిక: గురూ! ఇక్కడ (ఈ సర్గలో యాభై అయిదవ 55 శ్లోకంలో) మోక్షద్వారానికి ద్వారపాలకులను చెప్పుతానని ప్రతిజ్ఞ చేశారు వసిష్ఠులవారు. కాని శమం అనే గుణాన్నే ఎక్కువగా స్తుతించారు. శాంతుని లక్షణాలనే ప్రస్తావించారు. మిగత వారి మాటే ఎత్తుకోలేదు. కారణం ఏమిటో? లోగడ మోక్షానికి ద్వారపాలురు 4 నలుగురని చెప్పినట్లు జ్ఞాపకం. మిగిలిన ముగ్గురినీ ఇక ముందెక్కడనైనా చెపుతారా? ఇంతటితో సరియేనా?

శిష్యా! లోగడ 12 వ సర్గలో మోక్షానికి, శమమూ, విచారమూ, సంతోషమూ, సాధుసహవాసమూ, అని నలుగురు ద్వారాపాలురు అన్నారు వసిష్ఠులు. అందులో ప్రధానంగా ఒక్కణ్ణి స్వాధీనం చేసికొంటే మిగిలిన ముగ్గురూ స్వాధీనం అవుతారని కూడా సూచించారు. బహుశా ఆ ఒక్కరు ఈ శమం అనే వారే అయి వుండవచ్చు. వారి అభిప్రాయంలో. కనుకనే శమమును స్తుతించడం. శాంతుణ్ణి పలువిధాల నిర్వచించడం జరిగింది ఇక్కడ. ఇకముందు మిగతా ముగ్గురునీ చెపుతారు పై సర్గలలో. కనుకనే ఇక్కడ యథాక్రమంగా చెపుతా వినమన్నారు. అందరినీ ఇక్కడనే చెపుతాననలేదు.

---

# ౧౪ విచార నిరూపణము

ప్రధానమయిన ద్వారపాలుణ్ణి వర్ణించారు వసిష్ఠులు. విచారుడనే రెండవవాణ్ణి వర్ణిస్తారు

విచారము అయిదు రకాలు. 1. అర్థానర్థానుబంధ విచారమూ. 2. సారాసార విచారమూ. 3. హేయోపాదేయ విచారమూ. 4. ప్రమాణ తాత్పర్య విచారమూ. 5. ఆత్మ తత్త్వ పరీక్షా విచారమూ అని.

1. "మానవుల యొక్క స్వాభావిక ప్రవృత్తివల్ల అనర్థం. ప్రాపంచిక విషయాలను అనుభవించటం అనర్థం. శాస్త్రీయమయిన ప్రవృత్తి పురుషార్థ సాధనం. వైరాగ్య శమదమాదులు పురుషార్థ సాధనాలు" అని పరీక్షించుకునే విచారం మొదటిది.

2. "తాను ప్రేమించే పుత్ర మిత్ర కళత్రాది శరీరాలు అన్నీ స్వరూపంలో అపరిశుద్ధములు. కారణ రూపంలో అసహ్యములు. పరిణామంలో అతి నీచములు. మలమూత్రాది నీచవస్తువులతో నిండి ఉన్నాయి. బ్రహ్మలోక కాంత సుఖాలన్నీ దుఃఖంతో నిండి ఉన్నాయి. వీటిలో కేవలసుఖమనేది సున్న. వీటిలో ఏదీ నిత్యంకాదు" అనే విచారం రెండవది.

3. మోక్షసాధనం కర్మా? లేక ఉపాసనయా? లేక ఈ రెండూ కలసి మోక్ష సాధనమా? లేక జ్ఞాన సముచ్చితమయిన ఈ రెండూ మోక్షసాధనములా? లేక జ్ఞానమొక్కటే మోక్ష సాధనమా? అని విచారించడం మూడవది.

4. ఒకవేళ జ్ఞానమే మోక్ష సాధనం అన్నా, అది శ్రుతి సిద్ధమయిన జ్ఞానమా? లేక సాంఖ్య, వైశేషికాది తంత్ర (శాస్త్ర) సిద్ధమైన జ్ఞానమా!? శ్రుతిసిద్ధమైన జ్ఞానమే మోక్ష సాధనం అయ్యే ఎడల, శ్రుతులకు ద్వైతమందు తాత్పర్యమా? అద్వైతమందు తాత్పర్యమా? సవిశే

షమునందా? నిర్విశేష చిన్మాత్రమునందా? అని విచారించడం నాల్గవది.

5. శ్రుత్యాది ప్రమాణములకు, అద్వితీయ సచ్చిదానంద బ్రహ్మాత్మైక్యమందే, తాత్పర్యమని, నిర్ణయమయిననూ, తన జీవాత్మ నిజంగా, అట్టి వాడవునా? కాదా? అనే సందేహంతో, రత్న పరీక్షా న్యాయాన్ని అనుసరించి, అనుభవనిష్ఠుడైన గురువును ఆశ్రయించి, వారి సంవాదాన్ని పొంది, జీవ, ఈశ్వర, జగత్తుల తత్వాన్ని పరిశోధిస్తూ, పూర్తి నిర్ణయానికి వచ్చినదాకా పరీక్షించడం అయిదవది.

ఈ విచారం అంతా శాస్త్రజన్య జ్ఞానంతో జరగాలి. అంతఃకరణ నిర్మలంగా ఉండాలి. గుణం కుదరాలి. గురువు దరి చేరాలి. నిరంతర గోష్ఠి జరపాలి. విషయం తేలాలి. (నిజం తేలాలి) ఇలాంటి విచారంవల్ల బుద్ధి తీక్ష్ణమవుతుంది. సూక్ష్మ తత్త్వాన్ని గ్రహించ గలుగుతుంది. పరతత్త్వాన్ని తెలిసికొంటుంది, సంసారం అనే దీర్ఘ వ్యాధికి దివ్యౌషధం ఆత్మ విచారం. సంసారం అడవి. ఇది విషయ ప్రవృత్తులతో, చిగిర్చి ఉంటుంది. దీన్ని ఆత్మ విచారం అనే రంపంతో కోతకోస్తే మళ్లీ మొలకరించదు. బంధువులు నశిస్తే, కష్టాలు వెంటపడితే, దుఃఖం పొంగిపోతుంది. చిత్తానికి ఏమీ తోచదు. దుఃఖాన్ని తరించే మార్గం కానడు మానవుడు. అప్పుడు ఈ ఆత్మ విచారమే గతి. ఇంతకంటె వేరే ఉపాయం లేదు సంకటాలు తరించటానికి. ఆత్మ విచారంవల్ల చిత్తమునందలి పాప వాసనలు పరుగెత్తుకుపోతాయి. శుభ సంపత్తి చేకూరుతుంది. "శరీర బలం, బుద్ధి బలం, తేజస్సు, తాత్కాలిక ప్రతిభ, కర్మ ఫలం" ఇవన్నీ, దీనివల్ల ఫలిస్తాయి సత్పురుషులకు. ఇది యుక్తా యుక్తాలు విప్పి చూపటానికి పెద్ద దీపం. ఇది మంచి చెడ్డలను కండ్ల పరచుటకు కాగడా. కోర్కెలు తీర్చటానికి కల్పవృక్షం. సంసార జలధిని తరించటానికి పెద్ద నౌక. మానవుల హృదయ స్థానంలోని వివేకములు అనే పద్మాలను, మహామాయములు అనే మదపుటేనుగులు తెంచిపారేస్తున్నాయి, వీటి మదం అణచటానికి తగింది ఆత్మ విచారం అనే సింహం ఒక్కటే.

తరణోపాయ మార్గాన్ని గుర్తించలేని మూఢులు ఎవరైనా

కొందరు కాలవశాన పరతత్త్వాన్ని గుర్తిస్తున్నారంటే, అది అంతా ఈ విచారం అనే దీపం యొక్క వెలుతురు మహిమే. ఈ రాజ్యాలూ, భోజ్యాలూ, స్వర్గ మోక్షాలూ, ఇవన్నీ ఈ విచారం అనే కల్పవృక్షం యొక్క పండ్లు. విచారంవల్ల వికసించిన, మహనీయులమతులు, ఆపదలో మునగవు, ఎండు సొరకాయ బుర్రలు నీటిలో మునగవు. విచార పూర్వకమయిన బుద్ధితో వ్యవహరించే మానవులు, గొప్ప గొప్ప ఫలాలు పొందుతారు. మూర్ఖుల హృదయాలు అడవులు, అందులో అవిచారం అనే కరంజములు (కుబేరాక్షవల్లులు) ఒక రకమయిన ముళ్ల చెట్లు పుటతాయి. ఇవి చుట్టు ఆవరణం అంతా ఆవరిస్తాయి. ముముక్షా అనే మంచి మొక్కను ఎక్కరాకుండా చేయడమే, ఈ తీగల మొదటి పని. వీటికి పుట్టే ముళ్ల పూగుత్తులే దుఃఖాలు.

రామచంద్రా! ప్రతి మానవుడికీ అవిచారమనే (విచారంలేకుండా ప్రవర్తించడమనే) నిద్ర ఒకటి ఆవరిస్తుంది. ఇది కాటుక పొడివలె నల్లగా ఉంటుంది. మద్యమువలె, మదభ్రాంతులను కలుగ చేస్తుంది. నీకది సోకదు. విచారపరుడైన మానవుడు, అజ్ఞానమనే దీర్ఘనిద్రలో మునగడు. సూర్యుడు చీకట్లలో ఇమడడు. మనస్సు మానస సరస్సు అయి, అందులో ఆత్మ విచారం వికసించిన కమలముల రాశి అయితే, ఇంక ఆ మానవుడు మంచుకొండలాగ ప్రకాశిస్తాడు. మానవుడు అతి మూర్ఖుడై, వాడి మతిలో ఈ విచారమే లేక శోకమోహములే తాండవిస్తూ ఉంటే, మెత్తని (చల్లని) చంద్రుడి నుంచి, (గట్టి) (వెచ్చని) వజ్రం (పిడుగు) పుట్టినట్లే. పిల్లవాడు మూర్ఖుడయితే, వాడి ముందు భేతాళుడు తయారవుతాడు.

రామా! వివేకంలేని మానవుడు, దుఃఖాలు అనే విత్తనపు గింజలు దాచుకోటానికి తయారుచేసికొన్న పెద్ద గాదె. (కుసూలం) ఆపదలనే నవలతలకు (క్రొత్త తీగలకు) వసంత ఋతువు. ఇలాంటివాణ్ణి దూరంగా ఉంచాలి. స్వ పరదుఃఖాలకు అనుకూలమయిన కర్మలూ దురాచారాలూ దుశ్చింతలూ, అవిచారంవల్ల తయారవుతాయి. తమోగుణంవల్ల వేతాలులు పుటతారు. అవిచారపరులకూ, (విచారరహితులకూ) అడవిచెట్లకూ

ఏమీ తేడా లేదు. మంచి పనులుచేసే యోగ్యత వీళ్లకు లేదు. మార్గస్థులకు నీడ ఇచ్చే యోగ్యత కాని, ఆశ్రయం ఇచ్చే యోగ్యతకాని చెట్లకు లేదు. ఇలాంటివాళ్లను దూరంగా ఉంచు.

విచారయుక్తమై ఆశాపరవశంకాని మనస్సు అఖండానందాన్ని చెందుతుంది. పూర్ణచంద్రునియెడల ఆత్మ అఖండానందాన్ని చెందుతుంది. సంసార తాపంతో బాధపడే వాణ్ణి వివేకం దేహమంతా చల్లపరుస్తుంది, వెన్నెల, లోకాన్ని అలంకరించినట్లు, వివేకం మానవుని అలంకరిస్తుంది. పరిశుద్ధమయిన బుద్ధి మోక్ష సామ్రాజ్య ప్రాప్తికి పతాక, దానియందలి విచారం, రాజ చిహ్నమయిన తెల్ల వింజామరము. ఇది మానవునకు రాత్రిలలో చంద్రుడు. విచారపరులైన జీవులు జీవన్ముక్తులై దశదిశలను వెలిగించుచూ, భవభయాన్ని పారద్రోలుకొని భాస్కరులవలె ప్రకాశిస్తూ ఉంటారు, పిల్లవాడు అజ్ఞానంవల్ల రాత్రిపూట వేతాళుని (దయ్యాన్ని) కల్పించుకుంటాడు. ప్రాణాపాయం అంతటి భయాన్ని పొందుతాడు. మనస్సుకు విచారణ పెట్టుకున్నాడా! ఎక్కడ దాగుతాడో మళ్లీ కనిపించడు ఆ వేతాళుడు. ప్రపంచంలోని పదార్థాలు అన్నీ విచారణ పెట్టుకోకపోతే, రమణీయంగానే ఉంటాయి. విచారించుట మొదలుపెట్టామా, రాతితో కొట్టిన మట్టిముద్దవలె విడిపోతాయి. తుదకు వాటి స్వరూపం కూడా కనిపించదు. అంతటి నిస్సారములు ప్రాపంచిక వస్తువులు:

అజ్ఞానంవల్ల పుట్టి పెరిగిన సంసారమనే వేతాళుడు ఇచ్చే దుఃఖానికి మితి ఉండదు. వాడి స్వరూపాన్ని కాస్త విచారించుకుంటామా, ఇంక వీడు ఎక్కడ ఉంటాడో అంతుచిక్కడు, విచారం అనే ద్వారపాలకుని మంచి చేసికొంటే సంసార దుఃఖం పోవటం ఒక్కటే ఫలంకాదు, కైవల్యానందం కూడా లభిస్తుంది. విచారమనే కల్పవృక్షము యొక్క కమ్మని పండు కైవల్యం. విచారంవల్ల ప్రకృష్టానందం, దానివల్ల అవిద్యానాశం. దానివల్ల అవాప్తసర్వకామత, (నిష్కామత్వం) సిద్ధిస్తుంది. విచారం అనేది గొప్ప ఓషధి. దీనిచే సిద్ధుడైన మహాపురుషుడు, లేని దానిని కోరడు, ఉన్న దానిని విడవడు. కృతకృత్యుడవుతాడు.

"చిత్తం ఎప్పుడూ చంచలమైంది, దానికదే స్వభావం. చాంచల్యం లేకపోతే దానికి స్వరూపమే లేదు, ఇలాంటి చిత్తం విచారజన్య జ్ఞానంచేత నిశ్చలమయితే చిత్తం లేనట్లేగా? చిత్తం లేకపోతే మనిషి జీవించడం సున్న. చిత్తం ఉంటే (అనగా చంచల స్వభావమయిన చిత్తం ఉంటే) దాని విక్షేపాలను అది సాగిస్తూనే ఉంటుంది. ఇంక ఈ విచారంవల్ల లాభమేమి? వీడు కృతకృత్యుడయ్యేది ఎలా?" అని సందేహిస్తారు కొందరు,

పరమాత్మ తత్త్వాన్ని ఆశ్రయించిన చిత్తం, ఆభాస చిత్తంకాని అసలైన చిత్తంకాదు. వేగించిన గింజలు ఆభాస గింజలుకాని, అసలైన గింజలు కావు. ఈ ఆభాస గింజలు మొలకరించవు. ఆ చిత్తం విక్షేపాలను పుట్టించలేదు. ఇలాంటి చిత్తంలోని వాసనాజాలం, సర్వవ్యాపకమైన బ్రహ్మభావాన్ని పొంది ఉంటుంది. కాబట్టి ఇది చచ్చిందీకాదు, బ్రతికిందీ కాదు. చచ్చింది కాదు కనుక, జీవితానికి భంగం లేదు. పూర్తిగా బ్రతికిందికాదు గనుక రాగద్వేషాది వృత్తులను పుట్టించలేదు. కాబట్టి కాలిన గింజలలోవలె శక్తి చచ్చి ఆకార మాత్రంగా ఉంటుంది చిత్తం. విచారశీలుడైన మానవుడు ఈ మహావిశాల ప్రపంచ విషయాలను ఉదాసీనంగా చూస్తాడు. అనురాగంతో వాటిమీద మనస్సు పెట్టడు. సత్యములనీ, పురుషార్థములనీ, వాటిని అనుభవించదలచడు. దొరకినవని ఉప్పొంగడు. దొరకలేదని ఖేదపడడు.

విచారశీలుడైన మానవుడు, నిద్రించేడి వానివలె, అజ్ఞానంలో లయించి ఉండడు. స్వప్నమందువలె, లోపలివాసనా ప్రపంచంలో విహరించడు. మూఢజనులవలె, జాగ్రత్ప్రపంచంలో, (బాహ్య ప్రపంచంలో) తాండవమాడడు. కర్మ సన్న్యాసీ కాడు. కర్మసంగుడూకాడు.

గతించిన దానిని ఉపేక్షించి ఊరకుంటాడు. సంప్రాప్తమయిన దానిని అనుసరిస్తాడు, మనస్సును కలవరపరచుకోడు, కేవలం కదలకుండానూ ఉండడు. స్వాభావికమయిన (యుక్తమయిన) వ్యవహారాన్ని విడిచిపెట్టడు, నిండు సముద్రమువలె ఉంటాడు. సముద్రము

గడచిపోయిన, లక్ష్మీకౌస్తుభాది వస్తువులను గూర్చి బాధపడదు మళ్లీ వాటిని సంపాదింప ప్రయత్నించదు. ఉన్న వాటితో తృప్తి చెంది ఉంటుంది. చెలెలి కట్టను దాటి వెళ్లవలెనని కలవరపడదు, ఉత్తుంగ తరంగాలతో కలపరపడకుండానూ ఉండదు. కొందరు మహానుభావులైన యోగులు ఇలాంటి పూర్ణ మనస్సుతో ఈ శరీరమునందే జీవన్ముక్తులుగా వ్యవహరిస్తూ ఉంటారు. వారు అలా చాలా కాలం జీవన్ముక్తులుగా ఉండి, తుదకు ఆభాస రూపమయిన ఈ ఉపాధిని, విడిచి, విదేహ కైవల్యాన్ని పొందుతారు. మానవుడు కుటుంబ వ్యవహారాలలో నిమగ్నుడై ఉండి కూడా, నేను ఎవరిని? సంసార సంబంధం ఎవరికి? అని ప్రయత్నపూర్వకంగా శ్రవణమనన నాదులను అనుష్ఠించుచూ ఆలోచించాలి. రాజు అంతటివాడు కూడా, సంకట సమయాలలో, తాను ఆచరించ తగిన, సంధి విగ్రహాదులను విచారంవల్లనే నిర్ణయించుకుంటాడు. విచారంవల్లనే ఫలించేదీ ఫలించనిదీ తేల్చుకుంటాడు.

కర్మకాండ అయిన వేదాలు, ధర్మ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తాయి. బ్రహ్మకాండ అయిన వేదాంతాలు బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదిస్తాయి. ఇవి ఎలా పురుషార్థానికి కారణమయ్యేది విచారణచేతనే నిర్ణయించు కుంటాడు మానవుడు. రాత్రి కాలంలో నేలమీద ఉన్న వస్తువులు దీపంవల్లనే కనిపిస్తాయి,

మనకు నేత్రాలు ఉన్నాయి. కాని చీకటిలో ఇంచుమించు అది లేనివాటి క్రిందనే లెక్క, పగటి కాలంలో కూడా సూర్యాదుల వెలుతురువల్ల వీటి (ప్రసిద్ధ నేత్రముల) సత్తా కొంత తగ్గుతుంది. (ప్రతిహతమవుతుంది.) మన నేత్రాలు చాటుగా ఉన్న వస్తువులను కనిపెట్టలేవు. దూరంగా ఉన్న వస్తువులను గుర్తించలేవు. విచారమనే నేత్రం అలాంటిదికాదు. ఎంత దూరంగా ఉన్నదానినైనా కనిపెడుతుంది. విచార రహితుడు పుట్టు గ్రుడ్డి. వీనిని చూస్తే దుఃఖం వస్తుంది, విచారప్రియుడు దివ్యనేత్రం గలవాడు. వీడు అన్నిట జయిస్తాడు. ఆపదలను తప్పించుకుంటాడు, పురుషార్థాన్ని పొందుతాడు.

ఈ విచారంలో పరమాత్మ విచారమనేది చాలా గొప్పది. అతి

పవిత్రమయినది. పరమానందానికి సాధనం. ఇలాంటి ఆత్మ విచారాన్ని క్షణకాలమయినా విడవ కూడదు. అద్వితీయమయిన శివ తత్త్వాన్ని విచారించనిక్షణం వ్యర్థమైనదని లింగ పురాణం చెపుతోంది. బాగా పండిన తీయ మామిడిపండు రుచిస్తుంది. విచార కుశలుడైన పురుషుడూ, మహనీయులకు రుచిస్తాడు. విచార సుందరమైన మతిగలవారు, దుఃఖాలనే గోతులలో పడరు. దారి తెలిసి నడిచే నరులు, దారి తప్పి గోతులలో పడరు. విచారరహితుడై చెడిపోయిన మూర్ఖుడు (అజ్ఞుడు) ఏడ్చినట్లు, రోగం వచ్చినవాడు ఏడువడు. విషం తిన్నవాడు ఏడువడు. కత్తితో కోసినవాడు ఏడువడు. వీటి బాధకంటె అవిచారము యొక్క బాధ అంత గొప్పది. జన్మ జన్మకీ వీడికి ఈ ఏడుపు తప్పదు. బురదలో కప్పగా పుట్టినా కొంచెము మెరుగు. మలంలో పురుగై పుట్టినా కొంత మేలు. చీకటి గుహలో పామైనా కాస్త నయం. మానవజన్మలో విచార రహితుడుగా మాత్రం పుట్టరాదు.

అవిచారము అన్ని అనర్థాలకు ఆలవాలము. సజ్జనులందరూ వెలివేసినది. దుస్థితి జాలానికి పొలిమేర. ఇలాంటి అవిచారాన్ని దూరంగా పరిత్యజించాలి. రాగద్వేషాది అంధకూపంలో పడేవాళ్లకు విచారం ఊతకర్ర. కనుక మానవుడు ఎప్పుడూ విచారయుక్తుడు కావాలి. తనకు తానే విచారంవల్ల నిలవ తొక్కుకొని, సంసార మోహం అనే సముద్రం నుంచి, తన మనస్సు అనే మృగాన్ని దాటించాలి. నేను ఎవరను? నాకీ సంసార దోషం ఎలా అంటుకుంది? అని శ్రుతిమునిసమ్మతమైన న్యాయంచేత, ఆలోచించడమే విచారమనబడుతుంది.

విచారహీనుడైన దుర్మతియొక్క హృదయానికీ, రాతి యొక్క లోపలి భాగానికీ తేడా (భేదం) లేదు. విచారం లేనివాడి మనస్సు. అవివేకంచేత పుట్టు గ్రుడ్డివానికంటె కూడా ఇంకా దట్టంగా గుడ్డిగా ఉంటుంది. గుడ్డివాడు చూడక (తెలియక) బావిలో పడతాడు. విచార రహితుని (అవివేకి యొక్క) మనస్సు తెలిసి కూడా నరకకూపంలో పడుతుంది. రాతియొక్క లోపలి భాగం, అతిజడం కనుక మిక్కిలి అంధం. అతి కఠినం. కాబట్టి మోహం కంటె కూడా దట్టం. కనుక ఇలాంటి

మూర్ఖుని చిత్తం కేవలం దుఃఖ సాధనం. రాతియొక్క లోపలి భాగాన్ని కూడా, ఉలితో కొట్టి, తొలి (రంధ్రం) చెయ్యడానికే బ్రహ్మనిర్మించాడు.

రామచంద్రా! వ్యవహార ప్రపంచంలో నిజా నిజములయొక్క (హేయోపాదేయముల యొక్క) తత్త్వం విచారం లేనిదే దృఢంగా తేలదు. విచారంవల్ల తత్త్వనిర్ణయం కలుగుతుంది. తత్త్వ జ్ఞానం వల్ల మనస్సు నిశ్చలమవుతుంది. మనశ్శాంతివల్ల సర్వ దుఃఖాలు అంతరిస్తాయి.

రామా! లోకంలో మానవుల యొక్క లౌకిక వైదిక కర్మలు విచారంవల్లనే బాగా ఫలిస్తాయి. దీనివల్లనే మానవులు ఆత్మతత్త్వము యొక్క ఉత్తమ స్థితిని పొందుతారు. కనుక శమాది సాధన సంపత్తిగల నీకు కూడా ఇట్టి విచారమే రుచించుగాక? 5/6/16

## ౧౫ సంతోష నిరూపణము

సంతోషం ఈయనగారు మోక్షద్వారానికి, మూడో ద్వార పాలుడు. వీరి పరిస్థితి విచారిద్దాం. సంతోషమే నిశ్రేయసం. సంతోషమే నిరతిశయానందం. సంతోషం గలవాడికి, అన్ని దుఃఖాలూ అంతరిస్తాయి. సంతోషం యొక్క ప్రభావంచే సుఖంచేవాళ్లకూ, చిత్తం విశ్రాంతి చెందిన వాళ్లకూ, ఆత్మశాంతిని అనుభవించే వాళ్లకూ అఖండ భూమండలాధిపత్యం, ఎండు గడ్డి పోచ యొక్క తుంపువంటి దవుతుంది.

లోకంలో మానవునికి దారిద్ర్యం రావచ్చు. బంధువియోగం తటస్థించవచ్చు. సంసార పరిస్థితి ఇంక ఎంత విషమంగానైనా మారవచ్చు. కాని సంతోషశీలుడు ఇదంతా దైవ సంకల్పం అనుకుంటాడు. వగవడు. వాని బుద్ధి వగపుకు తావివ్వదు.

రామా! సంతోషం అమృతం. దాన్ని అనుభవించి తృప్తిపడ్డ వానికి ఈ భోగ సంపదలన్నీ విషప్రాయాలు. సంతోషంయొక్క మాధుర్యాన్ని అనుభవించిన వాడికి, అమృతరస తరంగాలు కూడా అంత సుఖంగా ఉండవు. సంతోష శీలుడికి, దొరకని వాటియందు కోరిక

ఉండదు. దొరికిన వాటిని చూచి (అనుభవించి) ఉప్పొంగడు. లాభా లాభములందు సమానంగా ఉంటాడు. భేదాభేదములంటే ఏమిటో వాడికి తెలియదు. ఇలాంటివాడు సంతుష్టుడు అని అంటారు పెద్దలు. ఆత్మ స్వరూపాన్ని గుర్తించి మనస్సు సంతోషించేటంతవరకూ, మనస్సు అనే గుహలో నుంచి ఆపదలనే తీగలు పుట్టుతూనే ఉంటాయి. సూర్యకిరణా లచే పద్మం వికసిస్తుంది. విజ్ఞాన దృష్టులచే సంతుష్టుని చిత్తం వికసిస్తుంది. సంతోషం లేని చిత్తంలో, ఆశాపరశమయిన చిత్తంలో, జ్ఞానం అంకురించదు. మలినమైన అద్దంలో ముఖం ప్రతిబింబించదు.

నరుడనేవాడు పద్మంవంటివాడు. ఈ పద్మాన్ని వికసింప చేయడా నికి, సంతోష భాస్కరుడు. (సంతోషం అనే భాస్కరుడు) బయలు దేగాడు. కాని ఈ నరాంబుజం (నరుడనే పద్మం) గాఢాంధకార రాత్రిలో కూడా ముడుచుకుపోదు. సంతుష్టుని మనస్సులో ఆధివ్యాధు లుండవు. వీడికి ఏమీ లేకపోయినా (వీడు వట్టిదరిద్రుడైనా) సామ్రాజ్య సుఖాన్ని అనుభవిస్తాడు. వీడు లేని దానిని కోరడు. ఉన్న దానిని సుఖ దుఃఖాలను అనుసరించి అనుభవిస్తాడు. సుఖంగా ఉన్నా అనుభవిస్తాడు. దుఃఖం వచ్చినా అనుభవిస్తాడు. ఇలాంటివాని ప్రవృత్తి జగదానంద కరంగా ఉంటుంది. వీడినే సంతుష్టుడని అంటారు పెద్దలు.

లోపల సంతోషం సంపూర్ణంగా కలవానికే పైకి ముఖం కల కల లాడుతూ ఉంటుంది. తనయందు తాను నిరతిశయానంద పరిపూర్ణుడై పురుష ప్రయత్నంచేత తృష్ణను విడిచి పెట్టాలి.

సంతోషామృతంతో మనస్సు నిండితే ఇంక ఎన్నటికీ అది చలిం చదు. శాశ్వతంగా స్థిరంగా ఉంటుంది. అమృత పూర్ణుడైన చంద్రుని యందు చల్లతనం శాశ్వతం. భృత్యులు రాజును నిరంతరం సేవిస్తారు. వానికి కింకరులవుతారు. అలాగే సంతోష పుష్టిగలవానిని సర్వ సంప దలూ సేవిస్తాయి. ఆశకు దాసులయినవారు లోకం అంతకు దాసులు. ఆశ దాసీకత్తెగా కలవానికి లోకమంతా దాస్యం చేస్తుంది.

శ్లో॥ ఆశాయాః దాసాయేదాసాస్తే సర్వలోకస్య
ఆశాదాసీయేషాం తేషాందాసాయతే లోకః॥

అని అన్నారు పెద్దలు-

మానవుడు ఆత్మనిష్ఠుడై, నిత్యతుష్టిని పొందితే, వర్షకాలంలో భూపరాగం అణగినట్లు, ఆధి వ్యాధులన్నీ అణగిపోతాయి, అమవన రోజున, క్షీణ చంద్రుడు, తనయందున్న కలంకముకంటె వేరుగా కనిపించడు, కలంకపుగ్నుడై పోతాడు.

మరిన్నీ, సూర్యుడికి చాలా దగ్గరగా ఉండుటచే చల్లగా కూడా ఉండడు. ఈ చంద్రుడే పూర్ణిమనాడు షోడశకలాపూర్ణుడుగా ఉంటాడు. తన కళంకాన్ని కూడా తాను కనుపరుస్తాడు. సూర్యుడికి ఎడంగా (దూరంగా) ఉండబట్టి చల్లగా కూడా ఉంటాడు. అలాగే మానవుడు సంతోషం లేకపోతే, అవివేకమనే కలంకంలో మునిగే ఉంటాడు. తాపత్రియంతో తగలపడుతూ ఉంటాడు, ఇలాంటి మానవుడే సంతోషమనే అమృత కళతో నిండి ఉంటాడా, తనయందున్న అజ్ఞానం అనే కలంకానికి కూడా తానే సాక్షి కనుక, దాన్ని (ఆ కలంకాన్ని) తనకంటె వేరుగా కనుపరుస్తూ, దానితో తాను అంటకుండా, చల్లగా ఆత్మసుఖంతో ఆనందిస్తూ ఉంటాడు.

సర్వసమత్వంగల పురుషుడి ముఖం అతి సుందరంగా ఉంటుంది. అలాంటి వాడి ముఖం చూస్తే కలిగే ఆనందం ధనరాసులు కుమ్మరించినా కలగదు.

రామచంద్రా! సమతాగుణంచేత అలంకృతుడైన పురుషుని దేవతలూ, మహనీయులైన మునులు కూడా నమస్కరిస్తారు.

గమనిక: గురూ! ఇక్కడ 17 వ శ్లోకంలో "పరాగము" అనే అర్థంలో "పాంశవః" అని అన్నారేమిటి? "పాంసవః" అని దంత్యవర్ణం ఉండవద్దూ.

ఇదా నీ సందేహం గొప్ప పొరపాటే కనిపెట్టావు. "తాలవ్యా అపి దంత్యాశ్చ శంఖ, శూకర, పాంశవః" అని ప్రమాణం ఉంది. కనుక ఈ మూడు పదాలలో దంత్యమూ ఉండవచ్చు. తాలవ్యమూ ఉండవచ్చు. తప్పులేదు. అయినా తత్త్వగ్రంధంలో ఈ వర్ణాల గొడవెందుకూ నీకు?

# ౧౫ సాధుసంగమ నిరూపణం

## సజ్జన సాంగత్యం. నాల్గవ ద్వారపాలుడు.

రామా! సంసారం తరించటానికి మానవులకు, సజ్జన సాంగత్యం అన్నిటా గొప్ప ఉపకారి. సజ్జన సాంగత్యం అనేది చెట్టు. దానికిపూచిన తెల్లని పువ్వు వివేకం. ఈ పువ్వును కాపాడుకున్న మహనీయులు, మోక్షం అనే పండును తప్పక అనుభవిస్తారు. పండితుల సాంగత్యంకల తావు అడవి అయినా, అందరు బంధువులు అక్కడ ఉన్నట్లే, సజ్జన సాంగత్యం కలవాడు దరిద్రుడయినా, భాగ్యవంతుడన్నమాటే. వీడి చావు కూడా ఉత్సవంలాగ తయారవుతుంది. ఇలాంటివాడి ఆపదలన్నీ సంపదల్లాగ పరిణమిస్తాయి. దుర్జన సాంగత్యంగలవాడు బంధుజనసంకుల మైన తావున ఉన్నా విజన ప్రదేశంలో ఉన్నట్లే. ఎవ్వడూ ఆ బంధువు చెంతకు చేరడు. వీడి భాగ్యం దరిద్రం క్రిందనే లెక్క. వీడి బ్రతుకు చావు క్రింద నేజమ్మ. వీడి సంపదలు ఆపదలకు మారు రూపాలు.

సాధుజన సమాగమము, ఆపదలనే పద్మలతకు మంచు. అవివేక మనే మంచునకు పెనుగాలి. ఇది జగత్ప్రసిద్ధం. దీనికి లోకంలో అపజయం ఎక్కడా లేదు. గాలి ఉంటె మంచు ఎగిరిపోతుంది. సజ్జన సాంగత్యం ఉంటే అవివేకం. (మోహం) పటాపంచలవుతుంది. మంచుపడితే పద్మాలు ముడుచుకుంటాయి. సజ్జన సాంగత్యం అబ్బితే ఆపదలు అంకురించవు.

సజ్జన సాంగత్యం, వివేకాన్ని వృద్ధిచేస్తుంది. అజ్ఞానాన్ని అడుగంటి స్తుంది. ఆధులను వలస పంపుతుంది. నీరుపోసి పెంచే తోటలో, పూగుత్తులతోనూ, పండ్ల గుత్తులతోనూ చెట్లు తులతూగినట్లు, సజ్జన సహవాసంవల్ల, మనోహరంగా వెలిగే వివేకమనే దీపం బయలు దేరుతుంది. దీనివల్ల అపాయంలేని సుఖం. బాధలేని సుఖం. ఎప్పుడూ పెరిగిపొయ్యే సుఖం. అన్నిటికంటె గొప్ప సుఖం కలుగుతుంది కష్టాలు ఎన్ని వచ్చినా, ఎంత పరాధీనుడైనా! క్షణకాలం కూడా సజ్జన సాంగత్యం విడువ కూడదు.

ఇవి (సజ్జన సాంగత్యాలు) ఘంచిదారి చూపటానికి కాగడాలు. హృదయంలోని అంధకారం రూపుమాపటానికి, జ్ఞాన సూర్యుని కిరణాలు. సాధుజన సాంగత్యం అనే చల్లనైన తెల్లని గంగలో స్నానం చేస్తే, ఇంక దానాలెందుకు? ధర్మాలెందుకు? పుణ్యతీర్థాలెందుకు? తపస్సులు ఎందుకు? యజ్ఞాలు ఎందుకు? రాగద్వేషాదులు లేనివారూ, సర్వ సందేహాలు తీరినవారూ, హృదయ గ్రంధులు వీడినవారూ, సాధువులు దొరికితే, తపస్సులు చేయడం నిరర్థకం. తీర్థాలలో మునగడం వ్యర్థం. పూర్ణ ప్రయత్నంచేత, మనో విశ్రాంతి చెందినవాళ్లు ధన్యులు. దరిద్రులకు మణులయందున్న దృష్టి, మానవులకు సజ్జనులయందుండాలి. అలభ్యమైన వస్తువు లభిస్తే దానియందు అత్యాదరం ఉంటుంది.

అలాగే మానవులకు సజ్జనులు సామాన్యంగా లభ్యంకారు. అలాంటివారు లభ్యం అయితే అత్యాదరం ఉండటం సహజం. సజ్జన సహవాసంగల బుద్ధిమంతుల మతి, అప్సర స్త్రీల మధ్య లక్ష్మీదేవివలె తాండవమాడుతుంది. సజ్జన సాంగత్యాన్ని విడిచిపెట్టని ధన్యుడు, బ్రహ్మవస్తువు కొరకు పాటుపడేవాళ్లకు శిరోమణి. చిద్గ్రంధిని విడదీసికొని, బ్రహ్మతత్త్వాన్ని తెలిసికొన్న సజ్జనులను సర్వవిధములా సేవించాలి. సంసార జలధిని తరించటానికి వీరే ఉపాయభూతులు.

సాధువులనగా నరకంలోని అగ్నిమంటలు (అగ్ని జ్వాలలు) చల్లార్చుటకు వారిదములు. (మేఘములు) ఇలాంటివారిని అనాదరంగానైనా చూడనివారు నరకాగ్నులు ప్రజ్వరిల్లుటకు కట్టెపుల్లలవుతారు. సజ్జన సహవాసమనే ఔషధం సేవిస్తే, దారిద్ర్యమూ, మరణమూ, దుఃఖమూ అనే సన్నిపాతాలు, (సంధిప్రలాపాలు) మొదలంట నశిస్తాయి.

సంతోషమూ, సాధుసంగమమూ, (సజ్జన సహవాసమూ) విచారమూ, శమమూ, అనే నాలుగూ సంసార సముద్రాన్ని దాటటానికి సులువైన ఉపాయాలు మానవులకు. సంతోషం అంటే, సర్వోత్కృష్టమైన వస్తువును పొందడం. సత్సంగ మనగా సర్వోత్కృష్టమైన స్థానాన్ని చేరడం. విచారం అనగా అన్నిటికంటె గొప్పదానిని తెలిసికొనటం. శమ

మనగా అన్నిటికంటె గొప్ప సుఖం. ఇక్కడ సాధనానికి ఫలానికి భేదం లేకుండా చెప్పిన మాటలు ఇవి.

ఈ నాలుగు ఉపాయాలను అభ్యసించినవారు సంసారముద్రాన్ని దాటతారు. సందేహం లేదు. ఈ నాల్గింటిని అభ్యసించ లేకపోతే, చక్కగా ఒక్కదాని నభ్యసించినా చాలును. నలుగురిని సేవించినట్లే. ఇందులో ఒక్కొక్కడు మిగిలిన ముగ్గురికీ జన్మస్థానము, కావున అందరి అనుగ్రహం కొరకైనా శక్తి లేనపుడు ఒక్కని ఆ శ్రయించవచ్చు. అందులో శమం అనే ద్వారపాలుణ్ణి ఆశ్రయించి, అలవరచుకుంటే, సజ్జన సహవాసమూ, సంతోషమూ, విచారమూ అనే వాళ్లు కూడా (ద్వారపాలులు) స్వయంగా సావధానంగా వెంటపడి తిరుగుతారు.

మహా విశాలమైన సముద్రంలో పెద్ద పెద్ద ఓడలు సావధానంగా తిరుగుతూ ఉంటాయి. కల్పవృక్షాన్ని ఆశ్రయించిన వాడికి లౌకిక సంపదలు సులభంగా లభిస్తాయి. ఈ నలుగురు ద్వారపాలురను ఆశ్రయించిన వాళ్లకు జ్ఞాన సంపదలు కరతలామలకములు. పూర్ణచంద్రునియందు సౌందర్యాది గుణములు, స్వతసిద్ధములు. వీటిని సేవించిన మానవుని యందు మనఃప్రసాదాది గుణములు సహజములు. మంత్రిసత్తముడుగల రాజునకు, రాజ్యలక్ష్మి సజ్జన సాంగత్యాది గుణములుగల వానికి, జయలక్ష్మి సులభము.

కాబట్టి రామచంద్రా! గట్టి ప్రయత్నంచేత, మనస్సును జయించుకొని, ఈ నాలుగింటిలో ఒక్క గుణాన్ని అయినా అలవరుచుకో. గట్టి పౌరుషం తెచ్చుకో. చిత్తమనే మదపుటేనుగును కట్టివెయ్యి. ఒక్క గుణాన్ని అయినా అలవరచుకో, లేకపోతే ఉత్తమగతి రాదుసుమా? నీ మనస్సు ఈ నాల్గింటిలో ఒక్క గుణాన్ని అయినా ఆర్జించేటంతవరకు బలాత్కారంగా పళ్లు పటా పటా కొరికి పోడిచేసుకో. సామాన్య ప్రయత్నంచేత మనస్సు స్వాధీనానికి రాదుసుమా. ఈ గుణాలను సంపాదించుకో లేకపోతే, నీవు దేవతవైనా, యక్షుడువైనా, మానవుడైనా, చెట్టు పుట్ట అయినా ఒకటే. ఇంతకంటె వేరే ఉపాయం తరించటానికి లేదు.

సంసారం తరించడానికి గుణం కారణంకాని, జన్మ కారణంకాదు. జన్మ కొంతవరకు సహాయపడితే పడవచ్చు. కాని దానికి నీ ప్రయత్నం గట్టిగా అవసరం. ఫలం ఇచ్చే గుణం ఒక్కటి దృఢపడితే, ఆ గుణానికి నీ చిత్తం స్వాధీనం అయితే, ఇంక నీ చిత్తంలో ఉండే దోషాలన్నీ నశిస్తాయి. ఒక్క గుణం వృద్ధి చెందితే, దోషాలను చంపివేసే గుణాలన్నీ వృద్ధిచెందుతాయి. దోషం ఒక్కటి వృద్ధి చెందితే, గుణాలను చంపే దోషాలన్నీ వృద్ధిచెందుతాయి.

మానవుల మనస్సు యందలి, అవివేకమనే అడవిలో ఎప్పుడూ, శుభమూ, అశుభమూ, అనే రెండు పాయలతో వాసనా నది మహా వేగంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ వాసనా నది నీ ప్రయత్నంచేత ఏ పాయ ఎండకట్టి ఏ పాయతో ప్రవహింప చేస్తే, ఆ పాయతో ప్రవహిస్తుంది. ఆ వాసనా నదిని నీవు ఎలా నడిపితే అలా నడుస్తుంది. శుభమార్గాన నడిపితే అలా నడుస్తుంది. అశుభ మార్గాన నడిపితే అలా నడుస్తుంది. ఈ రెంటిలో నీ చిత్తాన్ని వినియోగించుకో నీకు ఎలాతోస్తే అలాచెయ్యి.

కాని రామా! నా అభిప్రాయం చెపుతా విను. ఈ నదిని శుభ వాసనా ప్రవాహంతో నడిచేలాగుచెయ్యి క్రమంగా. అ శుభమార్గాన నడచేలాగ చేయకసుమా! అయినా నీవు శుభమతివి. అలా చెయ్యవులే అన్నాడు వసిష్ఠుడు.

## ౧౭ గ్రంథసంఖ్యాది వర్ణనము

రాఘవా? నీతి శాస్త్రవాణి వినటానికి రాజునకే తగును. జ్ఞానోపదేశాలు వినటానికి, అంతర్వివేకంగల నీబోటి మహానుభావునకే తగు. శరత్కాల చంద్రుడుదయించటానికి, మేఘాల సంబంధంలేని ఆకాశమే తగును. పరమపవిత్రమైన (నిర్మలమైన) బ్రహ్మ విచారానికి, మూఢులతోటి సాంగత్యంలేని నిర్మలచిత్తుడే తగును. నీవు అఖండ గుణ సంపన్నుడవు. (పరిపూర్ణ గుణ పూర్ణుడవు) నీకు మనో మాలిన్యమును

పోగొట్టు మాట ఒక్కటి చెపుతా విను. పూర్వపుణ్యం అనే కల్పవృక్షం పండి తయారైతేకాని ఇలాంటి మాటలు వినాలని సంకల్పం కలగదు. ఈ మాటలు ముక్తిదాయకములు. పరమపావనములు. అర్థ గంభీర ములు. ఇలాంటి మాటలు వినటానికి, వెనుక చెప్పిన శమాది గుణములు కలవాడే యోగ్యుడు. అధముడు ఇందుకు తగడు.

నీకికముందు నేను చెప్పబోయెడి గ్రంధము. 32 వేల శ్లోకాలు గల సంహిత. ఇది ఉపనిషత్తుల్యము. దీనికి మోక్షోపాయసంహితయని పేరు మోక్షమిచ్చుటలో మొనగాడు. మెలకువతో నున్నవాని యెదుట దీపం వెలిగిస్తే వాడు వద్దనుకున్నా పదార్థాలను కనపరచే వెలుతురు ప్రసరిస్తుంది. ఈ మోక్ష సంహితను వింటె అనివార్యంగా, మోక్ష సాధనం అయిన తత్త్వ జ్ఞానం కలుగుతుంది. స్వయంగా తాను పరిశీ లించి తెలిసికున్నా ఇతరుడు వర్ణించి చెప్పిక దానిని విన్నా, సంసార భ్రమ తొలగించి, నిరతిశయానందాన్ని ఇస్తుంది ఇది. ఆకాశ గంగలో తాను స్వయంగా మునిగినా, దూరంగా ఉండి దానిని స్మరించి చెప్పు కున్నా పాపం నశించి పుణ్యం కలుగుతుంది. రజ్జు స్వరూప జ్ఞానంవల్ల అందలి సర్ప భ్రాంతి తొలుగుతుంది. ఈ మోక్ష సంహితను గ్రహించి నందున ప్రపంచ భ్రాంతి తొలుగుతుంది. ఈ వాసిష్ఠ సంహితయందు ఆఱు ప్రకరణములు కలవు. ప్రతి ప్రకరణమునందును చక్కని ఆఖ్యా యికలు. అవి ప్రకృత విషయమునకు దృష్టాంతములు. వాటి యందలి వాక్యము లన్నియు యుక్తియుక్తమైన అర్థము కలవి.

ఇందు మొదటిది వైరాగ్య ప్రకరణము. దీనివలన వైరాగ్యము వృద్ధియగును. నిర్జల ప్రదేశమునందైనను నీరుపోసి కుదురు తడిపితే చెట్టు పెరుగును. అలాగే ఎంతటి అనురాగి అయినా ఈ ప్రకరణార్థ మును అనుసంధానం చేస్తే విరాగి కాకమానడు. దీని శ్లోక సంఖ్య ఒక టిన్నర వెయ్యి. ఇందలి అర్థము మనసుకు పట్టితే విషయములయందలి దోషం అంతా విశదమవుతుంది. మనస్సులోని మాలిన్యం మంట కలు స్తుంది. పరిశుద్ధి బయటపడుతుంది. మట్టిలో దొరికినమణిని కడిగితుడిస్తె స్వచ్ఛమయినట్లె.

దీని తరువాతిది ముముక్షు వ్యవహార ప్రకరణము. దీని శ్లోక సంఖ్య ఒక వెయ్యి. యుక్తియుక్తమైన దృష్టాంతములతోనూ, చిత్ర విచిత్రములైన ఆఖ్యాయికలతోనూ, అతి సుందరంగా ఉంటుంది. ఇందు ముముక్షువుల వ్యవహారమంతా నిరూపింపబడింది.

ఆపైన ఉత్పత్తి ప్రకరణము దృష్టాంతములూ ఆఖ్యాయికలూ మామూలు. ఏడువేల శ్లోకాల గ్రంథం ఈ ప్రకరణం. జగత్తులో తాండవమాడే, "నేను, నీవు, నాది, నీది" అనే దృక్, దృశ్య సంపద యావత్తూ భ్రాంతి కల్పితమని వర్ణింపబడింది. ఈ ప్రకరణాన్ని వింటే, "నీవు నేను అది ఇది" అనే బుద్ధికి గోచరమయ్యే ఆకాశాది ప్రపంచ జాతం అంతా, సచేతనాన్ని, అచేతనాన్ని పూర్తిగా తనలోనే తెలిసి కొంటాడు మానవుడు. అప్పుడు మూర్తమూ, అమూర్తమూ అనే భేదం ఉండదు. "చెట్టు, పుట్ట, కొండ, గోడ" అనే భేదం ఉండదు. ప్రపంచం అంతా మనస్సం కల్పంవల్ల తయారైన నగరంవలె గోచరిస్తుంది. కలలో కన్న పదార్థాలవలె భాసిస్తుంది. మనో రాజ్యంవలె విజృంభిస్తుంది. పదార్థాలు ఏవీ నిజంగా లేనందున అచ్చగా గంధర్వ నగరంలాగ తయారవుతుంది. ఇది ద్విచంద్రభ్రాంతి. ఎండమావుల నీరు.

ఓడ కదలునప్పుడు, కదలునట్లు కనుపడు కొండల భ్రమ. నిజమైన పురుషార్థం ఏమీ లేనిది. మనోభ్రాంతివల్ల కల్పించిన పిశాచం. కారణం లేకపోయినా కనిపిస్తుంది. కథలు వినేటప్పుడు, ఆయాశక్తివల్ల కథలోని వస్తువు ప్రత్యక్షమవుతుంది. అంతే ఇదికూడా. ఆకాశంలోని ముత్యాల హారం (కల్పితం) బంగారంలోని కటకత్వం వంటిది. నీటిలోని తరంగత్వం వంటిది. ఆకాశంలోని నలుపుతనము వంటిది. ఇవన్నీ కల్పితాలు. అలాగే ఈ ప్రపంచం కూడా కల్పితం. ఇది గోడలేని చిత్రపు, రంగు లేని వ్రాత బొమ్మ. చూడ సొంపైన బొమ్మ, కలలోకన్న బొమ్మ. ఆకాశాన వెలసిన బొమ్మ. కర్తలేని చిత్రపు. ఎంతకాలమైనా చెక్కు చెదరదు. సినిమా సీనులో కనపడే నిప్పులో నిప్పుయొక్క ధర్మం లేక పోయినా మంట కవిపించినట్లు, లేని వస్తువులలో, ఉన్నదానివలె గోచరిస్తూ ఉంటుంది జగత్తు. విచారిస్తే లేనిది. (గచ్ఛతీజగత్) అనియే జగ

ఛ్ఛబ్దమున కర్థము. కనుక ఇందులో యథార్థమేమీ లేదు. తరంగముల యందు ఉత్పలమాల అను భ్రాంతివంటిది ప్రపంచం. వెనుక చూచిన నృత్యాన్ని మనస్సులో స్మరించడం వంటిది.

ఎవ్వడేని మానవుడు, నోటి నిండా నీళ్లు పోసికొని, వెల్లకిలపడుకుని ఆ నీరును పైకి వదిలితే, ఆకాశమున తుంపురులతో నిండియుండును. ఆతుషార రాశిని మూఢుడు అదియొక సరమ్ము అని భ్రమ చెందును. అట్లే సర్వ వ్యాపకమగు చైతన్యమును మాయా ఆవరణ శక్తితో కప్పి పుచ్చి, విక్షేప శక్తితో స్వరూపరహితమైన కొన్ని వస్తువులను చూపగా వాటిని చూచి చైతన్యముకంటె ఈ ప్రపంచం భిన్నమని భ్రాంతి పడు చున్నారు మానవులు. ఇది రాలిన ఎండాకువలె నిస్సారము. గ్రీష్మ ఋతువులో పూతపిందెలేని అడవివలె నిష్ఫలము. చావు సిద్ధమయిన వాండ్ల చిత్తమువలె అస్థిరము. కొండ గుహలవలె, శూన్యము. అంధ కార బంధురము. అతి భయంకరము. చీకటి గుహలో ఒంటరినృత్యము, పిచ్చివాళ్ల పనులవంటిది. నిజంలో ఆరిపోయిన అజ్ఞానమనే మంచుకలది. విజ్ఞానమనే శరత్కాలనభస్సు. స్తంభాల మీదనూ, రాతిగోడమీదనూ ఉలితో కొట్టి తయారు చేసిన బొమ్మల ఆకారంవంటిది. బురదమట్టితో తయారుచేసిన బొమ్మలవంటిది. ఇందులో కొన్ని బొమ్మలు సచేతనాలు కొన్ని అచేతనాలు. దీనికి అధిష్ఠాన చైతన్య స్వరూపముకంటె వేరే స్వరూపం లేదు. ఇలాంటి ప్రపంచాన్ని ఈ ప్రకరణార్థమును అను సంధానం చేసికొన్న మానవుడు తనలోనే చూచుకుంటాడు.

తరువాత స్థితి ప్రకరణం నాల్గవది. మూడువేల శ్లోకాల గ్రంథం. ప్రపంచాన్ని గురించీ, బ్రహ్మతత్త్వాన్ని గురించీ అనేక ఆఖ్యాయికలు ఉన్నాయి ఇందులో. బ్రహ్మయే ద్రష్టగాను, దృశ్యంగాను, భోక్తగాను, భోగ్యంగాను, కర్తగాను కరణంగాను, ఉన్నాడని వర్ణింపబడింది ఇందులో. దశదిశల విస్తరించిన ప్రపంచ భ్రాంతి అంతా అధిష్ఠాన చైతన్యాన్ని ఆధారపరచుకొని పెరిగిందనీ అందులో నేలయిస్తోందనీ చెప్పుతుంది ఈ ప్రకరణం.

పిమ్మట ఉపశాంతి ప్రకరణం, ఇది 5 అయిదవది. అయిదువేల శ్లోకాల గ్రంథం. పరమపవిత్రమయిన ప్రకరణం ఇది. యుక్తులపుట్ట. "అదీ, ఇది, నేను, నీవు" అనే భ్రాంతి అంతా చల్లారునని చెప్పబడుతుంది ఇందులో. ఈ ప్రకరణంలోని విషయం మనసుకుపటితే సంసార సంబంధం చల్లగా జారుకుంటుంది. చెరిగిపోయిన చిత్రపు లోని సేనవలె, గుర్తుమాత్రంగా కనిపిస్తుంది. ఉన్నదానిలో నూరవవంతు మిగిలిఉంటుంది. (సంస్కార మాత్రంగా) ఇదీ జీవన్ముక్తియొక్క క్రమాన్ని బట్టి పరకీయ సంకల్పంవల్ల వాడి చిత్తంలో తయారైన నగరశోభవలె జారిపోతుంది. కలలో అలభ్యమయిన వస్తువును గురించి ఒకడికి సంకల్పం కలిగింది. వాడిప్రక్క ఉన్న మరొకడు దాన్ని చూచాడు కలలో, కలలోనే యుద్ధం చేస్తాడు. వీళ్లిద్దరూ ఆ తగాదాలో అరుస్తారు. ఇదంతా ఏమీ ఉండదు మెలకువవస్తే. అంతే ప్రపంచం కూడా. ఇందులో వస్తువును సంకల్పించిన వాడికి వస్తువు అంత స్పష్టపడదు. స్వప్నంలో ఆ వస్తువును చూచిన వాడికి అది కొంచెము స్పష్టపడును. కాని జాగ్రతలో ఈ ఇద్దరికీ ఆ వస్తువు లేనిదే. అందులో ఇద్దరూ సమానులే.

1. మఱినీ, ఈ ప్రపంచం సంకల్పరహితుడు కల్పించుకున్న వజ్ర నిర్ఘోషమువంటిది. (పిడుగుపాటువంటిది)

2. స్వప్న సంకల్పాన్ని మరచినవాడు నిర్మించుకున్న నగరము వంటిది.

3. ఇకముందు తయారు కాబోయే పట్టణముయొక్క ఉద్యాన వనంలో కనపొయ్యే గొడ్డురాలి శరీరమువలె శూన్యమైన స్వరూపంకలది.

4. ఆ గొడ్డురాలి నాలుకతో చెప్పబడుచున్న ఆమె పిల్లల యొక్క భయంకరమైన యుద్ధవార్తల వంటిది.

5. వ్రాయని వ్రాత బొమ్మలచే వ్యాప్తమైన గోడవంటిది.

6. నగరం అనే శబ్దార్థాన్ని పూర్తిగా మరచినవాడు కల్పించుకున్న నగరంవంటిది.

7. అన్ని ఋతువుల సంపద గలిగి, పుట్టని వనశోభవతే, అస్ఫుట మైన ఆకారము కలది.

8. ఇకముందు పుట్టబోయ్యే పుష్పములుగల వనంలో తాండవ మాడే వసంత ఋతువువంటిది.

9. తరంగాలన్నీ లోపల లీనమై నిశ్చలమైన నీరుగలనదివంటిది.

తరువాత నిర్వాణం అనే ఆరవ ప్రకరణం. దీని శ్లోక సంఖ్య 14500 లు పదునాలుగువేల అయిదువందలు. అమూల్యమైన జ్ఞానాన్ని ప్రతిపాదిస్తుంది. దీనిని చక్కగా తెలిసికొంటే, సకల కల్పనలు అంతరించి నిర్వాణమనే శ్రేయస్సు కలుగుతుంది. దీనిని విన్నవాడు నిర్విషయ చిత్ప్రకాశ రూపుడగును. సంసార బాధలుండవు. సర్వసంసార భ్రమలు అంతరించును. అతి నిర్మలుడగును. లోకయాత్ర రూపుమాయును. కృతకృత్యుడగును. వజ్రమణి వికారమయిన స్తంభమువలె, సమస్త జనులకూ, వారి పనులకూ ఆధారమగును. వజ్రమణి తనయందు ప్రతి బింబించిన జనులకూ, వారి పనులకూ ఆధారమగుచున్నది.

ఆకాశమువలె నిర్లిప్తుడగును. దిగమ్రింగిన జగజ్జాలములతో తృప్తిచెందిన వాడగును. బాహ్యేంద్రియములతో విషయ భోగమూ, మానసికమగు సుఖదుఃఖానుభవమూ నిశ్శేషముగా ఆకాశతుల్యమగును. (శూన్యమగును) ఆధిభూతాది రూపమగు కార్య కారణకర్తృత్వములందు హేయోపాదేయ బుద్ధిరహితుడగును. దేహముతో కూడినను, దేహము లేనివాడగును. సంసారమునందు ఉన్ననూ, సంసారసంబంధరహితు డగును. రాతిలోని మధ్యభాగమువలె, చిల్లిలేని చిన్మయుడగును. (అనగా పరిపూర్ణ చిన్మయుడని యర్థము) చిదాదిత్యుడై లోకాలన్నిటినీ ప్రకా శింప చేయుచూ, నిజంగా అచ్చటదృశ్య వస్తువులేవీ లేనందున, చీకటి రాత్రివలె గాఢాంధకారమును పొందినవాడువలెనగును. సంసారము యొక్క దుశ్చేష్టలన్నీ నిరోధించుకుంటాడు. ఆశ అనే కలరా వ్యాధిని నివారించుకుంటాడు. ఇలాంటి చిదాత్మయొక్క వెంట్రుక చివరిభాగము

నందు ఈ జగల్లక్ష్మి తాండవం ఆడుతోంది. అనగా అవిద్య యొక్క ఏకదేశమునందు జగల్లక్ష్మి తాండవిస్తోంది.) మహా మేరువు యొక్క పుష్పమునందు తుమ్మెదవలె. అహంకారమనే దయ్యాన్ని వదల్చుకుంటాడు. సశరీరుడైనను, అశరీరుడవుతాడు. ఇందు "పాదోఽస్యసర్వాభూతాని త్రిపాదస్యామృతందివి" విష్టభ్యాఽహమిదం కృత్స్నం ఏకాంశేనస్థితో జగత్" అను శ్రుతిస్మృతులు ప్రమాణములగుచున్నవి. చిదాకాశరూపుడైన పరమాత్మ, తనలో కల్పించుకున్న ప్రతి ఆకాశ పరమాణువు నందునూ, కొన్నివేల జగత్తులను ధరించి ఉంటాడు. అక్కడనే చూస్తాడు. చిన్న అద్దంలో మేఘాలూ, గ్రహాలూ, నక్షత్రాలూ, ఆకాశమూ, అంతా ప్రతిబింబించి కనిపిస్తూ ఉంటుంది. అఘటనఘటనాపటీయసైన, అవిద్యకు సాధ్యంకాని పనిలేదు. కాబట్టి చిన్నదానిలో ఈ మహా ప్రపంచం ఎలా తాండవిస్తుంది? అనే శంక నీకక్కరలేదు.

రామా! జీవన్ముక్తుని యొక్క హృదయం పరమాత్మే. దాని యొక్క (ఆ పరమాత్మ యొక్క) విస్తారము లక్షమంది హరిహరాదులైనా కొలవలేరు. వారికాసామర్థ్యంలేకకాదు. ఆ పరమాత్మకు కొలత లేకుండుట నిజము. కల్పితముకాదు. అందువల్ల ఎవ్వరూ అతనిని కొలవ లేరు, ఆకాశాది భూతములకు కొలత లేకుండుట పురుషుల అసామర్థ్యముచే కల్పితం కావచ్చు, పరమాత్మకు కొలత లెకుండుట (పరిచ్ఛేదము లేకుండుట) అట్లుకాదు, అది సహజం, స్వతస్సిద్ధం

## ౧౮ దృష్టాంత నిరూపణము

రామచంద్రా! మంచినేలను, మంచి గింజనాటితే, అది కాచి తీరాలి. (అది ఫలించి తీరాలి) ఈ మోక్షోపాయ సంహిత చిత్తంలో ఉంటే వివేక జ్ఞానం కలిగితీరాలి. యుక్తి జాలంచేత తత్త్వాన్ని (నిజాన్ని) నిర్ణయించి చెప్పే శాస్త్రం, పురుషులచే వ్రాయబడినా ఆదరించితీరాలి. పురుషుడు న్యాయమయిన దానిని అనుసరించాలి, మిగిలినది వేదతుల్యమైనా పరిత్యజించాలి. వేదాలు ఎంత గొప్పవైనా, వాటి భావం అంత స్పష్టంగా బోధపడనందున సాధారణాధికారులకు అంతగా ఉపకరించవు.

వేదసారాన్ని గుర్తించిన మహానుభావుల అనుభవమును ఆధారంగాచేసి కొని, యుక్తియుక్తంగా విషయం స్పష్టపరచబడింది ఇందులో. కాబట్టి యీ శాస్త్రంతో సరియైనది మరొకటేదీ కాదు.

పిల్లవాడు చెప్పినా యుక్తియుక్తమయిన మాటను గ్రహించి తీరాలి. బ్రహ్మదేవుడు చెప్పినా యుక్తిరహితమయిన మాటను త్రోసి పుచ్చాలి. తన యెదుట నున్న గంగోదకాన్ని విడచి, మా తాతగారు త్రవ్వించిన బావియిది, అని అందులోని నీరు త్రాగేవాణ్ణి మూఢు డంటారు లోకులు. తెల్లవారగానే సూర్యుడి వెలుగువచ్చి పడ్డట్లు, యీ సంహిత చిత్తంలో పడంగానే, మంచి వివేకం అ వి ర్భ వి స్తుం ది. ఉట్టిపడుతుంది.

ఒక్కమాటు మంచి గురువుయొక్క నోటికుండా గ్రంథమంతా వినాలి. సాధారణంగా తెలిసిన దానిని మెల్లమెల్లగా విచారణ చేసికో వాలి, ఆపైన బుద్ధికి చక్కని సంస్కారం ఏర్పడుతుంది. దానివలన సభాస్థలంలో జనరంజకంగా మాటాడే వాక్చాతుర్యం కలుగుతుంది. చక్కని అర్థమును గ్రహించే నేర్పు అలవడుతుంది. గొప్ప గొప్ప విద్వాంసులు కూడా స్నేహమవుతారు. రాత్రికాలంలో దీపం చేతిలో ఉండి నేత్రములకు చూపుఉంటే పదార్థాలన్నీ స్పష్టంగా కనిపిస్తాయి, అలాగే దీనివలన బుద్ధిమంతుడైనవాడు అన్నిట పూర్వాపరములను గుర్తించ గలుగుతాడు,

శరత్కాలం సమీపిస్తే మంచు తగ్గిపోతుంది, ఈ శాస్త్రం వింటే లోభమోహాదిదోషాలు తగ్గిపోతాయి. బుద్ధి వృత్తులు వివేకా భ్యాసాన్ని యెదురుచూస్తూ ఉంటాయి, అభ్యాసం లేనిదే ఏపనీ ఫలిం చదు, మనస్సు శరత్కాలంలో సరస్సువలె నిర్మలమవుతుంది. మందర పర్వతాన్ని పైకితీసినప్పుడు సముద్రమువలె సామ్యస్థితిని పొందుతుంది. పైన మకిల తుడిచిన రత్నదీపము యొక్క జ్వాలవలె, పదార్థజాలాన్ని సూచించే అతి స్వచ్ఛమయిన ప్రజ్ఞా సంపద చిత్తంలో వెలుగుతుంది. "నేను దరిద్రుడను" "నేను దీనుడను" అనే దృష్టులు ఏవీ అతనిని బాధిం

చవు, ఇనుప కవచమును కప్పుకున్న వానిని బాణాలు బాధించనట్లే, భయంకరమయిన సంసార భీతులు వీడి హృదయాన్ని చెడగొట్టవు, ఎదుట నున్న పెద్ద రాతిని బాణాలు ఏమీ చేయలేవు, పగటి కాలమున చీకటి శాంతించినట్లు, సంసారంలో జన్మ మొదలా? కర్మ మొదలా? దైవం ప్రధానమా! పౌరుషం ప్రధానమా? అనే సంశయాలన్నీ నశిస్తాయి, సూర్యోదయం అయి రాత్రి కాలం గడచిందంటే, కొంపలోని వస్తువులను గురించిన మనఃక్షోభ తీరుతుంది. అలాగే వీడికి సర్వ వస్తువులందును రాగద్వేషాది మనః క్షోభము నశిస్తుంది. ఈ శాస్త్రాన్ని విచారించే వాడికి, సముద్రమువంటి గాంభీర్యము, మేరుపర్వతమువంటి ధైర్యము, చంద్రునివంటి చల్లతనం చిత్తంలో ఉదయిస్తుంది. ఇలా క్రమంగా చెప్ప నలవికాని జీవన్ముక్తి దశాపరిణామం ప్రారంభం అవుతుంది.

మరియు, ఈ గ్రంథమును విచారించే వాడికి శరత్కాల చంద్రికవలె స్వచ్ఛమయిన పరమాత్మ సాక్షాత్కారాన్ని ఇచ్చే, బుద్ధి వృత్తి తయారవుతుంది.

హృదయాకాశంలో వివేకమనే సూర్యుడు ఉదయించి, శమమనే గుణంతో ప్రకాశిస్తూ ఉంటే, అనర్థకరులైన కామ క్రోధాది ధూమ కేతువులు పుట్టవు.

శరత్కాలంలోని మేఘాలు నీరు తాగవు, వర్షించవు. గర్జించవు. సౌమ్యంగా ప్రశాంతంగా ఉంటాయి. పరిశుద్ధంగా (తెల్లగా) ఉంటాయి. ఎత్తైయిన పర్వతాల మీద ఉంటాయి. అలాగే యీ శాస్త్రాన్ని తరచిన మానవులు జీవన్ముక్తులై, సర్వోన్నత పదవిలో ఉంటారు. శాంతించి ఉంటారు. పరిశుద్ధులవుతారు. చాలా సౌమ్యులుగా సంచరిస్తారు. వీరి ముఖాన దైన్యం అగపడదు. పరులను ద్వేషించే పాపిష్ఠి భావాలుండవు. పగటికాలంలో పిశాచాల ఆటలు (సంచారాలు) ఉండనట్లే. చిత్రపు (పటము) లోని తీగను గాలి కదల్చలేనట్లు, పరమాత్మ అనే గోడ యందు, లగ్నమై ఉన్న ఈ ధీరుని చిత్తమును, మనశ్చింతలు ఏవీ కదల్చ లేవు. తత్త్వవేత్త విషయాసక్తి అనే గోతులలో పడడు. దారి తెలిసిన

వాడెవ్వడేని గోతికి దారితీయునా? పతివ్రతయగు స్త్రీ అంతఃపురంలోనే విహరించినట్లు, సచ్ఛాస్త్రానికీ, సాధువుల నడవడికీ, విరోధం లేని పనులయందే, వీడి బుద్ధి రమించును. అసంగాద్వితీయ పరమాత్మ సాక్షాత్కారము చెందిన వీడు, అనేక కోట్ల ప్రపంచములకు ఎన్ని పరమాణువులో, ఆ ప్రతి పరమాణువునందునూ, అనేక బ్రహ్మాండాలను చూస్తూ ఉంటాడు. మోక్షోపాయమగు ఈ వాసిష్ఠసంహితచే వివేకమునొంది, అంతఃకరణశుద్ధికలవాడిని, ప్రపంచ భోగ పుంజము, దుఃఖ పెట్టలేదు. సంతోష పెట్టనూ లేదు. ప్రతి పరమాణువునందునూ అసంకీర్ణంగా అనేక బ్రహ్మాండాలు, సముద్రపు నీటిలో తరంగాలవలె, ఆవిర్భవిస్తూ, తిరోభావం చెందుతూ ఉంటాయి. వీటిని జీవన్ముక్తుడు కనిపెట్టగలడు. తనకు కలిగిన అరిష్టాలను గుర్చి ద్వేషించడు. తననుంచి తొలగిన ఇష్టములనుగూర్చి కాంక్షించడు. కార్యాకార్యములు తెలిసినా, చెట్టువలె తెలియనివాడుగా నుండును. ఇష్టానిష్టఫలము ప్రాప్తించినపుడు చిత్త వికారమును పొందడు. సాధారణ మానవుడివలె నుంటాడు. ప్రాప్తించిన దానితో తృప్తి పడును.

రామా! ఈ శాస్త్రాన్ని సంపూర్ణంగా తెలిసికో. ఎవరి చేతనైనా చెప్పించుకొని, ప్రతిశ్లోకమూ తాత్పర్యాన్ని విచారించుకో. ఇవి మాటలే కదా అని అలక్ష్యం చేయకుము. బ్రహ్మ శాపంవలెనూ బ్రహ్మదేవుని వరంవలెనూ, అనుభవంలోకి వస్తుందిసుమా ఇది.

ఈ శాస్త్రం చాలా సుబోధం. శబ్దార్థాలంకారయుక్తం. అతిసుందరం. రసమయమైన కావ్యం. దృష్టాంతాలపుట్ట. పదపదార్థ జ్ఞానంకలవాడు దీన్ని స్వయంగానే తెలిసికోవచ్చు. ఎవరికైనా స్వయంగా అర్థంకాకపోతే పండితునివల్ల చెప్పించుకొని తెలిసికోవచ్చు. మోక్షప్రాప్తికి ఈ శాస్త్రం వింటేచాలు. దీన్ని విచారిస్తేచాలు. దీన్ని తెలిసికొంటేచాలు. ఇంక తపోధ్యాన జపాదు లేమీ పనిలేదు.

ఈ శాస్త్రాన్ని బాగా అభ్యసిస్తే మాటి మాటికి తరచిచూస్తే, నూతన పాండిత్యం ఏర్పడుతుంది. చిత్తానికి అపూర్వ సంస్కారం కలుగుతుంది. "నేను" "జగత్తు" అనే ద్రష్టృ దృశ్య భావము అనే పిశాచము

మాయమై పోతుంది. సూర్యోదయం అయితే దయ్యాల ఆటకట్టినట్లే. "నేను" "జగత్తు" అను భ్రాంతి ఉన్నా ఏమీ చెయ్యలేదు వీణ్ణి. మెలకువ వచ్చిన తరువాత కలలోకన్న వస్తువు మానవుని కలవర పెట్టలేదు. భ్రమింప చేయజాలదు. మానవుడికి మనఃకల్పితమైన నగరంతో ట సంతోష విషాదాలు అంటవు. అలాగే జగత్తు భ్రాంతి అని తెలిసిన తరువాత ఆ భ్రాంతి బాధించలేదు. ఇది చిత్రువులో వ్రాయబడిన పాము అని తెలిసిన తరువాత ఆ పామువల్ల భయం ఉండదు. అలాగే, ఈ దృశ్య ప్రపంచమనే సర్పమును తెలిసికుంటే ఇంక దానివల్ల సుఖ దుఃఖాలుండవు.

"ఇది చిత్రవు నందలి సర్పము" అని తెలిసికొంటే దానియందలి సర్పత్వము నశిస్తుంది. సంసారము మిధ్య అని తెలిసికొంటే దీనియందలి సంసారత్వము నశిస్తుంది. అధిష్ఠాన రూపంతో అది మిగిలిఉన్నా ఏమీ బాధించదు. పుష్పాలూ, చిగురుటాకులూ, మాలగా కూర్చాలంటే, సూదితో గుచ్చే ప్రయత్నం చెయ్యాలి. తత్త్వజ్ఞానం కలిగిం తరువాత సంసారం నశించి మోక్షం పొందటానికి, ఆ మాత్రం ప్రయత్నంకూడా అక్కరలేదు. ఇంతవరకూ మేము "పురుష ప్రయత్నం కావాలి" "పురుష ప్రయత్నంకావాలి" అని అన్నామంటే అది జ్ఞాన ప్రతిబంధక మైన రాగద్వేషాది దోషాలు పోగొట్టుకోటానికిగాని, కలిగిన జ్ఞానంవల్ల మోక్షం పొందటానికిగాదు. దీని కొరకు పురుష ప్రయత్నం అనవసరం. ఆరూఢ జ్ఞాని (నిజమయిన తత్త్వజ్ఞాని) ప్రయత్నావస్థలో ఉండుటయే అసంభవం, పూలనూ, చిగురుటాకులనూ సూదితో గుచ్చేటప్పుడు అవయవాలు కదలకతప్పదు. మోక్షమును పొందుటలో ధీస్పందం కూడా నిరోధించాలి. అనగా బుద్ధికూడా చలించడానికి వీలులేదు. శరీరావయవముల చలనం అసలే లేదు.

సుఖాసనం మీద కూర్చుండి యథాసంభవమయిన భోగజాలాన్ని అనుభవిస్తూ, సదాచారానికి విరుద్ధంగా నడవక, కాలానుగుణంగానూ, దేశానుగుణంగానూ సుఖంగా వీలైనంతవరకు సత్సాంగత్యాన్ని అలవరచుకుని, ఈ మోక్ష శాస్త్రాన్నికాని, ఉపనిషత్తులనుగాని, ఇతర మోక్ష

ధర్మములనుగాని విచారిస్తూ ఉండేవాడికి, సంసార శాంతిని ఇచ్చే జ్ఞాన బోధ కలుగుతుంది. వీడు మళ్లీ పుట్టడు. యోని యంత్రంలో పడి నలిగి పోడు. ఈ శాస్త్రం ఇంత సులభంగా గొప్ప ఫలాన్ని ఇచ్చేదైనా సంసారం అంటే భయంలేక, పాపాత్ములై, భోగలాలసులైన మూఢులు, మాతృకుక్షిలోని మలమూత్రాలలో పురుగులు. వాండ్ల విషయం నా ముందు ప్రస్తావించవద్దు.

రాఘవా! ఇప్పుడు నీకు చెప్పబోయే శాస్త్రాన్ని విను. దీనిని వింటే నీకు జ్ఞానం విస్తరిస్తుంది. సారతరమైన ఆత్మ తత్త్వం ప్రత్యక్షమవుతుంది, ఇది ఇలాంటి శాస్త్రం. ఇది ఎలాంటి దృష్టాంతంతో అవతరించిందో. ఎలాగంటి పరిభాషతో (ఉపక్రమోప సంహారములతో), విచారించబడిందో తెలిసికో. తెలియని విషయాన్ని తెలిసిన విషయంతో తెలియపరచడమే దృష్టాంతంయొక్క స్వభావం అంటారు పెద్దలు. (పోలికచేత ప్రకృతార్థ నిర్ణయము దృష్టమైనందున దృష్టాంతమని దీని వ్యుత్పత్త్యర్థము)

రామా! దృష్టాంతం లేనిదే అపూర్వమైన విషయాలు బోధపడవు. దీపం లేనిదే రాత్రిపూట ఇంటిలో కుండచట్టీ కనిపించవు. (గృహపరికరాలు కనిపించవు)

కాని రామా! ఏయే దృష్టాంతములచే నేను నీకు ఆత్మతత్త్వాన్ని బోధిస్తున్నానో, ఆదృష్టాంతాలన్నీ జన్యాలు (పుట్టుక కలవి) అనృతములు. (అసత్యములు) ఈ దృష్టాంతములచే తెలియదగిన బ్రహ్మ పదార్థము మాత్రము పరమార్థసత్యము. నిత్యము (అకారణము) మిథ్యాభూతములైన మృత్సువర్ణాది దృష్టాంతముల చేతనే పరమార్థ సత్యమైన బ్రహ్మ పదార్థము బోధింపబడుతోంది, కాబట్టి దృష్టాంతముల యందుండే, జన్యత్వ అనృతత్వాది ధర్మాలు హేయములు. (పనికిరానివి)

ఉపమానోపమేయములకు కార్యకారణత్వములచే పోలిక చెప్పబడినది. అనగా ఉపమేయం కార్యమయితే ఉపమానం కూడా కార్యమే కావాలి. ఉపమేయం కారణమయితే ఉపమానం కూడా కారణమే

కావాలి. బ్రహ్మ విషయంలో మాత్రం అలాంటి నియమం కుదరదు. ఇక్కడ ఉపమానములైన మృత్సువర్ణాదులు కార్యములైనా ఉపమేయ మయిన బ్రహ్మ పదార్థము కారణమే అవుతోంది.

ఇక్కడ నీకు బ్రహ్మమును ఉపదేశించుటలో ఏది దృష్టాంతంగా నేను చూపెదనో, దానిలో, కొన్ని ధర్మములను మాత్రమే దృష్టాంతంగా గ్రహించితిని కాని, సకల ధర్మములను దృష్టాంతంగా గ్రహించ లేదు. ఎలాగంటే ప్రపంచమునకు వివర్తాధిష్ఠానము బ్రహ్మమని బోధించుటలో, సర్పమునకు వివర్తాధిష్ఠానమయిన రజ్జువును (త్రాడును) దృష్టాంతంగా చూపినాను. ఇందులో దృష్టాంతదార్ష్టాంతికములకు, వివర్తాధిష్ఠానాంశమాత్రంలోనే సాదృశ్యము కాని, దార్ష్టాంతికమునందలి (బ్రహ్మమునందలి) నిత్యత్వసుఖత్వాది సర్వాంశములయందు సాదృశ్యము కాదు.

కాబట్టి నీకీ శాస్త్రంలో బ్రహ్మమును బోధించటానికి దృష్టాంతంగా చూపబడే వస్తువులన్నీ స్వప్నతుల్యములని గ్రహించు. ప్రపంచాంతర్గతములయిన వస్తువులు ఏవీ సత్యములు కావు.

ఇలా ఉండగా నిరాకారమయిన బ్రహ్మకు ఆకారముగల వస్తువు దృష్టాంత మెట్లగును? అని వాదించేకుతార్కికుల మాటలు పాటింప పనిలేదు. అనుమానమునందలి దోషాలను గుర్తించెడి తార్కికులు, అసిద్ధి, విరోధాది దోషాలచేత దృష్టాంతాలను దూషిస్తారు. వారు దూషించే హేత్వాదులు ప్రపంచాంతర్గతములు, స్వప్నతుల్యములు. దాని వల్ల వస్తువునందు (పరమార్థ సత్యమైన బ్రహ్మయందు) ఏదోషమూ ప్రసక్తించదు. సాధ్యము సిద్ధించువరకు, బోధ్యబోధక వ్యవహారము (తెలియ దగినది దానిని తెలిపే దానియొక్క పని) వ్యవహార సత్యత్వాన్ని పుచ్చుకొని అయినా నెరవేరుతుంది.

జాగ్రదవస్థలోని పదార్థాలు స్వప్నతుల్యములనుటలో వివాదం లేదు. పుట్టక పూర్వం ఇవీ లేవు. అవీ లేవు, నశించిన తరువాతకూడ ఈ రెండూ ఉండవు. మధ్యకాలంలో (వర్తమానకాలంలో) మాత్రం

ఈ రెండూ ఉంటాయి. కాని ఇవి వర్తమానకాలంలో కూడా ఉపాదాన కారణంతో భిన్నంగా ఉన్నవా? లేక అభిన్నంగా ఉన్నవా! అనే విషయాన్ని ఎవ్వరూ విచారించ లేక పోతున్నారు. విచారించినా నిర్ణయించ లేక పోతున్నారు. కాబట్టి జాగ్రత్కాలీన వస్తువులుకూడ స్వప్న వస్తువులవలె మిథ్యా భూతములే. ఇది ఆబాల గోపాలము తెలసిన విషయం.

అయితే స్వప్నం ప్రాతిభాసిక సత్తకలది, జాగ్రదవస్థ వ్యావహారిక సత్తకలది. అనగా స్వప్నంలోని వస్తువులు కనిపించేటప్పుడు మాత్రమే ఉంటాయి. జాగ్రత్తులోని వస్తువులు, కనిపించేటప్పుడు మాత్రమేకాక, మరికొంత కాలము కూడ ఉంటాయి. అందువల్ల ఈ రెంటికి పోలిక (సామ్యం) చెప్పటానికి వీలులేదు. కాని, స్వప్నానికీ, జాగ్రత్తుకూ కార్య కారణ హేతుఫల భావం ఉంది. జాగ్రత్తులోని ఫలానికి స్వప్నం కారణం అవుతుంది. స్వప్నంలోని కారణానికి జాగ్రత్తులో ఫలం కలుగుతుంది. ఎలాగంటే, ఒకానొకరోజు జాగ్రదవస్థలో, జైత్రయాత్ర చేయడమా? చేయకపోవడమా? అని సందేహిస్తాడనుకోండి. వాడా సందేహంతోనే దేవతలను ప్రార్థిస్తూ పడుకుంటాడు. వాడికి నిద్రలో జైత్రయాత్ర చేయవలసిందేనని స్వప్నం వస్తుంది. మరునాడు ప్రొద్దుననే జైత్రయాత్ర చేస్తాడు. శత్రు జయం కలుగుతుంది,

లేక అలాగే జైత్రయాత్ర చెయ్యాలా? చేయ తగదా? అని ఆలోచిస్తూ చాలాకాలం పూజలూ, మంత్ర జపాలూ, స్తోత్రాలూ చేస్తూ ఉండి పరుంటాడు, వాడికి ఆ నిద్రలో తనకు దేవతలు అనుకూలనుయిన వరం ఇచ్చినట్లూ, శత్రువులకు శాపం ఇచ్చినట్లూ స్వప్నం వస్తుంది. మరునాడు ఉదయాన ఈ స్వప్నాన్ని నమ్మి జైత్రయాత్ర చేస్తాడు. శత్రు జయం కలుగుతుంది. ఇలా ఈ రెంటికి కార్యకారణ భావం ఉన్నందున, ఇవి రెండూ సమానం అనవచ్చు. జగత్తు యొక్క పరిస్థితి అంతా ఇలాంటిదే. అందువల్ల స్వప్న దృష్టాంతములు యథార్థములు మోక్షోపాయమయిన ఈ వాసిష్ఠ సంహితను రచించిన వాల్మీకి ఇతర గ్రంథములను (పూర్వ రామాయణాదులను) గూడ రచించాడు.

వాటిలో గూడ దృష్టాంతములను యథాసంభవంగానే, కావలసిన అంశం లోనే గ్రహించాడు. సర్వాంశములయందు సామ్యాన్ని వాటిలో కూడ చెప్ప లేదు, కాని శ్రోతలకు ప్రపంచం సత్యం అనే భ్రమ ఉండటం చేత, ప్రపంచం స్వప్న సమం అని శాస్త్రం చెప్పినా, వాళ్లకు త్వరగా మనసుకు పట్టదు. వాళ్లు తగాదా పడుతూనే ఉంటారు ఈ అంశంలో. నిజంగా ప్రపంచం స్వప్నంవంటిది, సంకల్ప నగరంవంటిది. ధ్యానావస్థలో కల్పించుకున్న నగరంవంటిది. కాబట్టి వాటినే దృష్టాంతంగా ఇయ్యాలి, అంతకంటె వేరే దృష్టాంతాలు లేవు. బ్రహ్మను బోధించటానికి.

స్వప్న ప్రపంచానికీ, జాగ్రత్ప్రపంచానికీ అన్ని అంశాలలో సామ్యం అంగీకరించినా, ప్రపంచోపాదాన కారణమయిన బ్రహ్మకూ, కటకముకుటాలకు ఉపాదాన కారణమయిన సువర్ణానికీ, అన్ని అంశాలలో సామ్యం (సర్వాంశసామ్యం) చెప్పటానికి వీలు లేదు. కటకముకుటాలకు ఉపాదానమయిన సువర్ణమునందు, (పరిణామిత్వం) పరిణామం చెందే స్వభావం ఉంది. బ్రహ్మయందు ఆ స్వభావం లేదు. "తదేతత్ బ్రహ్మ అపూర్వ మనపరం ఏకమే వాద్వితీయం" ఇత్యాది శ్రుతులు చిచ్ఛక్తి (చితిశక్తి) పరిణామం చెందేదికాదని చెప్పుచున్నాయి. "అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే" అను స్మృతులు కూడ అసంగ ఉదాసీనుడైన బ్రహ్మకు పరిణామకారణత్వము ఏమాత్రమూ పొసగదని అంటున్నాయి. ఒకవేళ సువర్ణదృష్టాంతమును బట్టి బ్రహ్మకు గూడ పరిణామిత్వము (పరిణామ స్వభావము) అంగీకరిద్దామన్నా చిద్రూపుడైన బ్రహ్మ చిద్వస్తువులయొక్క ఆకారంగా పరిణమించగలడుకాని, జడవస్తుల ఆకారంగా పరిణమించలేడు. అలా పరిణమించుట కూడా కుదరదు. కాబట్టి ఎంత తన్నుకున్నా సువర్ణ దృష్టాంతమును బట్టి బ్రహ్మకు పరిణామ కారణత్వము చెప్పడం కుదరదు. కనుక బ్రహ్మ విషయంలో మాత్రం దృష్టాంతదార్ష్టాంతికములకు సర్వాంశసాధర్మ్యం అసంభవం. కనుక ఉపమానోపమేయములకు ఏకాంశసాధర్మ్యమే (ఏదో ఒక అంశయందు సామ్యమే) అంగీకరించాలి బుద్ధిమంతులు. అదే నిర్వివాదస్థితి, లేనిచో తగాదా తప్పదు.

దీపానికీ మణికీ పోలిక చెప్పామనుకోండి. ఆ పోలిక వస్తువులను ప్రకాశింప చేయటంలోనేకాని, దీపంలో ఉన్నట్లు వత్తీ, చమురూ బుడ్డీ కూడా! మణిలో ఉన్నట్లు చెప్పడానికి వీలా? లేదు. అర్ధ ప్రకాశమాత్రమైన ఏక దేశసామ్యం చేతనే ఉపమానం ఉపమేయాన్ని బోధిస్తుంది. ఈ విషయమును శాస్త్రీయమైన సర్వదృష్టాంతములందుకూడ అంగీకరించి తీరాలి. ప్రత్యగాత్మకు ఆకాశాన్ని దృష్టాంతంగా ఇచ్చినా, సూర్యుణ్ణి దృష్టాంతంగా ఇచ్చినా, బ్రహ్మకు మృల్లోహాదులను దృష్టాంతంగా ఇచ్చినా? పదార్థ పరిశోధన ద్వారా మహా వాక్యార్థమును నిశ్చయించ టంలోనే తాత్పర్యంకాని, అన్ని అంశాలలోను తాత్పర్యంకాదు. మానవుడు దురూహాలకులోనై వివేకాన్ని నాశనంచేసికోకూడదు. విద్వదనుభవానికి విరుద్ధంగా ఉండే పాపిష్టి వికల్పాలను పారద్రోలాలి.

ప్రపంచం సత్యమనీ, భార్యాపుత్ర మిత్రాదులవల్ల కలిగే సుఖం శాశ్వతం అనీ, సర్వ కర్మ సన్యాసంవల్ల సాధించే మోక్షం పరమ దారిద్ర్య రూపమనీ ఇలాంటి మోక్షంవంటి శత్రువు మరొకటి ఉండదనీ కొందరంటారు. బాగా విచారణ చేయనివాళ్లకు అలాగే తోచవచ్చునుగాని, విచారించుకున్నవాళ్లకు మాత్రం ఎంత విరుద్ధంగా ఉన్నా, నిత్యనిరతిశయానందరూపమైన పరమ పురుషార్థాన్ని ప్రసాదిస్తున్నందువల్ల ఔపనిషద వాఙ్మయం అంత పరమాప్త మిత్రుడు మరొకడుండడు. ప్రపంచ సత్యత్వమును చెప్పే మాటలే పరమ శత్రువులు. ప్రపంచ మిధ్యాత్వమును చెప్పు మాటలే పరమ ప్రమాణములు. పరమమిత్రులు. ఇది అనుభవనిష్ఠులగు అస్మదాదులకు (వాల్మీకాదులకు) తెలుసును. పరమార్థరహితమయిన వైదిక మాటలను, పరమాప్తురాలైన స్త్రీ (భార్య) చెప్పినా, అదివాక్ప్రలాపమాత్రమే (వాగుడు మాత్రమే) అగును. ఆగమము (వేదము) కాదు. ఆప్త వచనముకాదు. ప్రమాణమునూ కాదు.

రామా! కపిలకణాద జైమిని మున్నగువారు వేదార్థమును ఎఱింగినవారైనను, ఈ విషయమునువారు కనిపెట్టలేదు. వారు వారి వారి సిద్ధాంతాలతో వారివారి మతాన్ని మాత్రమే పోషించుకున్నారు. అధ్యాత్మ శాస్త్రాలన్నిటికీ, ఏకవాక్యతకలగచెయ్యాలనివారుప్రయత్నించ

లేదు. వారి పని అదికాదు. వారి ఊహలనే వారు ప్రమాణంగా పెట్టుకున్నారు. మేము మా ఊహలను ప్రమాణంగా పెట్టుకోలేదు. శాస్త్ర తాత్పర్యాన్ని గుర్తించాము. దాన్ని ప్రమాణంగా చేసికొన్నాము. కపిలాదులకు శ్రుతి తాత్పర్యాన్ని నిర్ణయించతగిన మతిలేదు. అందువల్ల పురుషార్థాన్ని, తదుపాయాలను నిర్ణయించడంలో మాకు వాళ్లకూ భేదం వచ్చింది, మాది ప్రమాణం వాదం. వాళ్లది తర్క-వాదం (యుక్తివాదం.)

గమనిక: గురూ! లోకంలో, నేను లావు. నేను సన్నం. నేను పచ్చన, నేను నలుపు. వాడు తెలుపు. అనే ప్రత్యక్ష ప్రతీతులున్నాయి.

మందుతింటే రోగం తగ్గి ఆరోగ్యం కలుగుతోంది. అందువల్ల ప్రవృత్తికి కనిపిస్తోంది ఫలం. ఒకరి పనిని మరొకరు సాటిగా తీసికొంటున్నారు. ఒకరివలె మరొకరు నడచుకోవలెననుకుంటున్నారు.

"బ్రాహ్మణోయజేత జ్యోతిష్టోమేన యజేత" ఇత్యాది శ్రుతులూ స్మృతులూ, యుక్తులూ, కనిపిస్తున్నాయి. ఇవన్నీ దేహముకాని, దేహముకంటె వేరైన మరొకడు కాని, కర్తృత్వ భోక్తృత్వములుగల ఆత్మ ఉన్నట్లు చెప్పుచున్నాయి. వీటినిబట్టి కర్తృత్వభోక్తృత్వాది ధర్మములుగల ఆత్మలు అనేకులున్నటుల ప్రత్యక్షమగుచుండ, ప్రత్యక్షాద్యనేక ప్రమాణములకు, విరుద్ధమైన మహా వాక్యమువలన, కర్తృత్వభోక్తృత్వాది ధర్మరహితుడైన ఆత్మయొక్కడే అను విషయమును గ్రహించుట ఎలా పొసగుతుంది. ఎంతటి మహా వాక్యమైనా లోక విరుద్ధమైన అర్థాన్ని చెప్పితే నమ్ముతామా!

శిష్యా! అలాగా నీవు చెప్పినవన్నీ విద్వాంసులయొక్క అనుభవానికి విరుద్ధమైన భ్రాంతి జ్ఞానాలు. విద్వదనుభవాన్ని మంటకలిపే కుతర్కాలు. అజ్ఞానులకు బాగా రుచించే సుజ్ఞానాలు (వికల్పాలు) వీటిని ప్రమాణంగా పెట్టుకొని విద్వదనుభవ సిద్ధమైన వివేకాన్ని సమ్యగ్ జ్ఞానాన్ని నాశనం చేసికోకూడదు,

కొంతమంది బ్రహ్మ సప్రమాణమా? అప్రమాణమా? అని దుర్వికల్పం చేస్తారు. సప్రమాణం అంటే, బ్రహ్మ ఒకడూ, వానిని చెప్పు ప్రమాణం ఒకటీ రెండూ ఉన్నం మన అద్వైతానికి భంగంకదా అనీ, అప్రమాణం అనేటట్లయితే బ్రహ్మయందు ప్రమాణమే లేనందున ప్రమేయమైన బ్రహ్మ సిద్ధించదుకదా? అని అందామనీ, వాళ్ల తలంపు. ఇలాంటి కుతర్కాలచే విద్వదనుభవసిద్ధమైన ఆత్మైకత్వ జ్ఞానాన్ని ధ్వంసం చేసుకోవడం మంచిదికాదు. కనుక నీవు చెప్పిన అజ్ఞాన ప్రలాపాలవల్ల ఏ మాత్రం ప్రయోజనం లేదు. మహావాక్యార్థం సుస్థిరం.

—♦—

# ౧౯ ప్రమాణ నిరూపణం

రామచంద్రా! లోకంలో ఉపమేయమునందలి ఒకానొక అంశాన్ని విశేషించి చెప్పదలచి ఆ అంశంతో సామ్యం పెట్టుకొని ఉపమానం బయలుదేరుతుంది. అలా కాక ఉపమానోపమేయములకు సర్వాంశముల యందు సామ్యం చెప్పేటట్లయితే, ఆ రెంటికీ భేదమే ఉండదు. గవయ మృగము గోవువంటిది అని అన్నాం అనుకోండి. అంటే ఆ రెంటికీ ఆకారంలోనే పోలిక అనుకోవాలికాని, జాతిలోకూడ పోలిక అనుకోటానికి వీలులేదు. అలా రెండూ ఒకే జాతివయితే ఉపమానమే భగ్నమవుతుంది. కాబట్టి దృష్టాంత దార్ష్టాంతికములకు ఏదో ఒక అంశంలోనే సామ్యం కాని, అన్ని అంశాలలో సామ్యం కాదు. అలాగే బ్రహ్మకు మృత్పు వర్ణాదులు దృష్టాంతంగా చెప్పినందువల్ల బ్రహ్మ ఏకమనీ, అద్వితీయమనీ, జ్ఞానస్వరూపమనీ, తెలుస్తుంది. తత్త్వం పదార్థ శోధనకొరకు ఇలాంటి దృష్టాంతాలు చెప్పటం అవసరమయింది. దీనివల్ల మహావాక్యార్థనిశ్చయం కలిగి మోక్షఫలం లభిస్తుంది. ఏదో ఒకానొక యుక్తివల్ల మహావాక్యార్థ నిశ్చయం కలగచేయడమే మాతాత్పర్యంకాని, దృష్టాంత దార్ష్టాంతిక ములను పుచ్చుకొని, సర్వాంశంలో సాధర్మ్యమా? కొన్ని అంశాల లోనే సాధర్మ్యమా? అనే వికల్పాలతో ప్రొద్దుపుచ్చుకోమని చెప్పడం మా పని కాదు. కాబట్టి రామా! నిశ్శ్రేయసమే పరమ పురుషార్థమని గ్రహించు. దాన్ని పొందటానికి ప్రయత్నించు. అన్నం వండి సిద్ధమై ఉంది. ఆకలిగొన్నవాడు దాన్ని తినాలికాని, ఇది ఏలా తయారయింది? వండిందెవరు? బియ్య మెక్కడివి? కట్టెలెవరిచ్చారు? నిప్పు ఎలా వచ్చింది? అనే ప్రశ్నలతో ఏమి లాభం?

లోకంలో "ఔషధం పిబ భ్రాతురివశిఖా తే వర్ధిష్యతే" "మందు తాగు నీయన్నవలె నీకు జుట్టు పెరుగుతుంది" అని అంటారు. ఇక్కడ మందుజుట్టు పెరగటానికి కారణంకాదు. అయినా కారణం అనిచెపుతూ, అందు అన్నగారిని దృష్టాంతంగా చూపారు. ఇది, పిల్లవాడికి, ఔషధ పానము ఇష్టసాధనమను జ్ఞానం కలగచేయుటకే, ఉపమానోపమేయము లతో చెప్పబడింది కాని, నిజంగా జుట్టు పెరగటానికీ, మందు తాగటానికీ

కార్యకారణభావం ఉన్నదని చెప్పటానికి కాదు. ఎలాగయినా పిల్లవాడికి మందు త్రాగుటయందు ప్రవృత్తిని కలిగించాలి, అక్కడ వీడు మూర్ఖిస్తూ ఉన్నాడు. అందుకొరకు ఈయవస్థ పడవలసి వచ్చింది. లోకంలో ఇలాంటి అవస్థ ఎలా అవసరమయిందో, శాస్త్రంలో కూడా అలాగే, అజ్ఞానులను ఉద్ధరించడానికి, ఏదో ఒక సాదృశ్యంతో, శాస్త్రార్థం మనస్సుకు ఎక్కించటం అవసరమయింది.

కాబట్టి రాతిలోపుట్టి బలిసి ఉన్న గుడ్డికప్పవలె, మానవులు వివేకరహితులై ప్రపంచ భోగాలలోపడి ఉండుట మంచిదికాదు. మేము దృష్టాంత పూర్వకంగా బోధించిన బోధచేత, ప్రయత్నించి పరమపదాన్ని సాధించాలి. శాస్త్రీయమైన విచారణ అవసరం మానవునికి. ప్రతిదినము వేదాంత శ్రవణంచేస్తూ ఉండాలి. గురుశుశ్రూష చెయ్యాలి. శాస్త్రజ్ఞుల సహవాసం కలగాలి. ఆత్మజ్ఞుల అండచేరాలి, ఆత్మవిచారం చెయ్యాలి. అపుడు పునరావృత్తి రహితమయిన సప్తమ భూమికను పొందాలి. (తురీయ స్థానాన్ని చేరాలి.) దీనినే మాండూక్యంలో "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" అని అన్నారు. సంసార సముద్రం నుంచి ఉత్తీర్ణుడై, తురీయ స్థానంలో విశ్రాంతిచెందినవాడికి, ఇహలోకంలోగాని, పరలోకంలోగాని, చేయతగినపని ఏమీ లేదు. వాడు జీవించి ఉండనీ, మరణించనీ, గృహస్థు కానీ, యతికానీ, వీనికి కర్తవ్యం ఏమీ లేదు. శ్రవణమననాది విక్షేపాలు కూడా అవసరంలేదు. మందరపర్వతం తీసిన సముద్రంవలె, అన్ని విక్షేపాలు అంతరించి, యథాస్థితిలో ఉంటాడు.

ఇక్కడ "నిర్మందర ఇవార్ణవః" (మందర పర్వతం బయటికితీసిన సముద్రంవలె) అనే దృష్టాంతంలో ఉపమానోపమేయాలకు, ఏకాంశ సాధర్మ్యమే గ్రహించాలి. తావతాబోధ్యబోధ (తెలియదగిన దానిని తెలియుట) పూర్తి అవుతుంది. దృష్టాంత సిద్ధమయిన బోధను పరమత ఖండనకొరకు ముక్కున ఉంచుకోవాలి కాని, ఈ దృష్టాంత దార్ష్టాంతిక భావాన్ని హృదయం (గుండె) దాకా పోనిచ్చి, అక్కడ "ఈ దృష్టాంత దార్ష్టాంతిక భావం సరిపోతుందా? మందర పర్వతం తీసిననూ, సముద్రం తరంగాలతో క్షోభిస్తూనే ఉంటుందే? అలాగే ముక్తాత్మకూడా, విక్షిప్త

చిత్తుడై ఉంటాడా" అనే శుష్కతర్కాలతో ప్రశ్న వృచ్ఛకోకూడదు. దృష్టాంతాలమీద ఈచర్చ పెట్టుకుంటే, అసలు పురుషార్థం అడుగంటు తుంది. ఇలాంటి బోధ చంచుత్వము పనికిరాదు. సముద్రంలో మందరం వేసి, వాసుకిని తాడుగాచుట్టి దేవదానవులు ఇరువైపులలాగితే, సముద్రం మహాక్షోభిస్తూ, ఉంటుంది. దాన్ని బయటకు తీస్తే ఆ సముద్రం యథా స్థితిలో ఉంటుంది.

అలాగే మానవుడు ఆత్మజ్ఞానంకలిగి తురీయస్థితిని పొందక పూర్వం ప్రపంచ వాసనలతో మహా విక్షిప్తుడై ఉంటాడు. తత్త్వజ్ఞానంవల్ల మనో నాశంకలిగి, వాసనాక్షయం అయితే, వాడికి ఆవిక్షేపాలన్నీ రూపుమాసి పోతాయి. వాడు యథా స్థితిలో ఉంటాడు. "సతిష్ఠతి యథాస్థితమ్" అని మూలము. అయితే ఉపమేయమయిన ఆత్మకు యథాస్థితి, ఆత్యంతిక విక్షేప నివృత్తి. (ఏవిధమయిన విక్షేపములూ లేకుండుట.) సముద్రానికి యథాస్థితి సహజమయిన తరంగాలతో చలిస్తూ ఉండటం కావచ్చు. అంతమాత్రంచేత ఆస్థితి ఉపమేయంలో కూడా ఉండాలని ఇక్కడ తాత్పర్యం కాదు. దృష్టాంత దార్ష్టాంతికాలు, వాని స్థితిని అవి పొంద టమే ఇక్కడ తాత్పర్యం. ఒకదాని స్థితి ఒకవిధమూ, మరొకదాని స్థితి మరొకవిధమూ అయితే కావచ్చు. ఆ రెండూ వాటి మామూలు స్థితిలో ఉండటంలోనే ఇక్కడ వాటికి సాదృశ్యం వివక్షితం అయింది.

బోధకులెప్పుడూ ఏదోయొక యుక్తిచే. తాము తెలుపదగిన దానిని తెలుపాలనే వ్యాకులంలోనే ఉంటారు. కాని అందులో యుక్తాయుక్తాన్ని వారు అంతగా పాటించరు. శ్రోతలుకూడా వాటిని కావలసిన అంశంలో వాడుకుని విషయం బోధపరచుకోవాలి కాని, దృష్టాంతాలను ఖండించ టానికి మొదలు పెట్టకూడదు. అలా మొదలు పెట్టితే అది "వరఘాతాయ కన్యోద్వాహః" "అల్లుని చంపటానికి కూతురికి పెళ్లి" వంటిదవుతుంది. బోధ చంచువులు రెండు రకాలు. ఒకడుజ్ఞాన ఫలమయిన ఆత్మతత్త్వాన్ని అనర్థంగా వికల్పించేవాడు. రెండవవాడు. జ్ఞానాన్ని జ్ఞానసాధనాలను దుస్తర్కాలతో వికల్పించేవాడు. ఇందులో మొదటివాడు హృదయంలో విశ్రాంతిచెంది, అనుభవరూపుడయిన సంవిదాత్మ, అసర్థమని బోధిస్తాడు.

రెండవవాడు జ్ఞానాన్ని జ్ఞానసాధనాలను వాడికి ఉన్న ప్రపంచాభిమానాన్ని పురస్కరించుకొని దుర్వికల్పాలతో దూషించటం ప్రారంభిస్తాడు. ఆకాశాన్ని ఆధారపరచుకుని ఉన్న మేఘం ఆకాశాన్నే మలినపరచినట్లు బోధరూపుడయిన తాను తన బోధనే దూషిస్తాడు. (మలినం చేసుకుంటాడు.)

రామా! నదులన్నిటికీ సముద్రం స్థానమయినట్లు, ప్రమాణాలన్నిటికీ, ప్రత్యక్షం ఒక్కటే స్థానం. దీనిని గురించి చెపుతావిను. దీన్నివింటె కాని జీవన్ముక్తునకు "నిర్మందరార్ణవ" అనే దృష్టాంతము నీకు స్పష్టంగా బోధపడదు. ప్రత్యక్ష ప్రమాణ మొక్కటే సర్వప్రమాణాల ప్రామాణ్యాలకు మూలాధారము. కనుక దాని (ప్రత్యక్షముయొక్క) తత్త్వాన్ని వర్ణించి చెపుతావిను.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" ఇంద్రియము లన్నిటిలోనూ, నేత్రములు ప్రధానములు. ఇంద్రియజన్య జ్ఞానాలన్నిటిలోను, చక్షురింద్రియజన్య జ్ఞానం ప్రధానం. చక్షురింద్రియజన్య జ్ఞానమే ముఖ్య ప్రత్యక్షం. దానిలో విషయమయ్యే త్రిపుటికూడ దానిని ఆధారంగా జేసికొనియే ప్రత్యక్షమనబడుతుంది. త్రిపుటియనగా కర్త కర్మ క్రియలు. ఈ ప్రత్యక్షం కంటెకూడా ముఖ్యాపరోక్ష (ప్రత్యక్ష) మయింది బ్రహ్మ పదార్థము. చక్షురాదీంద్రియములకు ఆలోకాదుల సహాయం ఆవశ్యకం. బ్రహ్మపదార్థానికి ఇతరాపేక్ష లేదు. కనుకనే "యత్సాక్షాదపరోక్షం బ్రహ్మ" అని శ్రుతిచెప్పినది. ఆ బ్రహ్మ పదార్థమే ప్రతి శరీరంలోనూ వ్యాపించి యుండి, ఇంద్రియాది వృత్తులకు సాక్షి అనబడుతూ ఉంది. ఈ సాక్షి చైతన్యమే త్రిపుటిని వ్యాపించి వ్యవహారావస్థలో ప్రత్యక్షమని వ్యవహరింపబడుతోంది. సాక్షి చైతన్యానికి అనుభూతి, వేదనం. ప్రతిపత్తి అని మూడు నామములుకలవు. ఈ మూడును సార్థక నామములు.

1. త్రిపుటిని అనుసరించి ప్రకాశ స్వరూపంతో ఉండటం అనుభూతి.

2. వేద్యమైన (తెలియదగిన) త్రిపుటిని ప్రకాశింపచేయుట వేదనం.

౬. ప్రకాశ రూపంతో త్రిపుటిని వ్యాపించటం ప్రతిపత్తి.

(ప్రతిప్రకాశాత్మనా పత్తిః వ్యాప్తిః) అని వ్యుత్పత్త్యర్థము. ఈ సాక్షి చైతన్యమే ప్రాణవాయువును ధరించడంచేత జీవుడనబడుతున్నాడు.

ఈ సాక్షి చైతన్యమే, వృత్తిని ఉపాధిగా జేసికొని సంవిత్తు అనీ, అహంతాప్రత్యయాత్మకుడై, పురుషుడూ, ప్రమాత అనీ, విషయాలతో కూడి ఉండి, విషయాకారమైన అంతఃకరణ వృత్తిచే బాహ్యావరణ భంగము కాగా పదార్థమూ, విషయమూ అనీ, ఇట్లు, త్రైవిధ్యాన్ని చెందుతున్నాడు. సముద్రంలోని నీరుతరంగరూపంగానూ ఫేన, బుద్బుదరూపంగానూ కనిపించినట్లు, ఈ సంవిత్తుయే సంకల్ప వికల్పాత్మకమైన అంతఃకరణము మొదలగు నానావిధ భ్రమలతో జగత్తుగా స్ఫురిస్తోంది, ఈ సాక్షి చైతన్యం సృష్ట్యారంభంలో తాను కారణం లేనిదైయుండి, సృష్టి అనే లీలతో స్వయంగా ప్రకాశించి తనయందు కారణత్వాన్ని కల్పించుకుంటుంది తానే. అద్వితీయమయిన ఈ చిద్వస్తువునకు వాస్తవమయిన కార్యకారణ భావము సంభవించదు. కాబట్టి లేదు. అయినా అజ్ఞాన కల్పితమయిన జీవునకు, ఉన్నట్లు గోచరిస్తుంది. (నిజమైనట్లు భాసిస్తుంది.) అజ్ఞాన కల్పితమైన జీవునకు లేని కారణత్వం ఆరోపితమై, అజ్ఞాన సంవలితాత్మ రూపమయిన ప్రకృతియందు, ప్రపంచ రూపంకూడా వ్యక్తమవుతుంది. కాబట్టి ఈ ప్రపంచం అంతా ఇలా ఆత్మ చైతన్యమునందు ఆరోపింపబడింది. ప్రపంచం ఇలా కల్పితంకదా అని తాను స్వయంగానే విచారించుకుని, అవిద్యాకల్పితమైన ప్రపంచ శరీరాన్ని అజ్ఞాన నాశనంచే నశింపజేసికొని, అపరిచ్ఛిన్నమైన పరమ పురుషార్థ రూపాన్ని తాను పొందాలి.

అయితే ఆ విచారము మోక్షదశలో మిగిలి ఉండదా! అని శంకింపగాదు. చరమ సాక్షాత్కారమయిన ఆ విచారం కూడా, స్వరూపరహితమవుతుంది. ఆత్మ స్వరూపంలో కలిసిపోతుంది. శబ్దార్థోల్లేఖ లేకుండా మోక్షావస్థలో పరమాత్మ స్వరూపం ఒక్కటే మిగిలి ఉంటుంది. ఇలా ప్రపంచం బాధితమయితే, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ

ములతోటి కూడా మనస్సు శాంతిస్తే, బాధితమయిన ప్రపంచం, మరల సత్యంగా తోచదు కాబట్టి, అప్పుడు ప్రారబ్ధ కర్మాధీనంగా ఇంద్రియా లకు చలనాభాస మాత్రమే ఉంటుంది. క్రియా కర్తృత్వంకాని, తత్ఫల భోక్తృత్వం కాని ఉండదు. మనస్సులోని కోరికలు, చస్తే కర్మేంద్రియాలు కర్మలయందు ప్రవర్తించవు. కనుక జీవన్ముక్తుడు ("అసంచారిత యంత్రవత్") ప్రారంభింపచేయని (స్టార్టు చేయని) యంత్రంవలె ఉండి పోతాడు, కాబట్టి "నిర్మందర ఇవాంభోధిః" (మందర పర్వతం లేని సముద్రంవలె) అని దృష్టాంతం చెప్పబడింది. అజ్ఞానుల దృష్టిలో జీవన్ముక్తుని ఇంద్రియాదులయందు చలనం కనిపిస్తూ ఉన్నా అది ఆభాస రూపంకాని వాస్తవచలనంకాదు. దానివల్ల వీడికిబంధం లేదు. కొయ్యతో రెండు పొట్టేళ్లను తయారుచేసి, ఆ రెండూ తలపట్టుపట్టి పోట్లాడుకుంటు న్నాయి అంటే, ఆ రెండు పొట్టేళ్ల తలలు చలించటానికి కారణం వాటికి అమర్చిన తాడులాగటం అవుతుంది. ఆ తాడులాగకపోతే కొయ్య పొట్టేళ్ల తలలు కదలవు. పోట్లాట జరగదు. అలాగే మనోయంత్రం చలించటానికి కారణం విషయస్ఫూర్తి. విషయాలయందు మిథ్యాత్వ నిశ్చయంగల జీవన్ముక్తుని యొక్క మనస్సుకు విషయాలు ప్రకాశించవు. విషయాలు ప్రకాశించకపోతే మనస్సు చలించదు.

అయితే, మనశ్చలనానికి విషయ, వేదనం (జ్ఞానం) అవసరమని తేల్చారు. అంటే, మనసు చలించటానికి పూర్వం విషయాలు ఉండా లన్నమాట. లోగడ విషయాలు మనోమయములని చెప్పారు. మనస్సు చలిస్తే కాని మనోమయములైన విషయాలు తయారుకావు. ఈ అన్యోన్యాశ్రయ దోషం ఎలా తెగుతుంది?

బాహ్యేంద్రియాలచే విషయాలను గ్రహించటం, మనస్సుచే ఆ విషయాలను అనుసంధానం చేయటం ఈ రెండు రకాల పదార్థల తోనూ ప్రపంచం అంతా నిండి ఉంది. అలాంటి ప్రపంచం మాయా శబలిత బ్రహ్మయందు ఉన్నది. జగత్తు అంతా ఈ వాసనారూపమే. అలా ఉండియే ఆవిర్భవిస్తుంది. ఇది ఎలాగంటే స్పందనం (చలనం) ఉంటేకాని గాలిలేదు. గాలి ఉంటేకాని స్పందనం (చలనం) ఉండదు.

కాబట్టి గాలిని ప్రసరింప చేసే స్పందనం గాలిలో ఉండే బయటికి ఆవిర్భవిస్తుంది అనాలి. అలాగే ఈ ప్రపంచం కూడా ఆత్మ చైతన్యం యందు ఉండే ఆవిర్భవిస్తోంది.

స్వతః పరిశుద్ధమయిన ఆ పరిపూర్ణ చైతన్యము, కర్మ పరిపాకాన్ని బట్టి ఏ ప్రాణియొక్క కర్మభోగం కొరకు ఆవిర్భవించ నున్నదో, ఆ ప్రాణి రూపంగా పుట్టిన దానివలె, ఆ దేశానికి, ఆ కాలానికి, అనుకూల మైన పదార్థాకారాన్ని లోపల వెలుపల ధరిస్తుంది, అప్పుడు వాడు పుట్టాడు. వీడు పుట్టాడు అని అంటారు లోకులు. విచారయుక్తుడికి తాను దేహాది దృశ్య రూపాన్ని చెందినట్లు తెలుసు. అయినా సర్వవ్యాపకుడైన ఆ జీవుడు అజ్ఞానంవల్ల, ఈ దృశ్యాభాసమే తన రూపం అని అనుకుంటూ జీవరూపంతో ఉంటాడు. చైతన్యం ఏ రూపంలో ప్రవేశించి ఉంటే అదే వాని రూపం అని తోస్తుంది. అది సహజం. అందువల్ల సర్వాత్మ యగు ఆత్మవస్తువు కూడ ఎందులో ఉంటే అదే తన రూపంగా ఉల్లాస పడుతూ ఉంటాడు. ఈ దృశ్య ప్రపంచం అంతా వట్టిమిథ్య. ఎలాగంటే ఆత్మ దృక్ స్వరూపుడు. అతడు ద్రష్ట. అతడు తన రూపం నుంచి దిగ జారి దృశ్య రూపాన్ని ధరించాడని అనేటట్లయితే అపుడు ఆ దృశ్యానికి ద్రష్టయే లేడు కాన, ద్రష్టలేని దృశ్యమే సిద్ధించదు. లేక ఆత్మ తన రూపాన్ని విడవకుండానే దృశ్య రూపాన్ని చెందాడనేటట్లయితే, అపుడు రజ్జు స్వభావాన్ని విడవకుండా, సర్పమైన రజ్జువు, ఆ సర్పమునకు వివర్తా ధిష్ఠానమయినట్లు, ఆత్మ స్వభావాన్ని విడవకుండా. దృశ్యమయిన ఆత్మకూడ ఆ దృశ్య ప్రపంచానికి వివర్తాధిష్ఠానం అగును. అపుడు అనివార్యంగా దృశ్యప్రపంచం మిథ్య అయి తీరుతుంది. ఇలా కార్యం అంతా మిథ్య అయితే, దానిని అపేక్షించియున్న కారణత్వము కూడ మిథ్యే అవుతుంది. కాబట్టి బ్రహ్మ అకారణకమనీ (కారణత్వము లేనిదనీ) అద్వితీయమనీ సిద్ధించింది. ప్రత్యక్షానుభవ రూపమయిన బ్రహ్మ అద్వి తీయమని తేలింది. అనుమానాది మిగిలిన ప్రమాణాలు అన్నీ దీనిఅంశలే కాన, ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమయిన అర్థమునందే ఇవికూడ పర్యవ సానం చెందునని అనాలి. కనుక దీనివల్ల సర్వప్రమాణాలకు తత్త్వము ఆత్మయే అని తేలింది.

మానవుడు తన పురాకృత ప్రయత్నానికి దైవమని పేరు పెట్టు కొని, దానికి పరాధీనుడై, దాన్ని ఉపాసన చేస్తూ ఉంటాడు. అలాంటి దైవాన్ని దూరంగా తోసి, ఐహిక మగు తన ప్రయత్నంచేత ఇంద్రియాలను నిగ్రహించుకొని, ఆ ఉత్తమ స్థానాన్ని తన హృదయం లోనే తాను పొందాలి. ఇదంతా తన ప్రయత్న సాధ్యం, దైవాయత్తం అని ఉపేక్షించకూడదు. రామా! గురు పరంపరా ప్రాప్తమయిన పరమార్థనిష్ఠతో విచారించుకో నీవు. త్రివిధపరిచ్ఛేద శూన్యమయిన ఆత్మ తత్త్వాన్ని నీవే నీ బుద్ధితో సాక్షాత్కారం చేసికుంటావు. అన్నాడు వసిష్ఠుడు.

## ౨౦ సదాచార నిరూపణం

విషయం అంతా విన్నాడు రాముడు. ఇలాంటి జ్ఞానం ఎలా కలుగుతుంది? ఎవరివల్ల నేర్చుకోవాలి? అని ఉవ్విళ్లూరుతున్నాడు. చూచాడు వసిష్ఠుడు రాముడి చవారా, తత్త్వజ్ఞానం ఉత్తమ (మహా) పురుషులయందుకాని ఉండదని చెప్పదలచాడు. సదాచార సంపన్నులు కాని మహాపురుషులు కారని నిర్ణయింపదలచాడు. సదాచారాన్ని వర్ణి స్తాడు వసిష్ఠుడు.

రామా! సాధుజన సాంగత్యంవల్ల, వారు చెప్పిన యుక్తులవల్లనూ జ్ఞానాన్ని వృద్ధిచేసికోవాలి. మహాపురుషులలక్షణాలను అలవరచుకోవాలి ముందు. అన్ని గుణాలు ఒకరియొద్ద ఉండవు. ఎవరెవరి దగ్గర ఏయే గుణం ఉంటే వారివారు ఆయాయాగుణాన్నే శిక్షించగలుగుతారు. వారివద్ద ఆయా గుణాన్నే నేర్చుకోవాలి. శమాది గుణసంపత్తియే మహా పురుషలక్షణం. ఎంతటి మహాపురుషుడైనా సమ్యగ్ జ్ఞానం లేనిచే సిద్ధిపొందలేడు. తొలకరి వానలవలన క్రొత్త మొక్కలు బయలుదేరు తాయి, సత్పురుషులు ఆచరించే అమానిత్వ అదంభిత్వాది, జ్ఞానసాధ నాల వలన ఆత్మ సుఖం ఆవిర్భవిస్తుంది. అవిచాలాప్రశస్యములు, యజ్ఞాల వల్ల సస్యానుకూలమయిన ఉత్తమ వృష్టి వృద్ధి పొందుతుంది. శమద మాది గుణాలవల్ల ఆత్మజ్ఞానం వృద్ధి అవుతుంది. జ్ఞానంవల్ల శమాది

గుణాలు వృద్ధి చెందుతాయి. శమాది గుణాలవల్ల జ్ఞానం వృద్ధి అవుతుంది. సరస్సులో నీళ్లు బాగా ఉండి అది అభివృద్ధిగా ఉంటే, అందులో పద్మాలు పుట్టి అవి వృద్ధి చెందుతాయి. పద్మాలు బాగా అభివృద్ధిగా ఉంటే, వాటివల్ల, చల్లదనంలోను, పరిమళంలోనూ, శోభలోనూ, సరస్సుకు ఖ్యాతి అభివృద్ధి అవుతుంది. ఇలా ఈ రెండూ (జ్ఞాన జ్ఞాన సాధనాలు) పరస్పర వృద్ధికి హేతువులు అవుతాయి. మహాపురుష ధారే యుని నుంచి ప్రయత్నపూర్వకంగా శ్రవణం చేసి జ్ఞానం అలవరచుకోవాలి. జ్ఞానమూ, సదాచారమూ, ఈ రెండూ సమానంగా ఏక కాలంలో అలవరచుకోవాలి. ఈ రెంటిలో ఏ ఒక్కటి లేకున్నా పురుషుడు సిద్ధిని పొందలేడు.

ఒకానొక ఆడది పండిన పంటచేను కాచుకుంటూ ఉంది. చేను మీాద పిట్టలు వాలకుండా కొట్టాలి. అందు కొరకు వేరే పని చేయకుండా, దానికి వచ్చిన పాటలు పాడుకుంటూ చేతులతో గట్టిగా తాళంవేస్తుఉంది. దానివల్ల పిట్టలు ఎగిరిపోతున్నాయి. దానికి పాటలు పాడుకునే ఆనంద తీరిపోతూంది. అలాగే జ్ఞానానికి రాగద్వేషాదులు విఘ్నాలు. వాటిని పోగొట్టుకోవాలి. పోగొట్టుకోవాలనే కోరికతో చేయకపోయినా, మోక్షం కొరకు ఆచరించే, శ్రవణ, సదాచారాలవల్ల, ఆనుషంగికంగా, రాగద్వేషాది విఘ్నాలుపోయి పరమపదం సంప్రాప్తం అవుతుంది.

రాఘవా! ఇలాంటి సదాచారక్రమాన్ని చెప్పానునేను ఇందులో. ఇకముందు ప్రకరణంలో జ్ఞానక్రమాన్ని చెపుతాను. ఈ శాస్త్రం కీర్తి దాయకం. ఆయుష్కరం. పరమ పురుషార్థప్రదం. దీన్ని తెలిసినవాడి వల్లనూ, ఆప్తునివల్లనూ వినాలి. నీవు అలా విని, ఆవిన్న మహిమచేత బలాత్కారంగా బుద్ధి మాలిన్యాన్ని పోగొట్టుకుంటావు. కతకముయొక్క (ఇండుపగింజ గంధము యొక్క) సంబంధంవల్ల నీటిలోని కల్మషంపోయి, నీరు నిర్మలం అయినట్లు నీ బుద్ధి నిర్మలం అవుతుంది. నీవు పరమ పదమును పొందుతావు.

రామా! తెలియదగిన దానిని తెలిసికొని, దానిని మననం చేసే

వాడి మనస్సు, వద్దనుకున్నా ఉత్తమ స్థానాన్ని చేరుతుంది. జ్ఞాన ప్రభావంచేత, అజ్ఞాన తత్కార్యాలను తిరస్కరించి, తెలియబడిన, పరిపూర్ణమైన, ఉత్తమ స్థానాన్ని మనస్సు ఎప్పుడూ విడిచి పెట్టదు. కనుకనే,

శ్లో॥ దేహాత్మ జ్ఞానవత్ జ్ఞానం దేహాత్మ జ్ఞాన బాధకం
ఆత్మన్యేవభవేద్యస్య సనేచ్ఛన్నపిముచ్యతే॥

దేహామే నేను అనే జ్ఞానమువలె, దేహాత్మ జ్ఞానాన్ని బాధించే, ఆత్మతత్త్వ జ్ఞానం కలిగితే, వాడు కోరకుంటా ముక్తుడవుతాడు అంటారు పెద్దలు. శ్రీ శ్రీ శ్రీ

—ముముక్షు వ్యవహార ప్రకరణం సమాప్తం—



ఓం

# ఉత్పత్తి ప్రకరణం



## ౧ బంధహేతు నిరూపణము

ముగిసింది ముముక్షు వ్యవహారం. ప్రారంభం అయింది ఉత్పత్తి ప్రకరణం. పూర్వం ప్రతిజ్ఞ చేసిన జ్ఞానక్రమాన్ని విస్తరించి చెప్పదల చాడు వసిష్ఠుడు. సృష్టి ప్రకారం వర్ణించి, తద్వారా బ్రహ్మాద్వైతం ప్రతిపాదించడం సులువనుకున్నాడు. సృష్టిక్రమాన్ని బోధించే శ్రుతి వాక్యాలన్నిటికీ మహావాక్యార్థ జ్ఞానంలోనే పరమ తాత్పర్యం అని చూపించదలచాడు. ప్రపంచ సృష్టిని వర్ణిస్తాడు.

రామచంద్రా! మహావాక్యజన్య జ్ఞానంవల్ల అఖండ బ్రహ్మాకార వృత్తి కలిగి తన నిజరూపం ప్రకాశిస్తుంది, అపుడు బ్రహ్మవేత్త ఆత్మ తత్త్వం సాక్షాత్కారం చేసికొని, నిత్యముక్త పూర్ణ స్వరూపంతో ప్రకాశిస్తాడు. ముక్తికి మహావాక్యార్థ జ్ఞానం కంటే వేరు కారణం అవస రం లేదు. బంధరూపమయిన ఈ ఆకాశాది ప్రపంచం అంతా, ప్రత్య గాత్మ రూపుడయిన బ్రహ్మయందు స్వప్నంవలె కనిపిస్తుంది. స్వాప్నిక మయిన బంధం ప్రబోధంవల్లనే నివృత్తి చెందుతుంది. ప్రబోధమనగా మెలకువ. అనగా తెలివి. అనగా జ్ఞానం. కనక జ్ఞానంవల్లనే స్వాప్న ప్రపంచం నశించినట్లయింది. దీనికి ఇంతకంటె వేరు కారణం లేదు. అలాగే, దీనితో (స్వప్నంతో) తుల్యమయిన ఆకాశాది ప్రపంచంకూడా, జ్ఞానంవల్లనే నశించాలి. వేరు కారణాన్ని అపేక్షించదు. మహావాక్య జన్య జ్ఞానమే మిథ్యాభూతమయిన ప్రపంచ నివృత్తికి కారణమని స్పష్టమయింది.

ఉపనిషత్తులలోని సృష్టి వాక్యాలన్నిటికీ మహావాక్యములకు తాత్పర్య విషయమయిన బ్రహ్మాద్వైతమునందే పర్యవసానము. ఈ ఉత్పత్తి ప్రకరణంలోని ప్రపంచ సృష్టిని బోధించెడి మహావాక్యములకు గూడ అద్వితీయ బ్రహ్మ తత్త్వాన్ని బోధించడంలోనే తాత్పర్యం. సర్వ వేదాంత వాక్యములకు పరమ తాత్పర్య విషయమయిన అద్వితీయ బ్రహ్మను, శ్రవణాది ఉపాయములచే, "నేనే బ్రహ్మను" అని తెలిసికొన్నవాడు, జీవించియుండియే మోక్షఫలమును అనుభవిస్తాడు. ఇలాంటి వానినే జీవన్ముక్తుడని అంటారు పెద్దలు. ప్రపంచం మిథ్య అనీ, దానికి అధిష్ఠానమయిన బ్రహ్మయొక్క ఉనికికంటె వేరుగ ఉనికి లేదనీ, అధిష్ఠానమయిన బ్రహ్మకుకూడ నాశం అంగీకరిస్తే, నిరధిష్ఠానకమయిన (అధిష్ఠానము లేని) భ్రమ కుదరదనీ, తెలిసికుంటే, రామచంద్రా!

శ్లో॥ తదేతద్ భగవన్బ్రూహి కిమిదం పరిణశ్యతి।
కిమిదం జాయతే భూయః కిమిదం పరివర్ధతే॥

"స్వామీ! చచ్చేది ఏది? పుట్టేది ఏది? పెరిగేది ఏది? చెప్పండి" అనీ నీకు ప్రశ్నయే పుట్టదు. సద్రూపమయిన బ్రహ్మకు నాశం లేదు. నశించే ప్రపంచానికి ఉనికి (సత్తా) లేదు. కాబట్టి నీ ప్రశ్నకే అవకాశం లేదు. రామచంద్రా! ఈ విషయం అంతా నీకు, ప్రమాణబద్ధంగానూ, అనుభవానికి సరిపడినట్లూ, పరీక్షకు నిలచేటట్లూ, సరియైన యుక్తులను నిరూపిస్తూ, వినువారల బుద్ధి పరిపాకానికి అనుకూలంగా ఉండే విధంగా, చెపుతా విను. బ్రహ్మపదార్థం సృష్టికి పూర్వకాలంలో ఎలా ఉన్నదో, సృష్ట్యారంభకాలంలో ఎలా ఉన్నదో? స్థూల సృష్టి యొక్క క్రమం ఎలా జరుగుతూ ఉందో? ప్రపంచం అంతా తనయందారోపించుకున్నా బ్రహ్మనిర్వికారంగా ఏలాఉందో? ఈ విషయం అంతా తేటతెల్లన చేస్తా.

నేను, చిదాకాశ శరీరుణ్ణి, (చిద్రూపుడను) అని తెలిసికొనిన జీవుడు, ప్రపంచాన్ని స్వప్నంవలె చూస్తాడు. కలలోకన్న విషయాలు (వస్తువులు) మెలకువ వచ్చినపుడు ఉండవు. కలకన్నాను అనే జ్ఞానం మాత్రం ఉంటుంది. ఇది పోదు. అలాగే ప్రపంచంలోని విషయాలు స్థిరంగా ఉండవు. మారిపోతూ ఉంటాయి.

ప్రపంచ జ్ఞానం మాత్రం నశించదు (మారిపోదు) కాబట్టి "నేను" "నీవు" అనే భావంతో భాసించే ప్రపంచం, స్వప్న ప్రపంచం అనే దృష్టాంతానికి దార్ష్టాంతికం అనుటలో అభ్యంతరం లేదు. కనుక స్వప్న ప్రపంచంవలె జాగత్ప్రపంచంకూడ మిథ్య అన్నమాట, వెనుక ముముక్షు వ్యవహార ప్రకరణం చెప్పాను నీకు. ఉత్పత్తి ప్రకరణం ఇకముందు చెపుతా విను.

రామా! దృశ్యం ఉంటే బంధం ఉంటుంది. దృశ్యం లేకపోతే బంధం లేదు. బంధమోక్షాలు దృశ్యం మీద ఆధారపడి ఉన్నాయి. దృక్కు (ఆత్మ) మీద ఆధారపడిలేవు. ఆ దృశ్యం ఎలా వచ్చిందో చెపుతా విను, కొందరు దృశ్యం లేనంత మాత్రాన, బంధం తొలగ దంటారు. చావుపుటకలూ, వృద్ధిక్షయాలూ, స్వర్గ నరకాలూ, అనేవే బంధం అంటారు. ఈ బంధం అంతా ద్రష్ట (ఆత్మ) ధర్మం అంటారు, దృశ్య ప్రపంచంపోయినా, ఆత్మ (ద్రష్ట) ధర్మమయిన బంధం తొలగ డం అసంభవం అంటారు. కాని వాళ్లు పొరపడుతున్నారు. ఏది పుటు తుందో, అదే పెరుగుతుంది. అదే నశిస్తుంది. దానికే స్వర్గం. దానికే నరకం. బంధమోక్షాలుకూడా దానికే. ఇది నిజం. ఇది కాదం టానికి వీలులేదు. కాని ఆ పుట్టేది దృశ్యమయిన ప్రపంచం కాని, ద్రష్ట అయిన ఆత్మకాదు. కాబట్టి బంధం నిజంగా ఆత్మ ధర్మంకాదు. ఆత్మ తన స్వరూపం తాను తెలుసుకోలేక, దృశ్యం యొక్క ఉత్పత్త్యాదులు తనవని భ్రమపడుతున్నాడు. వీడికి ఈ అనుభవం భ్రమ సిద్ధంకాని, నిజంకాదు. కనుకనే ముముక్షువులకు స్వస్వరూప జ్ఞానం కలగటానికి దృశ్యాసంభవముయొక్క క్రమాన్ని చెప్పబోతున్నాను. చావుపుటకలు మొదలయినవి, దృశ్యమయిన సంసారకోటిలోవికాని, ఆత్మకోటిలోనివి కావు. ఆత్మ దృశ్యం పుట్టక పూర్వం ఎలా ఉంటాడో దృశ్యం పుట్టిం తరువాత కూడా అలాగే ఉంటాడు, అణుమాత్రం కూడా వికారం చెందడు. ఈ అంశంలో కావాలంటే,

శ్లో॥ న నిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచ సాధకః।
నముముక్షుర్నవై ముక్త రిత్యేషా పరమార్థతా॥ అను గౌడపాద కారికను స్మరించుకోవచ్చు.

రామా! ఈ సర్గలో ఈ ప్రకరణముయొక్క అర్థం సంక్షేపంగా చెపుతాను. మిగిలిన సర్గలలో దీనినే విపులపరుస్తాను. రామచంద్రా! ఈ కనిపించే స్థావర జంగమ ప్రపంచం అంతా గాఢనిద్రలో స్వప్నం లయించినట్లు, ప్రళయకాలమునందు, ఆత్మ స్వరూపంలో లయిస్తుంది. అపుడు నిష్క్రియుడూ, అపరిచ్ఛిన్నుడూ, నీ రూపుడూ, ప్రకాశ స్వరూపుడూ, నిర్ధర్మకుడూ, ప్రపంచ సంస్కారమున కాధారుడైనందున అనభివ్యక్తుడూ, (అనగా స్పష్టంగా బయటపడని నిజరూపం కలవాడు) అయిన ఆత్మ మాత్రమే మిగిలి ఉంటాడు. అతనికి, 1, ఋతం అనీ 2. ఆత్మ అనీ, 3, పరం అనీ, 4. బ్రహ్మ అనీ, 5. సత్యం అనీ, అయిదు పేర్లను పండితులు, వ్యవహారం కొరకు కల్పించారు.

1. "ఋతం" అనగా ఉత్కృష్ట ప్రమాణములయిన శ్రుతులచే తెలియ తగినవాడని యర్థము.

2. "ఆత్మ" అనగా, యచ్చాప్నోతీ యదాదత్తె యచ్చాత్తి విషయానిహ। యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మేతి శబ్ద్యతే॥ అని వ్యాసులు చెప్పినట్లు సర్వవ్యాపకుడని యర్థము.

3. "పరమ్" అనగా సత్యత్వము యొక్క పరమావధిని చెందినవాడని యర్థము,

4. "బ్రహ్మ" అనగా జగదాకారంగా నిండినవాడని యర్థము.

5. "సత్యమ్" అనగా యథా శాస్త్రముగ విద్వాంసులచే అనుభవింపబడువాడని యర్థము.

ఇట్టి ఆత్మ, తాను చిత్స్వభావుడై ఉండియే, అవివేకంవల్ల (అజ్ఞానంవల్ల) ఆకాశాది క్రమంతో పుట్టిన సమష్టి లింగ శరీరంలో ప్రవేశించి, దానియందు తనకున్న అభిమానం చేత, లింగ సమష్టి స్వరూపుడై, అందులో ప్రాణవాయువును ధరించుట అను ఉపాధిచేత ముందు కలుగబోయ్యే జీవుడను చండాలపు పేరుతో అతి నీచమైన జీవత్వాన్ని పొందిన

వాడువలె ఉంటాడు భ్రాంతిచే. నిజంలో జీవత్వాన్ని పొందడు. ప్రాణ ధారణచేత జీవుడై ఉండి, క్రమంగా, సంకల్ప వికల్పాలను మననంచేస్తూ మూఢుడై తన పరమాత్మ భావాన్ని తాను మరచి మనోరూపుడవుతాడు. సుస్థిరమయిన సముద్రం నుంచి, అస్థిరమయిన (అతి చంచలమైన) తరంగ రూపం బయలుదేరినట్లు. నిశ్చలమయిన ఆత్మతత్త్వం మారిపోయి, అతి చంచలమయిన మనోరూపం తయారవుతుంది. అసగా మనోధర్మములయిన సంకల్పాదులన్నీ తనవని తలుస్తాడు, ఇలా సమిష్టి మనోరూపాన్ని చెందేసరికి, ఇతనికి "హిరణ్యగర్భుడు బ్రహ్మ" అనే నామం ఏర్పడుతుంది. తరువాత ఇతడు పూర్వవాసనవల్ల, ఎవరూ చెప్పకుండానే, విరాట్స్వరూపాన్ని, లోకస్వరూపాన్ని, ఆ లోకములలోని భూత సముదాయం యొక్క స్వరూపాన్ని, స్వయంగానే సంకల్పించుకుంటాడు. ఆయనగారి సత్య సంకల్పంచేత ఈ సంసారం అనే ఇంద్రజాలం అంతా ఇలా విస్తరిస్తుంది.

బంగారపు కటక రూపమయిన బంగారము నుండి, కటక శబ్దార్థము (కటకము) వేరుకాదు. అట్లే పరబ్రహ్మయందు భాసించెడి జగచ్ఛబ్దార్థము కూడ (జగత్తుకూడా) పరబ్రహ్మకంటె వేరుకాదు.

పరిదృశ్యమానమగు ప్రపంచము, అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మ స్వభావంలోనే ఉంది. కాని, జగచ్ఛబ్దార్థమయిన పరిచ్ఛిన్నాత్మ స్వభావంలో లేదు. కటకత్వము హేమ స్వభావంలో ఉంది కాని కటక స్వభావంలో లేదు. అయితే ప్రపంచం ప్రపంచ స్వరూపంలో లేకపోతే, ప్రపంచ స్వరూపంగా కనిపిస్తూ ఉందే! ఎలా కనిపిస్తోంది? బ్రహ్మ స్వరూపంగా కనిపించటం లేదేమి? అని అంటారు. నిజమే మరుమరీచికలచే (ఎండమావులచే) కల్పితమయిన నదియొక్క ప్రవాహతరంగాలు, ప్రవాహరూపంలో లేకపోయినా ఆ రూపంలో ఉన్నట్లు కనిపిస్తూ ఉంటాయి. అలాగే ప్రాపంచికమయిన ఇంద్రజాల వైభవం కూడా ప్రపంచ రూపంలో లేకున్నా ఉన్నట్లు కనిపిస్తూ ఉంటుంది. ఇదంతా మనోభ్రాంతి. దీనికి కారణం అవిద్య. ఇద్దానికి, 1. అవిద్య అనీ

2. సంసృతి అనీ, 3. బంధం అనీ, 4. మాయ అనీ, 5. మోహమనీ, 6. మహత్తు అనీ, తమస్సు అని, 7. నామములు కలవు.

1. విద్యవల్ల నశిస్తుంది కాబట్టి అవిద్య. 2. క్రిందకూ, మీదకూ అడ్డముగానూ, ప్రాణులు సంసృతి చెందటానికి హేతువైంది కాబట్టి సంసృతి. 3. అస్వాతంత్ర్యాన్ని కలిగించేది కనుక బంధం. 4. మిథ్యా భూతము కనుక మాయ. 5. భ్రమ హే తు వు కనుక మోహము. 6. దుస్తరము (దాటశక్యము కానిది) కనుక మహత్తు. 7. స్వరూపాన్ని కప్పిపుచ్చును కనుక తమస్సు. ముందు బంధముయొక్క స్వ రూ ప ం చెపుతా విను, ఆవల మోక్షము యొక్క స్వ రూ ప ం విందువుగాని. రామా! ద్రష్టకు దృశ్యంతోటి సంబంధము బంధము. ద్రష్టదృశ్యమువల్ల బద్ధుడైనాడు. దృశ్యసంబధం లేకపోతే ముక్తుడవుతాడు. నేను, నీవు, నాది నీది అనేది మిథ్యాభూతమయిన దృశ్యం. ఇది ఉన్నంతవరకూ మోక్షం లేదు. ఇది లేదు, ఇది లేదు అని అనుకున్నంత మాత్రాన ఇదిపోదు. అనుభవిస్తున్న వ్యాధి లేదనుకున్నంత మాత్రాన తగ్గుతుందా? అలాగే అనుకుంటూ ఉంటే ఇంకా పెరుగుతుంది.

విమర్శకులారా! ఉన్న దృశ్య ప్రపంచం మీ బుద్ధి ఊహాలతో కాలాగడపుతూ ఉంటే పోతుందా? తీర్థ యాత్రలు సేవిస్తే తొలగు తుందా? నోములు ఆచరిస్తే తీరుతుందా? తీరదు. ఇంకొక క్రొత్త దృశ్యం తయారవుతుంది. దృశ్యమయిన ప్రపంచం ఉన్నట్లయితే అది ఎన్నటికీ నశించనే నశించదు. లేనిదానికి ఉత్పత్తి లేదు. ఉన్నదానికి చావులేదు. ఇది న్యాయం. దృశ్యముయొక్క ఉనికిని అనాదరణచే, ఉపేక్షించి ఊర కుండరాదు. తత్త్వ విచారంచే రూ పు మా పు కో వా లి. తనయొక్క చిద్రూపం తనకు తెలియని ద్రష్ట ఎక్కడ ఉంటాడో అక్కడల్లా దృశ్య సౌభాగ్యం తాండవిస్తూనే ఉంటుంది. తుదకు పరమాణువు యొక్క ఉదరంలో దాగి ఉండనీ ద్రష్ట, అక్కడ కూడా దృశ్యమువల్ల బంధం తప్పదు ద్రష్టకు. పరమాణూదరంలో చిక్కిన ద్రష్ట, అక్కడ కూడా భ్రాంతితో విపులంగా నాటకం ఆడటానికి అడ్డులేదు. కనుక ద్రష్టకు అక్కడా దృశ్య బంధం అనివార్యమే అవుతుంది.

కాబట్టి "దృశ్యం ఉన్నది. దాన్ని పోగొట్టుకున్నాను. తపోధ్యాన జపాలచే దృశ్యాన్ని దూరదేశానికి పారద్రోలి విడిచిపెట్టాను. అవి అనుకోటం, పుల్లనీళ్లు తాగి కడుపునిండా అన్నం తిన్నాను. నా ఆకలి తీరింది". అని తృప్తి చెందినట్లే.

రామచంద్రా! దృశ్యమనేది ఉంటే అది పరమాణువు యొక్క ఉదరం గోకూడ ప్రతిబించనే ప్రతిబింబిస్తుంది. విశాలమయిన ప్రదేశంలో ఎలా ప్రతిబింబిస్తుందో, అలాగే ప్రతిబింబిస్తుంది. ఏమాత్రం సంకోచం చెందదు. కొంచ ఎంత పెద్దదైనా చిన్న అద్దంలో ప్రతిబింబించటానికి సంకుచితము కాదు. అంతా ప్రతిబింబిస్తుంది. సముద్రాలు, నదులు, అడవులు, ఇవన్నీ అద్దంలో ఎలా ఉన్నవి ఉన్నట్లుగా ప్రతిబింబిస్తాయో, పరమాణూదరంలో ఉన్న చిదాదర్శంలో కూడా దృశ్యం అలాగే ప్రతిబింబిస్తుంది. కాబట్టి అక్కడ కూడా స్థూల సూక్ష్మములయిన జన్మజరా మరణాది దుఃఖములు తప్పవు. తత్త్వజ్ఞానంచేత, నేను ఈ దృశ్యాన్ని పోగొట్టుకున్నాను. నేను తత్త్వ విచారంలో ఉన్నాను. దృశ్యనివృత్తికి జ్ఞానమే సరియైన కారణం. జ్ఞానరహితమయిన సమాధిలో సంసార స్మృతియే ఉంటుంది. కాని సంసార మార్జనం ఉండదు. కాబట్టే జ్ఞానం లేకపోతే నిర్వికల్పక సమాధివల్ల కూడా దృశ్యనివృత్తి కలగదు. తత్త్వ జ్ఞానం (తత్త్వ విచారం) ఉండేటట్లయితే దృశ్యమార్జనమునకు నిర్వికల్ప సమాధికూడా అవసరములేదు. నిర్వికల్పక సమాధివల్ల చిత్తనైర్మల్యం ఏర్పడుతుంది. దానివల్ల సమ్యగ్ జ్ఞానం కలుగుతుంది. దానివల్ల దృశ్య మునకు బాధ. తరువాత తురీయప్రాప్తి. దృశ్యం కనక నిజంగా ఉండే టట్లయితే ఇంక నిర్వికల్ప సమాధి ఎలా సంభవిస్తుంది? (కుదురుతుంది) కనుక దృశ్యం మిథ్య అని అంగీకరించితీరాలి. దృశ్య మిథ్యాత్వ జ్ఞానం లేని, కేవల సమాధివల్ల ఏమి లాభం రామా! ఆ సమాధి నుంచి లేవ గానే మళ్లీ దుఃఖభూయిష్ఠమయిన ఈ దృశ్యం అంతా వెంటపడుతుంది కదా? కాన సమాధులవల్ల ఏం ప్రయోజనం. మళ్లీ అనర్థం వెంటపడు తుందికదా? క్షణకాలం సమాధిలో చిత్త సమాధానం కుదిరినంత మాత్రాన, ఏమి సుఖం? ఒకవేళ, మళ్లీ వ్యుత్థానం లేకుండా నిర్వికల్పక సమాధిలో ఉండటం కుదిరితే, అప్పుడు జ్ఞానం లేకుండా అక్షయమయిన

సుఖం లభించినట్లే కదా? అని అనుకుంటారేమో? గాఢనిద్రను మోక్ష మని అనుకున్నట్లు వెర్రిమాట అది. అలాంటి అభిప్రాయం వాళ్ల మౌఢ్యాన్ని తెలియజేస్తుంది. మనోరూపమయిన దృశ్యం ఒకటి ఉన్నట్లయితే, సమాధికి ఎంతగా ప్రయత్నించినా దృశ్యాలు వాడి వెంట పడక మానవు. మానవుడి చిత్తం ఏయే విషయంమీదకు వెళ్లుతుందో, ఆయావిషయమునకు సంబంధించిన జగద్భ్రాంతి వాడికి దుర్నివారము. ఒకవేళ మానవుడు అజ్ఞుడై అనాత్మ పదార్థమయిన పాషాణమును సమాధిలో భావనచేస్తే తుదకు వాడికి ఫలకాలంలో దృశ్యమయిన పాషాణత్వం ప్రాప్తిస్తుంది. (రాయి అయి పుటతాడు.) అంతే కాని స్వస్వరూపమగు న చిన్మాత్రంతో మిగిలిపోయ్యే సమాధి సిద్ధించదు. పోనీ పాషాణమై పుట్టినా, దుఃఖం లేదుకనుక, ఆస్థితి అయినా వీడికి స్థిరంగా ఉంటుందా అని విచారిస్తే అదీ లేదు. ఈ విషయం సమాధి నిష్ఠులందరికీ అనుభవ గోచరమే. ఒకవేళ ఎవరయిన సమాధిబలంవల్ల స్థిరంగా పాషాణభావాన్ని చెంది ఉన్నా, వాళ్లకు అది సర్వసంసార శాంతి రూపమయిన తురీయ (మోక్షమనే) పురుషార్థము కానేరదు.

కాబట్టి దృశ్యం సద్రూపమయితే ఎన్నటికీ నశించదు. తపోజపధ్యానాలచేత దృశ్యం నశిస్తుందనేది, అజ్ఞానులయొక్క భ్రమమాత్రం. తామరపద్మంయొక్క బొడ్డులో (పద్మాక్షకోటరమున) తామరతీగయొక్క ఉత్పత్తికి కారణమయిన బీజము (విత్తనము) ఎలా ఉంటుందో, అవిద్యాయుక్తుడయిన, (అజ్ఞానంతో కూడియున్న) ద్రష్టయందు దృశ్యం అలా ఉంటుంది. పదార్థములలో రుచి ఉన్నట్లూ, నువ్వులు మొదలయిన వాటియందు నూనె ఉన్నట్లూ, పుష్పములయందు పరిమళం ఉన్నట్లునూ, ద్రష్టయందు దృశ్యం ఉంది. కర్పూరం ఎక్కడ ఉన్నా దాని పరిమళం ఎలా దానిలో ఉంటుందో, అలా చిద్ధాతువులో, దృశ్యమయిన జగత్తు ఉంటుంది.

రామా! నీ హృదయాకాశంలో నీ మనోరాజ్యంలో విహరించే ద్రష్ట, స్వప్నదృశ్యాన్ని ఎలా తనలోనే ఉన్నట్లు అనుభవిస్తున్నాడో, అలాగే జాగ్రద్దృశ్యంకూడా ద్రష్టలోనే ఇమిడివున్నదని స్వప్నదృష్టాంతవల్ల

నమ్ము. కనుక మనస్సంకల్పంలో ఉండే పిశాచం (దయ్యం) పిల్లవాణ్ణి చంపుతుంది. దృశ్యమనే పిశాచం ద్రష్టను చెడగొట్టుతుంది. విత్తనంలో ఉన్న మొలక (అంకురము) దేశకాలాలను అనుసరించి ప్రకాశమాన మైన దేహాన్ని ధరిస్తుంది. ఆత్మ అనే ద్రష్టయందిఇమిడియున్న దృశ్యం, దేశ కాలాలను అనుసరించి కలకలలాడే వేషాలతో నానారూపాలుగా బయటు దేరుతుంది. లోకంలో, విచిత్రకార్యములను నెరవేర్చే చమత్కార మయిన శక్తి ఆయా విత్తనములు మొదలయిన ద్రవ్యముల యొక్క ఉదరంలోకాని, కోటరంలోకాని, వారి వారి హృదయంలోకాని, ఎలా ఉంటుందో, అలాగే, చిన్మాత్ర శరీరుడయిన ఆత్మద్రవ్యము యొక్క ఉదరంలో ప్రపంచస్థితి అంతా ఇమిడి ఉంది. ఈ దృశ్య ప్రపంచమే ద్రష్టకు బంధహేతువు.

## ౨ మొదటి సృష్టికర్త చరిత్ర

రామచంద్రా! హిరణ్యగర్భుని చరిత్ర చెపుతా విను. చాలా బాగుంటుంది. ఇది వింటే ఉత్పత్తి ప్రకరణం సులభంగా అర్థం అవు తుంది నీకు. పూర్వం చిదాకాశంవల్ల పుట్టిన, సమష్టిలింగ శరీరుడయిన, హిరణ్యగర్భుడనే బ్రాహ్మణుడు ఉన్నాడు. అతడు పరమ ధార్మికుడు ఆత్మచింతన కలవాడు. ప్రజల హితవును కోరువాడు. అతడు మృత్యువు నోట పడకుండా చాలాకాలం బ్రతికాడు. వాణ్ణి గురించి మృత్యువు ఇలా ఆలోచించింది. నేను క్రమంగా ఉన్న భూతాలను మింగేదానను, ఈ హిరణ్యగర్భుడనే బ్రాహ్మణ్ణి మింగలేకపోతున్నా, ఖడ్గం యొక్క పదును రాతిమీద వ్యర్థమైనట్లు, నా సామర్థ్యం ఈ బ్రాహ్మణి మీద వ్యర్థం అయింది ఏమి కారణం? అని ఆలోచించింది. వాణ్ణి చంపటానికి మేరు పర్వతం మధ్య ఉన్న సత్యలోకానికి వెళ్లింది మృత్యువు. సాధారణంగా సమర్థులు తమ పనులయందు ప్రయత్నాన్ని మానుకోరు.

మృత్యువు సత్యలోకం చేరే లోపుగా ప్రళయ కాలాగ్నితో సమానమయిన మంట బయలుదేరింది. ఒళ్లు అంతా తగలపెటుతూంది.

ఎలాగో ఆ అగ్నిమంటను భేదించుకొని సత్యలోకంలో ప్రవేశించింది మృత్యువు. ఆ బ్రాహ్మణ్ణి చూచింది. చేతులతో పట్టి లాగాలనుకుంది. నూరు చేతులతో ఒక్క మాటుగా పట్టుపట్టింది. కాని లాగలేకపోయింది. బ్రాహ్మణుడు మాత్రం ఎదురుకుండా కనపడుతూనే ఉన్నాడు. ఎంత బలవంతుడయినా సంకల్ప పురుషుణ్ణి అంటటం సాధ్యమా? మృత్యువు తిరిగి వచ్చింది యముని వద్దకు. నేను చిదాకాశజుడు అయిన హిరణ్యాగర్భుని ఎందుకు భక్షించలేకపోతున్నానో? చెప్పమని అడిగింది. యముడు ఇలా జవాబు చెప్పాడు. మృత్యువా! "నీవు వంటరిగా వెళ్ళి బలాత్కారంగా ఎవ్వణ్ణీ చంపడానికి సమర్థురాలవు కావు. ఎవణ్ణి చంపదలచుకుంటావో వాడు చేసిన కర్మలను సహాయం చేసికోవాలి. లేకపోతే నీవల్ల ఏమీకాదు. కాబట్టి ఆ హిరణ్యాగర్భుడు చేసిన కర్మలు ఏమి ఉన్నాయో? వెతుకు. వాటిని సహాయం చేసికో. ఆవలవాణ్ణి చంపగలుగుతావు" అని.

అంతట మృత్యువు వాడి కర్మలు వెతకటానికి బయలుదేరింది. జిల్లాలన్నీ చూచింది. దిగంతాల వరకూ వెళ్ళింది. నదులూ, నదములూ గాలించింది. అడవులూ, మన్యాలూ, అన్వేషించింది. కొండలు ఎక్కింది సముద్రాలలో మునిగింది. ద్వీపాంతరాలలో సంచరించింది. పెద్దపెద్ద పట్టణాలు, ఉపపట్టణాలు ఊరేగింది. ఊళ్లు పల్లెలు ఊడ్చింది: తుదకు ఇతర దేశాలలో ఉండే గహన భూములు కూడా గాలించిది. ఇలా భూమండలం అంతా తిరిగినా హిరణ్యాగర్భుడి కర్మలు ఎక్కడా కనిపించలేదు మృత్యువుకు. ఎంత తెలివికలవాడికయినా గొడ్డురాలి బిడ్డ కంటికగపడతాడా? మనస్సులో సంకల్పించుకున్న కొండ కంటకి ప్రత్యక్షంఅవుతుందా? తిరిగి వచ్చింది మృత్యువు. తాను యమధర్మరాజును మళ్ళీ అడిగింది. నాకర్ల సందేహాలు యజమానులే తీర్చాలనుకుంది. ప్రభూ! ఆ ఆకాశజుని (హిరణ్యాగర్భుని) కర్మలు ఎక్కడ ఉన్నాయి? ఎక్కడా కనిపించలేదే! అని అడిగింది యముణ్ణి. యముడు జవాబు చెప్పటానికి చాలాకాలం ఆలోచించాడు. తుదకు ఇలా జవాబు చెప్పాడు, మృత్యూ! హిరణ్యాగర్భుడికి కర్మలు ఏమీలేవు. అతడు కేవలం చిదాకాశంనుంచే పుట్టాడు. చిదాకాశంవల్ల పుట్టినవాడు, ఆకాశంవలె నిర్మలంగానే ఉంటాడు. వాడి

వద్ద కర్మలేమీ ఉండవు. కాబట్టి నీకు సహాయపడే కర్మలు ఏవీ వాడి వద్దలేవు. వీడికి ప్రాక్తన కర్మలతో సంబంధం ఏమాత్రంలేదు. గొడ్డు రాలి బిడ్డకు ఏ కర్మ సంబంధం ఉంటుంది? ఆకారం యొక్క పుట్టుక లేనివాడికి ఏ కర్మ సంబంధం ఉంటుంది? వికార హేతువులయిన అవిద్యా దులు ఏవీ లేనందువల్ల వీడు ఆకాశంవలె నిర్మలుడు. ఆకాశంలో చెట్టు పుట్టదు. వీడికి కర్మ పుట్టదు. పూర్వకర్మలు లేనందున వీడికి అస్వాధీన మైన చిత్తం కూడా లేదు. వీడు చిదాకాశ రూపంలోనే ఉంటాడు. ప్రారబ్ధ సంచిత ఆగాములు వీడికి లేవు. కేవల చిదాకాశ రూపుడు. ఒకవేళ ఇపుడు దేహధారి కనుక ప్రాణస్పందం కలవాడుగా కనిపించినా, ఆ ప్రాణ దేహాది క్రియలందు వాడికి సత్యత్వబుద్ధి లేదు. మనం మాత్రం భ్రాంతిచే అనుకుంటున్నాము అతనికి కూడా ప్రాణనాదిచేష్టలు ఉన్నాయి అని. చిద్రూపమయిన స్తంభంలో చిద్రూపమయిన బొమ్మ తన శరీరం చిద్విలక్షణం అని భావించినట్లు, హిరణ్యగర్భుడు చిచ్ఛరీరుడై ఉండి, తన శరీరం చిద్విలక్షణమని భావిస్తూ ఉంటాడు. కాబట్టి భావనా మాత్రమైన దేహాదిబుద్ధికాని వీడికి, వాస్తవమయిన దేహాది బుద్ధి లేదు.

ఇతడు పరబ్రహ్మస్వరూపుడు. నీటిలో ద్రవత్వమూ, ఆకాశంలో శూన్యత్వమూ, వాయువునందు స్పందత్వమూ, ఉన్నట్లు. పరబ్రహ్మ స్వరూపంలో ఉంటాడు వీడు. సంచిత ప్రారబ్ధ ఆగాములు లేనందున ఇతడు సంసారానికి లొంగడు. ఉత్పత్తికి కారణములయిన అవిద్యా కామ కర్మలులేనందున వీడు స్వయంభువుడు. వీడు పూర్వం కర్మలు చేయలేదు. ఇప్పుడు చేయుటలేదు. ఇంక నీవు వీణ్ణి ఎలా ఆక్రమిస్తావు? ఎప్పుడయినా వీడు మరణమును సత్యత్వబుద్ధితో సంకల్పించి ఉన్నట్లయితే, అపుడు నీపాలపడేవాడే. అదెప్పుడూ లేదు. ప్రపంచం అంతా మిధ్య అనే దృఢ నిశ్చయం కలవాడు వీడు. లోకంలో ఏ జీవునకు "నేను పాంచ భౌతిక శరీరధారిని" అనే నమ్మకం ఉంటుందో వాడు నీనోట పడక తప్పడు. ఈ బ్రాహ్మడికి, పంచభూత వికారమైన శరీరముకలవాడనను సంకల్పమే లేనందున వీడు ఆకారము కలవాడు కాడు. నిరాకారుణ్ణి నీవు ముట్టలేవు. నీకు ఎంత శక్తి ఉంటే మాత్రం ఆకాశాన్ని తాటితో కట్టగలవా? ఎందుకీ పిచ్చి ప్రయత్నం నీకు అని అన్నాడు యముడు.

అంతట మృత్యువు; స్వామీ! శూన్యమయిన నిరాకారం వల్ల సాకారం ఎలా పుట్టింది. పృథివ్యాది భూతాలు ఉన్నాయా? లేవా? చెప్పండి అని అడిగింది మృత్యువు యముణ్ణి.

యముడు సమాధానమిస్తాడు. మృత్యూ! ఈఆకాశజుడు (హిరణ్యగర్భుడు) ఎప్పుడూ పుట్టలేదు. ఎప్పుడూ లేక పోలేదు. విజ్ఞాన మాత్రరూపుడు కనుక ఎల్లపుడూ ఉన్నాడు. మహాప్రలయంలో, శాంతము, అజరము, అనంతము, అయిన పరబ్రహ్మ తత్త్వం ఒక్కటే ఉంది. అప్పుడు ఆ పరబ్రహ్మకు సమీపంలో సృష్ట్యారంభసమయమున ఆ పరబ్రహ్మను అనుసరించి పెద్దకొండంత వెలుగు (తేజస్సు) కనిపించింది. ఈ వెలుగునే విరాట్టు అని కాని, చతుర్ముఖుడు అని కాని అంటారు పెద్దలు. సృష్టి ప్రారంభ కాలంలో ఈ వెలుగు వెలగటానికి కారణం, పూర్వజన్మ వాసనలతోనూ, కర్మలతోనూ నిండి, పరబ్రహ్మయందు లీనమై ఉన్న, జీవుల యొక్క అవిద్యే కారణం. ఆ వెలుగును (ఆ తేజస్సును) మనబోటివాళ్లు చూచి భ్రాంతిపడి స్వప్నంవలె మిథ్యాభూతమయిన ఆకారం అనుకున్నారు. దానికే వాళ్లు చతుర్ముఖుడు, విరాట్టు అని పేరు పెట్టారు. కాని ఆవెలుగు మాత్రం నిర్వికల్ప చిదాకాశరూపంగానే ఉంది. ఆవెలుగే ఈ ఆకాశజుడు (హిరణ్యగర్భుడనే) బ్రహ్మణుడు. వీడికి దేహం లేదు. కర్మలు లేవు. కర్తృత్వం లేదు. వాసనలేదు. శుద్ధచిదాకాశుడూ, విజ్ఞానఘనుడూ వీడు. ప్రక్తనమయిన వాసనాజాలం ఏ మాత్రం వీడికి లేదు. బహిర్ముఖమయిన చిత్ప్రవృత్తి (వేదన) తగ్గితే ఈ మాత్రమయిన ప్రాతిభాసిక రూపం కూడా ఉండదు. అధిష్ఠాన తత్త్వజ్ఞానం కలగగానే విషయాలు నశిస్తాయి. కనుక విషయవేదనలు కూడా, ఆ చిదాకాశ స్వరూపంగానే ఉండి పోతాయి. చిదాకాశ రూపంలో లీనమవుతాయి. వీడు చిత్స్వభావములయిన విషయ జ్ఞానములనే సహించలేడు. వాటినే వీడు సహించలేకపోతే, ఇంక పృథివ్యాది పంచభూతాలను ఎలా సహిస్తాడు? అలాంటి వాణ్ణి నీవు ఎలా ఆక్రమిస్తావు? కాబట్టి వాణ్ణి ఆక్రమిద్దామనే ఆశవిడిచిపెట్టు. ఎవ్వడూ ఎప్పటికీ ఆకాశాన్ని పట్టుకోలేడు. అని అన్నాడు యముడు. మృత్యువు ఇదంతా విన్నాడు ఆశ్చర్యపోయాడు. స్వస్థానం చేరాడు. అన్నాడు వసిష్ఠుడు.

విన్నాడు రాముడు ఈ కథ అంతా. విషయం తెలుసుకున్నాడు. తాను తిరిగి చెపితే గురువు సంతోషిస్తాడనుకున్నాడు. ఇలా అన్నాడు. మహర్షీ! మీరు చెప్పిన ఆకాశజుడు లోక పితామహుడయిన హిరణ్య గర్భుడు. అతడే స్వయం భువుడు. అద్వితీయుడు. జీవసమష్టిరూపుడు. అనినా అభిప్రాయం. ఈ ఆఖ్యాయికకు తాత్పర్యం జగన్మిథ్యాత్వం అని నేను గుర్తించాను. అన్నాడు రాముడు.

రామచంద్రా! నిజమే. ఆయన చతుర్ముఖుడే. ఆయనను గురించియే మృత్యువు యముడితో తగాదాపడింది పూర్వం. మళ్లీ టూకీగా చెపుతా దాన్ని. పూర్వం మనువులయొక్క సంధికాలంలో మృత్యువు సర్వభక్షకుడుగా ఉండి ప్రజలను మ్రింగుతూ ఉండేవాడు. అదే బలంతో పద్మ భవుని కూడా భక్షించాలని ప్రయత్నించాడు. అప్పుడే యమధర్మరాజు చివాట్లు పెట్టి బుద్ధి చెప్పాడు యముడికి. ఎవడు ఏ పని చేస్తూ ఉంటాడో వాడికి ఆ పనిలో వ్యసనం జాస్తి. అదే వ్యసనం బ్రహ్మమీాద కూడా చూపించి భంగపడ్డాడు మృత్యువు.

బ్రహ్మ చిదాకాశరూపుడు. మనోమాత్రుడు. కేవల సంకల్ప స్వరూపుడు. పాంచ భౌతిక ఆకారము లేనివాడు. కేవల అనుభూతి మాత్రుడు. చిద్వ్యోమ. ఇతని యందు, కారణత్వ కార్యత్వములు లేవు. ఆకాశంలో ప్రకాశించెడి ఆకారంగల సంకల్ప పురుషుడువలె, స్వయం భవుడు ప్రకాశిస్తున్నాడు. ఇతని యందు దృశ్యత్వ, ద్రష్టృత్వాలులేవు. చిన్మాత్ర స్వభావత్వము ఒక్కటే కలదు. అయినను సంకల్ప మాత్రమైన మనోరూపాన్ని స్వయంభు అనీ, బ్రహ్మ అనీ, అంటున్నారు.

అయితే నిరాకారనుయిన సంకల్పానికి పురుషాకారము ఎట్లు సంభ వించిందని శంకిస్తారు కొందరు. బొమ్మలు వ్రాసేవాడు, తాను వ్రాయ బూనుకున్న బొమ్మ యొక్క ఆకారం తన సంకల్పంలో (మనస్సులో) ఉంచుకునే వ్రాస్తున్నాడు. వాడి సంకల్పంలో ఉన్న రూపమే (ఆకారమే) బయటపటంలో వ్రాయబడుతోంది. అక్కడ చిత్రకారుని సంకల్పంలో ఉన్న బొమ్మకు శరీరం లేకున్నా, బొమ్మయొక్క ఆకారం కలదిగా ఎలా

భాసిస్తూ ఉందో. అలాగే స్వచ్ఛమయిన చిదాకాశముయొక్క స్వచ్ఛమయిన ప్రతిబింబాన్ని గ్రహించగల సంకల్పం కూడా ప్రజాపతి శరీరాకారంగా భాసిస్తుంది. అలా భాసించడం వాస్తవం కాదు. శుద్ధచైతన్యమే అలా వివర్తం అవుతుంది.

## 3 బంధహేతు నిరూపణము

మహర్షీ! చతుర్ముఖ బ్రహ్మ, పాంచ భౌతిక దేహములేని మనో రూపుడని చెప్పారు మీరు. మనస్సు అంటే సంకల్పాత్మకం. వాసనా జాలరూపం. కాబట్టి ప్రాక్తనవాసనలు ఇతనికి కూడా తప్పవు. ఆవాసనలను అనుసరించిన స్మృతి పూర్వదేహమును విడిచిపెట్టే కాలంలో అన్ని భూతములకు కలుగుతూ ఉంది. మీకు కద్దు. నాకు కద్దు. ప్రతి ప్రాణికీ కద్దు. ఆ స్మృతియే ముందు జన్మకు కారణం సర్వప్రాణులకూ. అందుకు కృష్ణుని వాక్యం ప్రమాణం.

శ్లో॥ యం యం వా పిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరం।
తంతమేవేతి కౌంతేయ॥ అని.

అలాంటి స్మృతియే ఈ హిరణ్యగర్భుని జన్మకు కూడా కారణమనక తప్పదు. ఎప్పుడు ప్రాక్తన జన్మయందు స్మృతిని ఒప్పుకున్నామో, అప్పుడు ఆ స్మృతికి సంస్కారము అవసరం. ఆ సంస్కారానికి ఆధారమైన దేహం అవసరం కాబట్టి హిరణ్యగర్భుడికి పూర్వదేహంకూడా ఉన్నదనాలి.

ఇంక మీరు ఆయన జన్మకు కారణం లేదని ఎలా చెప్పగలరు? అని ప్రశ్నించాడు రాముడు. వసిష్ఠుడు సమధానం ఇస్తాడు.

రామచంద్రా! పూర్వ కర్మవాసనలతో కూడియున్న, పూర్వదేహం ఉంటే, వాడికి ఆదేహాన్ని విడిచేటప్పుడు స్మృతి కలుగుతుంది. ఆ స్మృతి ముందు జన్మకు కారణం అవుతుంది. అది సంసార సంబంధానికి హేతువు అవుతుంది. చతుర్ముఖ బ్రహ్మకు, పూర్వకర్మలేదు. పూర్వదేహమూ లేదు. ఇంక వానికి పూర్వ స్మృతి మాత్రం ఎలా ఉంటుంది?

అయితే, "హిరణ్యాగర్భుని పదవి (స్థానము) కర్మోపాసనలయొక్క సముచ్చయమునకు ఫలం కదా? పూర్వ శరీరం లేనిదే ఆ సముచ్చయాను ష్ఠానం కుదరదుకదా? కాబట్టి హిరణ్యాగర్భుడికి పూర్వదేహం లేదనిచెప్పటం ఎలా?" అనీ, "హిరణ్యాగర్భుడు మనోమయ శరీరుడయితే, "అన్నమయం హిసోమ్యమనః" అను శ్రుతి మనస్సు అన్నవికారమని చెప్పు చుండగా, అన్నము పృథివీ భూతములో చేరియుండగా మనోమయ శరీరుడయిన హిరణ్యాగర్భుడికి, పృథివ్యాది భూతసంబంధం లేదని చెప్పటం ఎలా" అనీ కొంద రడుగుతారు. అజ్ఞానుల దృష్టిలో హిరణ్యాగర్భుని అధికారము (స్థానము) కర్మోపాసనా సముచ్చయానికి ఫలమని ఉండవచ్చు. హిరణ్యాగర్భుని దృష్టిలో మాత్రం తత్త్వజ్ఞానం చేత, ప్రపంచం త్రైకాలికంగా లేదని బాధక జ్ఞానం ఉండటం చేత, పూర్వదేహ, వాసనాదులు వానికి లేవు. ఒకవేళ బాధితాను వృత్తివల్ల, మళ్లీ ఆ మనస్సూ, దేహమూ వెంటపడ్డా, అవి దగ్ధపటన్యాయంగా ఉంటాయి కాని, బాధించవు. తగల పడినగుడ్డ' గుడ్డయొక్క ఆకారంగా ఉన్నా, అది గుడ్డయొక్క పనిని చేయ లేదు. దాని మీద నిజమయిన గుడ్డ అను బుద్ధి ఉండదు వీడికి. అలాగే హిరణ్యాగర్భుడికి కూడా, మనస్సుయందూ దేహమునందునూ, సత్యత్వ బుద్ధి ఉండదు. కాబట్టి, హిరణ్యాగర్భునికి, మనోదేహములు సంసార బంధకములు కాకపోవటంవల్లనూ, వాటియందు ఇతనికి సత్యత్వ బుద్ధి లేనందువల్లనూ, అవి లేవని చెప్పవలసి వచ్చింది.

అజ్ఞానియొక్క మనఃసంకల్పంవల్ల కల్పించుకున్న నగరాదిప్రపంచమే సత్యం కాదనీ, భౌతికం (భూత వికారం) కాదనీ శాస్త్రం చెప్పుతూ ఉంటే, తత్త్వజ్ఞానం చేత బాధితమయి, బాధితాను వృత్తివల్ల ఏర్పడ్డ, విరించి యొక్క మనస్సంకల్పంవల్ల తయారయిన ప్రపంచం భౌతికం ఎలా అవు తుంది? కనుక అజ్ఞానుల దృష్టిలో హిరణ్యాగర్భుని స్థానము కర్మోపాసనా సముచ్చయమునకు ఫలమని లోకవాదుకా, శాస్త్రమూ, ప్రవర్తించింది. తత్త్వదృష్టిలో హిరణ్యాగర్భునకు పూర్వ దేహ వాసనాదులు ఏమీ లేవని శాస్త్రము చెప్పింది. కాబట్టి ఈ రెండు శాస్త్రములకూ విరోధం లేదు. కనుక హిరణ్యాగర్భుడు కారణ రహితుడు. అతని చిత్తమే కారణముగా కనిపిస్తుంది. అతనికి సూక్ష్మమయిన లింగ సమష్టి దేహమే కాని స్థూల

దేహము లేదు. అన్నాడు వసిష్ఠుడు. అయితే అన్ని భూతములకూ, స్థూలమూ, సూక్ష్మమూ అని రెండు శరీరాలు ఉంటే, బ్రహ్మకు మాత్రం సూక్ష్మ శరీరం ఒక్కటే, ఉండటం ఏమి? అని ప్రశ్నించాడు శ్రీరాముడు. వసిష్ఠుడు జవాబిస్తాడు. రామా! అన్ని భూతాలకూ రెండు శరీరాలు ఉన్న మాట వాస్తవం. ఆ భూతాలయొక్క ఉత్పత్తికి, అవిద్య కారణం. పంచీకృత పంచభూతములు కారణాలు. బ్రహ్మకు అలాంటి కారణములు లేవు. అందువల్ల ఇతనికి ఒక్క ఆతివాహిక (సూక్ష్మ) శరీరమే ఉంది.

భూత జాతు లన్నిటికీ ఈ హిరణ్యాగర్భుడు కారణం. ఇతనికి మరొకటి కారణం లేదు. అందువల్ల మొట్టమొదటి వాడయిన ఈ ప్రజాపతికి స్థూల మయిన భౌతిక దేహం లేదు. కేవల చిదాకాశరూపుడు. (మనోమయ శరీరుడు.) చిదాకాశ శరీరుడైన బ్రహ్మవల్ల పుట్టిన ప్రజలుకూడ, అధిష్ఠాన మయిన చిన్మాత్రులు కావలెను. మృత్తువల్ల పుట్టిన ఘట శరావాదులు. (కుండమూకుడు మున్నగునవి) మృద్రూపములు. కనకమువల్ల పుట్టిన కుండలాదులు కనక స్వరూపములు. అలాగే చిచ్ఛరీరుడయిన బ్రహ్మవల్ల పుట్టిన భూతములు కూడ చిద్రూపములగుట సహజం. హిరణ్యాగర్భుడు, చిత్త భ్రాంతిచే చిత్తమాత్రుడయినను, (మనోమయుడయిననూ) పరమార్థంలో చిదాకాశరూపుడుగా ఉన్నాడు కాని, భౌతికమయిన పురుషభావాన్ని చెందలేదు. అలాగే జీవుడు కూడ భ్రాంతిచేత శరీరాభిమానం కలవాడై యున్నను, పరమార్థంలో చిద్రూపుడు కాని, భౌతికా కారుడు గాడు.

ప్రపంచంలో ఉండే భూత సమూహము లన్నిటికీ, చిత్త దేహం అనేది మొదటిది. దీనివల్ల అహంభావం పుటుతుంది. చిత్త దేహంవల్ల బయలుదేరిన ఈ ప్రపంచ స్థూల సృష్టి యావత్తు తద్రూపమనక తప్పదు. ఉపాదేయము ఉపాదానాభిన్నమని శాస్త్ర సిద్ధాంతం. గాలివల్ల బుట్టిన చలన సృష్టి (స్పంద సృష్టి) గాలి రూప మనటం సహజం. పరమార్థంలో చిన్మాత్రుడయిన హిరణ్యాగర్భుడికి, మనోవికారం అధ్యస్తమయింది. దాని వల్ల పుట్టిన ఈ ప్రపంచంకూడా అధ్యస్తమే కావాలి. అయినా ఈ ప్రపంచం వ్యవహారంలో (అనుభవంలో) సత్యంగా భాసిస్తూ ఉంది. ఇందుకు దృష్టాంతం మనకు అనుభవంలోనే ఉంది. మిథ్యా పదార్థంవల్ల నిజమయిన

వస్తువు పుటుతోంది. ఒకానొక స్వప్నంలో, అక్కడ ఉన్న అంతఃపుర స్త్రీతో సంభోగం జరిగినట్లు మరొక స్వప్నం వచ్చింది. అందులో ఆ రెండవ స్వప్నంవల్ల రేతస్స్ఖలనం అనే నిజమయిన పని జరుగుతూంది. ఇది లోకానుభవ సిద్ధం. అలాగే ఈ ప్రపంచంకూడా ప్రాతిభాసికాకారం వల్ల తయారయినా, నిజంగా భాసించవచ్చు వ్యవహారదశలో. చిదాకాశ రూపుడయిన హిరణ్యాగర్భుడుకూడా భౌతిక దేహంలేనివాడయినా, పురుషాకారుడుగా వ్యవహరింప బడవచ్చు. ఇతడు సంవిద్రూపుడు, సంకల్ప రూపుడు, పరమార్థంలో పుట్టడు. భ్రాంతి దశలో పుటతాడు.

వాడి స్వరూపం వాడి స్వాధీనంలో ఉన్నందున అతనికి చావు పుట కలులేవు. అవిద్యాద్యధీనములయిన వాటికిగాని చావు పుటుక లుండవు. కాబట్టి బ్రహ్మ సంకల్ప పురుషుడు. భౌతిక దేహరహితుడు. ముల్లోకము లకు కారణుడు. ప్రాణుల కర్మవాసనల ననుసరించి, ఈ సంకల్పరూపుడు భాసిస్తూ ఉంటాడు. ఎవడెవడు తన మదిలో ఎలా సంకల్పించుకుంటే వాడి వాడికి కొండ అలా భాసిస్తుంది. సంకల్ప శైలానికి సంకల్పమే రూపము. వేరు రూపముండదు. అయినా ఇతడు తన చిత్ స్వరూపాన్ని, ఆతివాహిక భావాన్ని మరచి, భౌతికమయిన అర్థ క్రియలను తయారు చేస్తాడు. కాని, మనబోటి జీవులు తమ స్వరూపాన్ని మరచినట్లు ఇతడు మరువడు. ఇతడు మాయాశబలిత బ్రహ్మయొక్క మొదటి వివర్తము. అతనియొక్క సత్యసంకల్పంవల్ల తయారయినవాడు. అందువల్ల మనలను ఆవరించినంతగా అజ్ఞానం ఆ హిరణ్యాగర్భుని ఆవరించదు. శుద్ధ సంవిత్తుగానే ఉంటాడు. కాబట్టి పూర్తిగా ఆతివాహిక దేహ విస్మృతి కలుగదు. అతనికి ఆధిభౌతిక పదార్థ జాతం తోటి పూర్తి పిశాచత్వ మూ ప్రాప్తించదు. అసత్యమయిన మృగతృష్ణ మిథ్యాభూతమయిన జాడ్య భ్రాంతినే ఇస్తుంది. కాని, నిజమయిన జాడ్యభ్రాంతిని ఈయజాలదు. (జాడ్యభ్రాంతి అనగా జలత్వ భ్రాంతి అని యర్థము) ప్రపంచం చతుర్ముఖ బ్రహ్మ (హిరణ్యాగర్భుని) వల్ల పుట్టింది. హిరణ్యాగర్భుడు మనోమయ శరీరుడు. కాన వానివల్ల బుట్టిన జగత్తుకూడ మనోమాత్రమే కావలెను. హిరణ్యాగర్భునకు సహకారి కారణాలులేవు. వానివల్ల బుట్టిన ప్రపంచానికి కూడ అవిలేవు. కారణ వైచిత్ర్యమునుబట్టి కార్యవైచిత్ర్యము ప్రపంచంలో

ఏర్పడిందనటం నిరాధారం. కారణం శుద్ధంగా ఉంటే కార్యంకూడా శుద్ధంగానే ఉండాలి. బ్రహ్మవిషయంలో ఏమాత్రం కార్యకారణ భావంలేదు. కాబట్టి ఆ పరబ్రహ్మ ఏలాంటిదో, ఈ ముల్లోకమూ అలాంటిదే. మనోరూపుడైన (మనశ్శరీరుడయిన) హిరణ్యాగర్భునివల్లబుట్టిన ప్రపంచం హిరణ్యాగర్భునితో అభిన్నం. ఆహిరణ్యాగర్భుడు పరమాత్మతో అభిన్నుడు. కాబట్టి ప్రపంచం పరమాత్మా భిన్నమన్నమాట. నీటిలో బయలుదేరిన ద్రవత్వము నీటి రూపమగుట సహజము. మనోరూపునివల్లపుట్టిన జగత్తుకూడ మనోమాత్ర మనుట సహజం. కాబట్టి ఈ ప్రపంచం సంకల్ప నగరం వంటిది. గంధర్వ పత్తనం వంటిది. రజ్జుసర్పం వంటిది. శుక్తి రజతం వంటిది. మిథ్యాభూత మయిన ఈ ప్రపంచమునందు "ఇది భూత వికారమను" జ్ఞానమే కూడదు. అట్టి స్థితిలో సంవిద్రూపులయిన బ్రహ్మాదులు ప్రపంచంలో భౌతిక దేహాలను విషయం సుతరాం అసంభవం. జ్ఞానికి సూక్ష్మరూపమేలేదు. స్థూలరూపం ఉండదని చెప్పటం ఎందుకు? విరించి మనస్సుఅనే పేరుగల మనుష్యుడు. వాడివల్ల పుట్టిన జగత్తు మనోరాజ్యం అంటారు. మనస్సు యొక్క రూపం విరించి. విరించి యొక్క రూపం మనస్సు. ఇక్కడ పృథ్వ్యాదులు ఏమీ లేవు. అవి అంతా కల్పితాలు. దృశ్య ప్రపంచం అంతా మనస్సు యందే కల్పితం. దీనినీ, దీనిని చూచే సాక్షినీ వేరుపరచి గ్రహించువాడు లోకంలో అరుదు.

స్వప్నప్రపంచం అంతా చిత్తరాజ్యంలో ఉన్నట్లు నీకు ఎలా అనుభవంలో ఉందో, అలాగే ఈ జాగ్రత్ప్రపంచం కూడా నీ మనోరాజ్యం లోనే ఉందని గ్రహించు. కాబట్టి మనఃకల్పితమయిన దయ్యం పిల్లవాణ్ణి చంపినట్లు, దృశ్యప్రపంచం అనే కల్పిత దయ్యం ద్రష్టను నాశం చేస్తుంది. విత్తనంలో ఉన్న మొలక దేశకాలాలను అనుసరించి భాసురమైన దేహంతో బయలుదేరుతుంది. మనస్సులో ఉన్న ఈ దృశ్యం కూడా వివిధ రూపాలతో లోకంలో విస్తరిస్తుంది. దృశ్య ప్రపంచం సత్యమయితే ఎన్నటికీ నివర్తించదు. (నశించదు) దృశ్యం నివర్తించకపోతే దృక్ రూపునకు అద్వితీయత్వం లేదు. కాబట్టి దృశ్యం ఉన్ననూ, అది మిథ్య అని నిశ్చయ జ్ఞానం ఉన్నట్లయితే, బోద్ధకు బోద్ధృత్వము నశిస్తుంది. అదియే బోధస్వరూపుడయిన ఆత్మకు మోక్షం. అని అన్నాడు వసిష్ఠుడు.

# ४ ఉత్పత్తి ప్రకరణార్థ కథనము

వసిష్ఠుడు ఇలా చెపుతున్నాడు. జనం అంతా వినటానికి చెవ్వులు దోరగట్టుకొని మౌనంగా ఏకాగ్రంగా ఉన్నారు. ఘంటా నాదాలు శాంతించాయి. పంజరంలోని పక్షుల ఆట కట్టింది. స్త్రీలు తమ విలాస చేష్టలు మరచిపోయారు. రాజ గృహం అంతా గోడమీది ప్రాతబొమ్మ లాగ అయింది. పగటికాలం నీ రెండులోకి వచ్చింది. ముహూర్త మాత్రం మిగిలింది. రాజవ్యవహారాలు సూర్యకిరణాలతో పాటు సన్న గిలాయి. సుగంధములయిన గాలులు వీ చ నా ర ం భి ం చా యి. వసిష్ఠుని వాగ్ఝరిని వినుటకు కుతూహలపడుతున్నట్లు ఉన్నాయిఅవికూడ. సూర్యుడు కూడా ఈ విస్న విషయాన్ని మననం చేసుకోటానికి అన్నట్లు అస్తాద్రి చేరాడు, పగటి కాలాన్ని తయారు చేయటం మానాడు. రహస్య స్థలం చేరాడు. జనసంకులంలో మననం కుదరదనుకున్నాడు. వనభూములలో చల్లని మంచు బిందువులు బయలు దేరాయి. నలుదిక్కులా జనసంచారం కట్టింది. సావధానంగా వినాలన్నట్లు పనులు మానుకున్నారు ప్రజలు. వస్తువులయొక్క నీడ అంతా వసిష్ఠుని వచన క్రమం వినటానికి వలె పొడ వైంది. వినేవాళ్ల మెడలు లేచినట్లు ఈ నీడ కూడ కొంత సాగింది.

ఈ స్థితిలో ద్వారపాలకుడు వచ్చాడు. సాయంకాల కృత్యాలకు సమయం అయిందని హెచ్చరించాడురాజును. వసిష్ఠుడు సంభాషణ చాలించాడు. మిగిలింది రేపుప్రొద్దున మాట్లాడుతానని ముచ్చటించాడు రాజుగారితో. తాను మౌనం వహించాడు. రాజు విని సరేనని, అర్ఘ్య పాద్యాది విధులతో దేవఋషి ముని విప్రులను ఆదరించి పూజించాడు. అంతటితో సభ అంతా లేచింది. వారు వారు వారి వారి స్థానం చేరారు. సభశ్చరులు ఆకాశం చేరారు. భూచరులు భూమండలం చేరారు. రాత్రి కాలం ప్రవేశించింది. దివసనాయకుడు దేశాంతరం వెళ్లాడు. నక్షత్రాల గుంపుతో సంధ్యాకాలం తయారయింది. క్రమంగా దిక్కులు విరబోసు కున్న పొడుగాటి నల్లని వెంట్రుకలుగల నకేశీ విధవలులాగ తయారయి నాయి. గాఢాంధకారాన్ని పొందాయి. క్ర మ ం గా చంద్రోదయం అయింది. తిమిరసమూహాలు పలాయనం చెప్పాయి. ఋషులూ, రాజు

లూ, మునులూ, బ్రాహ్మణులూ, వారి వారి స్థానంలో విశ్రాంతి చెందారు. ఇలా రాత్రి అంతా గడచింది. ఉషఃకాలం వచ్చింది. సూర్యోదయం అయింది. నభశ్చర మహీచరాదులు వారి వారి ప్రాతఃకాల కృత్యాలు నెరవేర్చుకున్నారు. మరల సభను చేరారు. వెనుకటి రోజువలె సభ అంతా నిండింది. శ్రీరాముడు, ప్రసంగంలోకి దించి వసిష్ఠుని ఇలా అడిగాడు.

మహాత్మా! మనస్సువల్ల ఈ లోకపుంజం విస్తరిస్తోందని అంటిరి కదా! దాని (ఆ మనస్సు) యొక్క రూపం ఎట్టిదో స్పష్టపరచండి? అని. మనస్సు యొక్క రూపం తెలిస్తే జగద్రూపం తెలుస్తుందని ఇతని అభిప్రాయం. రామా! మనస్సు ఆకాశంవలె శూన్యం. జడాకారం. దానికి నామం కంటె వేరుగ రూపం ఏమీ లేదు. ఆకాశం లోపలా, వెలుపలా, అంతటా ఉంది. కాని రూపం ఎక్కడా లేదు. మనస్సు కూడా అంతే. ఈ చూచే జగత్తు అంతా ఇలాంటి మనస్సువల్ల పుట్టిందే. కనుక భ్రాంతి మాత్రం. మృగతృష్ణోదకం (ఎండమావుల నీరు) వంటిది. క్షణికమయిన సంకల్పమే దీని రూపం. ద్వితీయ చంద్ర భ్రమనంటిది. లోకంలో ఏ వస్తువు కయినా ఆకారం స్ఫురించిందంటే అది అంతా మనస్సు అని గ్రహించు. అంతకంటె మరొకటి లేదు. సంకల్పమే మనస్సు. మనస్సే సంకల్పము. గాలినుంచి స్పందమూ, ద్రవత్వమునుండి సలిలమూ బయలు దేరినట్లు, సంకల్పము నుంచియే మనస్సు బయలుదేరుతున్నది. మనస్సూ, సంకల్పమూ, ఎప్పటికీ వేరుగాదు. సత్యంకాని, అసత్యంకాని పదార్థ ప్రతిభాస అంతా, (ఆకార ప్రతిభాసము) మనోమాత్రము. ఆమనస్సే విరించి, (హిరణ్యగర్భుడు) అనగా హిరణ్యగర్భుడు మనోమయ రూపుడని తేలింది. ఇతడే, సూక్ష్మభూతములను చాలా కాలం కలసి యుండుటకు కలిపి పంచీకరణంచేయుటవలన స్థూల భూతములుఅను బుద్ధిని ధరిస్తున్నాడు.ఈ దృశ్య ప్రపంచానికి, అవిద్య, సంసృతి, చిత్తం మనస్సు, బంధం, మలం, తమస్సు అని పర్యాయ నామము లన్నారు పెద్దలు. కమలముయొక్క బీజంలో దాని తీగ అంతా ఇమిడి ఉన్నట్లు చిత్పరమాణువు లోపల దృశ్య జగత్తు అంతా ఇమిడి ఉంది. ప్రకాశానికి వెలుతురూ, గాలికి చలనమూ, నీటికి ద్రవత్వమూ, వలె ద్రష్టకు దృశ్యత్వం స్వభావసిద్ధమయింది. (సహజమయింది)

సువర్ణమునందు కటకత్వమూ, మృగనదియందు జలమూ, స్వప్నపురము నందు గోడవలె ద్రష్టయందు దృశ్యప్రపంచం అపృథక్సత్తాకమై, (వేరు ఉనికి లేనిదై) ఉంది. ఇంతవరకూ దృశ్యం ద్రష్టయొక్క ఉనికి కంటె వేరు ఉనికి లేకుండా ఉన్నదని, నిరూపించాను. ఇంక దృశ్యము అసలే లేదని నిరూపిస్తా చూడు. ఎలా గంటె, దృశ్యానికి, ద్రష్టయొక్క ఉనికి కంటె వేరు ఉనికి లేదంటే, ద్రష్టయొక్క ఉనికే దృశ్యానికి ఉనికి అని తేలింది. ఇది అసంభవం, ఒకదానియొక్క ఉనికి ఒకదానికి రాదు. కాబట్టి ద్రష్ట యొక్క ఉనికిమీద ఆధారపడియున్న దృశ్యం లేదన్నమాట. కనుక ద్రష్టకు ద్రష్ట్రుత్వం లేదన్నమాట. కాబట్టి ఆత్మకు కైవల్యము, (అద్వితీయత్వము) నిరాఘాటం.

నీ చిత్తంలో ఈ కేవలీ భావంనిలిచిఉంటే రాగద్వేషాది వాసన లన్నీ శాంతిస్తాయి. గాలి అణిగితే చలన, క్షోభాలు శాంతిస్తాయి. ప్రకాశ్యమయిన, పంచభూతాత్మక ప్రపంచం లేకపోతే, ప్రకాశరూపుని ప్రకాశం నిర్మలం అవుతుంది. "నీవు" "నేను" అనే జగత్తు అంతా అసత్తు అయితే (లేకపోతే) ద్రష్టకు కైవల్యం సుస్థిరం. నిర్మాలాత్మకు కూడఈకైవల్యం సులభం ప్రతిబింబగ్రహణములేని (అనగా దేని యొక్క ప్రతిబింబమూ సంక్రమించి ఉండని) దర్పణమునందు ఎట్టి దర్పణత్వముండునో, దృశ్యభ్రాంతి అంతా అంతరిస్తే ఆత్మకు కూడా అట్టి కేవలత్వం సిద్ధిస్తుంది. అన్నాడు వసిస్ఠుడు.

వసిష్ఠ మహర్షీ! దృశ్యం ఉందంటారా? నశించదు. నాఽ భావో విద్యతే సతః॥ అని చెప్పారు శ్రీకృష్ణులు. లేదంటారా? ఇది లేకపోవడం ఎలాగో నాకు బోధపడడంలేదు. కాబట్టి సంసార దోషాన్ని ఇచ్చే ఈ దృశ్యవ్యాధి శాంతించడం ఎలాగో చెప్పండి అన్నాడు రాముడు.

రామా! ఈ దృశ్య పిశాచం ఎగిరిపోవటానికి నీకు మంచి మంత్రం చెపుతా విను. ఆ మంత్రంతో పేరు లేకుండా చస్తుంది దృశ్య పిశాచం. దృశ్యం ఉన్నట్లయితే దానికి నాశం ఉండదు. అది నిజం. ఒకవేళ పైకి నశించినట్లు కనిపించినా లోపల హృదయంలో బీజ భూతంగా ఉంటుంది. అందులో నుంచి స్మృతి రూపంగా మళ్లీ బయలుదేరి లోకశైలాంబ

రాకారంగా విస్తరిస్తుంది. ఇంక ఎన్నటికీ ఆత్మకు మోక్షం ఉండదు. పోనీ మోక్షమే లేదందామంటే అనేకనుంది దేవఋషులూ మునులూ ముక్తిపొందినట్లు కనపడుచున్నారు. జీవన్ముక్తులుగా గోచరిస్తున్నారు. ఈ జగత్తే ఉంటే వాళ్లలో ఎవ్వరికీ మోక్షం ఉండేదికాదు. దృశ్యం బాహ్యంలో ఉండనీ, హృదయంలో ఉండనీ, ఎలాగైనా ఆత్మకు చెరుపే దానివల్ల. కాబట్టి రామా! నేను చెప్పే ప్రతిజ్ఞా వాక్యం ఒక్కటి విను. ఈ మాట ఆరంభవాదులకు కొందరికి చాల భయంకరంగా ఉంటుంది. ఉత్తర గ్రంథంవల్ల నీకే, విషయం అంతా బోధపడుతుంది.

ఈ ఆకాశాది ప్రపంచం అనేది బొత్తుగా ఏమీ లేనే లేదు. నీముందు కనపడే దృశ్యజాతం అంతానున్న అనుకో. అది అంతా అజరామరమైన పరబ్రహ్మయే. సందేహంలేదు. ఈయన పూర్ణంగా ఉంటే అది పూర్ణంగా విస్తరిస్తుంది. అతడు శాంతిస్తే అది శాంతిస్తుంది. ఘటాది ఉపాధులలో ఉండే ఆకాశమే, ఉపాధి నాశానంతరం ఆకాశంలో చేరినట్లు. బ్రహ్మయందే బ్రహ్మ ఉంటూ ఉంది. ఆ బ్రహ్మ ఏమాత్రం వికారం చెందటం లేదు. కాబట్టి సద్రూపం అయిన దృశ్యం లేదు. ద్రష్ట లేదు. దర్శనం లేదు. శూన్యంకాదు. జడంకాదు. చిత్తుకాదు. (బుద్ధి ప్రతిబింబిత చైతన్యం కాదు) ఇది అంతా శాంతమైన బ్రహ్మ పదార్థమే అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

విన్నాడు శ్రీరాముడు. ప్రపంచం లేదన్నమాట నమ్మలేదు. అది అసంభవం అనటానికి తగిన దృష్టాంతాలను కొన్నిటిని వెతికాడు. వసిష్ఠునకు చూపాడు. మహర్షీ! గొడ్డురాలిబిడ్డ కొండను పొడిచేశాడట. కుందేటికొమ్ము గానం చేసిందట. రాయి చేతులుచాచి తాండవ నృత్యం చేసిందట. ఇసుకరేణులు నూనెను స్రవించినవట. రాతిబొమ్మలు పాఠం చదివినవట. పటంలోని మేఘాలు గర్జించాయట. ఈ మాటలు ఎలా ఉన్నాయో, అలా ఉందిప్రపంచం బొత్తుగా లేదని మీరు నాకు చెప్పడం. కాబట్టి ఇది ఎలా లేదో? ఎలా పుట్టలేదో? నిశ్చయించి చెప్పండి? అని అడిగాడు రాముడు. వసిష్ఠుడు స్వప్న దృష్టాంతంతో విషయాన్ని నిర్ణయింపదలచాడు.

రామచంద్రా! నేను పొసగని మాటను చెప్పేవాడనుకాను. ఈ ప్రపంచం లేనిదయినా ఉన్నట్లు కనిపిస్తోంది. ఇది సర్గాదిలో పుట్టలేదు. స్వప్నంలో పట్టణం కనిపించినట్లు మనస్సువల్ల ప్రకాశిస్తోంది. అందువల్ల లేదని అన్నాను. దీన్ని కనుపరచే మనస్సే సృష్ట్యారంభంలో పుట్టలేదు. దానికే నిజమయిన శరీరంలేదు. ఇంక దానివల్ల భాసించే (కనిపించే) దీని గతి ఏం చెప్పాలి. మనస్సే ఈ దృశ్యాత్మకమైన జగత్తును విస్తరింప చేస్తోంది. అసద్రూపమయిన ఒక స్వప్నము, సదాకారమయిన మరొక స్వప్నాన్ని చూపించినట్లు భావనా వశంవల్ల ఈ ఇంద్రజాల సంపద విస్తరించింది. మనస్సే స్వయంగా అతిశీఘ్రంగా ఈ దేహ జాలాన్ని సంకల్పిస్తుంది. ఈమనస్సే ప్రకాశిస్తుంది. చలిస్తుంది. వెళ్లుతుంది. యాచిస్తుంది. తిరుగుతోంది. మునుగుతుంది. స్వయంగా చరిస్తుంది. సంసారావస్థా సంబంధమయిన నైచ్యాన్ని పొందు తుంది. కైవల్యమనే గొప్పతనాన్ని పొందు తుంది. కనుక ఈ నాటకం అంతా మనస్సుదే కాని మరొకటి ఏమీ లేదు. కనుకనే ప్రపంచం స్వప్నంవలె మిథ్య అని నేనన్నాను. ఇందులో అసంగతం ఏమీ లేదు. అన్నాడు వసిష్ఠుడు.

(రెండవ రోజు ప్రసంగం ముగిసింది.)

## ౫ మూలకారణ దేవ స్వరూప వర్ణనము

మూడవరోజు ప్రసంగం ప్రారంభం అయింది. ప్రకరణం అంతా విన్నాడు రాముడు. ఇందులో మనస్సు మిథ్య అని తేలిందని నిర్ణయించాడు. మిథ్యా పదార్థానికి అధిష్ఠానం ఉండాలికదా? అని ఆలోచించాడు. దాని యందిది ఆరోపితమగుట ఎట్లా? అని ఊహించాడు. అసలు ఈ మనస్సు మిథ్య అగుటకు కారణమేమి? అని సందేహించాడు. ఇదంతా విపులంగా తెలుసుకోదలచాడు. ఇలా అడిగాడు వసిష్ఠుణ్ణి. మహర్షీ! మనస్సు భ్రమ అయితే, దానికి పరమార్థమయిన మూలకారణం (అధిష్ఠానం) ఏది? అసలు ఇది మాయామయం. (భ్రమ) ఎందుకు అయింది? టూకీగా చెప్పండి? అన్నాడు రాముడు.

వసిష్ఠుడు కూడా మొదటి భ్రాంతికి మూలం తెలిస్తే అన్నిభ్రాంతులకు మూలం తెలుస్తుందనుకున్నాడు. సమాధానం ప్రారంభించాడు.

రామచంద్రా! ప్రపంచంలోని పదార్థాలన్నీ మహాప్రలయంలో, సూక్ష్మ భావాన్ని చెంది ఉంటాయి. ఏవీ వాటిపనిని అవి చెయ్యలేవు. అలాంటి దశలో, ఆద్యంతములు లేని వాడూ, స్వయం ప్రకాశరూపుడూ, సంసార బాధలు లేని వాడూ, సర్వ క్రియా శక్తి సంపన్నుడూ, అయిన పరమాత్మ ఒక్కడే మిగిలి ఉంటాడు. వీనినే, వేదాలు గుర్తించలేకపోయాయి. జీవన్ముక్తులు సాక్షాత్కరించుకొంటున్నారు. వీనికే పరమాత్మ పరమేశ్వరుడు, పరబ్రహ్మ, మున్నగు నామములు అనేకములు కల్పితము లయినాయి. సాంఖ్యులు పురుషుడన్నా, వీనినే. వేదాంతాలు బ్రహ్మ అన్నా వీనినే. బౌద్ధులు క్షణిక విజ్ఞాన మాత్రమన్నా వీనినే. శూన్య వాదులు శూన్య మన్నా వీనినే. సూర్యోపాసకులు సూర్యుడన్నా వీనినే. ఇతడే వక్త, భోక్త, ద్రష్ట, కర్త, మంత, అంటారు. ఇతడు సద్రూపుడు, అయినా పామరులకు అసద్రూపుడు. (లేనివాడు.) ప్రతివాడికీ దేహంలోనే ఉంటాడు. అయినా అజ్ఞానులకు దూరంగా ఉన్నట్లు భాసిస్తాడు. సూర్యుడి వెలుగువలె చిత్ప్రకాశరూపుడు. సూర్యుడినుంచి, కిరణములవలె, వీని నుంచియే, విష్ణ్వాది దేవతలు, ఆవిర్భవిస్తున్నారు. సముద్రమునుంచి బుడగలవలె, వీని నుంచియే అనంతములయిన జగత్తులు పుట్టుచున్నాయి. నదులన్నీ సముద్రమును చేరు చున్నట్లు దృశ్య వస్తువులన్నీ వీనినే చేరుతున్నాయి.

దీపమువలె ఇతడు స్వయముగా ప్రకాశిస్తాడు. ఇతరములను ప్రకాశింపచేస్తాడు. ఇతడు ఆకాశంలో ఉన్నాడు. శరీరంలో ఉన్నాడు. రాతిలో ఉన్నాడు. నీటిలో ఉన్నాడు. తీగలో ఉన్నాడు. మట్టిలో ఉన్నాడు. కొండలో ఉన్నాడు. గాలిలో ఉన్నాడు. ధూళిలో ఉన్నాడు. పాతాళంలో ఉన్నాడు. ఇతడే, తన చైతన్యముతో, కర్మేంద్రియ పంచకమూ, జ్ఞానేంద్రియ పంచకమూ, ప్రాణ పంచకమూ, భూత సూక్ష్మ పంచకమూ, అవిద్యా, కామ, కర్మ అంతఃకరణములనే పుర్యష్టకాన్ని ముంచి వేస్తున్నాడు. రాళ్లను కదలకుండా, మెదలకుండా చేసింది ఈపరమేశ్వరుడు. ఆకాశాన్ని శూన్యంగా తయారుచేసింది ఈ పరమేశ్వరుడు. రాళ్లను గట్టి పరచింది (ఘనీభవింప జేసింది) ఇతడు. నీటిని ద్రవింప జేసింది ఇతడు. సూర్యుని ప్రకాశరూపునిగా తయారుచేసింది ఇతడు. చిత్ర విచిత్రములయిన సంసార వృష్టులన్నీ ఇతనినుంచి బయలుదేరుతున్నాయి. మరుభూమి

యందు మరీచికలవలె ముల్లోక తరంగములు ఇతని యందే పుట్టు చున్నాయి. ఇతడు ప్రపంచ రూపంతో నశించువాడు. స్వస్వరూపంతో అవినాశుడు. (నాశములేనివాడు) శుద్ధచైతన్యంలో మాయ అనే తీగ పుట్టింది. బ్రహ్మాండం అనే పండును ఇస్తోంది. చిత్తము మొదలగు పద క్రొందు ఇంద్రియములనే ఆకులతో విరాజిల్లుతోంది ఈతీగ. పరమేశ్వరుడు అనే గాలిచే నాట్యం (నృత్యం) చేస్తోంది.

ఈ చిన్మణి ప్రతి శరీరంలో ప్రకాశిస్తూ ఉంది. చంద్రమండలంలో కిరణాలు ప్రకాశించినట్లు ఇతనిలో జగత్తులన్నీ కలకలలాడు చున్నాయి. అమృతమును వర్షించు చిద్ఘనము (చిన్మేఘము) ప్రకాశిస్తూ ఉంటే కోట్లకొలది ప్రాణులు జలధారలలాగ సృష్టి అవుతున్నారు. చిత్ప్రకాశము యొక్క సత్తావల్లనే వస్తువులు చిత్ర విచిత్ర కార్యాలను చేస్తున్నాయి. వేయేల కార్య జాతం అంతా ఇతని సత్తావల్లనే జరుగుతూ ఉంది. ఇతడు శుద్ధ సంవిద్రూపుడు కనుక, ఏపదార్థముగా భావనచేస్తే ఆయాపదార్థంగా తయారయి ప్రపంచాన్ని అధిష్ఠించి ఉన్నాడు. ఇతడు మహాత్తరమయిన బ్రహ్మాండములనూ, అందులో చిత్రవిచిత్రములయిన లీలలనూ చేస్తున్నా, ఏమీ చేయనివాడుగా నిర్వికారంగా ఉంటాడు. ఉదయాస్తమయములు లేని నిర్వికారచిద్రూపుడు. కనుకనే ప్రపంచమునకు వివర్తోపాదానము. కనుకనే ఇతనివల్ల తయారయిన ప్రపంచం మిథ్య అయింది. కాబట్టి అన్ని భ్రాంతులకు మూలకారణం ఈ పరమేశ్వరుడని గ్రహించమన్నాడు వసిష్ఠుడు.

## ౬ ముముక్షు ప్రయత్నోపదేశము

దేవాధి దేవుడయిన ఈ పరమాత్మజ్ఞానమువల్లనే ముక్తి ఇతరము లయిన కర్మానుష్ఠానాదులు ఇచట ఉపయోగించవు. ఈ సంసారం మృగ తృష్ణాజల (ఎండమావుల నీటి) భ్రాంతివంటిది. భ్రాంతి, నిజమును తెలిసికొన్ననే నశిస్తుంది. సంసార భ్రాంతి కూడ తత్త్వజ్ఞానమువల్లనే నశిస్తుంది.

ఆత్మ ఆనంద ప్రకాశరూపుడు. అతడు దూరమున లేడు. దగ్గర లేడు. క్రియచే లభ్యుడుగాడు. సర్వప్రాణులకు అనుభవరూపుడు. మోక్షమున్ను అనుభవరూపమే. దీనినిగూర్చి తపోదాన వ్రతాదులు జేసి పొందు నుపకారముఁలేదు. స్వభావమాత్రమున నిలచిపోవుటయే ముక్తికి సాధనం సజ్జన సాంగత్యమూ, సచ్ఛాస్త్రాభ్యాసమూ, దీనికి ఉపకరించును. జీవన్ముక్తికిగాని, దుఃఖ నివృత్తికిగాని, పరమార్థసత్యమయిన పరమాత్మ జ్ఞాన మాత్రమే కారణం అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! జ్ఞాన మాత్రం చేత సాంసారిక దోషాలు అడుగంటేటట్లయితే, ఆ జ్ఞానం ఏ తీవ్రతపస్సుచే కలుగుతుంది? ఏ కాయక్లేశం చేత కలుగుతుంది? సెలవియ్యండి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! కర్మలు నిష్కామంగా చెస్తే ఆత్మ జ్ఞానమునందు గట్టి కోరిక కలుగుతుంది. అంతవరకే వాని పని. ఆవల మానవుడు శ్రవణాది ప్రయత్నమును చేసికొనవలసినదే. అంతఃకరణములోని రాగ ద్వేషాది దోషాలను పోగొట్టుకొనవలెను గాని, తపోదాన వ్రతాదులను ఆచరించి లాభం లేదు. మనస్సులో రాగ ద్వేషాలు ఉంటే, డబ్బు సంపాదించేటప్పుడు ఇతరులను వంచించవలసి వస్తుంది. అది తప్పదు. ఆస్థితిలో మానవుడికి చిత్తశుద్ధియే దుర్లభం. అలాంటి అప్పుడు దానాదులవల్ల కామ్యఫలమే లభించటం దుర్లభం. ఇంక జ్ఞానం కలుగుతుందని కాని, మోక్షం కలుగుతుందని కాని ఆశయే లేదు.

కాబట్టి సంసార రోగం నశించటానికి ముఖ్యౌషధాన్నే వాడాలి. అది సచ్ఛాస్త్రాభ్యాసమూ, సజ్జన సహవాసమూ, అని రెండు రకములు. ఈ రెంటికీ పురుషప్రయత్నం అవసరమే. సర్వదుఃఖ నాశానికి ఇంతకంటె వేరే గతి లేదు. రామచంద్రా! ఆ పురుష ప్రయత్నంలో ఉండే విధానం చెపుతాను విను. లోకానికి శాస్త్రానికీ విరోధం లేకుండా, యథా సంభవమయిన వృత్తితో జీవించాలి. యదృచ్ఛాలాభ సంతోషం అవసరం. భోగాభిలాష కూడదు. అందు అభినివేశం (పట్టుదల) అసలే పనికిరాదు. నిర్వేదం లేకుండా సజ్జనసహవాసం చెయ్యాలి. శాస్త్రాభ్యాసం చెయ్యాలి.

వికటకాని, నా చేత కాదనే భయం కాని కూడదు. దొరకినదానితో తృప్తిచెందుతూ, శాస్త్రముచే నిందింపబడిన దానిని ఉపేక్షించుచూ, సజ్జన సహవాసం చేస్తూ, సచ్ఛాస్త్రాభ్యాసం చేసేవాడు తొందరగా ముక్తుడవుతాడు. తత్త్వ విచారం చేసి ఆత్మతత్త్వమును సాక్షాత్కారం చేసికొన్నవానికి త్రిమూర్తులు కూడ క్రింది మెట్టులోని వారే.

లోకంలో, సదాచార సంపత్తియు, జ్ఞానవైరాగ్యాది గుణములున్నూ కలవాడు సాధువు. అట్టి వాని సహవాసము ముముక్షువునకు ఆవశ్యకము. వానిని ప్రయత్నపూర్వకంగా ఆశ్రయించాలి. విద్యలన్నిటిలో. అధ్యాత్మ విద్యయే సచ్ఛాస్త్రము. దీని విచారణయె ముక్తికి సాధనం. ఈ రెంటివల్లనూ అవిద్యాది దోషాలు, అంతరిస్తాయి. ఇండుపగింజయొక్క గంధమువల్ల నీటిలో దోషంపోతుంది. యోగాభ్యాసంవల్ల మనోదోషాలు మంట కలుస్తాయి. కాబట్టి, ముముక్షువునకు సజ్జన సాంగత్యమునందూ, సచ్ఛాస్త్రాభ్యాసము నందునూ ప్రయత్నం చాలా అవసరం అన్నాడు వసిష్ఠుడు.

## 8 దృశ్య మిథ్యాత్వము

మహర్షీ! పరమాత్మ జ్ఞానంవల్ల కదా మోక్షం కలిగేది? ఆ పరమాత్మ ఏ ఉపాధిలో అభివ్యక్తం అవుతాడో, ఎక్కడ ఉన్నాడో, నేను ఆ పరమాత్మను ఎలా పొందుతానో, చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! ఈ విషయం ఇదివరకే చెప్పితిమిగా? పరమేశ్వరుడు దూరంగా లేడు. శరీరంలోనే ఉన్నాడు. అందలి హృత్పుండరీకంలో విశేషంగా అభివ్యక్తం అవుతూ ఉంటాడు. అతడు చిన్మాత్రుడు. దేహంలో ఉన్నంత మాత్రాన దేహ పరిచ్ఛిన్నుడు గాడు. ప్రపంచం అంతా అతడే. అనగా సర్వవ్యాపకుడని భావము. అంతే కాని దృశ్య విశ్వమే అతని ఆకారమని కాదు. చిన్మాత్రుడయిన పరమాత్మకంటె వేరుగా విశ్వం లేదు. తత్కారణమయిన మాయయూ లేదు, అందలి గుణములను అభిమానించియున్న బ్రహ్మ విష్ణు రుద్రాది దేవతలున్నూ లేరు. అన్నాడు వసిష్ఠుడు.

స్వామీ! ప్రపంచం అంతా చేతన మాత్రమని (చైతన్యముగల జీవ సంఘంతో కూడియున్నదని) పిల్లలకు గూడ తెలుసును. ఇది మీరు ఉపదేశించవలసినపని లేదు. అని అన్నాడు. రామా! ప్రపంచం చేతన మాత్రమని (జీవమాత్రమని) నీవు తెలిసికొని ఉన్నట్లయితే, నీకు ఏమీ తెలియదన్నమాటే. ఈ జ్ఞానంవల్ల సంసార నివృత్తి కలుగదు. ప్రపంచం చేతనాత్మకం అంటే అక్కడ మీ అభిప్రాయంలో చేతన శబ్దానికి జీవుడు అర్థమగుచున్నాడు. అతడు బహిర్ముఖుడై విషయాలను అనుభవించుటచే వశుతుల్యుడు. అతనికి జరామరణాది భయములు తప్పవు. అతడు అజ్ఞాని, అసత్యకమయిన మనస్సుతోటి సంబంధము అతనికి తప్పదు. ఆ సంబంధము ఉన్నంతవరకు అతనికి దుఃఖాలు తప్పవు. జీవుడు విషయములకు బహిర్ముఖ్యుడయినపుడు కాని, చైతన్యమునకు అభిముఖుడయినపుడుగాని పరిపూర్ణుడగును. ఇది సమాధిలో కాని తటస్థించదు. ఇలాంటి జీవుణ్ణి జీవన్ముక్తుడు అంటారు పెద్దలు. ఈ దశ జీవుడికి పరమాత్మ జ్ఞానమువల్ల కాని కలుగదు. ఈ యది శ్రుతి సిద్ధాంతము. "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః । క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥" అను శ్రుతి ఈ యర్థమునందు ప్రమాణం.

జీవునకు విషయాభిముఖ్యము చిత్తనిరోధమనే యోగంవల్ల నిరోధింపబడాలికాని, కేవల జ్ఞానంవల్ల ఎలా కలుగుతుంది? అని శంకించుట తగదు. దృశ్యాసంభావనము ఎన్నటికయినా జ్ఞానం ఉంటేనే కలుగుతుంది కాని, కేవల సమాధివల్ల (యోగంవల్ల) కలుగదు, చైత్యాసంభావనము లేనిదే చిత్స్వరూపస్థితి అబ్బదు. తత్త్వజ్ఞానము లేనిదే చైత్యాసంభావనము (విషయములను మరచుట) సంభవించదు. కాన మోక్షమునకు జ్ఞానము ఆవశ్యకము. కేవల విషయ నిరోధంవల్ల జీవుడు స్వరూపోన్ముఖుడు కానేరడు. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! జీవుడే సంసారమయితే మోక్షదశలో జీవుడు బ్రహ్మత్వాన్ని పొందినపుడు బ్రహ్మ కూడా సంసారి కావలసివస్తాడు. జీవుడు బ్రహ్మను పొందడని అనేయడల పొందుటకు సాధనమయిన జ్ఞానశాస్త్రం అంతా వ్యర్థం కావలసివస్తుంది. కాబట్టి జీవరూపం సంసారం అనుట

తగదు. వేరే చెప్పాలి. మరిన్నీ జీవుడికి ఆధారం బ్రహ్మ అంటారా! లేక వేరే ఏమయిన ఉందంటారా! మొదటి పక్షంలో బ్రహ్మజ్ఞానంచే బ్రహ్మయందు అధ్యస్తమయినవన్నీ పోతే వాటితో పాటు జీవుడు కూడా ఎగిరిపోతాడు. అపుడు "వరఘాతాయ కన్యోద్వాహః" (అల్లుణ్ణి చంపటానికి కూతురికి పెళ్లి.) అనే న్యాయం సిద్ధిస్తుంది. రెండవ పక్షంలో బ్రహ్మ ద్వైతానికి బాధ కలుగుతుంది. ఎలా ఈ చిక్కు అని ప్రశ్నించాడు. శ్రీరాముడు.

రామచంద్రా! జీవుడే సంసరించే టట్లయితే నీవు చెప్పే చిక్కులన్నీ కలుగుతాయి. కావున అట్లుకాదు. బ్రహ్మయే స్వాజ్ఞానంవల్ల సంసారాన్ని పొందుతున్నాడు. స్వజ్ఞానంవల్ల ముక్తుడవుతున్నాడు. దుగ్గూఢుడు ఒక్కడే కాని ఇద్దరు లేదని శ్రుతి చెప్పుచున్నది. కాబట్టి ఎప్పుడు బ్రహ్మయే అనాత్మభూతములయిన దేహేంద్రియాదులలో ప్రవేశించి జీవుడై భ్రాంతి వల్ల శరీరేంద్రియ ధర్మములను అభిమానించుచూ సంసారమును పొందు చున్నాడో, ఆప్పుడు జీవుడు సంసారి అని వాడుక ఏర్పడింది. ఇప్పుడు ఇట్టి జీవునకు బాధ కలిగితే బ్రహ్మ జ్ఞానంచేత, వరఘాతన్యాయము తట స్థించదు. కనుక పరమాత్మ జ్ఞానం చేతనే నిఖిలదుఃఖములు నివర్తిస్తాయి. అన్నాడు వసిష్ఠుడు.

మునీంద్రా! నేను పరమాత్మయొక్క నిజరూపం అడిగాను. దానిని చెప్పండి. అది తెలిస్తే మనస్సులో ఉండే మోహాలన్నీ పటాపంచలవుతా యట. అని మళ్లీ ప్రశ్నించాడు రాముడు.

రామచంద్రా! చెట్టుయొక్క కొమ్మమీదుగా నభోమండలంలోని చంద్రుణ్ణి చూడటానికి చక్షురింద్రియం ప్రసరిస్తుంది. అప్పుడు కంటితో పాటు అంతఃకరణాభి వ్యక్తమయిన చైతన్యం కూడా బయలుదేరుతుంది. ఒక్క నిముషకాలంలో అంతఃకరణా వచ్ఛిన్న చైతన్యం చెట్టుయొక్క ప్రదే శం నుంచి, చంద్రుడున్న ప్రదేశందాకా పోతుంది. పోయి చెట్టుకొమ్మనూ చంద్రుణ్ణీ ఒకే పర్యాయం చూస్తుంది. అప్పుడు శాఖాప్రదేశం మొదలు కొని చంద్రునివరకు ఈ చైతన్యం అను స్యూతమై ఉన్నదని అనాలి. లేక

పోతే ఈ రెండూ ఒకేవిధంగా కనిపించటం కుదరదు. మధ్య భాగంలో ఈ చైతన్యం విచ్ఛిన్నమయితే, ఇంద్రియానికీ అనుభవానికీ కార్యకారణభావం కుదరదు. శాఖా ప్రదేశంలో చైతన్యానికి శాఖ అనే విషయం ఉంది. చంద్రదేశంలోకూడా చంద్రుడు విషయంగా ఉన్నాడు. కనుక ఆ రెండు ప్రదేశాలలో చైతన్యం సవిషయమయినా, మధ్యప్రదేశంలో ఈ చైతన్యం నిర్విషయం అనక తప్పదు. అట్టి నిర్విషయా పరోక్ష చిదూపనే పర మాత్మయొక్క రూపమని గ్రహించాలి.

ప్రపంచం ఉన్నదున్నట్లుగా మిథ్యాభూతము. పరమాత్మ అఖండ బోధరూపుడు. ద్రష్టృ దృశ్యక్రమం అంతా ఈపరమాత్మలో అస్తమిస్తుంది. ప్రపంచం అంతా స్వభావశూన్యం. అయినా, వస్తు యాథాత్మ్యరూపంతో నిండియున్నట్లు కనిపిస్తుంది. ఈ స్థితి పరమాత్మయొక్క యథార్థరూపంతో ఈ విధంగా గోచరిస్తుంది.

పరమాత్మ అపరిచ్ఛిన్నుడు. సర్వవ్యాపకుడు. అజ్ఞానదశలో ఉపయోగపడనందున శూన్యుడువలె నుండువాడు. చిద్ఘనుడు. స్థూల త్వాది ధర్మములు ఇతనికి లేవు. అయినను పాషాణమువలె అతిస్థూల ముగా అజ్ఞులకు గోచరిస్తాడు. లోపల అజడమయినను జడముగా భాసిస్తాడు. ప్రపంచం ఇతనితో ఆధ్యాసికతాదాత్మ్య సంబంధాన్ని పొంది స్వరూపంతో ఉండుటను సపాదించుకుంది. ఆ సత్తాయే పరమాత్మ యొక్క రూపము. ప్రకాశమునకు ఆలోకమూ, ఆకాశమునకు శూన్యత్వ మూ ఎట్లు స్వరూపముగా నున్నదో అట్లే ప్రపంచమునకు ఆత్మ రూపంగా పరమాత్మ ఉన్నాడు.

మునీంద్రా! ఇంద్రియాది ప్రమాణములచే తెలియబడని పర మాత్మ సద్రూపుడనీ, ఇంద్రియాది ప్రమాణములచే తెలియబడుచున్న మహా విశాలమయిన ఈ ప్రపంచం అసద్రూపమనీ నిర్ణయించుట ఎట్లు?

రామచంద్రా! బ్రహ్మ ప్రమాణగమ్యుడు కాడనుట చెల్లదు. ప్రతిబంధకము లేనపుడు బ్రహ్మ మహా వాక్యములచే తెలియబడుచునే యున్నాడు. బ్రహ్మయందు అధ్యస్తమయిన ద్వైత ప్రపంచం మిథ్య అను

జ్ఞానం చేతనే ప్రతిబంధం పోవాలి. ఆకాశానికి నలుపువర్ణముపలె ఈ ప్రపంచం భ్రాంతిచే కల్పింపబడింది. ఇది లేదను జ్ఞానం చేతనే బ్రహ్మ నిశ్చయం కలుగుతుంది. దృశ్యాత్యంతాభావమే బ్రహ్మయొక్క రూపము ఇది జ్ఞానముచేతనే తెలియనగును. ఇతరమయిన కర్మచే తెలియదగదు. దృశ్య మిథ్యాత్వ జ్ఞానముకంటే శుభంకరమయిన మార్గము మరొకటిలేదు. దృశ్యాత్యంతాభావము సిద్ధించిన తరువాత మిగిలేది పరమార్థమయిన బ్రహ్మమే. అదియే తెలియబడును. అదియే బోధయుగు జీవునకు ఆత్మయగును. బ్రహ్మ స్వరూప సాక్షాత్కారమునకు దృశ్య మిథ్యాత్వ నిశ్చయమెందుకు? దృశ్యం సత్యమనే జ్ఞానం ఉంటే మాత్రం బ్రహ్మ జ్ఞానం కలుగకూడదా! అని కొందరు శంకింతురు. అధ్యస్తమగు దృశ్యం సత్యం అనే జ్ఞానం ఉంటే ఆ అంతఃకరణంలో బ్రహ్మ ప్రతిబింబించదు. బుద్ధియందు ప్రతిబింబించిన బ్రహ్మ, ఆ బుద్ధియందు తనను ఆవరించియున్న అజ్ఞానాన్ని తగలపెట్టి తాను యథార్థంగా గోచరిస్తుంది. తనకు విరోధి అయిన ద్వైతముచే ఆక్రమింపబడిన బుద్ధియందు ద్వైతము ప్రతిబింబించుట, అసంభవము. కాబట్టి ప్రపంచంనిజమను కొనువాని, బుద్ధియందు బ్రహ్మ ప్రతిబింబించదు కనుక బ్రహ్మస్వరూప సాక్షాత్కారంకలగాలంటే దృశ్యాత్యంతాభావ (మిథ్యాత్వ) నిశ్చయంమిక్కిలిఅవసరం. అయితేద్వైతమిథ్యాత్వ నిశ్చయం లేక పోయినా, బుద్ధియందు ద్వైతం ప్రతిబింబించని దశలో అద్వైతం ఎందుకు ప్రతిబింబించ కూడదు? అని అంటారు కొందరు. అనేక వస్తువుల సన్నిధానంలో ఉన్న అద్దము ఎప్పుడూ ఏదో ఒక వస్తువు యొక్క ప్రతిబింబంతో కూడుకునే ఉంటుంది కాని, ప్రతిబింబరహితంగా ఉండదు. అలాగే బుద్ధికూడా ఎప్పుడూ ఏదో ఒక ద్వైత ప్రతిబింబం లేకుండా ఉండదు. ద్వైత ప్రతిబింబం ఉన్నంతవరకూ అద్వైతం ప్రతిఫలించదు. ప్రపంచం అనే దృశ్యానికి మిథ్యాత్వమే స్వరూపం కాని, అంతకంటే వేరే స్వరూపం లేదు. ఉన్నట్లు ఎవ్వరికీనీ గోచరించుటలేదు.

మహర్షీ! ఈ మహా విస్తృతమయిన ప్రపంచం, చిన్మాత్రమై, పరమ సూక్ష్మమయిన బ్రహ్మయందు అధ్యస్తమగుట ఎలా ఘటిస్తుంది? (కుదురుతుంది) ఆవగింజ పొట్టలో మేరుపర్వతం ఇముడు తుందా? సెలవియ్యండి అన్నాడు శ్రీరాముడు.

వసిష్ఠుడు ఆలోచించాడు. ఇలా అన్నాడు.

రామా! నీవు కొన్ని రోజులు ఇలా విసుకు లేకుండా మాబోటి సజ్జనులతో సహవాసం చేస్తూ, సచ్ఛాస్త్ర శ్రవణం చేస్తూ ఉండు. నేను నీ చిత్తంలో ఉండే దృశ్యాన్ని క్షణకాలంలో తత్త్వబోధచేత, ఎండ మావుల నీటిని ఎగరగొట్టినట్లు, తుడిచి వేస్తాను. ఎగరగొట్టుతాను. దృశ్యం పోతే ద్రష్టృత్వం పోతుంది. అలాగే ఏకత్వద్విత్వాలు కూడా పోతాయి. ఏకత్వం ఉంటే ద్విత్వం ఉంటుంది. ఏకత్వం కలిస్తే కాని ద్విత్వం పుట్టదు. దిత్వం ఉంటే ఏకత్వం ఉంటుంది. దృశ్యం పోతే ఇవన్నీ పోతాయి.

ద్విత్వ ఏకత్వ ద్రష్టృత్వ దృశ్యత్వాలు నశిస్తే, ఆపైన సద్వస్తువు ఒక్కటే మిగులుతుంది. అహంతా మొదలగు జగద్దృశ్యం అంతా నీ మనస్సు నుంచి తుడిచిపెడతా చూడు. "లేనిది ఉండదు. ఉన్నది పోదు" అని కృష్ణు డన్నాడు. ఏది స్వతస్సిద్ధముగా లేదో దాన్ని తీసివేయటంలో ప్రియాసలేదు.

జగత్తు నిజంగా పుట్టింది. అనటంకూడా చెల్లదు. బ్రహ్మ చైతన్యమే ఈ రూపంగా కనిపిస్తూ ఉంది. బంగారమునందు కటకత్వం పుట్టలేదు. బంగారమే కటకాకారంగా కనిపిస్తోంది. ఇది బంగారమే అనుకుంటె కటకం ఎగిరి చక్కా పోతుంది. అలా ఇది బ్రహ్మమే అనుకుంటే జగత్తు ఎగిరి పోతుంది. ఈ విషయం నీకు ఇంకా అనేక యుక్తులతో విస్తరించి చెవుతాను.

అపుడు నీకు అబాధితమయిన బ్రహ్మతత్త్వం స్వయంగానే అనుభవ గోచరమవుతుంది. అసలే పుట్టని ప్రపంచానికి ఉనికి ఎక్కడిది? పుట్టితే గా ఉండటానికి మరుభూమియందు నీటిప్రవాహం ఉంటుందా? రెండవ చంద్రునియందు గ్రహణం ఉంటుందా? గొడ్డురాలికి బిడ్డ ఉంటుందా? ఆకాశాన చెట్టు ఉంటుందా? ఇవన్నీ ఎలా అబద్ధమో? అలాగే జగత్తు మిధ్య కాబట్టి రామా! ఈ కనపడేది అంతా బ్రహ్మమే. ఈ విషయం నీకు ముందు యుక్తిచే నిరూపిస్తా. మాటలచేకాదు. ప్రాజ్ఞులు యుక్తులచే

ప్రతిపాదించిన విషయమునందు అనాదరణ పనికిరాదు. యుక్తి యుక్తమయిన విషయాన్ని అంగీకరించక యుక్తిరహితమయిన దానియందు పట్టుదలగలవాణ్ణే అజ్ఞాని అంటారులోకులు. అని గట్టిగా అన్నాడు వసిష్ఠుడు.

## ౮ సచ్ఛాస్త్ర నిరూపణం

మహర్షీ! ఏమిటి ఆ యుక్తి? అది ఎలా సిద్ధిస్తుంది. అది తెలిసిందంటే ఇంక తెలిసికోవలసిందేమీ ఉండదు. అని అన్నాడు రాముడు.

రామచంద్రా! మిథ్యాజ్ఞానం అనే విషూచిక (కలరావ్యాధి) చాలా కాలంనుంచి స్థిరపడిపోయింది. ఈ వ్యాధి జ్ఞానంవల్ల కాని పోదు. ఆ జ్ఞానం కలగటానికి యుక్తి ప్రధానమయిన కథలు కొన్ని చెప్తా విను. వింటివా తప్పక ముక్తి పొందుతావు. వినలేక విసుకుజెంది మధ్యలో లేచి వెళితివా, పశుధర్మాన్ని ఆశ్రయించిన నీకు ఏదీ సిద్ధించదు. ఎవడు ఏది కావాలనుకుంటాడో వాడు దానికొరకు ప్రయత్నిస్తాడు. వాడు తప్పక దాన్ని పొందుతాడు, అలసట చెంది మధ్యలో మానుకోకపోయినట్లయితే. ఇది లోకసమాజం. కాబట్టి నీవుకూడా విసుకుచెందకుండా, సజ్జనసహవాసమూ, సచ్ఛాస్త్రాభ్యాసమూ, చేసే యెడల కొద్దిరోజులలోనే ముక్తి పొందుతావు. నెలలుకూడా అక్కరలేదు. అన్నాడు వసిష్ఠుడు.

స్వామీ! ఆత్మజ్ఞానానికి ప్రధానంగా ఏ శాస్త్రం అవసరమో చెప్పండి. అన్నాడు రాముడు.

రామచంద్రా! ఆత్మజ్ఞానానికి ప్రధానమయిన శాస్త్రాలన్నిటిలోను ఈ వాసిష్ఠ రామాయణ శాస్త్రమే సర్వోత్తమం. దీనిలో చాలా ఇతిహాసాలు ఉంటాయి. వాటిని వింటే తప్పక వివేకం కలుగుతుంది. అన్ని ఇతిహాసాలకు ఇది సారభూతం. కనుక దీన్ని వింటే జీవన్ముక్తి సిద్ధించును. ఇది పరమపావనము. దీని విచారణవలన జగద్దృశ్యం అంతా ఉన్నది ఉన్నట్లు నశిస్తుంది. స్వప్నంలోనే ఇది స్వప్నం అని తెలిసేయడల స్వప్నమునందు సత్యత్వబుద్ధి నశిస్తుంది. ఏది ఈ గ్రంథంలో చెప్పబడి ఉన్నదో అదే ఇతర గ్రంథాలలో కూడా చెప్పబడి ఉంది. ఏది ఇక్కడ చెప్పబడ

లేదో అది ఏ గ్రంథంలోను చెప్పబడలేదు. ఇది (ఈ రామాయణము) సమస్త విజ్ఞాన శాస్త్రాలకు ధనాగారము. దీనిని శ్రవణం చేసినమానవునకు ఇతర గ్రంథాలు శ్రవణం చేసినందువల్ల కలిగిన బోధ (జ్ఞానం) కంటే ఎక్కువ బోధ కలుగుతుంది. ఎవనికి జన్మాంతర దుష్కృతంవల్ల ఈ గ్రంథం రుచింపదో వాడు ఇతర శాస్త్రాలను విచారించుకొను గాక. మాకు వాడి యందు ద్వేషం లేదు. దివ్యౌషధం సేవించిన వానికి రోగం పూర్తిగా శాంతిస్తుంది. పూర్ణమయిన ఆరోగ్యం కలుగుతుంది. అలాగే ఈ శాస్త్రం శ్రవణం చేస్తే జీవన్ముక్తత్వం స్వయంగా కలుగుతుంది. స్వానుభూతం అవుతుంది. మేము చెప్పిన విషయం. దేవుని వరంవలెనూ, శాపంవలెనూ, యదార్థం అగునుగాని, తప్పిపోదుసుమా. ఆత్మ విచారాత్మకమయిన ప్రకృత గ్రంథ కథచేత సంసార దుఃఖం మంట కలుస్తుంది. ఇతరములయిన తపోదాన వ్రతాదులచే గాని, యాగాదులచేగాని, ఇతర శాస్త్ర శ్రవణం చేతగాని, సంసార దుఃఖం నశించదు.

## ౯ పరమకారణ వర్ణనము

రామచంద్రా! ఈ ఆత్మ విచారము, తత్త్వనిర్ణయం కలిగేటంత వరకు తదేకనిష్ఠతో చెయ్యవలెనుగాని, ఎప్పుడో ఒకప్పుడు చేసిన చాలదు. నిరంతరం ఉండాలి. సమస్త ఇంద్రియములు ఆత్మాయత్తములయినపుడు గాని, అది ఫలించదు. శ్రవణాదులయందు తదేకనిష్ఠతో ఉండి ఆత్మ విచారంచేసే వాళ్లకు, మొదట జీవన్ముక్తి కలుగుతుంది. శరీరంపడిపోయిన తరువాత విదేహాకైవల్యం సిద్ధిస్తుంది.

మహర్షీ! ముందు విదేహా, జీవన్ముక్తుల లక్షణాలు చెప్పండి. శాస్త్ర దృష్టితో నేనందుకు ప్రయత్నిస్తాను. అన్నాడు రాముడు.

౧. రామచంద్రా! విను. ప్రపంచ వ్యవహారంలో ఉండి కూడా, పరామార్థ దృష్టితో ప్రపంచం లేనట్లు తలచువాడు జీవన్ముక్తుడు. ౨. లోకవ్యవహారం జరుపుచున్ననూ, తానేమీ చేయనట్లు తలంచుచూ, జాగ్రదవస్థయందు గూడ నిద్రించు వాడివలె నిర్వికారంగా ఉండువాడు జీవన్ముక్తుడు. ౩. సుఖదుఃఖములయందు ముఖవికాసములు లేనివాడు

జీవన్ముక్తుడు. దొరికినదానితో తృప్తిపడువాడు జీవన్ముక్తుడు. ४. నిద్రించినవాడివలె నిర్వికారంగా ఉన్నా, ఆత్మతత్త్వమునందు మేలుకొనియుండువాడు జీవన్ముక్తుడు. ఇంద్రియములచే విషయానుభవమును కోరనివాడు జీవన్ముక్తుడు. వాసనా రహితమయిన శుద్ధజ్ఞాని జీవన్ముక్తుడు. ౫. రాగద్వేష భయాదులకు అనుకూలంగా సంచరిస్తున్నా, లోపల మాత్రం ఆకాశమువలె, నిరావరణాత్మయందున్నవాడు జీవన్ముక్తుడు. ౬. అహంఅను, అభిమానము లేనివాడూ, కర్తృత్వ అకర్తృత్వములతో అంటనివాడూ జీవన్ముక్తుడు. ౭. ఏ చిదాత్మయొక్క సగము ఉన్మేషము వలన ముల్లోక ప్రళయము తటస్థించునో, సగము నిమేషమువలన సృష్టి తటస్థించునో, వాడు జీవన్ముక్తుడు. ఇక్కడ ఉన్మేషము అనగా ఆవరణ విఘటనము. నిమేషము అనగా ఆవరణము. ౮. లోకమునుంచి భయపడనివాడూ, లోకమును భయపెట్టనివాడూ హర్షామర్షభయములు లేనివాడున్నూ జీవన్ముక్తుడు. ౯. ప్రపంచమునందు మిథ్యాత్వ నిశ్చయము కలవాడు, జీవన్ముక్తుడు. దేహావయవములు ఉన్ననూ, నిరవయవత్వబుద్ధి గలవాడు జీవన్ముక్తుడు. మనస్సు ఉన్ననూ సంకల్పములు లేనివాడు జీవన్ముక్తుడు. ౧౦. పదార్థములయందు రాగద్వేషాదులు లేనివాడు జీవన్ముక్తుడు. ఇంక విదేహముక్తుని లక్షణము చెపుతాను విను.

వీనికి వృద్ధి క్షయములుండవు. అహంతా అనహంతలు సున్న. వ్యక్తుడుగాడు. అవ్యక్తుడునూ గాడు. దూరముననుండడు. దగ్గర ఉండడు. "నేను" వాడు అను భేదదృష్టి లేదు. ఇతడు సూర్యుడై ఎండ నిచ్చును. విష్ణువై పాలించును. రుద్రుడై సంహరించును. పద్మజుడై సృజించును. ఆకాశమై ఋషి సురాసుర సహితమయిన వాయుమండలమును ధరించును. కులపర్వతమై లోకపాలుర నగరములను ధరించును. భూమియయి లోక మర్యాదను నిలపెట్టును. తృణగుల్మలతాదులయి ఫలసంపత్తి నిచ్చును. జలమై ద్రవించును. అనలమై మండును. చంద్రుడై అమృతమును గురిపించును. హాలాహలమను విషమై మరణము నిచ్చును. ప్రకాశ రూపుడై దిక్కులను ప్రకటింప జేయును. తమోరూపుడై చీకటి నిచ్చును. శూన్యుడై ఆకాశత్వము నొందును కొండయై అడ్డగించును. అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యరూపుడై జంగమ పదార్థములను తయారు చేయును

జడప్రాయుడై స్థావర ప్రపంచమును నిర్మించును. సముద్రుడై భూమి అనే స్త్రీ చుట్టూ వలయాకారముగా తిరుగును. అనావరణ చిదాత్మ రూపుడై; తన ప్రకాశతో వ్యాప్తమైయున్న సమస్త ప్రపంచ పదార్థములనూ, విస్తరింపచేయుచున్ననూ, తాను శాంతముగా సర్వాకారముగా నుండును. ఇదీ, అదీ, యననేల? కాలత్రయ గతమయిన దృశ్యమంతయు తానే యగుచున్నాడు. విదేహముక్తుడు సర్వాత్మకమగు బ్రహ్మరూపముతో. అని అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! ఈ దృష్టి కలుగుట చాలా దుర్లభము. ఒకవేళ కలిగినా అది స్థిరముగా నిలుచుట అంతకంటె దుర్లభంఅని నా నిశ్చయము. మీరేమంటారు? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! నేను ఇంతకుమున్ను చెప్పిన స్థితియే ముక్తి, అదియే బ్రహ్మము. అదియే నిర్వాణము. ఇంక దానిని పొందు నుపాయమును చెపుతాను విను. "నీవు" "నేను" అను భావముతో కూడుకొని, కనిపించునట్టి ఈ ప్రపంచం అంతా ఉన్నట్లు కనిపించుచున్ననూ, గొడ్డురాలి బిడ్డవలె నిజముగా పుట్టనందున భ్రాంతి మాత్రమే.

అయితే స్వామీ! విదేహముక్తులు ముల్లోక స్వరూపులయినారని ఇంతకు ముందు సెలవిచ్చియుంటిరే; వారేనా యేమి ఈ సృష్టిలో ప్రవేశించింది? నాకు జూడ విదేహముక్తులే ముల్లోకములోని జీవులయి సంసారమును బొందినారని తోస్తూ ఉంది. మీ అభిప్రాయ మేమి?

రామచంద్రా! మూడు లోకముల నేవి ఉంటే అందులో విదేహముక్తులు పుట్టినారని అనవచ్చు. అవే లేవు. ముల్లోకము అనే శబ్దార్థమే అసంభవము. ఇంక విదేహముక్తులు అందులో సంసరించుట ఎట్లా పొసగుతుంది? బ్రహ్మయే ముల్లోకముల రూపనుగ మారెను అను బుద్ధి కూడ భ్రాంతియే. కనుక ప్రపంచం అనే శబ్దార్థము కేవలం కల్పనా మాత్రము. ఆకాశమువలె నిర్మలమూ, అద్వితీయమూ అగు చిన్మాత్ర బ్రహ్మమే, ఈ జగత్తు. అంతకంటె వేరు కాదు. ఇది నిజమును గ్రహించిన వాడికి బోధపడును. రామా! నేను ఎంతదూరము విచారించిననూ,

కటకము అనునది బంగారము కంటె వేరు వస్తువుగ కనుబడుట లేదు. కటకమునందు కూడా నిర్మలమయిన బంగారమే కనిపిస్తూ ఉంది. అలాగే తరంగములయందు నీరు కంటె వేరు వస్తువు కనిపించటములేదు. గాలి యందు చలనముకంటె వేరు గోచరించుటలేదు. అలాగే బ్రహ్మకంటె వేరుగ జగత్తు లేదు.

మహర్షీ! ప్రపంచము బొత్తుగా లేదనుకొని ముక్తిని పొందటం ఎలాగో నాకు అర్థం కావడం లేదు. ఆ ఉపాయం కొంచెం చెప్పండి? లోకంలో ద్రష్ట, దృశ్యమూ ఈ రెండూ కలసి ఉన్నాయి. ఇవి రెండూ నశిస్తే మిగిలేది నిర్వాణం అంటారు పెద్దలు. అది ఎలా? స్పష్టంగా కనిపించే ఈ ప్రపంచం లేదనుకోవడం ఎలా? స్వభావసిద్ధమగు బ్రహ్మను తెలిసికొనుట ఎట్లా? ఏ ఉపాయంవల్ల ఈ బ్రహ్మ జ్ఞానం కలుగుతుంది? ఈ జ్ఞానం కలిగిందా, ఇంక మానవుడికి సాధించతగింది ఏమీ ఉండదు. ఇది ఎలా కలుగుతుందో సెలవివ్వండి. అన్నాడు రాముడు.

రామచంద్రా! మిథ్యాజ్ఞానం అనే కలరా వ్యాధి మానవ లోకంలో స్థిరపడింది. బ్రహ్మ విచారం అనే మందువల్లగాని ఆ వ్యాధి నిర్మూలం కాదు. తొందరలో ఈ వ్యాధి కుదర్చటం సాధ్యం కాదు. కొండ శిఖరం ఎక్కినవాడు ఒకే మాటు నేలమీదికి దూకటం అసాధ్యం. ఎత్తైన కొండ మీదికి ఏక కాలంలో ఎక్కడం దిగటం సాధ్యం కాదు. ఆ పనులు క్రమంగా జరగాలి. అలాగే బ్రహ్మ జ్ఞానం కూడా అభ్యాస క్రమంచేత సాధ్యం కావాలి. తొందరగా కలిగేది కాదు. ఈ ప్రపంచ భ్రాంతి శాంతించడానికీ, బ్రహ్మ జ్ఞానం కలగడానికీ, నీకొక కథ చెపుతాను విను. దీనిని వింటివా తప్పక జ్ఞానం కలుగుతుంది. నీవు ముక్తుడవు అవుతావు. ఈ కథ అయిన తరువాత ప్రపంచోత్పత్తి క్రమం చెపుతాను. అందులో నేను ఏదేది పుట్టిందని ప్రతిపాదిస్తానో, దానితోటి అల్లా నీవు ముక్తుడవయివే ఉంటావు. ఉత్పత్తి ప్రకరణంలో నేను చెప్పబోయేది ప్రపంచం పుట్టలేదనీ, అది భ్రాంతి అనీ, ఇంతకంటె వేరు లేదు.

ఈ కనిపించే స్థావరజంగమాత్మకమయిన ప్రపంచం అంతా మహా ప్రళయంలో కనిపించకుండా పోతుంది. ఎక్కడకు పోతుందో తెలియదు.

ఏ మాత్రమూ ఉండదు. కేవలము శూన్యము అవుతుంది. అపుడు నిశ్చలమూ, గంభీరమూ, తేజో విలక్షణమూ, తమో విలక్షణమూ, అవ్యపదేశ్యమూ, అనభివ్యక్తమూ, అయిన సత్పదార్థము మిగిలి ఉంటుంది. అది శూన్యము కాదు. ఆకారము కలది కాదు. దృశ్యము కాదు. దర్శనముకాదు. భూతసముదాయ రూపముకాదు. దాని రూపము చెప్పుటకు అలవికాదు. పరిపూర్ణము. సదసద్విలక్షణము, చిన్మాత్రము, అసంగము, శివము. ఆదిమధ్యాంతరహితము. ఈ సత్పదార్థమునందే వ్యక్తావ్యక్తమయిన ప్రపంచం అంతా స్ఫురించుచున్నది. దీనికి ఇంద్రియాదులు ఏవీ లేవు. అయినా ఇంద్రియముల పనులు నెరవేర్చుకొంటుంది.

ఈ పరమ వస్తువు చిదాలోకరూపము. దీని ప్రకాశచేతనే ముల్లోకములు చూడబడుచున్నవి. ఇదే అజ్ఞాన దశలో విచిత్రమయిన సృష్టిగా కనిపిస్తుంది. అజ్ఞానము నివర్తించినపుడు,ఆద్యంతరహితమైన స్వరూపంతో ప్రకాశిస్తుంది.

యోగులు ఖేచరీ ముద్రయందు కనుబొమ్మలనడుమ దృష్టిని నిగిడ్చి ఉంచుతారు. అపుడు కన్ను అర్ధోన్మీలితంగా ఉంటుంది. దానితో భ్రూమధ్యమునుచూస్తూ ఉంటారు. ఆ స్థితిలో నల్లగుడ్డు అస్ఫుటంగాఉంటుంది. అందువల్ల వాళ్లకు ప్రపంచం స్ఫుటంగా గోచరించదు. సదాభాసంగా (ఉండీ ఉండనట్లుగా) గోచరిస్తుంది. అట్లే ఈ సత్పదార్థము వ్యోమరూపుడయియే (నిరాకారుడయియే) ఉన్నదానివలె కనిపించే స్వరూపంగల ప్రపంచాన్ని చూస్తూ ఉంటాడు. ఈ సదాభాస స్వరూపుడు కూడా ఆ సద్రూపుడే. సర్వవ్యాపకుడయిన ఆ సద్రూపుని కంటె ఈ జగత్తుకు వేరు కారణములేదు. నీటికి తరంగపుంజంవలె ఈ జగత్కార్యం అంతా ఇతనిదే.

అనావృత చైతన్యమయిన ఈ సత్పదార్థము విశేషప్రకాశఘనము. అయినా ఆయా చిత్తభూములందు సామాన్యాకారంగా ప్రకాశిస్తూ ఉంటుంది. దాని వెలుతురువల్లనే జగత్రయం భాసిస్తోంది. ఇది చిన్మాత్రమయిన దీపము. ఈ దీపము లేనిచో ప్రకాశరూపులయిన సూర్యాదులు కూడా అంధకారప్రాయులే. ఇతనియందే మృగతృష్ణికలవలె ప్రపంచ

పదార్థములు కనిపిస్తూ ఉన్నాయి. ఈ చిత్పదార్థము మనోభావముచే (సంకల్పముచే) చలిస్తూ ఉంటే జగల్లక్ష్మి ఉదయిస్తుంది. ఇది ప్రత్యక్షత్వాన్ని చెందినదా ఇంక జగల్లక్ష్మి అంతు చిక్కకుండా పోతుంది. రాత్రి కాలంలో ఉల్ముకము (కొఱవి) మాడుచూ తిరుగుతూ ఉంటే, అజ్ఞానులు చక్రమని భ్రమపడుతూ ఉంటారు. అలాగే చిత్పదార్థం ప్రకాశిస్తూ ఉంటే జగద్భ్రాంతి మానవులకు ఏర్పడుతోంది.

సృష్టి స్థితిలయములనేవి ఈయనకు గొప్పవిలాసములు. అందు సృష్టి ఆయనయొక్క స్పందము. లయము అస్పందము. ఆయనయొక్క పరమార్థ రూపము మాత్రము అతి నిర్మలము. గాలికివలె, స్పందాస్పంద మయమయిన ఉనికి ఈ సత్పదార్థమునకు పేరుచే సంకల్పం బడినదిగాని వస్తుతః యదార్థము కాదు. జ్ఞాని ఎప్పుడూ మెలకువతో ఉంటాడు. అజ్ఞాని ఎప్పుడూ నిద్రలో ఉంటాడు. ముక్తుడు నిద్రాజాగరములు రెండూ లేకుండా ఉంటాడు ఈ ముగ్గురూ ఇతని రూపులే. ఇతడు అంతటా ఎల్లప్పుడూ ఉంటాడు. ఇతనికి స్పందరహితమయిన స్థితి పరమశాంతము. స్పందస్థితి ముల్లోకములు. ఈ స్పందాస్పంద విలాసములతో ప్రకాశించెడి పరమేశ్వరుడు. అద్వితీయుడు పరిపూర్ణుడు. పుష్పములు నశించినా వాటి సారమయిన పరిమళం నశించదు. తెల్లని గుడ్డలో తెలుపురంగు ప్రత్యక్షంగా కనిపిస్తున్నా విడదీసి, గ్రహించటానికి సాధ్యం కాదు. అలాగే శరీరేంద్రియాలు నశించినా అందున్న ఆత్మ నశించదు. సర్వ వస్తువులయొక్క ప్రత్యక్ష జ్ఞానాలయందు ప్రకాశిస్తూ ఉన్నా ఈ ఆత్మను విడదీసి గ్రహించటం సాధ్యం కాదు. ఈ భగవంతుడు మూగవాడుగా ఉంటాడు. కాని మూగ కాడు. అన్నిటినీ మననంచేస్తూ ఉంటాడు (సంకల్పిస్తూ ఉంటాడు) కాని రాయివలె నిర్వికారుడు. నిత్యతృప్తుడయిననూ అనుభవిస్తూఉంటాడు. ఏమీ పనిలేకున్ననూ, ఏమేమో చేస్తూ ఉంటాడు. ఆయనకు శరీరంలేదు. అన్ని శరీరాలు ఆయనివే. అనేక చేతులూ అనేక నేత్రాలూ ఉన్నాయి. ఇంద్రియములు లేకున్నా ఇంద్రియముల పనులు నెరవేర్చును. ఎక్కడా ఉండడు. కాని ప్రపంచం అంతా వ్యాపించి ఉంటాడు. ఇతనికి మనస్సు లేదు. కాని ఈ లోకాలన్నీ ఈతని మనోనిర్మాణరీతులు. ఈ భగవంతుణ్ణి తెలియనందున సంసార సర్పమునుండి భయం ఏర్పడు తోంది. తెలిసి

కొన్నచో అన్ని భయాలూ, అన్ని కోరికలూ దిక్కులంట పగులెత్తుకొని పోతాయి. అపరిచ్ఛిన్నమయిన ఈ సాక్షి చైతన్యము ఉంటేనే చిత్తము యొక్క చేష్టలన్నీ జరుగుతున్నాయి. దీపం వెలుగుతూ ఉంటేనే రంగ స్థలంలో నాట్యం జరుగుతుంది. లేకపోతే లేదు. సముద్రమునుండి తరంగా వర్తాదులు బయలు దేరినట్లు, ఈ పరమాత్మనుండి అనేక పదార్థ భ్రాంతులు బయలు దేరుతున్నాయి. బంగారం, మురుగూ, భుజకీర్తులూ, కడియమూ, అను ఆభరణము లయినట్లు.

రామచంద్రా! నీవు ఏ ప్రకాశవస్తువును సాక్షాత్కారం చేసి కొన్నావో, ఆ ప్రకాశమే నీ ఆత్మ. అతడు అద్వితీయుడు. అట్లే నేను కాని ఈ జనులుగాని తెలిసికొనేయెడల ఆత్మ ఒక్కడే యగును. తెలియని అజ్ఞానికి మాత్రము భిన్నంగా గోచరిస్తాడు ఆత్మ. నీటిలో పుట్టే తరంగ పంక్తి నీటికంటె వేరు కాక పోయినా వేరుగానూ, అభిన్నమయిననూ భిన్నముగానూ, పూర్వమే సిద్ధించి ఉన్ననూ, ఇపుడు పుట్టి సిద్ధించినట్లున్నూ గోచరిస్తుంది. ఈ దృశ్యప్రపంచం కూడా సద్రూపుని యందు అట్లే కని పిస్తుంది. కాలధర్మాలూ, దృశ్యధర్మాలూ, మనోధర్మాలూ, ఇవన్నీ ఈ సాక్షి చైతన్య ప్రకాశవల్లనే నెరవేరుచున్నాయి. ఏ చైతన్యముయొక్క సామర్థ్యంచే శబ్దస్పర్శాదులను తెలిసికొంటున్నాడో, ఆ చైతన్యమే పర మాత్మ. త్రిపుటీ ప్రత్యక్షమునందు ఇమిడి ఉన్న చైతన్యమే పరమ కారణ పదార్థమయిన పరమేశ్వరుడు.

## ౧౦ ప్రళయమునందు మిగిలి యుండెడి వస్తువును వర్ణించుట

మహర్షీ! ప్రలయంలో మిగిలిన వస్తువు నిరాకారమని నేను కూడా విశ్వసించాను. కాని అది శూన్యమూ కాక, అశూన్యమూ కాక, ప్రకా శమూ కాక, తపస్సూ కాక, వెలుతురూ కాక, చిద్రూపమూ కాక, జీవు డూ కాక, మనస్సూ కాక, బుద్ధితత్త్వమూ కాక ఎలా ఉంటుంది. ఏమీ కానిది ప్రపంచమంతా తాను ఎలా అయింది. మీరు అన్న ఈ మాటలచే నా మతి వ్యామోహము చెందింది. దీని నిర్ణయం ఎలా? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! నీవు విషమ ప్రశ్న వేశావు. నా భావమును నీకు గుర్తింపలేదు. నీ సంశయం సులభంగా పోగొట్టుతాను చూడు. మహా ప్రళయంలో ఉన్న సద్వస్తువు ఎలా శూన్యం కాదో విను చెపుతాను. రాతిస్తంభం మీద బొమ్మను చెక్కక పూర్వం ఆ బొమ్మ ఆ రాతి స్తంభంలో ఎలా ఉన్నదో, మహా ప్రళయంలో ప్రపంచం పరమేశ్వరుని యందు అలా ఉన్నది. కాన అప్పటిది శూన్యావస్థ కాదు. ప్రపంచము సత్యము కానీ, అసత్యము కానీ, ఏమయినా, దేనియందు ఇది భాసిస్తూ ఉన్నదో, ఆ వస్తువు సద్రూపము అగునుకాని శూన్యము కానేరదు. శూన్యము ఆరోపమునకు అధిష్ఠానము కాదు. చెక్కని బొమ్మగల రాతి స్తంభము శూన్యంకాదు. సద్రూపమే అగును. ఇది ప్రత్యక్షము. అలాగే మహా ప్రళయస్థితికూడా శూన్యంకాదు. బ్రహ్మమే జగత్తుగా భాసించింది. జగద్భావం నశిస్తే బ్రహ్మ మిగిలి ఉంటుంది. అది శూన్యం ఎలా అవుతుంది? అది శూన్యం అయితే ఈ ప్రపంచం సద్రూపంగా ఎలా భాసిస్తుంది? నిశ్చలమయిన నీటిలో తరంగాలు, ఉన్నాయి అంటారా? లేవంటారా? ఉన్నవనుటకూ వీలు లేదు. లేవనుటకూ వీలు లేదు. అలాగే బ్రహ్మయందు జగత్తు శూన్యమూ కాకుండా, అశూన్యమూ కాకుండా ఉన్నది. అన్నాడు వసిష్ఠుడు.

అయితే మహర్షీ! రాతిస్తంభంలో బొమ్మ ఉన్నట్లు మహా ప్రళయంలో ప్రపంచం బ్రహ్మయందుండి, స్తంభంలో బొమ్మయొక్క ఆకారం వ్యక్తమయినట్లు, బ్రహ్మనుంచి ఈ ప్రపంచం అంతా వ్యక్తమవుతూ ఉంటే శాస్త్ర కర్తలందరూ స్తంభం మీది బొమ్మ విషయంలో విశ్వాసం కలిగి ఉన్నట్లు బ్రహ్మయందలి ప్రపంచం విషయంలో విశ్వాసం కలిగి ఉండరేం? బ్రహ్మ విషయంలో అందరికీ ఇంత వ్యామోహం ఎందుకు? అని ప్రశ్నించాడు రాముడు.

రామా! లోకంలోని మానవులు స్తంభం ఉన్న చోటును చూస్తున్నారు. దానిమీద బొమ్మను చెక్కువానిని చూస్తున్నారు. వానిచేతిలో ఉన్న సాధనాలను చూస్తున్నారు. స్తంభమును చూస్తున్నారు. దేశ కాల క్రియలను అన్నిటినీ చూస్తున్నారు. అందువల్ల అక్కడ అందరికీ విశ్వాసం

ఉంది. అక్కడ ఎవ్వరూ వ్యామోహ పడరు. బ్రహ్మ దేశ కాల వస్తు పరిచ్ఛేద శూన్యము. వానియందు ఈ సామగ్రీ సంపత్తి లేదు. ఎవరునూ చూచుట లేదు. అందువల్ల అందరూ బ్రహ్మ విషయంలో మోహపోతు న్నారు. ఇంతకంటె వేరే కారణాలేదు. అయితే సాధన సామగ్రీ సంపత్తి వల్ల పుట్టింది స్తంభంలో బొమ్మ. సాధన సామగ్రీ సంపత్తి లేకుండా పుట్టింది జగత్తు ఈ భేదం ఉన్నప్పుడు ఈ రెంటికీ సామ్యం ఎలా అని నీవు సందేహిస్తావు. అలా కాదు. స్తంభంలో ఉన్న బొమ్మకు స్తంభముయొక్క సత్తాకంటె వేరు సత్తా ఎలా లేదో, అలాగే ప్రపంచానికి కూడా బ్రహ్మ సత్తాకంటె (ఉనికికంటె) వేరు సత్తా (ఉనికి) లేదను అంశంలోనే ఈ రెంటికీ ఉపమానం. అన్ని అంశములలో కాదు. కాబట్టి బ్రహ్మయందు పర మార్థంగా (నిజంగా) ప్రపంచం పుట్ట లేదు. నశించ లేదు. కేవలం సద్రూప మయిన బ్రహ్మ స్వరూపంలోనే ఉన్నాడు. వీనియందు శూన్యత్వా శూన్యత్వములు లేవు. ఇవి కల్పితములు. ఇతర వస్తువులయందున్న శూన్యత్వా శూన్యత్వములను పురస్కరించుకుని ఆ శబ్దములు ఇచ్చట వాడబడినవి. నిజముగా బ్రహ్మయందు శూన్యత్వా శూన్యత్వములు లేవు. అలాగే భూతవికారమగు సూర్యానలేందు తారాదుల ప్రకాశ కూడ ఇచ్చట లేదు. ప్రకాశాభావరూపమయిన తమస్సు ఇక్కడ లేదు. ఈ బ్రహ్మతత్త్వము స్వయం ప్రకాశము. ఆకాశోదరమువలె అతిస్వచ్ఛము. తమః ప్రకాశ సంబంధరహితము. మారేడు కాయకూ, దాని లోపలి గుజ్జుకూ భేదము లేనట్లు బ్రహ్మకూ జగత్తుకూ భేదము లేదు. నీటిలో అలలూ, మట్టిలో కుండలూ, ఉన్నట్లు బ్రహ్మలో జగత్తు బ్రహ్మకారంగానే ఉంది. జగత్తునకు అధిష్ఠానమయిన బ్రహ్మ శూన్యము కాదు.

భూ జలాముల దృష్టాంతం పూర్తిగా బ్రహ్మయందు సరిపోదు. మట్టిసాకారం కుండా సాకారమే. ఈ కుండా తన ఆకారమును విడిచి మట్టి యొక్క ఆకారంతో మట్టియందు ఉంటుంది, అలాగే నీటిలో తరంగాలు కూడా నీటి యొక్క ఆకారంతో ఉంటాయి. బ్రహ్మ నిరాకారం. అందులో జగత్తు లీనమగుటచే అది కూడా నిరాకారంగానే ఉంటుంది. ఇక్కడ ఈ భేదం ఉంది. సూర్య కిరణంలోని వేడిమి అనుభవించే వాడికే గోచరిస్తుంది. అలాగే చిదాకాశమునందలి చిన్మాత్రతత్త్వముకూడా విషయ

వాసనలు లేని అనుభవజ్ఞునకే గోచర మవుతుంది. చిదచిదాది శబ్దములు ప్రత్యగాత్మయందు లక్షణచే వర్తించునుగాని, ముఖ్యవృత్తితో వర్తించవు. కాబట్టి బాహ్యాభ్యంతర ప్రపంచం అంతా బ్రహ్మమయం కాని, వేరు కాదు. ఈ ప్రపంచం పంచమభూమికలో చేరినవానికి స్వప్నవంటిది. షష్ఠ సప్తమ భూమికలలో నున్నవారికి తురీయము.

కాబట్టి పంచమ భూమికలో ఉన్న యోగి వ్యవహారదశలో ఉన్నా ప్రశాంతిమయిన మనస్సు గలవాడై అన్ని సంస్కారములకూ పెట్టెలాగ ఉంటాడు. నానాఽకారములుగల తరంగాలన్నీ ఒకే ఆకారంగల జల రూపంతో ఉండటం లోకానుభవ సిద్ధం. ఇలాగే నిరాకారమయిన బ్రహ్మయందు నానాఽకారములుగల సంస్కారము లుండటం విరుద్ధంకాదు.

జీవనిరాకరణము :— పరిపూర్ణమయిన ఈ బ్రహ్మనుండి ఉపాధి భేదముచే జీవులు అనేకులు బయలుదేరుచున్నారు. వీరు కూడా నిజంలో పరిపూర్ణులే. సాకారంగల వస్తువు పూర్ణంగా ఉండదు. పూర్ణం కావా లంటే నిరాకారమే కావాలి. "రూపం రూపం ప్రతిరూపోబ భూవ తదస్య రూపం ప్రతిచక్షణాయ" అన్నట్లు పరిపూర్ణమయిన బ్రహ్మ తనరూపాన్ని తాను తెలుసుకోటానికి జీవరూపంతో భాసిస్తున్నాడు. అందుచే పూర్ణ మయిన బ్రహ్మ పూర్ణంగా ఉన్నందున జగత్తు అనేది వేరే పుట్టలేదు. ఒకవేళ పుట్టిందనుకున్నా అది బ్రహ్మరూపమే. కాబట్టి జగచ్ఛబ్దార్థము చిదేకరసమని తేలింది. చిత్తము, చేత్యము అనే వస్తువులు అసత్యములనీ, సత్యములుగా తోస్తూ ఉన్నవనీ అర్థమయింది. పరమార్థంలో ఉపాధులే లేకపోతే ప్రతిబింబరూపులయిన జీవులుకూడా లేరు. బ్రహ్మ అణువుకంటె అణువు. మహత్తుకంటె మహత్తు. దేశకాలాది పరిచ్ఛేద రహితుడు. వ్యాపకుడు. ఆద్యంతరహితుడు. దృశ్య సంబంధరహితుడు. ఇతనియందు నిజంలో (పరమార్థంలో) విషయములను ప్రకాశింపజేయుట అనే చిత్త్వమే లేదు. ఇంక అనుకూల ప్రతికూల విషయములను అనుభవించే జీవత్వం ఎక్కడిది? కాబట్టి అతనియందు, చిత్తమూ, చేత్యమూ, బుద్ధీ, ఇంద్రి యములూ, వాసనలూ, జీవత్వమూ, అనేవి ఏవీ లేవు. కాబట్టి రామచంద్రా! మా దృష్టిలో ఆకాశము కంటె శూన్యమయిన పూర్ణ బ్రహ్మమొక్కటే ఉన్నది. అంతకంటే వేరే జగత్తులేదు. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! పరమార్థమయిన బ్రహ్మయొక్క రూపం మళ్లీ ఒక్కమాఱు చెప్పండి మాటిమాటికి వింటే కాని నాకు జ్ఞానం నిలవడంలేదు. అన్నాడు రాముడు.

రామచంద్రా! మహాప్రళయంలో సర్వకారణమగు పరబ్రహ్మ మిగిలి ఉంటాడు. వానిస్వరూపం చెపుతాను విను. ౧. నిరోధ సమాధిలో మనో వృత్తులను నశింపజేసికొనిన తరువాత సాక్షాత్కారమయ్యే స్వప్రకాశ సద్రూప పదార్థమే బ్రహ్మము. ౨. నిర్వికల్ప సమాధిలో త్రిపుటీ లయమునకు సాక్షిరూపుడు బ్రహ్మ. 3. సమాధినుంచి వ్యుత్థానము చెందక పూర్వము, ఇక ముందు జీవరూపం చెందబోయ్యే చిత్తు విషయోన్ముఖం కానపుడు. ఏ రూపంలో ఉంటుందో అట్టి నిర్మల శాంత చిద్రూపము బ్రహ్మ యొక్క రూపము. ४. బ్రతికి ఉన్న వాని వంటికి గాలి సోకినప్పటికీ, దాని స్పర్శ తెలియకుండా అఖండ బ్రహ్మాకారా వచ్ఛిన్న అపరోక్ష వృత్తిలో ఉన్న చిత్తమునకు ఏ రూపం గోచరిస్తూ ఉంటుందో అది బ్రహ్మ యొక్క రూపం. ఇది యోగులకు మాత్రమే గోచరిస్తుంది.

ఇక యోగాభ్యాసం లేని వారికిగూడ గోచరించే బ్రహ్మ రూపం చెపుతాను విను. ౧. స్వప్నదర్శనం లేక, నల్లులబాధ, దోమలబాధ లేక, మనో విశ్రాంతికి హేతువయిన దీర్ఘనిద్రలో మనస్సు జాడ్యం లేకుండా (మూఢత్వం లేకుండా) ఉంటే, ఏ తత్త్వం గోచరిస్తుందో, అదే ప్రళయంలో మిగిలేది. అదే బ్రహ్మయొక్క రూపం. ౨. ఆకాశమునకు హృదయము (తత్త్వము) శూన్యత్వము. గాలియొక్క తత్త్వము, లోపల వెలుపల నిండి యుండుట. రాతియొక్క తత్త్వము ఘనత్వము. (బరువు తనము.) అలాగే విషయ సంబంధరహితమయిన పరబ్రహ్మయొక్క తత్త్వము. చిద్రూపత్వము. ఆ చిత్త్వమే బ్రహ్మయొక్క రూపం. 3. వేయేల! సర్వప్రాణులకు, విషయాలనూ, మనస్సునూ విడచినపుడు ఏ స్థితి మిగిలి ఉంటుందో, అదియే బ్రహ్మయొక్క రూపం. ४. అన్నమయాది పంచకోశాత్మలలో ఆనందమయాత్మకుగూడ లోపల ఉండే అఖండ సచ్చిదానందము బ్రహ్మయొక్క రూపము. ౫. లింగ సమిష్టి రూపమైన

అవ్యాకృతాకాశమునకు లోపల నుండు అఖండ సచ్చిదానందము బ్రహ్మ యొక్క రూపము. ౮. చాక్షుషాది ప్రత్యక్షములయొక్క లోపల ఉండు చైతన్యము బ్రహ్మయొక్క రూపము.

ఈ విషయమంతా, తైత్తిరీయోపనిషత్తులో "తస్య ప్రియ మేవ శిరః" మోదో దక్షిణః పక్షః "ప్రమోద ఉత్తరః పక్షః" "ఆనంద ఆత్మా" "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను అనువాకమందూ, బృహదారణ్యకంలో, "ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తంచైవ అమూర్తంచ, అని ప్రారంభించి, "అథాత ఆదేశో నేతినేతి" అను వరకు ఉండు మంత్రములయందూ, "ప్రతి బోధ విదితం మతం" అను తలవకారోపనిషత్తు నందునూ, ప్రతిపాదింప బడినది.

౭. బుద్ధి వృత్తికీ, అర్థస్ఫురణమునకూ, విషయములకూ, అజ్ఞాన మునకూ సాక్షీ భూతమయిన చైతన్యము బ్రహ్మయొక్క రూపము. ౮. ప్రపంచము నిజముగా పుట్టకున్నా ఎవనివల్ల పుట్టినట్లు భాసిస్తున్నదో, అభిన్నమయినా ఎవనికంటె భిన్నముగా స్ఫురిస్తున్నదో, ఆ పరమార్థ చైతన్యమే బ్రహ్మ యొక్క రూపము. ౯. మాయాశక్తితో ప్రపంచ వ్యవహారం జరుపుచున్ననూ, పాషాణమువలె నిశ్చలముగా ఉండుట బ్రహ్మ యొక్క రూపము. ౧౦. నిత్యపరిపూర్ణమయిననూ, ప్రపంచ మునకు అవకాశము నిచ్చుటచే ఆకాశమువలె శూన్యముగ నుండుట బ్రహ్మయొక్క రూపము. ౧౧. "వేద్యము, వేదనము, వేత్త" (తెలియ తగినది, తెలిసికొనుట, తెలిసికొనువాడు.) మొదలగు త్రిపుటీ జాతము పుట్టుటకూ, నశించుటకూ, వివర్తకారణమయిన సచ్చిదానందము బ్రహ్మ యొక్క రూపము.

స్వప్న జాగరములు రెండూ లేనపుడు మనస్సుకు, ఏ సుషుప్తాత్మ స్వరూపముండునో అదే స్థావర జంగమ ప్రళయమందు కూడా మిగిలి ఉంటుంది. స్థావర పదార్థములయందలి అచలస్వభావము, జ్ఞానమయము అయితే ప్రళయకాలంలో ఉండే పరమాత్మకు సాటి అవుతుంది. అనగా నిశ్చలమయిన స్థావర పదార్థములు జ్ఞానరూపము లయితే ప్రళయకాలం

లోని పరమాత్మకు దృష్టాంతం అవుతాయి అని భావం. కాబట్టి రామా! సర్వోపాధి లయమునకు అధిష్ఠానమయిన సచ్చిదానంద బ్రహ్మ మహా ప్రళయకాలంలో మిగిలి ఉంటాడని గ్రహించు, అన్నాడు వసిష్ఠుడు.

## ౧౧ పరమార్థ వర్ణనము

అంతా విన్నాడు రాముడు. మళ్లీ సంశయం కలిగింది. చెప్పిన దాన్నే మళ్లీ చెప్పమన్నాడు. అడిగిన విషయమే మళ్లీ అడిగాడు. ఇది తెలియక కాదు, బోధపడక కాదు. తగినకారణం ఉండి అడిగాడు ఇలా. మహర్షీ! ప్రళయకాలంలో ప్రపంచమునకు వేరే సత్త (ఉనికి) లేకపోవు గాక. అపుడు బ్రహ్మ మాత్రమే మిగిలి ఉండు గాక. సృష్టి సమయమున ప్రపంచమునందు ప్రళయముకంటె విలక్షణంగా స్వతంత్రమయిన ఉనికి (సత్త) సర్వానుభవ సిద్ధం. (అందరిచే చూడబడుచున్నది.) ఆ సత్తతో (ఉనికితో) బ్రహ్మనుండి నివర్తించే ప్రపంచము మరొకచోట ఉండుననియే ఊహించవలెను. "నాభావో విద్యతే సతః" ఉన్నదానికి అభావము (లేక పోవుట) ఉండదని మీరే చెప్పి ఉన్నారు. కాబట్టి అది ఎక్కడ ఉంటుందో, అదే ప్రపంచానికి పరాయణము. (అధిష్ఠానము) దానిని చెప్పండి. అని అడుగదలచి, స్వామీ! చతుర్దశ భువనాత్మకమయిన, దేవనరసురతిర్యగాది ప్రాణి జాతముతో విస్తృతమయిన, ఈ ప్రపంచము ప్రత్యక్షంగా స్పష్టంగా కనిపిస్తూ ఉంది. ఉన్నట్లు దృఢపడుతోంది. దీనికి ప్రళయం కలిగితే ఇది ఎక్కడ ఉంటుందో చెప్పండి? అన్నాడు రాముడు.

రామచంద్రా! గొడ్డురాలి బిడ్డ ఎక్కడ నుంచి వస్తాడు? ఎలా ఉంటాడు? ఎక్కడికి వెళ్లుతాడు? గగన కాననము (ఆకాశ అడవి) ఎక్కడ నుంచి వస్తుంది? ఎలా పెరుగుతుంది? కొంచెము చెప్పు? అన్నాడు వసిష్ఠుడు.

స్వామీ! గొడ్డురాలి బిడ్డా, ఆకాశ అడవీ ఈ రెండూ లేవు. ఉండ బోవు ఈ రెంటికీ కనిపించుట, కనిపించకుండుట లేదు. ప్రపంచము అలా కాదు ఇది కొంతకాలం కనిపిస్తూ ఉంది కొంత కాలానికి కనిపించకుండా

పోతోంది. కాబట్టి నా పరిశ్న సరియయినదే. మీరు నా మీద వేసిన ప్రశ్న సరియైనది కాదు. విషమ పరిశ్న అన్నాడు రాముడు.

రామచంద్రా! గొడ్డురాలిబిడ్డ, ఆకాశ అడవీ, ఈ రెండూ ఎప్పుడూ ఎలా లేవో అలాగే నీకు కనిపించే (దృశ్యమగు) యీ మొత్తం ప్రపంచం కూడా ఎప్పుడూ లేదు. కాబట్టి ఆ రెంటితో యీ ప్రపంచానికి సామ్యం ఉంది. నా పరిశ్న విషమం కాదు. దానికి ఉనికి లేదు. కనుకనే అది పుట్టనూ లేదు. చావనూ లేదు.

స్వామీ! ప్రపంచం "గొడ్డురాలి బిడ్డ వంటిది." "ఆకాశ వృక్షము వంటిది." అను వాడుకలు లోకంలో కలవు కదా! అవి బొత్తుగా లేకపోతే వాటికి ఉపమానత్వమే లోకములో ఉండదు. ఉపమానత్వము లోక ప్రసిద్ధమై ఉంది. కనుక వికల్పరూపమయిన వంధ్యా పుత్రజ్ఞానము, ఆకాశ వృక్షజ్ఞానము చావు పుట్టువులను పొందుతోంది. కనుక అవి రెండూ ఈ ప్రపంచానికి ఉపమానములు కాదగును, కాబట్టి పరిపంచానికి జన్మ నాశములు తప్పనివి. కనుక నాశదశలో పరిపంచము ఎవనియందు ఎట్లు ఉండునని నేనడుగుట సబబు. అన్నాడు రాముడు.

రామచంద్రా! పరిపంచానికి వంధ్యా పుత్రుడూ, నభోవృక్షమూ ఈ రెండే దృష్టాంతములు. వాటి వికల్పకల్పనలు దృష్టాంతములు కావు. అనగా వికల్పరూపములైన వాటి జ్ఞానములు దృష్టాంతములుకావు. లోకంలో ఉపమేయ కోటిలో చేరని వస్తువు ఉపమానముగా దొరకకపోతే, ఉపమేయకోటిలో చేరినదానితోనే, సామ్యం చెప్పుటకద్దు. అది అనన్వయాలంకారమువంటిదవుతుంది. దానివలన దీనికి మరొకటి ఉపమానములేదని తేలుతుంది. కాబట్టి యీ జగత్తునకు వంధ్యాపుత్ర నభోవృక్షములే ఉపమానాలు. కనుక పరిపంచానికి వేరు ఉనికి అనునది నేను చెప్పిన గొడ్డురాలి బిడ్డయొక్క ఉనికి వంటిదే. ఇందు విరోధములేదు. గొడ్డురాలి బిడ్డవలె, ఆకాశ పుష్పమువలె, అను వాడుకలు కలవు. లేనిదానికి ఉన్న వస్తువు దృష్టాంతముగా దొరకనిచో, లేనిదానినే దృష్టాంతంగా చూపుట విరుద్ధముకాదు. కనుక వంధ్యా పుత్రుడువలె పరిపంచము వేరుగ లేదు.

ఇది నిజము. బంగారపు కటకమునందు కటకత్వము లేదు. ఆకాశమునందు దానికంటె వేరుగ శూన్యత్వములేదు. కాటుకయందు దానికంటె వేరుగ నలుపుతనము లేదు. మంచుయందు మంచుకంటె వేరుగా చల్లదనము లేదు. ఇవి అన్నీ వాటికంటె వేరుగా ఉన్నట్లు లోకంలో కనిపిస్తున్నాయి. అయినా, యిది అసత్యమే. భ్రాంతియే. అల్లే పరమాత్మయందు కూడ పరమాత్మ కంటె వేరుగా ప్రపంచం లేదు. వేరుగా ఉన్నట్లు కనిపించుగాక. ఆ కని పించటం మేము భ్రాంతి అంటాము.

మంచు కంటెను, చంద్రునికంటెను, చల్లదనము ఎలా వేరు కాదో బ్రహ్మకంటె ప్రపంచం అలా వేరు కాదు. బ్రహ్మయే భ్రాంతివలన ప్రపంచాకారంగా భాసిస్తూ ఉంది. మరుమరీచికానదిలో నీరు లేదు. ద్వితీయ చంద్రునియందు చంద్రత్వము లేదు, నిర్మల బ్రహ్మయందు కనుపడుతూ ఉన్నా ప్రపంచమూ లేదు. ఏది మొదట లేనే లేదో, ఏది పుట్టుటకు కారణమే లేదో అది ఉన్నట్లు గోచరిస్తున్నా లేనిదే. దానికింక నాశమేమిటి? ప్రపంచముయొక్క ఉత్పత్తికి కారణమెట్లు లేదో వివరిస్తాను విను. పృథివ్యాది భూతపంచకము జడము. దానికి జడమే కారణం కావాలి. బ్రహ్మ జడం కాదు. చేతనం. కాబట్టి బ్రహ్మవల్ల జగత్తు పుట్టిందనుట చెల్లదు. నీడవల్ల ఎండ కలిగినదని అనుట లోకములో చెల్లునా? కనుక కారణమే లేనందున కార్యమగు ప్రపంచము పుట్టనే లేదు. కాని యివి అంతా నేను నీకు పరిణామ దృష్టితో చెప్పినాను. వివర్త దృష్టిలో విరుద్ధ ఆరోపముకూడ సంభవిస్తుంది. కనుక చేతనమైన బ్రహ్మ యందు జడమైన ప్రపంచారోపము కుదురుతుంది. అయినా కారణమైన ఆ బ్రహ్మమే యీ జగద్భావముతో ఉన్నందున కార్యమైన జగత్తునకు వేరుగా ఉనికి లేదు. కొందరు అజ్ఞానమే జగత్తునకు పరిణామ కారణమని అంటారు. వారి మతమును అవలంబించినా, ఆ అజ్ఞానము, చైతన్యమును జగద్రూపముగా కనుపరచుచున్నదనాలి. అపుడు చిత్తు, చిదాభాసమైనట్లు. కనుక అజ్ఞానము బ్రహ్మను జగద్రూపంగా వివర్తము (మార్పు) చేయు చున్నదని అర్థమైనది అజ్ఞానము యొక్క పరిణామము సంవిత్తు యొక్క వివర్తమని మన కందరకు స్వప్నదశలో ప్రసిద్ధమే. కనుక స్వప్నమునందు జగద్భ్రాంతి ఎట్లు చిదాభాసమో అట్లే సృష్ట్యాదులందు బ్రహ్మయందు

జగద్భావము కూడా, సంవిదాభాసమే. కనుక ప్రపంచము బ్రహ్మమాత్రమే. బ్రహ్మకంటె వేరు కాదు. అని మేము ప్రతిజ్ఞచేసిన విషయము స్థిరమయింది. కనుక యిదెప్పుడునూ ఆత్మయందు పుట్టనూలేదు. చావనూ లేదు. ద్రవత్వమే నీరు. చలనమే గాలి. వెలుతురే ప్రకాశము. బ్రహ్మయే జగత్తు. పరున్నవానికి కలలో ఒక పెద్దపట్టణము తన ఆత్మయందే కనిపించి నట్లు, పరమాత్మయందు ఈ జగత్తు భాసించుచున్నది. ఇది నిజము. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! ఈ ప్రపంచము కలవలె అసత్యమయితే కల్పాంతం వరకూ వ్యవహారం గోచరమగుచూ, ఎలా దృఢపడి ఉంది? కాక దృశ్యం ఉంటేనే ద్రష్ట ఉంటాడు. ద్రష్ట ఉన్నపుడు దృశ్యం తప్పదు. ఇందులో ఒక్కటి ఉంటే రెంటికీ బంధం ఉన్నట్లే. ఒకటి నశిస్తే రెంటికీ మోక్షం కలిగినట్లే. కాని ఆ ఒక్కటీ నశించడమే దుర్ఘటం. దృశ్యము బొత్తుగా లేదను జ్ఞానము కలిగేటంతవరకూ, దృశ్యము నశించదు. ఈ జ్ఞానము కలుగుట అసంభవం. దృశ్యబుద్ధి పుట్టుచునే ఉంటుంది. కాబట్టి ముక్తి జ్ఞానము దుస్సాధ్యం. ఎందువల్ల అంటే, దృశ్యం నశించాలంటే ముందు దృశ్యం పుట్టి ఉండాలి. పుట్టిన దృశ్యమే విద్యవల్ల నశిస్తుందని అనుకున్నా కొంతకాలం అనుభవించిన ఆ దృశ్యానుభవంవల్ల కొంత సంస్కారం ఏర్పడుతుంది. ఆ సంస్కారం కొంత కాలం ఉండి మరల సంసారానర్థాన్ని తెచ్చిపెడుతుంది. ఇలా ఈ బంధం ఎన్నటికీ తెగదు. దృశ్యం అంతటా ఉన్నది. ద్రష్ట అంతటా ఉన్నాడు. దృశ్యములేనితావే ద్రష్టకు దొరకదు. కాబట్టి దృశ్యానుభవము ద్రష్టకు తప్పదు. అది తప్పనపుడు దృశ్యము లేదను బుద్ధి ద్రష్టకు పుట్టుట అసంభవం. దృశ్యము పుట్టకపోతే చిదూపుడయిన ద్రష్టకు దృశ్యసంబంధమేలేదుకనుక ముక్తికలిగేది. దృశ్యము అనుభవగోచరమగుచున్నది కాన పుట్టలేదనుట చెల్లదు. కాబట్టి ద్రష్టకు ముక్తి సున్న అని నా సందేహం. కనుక మీరు, సుయుక్తులతో, నా సందేహాన్ని తీర్చి, దృశ్యము బొత్తుగా లేదను జ్ఞానం కలిగెడి మార్గమును నాకు ఉపదేశించండి. మీరు ఆత్మవేత్తలలో అగ్రగణ్యులు. అన్నాడు రాముడు.

రామచంద్రా! నీకు ప్రపంచం ఎంత దృఢంగా (స్థిరంగా) కనిపిస్తున్నా, అది లేనిదే. లేనిదే ఉన్నట్లు భాసిస్తోంది. దీనికి స్వప్న సామ్యం నిజం. చాలకాలంనుంచి మీకు అనుభవంలో ఉండటంవల్ల దీనిమీద మీకు ఇంతగా దృఢజ్ఞానం కలిగింది. ఇది అనుభవదార్ఢ్యంకాని ప్రపంచం యొక్క దార్ఢ్యంకాదు. ఈ విషయం అంతా నీకు మండపోపాఖ్యానము మొదలగు కథలతో విస్తరించి చెపుతానువిను. పూర్వులయొక్క చరిత్రను నీకు వర్ణించి చెపితే కాని నీ మదిలో దృశ్యబుద్ధి (ప్రపంచబుద్ధి) తొలగదు. అపుడు కాని నీ మనస్సు తత్త్వమునందు విశ్రాంతి చెందదు. లోక వ్యవహారము నెరవేరదు. ప్రపంచ సృష్టి అంతా భ్రమ అని తెలిసికొని, ఆ జ్ఞానంతో నీవు లోకవ్యవహారమును జరుపుకుంటావు. ప్రపంచం భ్రమ అనే జ్ఞానం కలిగితే ఎవడు ఎన్ని వ్యవహారములు జరిపినా వాడిని అవి బాధించవు. వాటియందు వాడికి రాగద్వేషాలు అంకురించవు. రాగద్వేషాలు లేని పనులు ఎన్ని జరిపినా ఏమీ బాధలేదు. గట్టికొండను బాణాలు ఏమీ చెయ్యలేవు. కాబట్టి రామా! ఉన్నది ఒక్క ఆత్మయే. రెండవ వస్తువు అంతా కల్పితం. జగత్తు ఎలా పుట్టిందో చెపుతా విను. అని ప్రారంభించారు వసిష్ఠులు.

## ౧౨ జగదుత్పత్తి వర్ణనము

పరమపావనుడయిన పరమాత్మనుండి ఈ జగత్తుపుట్టింది. లోకంలో నిద్రించిన మానవుని ఆత్మయే స్వప్నముగా మారుచున్నది. అలాగే బ్రహ్మకూడా ప్రళయంలో సుషుప్తాత్మగా ఉండి సృష్టి సమయంలో స్వప్నాత్మగా మారుచున్నాడు. అదే ప్రపంచం. వ్యష్టిలో ప్రతిమానవుడూ ఎట్లో, సమష్టిలో బ్రహ్మకూడా అట్లే. లోకములో స్వప్నము ఒక్కొక మానవుని వాసనా మాత్రమున తయారయినందువల్ల అది వెంటనే మిథ్య అని తోస్తోంది. దాని మీద దృఢమయిన విశ్వాసము ఎవ్వరికీ లేదు. బ్రహ్మ సృష్టమయిన ప్రపంచము సర్వవాసనా కార్యము, అనగా అందరి ప్రాణుల సంస్కారమువలన పుట్టింది. అందుచేత దీనియందు గట్టినమ్మకం అందరికీ. ఇది మిథ్య అని ఎవ్వరూ అనుకోనరు. శాస్త్రము చెప్పినా విశ్వసించరు. కాని ఈ రెంటికీ (స్వప్న, జాగ్రత్ప్రపంచములకు) ఇంతే తేడా.

ప్రళయంలో బ్రహ్మ సర్వాత్మకుడు. సర్వసుషుప్త సమష్టి రూపుడు. ప్రకాశరూపుడు. చిన్మణి. ప్రపంచం అంతా ఈతని సత్తా మాత్రాత్మకము. అట్లుండి వాని నుంచియే చేత్య (విషయ) రూపముగా పుటుతోంది ఇది. ఎలా గంటే, అఖండ చిద్రూపమయిన పరబ్రహ్మకు సృష్టి ప్రారంభంలో ముందు పుట్టబోయే పదార్థములనుగురించి, ఒక విధమయిన ఊహ (ఆలోచన) కలిగింది. "సఈక్షత లోకాన్నుసృజై" అను శ్రుతి ఇందుకాధారము. అంతట ఆ అఖండ చైతన్యము ఈ ఈక్షణాత్మకమయిన వృత్తితో కూడుకొని సర్వజ్ఞుడూ, ఈశ్వరుడూ అను పేరును పొందినది. నిర్ధర్మకమయిన ఆ బ్రహ్మమందు పేరు పెట్టుటకు తగినధర్మ మేర్పడింది. అందుచే ఆ పేరులు కలిగినవి. తరువాత ఆ వృత్తి (ఈక్షణవృత్తి) చాలకాలము అనువృత్తముకాగా, ముదిరి గట్టిపడి, తుదకు తనయొక్క అపరిచ్ఛిన్నాత్మభావమునుగూడ మరచి, తన పదవిని విడచి, ఆ చైతన్యమే, హిరణ్యగర్భుడను పేరును బడసినది. ఇతడే ఆది జీవుడు. ఇంత మాత్రమున బ్రహ్మయొక్క స్వరూపమునకు భంగము కలుగలేదు. భావనామాత్రమున పరబ్రహ్మము క్రమంగా సంసరించుటకు అభిముఖమయినది కాని, వికారమును పొందలేదు. వికారమును పొందితేకాని స్వరూపానికి భంగం కలగదు. త్రాడు త్రాడుగానే ఉండి దానిమీద సర్పము తయారయినట్లు, బ్రహ్మ అలాగే ఉండి అతనియందు ఆది జీవుడయిన హిరణ్యగర్భుడు ఉదయించినాడు.

ఆపైన ఈ ఆ హిరణ్యగర్భునినుండి సూర్యాదులు ఆధికారిక పురుషులు పుట్టినారు. తరువాత ఆకాశాది పంచ మహాభూతములు పుట్టినవి. పిదప అహంత (అహంకారము) అహమభిమానము) పుట్టినది. ఇదియే ప్రపంచస్థితికి ముఖ్యకారణము. ఇది మొదలుకొని ద్విపదార్థ పర్యంతమైన కాలము పుట్టినది. ఇట్లు ఆకాశ, అహంకార, కాల, సృష్టులు కేవలం హిరణ్యగర్భునినుండి కలుగలేదు. ఆవేషముతోనున్న పరమాత్మనుంచియే కలిగినవి. ఈ ఆకాశమే సూక్ష్మరూపముతో ఘనీభావమును చెంది శబ్దతన్మాత్రమయినది. దీనినుండి నిఖిలవేదరూపములయిన శబ్దములన్నీ పుట్టినవి. ఇట్లు క్రమంగా వేదభావమును పొందిన పరమాత్మ నుండి భూరాదిలోకమును, అందలి నిఖిల ప్రాణులును పుట్టుచున్నారు. ఆకాశ

భావమును పొందిన పరమాత్మనుండి వాయుభూతముదయించినది. ఇదియే వ్యష్టిరూపములో ప్రాణవాయువును పొంది పదునాలుగు లోకములలోని భూతజాలమును వ్యాపించియుండును. నిఖిల ప్రాణుల క్రియాశక్తి అంతయు వాయుభూతముమీద ఆధారపడి ఉన్నది. ప్రాణవాయువును ధరించిన భూతములే జీవులనబడుచున్నారు. ఈ వాయుభూతము సూక్ష్మరూపముతో ఘనీభవించి స్పర్శతన్మాత్రమగుచున్నది ఇదియే ఆవహము, ప్రవహము మొదలగు ఏకోన పంచాశత్ (49) పవనస్కంధ విభాగముతో సర్వపదార్థముల క్రియాశక్తికి కారణమగుచున్నది. ఈ వాయుభావమును బొందిన పరమాత్మయే ప్రకాశాత్మకమగు భావనచే తేజోభూతమగుచున్నాడు. దీనివల్ల రూపతన్మాత్రము ఏర్పడుచున్నది. ఇదియే ప్రకాశరూపులయిన సూర్యచంద్ర నక్షత్ర విద్యుదాది రూపములతో విరాజిల్లుచున్నది. రూప ప్రపంచమంతా దీని విలాసమే. తరువాత జలభూతము. దానికి రసతన్మాత్ర. మధుర ఆమ్లాది రసములకు ఇది బీజము. సరిన్నదీ సముద్రాదులు దీని విలాసములు. తదుపరి జలభాగమును పొందిన పరమాత్మయే పృథివీ సంకల్పముచే పృథివీ భూతమై, గంధ సంకల్పముచే గంధతన్మాత్రమగుచున్నాడు, బ్రహ్మాండ గోలకములోని మనుష్యాద్యాకారములన్నియు దీని విలాసములు. భూత కోటికి ఇది ఆధారము.

నీటిలో బుడగలవలె ఉన్న ఈ తన్మాత్రలు పరమాత్మచే సంకల్పింపబడినవై పంచీకరణము జెంది బ్రహ్మాండాకారమును జెందుచున్నవి. ఇట్లు ఇవి కొంతకాలము కలిసియుండును. మరల విడిపోవును. మహాప్రళయములో ఇవన్నియు నశించునంతవరకు ఇది శుద్ధ చిద్రూపములని తెలియలేము. మర్రికాయలోని చిన్న చిన్న గింజలలో మర్రివృక్షములు ఇమిడియుండి స్థూలరూపముతో పుట్టుచున్నట్లు, ఈ తన్మాత్రలు సృష్టికిపూర్వము సంవిన్మాత్రముగా ఉండి ఆవల స్థూలరూపమున బుట్టుచున్నవి. ఈ తన్మాత్రలు అతిసూక్ష్మతమములు. వీటియందు స్థూల పదార్థములు ఇమిడియుండుట ఎట్లని శంకకలుగును. కాని నిజముగా వాటిలో ఇమిడి లేవు. అలా ఉన్నట్లూ మరల పుట్టినట్లూ మాయచే కనిపించుట మాత్రమే. స్వప్నంలో అతి సూక్ష్మమయిన నాడీ ఛిద్రములలో అతి విశాలమయిన జగత్తు కనిపించుచూ ఉన్నది. ఈ భూతములయొక్క స్థూలదశ అంతరించినా

స్థితియొక్క సూక్ష్మదశకు అపాయములేదు. వివర్తకారణము ఎన్నటికీ వికారమును జెందదు. నిర్వికారమయిన చైతన్యముతో కూడుకున్న ఈ భూతములు స్థూలరూపమును విడచిననూ, అతిసూక్ష్మమయిన చిద్రూప మునకు భంగంలేదు. ఈ స్థూలపదార్థములన్నియూ ఒకప్పుడు వివర్తమును చెందును. మరొకప్పుడు వివర్తరహితములుగా ఉండును. ఇంకొకప్పుడు చిదాధారములై అతి సూక్ష్మములుగా నుండును. మరొకప్పుడు అతి స్థూలము లగును. సంకల్పాత్మకమగు చిత్తుయే తన్మాత్రగణముగాను, త్రసరేణుగణముగాను తయారగుచున్నది. మరొకపుడు అదియే నిరాకార మగుచున్నది. కాబట్టి బ్రహ్మయే జగదాకారమవుతోంది. జగత్తునకు తన్మాత్రపంచకం కారణం. దానికి కారణం పరమాత్మతో నిత్యసంబద్ధ మయిన మాయాశక్తి. కనుక పరమాత్మతత్త్వమే మాయాశక్తి ద్వారా ప్రపంచానికి కారణమవుతూంది. మాయ తొలగగా తాను తనరూపంలో నిలచిపోతోంది. అందుచేత ప్రపంచం అంతా బ్రహ్మాత్మకం అన్న మాట నమ్మమన్నాడు వసిష్ఠుడు.

## ౧3 స్వయంభూ ఉత్పత్తి వర్ణనము

రామచంద్రా! సుషుప్తిలో జీవులందరూ మాయాశబల బ్రహ్మలో లీనమై ఉంటారు. అనగా మాయాశబల బ్రహ్మభావాన్ని పొంది ఉంటారు. అలాగే ప్రళయంలో కూడా మాయాశబల బ్రహ్మభావాన్ని పొందు తారు. జాగ్రతలో మళ్లీ బయటికి వస్తారు. అలాగే సృష్టిలో కూడా బయటికి వస్తారు. దీని క్రమం అంతా సకారణంగా చెపుతాను విను. ప్రళయంలో వికారములయొక్క వైషమ్యం ఏమీ ఉండదు. మాయా శబలమయిన బ్రహ్మ ఒక్కడే ఉంటాడు. అతడే ప్రపంచ ప్రళయానికి అధిష్ఠానం, అపుడు చిద్రూపుడయిన ఆ బ్రహ్మయందు కారణరూపముతో బ్రహ్మ సత్తా మాత్రమే ఉంటుంది. ఆ చిద్రూపునకు మొట్టమొదట స్వభావతః (నైసర్గికముగా) తెలిసికొనుట అను వికల్పము ఏర్పడు తుంది. అనగా తెలివి రూపమయిన వస్తువు తెలిసికొనుట అను ధర్మాన్ని పొందు తుంది. ఇదే ఈ బ్రహ్మకు జీవభావము. ఇది కొంచెము ముదిరినతరువాత అహంభావము ఏర్పడుతుంది. ఈ రెండు ధర్మములు ఏర్పడిన తరువాత,

తనలో వాసనారూపముతో ఉన్న శబ్దస్పర్శాదితన్మాత్రలను, స్వప్నము నందువలె మననము చేయుటవలన, మనస్సు అనే ధర్మం ఏర్పాడు తుంది. ఆ చిద్రూపునకు. ఆమనస్సుతో తనలో ఉన్న తన్మాత్రలను మాటిమాటికి భావన చేసేసరికి గట్టిపడి ఆభావన స్థూల దేహ రూపాన్ని పొందు తుంది. ఇలా ఆపైన జగత్తు అనే మహావృక్షం తయారయి కనిపిస్తూ ఉంటుంది. ఇలా అతి శీఘ్రంగా కలలో పట్టణంవలె, ఈ మహాచిదాకాశంలో ప్రపంచం అనుకోకుండా మాటిమాటికి పుట్టి నశిస్తూ ఉంటుంది. ఈ ప్రపంచమనే వెదురు గుబురునకు చిదాత్మయే కారణం. దీనిని పాతనక్కరలేదు. ఈ కుంజానికి నేలకాని, నీరుకాని, గాలికాని, మొక్క పెరిగే కారణాలు ఏవీ అక్కరలేదు. చిద్రూపమయిన పరవస్తువే, స్వప్న ప్రపంచాన్నివలె, పృథివ్యాది పంచభూతాలను, భౌతిక ప్రపంచాన్ని పుట్టిస్తాడు. ఇంతటి మహా ప్రపంచం తనలో ఉన్నా తాను దాన్ని విడచినవాడే. అంటనివాడే. అసంగుడే.

కాబట్టి ఈ స్థూల జగత్తునకు పంచతన్మాత్రలు కారణం. వాటికి అవ్యయమయిన చైతన్యము కారణం. లోకంలో విత్తనమే మొక్క అయి, చెట్టు అయి, పూత, పిందె, కాయ అయి పండు అవుతుంది. ఆ పండులో మళ్లీ ఈ విత్తనమే ఉంటుంది. కాబట్టి ఆ వృక్షమంతా ఆ బీజమయమే అనక తప్పదు. అలాగే ఈ ప్రపంచం అంతా బ్రహ్మమయం అని తీరాలి. స్థూల సూక్ష్మరూపమయిన ప్రపంచం అంతా బ్రహ్మ. కార్యం కారణాభిన్నం అని లోకంలో ప్రతీతి ఉంది. కనుక ప్రౌఢమయిన ఈ జగత్తు అంతా బ్రహ్మరూపం అనుటలో ఆశ్చర్యమేమీ లేదు. ఇందులో నిజంగా పుట్టిందేమీ లేదు. స్వప్న సంకల్ప పురమువలె లేనిది ఉన్నట్లు భాసిస్తోంది. ఈ బ్రహ్మకాశంలో జీవాకాశపుంజము. జీవోపాధులయిన పృథివ్యాదులు నిజంలో లేవు కనుక జీవుడు బ్రహ్మ చైతన్యమునందు కల్పితుడు. బ్రహ్మకంటె పరమార్థంగా వేరు గాడు. ఈ రూపంగా సమష్టి అభిమానంవల్ల హిరణ్యగర్భుడనే మొదటి జీవుడు తయారయినాడు. ఇట్లు విశేషాభిమానం చేత వ్యష్టి రూపంలో అనేక జీవులు తయారవుతారు. ఆ క్రమం విను. ఆ పరమేశ్వరునియందు కల్పింపబడిన సమిష్టి జీవాకాశము అతి విశాలము దానినుండి చిన్న స్ఫులింగము (నిప్పుకణము) లవలె తేజఃకణములు బయలు

దేరును. వాటికి తాము అంతటి పరిమాణము కలవారమను అభిమానము ఏర్పడుతుంది. ఆ అభిమానముచే ఆ తేజఃకణములు తాము పరిచ్ఛిన్నులమని తలంతురు. ఈ రూపంగా అనేక జీవులు తయారగుచున్నారు. "యథా అగ్నేః క్షుద్రాః విస్ఫులింగా వ్యుచ్చరంతి ఏవ మేవ అస్మాదాత్మనః సర్వ ఏతే ఆత్మానః వ్యుచ్చరంతి॥" అనే శ్రుతిపై యర్థమును స్పష్టపరచుచున్నది.

ఆ పైన ఆ తేజఃకణము, అణుభావమును విడచి, తారకా (లింగ) సాదృశ్యాన్ని గ్రహించి భావనచేసి కొంచెము స్థూలంగా తయారవుతుంది. ఇదే ఈ తేజఃకణమునకు భూతతన్మాత్రలచే తయారయిన లింగ దేహ భావము. మనస్సులో భావనచేసెడి వస్తువులు కంటికి కనిపించడం లోకానుభవ సిద్ధము. అట్టివే సంకల్ప చంద్రాదులు. ఆ తేజఃకణములు గట్టి భావనా వశంచేత ద్రష్టృ దృశ్య భావాన్ని చెందును. తాను చచ్చినట్లు తనకు స్వప్నము వచ్చిన విధంగా తానొక్కడే ద్విత్వాన్ని పొందుతాడు. ఆ తేజఃకణము, తన ధర్మమును విడచి, తాను గుండ్రముగా ఉండుటచే తనయందు, లింగ సాదృశ్యాన్ని గ్రహించి, లింగాకారమును భావన చేయును. ఆ భావనచే తన్మాత్రలచే తయారయ్యేడి లింగదేహము ఏర్పడుతుంది. దానిచే ఆ జీవుడు తారకాకారుడుగానే ఉంటాడు. (లింగాకారమును ధరించి యుంటాడు.) చిత్తము విషయాకారము చెందినట్లు. ఈ చైతన్యము వస్తుతః ఉపాధులన్నిటికీ వెలుపల ఉన్ననూ, అద్దము వెలుపల నున్న పర్వతము అద్దములో నున్నట్లు, లింగదేహము యొక్క తొర్రలో (కోటరంలో) ఉన్నట్లు భాసించును. భావిలో పడినవాని వ్యవహారము వలెనూ, పెట్టెలో మూసిగెడివాని అరపు బయటికి ప్రసరించనట్లునూ, ఈ జీవుడు దేహాభిమానంచేత ఆ లింగదేహంలో నుండియే వ్యవహరిస్తూ ఉంటాడు. స్వప్నావస్థలోను, సంకల్పావస్థలోను విషయాలు వెలుపల నున్ననూ ఆ బాహ్యరూపాన్ని విడిచి లోపలనే భాసిస్తూ ఉంటాయి. భావిలోని నీటిలో ప్రతిబింబించిన శరీరం ఆనీటిలోనే కదులుతూ ఉంటుంది. కొండగుహలో దూరిన ప్రతిధ్వని అక్కడనే గోచరిస్తుంది. అలాగే జీవుడు కూడ వాసనామయమయిన సూక్ష్మ దేహంలో ఉండి దానినే తెలుసుకుంటూ ఉంటాడు. కాబట్టి వాసనామయమయిన శరీరవ్యవహారదృష్టితో

చూస్తే జీవుడు మనోమయుడు. పరమార్థదృష్టితో విచారిస్తే సత్యజ్ఞానానందరూపుడు. ఇతనికే స్థూల శరీరభావనచేత స్థూల శరీరం ఏర్పడుతుంది: చూడాలి అని అనుకుంటే చూడటానికి సాధనమయిన కన్ను రంధ్రద్వయ రూపంతో తయారవుతుంది ఈ చిదాకాశానికి. అలాగే స్పర్శసంకల్పం చేత త్వగింద్రియం. శ్రవణ సంకల్పంచేత శ్రవణేంద్రియం. ఘ్రాణన సంకల్పం చేత ఘ్రాణేంద్రియం, ఇలా ఇంద్రియ గణం, ప్రాణాపానాది వాయు పంచకం, ఏర్పడుతుంది. నామరూపాత్మకమయిన ప్రపంచాన్ని అంతా తనయందు అధ్యాసచేసికొని ఉంటాడు. ఈ చిదాకాశుడయిన బ్రహ్మ (ఆదిజీవుడు) ఇలాగే బ్రహ్మాండాన్ని, అందులోని చతుర్ముఖాది శరీరాలనూ, అహంభావముతో కల్పించుకుంటాడు. ఆత్మ మొదట చిత్తమే తానని అభిమానిస్తాడు. తరువాత సంకల్పానుసారంగా, గర్భగృహావాసమునూ, దేశకాల క్రియా ద్రవ్యములనూ శబ్దజాలమునూ, భావనావశంచేత నిర్మించుకుంటాడు. తుదకు వాటితో బద్ధుడవుతాడు. సమష్టిరూపంలో ఉన్న ఈ ఆతివాహిక దేహుడే స్వయంభువు. మొదటి ప్రజాపతి. ఇతడు నిజంలో పుట్టలేదు. నిజంలో గిట్టడు. ఇదంతా కల్పనామాత్రం. ప్రపంచంలో జీవులందరి పరిస్థితీ ఇంతే. అసలు ప్రపంచం అనేదే ఒక అసత్యమయిన భ్రమ. అందులో ఒక్కటీ పరమార్థ సత్యమయిన వస్తువులేదు. పరమార్థ సత్యమయిన వస్తువు బ్రహ్మాకాశం (చిదాకాశం) ఒక్కటే. ఆ చిదాకాశమే ఇన్నిరకాల భాసిస్తూ ఉంది. ఈ ప్రపంచమును బాహ్య సామాగ్రితో ఎవ్వరూ నిర్మించలేదు. ఆంతర ప్రయత్నముతోనూ నిర్మించలేదు. కొందరు పూర్వకల్పంలోని చతుర్ముఖ బ్రహ్మయే, మహాకల్పాంతమందు అదృష్టమూ, సంస్కారమూ, మొదలగు పూర్వసామగ్రిచే ప్రపంచమును నిర్మించినాడని అంటారు. అది పొరపాటు. వెనుకటి కల్పంలోని బ్రహ్మ, బ్రహ్మలోకంలోనివారూ. వీరందరూ మోక్షం పొందుతారని చెప్పుచున్నది.

శ్లో॥ బ్రహ్మణాసహతే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే ।
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదం ॥ అనే స్మృతి.

"యావదధికార మవస్థితిరాధికారికాణాం" అనే సూత్రముకూడా ఆధికారిక పురుషులు అధికార పర్యంతమే ఉంటారని అంటోంది. కాబట్టి

వెనుకటి కల్పంలోని బ్రహ్మాదులు ముక్తులవడము తథ్యం. అట్టి స్థితిలో వాళ్లు, అదృష్ట సంస్కారాది సామగ్రిచేత, అగ్రిమ ప్రపంచాన్ని నిర్మించా రనడము అసంభవము. ఇక ఉపాసకులు కల్పారంభంలో హిరణ్యగర్భుని అధికారం పొంది వారు ఈ ప్రపంచాన్ని నిర్మిస్తారనేది కూడా కుదురదు. వారు ఈ విచిత్ర ప్రపంచాన్ని వెనుకటి కల్పంలో ఎన్నడూ నిర్మించలేదు. వారికి సృష్టిని గురించిన అనుభవము ఏ మాత్రమూ లేదు. అనుభవమే లేనపుడు సంస్కారముండుట అసంభవం. కాబట్టి సుతరాం ప్రపంచము సంస్కార జన్యము కాదు. స్వప్న ప్రపంచమువలెనూ, ఇంద్రజాలము వలెనూ, హఠాత్తుగా అవిద్యవల్లనే పుటుతుంది. కాబట్టి ప్రపంచం మిథ్య అనటంలో ఆశ్చర్యం లేదు. హిరణ్యగర్భు డెలాంటివాడో ఆయనవల్ల పుట్టిన ప్రపంచం కూడ అలాంటిదే అవుతుంది. హిరణ్యగర్భుడు శూన్య స్వరూపుడు. ప్రపంచం కూడా శూన్య స్వభావమే కావాలి. ఒకవేళ ప్రపంచం జీవానుభవజన్య సంస్కారంచేత పుట్టకపోయినా, అనాది సిద్ధ మయిన సాక్షి చైతన్యముయొక్క అనుభవంవల్ల సంస్కారం ఏర్పడి దాని వల్ల ప్రపంచం పుట్టవచ్చునని కొందరనవచ్చును. అపుడు సాక్షి వేద్య మయిన స్వప్నాదులు మిథ్యాభూతములయినట్లు, సాక్ష్యనుభవజన్యమైన సంస్కారంవల్ల పుట్టిన ఈ ప్రపంచం కూడా మిథ్యయే కావలసివస్తుంది. ఏ దేశమందైనా, ఏ కాలమందైనా, ఉదకమునందు ద్రవత్వమనే గుణం మారదు. అలాగే పరమాత్మయందు కూడా ఏ కల్పంలోనయినా, సృష్టి మారదు. సమానాకారంగానే ఉంటుంది. నిజంగా పుట్టినదానికి ఏమాత్ర మయినా మార్పు ఉండి తీరాలి. అలా మార్పు లేనందువల్ల ఇది మిథ్య అని తీరాలి. కాబట్టి ఈ బ్రహ్మాండం పరమాత్మయందు, స్వరూపరహితంగా, శూన్యాకారంగా భాసిస్తూ ఉంటుంది. ఇది భ్రాంతి. ఇందులో నిజంగా ఉన్న వస్తువు ఏమీ లేదు. బ్రహ్మాండం లేదు; బ్రహ్మలేదు. ఆధారంలేదు. ఆధేయం లేదు. దృశ్యం లేదు. ద్రష్టలేదు. జగత్తు లేదు. ఇది అంతా శాంతమయిన బ్రహ్మ స్వరూపం. లేనిదే ఉన్నట్లు కనుపిస్తూ ఉంది తుదకు లేనిదే లేనట్లు నశిస్తుంది. అథవా, అధిష్ఠానమయిన బ్రహ్మ దృష్టిలో ఇది సద్రూపము. అఖండితము. అనాద్యంతము. జ్ఞానమాత్రము అనవచ్చును. కనుక రామచంద్రా! పరబ్రహ్మయందు హిరణ్యగర్భుడు పుట్టలేదు. ఇతనికి

వేరే స్వరూపము లేదు. సర్వసముడయిన పరమాత్మే ఈ రూపంగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఈ హిరణ్యగర్భుడు మనోమయరూపుడు కాని, పాంచభౌతిక రూపుడు కాడు. పృథివ్యాది ప్రపంచం అంతా ఇతని సంకల్ప మాత్రరూపము. కనుక అది సత్యముకాదు. పుట్టని కుందేటి కొమ్ము ఎట్లు లేదో, అట్లే ఈ ప్రపంచం కూడా లేదనే అనాలి. అలా నీకు వర్ణించి చూపాను. అన్నాడు వసిష్ఠుడు.

## ౧౪ బ్రహ్మ స్వరూప ప్రతిపాదనము

విన్నాడు రాముడు ఇది అంతా. హిరణ్యగర్భుడనే ఆదిజీవుడు అపరిచ్ఛిన్నుడనీ, వ్యష్టిలో ఉన్న మిగిలిన జీవులందరూ పరిచ్ఛిన్నులనీ సందేహించాడు. ఈ సందేహం కూడా తీర్చడం అవసరం అనుకున్నాడు వసిష్ఠుడు, బ్రహ్మ స్వరూపం ప్రతిపాదించదలచాడు. వెనుక చెప్పిన విషయాన్ని ఒక్కమారు సింహావలోకనం చేశాడు.

రామచంద్రా! "నేను, నీవు, ఇది," అనే దృశ్యజాతం ఏదీ పుట్టలేదు. కాబట్టి ఏదీ లేదు. ఉన్నది పరమాత్మ ఒక్కడే. నిశ్చలమయిన సముద్ర కుహరంలోని, నీరు చలనముచెంది తరంగ రూపమయినట్లు పరమాత్మయే మొదట సమిష్టి జీవుడగుచున్నాడు. అయినా తన పరమాకాశ రూపాన్ని విడవడు. లోపల ఉన్న సంకల్పాత్మక చిద్వృత్తి వల్లనే ఇలా తయారవు తాడు. ఇతని శరీరము పాంచభౌతికముగాదు. ఆతివాహికము. అతి సూక్ష్మము. చిన్మాత్రచ్ఛన్న మయిన భోపమము. అక్షయము. స్వప్న శైలసదృశము. స్వప్నపురతుల్యము. స్థిరమయిన చిత్రములోని సైన్యము తో సమానాకారము. పాతిన స్తంభముమీద చెక్కని బొమ్మలతో సమానము. బ్రహ్మాకాశమనే గట్టి స్తంభం మీద చెక్క కుండా తయా రయిన బొమ్మవంటివాడు హిరణ్యగర్భుడు. ఇతడు పురాతన కర్మవల్ల పుట్టలేదు. కనుక అకారణుడు. మహాప్రళయకాలంలో మొదటి పితా మహులందరూ ముక్తులవుతారు. కనుక మళ్ళీ వచ్చే పితామహునకు పురాతన కర్మ లేదు. కాబట్టి ఇతడు దర్పణ ప్రతిబింబితమయిన శైలము వంటివాడు. దృశ్యమయినా దృశ్యుడు కానివాడే. కనిపిస్తున్నా కనిపించని

వాడే) నిర్వికార చైతన్యమునందు, చూచేవాడు, చూడతగినది, చూచుట, పుట్టించువాడు, పుట్టించుట, పుట్టింపతగినవి, అనుభవించువాడు, అనుభవించతగినవి, అనుభవించుట, (భోక్తా, భోగ్యమూ, భోగమూ,) అనే త్రిపుటీ ఏ మాత్రములేదు. ఇందుచే శూన్య వాదంలోకి దిగరాదు. ప్రతి శబ్దమునకు అర్థభూతుడు పదార్థములకు ఆత్మభూతుడూ ఇతడే. (ఈ నిర్వికార చైతన్యమే) జీవసంఘం అంతా ఇతనినుంచే బయలుదేరుతోంది. స్థూల సమష్టిరూపుడయిన హిరణ్యగర్భుడు మిథ్యాభూతుడు. అతనివల్ల పుట్టిన స్థూల సమిష్టిరూపుడయిన విరాట్టు కూడా మిథ్యగానే తయారయినాడు. ఆపైన ఆ విరాట్టువల్ల వ్యష్టిజీవులు తయారవుతారు. వారూ మిథ్యాభూతులే వీరందరూ పరమాత్మయొక్క సంకల్పములోని దార్ఢ్యా దార్ఢ్యములవలననే తయారవుతూ ఉంటారు. గట్టి సంకల్పమువల్ల గట్టి (స్థూల) వస్తువు తయారవుతుంది. సామాన్య సంకల్పమున సామాన్య వస్తువు (సూక్ష్మవస్తువు) తయారవుతుంది. కనుక మొత్తం అంతా సంకల్పాత్మకమే జగత్తు. మూలకారణమయిన పరబ్రహ్మ, సమష్టిరూపుడయినాడు. అతడే వ్యష్టిరూపుడయినాడు. కాబట్టి ఈ ముగ్గురూ ఒక్కటే. ఇందులో సమష్టి వ్యష్టులు అసత్యాలు, మూలకారణం ఒక్కటే సత్యం. కనుక వీరిలో ఒకడు అపరిచ్ఛిన్నుడూ, ఇంకొకడు పరిచ్ఛిన్నుడూ అనే విచారమే పనికిరాదు. వ్యష్టి జీవులు పరిచ్ఛేదము కలవారనీ, సమష్టి జీవుడు పరిచ్ఛేదము లేనివాడనీ నీవు పొరపడుచున్నావు. మరియు కొలిమిలో కాచిన ఇనుప ముద్దనుంచి అగ్నికణములు బయలుదేరినట్లు, ఈ జీవరాసులు ఎవరినుంచియో బయలుదేరుచున్నారని అభిప్రాయ పడుచున్నావు నీవు. ఈ మాట "కుందేటి కొమ్ము ఎగిరి ఆకసమునంటుచున్నది" అన్నట్లున్నది. జీవుడూ లేడు. జీవరాసులూ లేరు. జీవసమష్టి పిండమూ లేదు. ఈ మాటలు వట్టి ఆభాసలు. ఇందులో నిజమేమీ లేదు. ఉన్నది సర్వవ్యాపకమయిన శుద్ధ చైతన్యము ఒక్కటే. ఇది సర్వశక్తి యుక్తమయినందున చిత్రవిచిత్రమైన కల్పనా కౌశల్యాన్ని పొందుతుంది. ఆ చైతన్యముయొక్క సంకల్ప వృత్తులే చిదాభాసమును చెంది క్రమక్రమంగా మూర్తా మూర్త స్వరూపాన్ని చెందుతాయి. ఆపైన జీవుడూ, బుద్ధీ, మనస్సూ, విషయములూ, మున్నగు వ్యవహారం అంతా తయారవుతుంది. ఇది అంతా అవిద్యవల్లనే

ఏర్పడుతుంది. అవిద్య తొలగిందా! అపుడు విక్షేపరహిత ఆత్మస్వరూపము మాత్రనే మిగులుతుంది. కాబట్టి రామచంద్రా! బ్రహ్మే జీవుడు. వీరిద్దరకు ఏ మాత్రమూ భేదంలేదు. భేదం లేనపుడు ఒకరు పరిచ్ఛిన్నులు ఇంకొకరు అపరిచ్ఛిన్నులు అనే సందేహం ఏమిటి నీకు అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! వ్యష్టి సమష్టి జీవులకు భేదం లేదంటారే మీరు, అలాగైతే, వ్యష్టి జీవులు భోగేచ్ఛ గలవారయితే, సమష్టి జీవులు కూడా భోగేచ్ఛులు కావలసిందేగా, సమష్టి జీవులు మోక్షేచ్ఛ గలవారయితే, వ్యష్టిజీవులుకూడా ముముక్షువులు కావలసిందేగా? ఇంక బంధమోక్ష వ్యవస్థ ఎలా కుదురుతుంది? అని అడ్డు తగిలాడు శ్రీరాముడు వసిష్ఠుని వాగ్ఝరికి.

రామచంద్రా! బ్రహ్మ మొట్టమొదట సత్యసంకల్పుడయిన సమష్టి జీవుడు కావాలని సంకల్పించాడు. అలాగే అయినాడు. ఆవల స్వసంకల్పాధీనమయిన వృత్తులచే వ్యష్టిజీవులుగా మారదలచాడు. అలాగే అయినాడు. అతడు సర్వశక్తిమయాత్మకుడు. ఎప్పుడెట్లు తలచునో అప్పుడట్లు కాగలడు. కావున తాను సమష్టి జీవభావమును చెందునపుడున్న సంకల్పము వేరు. వ్యష్టిజీవభావమును జెందునపుడున్న సంకల్పము వేరు. ఆ సంకల్పంచేత సమష్టి జీవుడయినాడు. ఈ సంకల్పంచేత వ్యష్టి జీవుడయినాడు. సంకల్పములు రెండూ వేరయినందున వ్యష్టి జీవదశలో కూడా సత్యసంకల్పుడు లుండాలనే నియమంలేదు. అలా ఉండవుకూడా. సంకల్పం వేరయితే జీవులు వేరవుతారు. వారి ధర్మములు వేరవుతాయి. మహాజీవాత్ముడగు బ్రహ్మ సర్వశక్తియుక్తుడు. అతడు ప్రపంచంలో బంధమోక్షాది వవస్థ కుదురునట్లుగా నేను అందరిలోనూ, అన్నిటిలోనూ, ఉందునని సంకల్పించాడు. ఆయన సంకల్ప ప్రకారమే జరుగుచున్నది. ఆతనిపనులు సంకల్ప మాత్రమున నెరవేరుతాయి. వ్యష్టి జీవుల పనులు మాత్రం అట్లు నెరవేరవు. వారికి కార్యానుకూలమయిన ప్రయత్నం అవసరం. లేనిచో పని సిద్ధించదు. ఎక్కడనయినా మహానుభావులయిన మహర్షులందు బాహ్య పరికరములూ, ప్రయత్నమూ, లేకుండా పని సిద్ధించినదంటే, అది సమష్టి జీవుని సంకల్పం వల్లనే అని ఊహించాలి.

అనగా "ఈ మహర్షియొక్క సంకల్పం సిద్ధించుగాక" అని ప్రధానమయిన సమష్టి జీవునియొక్క సంకల్పం ఉన్నదని ఊహించాలి. ఈశ్వరానుగ్రహం లేనిదే వ్యష్టి జీవుని సామర్థ్యం ఫలించదు. ఈశ్వరసంకల్పం అనుకూలించనిదే జీవులకోరికలు ఫలించవు. మహర్షులకు ఈశ్వరుడు అనుకూలించి ఉండుటవల్లనే వారి సంకల్పము నెరవేరుతోంది. కావున జీవేశ్వరులకు భేదములేదు. అయినా ఈశ్వరసంకల్పము జీవులయెడ వేరుగా నుండటంచే బంధమోక్షాది వ్యవస్థ కుదురుతోంది. బ్రహ్మ స్వరూపుడయిన మహాజీవుడు ఆద్యంత రహితుడై సమష్టి వ్యష్టి భేదముచే కోటానుకోట్ల జీవరూపమును పొందుచున్నాడు. బ్రహ్మకు జడవస్తువులతోటి సంసర్గము వల్లనే జీవత్వము ఏర్పడుతోంది. సంసార సంబంధము కలుగుతోంది. ఆ సంసర్గము తీరినవెంటనే స్వస్వరూపము సిద్ధిస్తూ ఉంది.

ఈ జీవులు ఉపాసనచే క్రమక్రమంగా కాని, జ్ఞానముచే సాక్షాత్తుగాగాని బ్రహ్మత్వాన్ని పొందుతారు. రాగి రస ఓషధాదుల సంబంధంచే కాని, సువర్ణముయొక్క సాక్షాత్ స్పర్శచేగాని బంగారమవుతుంది. ప్రత్యగ్రూపమయిన చిదాకాశమునందు, లేని ఈ జగత్తు ఉన్నదానివలె భాసిస్తోంది. ఇదంతా చైతన్యముయొక్క చమత్కారం. జగత్సంస్కార సంస్కృతమయిన మాయయందు ప్రతిఫలించి, దానితో ఐకరస్యాన్ని చెంది-ఈ మహా విశాలమయిన ప్రపంచంగా తయారయింది చైతన్యం. ఈ ఆభాస (ప్రతిబింబ) చైతన్యము, వాస్తవ చైతన్యము కంటె భిన్నము కాకపోయినా, పరిణామాది శబ్దములచేత భిన్నమయినట్లు తెలియబడుతోంది. చిజ్జడముల యొక్క తాదాత్మ్య (పరస్పరా) ధ్యాసయే ప్రపంచము. అందు అహంతా దర్శనము (నేను అను జ్ఞానము) మొదటి అధ్యాస. జగద్రూపదర్శనము (ఇది ప్రపంచముఅనే జ్ఞానము) తరువాతది. ఈ అహంతా అధ్యాసయే (నేను అను అధ్యాసయే) క్రమంగా స్థూలరూపంతోటి ఉత్కర్షచెంది. (పెరిగి) బ్రహ్మాండమవుతోంది. కాబట్టి చైతన్యముయొక్క చమత్కారమునకే జగత్తు అని పేరు. అంతకంటె వేరే జగత్తు అనేది లేదు. అహంకారకల్పనమూ, తన్మాత్రాది జగత్కల్పనమూ, ఈ రెంటిలో అహంకార కల్పన, చైతన్యాధీనమనీ, తన్మాత్రాది కల్పన అహంకారాధీనమనీ తేలింది. ఇపుడు చైతన్యమే ఈ రెండు వస్తువు

లుగా అయినది కాని నిజంలో రెండో వస్తువు ఏదీ? లేదు. కాబట్టి ఏది మిగిలిందో అదే నిజమయినది. మిగతావి అన్నీ అసత్యములే. ఈ అధ్యాస లన్నిటిలోను, "నీవు నేను" అను చైతన్యాధ్యాసయే బలవత్తరమయింది. ఇది అపరిచ్ఛిన్నమయిన చైతన్యాన్ని పరిచ్ఛేద పరుస్తుంది. నిండు చైతన్యాన్ని ముక్కలు చేస్తుంది. దీనిని తొలగించుకోటం అతికష్టము. ఈ అధ్యాస తొలగినచో మిగిలిన అధ్యాసలన్నీ వాటంతట అవియే రూపు మాసిపోతవి. అపుడు సన్మాత్ర రూపము సులువుగా ప్రాప్తిస్తుంది. కాబట్టి రాఘవా! అహంకారాధ్యాసను పోగొట్టుకొనుటకు ముందు కర్మవాసనలను, కర్మలను రూపుమాపుకోవాలి. ఈ రెండే అహంకారాధ్యాసకు కారణము. ఈ రెండూ నశించిన తరువాత బ్రహ్మ స్వరూపావాప్తి కరతలామలకము. మేఘాలు పోతే ఆకాశం నిర్మలం అవుతుంది. దానికి వేరే ప్రయత్నం అక్కరలేదు. జ్ఞానముచేగాని ఈ అధ్యాస నశించదు. ఏది దేని విలాసమో అది దానికంటె వేరుకాదు. ఈ నియమము లోక సిద్ధము. తరంగ ఫేనబుద్బుదాదులు నీటియొక్క విలాసములు. అవి నీటి కంటె వేరుకాదు. సావయవ జలాది కార్యములే ఇట్లుండ నిరవయవమైన చిత్తుయొక్క వివర్తమయిన ప్రపంచము చిత్తుకంటె వేరుకాదని చెప్పనేల? మనస్సంకల్పరూపమయిన సూక్ష్మప్రపంచమూ, ఇంద్రియాధిష్ఠానమయిన స్థూల ప్రపంచమూ, శూన్యము. (లేనిది.) చైతన్యముయొక్క చమత్కార రూపము. కనుక అది దానికంటె వేరు కాదు. రామచంద్రా! నామ రూపాత్మకమయిన ప్రపంచముయొక్క తాత్త్వికరూపము (నిజరూపము) అపరిచ్ఛిన్న చైతన్యమే అని గ్రహించు. కనుక మనోబుద్ధి అహంకార తన్మాత్ర భూతాదులన్నీ చిన్మయములు. ఒకవేళ ఇవి పుట్టినవనుకున్నా చిత్తువల్ల పుట్టినవి కాని, ఇతరమువల్ల పుట్టలేదు. కనుక చిద్గుణములు. చిచ్చైత్యములకు భేదము కల్పితమే కాని వాస్తవికము కాదు. చిత్తుయందలి చమత్కారమే జీవరూపముగానూ తదుపాధి భూత తన్మాత్ర రూపము గానూ, కనిపిస్తూ ఉంది. చైతన్యముతో గూడిన అహంస్ఫురణము సందన కర్మగలప్రాణముతో గూడిజీవుడనబడుచున్నది. చిత్తు (చైతన్యము) స్ఫురణ మునుపొంది, స్వవికారములయిన అహంతాదులతో వ్యవచ్ఛిన్నమై జీవేశ్వరాది సంజ్ఞలను పొందుచున్నది. అయినా ఆ వ్యవచ్ఛిన్నరూపము

(ఆ భేదరూపము) ఉపాధిచే ఏర్పడింది. ఉపాధి మిథ్య. కనుక భేదముకూడా మిథ్యే. కాబట్టి చిత్తుయందు భేద ప్రసక్తే లేదన్నమాట. ఇలాగే జీవ ప్రాణములకు కూడ భేదము లేదు. చిత్ప్రధానమయిన అహంకారము జీవుడు. వీడు కర్త. స్పంద ప్రధానమయినది ప్రాణము. ఇది క్రియ. ఈ రెంటికికూడ భేదము లేదు. కర్తయొక్క ధర్మమే క్రియ. ధర్మధర్ములకు ఆత్యంతిక భేదములేదు. కనుక చిత్స్పందసంవలితమయిన పురుషుడే జీవుడు. ఇట్లే చిత్తము, మనస్సు, మనన్సు, ఇంద్రియాది భావమునందుకూడ జీవ భేదము లేదు. జీవోపాధి అయిన మనస్సే గోళకభేదముచే ఇంద్రియ రూపంతో ఉన్నది. కాబట్టి అశేష విశేషరహితమయిన చిత్ప్రకాశమే జగత్తు. ఇందు భేదగంధము ఏ మాత్రమూ లేదు. కనుక ఛేదింపనలవి కాని, దహింపసాధ్యము కాని, తడుపశక్యము కాని, ఎండింప యోగ్యము కాని, నిత్య, సర్వగత, అచలమగు ప్రత్యగాత్మ స్వరూపమే ఈ ప్రపంచం. ఇది తెలియక ద్వైతవాదులు వివాదపడుతున్నారు వారివారి భ్రమలచేత. మాకు ఆ భ్రాంతులు లేవు. ఆ వివాదాలూ లేవు. అజ్ఞానికి మాత్రమే దృశ్యం (ప్రపంచము) ఆకారవంతమై కట్టెదుట కనిపిస్తుంది. విజ్ఞానికి కని పించదు. విజ్ఞానికి చిదాకాశము మాత్రమే అనుభవగోచరమవుతుంది. మాయ అనే వసంతబుతువు, విషయాసక్తి అనే నీటితో తడిసిన చైతన్య మనే చెట్టునందు కాలాకాశ వాయ్వాదులనే పూగుత్తులను తమాషాగా విస్తరింపచేస్తుంది. చిద్రూపుడయిన పరబ్రహ్మ తాను చిల్లి పడకుండా ఉన్నవాడు ఉన్నట్లు ఉండి, ఆకాశము, వాయువు, అగ్ని, జలము: భూమి, చంద్రుడు, సూర్యుడు, మొదలగు పెక్కు రూపముల భాసించు చున్నాడు. వీటి అన్నిటికీ బ్రహ్మ స్వరూపంకంటె వేరే స్వరూపంలేదు. తత్వజ్ఞానం చేత ఈ దృశ్యజాలం నశిస్తే ఆ చిద్వస్తువే స్వస్వరూపముతో ఉండి పోతుంది. ఈ చిద్వస్తువునకు జడపదార్థములయొక్క సమ్మేళనం వల్లనూ, మనోభావ ప్రాప్తివల్లనూ జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు ఏర్పడుచున్నవి. ఈ యది స్పందరూపమయిన (చలనరూపమయిన) ప్రాణాదుల స్వరూపం పొందితే సంసారి అగును. లేనిచో విచారజన్య జ్ఞానంచేత చిద్రూపము నందే ఉండును, ఈ జగత్తు చిత్ప్రకాశముయొక్క ప్రకాశము. చిదా కాశముయొక్క శూన్యత్వము. చిదాలోకముయొక్క రూపము చిన్మారు

తముయొక్క స్పందము. చిదంధకారముయొక్క నలుపు చిదర్కుని పగలు. చిత్కజ్జలముయొక్క రజను. (పరాగము) చిదగ్నియొక్క వేడిమి. చిచ్ఛంఖముయొక్క తెలుపు. చిచ్ఛైలముయొక్క కుహరము. చిజ్జలము యొక్క ద్రవత్వము. చిదిక్షు ఖండము యొక్క తీపితనము (మాధుర్యము) చిత్క్షీరము యొక్క స్నేహము. చిద్ధిమము యొక్క శైత్యము. చిజ్జ్వాలయొక్క జ్వలనము. చిత్సర్షపముయొక్క చమురు. చిత్సరిత్తుయొక్క తరంగము చిత్ క్షౌద్రము (తేనే) యొక్క మాధుర్యము. చిత్పుష్పముయొక్క సుగంధము. చైతన్యముయొక్క సత్తయే జగత్సత్త కాని, జగత్తుకు వేరు సత్త లేదు. ఉన్నట్లు గోచరిస్తుంది. అది భ్రాంతి. తార్కికులు సావయవ నిరవయవులకు అభేదము కుదరదని ఆక్షేపిస్తారు. విద్వదనుభవమును ఎదిరించెడి ఆ మూర్ఖులతో మనకు పనిలేదు. అవయవ అవయవిత్వమనేది, కుందేటి కొమ్ము అను శబ్దార్థము వంటిది. ప్రపంచము స్ఫటిక శిలా ప్రతిబింబిత నగర సదృశమని చెప్పుచుంటే, ఇంక ఇందులో అవయవ అవయ విభావము ఏమిటి? చిగురుటాకునందలి సన్నని నాడుల వంటి దారములు ఆ చిగురుటాకు కంటె వేరు కాకున్ననూ వేరుగ కనిపించును. అట్లే ప్రపంచము బ్రహ్మకంటె వేరు కానున్ననూ, వేరుగ కనిపించును.

కాబట్టి చిత్తకార్యములయిన సంకల్ప వికల్పములు, లేనివి కాన, చిత్తముకూడ లేనిదే. కనుక దాని సమష్టి రూపుడయిన పితామహుడు కూడ లేనివాడే. చైతన్యాంచితమయిన చిత్తు మాత్రము అనుభవ గోచర మయినందున అది లేదనుటకు వీలులేదు. అనుభవ విరుద్ధమయిన అర్థము నందు మాట ప్రమాణము కాదు. ప్రపంచం నిజంగా ఉన్నట్లయితే, అది జ్ఞానము మొదలగు ఉపాయములచే పోదు. పోకపోతే మోక్షమే లేదు. ముక్తులూ, ముముక్షువులూ, అనేకులు శాస్త్ర సిద్ధమగుచున్నారు. కనుక ప్రపంచము సత్యమని పట్టుపట్టి శాస్త్ర సిద్ధ విషయమును సున్న చుట్టుట అతిమూర్ఖము అన్నాడు వసిష్ఠుడు. ఇంతటితో ప్రొద్దు గ్రుంకినది. సభ అంతా సాయంకాల కృత్యానికి లేచింది.

—*ఇట్లు మూడవరోజు ప్రసంగము ముగిసింది *—

# ౧౫ లీలోపాఖ్యానము (మండపోపాఖ్యానము)

నాల్గవరోజు సూర్యోదయం అయింది. మునులందరూ స్నాన సంధ్యా జపహోమాదులను తీర్చుకున్నారు. సభాస్థలిని అలంకరించారు. వసిష్ఠుడు మరల ప్రసంగం ప్రారంభించాడు. రామచంద్రా! 1) నిర్మల మయిన ఆకాశంలో భ్రాంతిచే ముత్యాలరాశి భాసించినట్లు చిదాకాశము నందు ఈ చతుర్దశ భువనాలూ భాసిస్తున్నాయి. (2) చైతన్యమనే స్తంభం మీద ఎవరిచే తనూ చెక్కకుండా తయారయిన బొమ్మ ఈ జగత్తు. (3) పరమాత్మయందు ఈ ప్రపంచం (దృశ్య) ప్రత్యయములు (జ్ఞాన ములు) సముద్రంలోని జలతరంగ ప్రత్యయముల వంటివి. (4) మూఢు లకు ఈలోకములు అతిస్థూలంగా కనిపించినా, విద్వాంసులకు మాత్రము, గవాక్ష రంధ్రములనుంచి ప్రసరించే సూర్యకిరణములలో దండాకారము గా తిరిగె పరాగ రేణువులవలె అతిసూక్ష్మములు. (5) ఈ పృథ్వ్యాది భూతములు అనుభవ గోచరములగు చున్ననూ, స్వప్న నగరములవలె లేనివి. (6) మరునదీజలమునకు ఆకారము లేనట్లు ఈ జగత్తుకు కూడ వేరు ఆకారములేదు. (7) జగద్బ్రహ్మ శబ్దములకు అర్థభేదము అజ్ఞానుల దృష్టిలోకాని, జ్ఞానుల దృష్టిలో లేదు. (8) కనుక ఇది పుట్టలేదు. మిథ్య. ఇందు నీకేమైనా సందేహం ఉంటే అతివిస్తృతమైన మండపోపాఖ్యానము చెపుతాను. విని నీసందేహాలు తీర్చుకో. అని కథ చెప్పడం ప్రారంభించాడు వసిష్ఠుడు.

ఈ భూమండలమున పద్మడను రాజు ఒకడుండెను. అతడు కుల మర్యాదలకు చెల్లెలికట్ట. శత్రుతిమిరములకు చండ భాస్కరుడు. దేవతా బృందమునకు మేరుపర్వతము. భవార్ణవమునందు యశశ్చంద్రుడు. సద్గుణ హంసలకు సరస్సు. సకలకలాకోవిదుడు. సర్వైశ్వర్యగుణాకరుడు. ఆతనికి అతిసుందరి లీలయను భార్య కలదు. ఆమె భూలోకలక్ష్మి. దేహ ధారిణియై భూలోకమున అవతరించిన గంగ. భూలోక మన్మథునకు పరిచర్య చేయదలచి అవతరించిన అపరరతీదేవి. భర్తకు ఛాయ (నీడ వలె నుండు సాధ్వీమతల్లి.

## ౧౬ లీలపరిదేవనము

భూలోక అప్సరసయగు నీమెతో గూడి పద్ముడు అమందానందము నొందుచు క్రీడించెను. ఉద్యానవనములూ, తమాలపు తోటలూ, రమ్యములయిన పుష్పమండపములూ, లతాగృహములూ, అంతఃపుర మందలి పుష్పశయ్యలూ, పూల అంగడి వీధులూ, వసంతోద్యానమందలి ఊయెలలూ, కృత్రిమ సరోవరములూ, చందనపాదపశైలములూ, కల్ప వృక్షముల నీడలూ, కదంబనీప గృహములూ, పారిజాత వృక్ష మధ్య భాగములూ, వికసిత కుంద మందారాది పుష్పముల మరంద సుగంధ ములూ, కూయుచున్న కోకిలలూ, మెత్తని అడవి పచ్చిక బయళ్లూ, తుంపురులు విదజల్లెడి కొండవాగులూ, మణిమాణిక్య శైల శిలా ఫలక ములూ, దేవాలయములూ, మునుల పుణ్యాశ్రమములూ, వికసించిన కలువలూ వికస్వరములయిన పద్మములూ, వీరి క్రీడా స్థలములు. ఇందు భార్యా భర్తలిద్దరూ, ప్రేమవర్ధకమగు రమణీయ క్రీడలతోనూ, విలాస చేష్టలతోనూ, ఎగతాళి మాటలతోనూ, పౌరాణిక కథలతోనూ, జూదములతోనూ, నాటక కథలతోనూ, కావ్య కథలతోనూ, గూఢార్థ శ్లోకములతోనూ, దేశకాల వ్యవహారములతోనూ, నగర గ్రామచేష్టల తోనూ, విహరించిరి. వివిధాభరణములను దాల్చిరి. పూలమాలలచే అలంకరించుకొనిరి. రుచ్యమయిన భక్ష్యములను భుజించిరి. కుంకుమ కర్పూరాదులతో పరిమళితమయిన తాంబూలాదులను నమలిరి. పుష్ప లతాకుంజముల దాగుకొనిరి. నఖక్షత దంతక్షతాది శృంగార చేష్టలను సలుపుకొనిరి, ఒండొరులను పరుగెత్తి పట్టుకొనిరి. తీగ ఊయలలో ఊగిరి. పడవలమీద తిరిగిరి. ఏనుగు, గుర్రము, మొదలగువానిమీద స్వారిచేసిరి. జలక్రీడలలో ఒకరినొకరుకని పెట్టిరి. వివిధ నృత్యములనుభినయించిరి. ఈ విధముగ, ఉద్యానములయందునూ, సరిత్తీర వృక్షములయందునూ, పుర వీధులందునూ, అంతఃపురములందునూ, మేడలందునూ, తీగ ఊయెల యందునూ క్రీడించుచుండిరి. ఇట్టి అఖండానందదశలో ఒకపుడు ఆమె (లీల) ఇలా తలచినది.

"ప్రాణప్రియుడగుఈ నా భర్త జరామరణములు లేనివాడై, తరగని యౌవనమునందుండుటెట్లు? ఇతనితో నేను నూరు యుగములు

పూగృహములందు స్వేచ్ఛగా క్రీడించు టెట్లు? "నేనాప్రియత్నమును ఆచరింతును. తపం బొనర్తును. జపమాచరింతును. యమనియమాది యోగమనుష్ఠింతును. నా భర్తను జరామరణములు లేని వానినిగ జేసి కొందును" అని. ఇట్లు తలచి, తపోవృద్ధులూ, విద్యావృద్ధులూ, జ్ఞాన వృద్ధులూ అగు బ్రాహ్మణులను పిలచి, పూజించి, ఓ బ్రాహ్మణోత్తము లారా? మానవులకు దేనివలన మరణరాహిత్యము సిద్ధించునో సెలవివ్వుం డని పలువూరు అడిగెను.

ఓ దేవీ! "జప, తప, యమ, నియమములచే, ఏ సిద్ధులయి నా సం ప్రాప్తమగును కాని, మానవునకు మరణరాహిత్యము మాత్రము సం ప్రాప్తముకాదు. మానవులు మరణించక తప్పదు" అని ఆ బ్రాహ్మణోత్త ములు బదులుచెప్పిరి. అంతట నాలీల బ్రాహ్మణోత్తముల పలుకులువిని, భర్తృ వియోగము తప్పదని భయపడి, తనబుద్ధితో తానిట్లు చింతించెను. "భర్తకంటె ముందర దైవయోగమువల్ల నేను మరణించుచో నాకు అన్ని దుఃఖములు తీరును. నేను సుఖముగ నుందును. వేయిసంవత్సరముల కయినను నా భర్త నాకంటె ముందుగా మరణించేయడల" ఆ మృత జీవుడు నా యింటినుంచి వెడలి పోకుండునట్లు చేసికొందును. అపుడు నా అంతఃపుర మండపంలోనే నా భర్తృ జీవుడు తిరుగుచుండును. నేను నిత్యమూ ఆతని జూచుచుందును. ఆతడు నన్ను జూచుచుండును. నేను, ఇట్లు ఎల్లపుడు సుఖముగ నుండగలను. ఇందుకొరకు ఇప్పటినుంచియే జప ఉపవాసనియమములచే "సరస్వతీదేవిని, చిద్రూపిణిని ఆరాధింతును. అనుగ్రహపరచుకొందును." అని నిశ్చయించుకొని, భర్త అనుజ్ఞ లేకండ గనే, శాస్త్ర విధానముగ ఘోర నియమము నవలంబించెను. సరస్వతీ దేవిని ఆరాధించెను, మూడు రోజులకొకతూరి భుజించు చుండెను. దేవ ద్విజగురుప్రాజ్ఞ విద్వత్పూజాపరాయణురాలై మెలగెను. స్నానదాన తపోధ్యానములయందు నిరంతరము మునిగియుండెను. సర్వాస్తిక్యబుద్ధితో సకల సదాచారముల నవలంబించి తన నడవడిభర్తకు గోప్యముగానుంచి భర్తను సంతోషపరచెను. ఇట్లు త్రిరాత్ర వ్రతములు నూరు గడచినవి. కష్టచేష్టలతో గూడిన ఈమె తపోనిష్ఠకుమెచ్చి సరస్వతీదేవి త్రిరాత్ర శతావసానమునందు ప్రసన్నురాలై లీలతో నిట్లుపలికెను. "ఓచిన్నదానా?

భర్తృభక్తితో నిరంతరము నీవాచరించెడి తపస్సునకు నేను మెచ్చితిని. అనుగ్రహించితిని. వరము కోరుకొనుము అని.

ఓ అంబ? ఓ జగన్మాత? నీవు జన్మజరామరణములనే అగ్నిమంటలకు శశిప్రభవు. (చంద్రికవు) హృదయాంధకారపు జనునకు రవిప్రభవు (వెలుతురు) ఈ దీనురాలను రక్షింపుము. నేనుకోరెడి ఈరెండు వరముల నిమ్ము. ఒకటి, మరణించిన నాప్రియభర్తయొక్క జీవుడు నా అంతఃపుర మండపమునుండి వెడలకుండుట, రెండు నేను ఎప్పుడెప్పుడు ఈ వరము కొరకు నీదర్శనమును గోరుదునో అప్పుడప్పుడు నీవు దర్శనమిచ్చుట" అని ప్రార్థించెను.

ఆదేవియు లీలయొక్కప్రార్థనను ఆలకించి "అట్లేయగుగాక" అని చెప్పి అంతర్ధానమునొందెను. అంతట నారాజమహిషియు, పరితుష్టయగు ఇష్టదేవతయొక్క పలుకులువిని, గానధ్వనినివిన్న లేడివలె, నానందించెను. పిదప కొంత కాలము కాలచక్రము దొరలుచుండగా, ఆలీలయొక్క పతి చైతన్యము లింగదేహమునందు అంతర్ధానమునొందెను. (అనగాపద్ముడను రాజు మరణించెను.) అది ఆమెకుచూస్తూ ఉన్న పచ్చి ఆకు ఎండినట్లు అయినది, ఇట్లు తన భర్త మరణించగా ఆమె, నీరులేని కొలనులోని తామర తీగవలె ఎండిపోయినది. వెచ్చని నిట్టూర్పు గాలిసోకిన అధర పల్లవముచలె వాడినది. బాణము నాటుకున్న ఆడలేడివలె మరణావస్థను బొందినది. అజ్ఞానాంధకారములో మునిగినది. దీపము ఆరిపోయిన ఇంటికళవలె, కాంతిహీనురాలైనది. ప్రవాహము తగ్గిపోయినదివలె కృశించినది. క్షణ కాలములో అరచుట, క్షణకాలములో వెంటనే మూర్ఛ భావము నవలంబించుట. ఇట్లు మానవతురాలగు ఆ లీల చక్రవాకివలె భర్తృవియోగమును సహింపజాలక, మరణింప సమకట్టెను. ఇట్లు పతివియోగము చే అతి విహ్వలయగు నా లీలను కృపాపరవశురాలగు సరస్వతిదేవి, నీరెండిన మడుగులోని ఆడ చేపను తొలకరి వానవలె, ఆ కా శ వా ణి తో అనుగ్రహించి ఇట్లు చెప్పెను.

గమనిక: గురూ! "యా స్త్రీ భర్త్రాఽననుజ్ఞాతా ఉపవాస వ్రతంచరేత్!
ఆయుష్యంగ హరతేభర్తుః మృతానరకమృచ్ఛతి"

భర్త అనుమతి లేకుండా ఉపవాస వ్రతమును ఆచరించిన స్త్రీ భర్తయొక్క ఆయుర్దాయమును హరించుననియు, ఆమె మరణించిన తరువాత నరకము నొందుననియు ధర్మశాస్త్రము చెప్పుచున్నది. దీనినిబట్టి భర్త అనుమతి లేని ఉపవాసవ్రతము భార్యకు అశాస్త్రీయము, ఇట్లుండ శాస్త్ర నిషిద్ధమైన ఉపవాసవ్రతమును ఆచరించిన ఈ లీల యొక్క వ్రతము యథాశాస్త్రమని అంటారే వసిష్ఠులు ఏమిటిది? ఇది యథాశాస్త్రమయితే పై శాస్త్రమేల ఇద్దానిని నిషేధించినది?

శిష్యా? ఇదియూ నీ సందేహం తప్పులేదు. దీనికి అపవాదముగా మరొక ధర్మ శాస్త్ర మున్నది. చూడు..

శ్లో|| ప్రత్యక్షంవా పరోక్షంవా సదాభర్తృహితంచరేత్।
వ్రతోపవాసనియమైః ఉపచారైశ్చ లౌకికైః||

భర్తకుతెలిసికాని, తెలియకకాని, భర్తృహితమునుగోరి వ్రతోపవాస నియమములనూ, లౌకికోపచారములనూ ఆచరించ వచ్చును. అని దీని భావము. కాన నీవు చూపిన పై నిందా ధర్మశాస్త్రము, తన కొరకు కామ్యముగా జేసికొనెడి ఉపవాసాది వ్రత విషయముకాని, భర్తయొక్క హితమునుగోరి చేసెడి ఉపవాసవ్రతమును ఉద్దేశించి కాదు. కావున లీల ఆచరించిన ఉపవాసవ్రతము భర్తయొక్క హితార్థము కనుక నిజ యథా శాస్త్రమేయగును. కనుక వసిష్ఠుడు చెప్పిన దానిలో పొరపాటులేదు.

## ౧౭ సందేహ రాజ్యము

ఓ చిన్నదానా! శవరూపమయిన నీ భర్తను పూలరాశియందు దాచి యుంచుము. పూలువాడి పోవును. కాని నీ పెనిమిటి మరణించడు. మరల వెంటనే నీకు భర్త కాగలడు. ఇతని జీవుడు నీ అంతఃపురమండపము నుండి లేచిపోడు. ఇది మంచి ఉపాయము. అన్నది సరస్వతి.

భీతిల్లెడి ఆ లీల ఈ మాటలు విని, బంధువులచే ఓదార్చబడినదై దుఃఖమును దిగమ్రింగి తన భర్తయొక్క శవ శరీరమును పుష్పరాశియందుంచి, ఆ రాత్రి తన అంతఃపురమున అందరూ నిద్రించియుండగా ఆ సరస్వతీదేవిని ధ్యానమార్గమున పిలచెను. ఆ దేవి ప్రత్యక్షమయి

ఓ చిన్నదానా? ఎందుకు నన్ను రమ్మంటివి? ఏల దుఃఖించు చుంటివి? ఆలూ మగడూ అను సంసార భ్రాంతులు మృగ తృష్ణాంబువులుకదా? అని అన్నది.

ఓ దేవి? నా భర్త ఇపు డెచ్చట నున్నాడు. ఏమి చేయుచున్నాడు? నేను ఇాట నొంటరిగా నుంట సహింపజాలకున్నాను. నన్ను ఆయన దరిజేర్చుము. అని అన్నది లీల.

ఓ వరాననా? నీ భర్త ఇపుడు చిదాకాశమునందున్నాడు. చిదాకాశమనగా బ్రహ్మ. ఆ చిదాకాశమును (బ్రహ్మమును) ఏకాగ్రతతో ధ్యానించిన యెడల నీ భర్తను నీవు వెంటనే ఇక్కడనే చూడగలవు. లేక అక్కడకు వెళ్లి అయినను చూడగలవు. ఆ చిదాకాశమే అజ్ఞానముచే ఆవృతమై అసద్రూపమయిన జగత్తుగా కనిపించు చున్నది. దానిచే మానవులకు ఈ సుఖ దుఃఖాదులు పొటబడుచున్నవి. ఈ చిదాకాశమును నీకు గుర్తింపజేసెదను వినుము. నీవు నీ కన్ను విచ్చి నభోమండలమున ప్రకాశించెడి చంద్రబింబమును జూచు చుందువు. ఈ పని నీకు ఒక్క నిముషకాలంలో జరుగును. అపుడు నీలో ఉన్న చిదాకాశము (బ్రహ్మము) నీ హృదయమునందు మనోమయముగ నున్నది. బాహ్యమున చంద్రమండలాకారముగ నున్నది. ఆ చంద్ర మండలమునకూ నీ కంటికీ నడుమ, ఆ చైతన్యము నిరాకారముగనున్నది. అదియే చిదాకాశము. కనుక నీవు సమస్త సంకల్పములను విడచి ఆ చిదాకాశమునందు స్థితినిపొందే యెడల అచట నీ భర్తను చూడగలవు. ఆ స్థానము సర్వాత్మకము. సర్వము దాని యందుండును. నీ భర్త యొక్క పరలోక కల్పనముకూడ నచ్చటనే. తత్వజ్ఞానముచేత అజ్ఞానము నశించి ద్వైతాత్యంతాభావ బుద్ధి పుట్టిననే కాని ఆ స్థానము నీకు దొరకదు. నా వరప్రసాదమున నీకు తత్వజ్ఞానము కలుగును, అని చెప్పి సరస్వతీ దేవి తన స్థానము జేరెను. అంతట నా లీల లీలా మాత్రముచే నిర్వికల్పక సమాధిని బొంది క్షణకాలములో అంతఃకరణ పంజరముతో గూడిన స్థూల దేహమును విడచెను. (అనగా స్థూల సూక్ష్మ దేహములందభిమాన మునువిడచెనని భావము) గూటి నుండి ఎగసిన పక్షివలె చిదాకాశమున

కెగసెను. అంతట తన యింటనే కొలువుకూటము నందున్న భర్తను జూచెను. ఆ సభాస్థలమున పద్ముడనురాజు సింహాసనా రూఢుడై రాజ కార్యములను చూచుచుండెను. సభాగృహము పతాకలతో శోభిల్లు చున్నది. పూర్వద్వారమున లెక్కకు మిక్కుటమయిన మునులు, విప్రులు, ఋషులును ఉండిరి. వారందరు "జయ జయ" అని ఆశీర్వదించుచుండిరి. అట్లే దక్షిణద్వారమున పెక్కండ్రు రాజులును, మహారాజులును. పశ్చిమ ద్వారమున ఏనుగులు గుర్రములు మొదలయినవియు, ఉత్తరద్వారమున లలనామండలమును ఉండెను. వేయేల ఆ సభాస్థలము వర్ణనాతీతమయిన శోభతో తులతూగుచుండెను. ఆకాశరూపిణియగు లీల అట్టి సభను ప్రవేశించెను. అచ్చట తిరుగుచున్న ఆమెను ఎవ్వరును కనిపెట్టలేక పోయిరి. ఆమె మాత్రము అచ్చటి భృత్యులనూ రాజులనూ, చూచెను. వారందరును వెనుకటివారువలెనే ఉండిరి. వారువారు వారివారి పనులను వెనుకటివలెనే చేయుచుండిరి. కాని పద్ముడను తన భర్త మాత్రము వెనుకటి శరీరమును విడిచి, పదియారు సంవత్సరముల బాలుడై రాజ్య మును పాలించుచుండెను. లీల వారందరనుచూచి నగరములోని వారంద రను మరణించిరా యేమి? అని ఆలోచింపసాగెను. ఇట్లుండ సరస్వతీదేవి అనుగ్రహమువలన లీలకు సమాధి భంగము కలిగెను. అప్పుడు ఆమె మరల వెనుకటివలె నిద్రించుచున్న పరిచారికలను చూచెను. నిద్రించు చున్న సఖీబృందమును మేల్కొలిపి, ఓ చెలియలారా! "నాకిచట చాల కష్టముగనున్నది. రాజసభకు తీసికొనిపొండు. అచట నా భర్తగారి సింహా సనముదరిన నిలచుండి అచటనున్న సభ్యులను జూతును. సుఖింతును. లేకున్న నేను బ్రతుకజాలను" అని చెప్పెను. అంతట నా రాజపరివారము అంతయు కడుసంభ్రమముతో మేల్కొన్నది. లీల చెప్పినదానికి సమ్మ తించి, యథోచితముగ వారువారు వారివారి పనులందు నిమగ్నులయిరి. యాష్టీక భటులు. (కర్రపెత్తనపు భటులు) పురమందలి పెద్దలను పిలచి వచ్చుటకు వెడలిరి. భృత్యులు కొందరు ఆస్థానమండపమును ఊడ్చిరి. జనులు గుంపులు గుంపులుగ ముంగిలి ప్రదేశములను చేరిరి. మంత్రు లును, సామంతులును, తమ తమ స్థానములను ఆక్రమించుకొనిరి. ప్రతి ద్వారమువద్దనూ, ద్వారపాలకులు తెల్లని వస్త్రముల ధరించి నిలబడిరి.

పద్మానుయాయులగు రాజన్యులు అరుదెంచి సభను అలంకరించిరి. అప్పుడు లీల రాజసింహాసనముదరిన బంగారు క్రొత్త చిత్రాసనమునందు గూర్చుండి మునుపటివలెనున్న రాజులనూ, గురువులనూ, స్త్రీలనూ, స్నేహితులనూ, సభ్యులనూచూచి, అమందానందమునొందెను. రాష్ట్రము నందలి జనులందరు జీవించి యుండిరని నిశ్చయించుకొనెను.

## ౧౮ జగన్మిథ్యాత్వము

మనోవ్యథను మాపుకొనుటకు ఆస్థానదర్శనాదులు ఉపాయములని తలచెను. రాజులు ఈమె ఆశయమును చేష్టలచే గ్రహించిరి. లీల మరల అంతఃపురమున్ప్రవేశించినది. పూలరాశిలో దాచి ఉంచిన పెనిమిటి ప్రక్కన కూర్చొని, "ఆహా! ఏమి ఈ మాయ? నా పురజనులందరూ లోపలా వెలుపలా కనిపించుచున్నారు. సమాధిలో చిదాకాశంలోనూ వీరే. వ్యవస్థానంలో ఆస్థానమునందునూ వీరే. ఇవే తాటి తోటలు. ఇవే తమాల వృక్షములు. ఇవే హింతాలములు. ఇవే పర్వతములు. ఇవి అన్నీ సమాధిలో ఉన్నట్లే బయటకూడ ఉన్నవి. బయట ఉన్నట్లే సమాధిలో కూడ అగపడుచున్నవి. కొండ అద్దంలో కనబడుతోంది. బయటనూ కనబడుతోంది. అలాగే ఈ ప్రపంచముకూడా చిదాదర్శంలో కనిపిస్తోంది. బయటనూ కనిపిస్తోంది. ఇందులో భ్రాంతి ప్రపంచం ఏదో? నిజమయిన ప్రపంచం ఏదో? అర్థం కావడంలేదు. ఈ విషయం ఆ సరస్వతీదేవిని అడిగి నిజం తెలుసుకుంటాను." అని ఆలోచించి తనకు అట్లు జరుప నిర్ణయించుకున్నది. వాగ్దేవతను పూజించినది. ఆమె, కుమారీ రూపముతో ప్రత్యక్షమయినది. లీల ఆ దేవికి ఎదురుగా కూర్చుండి ఇట్లడిగినది.

"దేవి! ఉత్తములు దయతలచ తగినవారలయెడ భయంకరముగా నుండరు. మీరు సృష్ట్యాదిలో స్థాపించిన మర్యాదను గురించి నాకు కొంత సందేహం కలుగుతోంది. నేను నమ్రతతో అడుగుచున్నాను. పరిపూర్ణానుగ్రహముతో సెలవిండు. ఈ ప్రపంచమునకు సంబంధించిన చిద్దర్పణము ఆకాశముకంటె నిర్మలము. కోటి యోజనములు విస్తీర్ణతగల దృశ్య వస్తువులు కూడా దీనిలో అత్యల్పముగా గోచరించును. ఇది అఖం

డార్థములయిన మహావాక్యములకు లక్ష్యము. ప్రజ్ఞానఘనము. మహా శీతలము. నిరావరణము. అప్రకాశ్యము. సర్వప్రకాశకము. ఈ ఆత్మ దర్పణము (చిదాదర్శము) నందు, దిక్కాలములు. ఉన్నవి. సర్వకార్యములు ఉత్పన్నములయినవి. అన్నియు అవకాశమును పొందినవి. ప్రకాశించుచున్నవి. కార్యకారణములయొక్క నియతి క్రమం అంతా ఇమిడి ఉన్నది. కార్య వైచిత్ర్యం యావత్తూ ఇందే పరిణామమును చెంది ప్రతి ఫలించినట్లు లోపల కనిపించుచున్నది. ముల్లోకముల ప్రతిబింబ లక్ష్మి అంతయును ఈ చిద్దర్పణమునందును, వెలుపలను గోచరించు చున్నది. ఇందులో కృత్రిమము ఏది? సహజము ఏది?" అని.

దేవి:— ఓ లీలా! ప్రపంచమునకు కృత్రిమత్వం అనగా ఎలాంటిది. అకృత్రిమత్వం అనగా ఎలాంటిది. ఇందులో నీ అభిప్రాయం ఏమి?

లీల:— దేవి! మన ఉభయులమూ ఉన్నట్లు, ఉండు వస్తువులు అన్నీ అకృత్రిమములు. ఇపుడు నాభర్త ఎచట నున్నాడో అచట కనిపించు వస్తువులన్నీ కృత్రిమములు. అక్కడ ఆ వస్తువులకు తగిన దేశకాలాదులు లేవు. కనుక అవి కల్పితములు. ఇదీ నా అభిప్రాయము. అనగా వస్తువులకు కావలసిన దేశకాల క్రియాదులుగలతావున ఉండు వస్తువులు అకృత్రిమములు. అవి లేనిచోట కనిపించునవి కృత్రిమములు.

దేవి:— ఓ లీలా! నీవు చిదాకాశంలో నీ భర్తృ ప్రపంచమును చూచు చుంటివికదా? అది నిర్హేతుకమందువా? సహేతుకమందువా? నిర్హేతుకమనే యెడల కారణము లేకుండా కార్యము పుట్టవలసి వస్తుంది. అది లోక విరుద్ధము కనుక అది కుదరదు. ఇంక సహేతుకమనే యెడల (రెండవ పక్షమున) ఆ హేతువు కృత్రిమమా? అకృత్రిమమా? ఇందు మొదటి పక్షంలో కృత్రిమమయిన ఈ ప్రపంచమా ఆ హేతువు? అన్య ప్రపంచమా? అన్య ప్రపంచమనేది అప్రసిద్ధము. కాబట్టి మొదటి కల్పమే మిగులును. అపుడు కృత్రిమ (మిథ్యా) ప్రపంచమునకు హేతువయిన ఈ ప్రపంచముకూడా కృత్రిమమే (మిథ్యయే) కావలెను. ఒకటి కృత్రిమ మూ, మరొకటి అకృత్రిమమూ అయితే ఆ రెంటికీ కార్యకారణభావమే

కుదరదు. కాబట్టి నీవు చూచే రెండు ప్రపంచములకూ వైధర్మ్యమును (భేదమును) చెప్పటకు వీలులేదు. కారణముకంటె విరుద్ధమయిన కార్యము పుట్టదు. కార్యమునకు విరుద్ధంగా కారణముండదు. పొట్లగింజకు కాకర తీగపుట్టదు. కాకర తీగకు పొట్లగింజ కారణముకాదు. కనుక నీవు ఈ రెండు ప్రపంచములలో ఏది పారమార్థికము? ఏది అపారమార్థికము? అని సందేహించడమే తప్పు.

లీల:- దేవీ! కార్యకారణములు విరుద్ధంగాఉండవని నీవుచెప్పింది కుదరదు. కుండకు మట్టిముద్ద కారణం. ముద్దరూపమయిన మట్టికి నీటిని గ్రహించే శక్తికాని ధరించే శక్తికానిలేదు. కాని అలాంటి మట్టిముద్ద నుంచి ఆ రెండు శక్తులుగల కుండపుట్టుచున్నది. ఇది లోకంలో అనుభవ సిద్ధము. కనుక కార్యకారణములు సమానశక్తి కలవి అను నియమం ఎట్లు లేదో. అట్లే సమానసత్త కలవను నియమముకూడా ఉండదుకదా!

దేవి:- లీలా! ఉపాదానకారణమునందలి వైచిత్ర్యమువల్లకాని, సహకారి కారణములయొక్క వైచిత్ర్యమువలనగాని మన్ఘటస్థలమందు నీవుచెప్పిన శక్తివైచిత్ర్యము ఉండవచ్చును. సమానమయిన ఉపాదాన నిమిత్తకారణములుగల, కార్యములపట్ల అలాంటి వైచిత్ర్యముఉండదు. ఇపుడు నీవడిగిన రెండు సృష్టులుమాత్రము సమానమయిన ఉపాదాన కారణములవల్ల పుట్టినవికాని, భిన్నోపాదాన కారణములవల్ల పుట్టలేదు. కనుక ఈ సృష్టులందును తేడాఉండుటకు వీలులేదు. ఈ రెండు ప్రపంచ ములూ మాయా కామ కర్మ వాసనలవల్లనే పుట్టినవి. కాకపోతే ఈ బాహ్యసృష్టిలో చేరిన పృథ్వ్యాది భూతములలో, చిదాకాశంలో నీవు చూచే నీభర్తృ ప్రపంచమునకు కారణమేద్ది? చెప్పు ఇది ఏదీ కారణం కాదు. అచ్చటి భౌతిక పదార్థములుకూడ అచ్చటి భూతములవల్లనే బుట్టినవి. ఇచ్చటి భౌతికములు ఇచ్చటి భూతములవల్ల పుట్టినట్లే. కనుక వీనియందును వైషమ్యము (తేడా) లేదు. అక్కడి భౌతికములు ఇక్కడి భూమినుండి పుట్టవు. ఇక్కడి భూమి ఎగిరి అక్కడికి వెళ్లితే ఇంక ఇక్కడ భూమి లేక పోవలసివస్తుంది. కాన ఎక్కడ అపూర్వమయిన సహ కారి కారణసామగ్రిలేకుండా కార్యం తయారవుతుందో, అక్కడ పూర్వ

కారణ సామగ్రీ వల్లనే కార్యం పుట్టుచున్న దనవలెను. కనుక ఈ రెండు సృష్టులకు భేదము లేదు.

లీల:— దేవీ! చిదాకాశంలో నేను చూచిన నాభర్తృ ప్రపంచము స్మృతిరూపము. స్మృతియందు పురోవర్తి విషయములు ఉండవు. ఇక్కడ కూడ అంతే. కాన అది మిథ్య. ఈ బాహ్యప్రపంచము దానికి కారణము. ఇది సత్యము. దీని సంస్కారమువలన అది పుట్టింది.

దేవి:— లీలా! ఈ బాహ్య ప్రపంచానుభవంవల్ల సంస్కారంకలిగి, దానివలన స్మృతిరూపమయిన నీ భర్తృప్రపంచము పుట్టిందనీ, అది మిథ్య అనీ నీవు అనుచున్నావు. అలాగయితే, ఈ బాహ్యప్రపంచము కూడా అంతకు పూర్వసృష్టిలోని సంస్కారమువల్ల పుట్టినందున గగనసదృశమే. అనగా మిథ్యయే.

లీల:— దేవీ! నేను కూడా అలాగే అనుకొనుచున్నాను. సంస్కారం వల్ల పుట్టిన నా భర్తృ ప్రపంచము ఎలా మిథ్యాభూతమో? అలాగే సంస్కారంవల్ల పుట్టిన ఈ బాహ్య ప్రపంచం కూడా మిథ్యయే. అందుకు నా భర్తృ ప్రపంచమే నిదర్శనము.

దేవి:— లీలా! నిజము. లేని నీ భర్తృ ప్రపంచము ఉన్నట్లు ఎలా ప్రకాశిస్తున్నదో? అలాగే ఈ బాహ్యం ప్రపంచం కూడా లేనిదయియే ఉన్నట్లు భాసిస్తోంది.

లీల.— దేవీ! భ్రమాత్మకమయిన, నా భర్తృ ప్రపంచము, ఈ బాహ్య ప్రపంచంవల్ల ఎలా తయారయిందో, ఆ విధానం కొంచెము చెప్పు. అది వింటేకాని నాకు ఈ ప్రపంచ భ్రాంతి తొలగేటట్లు లేదు.

## మండపోపాఖ్యానము

దేవి:— లీలా! నీభర్తృ ప్రపంచమునకు కారణమయిన ఈ బాహ్య ప్రపంచము ఎట్లు భ్రమాత్మకమో? చెప్పెదను. వినుము.

చిదాకాశంలో ప్రపంచమనే ఒక మండపం ఉన్నది. దానిపైకప్పు ఆకాశమనేగాజుపేకు. మేరుపర్వతం ఆమండపమునకు స్తంభము. ఆస్తంభ

మునందు లోకపాలురయొక్కయూ, వారిభార్యలయొక్కయూ బొమ్మలు చెక్కబడి ఉన్నవి. పదునాలుగు లోకములూ, పదునాలుగు గదులు. ముల్లోకములూ, మూడు గోతులు. (గుంటలు.) సూర్యుడు దీపము. మూలమూలల నున్న ప్రాణులు చదపురుగులు. పర్వతములు నగరములును పుట్టలు. బహుసంతానవంతుడునూ, ముదుసలియూనగు ప్రజాపతి. (బ్రహ్మ.) ఆ మండపంలో ఉండే బ్రాహ్మణుడు. జీవకోటి ఇందు సాలెపురుగులు. ఆకాశభాగము దీని పై భాగమునందలి బూజు. నభోమండలంలో ఉండే సిద్ధులు రొదజేయుదోమలు. మేఘములు ఇంటిపొగలు. వెదురుగుబురులు గవాక్షములు. వైమానికులు ఇందలి పురుగులు. ఈ మండపమున సురాసురాదులు అల్లరిబాలురు. ఆడుకొనుచూ అరచుచుందురు. లోకములూ, పురములూ, గ్రామములూ, పల్లెలూ, ఇందలి కుండలు వగైరా పాత్రలు. స్వర్గ మర్త్య పాతాళములు. ఇందలి గోతులు. ఈ మండపములో ఒకొక్క మూల కొండ చరియల క్రింద చిన్న చిన్న పల్లెలు కలవు. నదులూ, పర్వతములూ, అడవులతో గూడిన ఈ మండప ప్రదేశమునందు, పుత్రవంతుడూ, భార్యా సమేతుడూ, అగ్నిహోత్రీ, రోగరహితుడు, ధర్మపరుడూ, అతిధిసేవాతత్పరుడూ, రాజభయరహితుడూ, గోమంతుడూ, అగు ఒక బ్రాహ్మణుడు ఉన్నాడు.

## ౧౯ వసిష్ఠుడను బ్రాహ్మణుని వృత్తివర్ణనము

అతడు విత్తవేషవయః కర్మ విద్యావిభవ చేష్టలలో వసిష్ఠుడంతటివాడు. వసిష్ఠునకు ఈ బ్రాహ్మడికి రెండు అంశములో తేడా వసిష్ఠుడు ఇక్ష్వాకు రాజులకు పురోహితుడు. ఇతడు కాడు. వసిష్ఠుడు శ్రీరామునకు అధ్యాత్మం ఉపదేశించాడు. ఇతడు ఆ పని చేయలేదు. ఇతని పేరు కూడ వసిష్ఠుడు. ఇతని భార్యపేరు అరుంధతి అతి చక్కనిది. ఈమె భూలోక అరుంధతి. గుణగణములలో ప్రసిద్ధ అరుంధతితో సమానురాలు. కాని ఈమెకు తత్వజ్ఞానము మాత్రం లేదు. భర్తయందు అవ్యాజ ప్రేమకలది. మందగమన ఆ బ్రాహ్మడికి ఈమె సంసార సర్వస్వ పేటిక, అతడు ఒకానొకపుడు ఆచరియందు భార్యా సమేతుడై కూర్చుండి క్రింద తన పరివారముతో వేటాడవచ్చిన రాజును

చూచాడు. ఆ రాజు వైభవము వర్ణనాతీతము. దేవేంద్రునకు గూడ దుర్లభము. అంతటి చామరములూ అట్టి పతాకములూ ఆసితఛ్చత్రములూ అని తరసాధారణములు. అందరును నవరత్నఖచిత సువర్ణహారములతోనూ, భుజకీర్తులతోడనూ, అలంకృతులై ఉన్నారు. ఆ బ్రాహ్మణుడు ఈ రాజును జూచి, ఈతని వైభవమునకు అచ్చెరువొంది ఆహా! రాజరికము ఎంత సౌభాగ్యవంతము! నేను కూడ చతురంగ బలముతో, ఛత్రచామరాదులతో, తులతూగు రాజును ఎన్నడగుదును. ఎన్నడు కుంద మందరాది సుగంధ పవనములు, నా అంతఃపుర స్త్రీల రతి శ్రమబిందువులను స్పృశించును: నా అంతఃపుర స్త్రీల ముఖములను కర్పూరము చేతనూ దిగంగనలయొక్క ముఖములను పరిపూర్ణమయిన కీర్తి చేతనూ ప్రకాశించునట్లు ఎన్నడు చేతును"! అని ఆలోచించెను. అప్పటి నుంచి అదే సంకల్పముతో స్వధర్మ నిరతుడై యావజ్జీవము గడపెను. కొంతకాలమునకు ఆతనికి ముసలితనము వచ్చినది. మరణం ఆసన్నమైనది. భార్య అది చూచి కృశించినది. ఓ లీలా! నీవు నన్ను ఆరాధించినట్లే ఆమె కూడ నన్ను ఆరాధించినది. మానవులకు మరణము తప్పదని నిశ్చయించుకున్నది తుదకు తన భర్త జీవుడు తన ఇంటి నుండి వెడలకుండునట్లు వరమడిగినది నేనందుకు సమ్మతించితిని. పిదప కాలవశమున ఆ బ్రాహ్మణుడు మరణించెను. ఆతని జీవ చైతన్యము ఆ యింటనే బ్రహ్మ భావముతో నుండి, వెనుకటి సంకల్ప బలమువల్ల ఆ చిదాకాశ రూపముతోనే మహాశక్తి సంపన్నుడైన రాజు ఆయెను. అతడు ప్రభావముచే భూలోకమును జయించెను. ప్రతాపముచే స్వర్గమును ఆక్రమించెను. దయతో పాతాళమును పాలించెను, ముల్లోకములను, జయించెను. అతడు శత్రువులు అనే వృక్షములకు కాలాగ్ని రూపుడు, స్త్రీలకు అపరమన్మథుడు, సంసార విషయములు అనే చంచల వాయువులకు కదలని మేరువు. సజ్జనులు అనే పద్మములకు సూర్యుడు, యాచకులకు కల్పవృక్షము, సర్వ శాస్త్రములకు ఆదర్శము, బ్రాహ్మణోత్తములకు ఆధారము. ధర్మమను చంద్రునకు పూర్ణిమ. ఆ బ్రాహ్మణుడు ఇట్లు శవరూపుడై భూతాకాశ రూపమును దాల్చియుండెను. భార్య ఆ శవమును చూచి మిక్కిలి దుఃఖించెను. ఆమె హృదయము ఎండిన మినపకాయవలె రెండుగా బ్రద్దలాయెను. ఆమె కూడ కొయ్య

వలె శవాకారము చెంది, శరీరమును విడిచి, ఆతివాహిక దేహముతో (లింగ దేహముతో) భర్తను పొందెను. భర్త వెంటనుండి దుఃఖమును మాపుకొనెను. ఆ బ్రాహ్మణ దంపతులు మరణించి నేటికి ఎనిమిదవ రోజు జరుగుచున్నది. వారి ఇండ్లు, స్థలములు, భూములు, ధనములు, స్థిరచరాస్తులు, అన్నీ అట్లే ఉన్నవి. దంపతుల జీవితములు, ఆ కొండ చరియయందలి పల్లెలో ఆ యింటిలోనే ఉన్నవి.

## ౨౦ పరమార్థవర్ణనము (వసిష్ఠుడు, పద్ముని నిరూపించుట)

ఓ లీలా! ఆ బ్రాహ్మణుడే, ఇపుడు నీ భర్తయగు పద్ముడను రాజు. ఆ అరుంధతియను బ్రాహ్మణ స్త్రీయే నీవు. మీరిరువురు ఇపుడు రాజ్యమేలుచున్నారు. మీరే పూర్వము పార్వతీ పరమేశ్వరులవంటి బ్రాహ్మణ దంపతులు. ఇదీ నీ పూర్వజన్మ వృత్తాంతము. నిన్ను స్మరింపజేసితిని. ఇపుడు నీవు చూచెడి సర్గద్వయమువలె ప్రాక్తన సర్గముకూడ మిధ్యయే అగుచున్నది. కాన ప్రపంచము ఎప్పుడును మిధ్య అని గ్రహించుము. బ్రహ్మ చైతన్యమే భ్రాంతివలన జీవభావమును పొందును. ఇది మొదటి భ్రాంతి. సర్వ ప్రపంచ భ్రమకూ ఇది మూలము. వెనుకటి వెనుకటి భ్రమలు ముందు ముందు భ్రమలకు హేతువులు. ఈ ప్రపంచము ప్రపంచ దృష్టిలో అసత్యము. అధిష్ఠానమయిన బ్రహ్మ దృష్టిలో సత్యమూ కావచ్చును. కనుక మిధ్యాజ్ఞాన విజృంభితమయిన సృష్టులు అన్నీ అసత్యములే. మిధ్యాజ్ఞాన విజృంభితముకాని సృష్టి లేదు. కనుక ఒకటి భ్రాంత ప్రపంచమనీ, మరొకటి అభ్రాంత ప్రపంచమనీ అనుకొనవలసిన పని లేదు. అని అన్నది సరస్వతీ దేవి.

రామచంద్రా! ఈ మాటలన్నీ విని లీల కొంతతడవు ఆశ్చర్యపడి, సరస్వతీదేవితో ఇట్లన్నది. దేవీ! నీ మాటలు చాలా అసంగతములు. నీవు చెప్పినట్లు ఎన్నటికీ జరుగదు. ఆయన ఇంటిలోనున్న ఆ బ్రాహ్మణ జీవు డెక్కడ? ఈ విశాల దేశములో నున్న మేమెక్కడ? నేను సమాధిలో చూచిన నా భర్తగారి ప్రపంచమే నా ఇంటిలో ఇముడుట (ఉండుట) అసంభవము. ఆ పరలోకము, ఆ భూమి, ఆ శైలములు, ఆ దిక్కులు,

అవి అన్నీ, ఇట నాయింటిలో ఎట్లు యిముడగలవు.? కనుక నీవు చెప్పిన కథ చాల అసమంజసము. ఎక్కడనయినా ఆవగింజ పొట్టలో ఐరావతము ఇముడునా? దోమ సింహముతో యుద్ధమాడునా? పిల్ల తుమ్మెద మేరు పర్వతమును పద్మముయొక్క బొడ్డులో ఉంచి భ్రమింగునా? కలలోని మేఘ గర్జితమును విని నెమళ్లు నాట్యమాడునా? ఇవన్నీ జరిగితే, కొండలూ, గుట్టలూ, అడవులూ, నాయింటిలో ఉంటుట జరుగుతుంది. కనుక ఇది పొసగుట ఎలాగో దయచేసి చెప్పుము. ఉత్తములు అను గ్రామ్యాలను కలవరపెట్టరు. అని అడిగినది లీల.

దేవి:— లీలా! నేను ఎప్పుడూ అబద్ధం చెప్పను. అబద్ధమాడకూడదను మర్యాదను నేను ఏర్పరచి దానిని నేనే భంగ పరతునా? ఇతరులు లోక శాస్త్ర మర్యాదలను చెఱుచుచుండగా నేను స్థాపించుటకు యత్నించే దానను. అలాంటి నేనే "నాన్నృతం వదేత్" అను మర్యాదను భంగ పరచితే ఇంక దానిని పాలించే వారెవరు?. ఆ బ్రాహ్మణుని జీవాత్మ, ఆ గ్రామమునందు, ఆ ఇంటిలోనే, ఆకాశరూపమును పొంది, ఆకాశ రూపముతోనే మహారాజ్యమును చూస్తూ ఉన్నాడు. మీరు మరణించి నందున వెనుకటి జన్మమును మరచారు. స్వప్నంలో జాగ్రదవస్థా విష యాలు మరపుకునస్తాయి. కలలో ముల్లోకములు కనిపిస్తాయి. సంకల్పము నందునూ, అట్లే కనిపిస్తాయి. మరుభూమియందు ఉదకము కనిపిస్తుంది. అట్లే ఆ బ్రాహ్మణుడు తన యింటనే వన, పర్వత, పత్తనాదులతో నిండిన భూమిని చూచాడు. పంచకోశముల మధ్య నున్న సత్యమయిన చిదాత్మవలన అసత్యమయిన ఈ ప్రపంచం భాసిస్తోంది. అసత్యమయిన సంస్కారమువల్ల పుట్టినందునగూడ ఈ ప్రపంచం అసత్యం అనాలి. మృగ తృష్ణాతరంగిణి (ఎండమావుల ఏరు) అసత్యమయితే అందులోని తరంగం కూడా అసత్యమే అవుతుంది. కాబట్టి "నీ యిల్లూ, నీవూ, నేనూ" ఇది అంతా ఆ బ్రాహ్మడి గృహాకాశ కోశంలో ఉన్నట్లు నమ్ము. ప్రపంచం అంతా కేవలము చిదాకాశమయము. స్వప్నంలో స్వప్న ప్రపంచం చిదాత్మయందు ఉంటుంది. సకల ప్రపంచమూ చిదాత్మయందే భాసి స్తోంది. ఈ లోకానుభవాన్ని కాదన లేరు. కనుక చతుస్సముద్ర పరీతమైన భూమి యావత్తూ, ఆ బ్రాహ్మణ గృహంలో తిరిగే బ్రాహ్మణుని జీవా

కాశంలో ఇమిడి ఉంది. ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. నేను చెప్పిన అసత్యమూ లేదు. ఓ చిన్నదానా! ప్రతి పరమాణు చిదాత్మయందునూ ఈ జగద్బృందము నిండి ఉన్నది. నీకు సందేహం ఎందుకు?

లీల:— దేవీ! ఆ బ్రాహ్మణుడు ఎనిమిది రోజుల క్రిందట మరణించాడు. మేమిక్కడపుట్టి కొన్ని సంవత్సరాలయింది. నిజంగా ఆ బ్రాహ్మణ దంపతులమే మేమయితే, మేము పుట్టి ఏ డెనిమిది రోజులే కదా కావాలి. అలా లేదే, ఇది ఎలా పొసగుతుంది?

దేవి:— లీలా! ఇదేమిప్రశ్న? విశాలమయిన ప్రదేశంలో ఉండదగిన వస్తువులు, సంకుచిత ప్రదేశంలో చిదాత్మయందుంటున్నాయి అంటే, "ఈ కాలంలో ఉండదగినవి పూర్వ కాలంలో ఎలా ఉన్నాయి? పూర్వ కాలంలో ఉండదగినవి ఈ కాలంలో ఎలా ఉన్నాయి?" అనే ప్రశ్న అనవసరం కదా? చిదాత్మయందు దేశదైర్ఘ్యం ఎలా లేదో, అలాగే కాలదైర్ఘ్యంకూడా లేదు. సర్వదేశ సర్వకాలములందు ఉండు వస్తువులన్నీ చిదాత్మయందు కనిపిస్తాయి. ఆత్మ సర్వ ప్రపంచ రూపుడు. ప్రపంచం ఎట్లు ప్రతిభా మాత్రమో? అట్లే క్షణము, కల్పము, అనే కాలపరిమాణం కూడా ప్రతిభా మాత్రమే. (ప్రాతిభాసికమే.) అనగా "నేను. నీవు" అను అధ్యాసకలవానికే, క్షణము, కల్పము, మొదలగు ప్రపంచం అంతా. ప్రతిభాసిస్తుంది. మూర్ఛపోయిననాడు క్షణకాలంలో ప్రాక్తన విషయాన్ని మరచి నవీనంగా ఏమేమో చూస్తాడు. ఆలోచిస్తాడు. రెప్పపాటు మాత్రంలో వ్యోమరూపంలో ఉండి, తాను ఒక చోట ఉన్నా, తానే అన్నిటికీ ఆధారం అనుకుంటాడు. తాను తలచే శరీరము తనదనుకుంటాడు. ఏది చిత్తంలో సంస్కార రూపంగా ఉంటే దాన్ని అంతా చూస్తూ ఉంటాడు. "నేను వీనికి కుమారుణ్ణి." "నాకింత వయస్సు." "నాకు వీరు బంధువులు." "ఇది నాయిల్లు." "నేను పిల్లవాడనుగా పుట్టాను." "నేనిట్లు వృద్ధిపొందాను." నా బంధువులంతా ఇక్కడ తిరుగుచున్నారు. అని ఏమేమో భావన చేస్తాడు. చిత్తాకాశమనేది చాలా ఘనమయినదీ ఏక రూపమయినదీ. కనుక, ఇంకా ఏమేమో ఆ చిత్తంలో గోచరిస్తూ ఉంటాయి. ఈ విధానము మిథ్యా మరణములను పొందిన వాడియందు

కూడ లోకంలో కద్దు. ఇంతటి ప్రపంచం ప్రీడు చిత్తంలో చూచినా, తుదకు విచారిస్తే ఇక్కడ పుట్టిందీ, ఉన్నదీ ఏమీ లేదు. అంతా స్వప్న తుల్యం. సర్వవ్యాపి అయిన ఆ చిచ్ఛక్తియే స్వప్నాన్ని చూస్తోంది. అదే పరలోకాలను చూస్తూ ఉంది. పరలోకాన్ని ఎలా చూస్తోందో ఇహలోకాన్నికూడా అలాగే చూస్తూ ఉంది ఆ చిచ్ఛక్తి. దానికి స్వప్న, పరలోక, ఇహలోకముల, గురించిన భేదం ఏమీ లేదు. అజ్ఞానులకు మాత్రం ఇందులో కొన్ని సత్యములనీ, కొన్ని అసత్యములనీ గోచరించ వచ్చు. అంత మాత్రం చేత ఏమీ లాభం లేదు. కనుక ఈ ప్రపంచం కేవలం ఆత్మరూపం అందువల్ల ఇది జగద్రూపంతో అసత్యం. మనకు ప్రత్యక్షాది ప్రమాణాలకు అధిష్ఠాన చైతన్యమే ఈ రూపంగా భాసిస్తోంది. నీటికంటె తరంగములు వేరుకావు. బ్రహ్మకంటె జగత్తు వేరుకాదు. కనుక కనిపించే ప్రపంచం అంతా శూన్యం. బంధు మిత్ర, పుత్ర, కళత్ర, మాతృ, పిత్రాది బుద్ధులన్నీ వాసనా భేదంతో ప్రవర్తిస్తున్నాయి. ఆ వాసనలు ప్రతి నియత దేశకాలానుగుణంగా ఉద్రేకిస్తూ ఉంటాయి. ఒక్కొక్క జీవుడు ఒక్క నిముషంలో ఒక కల్పం గడచిందను కుంటాడు. హరిశ్చంద్రునకు ఒక రాత్రి పన్నెండు సంవత్సరములయింది. కాంతా విరహము కలవాడు ఒక్క రోజును సంవత్సరంగా భావిస్తున్నాడు. స్వప్నం లో ఒకానొకడు తాను మరణించాననుకుంటాడు. తాను మరొకని కుమారుడనుకుంటాడు. అన్నము తినకుండా పరుండి కలగాంచిన వానికి అన్నం తిన్నట్లు కలవస్తుంది. తిని పరున్నవానికి తిననట్లు స్వప్నం వస్తుంది. ముగ్ధజనులయందు ఈ పై చరిత్ర అంతా అనుభవసిద్ధం. కనుక లీలా! ఈ ప్రపంచం. మిరియపు గింజలో కారం. ఉన్నట్లూ, స్తంభములమీద చెక్కని బొమ్మలున్నట్లూ, కనిపించకుండా ఆత్మయందు ఉన్నాయి. కనుక దీనియందు సత్యమను బుద్ధికాని, ఇది బంధమను బుద్ధికాని, దీనినుంచి మోక్షం కావాలను బుద్ధి కాని అనవసరం.

## ౨౧ విశ్రాంత్యుపదేశము

జీవుడికి కళ్లు తెరిస్తే కంటికి రూపాలు కనిపిస్తాయి. అలాగే ముగ్ధ డికీ (మోహము చెందినవానికీ) మరణించినవానికీ, స్వర్గాదిలోకములూ,

గృహములూ పృథ్వ్యాదిభూతములూ కనిపిస్తాయి. తన మరణం తనకు కలలో గోచరిస్తుంది. ఇతరుడు తనకు తండ్రిగా కలవస్తుంది. అనుభవించనిదీ, తాను చూడనిదీ కూడ అనుభవించినట్లు, చూచినట్లు స్మృతికి వస్తుంది. ఇదంతా చిదాకాశంలో భ్రాంతి భాసురము. గోడలేని బొమ్మవంటిది ఈజగత్తు- వాసనామయము. నిర్వికారమయిన చైతన్యమునందు దూరము, సమీపము, క్షణము, ఘటిక, దినము, పక్షము, మాసము, వర్షము, కల్పము, మున్నగు విపర్యాసములు కల్పింపబడుచున్నాయి. వాసనాజన్యమయిన ఈ ప్రపంచం కొందరియడల స్మృతి రూపము. కొందరియడల ప్రతిభా మాత్రమే (అనుభవ మాత్రము.) మొదటి సృష్టియందు ప్రజాపతియగు చతుర్ముఖ బ్రహ్మకు ప్రపంచము అనుభవమాత్రమే (ప్రతిభామాత్రమే) కాని స్మృతిరూపముకాదు. ఎలాగంటే! పూర్వకల్పంలో ప్రపంచానుభవంగల ప్రజాపతి కల్పాంతంలో ముక్తిపొందాడు. ఇప్పుడీ నవీనసృష్టిలో ఈఅధికారానికి వచ్చినపుణ్యశాలికి ప్రపంచసృష్ట్యనుభవంలేదు. అనుభవములేనిదే సంస్కారము (వాసన) పుట్టదు. వాసనలేని (సంస్కారములేని) జ్ఞానము స్మృతికాదు. అనుభవ రూపమే అవును. కనుక కొందరకిది అనుభూతమై స్మృతి రూపమగును. మరికొందరకు అనుభూతము కాకస్మృతిరూపమగును. ఎట్లయినను ఈ ప్రపంచం వాసనామయమయిన చిత్తమునందు స్మృతి రూపముగాఉండి బంధమయినందున దీనిని పూర్తిగా విస్మరించడమే మోక్షము. ఇది అవిద్యానివృత్తివల్లకాని తొలగదు. తత్వజ్ఞానమువల్లకాని అవిద్యనివర్తించదు. కనుక జీవులు తరించటానికి తత్వజ్ఞానము మిక్కిలి ఆవశ్యకము. కొందరు యోగముచే మనోవృత్తులు శాంతించుననీ, మనోవృత్తులుశాంతిస్తే (నిరోధిస్తే) ప్రపంచం పూర్తిగా మరపుకువస్తుందనీ, ప్రపంచాన్ని పూర్తిగా మరచుటయే జీవునకు ముక్తి అనీ, అంటారు. ఆపద్ధతి పట్టిన దయ్యాన్ని వదలుకొట్టుకోవడంకాని, దయ్యంపట్టకుండా చేసికోవడము కాదు. ఒక దయ్యాన్ని వదల్చుకుంటే ఇంకొక దయ్యం ఆవేశించవచ్చు. అంతమాత్రాన లాభంలేదు. అలాగే యోగంవల్ల విక్షేపాలు కొన్ని తగ్గినా, వ్యుత్థానదశలో మళ్లీ క్రొత్త విక్షేపాలు పుట్టవచ్చు. తత్వజ్ఞానంచేతనయితే కారణమయిన అజ్ఞానం నశిస్తుంది కనుక ఇక దృశ్య

ప్రపంచస్మృతి కలుగదు. ఒకవేళ దగ్ధపటన్యాయంగా దృశ్యం (ప్రపంచం) భాసించినా, అది జీవున్ని ఆవరించదు. దానివల్ల బాధలేదు. కనుక మోక్షమునకు తత్త్వజ్ఞానం మిక్కిలి అవసరం.

దేవీ! జన్మకు సంస్కారం (వాసన) కారణం అని అంటిరి. సంస్కారము అనుభవమువల్ల కాని కల్గదు. నేను బ్రాహ్మణ బ్రాహ్మణీరూప జన్మలో నుండగా మాకు ఈ రాజు, రాణి జన్మయొక్క అనుభవంలేదు. ఇప్పటి జన్మయొక్క అనుభవం పూర్వజన్మలో ఉండడము అసంభవం. కనుక అనుభవంలేనందున ఈ జన్మకు కారణమయిన సంస్కారంలేనట్లే మాకు. ఇంక మాకీజన్మ ఎట్లావచ్చింది?.

దేవి:- లీలా! పూర్వానుభవ జన్యసంస్కారమొక్కటే వాసన కాదు. ఇంకొక రకమయిన వాసనకూడ ఉంది. దానివలనగూడ జన్మ సిద్ధించవచ్చు. అనుభవజన్య సంస్కారమూ, అనాది అవిద్యాశక్తిరూప సంస్కారమూ, (వాసన) అని సంస్కారాలు రెండు విధాలు. ఈ రెంటిలో ఏ ఒక్కటయినా జన్మకు కారణం కావచ్చును. కనుక అవిద్యాశక్తిరూప సంస్కారంవల్లకూడ మీకీజన్మ రాదగును. అవిద్యాశక్తిరూపమగు వాసన అనగా రాజును చూచి నేను రాజు నెట్లగుదును? అను గట్టిసంకల్పము. దానివల్ల మీకీ జన్మవచ్చినది. లేక అనుభవజన్య సంస్కారమే జన్మకు కారణంగా ఉండాలి అని నీకు పట్టుదల ఉంటే, అపుడు పితామహుడు (బ్రహ్మ) సర్వజ్ఞుడు కనుక అతనికి కాబోవుదానియందుగూడ అనుభవము సంభవించుటవలన, ఆయనగారి అనుభవజన్యసంస్కారమే మీ జన్మకు కారణము కావచ్చును. ఆ పితామహునియొక్క శరీరసృష్టికి (జన్మకు) మాత్రము ఆయనగారి సంస్కారం కారణంకాదు. పూర్వకల్పంలోని పితామహుని సంస్కారమూ కారణంకాదు. ఆయనగారు ఆ కల్పాంతములో ముక్తి పొందారు. కనుక ఆయనగారి సంస్కారం లేదు. ఇంకపోతే పూర్వోపదిష్ట జన్మ (బ్రహ్మ) యొక్క దేహాది వాసనతో కూడుకున్న మాయోపహిత చైతన్యము అలాగే ఉండటంచేత, ఆ చైతన్యమే ఈ క్రొత్త బ్రహ్మగా వివర్తం చెందినదని అనాలి. ఇక ఆ పూర్వ (హిరణ్యగర్భుని) దేహాది వాసన కూడ ఆయనగారి తత్త్వజ్ఞానంచేత నశించిందని ఆలోచించేయెడల, అపుడీ

నవీన ప్రజాపతికాకతాళీయంగా ప్రతిభామయుడుగా తయారయినాడనాలి. ప్రజాపతికారణంలేకుండా ప్రాతిభాసికంగా పుట్టాడు కనుకనే ఆతడు సృష్టించిన ప్రపంచంకూడా ప్రాతిభాసికమయి బాధితమవుతోంది. ఇందు వాస్తవమేమీలేదు. అంతా చిన్మయము. ఈ రెండు విధములయిన సంస్కారంవల్లకలిగే స్మృతులు రెంటికి మాయాశబలబ్రహ్మయేకారణం. శుద్ధబ్రహ్మయందు కార్యకారణ భావము మొదలయినభేదం ఏమాత్రం లేదు. కార్యకారణ భావమనే వికల్పము మాయాకల్పితము. విమర్శనా జ్ఞానం లేకపోవుటచే ఈవికల్పజ్ఞానం కలుగుతోంది. విమర్శిస్తే ఇది అంతా నశిస్తుంది. "ఎలాగంటే మట్టిముద్దవేరు కుండవేరు" అనే జ్ఞానం మనస్సులో కలిగినప్పుడే ఆరెంటికి కార్యకారణ భావజ్ఞానం కలుగుతుంది. విమర్శనా జ్ఞానంచేత, ఇది (కుండ) అంతామట్టెఅనే జ్ఞానం కలిగేయెడల, ఇంక కార్యమూ కారణమూఅనే జ్ఞానానికి ప్రసక్తేఉండదు. కార్యకారణభావ మూలేదు. అలాగే, మాయిఅగు ఈశ్వరుడు వేరు ప్రపంచమువేరు, అను జ్ఞానమున్నపుడే ప్రపంచమునకు ఈశ్వరుడు కారణమను జ్ఞానము ఉనయి స్తుంది. అంతా అద్వితీయమయిన సన్మాత్రమేఅను విమర్శగలవాడికి, మాయియగు ఈశ్వరుడూలేడు. ప్రపంచమూలేదు. "ఈశ్వర ప్రపంచము లకు కార్యకారణభావమూలేదు." ఈ అర్థమునందు స్వారాజ్యసిద్ధిఅను గ్రంథము ప్రమాణము.

శ్లో॥ పిండావస్థా ఘటత్వే మనసికలయతః సేఽలుకాంత్యత్వధీః స్యాత్ ।
మృన్మాత్రం యద్వదేకం స్ఫుటమభిమృశతః నైవహేతుర్నకార్యం ।
తద్వన్మాయి ప్రపంచౌ ఘటితికలయతః బ్రహ్మ విశ్వస్య హేతుః ।
సన్మాత్రం త్వేకరూపం పటుపరిమృశతః నైవమాయీ న విశ్వమ్ ॥
స్వా॥ సి॥ ఉ॥ శ్లో॥ ౧౧

కాబట్టి పరమాత్మయందు ప్రపంచము సంభావనా మాత్రమేకాని వాస్తవముకాదు. దేవీ! నీవనుగ్రహించిన దివ్యదృష్టివలన నాకు చక్కని విజ్ఞానము లభించింది. ప్రాతఃకాల సూర్యప్రభచేతకంటికి బాహ్యప్రపంచ ము స్ఫుటంగా కనిపించినట్లు నాకు ఏమాత్రము అభ్యాసము లేకున్నా తత్త్వముగోచరిస్తోంది. నాకు ఆ బ్రాహ్మణుని గృహముచూడాలని కుతూ

హాలంగా ఉంది. దీనిని తీర్చుము. నన్ను ఆ బ్రాహ్మణుని యింటికి తీసికొని పొమ్ము. ఆ గిరి గ్రామమును జేర్చుము. ఆ బ్రాహ్మణుని జూతును. ఆ ప్రపంచమును విలకింతును.

లీలా! నీకా కోరిక ఉన్నయెడల వెనుకటివలె సమాధిచే ఈ దేహమును మరచిపో. పరమపావనమయిన చిన్మయశరీరాన్ని సంపాదించుకో. స్థూలదేహాభిమానమును విడిచిననే కాని చిదాకాశమునందలి ఆ ప్రపంచమును చూడలేవు. దానిని చూచుటకు ఈ స్థూలము ప్రతిరోధకము. (అడ్డు.) దీనిని విడచినచో అనర్గళంగా ఆ బ్రాహ్మణుని గృహము చూడగలవు.

దేవీ! ఈ దేహముతో ఆ ప్రపంచమును ఏల చూడలేము? ఏమి అక్కడ యుక్తి? అనుగ్రహించి సెల విమ్ము.

లీలా! ఈ లోకములన్నియు మాయామాత్రములు. కనుక స్వరూపము లేనివి. మిథ్యాజ్ఞానమువల్ల ఆకారముకలవిగా కనిపించుచున్నవి. బంగారమునందు ఊర్మికాత్వము (అంగుళీయత్వము) గోచరించినట్లు. బంగారము ఉంగరముగ గోచరించుచున్ననూ, అందు ఊర్మికాత్వము లేదు. అలాగే జగత్తునందు జగత్త్వములేదు. ప్రపంచమనేది శూన్యము. బ్రహ్మయే ఇలా కనబడుచున్నది. కనుక ప్రపంచము మిథ్య. బ్రహ్మ సత్యము. ఈ యర్థమునందు వేదాంతములు ప్రమాణములు. గురువుల ఉపదేశములు ప్రమాణములు. ఆత్మానుభవము ప్రమాణము. బ్రహ్మయే బ్రహ్మను తెలిసికొనుచున్నాడు. అబ్రహ్మ (అజ్ఞాని) బ్రహ్మను తెలిసికొనలేడు. నీకు మిథ్యాజ్ఞానంచేత భేదబుద్ధి నశించలేదు. కనుకనే బ్రహ్మను నీవు తెలియకున్నావు. నిరూఢమయిన బ్రహ్మజ్ఞానంగల మాబోంట్లము బ్రహ్మను తెలిసికొనుచున్నాము. నేను ఈ దేహముతోనే ప్రపంచంలో బ్రహ్మను సాక్షాత్కరించుకొనుచున్నాను. హిరణ్యగర్భాదులు సదా బ్రహ్మను దర్శించుటకు యోగ్యులు. కనుకనే వారు జగత్తులో ఉండియే బ్రహ్మను జూచుచున్నారు. నీకు మాలాంటి అభ్యాసంలేదు. అందువలన నీవు బ్రహ్మనూ, గిరిగ్రామమునూ, ఈ దేహముతో చూడలేవు. నీ సంకల్పాత్మకమయిన గంధర్వనగరాదులనే నీవు ఈ దేహంతో పొందలేక

పోతే, ఇతరుని సంకల్ప పురమును ఈ దేహముతో నీవెట్లు పొందుదువు? కనుక ఈస్థూల దేహమునువిడిచి చిచ్ఛరీరమును స్వీకరించు. చిదాకాశంలో ఉన్న ప్రపంచం చూడడానికి, చిచ్ఛరీరమే తగినది. స్థూలశరీరముతగదు. స్థూల శరీరము స్థూల ప్రపంచమును చూడగలదు. మానసిక శరీరము మానసిక ప్రపంచాన్ని చూడగలదు. మొత్తము ప్రపంచం అంతా సాంకల్పికమయినా ఈ అవాంతరభేదం తప్పదు. ఈయది సృష్ట్యారంభం లో, పరమేశ్వరుని సంకల్పమువల్ల ఏర్పడింది. దీనిని తప్పింప నెవ్వరికిని సాధ్యముకాదు.

దేవీ! మన మిరువురముకలిసి ఆ బ్రాహ్మణుని యింటికి వెళ్లుద మంటివే. నేనీ స్థూల దేహమును ఇచ్చటనుంచి, శుద్ధసాత్త్వికమగు మాన సిక శరీరముతో ఆలోకమునకు వత్తును. నీవు ఈశరీరముతో ఎట్లు వత్తువు?

లీలా! నీ స్థూల శరీరము నీకు పాంచ భౌతికముగా గోచరించు చున్నది. అయినా అది శూన్యమే. నా శరీరమునందు నాకాదృష్టిలేదు. నా శరీరము శుద్ధసాత్త్వికము. చిన్మయము. కేవల ప్రతిభామాత్రము. కాలినగుడ్డకూ బూడిదకూ ఎంతటిభేదమో, పరబ్రహ్మకూ నాశరీరమునకూ అంతే భేదము. కనుక నేనీ శరీరమును విడువవలసిన పనిలేదు. ఈ శరీరము తోనే నేను వత్తును. నీరు నీటితో, నిప్పు నిప్పుతో, గాలి గాలితో కలిసినట్లు, ఈ నా దేహము మనోమయ దేహములతో కలియును. అయితే "నీశరీరము కూడా వాస్తవమున సాంకల్పికమే కనుక, నీ శరీరము కూడ మనోమయ శరీరములతో కలిసి ఆ బ్రాహ్మణుడున్న లోకమున కేల వెళ్లదు?" అని నీకు సందేహం కలుగవచ్చును. నాకూ నీకూ భేదం ఉన్నది. నాకు నా శరీరమునందు పార్థివమను బుద్ధి లేదు. చిన్మాత్రమను బుద్ధి కలదు. నీకు నీశరీరమునందు పృథ్వీ వికారమను బుద్ధియే కలదు. చిన్మయమను బుద్ధి లేదు. అందువలన నా శరీరముతో నీశరీరము అభిన్నము కాదు. కల్పిత శైలమునకును వాస్తవ శైలమునకును, పరస్పర సంఘర్షణ జరగదు. నీకు చిరకాల భావనవలన నీ శరీరమునందు ఆధిభౌతికమను బుద్ధియే కలదు. నాకు నా శరీరమునందు చిరకాలమునుంచీ ఆతివాహికమను (సూక్ష్మ మను) బుద్ధియే కలదు. అందుచే నీవీశరీరమును విడచినగాని ఆ బ్రాహ్మణుని

గిరిగ్రామమును జేరజాలవు. సమాధి అభ్యాసంచేత. నీకు ఈ స్థూల దేహంమీద వాసన క్రమంగా ఎప్పుడు తగ్గునో అప్పుడు నీకు దానియందు పార్థివమను బుద్ధినివర్తించును. అపుడు నావలె నీకు గూడ నీ దేహం మీద ఆతివాహికమను భావ మేర్పడును.

దేవీ! ఈ దేహము ఆతివాహికమను జ్ఞానమువాసనాక్షయంచేత వృఢపడితే ఈ స్థూలదేహం ఆతివాహిక భావమును పొందునా? లేక నశించునా?

లీలా! తత్త్వవేత్తలుకాని వారి దేహము నశించును. తత్త్వవేత్తల దేహము తత్త్వజ్ఞానముచే బాధితమై దగ్ధ పటాకారమగును. కనుక అది లేనిదానితో సమానము. దగ్ధపటము (కాలినగుడ్డ) వెనుకటి సంస్కారమువలన గుడ్డయొక్క ఆకారముగా కనిపించుచున్ననూ, అది గుడ్డ కానట్లే. అది లేనట్లే. అట్లే తత్త్వవేత్తల దేహము కూడా తత్త్వజ్ఞాన బాధితమయిన తరువాత వాసనలచే దేహాకారముగా భాసించుచున్ననూ, సమాధి అభ్యాసం చేత ఆవాసనలు క్షీణిస్తే సూక్ష్మభావమునే చెందును గాని, నశించదు. రజ్జుజ్ఞానముచే సర్ప భ్రాంతి నశిస్తే అక్కడ సర్పము నశించినదందుమా? నశించలేదందుమా? ఏదనుటకు తావు లేదు. అసలు అక్కడ వస్తువనేది ఉంటే అది నశించినదనియో, నశించ లేదనియో చెప్పుటకు వీలగును. వస్తువే లేనపుడు ఏమని చెప్పవలెను? రజ్జు తత్త్వ జ్ఞానమువల్ల రజ్జువునందు సర్పము కనిపించుటలేదు. అలాగే ఆతివాహిక జ్ఞానమువల్ల ఆధిభౌతిక దేహము కనిపించదు. బ్రహ్మయందు దేహాది ప్రపంచము కల్పితమని వ్యావహారిక దృష్టి ననుసరించి చెప్పితిమి. తత్త్వ దృష్టిలో ఆ కల్పనకూడ లేదు. కనుకనే గౌడపాదాచార్యులిట్లు చెప్పిరి.

శ్లో॥ ప్రపంచో వినివర్తేతకల్పితో యది కేనచిత్ ।
ఉపదేశాదయం వాదః జ్ఞాతే ద్వైతం నవిద్యతే ॥ అని.

లీలా! మేమందరము, మా దేహాదులను పరబ్రహ్మ స్వరూపంగా జూచుచున్నాము. ఆ పరబ్రహ్మ తన మహిమయందు తానుండినట్లు తలచుచున్నాము. నీకు అలాంటి నిరూఢమయిన జ్ఞానము లేదు. కనుక

నీవు మావలె గ్రహించలేకున్నావు. అయితే దృశ్యరహితమయిన శుద్ధ చిత్తు దృశ్య ప్రపంచ రూపముతో ఉనికిని ఎట్లు పొందినదని నీకు సందేహం కలగవచ్చును. విను సమాధానము. సృష్టి ప్రారంభంలో లింగాత్మ (హిరణ్యగర్భుడు) ఆవిర్భవించాడు. ఈ చిత్తు ఆ లింగాత్మను గోచరింప జేసికొంటూ ఉన్నది. అప్పుడు ఆ చిత్తునకు చిత్త్వమను ధర్మము ఏర్పడినది. ఆ లింగాత్మ క్రమంగా పంచీకరణమును జెంది స్థూల రూపం చోదేసరికి, ఈ చిత్తు కూడా దాని ననుసరించి దృశ్య రూపాన్ని చెంది భ్రాంతితో దాన్ని చూస్తూ ఉంటుంది.

దేవీ! నీవు చెప్పిన సమాధానం పొసగుట లేదు. ఎట్లనగ? పూర్వ కాలంలో ఉన్న పాలు ఉత్తర కాలంలో పెరుగుగా పరిణమిస్తాయి. పెరుగుగా మారిన దశలో అచ్చట పాలుండవు. ఇట్టి స్థితిలో నీవు చెప్పిన శుద్ధ చైతన్యమునకు దేశకాలాది సంబంధమే లేకపోతే, అట్టి బ్రహ్మయందు ప్రథమ వికారముయొక్క కల్పన యెట్లు పొసగును? కాల సంబంధముకల దానియందు కదా. మొదట వికారమను పదము పుట్టేది?

లీలా! నీవు చెప్పినది నిజమే. వికారమనునది సత్యమని మేమంగీకరిస్తే నీవు చూపిన దోషము పట్టును. ఆ వికారము మిథ్య అయినప్పుడు ఈ దోషమే పట్టదు. బంగారమునందు కటకత్వము, నీటియందు తరంగత్వము, సంకల్ప నగరాదులందు సత్యత్వము, ఎట్లు లేదో అట్లే సత్య స్వరూపుడయిన బ్రహ్మయందు, దృశ్యకల్పన లేదు. ఇతడు సర్వకల్పనా వ్యతిరిక్తుడు. శాంతుడు, అద్వితీయుడు, అజుడు, సర్వవ్యాపకుడు. అతి స్వచ్ఛమయిన మణి యొక్క ప్రతిభాసవలె ఈ ప్రపంచము ఇతని యొక్క ఆపాతమయిన ప్రతిభాస.

లీల:— దేవీ! ఇంతవరకు మేము ఈ ద్వైత కల్పనలో పడి తిరుగుచున్నాము కదా? ఎవరు మమ్ము ఇలా త్రిప్పింది. ఎవరివల్ల మేము ఇలా చెడిపోతిమో సెలవివ్వు?

దేవి:— లీలా! నిన్ను మరొకరెవ్వరు చెడగొట్టలేదు. నీ అవిచారమే నిన్ను చెరచినది. అవిచారము అనునది అందరకు స్వతస్సిద్ధము. అవి

చారమనగా అవిద్య. అది విచారముచే నశించును. అందుకు ఎక్కువ కాలము పట్టదు. ఈ జగత్తు శుద్ధబోధ రూపము. నిజస్థితిలో ఇందు అవిచారమూ, విచారమూ, అవిద్యా, బంధమూ, మోక్షమూ, అనేవి ఎవ్వియూ లేవు. ఇంతవరకు నీవు విచారించలేదు. అందువల్ల నీకు జ్ఞానోదయం కలగలేదు. నీవు భ్రాంతిలో ఉన్నావు. ఇప్పుడు నీకు బోధకలిగింది. ముక్తురాలవయితివి. నీ చిత్తంలో వాసనాక్షయమనే బీజం పడింది. ఈ దృశ్య భ్రాంతి మళ్లీ పుట్టదు నీకు. ద్వైతవాసన నీచిత్తమును ఆక్రమించదు. ప్రపంచమనేది అసలు పుట్టకనేపోతే అది పోయినతరువాత మరల వచ్చుట అసలే సున్న. నీ చిత్తంలో నిర్వికల్ప సమాధి నిరూఢివల్ల వాసనాక్షయమనే బీజం అకురించగానే సంసార బీజములయిన రాగద్వేషాలు నశించాయి. అవి మళ్లీ పుట్టవు. అవి లేకపోతే సంసారం లేదు. నీవు నిర్వికల్ప సమాధి స్థితియందు స్థిరపడగలవు.

## ౨౨ విజ్ఞాన వర్ణనము

లీలా! మెలకువవచ్చి లోగడిది స్వప్నమని తెలిస్తే స్వప్నప్రపంచం అంతా సున్న కదా? అలాగే తత్త్వజ్ఞానంచేత వాసనాక్షయం అయితే అనుభూతమయిన ఈ స్థూల దేహం సున్న. స్వప్న పరిజ్ఞానంవల్ల స్వప్న శరీరము నశించినట్లు వాసనాక్షయంవల్ల జాగ్రచ్ఛరీరం కూడా నశిస్తుంది. స్వప్న దేహాంతమునందు ఈ స్థూల దేహమగపడునట్లు, జాగ్రద్దేహాభావన నశిస్తే ఆతివాహిక దేహమగపడును. స్వప్న వాసనలు పూర్తిగా అంతరిస్తే సుషుప్తి కలుగును. అలాగే జాగ్రద్వాసనలు పూర్తిగా నశిస్తే ముక్తి దొరకును. జీవన్ముక్తుల వాసన వాసన కాదు. అది శుద్ధసత్త్వమయము అధిష్ఠానమయిన సత్తా సామాన్యమునకే శుద్ధ వాసనయను పేరు కలిగింది. భస్మికు దగ్ధపటమని (కాలినగుడ్డయని) పేరిడినట్లు. కనుక అంతకు పూర్వమందున్న సర్వవాసనానుగత సత్తా సామాన్యముకాని, అది వాసనకాదు. వాసనలులేని నిద్రను సుషుప్తి అంటారు, వాసనలు నశించిన జాగ్రత్తును ఘనమైన మోహమంటారు. అనగా అనుద్భూతవాసనలుగల నిద్ర సుషుప్తియనియు అభిభూతవాసనలుగల జాగ్రత మూర్ఛ అనియు అర్థము. వాసనలు సమూలము నశించిన స్థితి తురీయము. అది నిద్రయగుగాక. జాగ్రత

యగుగాక. ఈ స్థితి పరతత్త్వము తెలిసినప్పుడే కలుగును. ఇదే స్థితిలో నుండి జీవించియున్న యడల వారిస్థితి జీవన్ముక్తి అనిపించుకొనును. ఈ స్థితి అముక్తులకు తెలియబడదు. సమాధి పాటవమువలన శుద్ధ సత్త్వము నందు చిరకాలము స్థిరపడిన చిత్తము, వాసనాక్షయమును జెంది, ఆతి వాహికత్వమును పొందును. ఎండకు మంచుగడ్డ నీరయినట్లు. ఇట్లు ఆత్మ జ్ఞానముకలిగి, వాసనాక్షయమును జెంది, ఆతివాహికమయిన మనస్సే, సర్గాంతరములందలి మనస్సులతోడను, ఇతర జన్మములందలి మనస్సుల తోడను, సిద్ధులతోడను. దేవాది శరీరములతోడను కలియును.

లీలా! నీకు అభ్యాస బలంవల్ల ఎప్పుడు అహంభావము పూర్తిగా నశిస్తుందో, అప్పుడు నీకు దృశ్యప్రపంచమునకు చరమావధియగు స్వాభా వికచిద్రూపత్వము. తటస్థించును. ఆతివాహిక జ్ఞానము దృఢమై స్థిరపడి నపుడు నీవు పరమపవిత్రమయిన లోకములను గాంచగలవు. కనుక వాసనా క్షయముకొరకు ప్రయత్నించుము. అది గట్టిపడితే నీవు జీవన్ముక్తురాలవు కాగలవు. అతి చల్లని వాడగు బోధ చంద్రుడుదయించి వృద్ధినొందునంత వరకు నీవు ఈ స్థూల దేహమును ఇటనుంచి లోకాంతరములను జూచు చుండుము. మాంసమయ దేహము మాంసమయ దేహముతోడనే కలియగలదు కాని, చిన్మయ దేహముతో కలియలేదు. దానితో ఏపనినీ చేయజాలదు. కనుక నీమాంసమయశరీరము, నాదు చిన్మయశరీరముతో కలిసి లోకాంతరమునకు రాజాలదు. ఇయ్యది ఆబాలగోపాలము సర్వాను భవసిద్ధమయిన విషయము. నేను క్రొత్తగా చెప్పిడిది కాదు. దీనికి భిన్నంగా, నా వరమునవల్లగాని, ఇంకెవ్వరి వరమునలనగాని, లేక శాపము వలనగాని జరుగనేరదు. లోక సిద్ధమయిన వస్తువుల స్వభావము మార్పును చెందదు. జ్ఞానాభ్యాసమున ఈ స్థూల దేహమునకు, సంసారవాసనలు నశించి, ఆతివాహిక శరీరత్వము సిద్ధించును. అది దానికి సహజమే. అందు అపూర్వత్వము ఏమియు లేదు. మరణానంతరము పరలోకమున కేగు జీవులందరును ఆతివాహిక దేహమును పొందెదరు. కాని వారు అద్దానిని గుర్తింపజాలరు. ఇతర జీవులు మాత్రము మరణించినవాని స్థూలదేహమునే చూచుచుందురు. కాని సూక్ష్మదేహము వారికిని కని పించదు. వాస్తవమున నీ దేహము బ్రతుకుటలేదు. చచ్చుటలేదు.

మరణము, జీవితము అనునవి స్వప్న సంకల్ప భ్రాంతి వంటివి. సంకల్ప పురుషునియందు జీవిత మరణములు ఎట్లు అసత్యములో అట్లే నీ శరీరము నందు కూడ అని గ్రహించుము.

లీల:— దేవీ! నీవు నాకు మనశ్శాంతి నిచ్చెడి చక్కని జ్ఞానమును ఉపదేశించినావు. దీనివల్ల నాదు దృశ్యదర్శన రోగము రూపు మాసినది. ఇక అభ్యాసం అంటే ఏమిటో? అదెట్టిదో? అది ఎట్లు పుష్టి చెందునో? పుష్టి చెందినచో కలిగెడు ఫలమేమో? చెప్పు. ఇది నాకు మహోపకారము.

దేవి:— లీలా! ఎవ్వనికైననూ, ఎప్పుడైననూ, ఏ కార్యమైననూ, అభ్యాసము లేనిదే సిద్ధించదు. తచ్చింతనము, తత్కథనము, అన్యోన్యం తత్ప్రబోధనము తదేక పరత్వము, అనునవి అభ్యాసోపాయములు. తన బుద్ధికి విషయము పట్టుటకు తాను మదిలో ఆలోచించుకొనుట, చింతనము. అభిజ్ఞులయొక్క సంవాదముకొరకు కథనము: (చెప్పుట) ఒకరికి తెలియని అంశములను మరొకరు బోధించుట ప్రబోధనము వీటివల్ల అసంభావన నివర్తించును. తదేక పరత్వము (తదేక నిష్ఠ) చే విపరీత భావన నివర్తించును. సంసారమునందు విరక్తి జెంది జన్మరాహిత్యముకొరకు భోగవాసనలను తగ్గించుకొను మహానుభావులు ప్రపంచమునందు జయమందుచున్నారు. ఉదారమయిన భావముకలిగి, విరక్తులై, ఆనందించు మతిగలవారే పరమ సాధకులు. దృశ్యాఽత్యంతా భావజ్ఞానముకొరకు అధ్యాత్మ శాస్త్రములను శ్రవణ మొనర్చువారును, తదర్థమును, మనన నిదిధ్యాసలు చేయువారును పరమాభ్యాసకులు సృష్ట్యారంభంలో ఈ దృశ్యం పుట్టలేదు. కనుక ఎల్లపుడు ఇది లేదు. నేను లేను అను జ్ఞానము కూడ అభ్యాసము. దృశ్య మిథ్యాత్వ జ్ఞానముచే రాగ ద్వేషాదులు నశిస్తే ఆత్మయందు అఖండ ప్రేమ (ఆత్మరతి) కలుగును. అదికూడా బ్రహ్మాభ్యాస మందురు. దృశ్య మిథ్యాత్వజ్ఞానము లేక, రాగ ద్వేషాదులను చంపుకొనక చేసెడి తపస్సు దుఃఖదాయకమగును గాని, సుఖము నీయదు. జ్ఞానమును ప్రసాదించదు. దృశ్య మిథ్యాత్వజ్ఞానమే, చరమసాక్షాత్కారాత్మకమగు జ్ఞానము. అదియే బ్రహ్మము. దాని అభ్యాసమువలననే మోక్షము.

లీలా! సంసారమనేది కృష్ణపక్షరాత్రి, మోహమనుదని గాఢనిద్ర. ఇది మంచుగడ్డ వంటిది. ఇది నిరంతరాభ్యాస జన్యమయిన వివేకజ్ఞానమను జలపాతముచే నిశ్శేషముగా తొలగునన్నది సరస్వతీ దేవి. వసిష్ఠు డిట్లుపదేశించుచుండ ప్రొద్దు గ్రుంకెను. సాయంకాల విధుల నాచరించుటకు సూర్యు డస్తమించెను. సభాసదులయిన మునులు వసిష్ఠునకు నమస్కరించి స్నానమున కేగిరి. ప్రొద్దునే సూర్యకిరణములతో కూడ మరల సభాస్థలి జేరిరి.

ఇట్లు నాల్గవ రోజు ప్రసంగము ముగిసినది.

## ౨౩ లీలా సరస్వతులు జ్ఞానదేహముతో ఆకాశమున కేగుట

వసిష్ఠుడు. రామచంద్రా! ఆ లీలా సరస్వతు లిరువురు ఆ రాత్రి ఇట్లు సంభాషించు కున్నారు. అంతఃపుర పరిజనులు తలుపులను, గవాక్షములను వేసికొని నిద్రించుచున్నారు. అంతఃపుర మంటపము తెయు పుష్పపరిమళముతో నిండి ఉన్నది. అచ్చట పద్మని శరీరము వాడని పూగుత్తులు అను వస్త్రముచే గప్పబడి యున్నది. ఆ ప్రక్కన పూర్ణ రాకానిశాకరునివలె ప్రకాశించెడి ముఖములుగల వారిరువురు సమాధి నాశ్రయించి, నిశ్చలాంగులై ఉన్నారు. రత్నస్తంభమున చెక్కిన బొమ్మల వలె నున్నారు. సర్వేంద్రియ వ్యాపారములను బంధించినారు. సాయం కాలమున ముడుచుకు పోయెడు తామరజంటవలె, సంకోచమును పొంది నారు. శరత్కాలమున గాలిలేని కొండమీది మేఘములవలె నిశ్చలముగను, పరిశుద్ధముగను, ప్రశాంతముగను ఉన్నారు. నిర్వికల్ప సమాధి నాశ్రయించి బాహ్యజ్ఞానమును పరిత్యజించినారు. నిర్వికల్ప సమాధియందు స్థిరపడి దృశ్యమను పిశాచమును పూర్తిగా వదల్చుకొన్నారు. రామా! కుందేటి కొమ్మువలె లేనివస్తువే మనకు మృగతృష్ణాంబువలె గోచరించుతూ ఉన్నది. అప్పుడా యిరువురును, సూర్య చంద్రాది పదార్థరహితమయిన ఆకాశమువలె కేవల శాంత స్వభావమును ధరించినారు. జ్ఞాన దేహముతో సరస్వతియు, ధ్యాన జ్ఞానానుగత దేహముతో లీలయు సంచరింపసాగారు. వీరి సంచారమంతయు, ఆ లీలయొక్క గృహ మంటపాకాశమునందే జరిగినది కాని, బయట నెక్కడనో గాదు. అనంతరమూ

ఆ యువతులిరువురు, వ్యవహార కల్పనావశమున, ఆకాశమున చాల దూర మేగి, అచటనుండియే చిద్వృత్తియొక్క సామర్థ్యముచే దూరదూరముగా కోటియోజనముల విస్తీర్ణమగు ప్రదేశమున విహరింపసాగినారు. చిన్మయ మయిన దేహముగలవారైనను వెనుకటి పృథ్వ్యాను సంధాన వాసనవల్ల, ఒకరి యాకారమును ఒకరు చూచుకొనుచు, పరస్పర స్నేహముగల చెలికత్తెలవలెనే సంచరించినారు.

## ౨౪ గగన వర్ణనము

చేతులు చేతులు పట్టుకుని ఎత్తైన ప్రదేశములనుదాటి, నభోమండలమును వీక్షించారు. అది సముద్రమువలె అతి విస్తీర్ణము. గంభీరము. నిర్మలము. కోమలము. మందమారుతముచే సుఖభోగదము. (చల్లటి గాలి సోకుచు హాయిగనున్నది.) శూన్యత్వమను నీటిలో మునుగుటవలన మిక్కిలి ఆహ్లాదకరము. అతిసుందరము పరిశుద్ధము. సజ్జనుని కంటె పవిత్రము. ఇట్టి ఆకసమున వారొకచోట దేవతా సౌధముల విశ్రమించారు. చంద్రమండలమునుదాటి మందారమాల సుగంధ వాయువుల సేవించారు. చల్లని మేఘమండలమందు స్నానమాడారు. ఆడతుమ్మెదల వలె నలుదిక్కుల కులశైలములందు తిరిగారు. ఆకాశగంగా ప్రవాహమున స్నానమాడారు. అందు విమానములచే సమున్నతములయిన భూలోకములను అనేకములను చూచారు. ప్రళయాగ్నివలె ప్రకాశించెడి మణిమయ భాగములను తిలకించారు. ఒక తావున ముత్తెపు శిఖరములను, మరొక తావున కాంచన పర్వతములను, ఇంకొక తావున మరకత మణి ప్రదేశములను, దర్శించారు. ఆపైన విమానములచే సంచరించెడి సిద్ధులనూ, దేవతా స్త్రీల వాద్యధ్వనులనూ, కనుగొన్నారు. అందొక చోట కూశ్మాండరక్షః పిశాచమండలములు, మరొకచోట విమాన ధ్వనులు, ఇంకొకచోట, గ్రహనక్షత్ర సంచారము. లోకపాలురు, అప్సరసలు, సిద్ధులు, కాకులు, గద్దలు, రాబందులు, (కాకముఖాని) యోగినీ గణము, మున్నగు వానిని దర్శించారు. అందు మేఘమందిరముల సిద్ధ గంధర్వుల దంపతులు సురతోత్సవమును జరుపుచున్నారు. వాయు మండలమున ఆకాశగంగాజలములు ప్రవహించుచున్నవి. ఆయుధాధిష్ఠాన

దేవతలోకచోట కనిపించారు. గోడలులేని, యిళ్లు అగపడినవి. తుంబు రాముల పాటలు వినబడినవి. కొన్ని చోట్ల కదలని నగరములునూ, మరి కొన్ని చోట్ల కదలెడి నగరములునూ, కనిపించినవి. ఒకచోట రుద్రపురము. మరొకచోట బ్రహ్మపురము. ఇంకొక తావున మాయాపురము, మాయా సరోవరము, సూర్యోదయము, చీకటి రాత్రులు, సంధ్యారాగము, వర్షించు మేఘములు, ఇట్లే మెమో చిత్రవిచిత్రములయిన వస్తుజాలమంతయును, త్రిలోక భూతరాశినీ ఆ చిదాకాశమున, ఆ లలనలు చూచారు. మరల భూలోకమునకు రాదలిచారు.

## ౨౯ భూలోక వర్ణనము

నభస్థలమునుంచి గిరిగ్రామపురమునకు సాగుచు, అపూర్వమగు భూతలమును చూచారు. ఈయది అంతా సరస్వతీదేవి లీలకు జూపుటకు తయారు చేసినది. ఈ భూమండలము, బ్రహ్మాండమను నరుని (మానవుని) హృత్పద్మము. ఎనిమిది దిక్కులూఈ పద్మమునకు రేకులు. నాలుగు దిక్కులనున్న కొండలు కింజల్కములు. దీని గంధమే దీనికి పరిమళము. నదీసమూహములు కింజల్కముల కాడలు. నదులయందలి జలములు మంచు బిందువులు. రాత్రికాలము ఈ పద్మమరందమును గోరు తుమ్మెద. ఇందలి ప్రాణులు దీని రోమములు. శబ్దాది విషయములు దీని నాళము లందలి దారములు. పాతాళాది లోకములు దీని నాళరంధ్రములు. పగటి వెలుతురు దీని కాంతి (ప్రకాశ) శృంగారాది నవరసములు దీని మకరంద ములు. సూర్యుడు దీనియందు విహరించు హంస. పాతాళమున నున్న వాసుకి దీని కాడ. (నాళము). సముద్రము దీనికాధారమగు సరస్సు. సముద్రము కదిలినచో దీని దళములు కదలును. దేవదానవులు దీని నాళమునందలి ముళ్లు. పర్వతములు దీని విత్తనములు. ఈ భూపద్మము యొక్క వైశాల్యము లక్షయోజనములు. దీని కంటె రెండింతలు లవణ సముద్రము. దీనిని చుట్టియున్నది. దీని కంటె రెండింతలు పెద్దది శాక ద్వీపము. దీనిని క్షీరసముద్రము ఆవరించియున్నది. దీనికంటె రెండింతలు పెద్దది కుశద్వీపము. దీని చుట్టు దధిసముద్రమున్నది. ఇదే విధముగ క్రౌంచ ద్వీపము. దీని చుట్టు దధిసముద్రము. ఆపైన శాల్మలీ ద్వీపము.

దీని చుట్టు కల్లు (సురా) సముద్రమున్నది. పిదప గోమేదక ద్వీపము దీని చుట్టు ఇక్షు సముద్రము. తరువాత పుష్కర ద్వీపము. దీని చుట్టు మంచి నీటి సముద్రము. ఆ పైన మంచినీటి సముద్రముకంటె పదిరెట్లు పెద్దదగు బిలమున్నది. ఆ బిలము పాతాళలోకమునకు బోవును. అది అంతయు అంధకారమయము. తరువాత దానికంటె పదిరెట్లు పెద్దదగు అరణ్యము. అచట ప్రాణి సంచారము లేదు. పిదప దానికంటె పదియంతలు పెద్దదగు అగాధ జలరాశి యున్నది. పిదప పదిరెట్లు పెద్దదగు అగ్నిజ్వాలలు. ఇవి మేర్వాది పర్వతములను కరగించు చున్నట్లున్నవి. తరువాత పదిరెట్లు పెద్దదగు వాయుప్రవాహము. పిదప పదిరెట్లు పెద్దదగు శూన్యాకాశము. ఆ పైన నూరుకోట్ల ఆమడలు వ్యాపించి దట్టమైన బంగారు వికారమగు బ్రహ్మాండ కుడ్యమున్నది. ఈ కుడ్యము రెండు భాగములు. ఇట్లు లీల, సాగరములతోడను, కులశైలములతోడను, లోకపాలురతోడను, దేవతా పురములతోడను, ఆకసముతోడను, భూతములతోడను, నిండియున్న లోకములను జూచి, గిరిగ్రామ దేశములను దర్శించెను.

గమనిక:— ఇట వర్ణించిన ద్వీప పరిమాణము పౌరాణిక ప్రక్రియకు విరుద్ధము. అయితే ఒకానొక బ్రహ్మాండమునందు ఇట్లు కూడ ఉన్నదని సమాధాన పరచుకొనవలెను. లేదా! ప్రపంచం అంతా మాయికముకాన, దానిని ఎవరెట్లు వర్ణించినను తప్పులేదు. కనుకనే శ్రీధరాచార్యులిట్లనిరి. శ్లో॥ క్వచిత్ క్వచిత్పురాణాదౌ విరోధో యది లక్ష్యతే। కల్పభేదాది భిస్తత్ర వ్యవస్థా సద్భిరిష్యతే॥ అని. అక్కడక్కడ పురాణాదులందు విరోధమున్నది. కల్పభేదము ననుసరించి దాని వ్యవస్థను సమర్చుకొనవలెను.

## ౨౬ సిద్ధదర్శనము

ఇట్లు వారిద్దరు, పద్మభూపాలుని బ్రహ్మాండ మండలము నుండి, ఈ బ్రాహ్మణుని బ్రహ్మాండ మండలమును జేరి, అందు ఆ బ్రాహ్మణ గృహమును సందర్శించిరి. ఈ లలనలు మాత్రము పరికిని కనిపించలేదు. గృహ యజమానిలేని యా గృహము, దిగులు జెందిన దాసీలు కలదియై, కన్నీళ్లు కార్చెడి ముఖములుగల స్త్రీలు గలదియై, రేకు లూడిపోయిన పద్మమువలెనూ, ఉత్సవములు లేని పట్టణమువలెనూ, అగస్త్యునిచే పానము చేయబడిన సముద్రమువలెనూ, వేసవిలో తగలబడిన అడవివలెనూ,

పిడుగుపడిన చెట్టువలెనూ, గాలికి తెగిపోయిన మేఘమువలెనూ, మంచుకు చెడిపోయిన పద్మంవలెనూ, వత్తి చమురూ లేని దీపంవలెనూ, చావు సిద్ధమైన వాని ముఖంవలెనూ, ఎండిపోయిన చెట్లుగల అడవివలెనూ, అనావృష్టి దోషముపట్టిన దేశమువలెనూ, కళావిహీనంగా ఉన్నది. అంత నా లీల చిరకాలపు జ్ఞానాభ్యాసం చేత, దేవతలవలె, సత్యసంకల్పం కలదీ, నిజమయిన కోరికకలదియునై, "ఇందున్న నాబంధువులు నన్నూ ఈ వాగ్దేవినీ, సామాన్య స్త్రీలనుగానే చూతురుగాక" అని సంకల్పించినది. అందుచే అచ్చటి పరిజనులు వారిద్దరినీ, లక్ష్మీ గౌరుల జంటవలెనూ, వసంత లక్ష్ముల జంటవలెనూ, చంద్రబింబముల జంటవలెనూ, జూచిరి. యధార్థమును గ్రహించలేదు. వారి కంటి చూపులూ, శరీరలావణ్యమూ, బాహులతికలూ, ఎర్రని చేతులూ, కోమల పల్లవ సదృశమయిన పాదములూ, వర్ణనాతీతములు. వారు చల్లని చూపులచే ఓషధులను బ్రతికించిరి. కరిగిపోసిన మేలిమి బంగారపు ప్రసారమువలెనున్న లావణ్య ప్రవాహంచేత బంగారు అడవినిగా తయారుచేసిరి. ఎర్రని చేతులుగల బాహువులు, బంగారపు కల్పవృక్షపు తీగలా? అన్నట్లున్నవి. పల్లవ సదృశములయిన పాదములు మెట్ట తామర పద్మపు రేకులవలె భాసించినవి. వారి చూపులచే ఎండిన తాళీతమాల వృక్షముల మొద్దులు చిగిర్చినవి. ఇది చూచి జ్యేష్ఠశర్మ మున్నగువారు వీరిద్దరు వనదేవతలని భావించిరి. వారి పాదముల మీద దోసెలితో పూలరాశిని విదజల్లిరి. తరువాత జ్యేష్ఠశర్మ ఇలా అన్నాడు. "ఓ వనదేవతలారా? మీకు జయము. మా దుఃఖమును పోగొట్టుడు. పెద్దలరాక రిత్త పోదు. తరచుగ మీబోటి వారి ప్రవృత్తి పరులను రక్షించుటకేయగును."

లీల:— నాయనా! మీ దుఃఖానికి కారణం ఏమి? మీ పరిజనం అంతా దుఃఖాక్రాంతంగా ఉన్నారు ఏమి కారణం?

జ్యేష్ఠశర్మ:— ఓ దేవి! "మా తలిదండ్రులు బహుసంతానవంతులు. ఇచ్చటి బ్రాహ్మణ వంశములకు ఆధారభూతులు. పూజనీయులు. వీరు పుత్ర పశు బంధువులను వదలి దివంగతులయిరి. నేను మా దుఃఖమును భరింపలేకున్నాము. మేమేకాదు మాతోటిపాటు ఇచ్చటి ఇతరజంతువులు

కూడ ఈ దుఃఖమును భరింపలేకున్నవి. మా పెంపుడు పక్షులు మాయింటి కప్పుమీద కూర్చిండి రెక్కలు కొట్టుకొంటూ మా తలిదండ్రుల మృతిని గూర్చి దుఃఖించుచున్నవి. పర్వతములు గుహలయందలి ప్రతిధ్వనులను మాటలతో, శెల ఏటి నీరను మిషతో కన్నీరు కార్చుచున్నవి. దిక్కులు మారుమోతలచే భోరుమని యేడ్చుచున్నవి. గ్రామీణ ప్రజలు నేలపడి పొర్లాడు చున్నారు. చావుకు తెగించారు. చెట్లు పూగుత్తులనే కండ్లతో మంచు బిందువులచే కన్నీటిని కార్చుచున్నవి. బాజారులు జనసంచారము లేక కళ తప్పినవి. లతలు పల్లవములను చేతులతో గుండెలు కొట్టుకొను చున్నవి. శెల ఏటి ప్రవాహములు కొండగోతులలోని రాతికి తల పగల కొట్టుకొని ముక్కలగుచున్నవి. గుహలు కాంతితప్పి గహనములయినవి. నీరులేని తీగలు సన్నగిలి పూగుత్తులను ముఖములను వాడ్చుకొనుచున్నవి. నదులు సముద్రంలోపడి చావదలచినవి. దిగుడు బావులు దిగులుజెంది నిశ్చేష్టలై నిలువుగుడ్లు పడియున్నవి. ఇపుడు మా తలిదండ్రులచే అలంక రింపబడిన నాకలోకము ఆడుచు, పాడుచు, ఉన్న కిన్నర గంధర్వ విద్యాధర సురాంగనలచే కళకళలాడు చున్నది. వేయేల అచేతన పదార్థములకు సయితము వీరి మరణము సంతాప జనకమయినది. కనుక మా దుఃఖాన్ని పోగొట్టి మమ్ము కృతార్థుల జేయండి. మీబోటి వారల దర్శనము వ్యర్థము కాదు." అని అన్నాడు జ్యేష్ఠశర్మ. ఇట్లనుచుండగనే యా లీల జ్యేష్ఠశర్మను తలమీద స్పృశించినది. అంతమాత్రమున వారి దుఃఖ మంతయు రూపుమాసినది. అందరు దుఃఖరహితులయినారు. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! ఈ లీల పూర్వజన్మలో జ్యేష్ఠశర్మకు తల్లి కదా? నిజ రూపంతోనే దర్శనమిచ్చి కుమారుని ఓదార్చ లేదేమి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! అజ్ఞానికి పాంచభౌతికమయిన శరీరము సత్యమని తోచును. జ్ఞానికి కేవలము అద్వితీయ చిదాత్మ స్వరూపంగానే ప్రపంచం భాసిస్తుంది. లీల ప్రపంచం మిథ్య అని గుర్తించింది. ఉన్న చిద్వస్తువును గ్రహించింది. ఇలాంటి తత్త్వజ్ఞానం అబ్బిన వాళ్లకు, "వీడు నాకొడుకు" "వీడు నా స్నేహితుడు" "వీడు నా తండ్రి" "ఈమె నా భార్య" అను

బుద్ధులుండవు. వారి మీద రాగద్వేషాదులు కూడ ఉండవు. పుత్ర స్నేహం అనేది కూడా ఉండదు. లీల జ్యేష్ఠశర్మను చేతితో నెత్తి మీద స్పృశించడం కూడా పుత్ర స్నేహంవల్ల కాదు. జ్యేష్ఠశర్మ యొక్క భావి శుభాన్ని కాంక్షించి, అతనికి ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించదలచియే అట్లు చేసింది. ఇందు నీవు కంగారుపడవలసిన విషయం ఏమీ లేదు.

## ౨౭ లీల జన్మాంతర వర్ణనము

అంతట ఆ యిరువురు, ఆ బ్రాహ్మణుని యొక్క గృహాకాశము నందే అంతర్ధానం అయినారు. జ్యేష్ఠశర్మ మున్నగువారు "వనదేవతలు తమను అనుగ్రహించిరని" సంతసించి, తమ యింటిపనులను జూచుకొను చున్నారు. లీలా సరస్వతులిద్దరు సంకల్ప శరీరులయినారు. ఒకరికొకరు అదృశ్యంగా ఉన్నారు. ఈ స్థితిలో సరస్వతీదేవి లీలతో ఇలా అన్నది. సంకల్ప పురుషులిద్దరు మాట్లాడు కొనునట్లునూ, కలలో ఒకరి నొకరు పలకరించుకొనునట్లునూ, వారిద్దరకు సంభాషణ జరిగింది.

లీలా! నీవు జ్ఞేయవస్తువును పూర్తిగా తెలిసికొన్నావు. పరోక్షా పరోక్ష జ్ఞానం కలిగింది నీకు. బ్రహ్మసత్త ఇలాంటిది. ఇంక నీకేమి కావాలో అడుగు.

సరస్వతీ! మరణించిన నా భర్త జీవుడు రాజ్యం చేసే తావున, వారలకు నేను కనిపించలేను. వారు నన్ను చూడలేదు. ఇచట నా కుమారుడు నన్ను చూచాడు. నేనతనిని చూచాను. ఇచట నన్ను చూచుటకు కారణమేమి? అచ్చట చూడకుండుటకు కారణమేమి?

లీలా! నీకపుడు జ్ఞానాభ్యాసములేదు. అందువల్ల నీకు ప్రపంచము సత్యమను నిశ్చయము తొలగలేదు. మిథ్యాత్వ నిశ్చయము కలుగలేదు. అద్వితీయ బ్రహ్మజ్ఞానం కలుగలేదు. అద్వైత జ్ఞానం కలగని వారికి అద్వైత కర్మలయిన సత్యసంకల్పాదులు అబ్బవు. ఎండనున్న వానికి, నీడ నున్న వానియొక్క అనుభవముండదు. నీడనున్నవాని శరీరం చల్లగా ఉంటుంది. ఈచల్లదనం ఎండలోనున్నవాని శరీరము నందుండునా? ఉండదు. అలాగే భేదం జ్ఞానం నశించిన వాని లక్షణాలు, భేదజ్ఞానం కలవాళ్ల యందుండవు.

అప్పుడు నీకు "నేను లీలను" అను ద్వైత జ్ఞానమే ఉన్నది. "నేను బ్రహ్మను" అను అభేదజ్ఞానము లేదు. అందువల్ల నీకపుడు సత్యసంకల్పాదులు కలుగలేదు. ఇపుడు తత్వజ్ఞానాభ్యాసం చేత అద్వైత భావం గట్టి పడింది. అందువల్ల సత్యసంకల్పాది బ్రహ్మగుణములు అబ్బినవి. "నా కుమారుడు నన్ను జూచుగాక" అను నీ సంకల్పము ఫలించినది. నీవు యిప్పుడు నీ భర్త్రులోకమునకు వెళ్లేయెడల, ఆయనగారి తోటి నీకు వెనుకటివలె వ్యవహారమంతా జరుగగలదు." అని అన్నది సరస్వతి.

లీల:— సరస్వతీ! ఈ యింటిలోనే ఆ బ్రాహ్మణుడు నాకు భర్త అయినాడు. ఇచ్చటనే ఆయన మరణించి రాజు అయ్యాడు. ఇచ్చటనే ఆయనగారి రాజధానీ పురమందు నేను పట్టమహిషిని అయినాను. ఆరాజుగారయిన నా భర్త యిచటనే మృతిచెందాడు. ఈ అంతఃపురాకాశమునందే ఆ రాజు కూటస్థ బ్రహ్మస్వరూపాన్ని చెందాడు బుట్టలో ఆవాలు ఉన్నట్లు, ఈ గృహాకాశంలోనే బ్రహ్మాండాలన్నీ ఉన్నట్లు, తలుస్తాను. నాభర్త మండలము నాకు అతిసన్నిహితమని తలుస్తాను. కనుక అది అంతా నాచెంతనున్నట్లు నేను ఎలా చూస్తానో అలా నన్ను అనుగ్రహింపుము" అని అన్నది లీల.

సరస్వతి:— లీలా! నీకు వందలకొలది భర్తలున్నారు. అందులో ఇపుడు అమలులోనున్నవారు ముగ్గురు. ఈ ముగ్గురు ఇటీవలవారు. (దగ్గరవారు.) వీరిలో బ్రాహ్మణుడు (భర్త) భస్మమయినాడు. పద్ముడను రాజు అంతఃపురమందు పూలరాశిలో దాగి శవాకారముగ నున్నాడు. మూడవభర్త వసుధాధిపుడై ఈ మహా సంసారసముద్రంలో ప్రవేశించి తిరుగుతున్నాడు. భోగవాసనలతో విక్షిప్త చిత్తుడై, జడమతియై, సంసార సముద్రంలో తాబేలులాగ తిరుగుతున్నాడు. చిత్రవిచిత్రములయిన రాజ కార్యాలు చేస్తున్నాడు. అయినా సంసారంలో మొద్దులాగ నిద్రిస్తున్నాడు. సంసార భ్రమలో ఎంత మాత్రమూ మెలకువలేదు. "నేను ఈశ్వరుడను" "నేను భోగిని" "నేను సిద్ధుడను" "నేను బలవంతుడను" "నేను సుఖిని" అనే అనర్థవృత్తులనుత్రాళ్లు అతని మెడనిండా ఉన్నాయి. నిన్ను ఇప్పుడు ఏ భర్తవద్దకు తీసికొని పొమ్మనెదవు? చెప్పు. సంసారము వేరు. బ్రహ్మాండ

మండపము వేరు. విస్తారమయిన వ్యవహార పరంపరలు వేరు. ఈ సంసార మండలములు సమీపమందున్నట్లు ఉన్ననూ, వాటికీ మనకూ కోటి ఆమడ దూరమున్నది. వీటి పారమార్థికమగు రూపము చిదాకాశ మాత్రము. ఈ లోకములన్నియు మహత్తరమయిన ద్వీపములూ, సముద్రములూ, నదులూ, గిరులూ, వనములతోటి పెద్ద పెద్దవిగ కనిపించుచున్ననూ, చిద్దృష్టితో చూచేయడల, ఇవన్నీ మర్రిగింజ మాత్రము కూడ కావు. భ్రాంతరహితమైన చైతన్యమే యిట్లు భాసిస్తోంది. సముద్రంలో తరంగాలు మాటిమాటికి లేస్తున్నట్లు, ఈ చిత్సముద్రంలో ప్రపంచ తరంగాలు ఉండి ఉండి మాటి మాటికీ లేస్తూ ఉంటాయి. కాబట్టి యిప్పుడు ఏ భర్త వద్దకు తీసుకపొమ్మనేది చెప్పమన్నది వాగ్దేవి.

లీల:— వాగ్దేవీ! అవును నిజమే. ఇప్పుడు నాకు జ్ఞప్తికి వచ్చినది. ప్రపంచం అలాంటిదే. లీల అనే పేరుతో ఇప్పుడు నే నెత్తిన జన్మ రాజస జన్మ కాని తామస జన్మ కాదు. సాత్త్వికమూ కాదు. చతుర్ముఖబ్రహ్మ నుండి అవతరించిన నాకు ఎనిమిది వందల జన్మలు గడచాయి. అందులో అనేక యోనులందు బుట్టినట్లు ఇప్పుడు నేను గట్టిగా స్మరించుచున్నాను.

దేవీ! ఈ సంసార మండలంలో పూర్వం నేనొక విద్యాధర స్త్రీని. ఆ పైన దుస్సంస్కారాలవలన మనుష్య స్త్రీని అయినాను. అటుపైన నాగకన్యకనయితిని. తరువాత శబరిని. (బోయదానను.) పిదప ముని కన్నెను. తరువాత మగజన్మను యిచ్చే కర్మలు కొన్ని పరిపాకం చెందగా, సౌరాష్ట్ర దేశంలో మగవాడినిగా పుట్టి, రాజునై నూరు సంవత్సరాలు రాజ్యమేలినాను. అపుడు రాజరికంలో చేసిన పరద్రవ్యాపహరణాది దోషాలవల్ల, మన్నె ప్రదేశాలలో ఆడ మొసలిని అయ్యాను. తొమ్మిది సంవత్సరాలు కష్టనష్టాలకు గురి అయినాను. పిదప సురాష్ట్ర దేశాలలో గోవునై పుట్టి యెనిమిది సంవత్సరములు గడపినాను. ఆ జన్మలో అందరిచే దెబ్బలు తిన్నాను. ఆపైన అడవిలో ఆడపక్షినై పుట్టి వ్యాధులు (బోయ వాళ్లు) పన్నినవలలో పడి కష్టాలు అనుభవించాను. తరువాత ఆడ తుమ్మెదనై పుట్టి, పద్మకింజల్కములమధ్య శయనించి, విశ్రమించాను. పిదప ఆడి లేడినై పుట్టి ఉత్తుంగ శైలశృంగాలలో విహరించాను. ఆపైన

ఆడచేపనుగా పుట్టాను. చర్మణ్వతీ నదీతీరంలో పులింద స్త్రీల గానాన్ని విని ఆనందించాను. తరువాత పులింద స్త్రీగా పుట్టి సురతాంతములందు కొబ్బరి కల్లు తాగి ఆనందించాను. తరువాత మేరుపర్వతంమీద కల్పవృక్ష వనంలో అప్సరస స్త్రీగా పుట్టి అనేక మంది దేవతలను ఆనందపరచాను. తరువాత జలమయమై మన్నైపు భూములలో ఆడ తాబేలు అయ్యాను. పిదప ఆడరాజహంసను అయినాను. ఆపైన ఒక బూరుగచెట్టు ఆకు మీద వ్రేళ్లాడే దోమలలో ఒక దోమ ఆ యాకునుంచి జారుచూ, అందుండలేక వ్రేళ్లాడుటను చూచి, ఆ సంస్కారంతో హంసనైన నేను మరణించి దోమనై పుట్టాను. తరువాత గిరినదులయందు వేతస (నీటి ప్రబ్బర) చెట్టుగా జన్మించాను. తరువాత గంధమాదనంమీద విద్యాధరాంగనగా పుట్టి విద్యాధర కుమారులతో విహరించి, తుదకు వారితోటి వియోగ దుఃఖాన్ని అనుభవించాను. ఇలా నాకు అనేక జన్మలు గడచాయి. అని లీల వాగ్దేవితో చెప్పిన దన్నాడు వసిష్ఠుడు.

## ౨౮ గిరిగ్రామ వర్ణనము

శ్రీరాముడు ఈ కథ ఇంతవరకు విన్నాడు. సందేహం కలిగింది. ఇలా అడిగాడు వసిష్ఠుణ్ణి. మహర్షీ! మృతిచెందిన పద్మడను రాజును చూడడానికి, వీరిద్దరూ బ్రహ్మాండ మండలానికి కదా వెళ్లారు. అది వజ్రం కంటె దృఢమయిన గోడలు కలదే. కోటి ఆమడ వైశాల్యం గలిగి మహా గట్టిగా ఉంటుందే? అందులోకి ఈ ఆడవారిద్దరు ఎలా చేరారు? అక్కడ నుంచి యలా బయటికి వచ్చారు? చెప్పండి.

రామచంద్రా! ఎంత పిచ్చివాడవోయి. బ్రహ్మాండం ఎక్కడ? ఎక్కడ దాని గోడలు? ఎక్కడ వజ్రంలాగ గట్టిగా ఉండటం? నిజస్థితిలో వీళ్లిద్దరూ వాళ్లయింటిలో అంతఃపురంలోనేగా ఉన్నారు. అందులోనే గిరిగ్రామం అనే పట్టణం. అందులోనే యిల్లు. అక్కడనే వసిష్ఠుడనే ఆ బ్రాహ్మణుడు రాజయి చతుస్సముద్ర పర్యంతమయిన భూతలమును పాలించాడు. గొప్ప రాజు అయినాడు. అక్కడనే ఆయనగారి భార్య అయిన అరుంధతి లీల అనే జన్మయెత్తి పట్టమహిషి అయింది. సరస్వతీ

దేవిని అర్చించినది. అక్కడ నుంచీయే సరస్వతీదేవితో కూడా వాసనా మాత్రంచేత చిదాకాశంలో మరో బ్రహ్మాండానికి వెళ్లింది. మరల అక్కడ నుండి తన యింటికి వచ్చింది. ఇదంతా, ఇంటిలో పక్కమీద పడున్నవాడు ఒక స్వప్నం నుంచి మరొక స్వప్నాన్ని చూచినట్లు ప్రతిభా మాత్రం. అక్కడ బ్రహ్మాండం లేదు. సంసారం లేదు. గోడలూ లేవు. మారమూ లేదు. వాసనా మాత్రం చేత చిత్తమే అలా ప్రకాశించింది. అజ్ఞానికి ఇది అంతా ఉన్నట్లు కనపడుతుంది. జ్ఞాని దృష్టిలో ఏమీ లేదు. ఇంటిలో పడుండి కలగన్నవానికి కలలో పెద్దనగరం కనిపిస్తుంది. వాడి యింటిలో నిజంలో ఆ నగరం ఉన్నదా? లేదు. అలాగే వీళ్లు చూచిన బ్రహ్మాండం కూడా నిజంలో లేదు. బ్రహ్మాండం అంటె బ్రహ్మగారి గట్టి సంకల్పమే. అంతకంటె వేరే లేదు. అదే సంకల్పం ఆ వాసనతో వీళ్లకు కూడా కలిగేసరికి వీళ్లకు కూడా ఆ బ్రహ్మాండం గోచరించింది. కనుక ఈ ప్రపంచం అంతా మరుభూమిలో నీరు లేనట్లు లేదు. లేకపోయినా ఉన్నట్లు భాసిస్తుంది ఆత్మయందు. అని రాముని సందేహం తీర్చి పై కథ చెప్పడం ప్రారంభించాడు వసిష్ఠుడు.

కాబట్టి రామచంద్రా! అతిసుందరులయిన ఆ లీలా సరస్వతులు ఇలా మాట్లాడుకుంటూ సుందరమయిన మందగమనములతో ఇంటి బయటికి వచ్చారు. వారి ముందట అతివిచిత్రమయిన పర్వత మొకటి కనపడింది. అది ఆకాశ కుహరమంతా నిండి ఉంది. ఆదిత్యమండలాన్ని తాకి ఉంది. నానారకములయిన ఉద్యానవనములతో వ్యాప్తమై ఉంది. అందులో ఏటి మీద కూయుచు తిరిగే వనవిహంగములు, (పక్షులు,) పూగుత్తుల రాశిచే విచిత్రవర్ణములయిన మేఘమండలాలు, దృఢమయిన నీటి ప్రబ్బరి చెట్లయొక్క వ్రేళ్లచే నీటిలో పడకుండా కాపాడబడిన సరిత్తటములు, చెట్ల నంటుకున్న తీగలను చుట్టుకొని వచ్చెడి కమ్మనిగాలి, పూలుపూచిన కొమ్మచివరలచే గోడకట్టి దాచిపెట్టినట్లున్న మేఘ బృంద ములు, చెట్లయొక్క కదలికచే ఊగులాడెడి నదీతటములు. గలిగి వర్ణనా తీతమైనన్నది. దానిమీద ఆకాశమునుంచి జారిపడిన స్వర్గపుముక్కయా! అన్నట్లు ఉన్న గిరిగ్రామమను పట్టణమును చూచారు. వర్ణింపనలవికాని సౌందర్యంపు ఎంతేని కంటికింపు.

## ౨౫ పరమాకాశ వర్ణనము

ఈ లీలా సరస్వతులిద్దరు ఆ పట్టణమును ప్రవేశించారు. అందు లీల అను నామె చిరకాలపు జ్ఞానాభ్యాసంచేత, చిన్మయ దేహాన్ని దాల్చి, త్రికాలజ్ఞురాలై, అప్రయత్నంగా, తన ప్రాచీన జన్మమరణములను అన్నిటినీ స్మరించింది. వాగ్దేవితో ఇట్లన్నది. , దేవీ! ఈ ప్రదేశం చూచేసరికి నీ అనుగ్రహంవల్ల నాకు వెనుకటి పనులన్నీ తలపుకు వస్తున్నాయి. ఇక్కడ నేను నరాలు బయటపడి, చిక్కి తెల్లగా పాలిపోయిన ఒక బ్రాహ్మణ స్త్రీని. నా చేతులు దర్భపుల్లలులాగ ఉండేవి. భర్తకు ఖ్యాతిగణించే దాన్ని. నాకు అనేక మంది కొడుకులు. ఎల్లప్పుడు అతిథిపూజ చేసెడి దానను. దేవద్విజగురువులందు నాకు భక్తి జాస్తి. ఎప్పుడూ చల్లకవ్వం నా చేతిలోనే ఉండేది. ఆవునేతితో అంటి పీరందరకు తలంటిపోసేదానను. చరువును ఒండెడి పాత్రలను తోముచుండే దానను. నా ముంజేతి గాజులలో ఎప్పుడూ మెతుకులుండేవి. అల్లుళ్లనూ, కూతుళ్లనూ, అన్నలనూ, తమ్ముళ్లనూ, తండ్రులనూ, తల్లులనూ, పూజించెడిదాన్ని. చచ్చేటంత వరకూ, నాకు రాత్రింబగళ్లు ఇంటిపనులతోనే సరిపొయ్యేది. నా పరివారంలో ఎవరేపనిచేసినా "ఇంత ఆలస్యమా" అని కోపపడుతూ ఉండే దాన్ని. నేనెవరో! నాకీ సంసార మేమిటో? ఈ ముచ్చట నాకు కలలో కూడా ఉండేది కాదు. నావలెనే ఎప్పుడూ, ఇంటిపనులలోనే మునిగి తేలే మొద్దుశ్రోత్రియ బ్రాహ్మణుడు నా భర్త. ఎప్పుడూ నాకు సమిధలూ, కూరకాయలూ, ఆవు పేడా, కట్టెపుల్లలూ, తేవడంతోనే ప్రొద్దు అంతా పరిపొయ్యేది. ఎండు నరాలుగల శరీరం మీద పాతకంబళి కప్పుకునుండే దాన్ని. పిల్లల చెవులలోని పురుగులు తీసివేయుచుండేదాన్ని. కూరకాయ మడులకు నీరుపోసే వాళ్లను పిలుస్తూ ఉండేదాన్ని. లేగదూడలకు నీటి రొమ్ముడున మొలచిన లేతగరిక పోచలు మేపుచుండేదాన్ని. ఎప్పుడూ ఇంటి ముందర అలుకుట, ముగ్గు పెట్టుటతోనే కాలం సరిపొయ్యేది. ఇంటిలో భృత్యులకు నీతి వినయ సదాచారములను, నేర్పుచుండేదాన్ని. "ఇలాంటి వాళ్ల ఇంట్లో, ఇలాగంటి అవినీతులయిన భృత్యులు తయారైనారేమిటి?" అని కోపిస్తూ ఉండేదాన్ని. మాకులమర్యాదలు కాపాడుతూ ఉండేదాన్ని. ఇలా చాలాకాలం ఉండగా నాకు ముసలితనం వచ్చింది. ఎడమ చెవుకు

చెముడు. తలకువణకు, నడుమువంగుట, కర్ర చేతిలో లేనిదే నడవలేక పోవుట, మొదలయిన లక్షణాలన్నీ వెంటపడ్డాయి నాకు.

దేవీ! ఇదిగో చూడు నా వస్తువులన్నీ ఇక్కడనే ఉన్నాయి. ఇది నేను పెంచిన పాటల వృక్షము. ఇది అశోకము, ఇది కర్ణికారము, ఇదిగో ఇట ఈ చెట్లకు నీరుపోసే దాసి నీరుపొయ్యలేక కన్నీరు కారుస్తూ ఏడుస్తోంది ఇప్పటికి యెనిమిది రోజుల నుంచి. దేవీ! ఇక్కడ నేను తిన్నాను. ఇక్కడ నున్నాను. ఇక్కడ పరున్నాను. ఇక్కడ లేచాను. ఇక్కడ నీరు త్రాగాను. ఇక్కడ ఇచ్చాను. ఇక్కడ ఫలధాన్యాదులు పుచ్చుకున్నాను. ఇక్కడ నా పెద్ద కొడుకు జ్యేష్ఠ శర్మ అనేవాడు ఏడుస్తున్నాడు. ఇక్కడ మాకు పాలిచ్చే ఆవు పచ్చిక బయలు మీద తిరుగుతోంది. గరిక మేయుచున్నది. ఇదిగో ఇది వసంతారంభంలో హోలీ పండుగలలో మంటలు పెట్టిన బూడిదరాసి. ఇది మా ఇంటిముందటి ప్రకోష్ఠం. ఇది సారతీగలచే చుట్టుకున్న మా వంటఇల్లు. వీరు నాకు బంధనమైన బంధువులు. ఇది మా ఇంటి ముంగిలి. నానా రకములైన పూలచెట్లచే వ్యాపించి ఉంది. ఇక్కడనే నా భర్త చతుస్సముద్రవలయితమగు భూమండలమునకు ప్రభువై ఉన్నాడు. ఆ! నిజమే నాకిపుడు జ్ఞప్తికి వస్తోంది. ఈయనగారు పూర్వం తాను శీఘ్రంగా రాజు కావలెనని కోరాడు. ఎనిమిది రోజులలో పెద్ద రాజ్యమును పొందాడు. ఇక్కడనే నా భర్తగారి జీవుడు ఆకాశంలో గాలివలె గాలిలో పరిమళంవలె, ఉన్నాడు. ఇక్కడ అంగుష్ఠ మాత్ర పరిమాణంగల ఆకాశంలో, కోటి ఆమడ విశాలమయిన మా భర్తగారి రాజ్యం అంతా ఇమిడి ఉంది. మనమిద్దరము చిదాకాశరూపంతో ఉన్నాము. నా భర్త రాజ్యం కూడా ఈ చిదాకాశ రూపంగానే ఉన్నది. ఇది అంతా నాకు మహామాయగా ఉంది. మళ్లీ నా భర్త యొక్క అసలైన రాజ్యానికి వెళ్లాలని నాకోరిక. వెళ్లుదాము. బయలుదేరు. ప్రయత్నించేవాళ్లకు, నడచేవాళ్లకు దూరమేమిటి? అని వాగ్దేవితో చెప్పింది లీల. ఆమెకు నమస్కరించి, ఆమెతో కూడ ఆడపక్షివలె ఆకాశానికి ఎగిరిపోయింది. కాటుకకొండవలె నల్లనయిన మేఘమార్గమును దాటింది, వాయులోకం దాటింది. సూర్యలోకం దాటింది. చంద్రలోకం దాటింది. ధ్రువమార్గం దాటింది. సాధ్యులలోకాన్ని దాటింది. సిద్ధుల

లోకం దాటింది. స్వర్గలోకం దాటింది. బ్రహ్మలోకం దాటింది. విష్ణు లోకం దాటింది. గోలోకం దాటింది. శివలోకం దాటింది. పితృలోకం దాటింది. విదేహ, సదేహముక్తుల లోకాలను దాటింది. దూరదూరంగా వెళ్లి, వెళ్లి, అక్కడ కొంచెం తెలివి తెచ్చుకుంది. తాను దాటిన సభ స్థలమును మళ్లీ వెనుకకు తిరిగి చూచింది. ఎక్కడా సూర్యచంద్ర నక్షత్రాదులు కనిపించలేదు. గాఢాంధకారబంధురమయిన ఆకాశమాత్రం మాత్రమే కనిపించింది. అప్పుడన్నది లీల. దేవి! సూర్యచంద్ర నక్షత్రాదులు వెలుగేమయినది? పిడికెళ్లతో పట్టుకోతగిన ఈ చీకటంతా ఎక్కడనుంచి వచ్చింది?

దేవి– లీలా! నీవు ఆకాశమార్గంలో సూర్యచంద్ర నక్షత్రాదులు గూడా కనిపించనంతటి దూరం వచ్చావు. ముందు చాలదూరం వెళ్లిన వాడికి వెనుకనున్న సూర్యుడు కనిపించనట్లు నీకును కనిపించటం లేదు. అన్నది వాగ్దేవి.

లీల:– దేవి! మనమంతదూరం వచ్చామా? సూర్యుడు పరమాణు వంతటి పరిమాణంగా కూడ కనిపించడం లేదే? ఇచట ఉత్తర వైపున ఒక త్రోవ కనిపిస్తుంది. అదేమిటి? ఎక్కడికి వెళుతుందో చెప్పు?

దేవి:– లీలా! నీముందు ఉత్తర దిశన బ్రహ్మాండ కటాహము (కర్పరము) పైడిప్ప కనిపిస్తోంది. ఈ సూర్యచంద్రాదులందరూ ఆ బ్రహ్మ గారి యొక్క ధూళి లేశాలు అని చెప్పింది వాగ్దేవి. (సరస్వతి).

రామచంద్రా! వీరిద్దరు ఇలా మాట్లాడు కుంటూ బ్రహ్మాండ కర్పరమును చేరారు. అక్కడ దట్టమైన మంటపం చూచింది లీల. ఆ బ్రహ్మాండమునకు పైన ఒకదానికంటె నొకటి పదిరెట్లు పెద్దదయిన పంచభూతముల ఆవరణం చూచింది. ఆపైన పరిశుద్ధమయిన చిదాకాశం తప్ప ఇతరవికల్పాలు ఏవీకనిపించలేదు. స్వస్వరూపమునందున్న పరమాత్మ చైతన్య యొక్కటే విస్తృతమయి ఉంది.

## 30 విచిత్ర బ్రహ్మాండ వర్ణనము

అది పరమాకాశము. అపరిచ్ఛిన్నము. అవాఙ్మానస గోచరము. దిగ్విభాగాది సర్వద్వైత శూన్యము. దీనియందు అనేక కోట్ల బ్రహ్మాండాలు సూర్యకిరణములలో త్ర్యణుకములవలె తిరుగుతూ ఉంటాయి. ఇవన్నీ ప్రపంచ వాసనా వాసితమయిన అంతఃకరణకలవారలకే గోచరిస్తూ ఉంటాయి. నిజస్థితిలో, ఆ చిదాకాశమునందుగాని, ఈ బ్రహ్మాండము నందుగాని ఏమీలేదు. పరమాత్మ చైతన్యం ఒక్కటే నిజమయిన వస్తువు. లోగడ వర్ణించి చెప్పిన బ్రహ్మాండ జాతం అంతా అజ్ఞానులదృష్టి ననుసరించి చెప్పితిని కాని, తత్త్వజ్ఞుల దృష్టి ననుసరించి కాదు. సంకల్పం ఉంటే సంకల్పానుసారంగా ఏమయినా కనిపిస్తూ ఉంటుంది. అది నశిస్తే ఏమీ గోచరించదు. ఇది నిజం అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! పరమాత్మ ప్రపంచానికి అధిష్ఠానం అని కదా? మీరు చెప్పితిరి. అతనియందేకదా ప్రపంచం అధ్యస్తమయి ఉన్నది. అధిష్ఠానం అంటే ఆధారం. ఆధారం క్రిందది, ఆధేయం మీదది, అనేది లోక సహజం. కనుక పరమాత్మకు కూడ "క్రింద" అనేది గ్విభాగం ఉన్నట్లే. అతనియందే ఆ విభాగం లేకపోతే అధ్యస్తమయిన ప్రపంచానికి మాత్రం ఆ విభాగం ఎలా వస్తుంది? కనుక పరమాత్మ దిగ్విభాగరహితుడనే మాట ఎలా పొసగుతుందో చెప్పండి.

1. రామచంద్రా! యదార్థమయిన వస్తువులకు ఆధారాధేయ భావము ఉంటుంది. అప్పుడు ఆధారం క్రిందిది, ఆధేయం మీదిది అవుతుంది. ప్రపంచం మాయా కల్పితం. దీనికి పరమాత్మ అధిష్ఠానమయినా ఆధారాధేయ భావంకాని, క్రింద, మీద, అను దిగ్విభాగంగాని, ఇక్కడ ఉండవలసిన పనిలేదు. ఈ నియమం లేనందువల్ల ఇక్కడ దోషములేదు. కంటిలో తిమిర దోషం గలవానికి ఆకాశమునందు కేశోండ్రకము (వెంట్రుకల కొప్పు) అను భ్రాంతి గలిగినట్లు, ఈ బ్రహ్మాండాలన్నీ పరిచ్ఛేదరహితమైన పరమాత్మయందు భ్రాంతివల్ల కనిపిస్తూ ఉంటాయి. కాబట్టి పరమాత్మయందు దిగ్విభాగము లేకున్నా ప్రపంచమునందు ఆవిభాగముండవచ్చును.

2. లేక సమస్త వస్తువులు ఈశ్వరేఛ్ఛకు పరతంత్రములు. కాన ఈశ్వరేచ్ఛావశమున పృధివ్యాదులు ఊర్ధ్వాధోతిర్యగాది భేదములను చెందవచ్చును. ఈ దిగ్విభాగమనునది ఆపేక్షికము. బ్రహ్మాండములలో సర్వ వస్తువులకు, పృధివిని అపేక్షించియే అధో దేశ కల్పనము. వాస్త వంగా అధోదిక్కు అనేది లేదు.

3. అయితే (వాస్తవంగా అధోదిక్కు అనేది లేకపోతే) తొడిమ నుండి జారిపడే పండు బరువైనపుడు క్రిందపడుటలో కారణమేమి? క్రిందు అనే దిక్కు లేదుకదా! అను శంక కలుగును. అంత మాత్రంచే వాస్తవ మైన దిగ్విభాగాన్ని అంగీకరించుటకు వీలులేదు. శబ్దాది విషయములకు తమ తమ ఇంద్రియములను ఆకర్షించు శక్తి ఎట్లో స్వాశక్య సంబద్ధ పృధివ్యాదులకు గూడ స్వాంశములైన వస్తువులను ఆకర్షించు శక్తి కూడ అట్లే కలదు. అదియే గురుత్వమన బడుచున్నది. అంతకంటె అది వేరే గుణముకాదు. కనుకనే బాహ్యాదిగ్విభాగము లేనందువల్ల బ్రహ్మాండ ములు ఎంత బరువుగా ఉన్నను, వాటికి పతనాది ప్రసక్తి లేదు. (అవి పడవు) ఆ బ్రహ్మాండములను ఆవరించియున్న జలాదులకు గూడ, ఆ బ్రహ్మాండములను తడిపి విశ్లేషపరచే (విడిపరచే) శక్తి లేదు. కనుక అధి ష్ఠాన చైతన్యమునందు దిగ్విభాగము ఉండవలసిన పనిలేదు. కనుక మహా పృధివీ రూపమైన బ్రహ్మాండ భాగము క్రిందిదనియు, తద్భిన్నమైన నభోభాగము పైదనియును కల్పింపబడినది. ఈ విధానము, "భూగోళము, ఖగోళజ్యోతిశ్చక్రము యొక్క ఆధారము చేచుట్టుకొని యున్నదని అంగీకరించే జ్యోతి శాస్త్రజ్ఞులకు కూడ సమ్మతము. వాయు ఆకసమున పక్షులయొక్క పాదములుండు భాగము, అధోభాగమనియు. వీపు (పృష్ఠ) భాగము ఊర్ధ్వ భాగమనియును సూర్య సిద్ధాంతాది గ్రంధములయందు జెప్పిరి. కొన్ని బ్రహ్మాండములకు లోపల చెట్లూ, పుట్టలూ మాత్రమే ఉండును. మనుష్యులుండరు. పైన (ఆకాశంమీద) దేవతలు, సిద్ధులు, కింపురుషులు, విద్యాధరులు, మొదలగువారుంటారు. కొన్ని బ్రహ్మాండ ములు అప్పటికప్పుడు కల్పితమైన చతుర్విధప్రాణి వర్గముతో కూడి ఉంటాయి. కొన్ని బ్రహ్మాండములు నామరూప వికారములులేక అవ్యా కృతములుగా సదిరించియున్నట్లు దాగి ఉంటాయి. మరికొన్ని బ్రహ్మాండ

ములలో, మొదటి కల్పము, మొదటియుగ ప్రారంభమగునపుడు, పరిశుద్ధ ములైన భూతములు సృష్టియగును. కొన్ని బ్రహ్మాండములయందు సూర్యాదులు లోకములను తగలపెట్టుదురు. మరికొన్ని బ్రహ్మాండములు ఆధారము దొరకక, పైకిలేచునట్టి ఆశలేక, కల్పాంతమువరకు అధఃపతనము చెందియే యుండును. కొన్ని బ్రహ్మాండములు స్తబ్ధములుగా ఉండును. మరికొన్ని గాలియందు, చలన (స్పందము)మువలెను, ఆకసమునందు కేశోండ్రకము (కొప్పు) ల వలెను కల్పితములై ఉండును. "ధాతా యథా పూర్వకమకల్పయత్" అను శ్రుతిపూర్వకల్పమునందు బ్రహ్మ యొక్క సృష్టి యెట్లుండునో, రెండవ కల్పమునందు గూడ అట్లే ఉండునని చెప్పుచున్నది. కాని వెనుకటి జన్మయందు వేద శాస్త్రములందు జెప్పిన కర్మజ్ఞానములను ఆచరించి, ప్రజాపతియై సృష్ట్యధికారమునకు వచ్చిన బ్రహ్మగారి మొదటి కల్పంలోని మొదటి సృష్టి, ఇతర బ్రహ్మ యొక్క సృష్టికంటె వేరుగనున్ననూ, తదుత్తర కల్పములండలి ద్వితీయాది సృష్టి ప్రారంభములు మాత్రము పూర్వమువలెనే ఉండును. దానిని బట్టి పైశ్రుతి సంగతమగును. కాని ఇతర బ్రహ్మగారి సృష్టి ద్వారా ఈ బ్రహ్మంగారి సృష్టి క్రమము వేరనక తప్పదు. అందువల్ల నేను చెప్పిన బ్రహ్మాండ వైచిత్ర్యము పొసగుటలో అభ్యంతరంలేదు. ఇట్లే కొన్ని బ్రహ్మాండములలో చతుర్ముఖ బ్రహ్మ సృష్టికర్త. మరికొన్ని బ్రహ్మాండములలో విష్ణువు సర్గాధినాధుడు. మరికొన్నిటియందు రుద్ర, భైరవ, దుర్గా, వినాయకాదులు సృష్టికర్తలు. ఇట్లు పురాణములు చెప్పుచున్నవి. కొన్ని బ్రహ్మాండాలు ఏకార్ణవ ప్రాయములు. చిత్రవిచిత్రములైన సృష్టికర్తలు కలవి. మరికొన్ని తిర్యగ్జంతువులతో నిండియుండును. కొన్ని జన్మరహితములు. మరికొన్ని కృమిమయములు. కొన్ని శిలాప్రాయములు. కొన్ని దేవమయములు. కొన్ని నరమయములు. కొన్ని అంధకార బంధురములు, మరికొన్ని కనుపడని ప్రాణులు కలవి. కొన్ని ఎప్పుడుసూ ప్రకాశించునవి, కొన్ని దోమలతో నిండినవి. కొన్ని ఎప్పుడూ ఏమీ లేనివి. ఇలాంటి సృష్టులతో నిండిన బ్రహ్మాండాలు అంతః ప్రజ్ఞగల యోగులకు గూడ సవిల్పక జ్ఞాన గోచరములు గావు. అనగా ఇదమిత్థమని నిర్వచించి చెప్పనలవికావు. విష్ణ్వాది దేవతలు కూడ తమ

జీవితకాలం అంతా వెదకినా వీటి అంతు కనుగొనలేరు. ఇవి అంతటి అనంతములు. అతి చిత్రవిచిత్రములు. వీటి చుట్టూ వెలుపల నున్న జలాద్యావరణములలో కూడ కొంత వైచిత్ర్యమున్నది. భూమి చుట్టూ నీరున్నది సముద్రరూపంతో, భూమి లోపల కూడా నీరున్నది. ఈ లోపల నున్న నీరు భూమిని ఏల కరిగించి తీయదు? చుట్టు ఉన్న సముద్రములు భూమిని ఏల నీటితో ముంచవు? వీటిని పట్టుకున్న వాడెవడు? అడ్డుపరచిన వాడెవడు? అని శంక కలుగుతుంది. వలయము నందు రత్నములు పొదిగియున్నట్లు, ఈ అండ గోలకమునందు భూతము లను ఆకర్షించి నిలపెట్టే శక్తి యిమిడి యున్నది. దానివల్ల అవి విశ్లేష చెందకుండా (విడిపోకుండా) నిలచియున్నవి.

రామచంద్రా! ఈ జగద్విస్తారమును వర్ణించి చెప్పుటకు నా బుద్ధి చాలదు. నాకంతటి శక్తి లేదు. నాకు తెలిసినంత వరకు చెప్పితిని అన్నాడు వసిష్ఠుడు.

## ౩౧ యుద్ధ ప్రేక్షకులతో నిండిన నభోవర్ణనము

రామచంద్రా! "లీలా సరస్వతులు ఇలా మాటాడుకొనుచు నడచారు. అనంతకోటి బ్రహ్మాండములను చూచారు. లీల యొక్క జన్మాంతరీయ బ్రహ్మాండము నుండి వెలువడి తుదకొక బ్రహ్మాండమును చేరారు. అచ్చట నొక యంతఃపురమును ప్రవేశించారు. అందులో పూలరాశిలో దాచి ఉంచిన మహారాజు (పద్మని) యొక్క శవం ఉన్నది. దాని ప్రక్కన లీల సమాధినిష్ఠలో ఉన్నది. అచ్చటి పరివార జనులు దుఃఖంచేత నిద్రలేకుండా ఉన్నారు. అంతఃపురం అంతా సువాసన ద్రవ్యాలతో పరిమళిస్తూ ఉన్నది. అచ్చటి పరిస్థితి చూచి, లీల ఆ భర్త గారి సంసారం ప్రవేశించాలని సంకల్పించినది. వెంటనే సంకల్పమయ దేహంతో, ఆ యంతఃపురాకాశ మంటపం ప్రవేశించింది. బ్రహ్మాండ కర్పరమును ఛేదించుకొని ఆ భర్తగారి విశాలమైన సంకల్ప సంసార మును సరస్వతీదేవితో కూడా చేరింది. అందులో లోకాంతరాలను కొండలనూ, నదులనూ దాటింది. చతుస్సముద్రపరీతమైన భూతలం

చేరినది. మేరు పర్వతముచే అలంకృతమై నవఖండమండితమయిన జంబూ ద్వీపమును ప్రవేశించినది. అందు భారతవర్షమున తన ప్రాణనాథుని రాజ్యమును చూచినది. అప్పటి సింధురాజు సామంతరాజుల సహాయముతో మదించి, సేనా సమేతుడై తన భర్తగారి రాజ్యమును ఆక్రమించి ఉన్నాడు. వారిద్దరకు యుద్ధము ప్రసక్తించినది. ఆ సన్నాహం చూడటానికి వచ్చిన ప్రజాసీకంతో ఆకాశం క్రిక్కిరిసి ఉంది. నిర్భయంగా ఈ లీలా సరస్వతులు కూడా ఆ సంగ్రామం చూస్తూ ఉన్నారు. నభోమండలంలో నభశ్చరగణంవచ్చి మేఘాలు లాగచుట్టు మూగి ఉన్నది. సిద్ధచారణ గంధర్వ విద్యాధరాదులు వచ్చారు. రణశూరులను స్వర్గలోకం చేర్చటానికి అప్సరసలు నిరీక్షిస్తూ ఉన్నారు, రక్తమాంసాలను భక్షించటానికి ఘాతరక్షః పిశాచాదులు సిద్ధంగా ఉన్నారు. విద్యాధరాంగనలు పూలవర్షం కురిపించటానికి తయారై ఉన్నారు. ఈ ద్వంద్వ యుద్ధాన్ని చూచుటకు కుతూహలపడిన, వేతాల యక్షకూశ్మాండాదులు తమను ఆయుధ ప్రహారాల నుంచి కాపాడుకోటానికి కొండచరియలలో దాగియున్నారు, ప్రేక్షకులు అహోమహమికతో వచ్చి పడుతున్నారు, స్వర్గార్హులయిన శూరులను గొనిపోవుటకు ఇంద్ర భటులు త్వరపడుచున్నారు. గంధర్వులు, స్వర్గాగతులగు శూరులను సన్మానించుటలో వ్యగ్రులై ఉన్నారు. అమర స్త్రీలు కటాక్షములతో వారిని చూచుచున్నారు. శూరుల కీర్తి చే సూర్యుడు కూడ చల్లపడి చంద్రుడయినాడు. రామచంద్రా! ఇలా ఉన్నది. పద్మరాజు సింధురాజుల యుద్ధ చరిత్ర" అని అన్నాడు వసిష్ఠుడు.

శ్రీరాముడు— మహర్షీ! ఎలాంటి భటుడు శూరుడు? ఎవడు రణరంగంలో స్వర్గమునకు వెళ్లుతాడు? ఎలాంటివాడు డాంబికుడు?

వసిష్ఠుడు— రామచంద్రా! శాస్త్ర విధానంగా ధర్మపరిపాలన చేయు రాజు కొరకు పోరాడి యుద్ధమందు జయించినవాడుగాని, చచ్చినవాడుగాని శూరుడు. శాస్త్ర వ్యతిరిక్తమయిన నడతగల ప్రభువుకొరకు పోరాడి చచ్చినవాడు బాలయుద్ధ హతుడు. (డింభాహవుడు) ఇట్టి వానికి స్వర్గముగాదు నరకము తప్పదు.

వేలైనంతవరకు శాస్త్రార్థాన్ని, లోకాచారాన్ని అనుసరించి

యుద్ధంచేసే వాడే భర్తుడగు శూరుడు, గోవు కొరకు, బ్రాహ్మణుని కొరకు, మిత్రుని కొరకు, శరణుజొచ్చినవాని కొరకును, యుద్ధమాడి మరణించినవాడు స్వర్గాలంకారము. పరిపాలింప దగిన తన దేశమును పాలించుటయందు ఉద్యుక్తుడయిన రాజుకొరకు మరణించినవారు వీర స్వర్గమును జేరెదరు.

ప్రజోపద్రవకారియగు రాజును రక్షింపతలచి యుద్ధమాడువారికి నరకము స్థిరము. రాజుకానీ, రాజుకాకపోనీ శాస్త్రమును తప్పి నడచే వాళ్లకొరకు మరణించినవారు తప్పక నరకమును పొందుదురు. ధార్మికుని కొరకయినను, అధర్మ యుద్ధమునుచేసి చచ్చినవారు స్వర్గమునుపొందరు. అధర్మ యుద్ధం చేసే వారికి కూడ స్వర్గంపచ్చే యడల ప్రజలు పరలోక భయం లేకుండా అన్యాయంగా పరులను నాశనం చేస్తారు. యుద్ధంలో చచ్చిన వాళ్లందరూ వీరస్వర్గానికి వెళ్లుతారనేది లోకవాడుకకాని, శాస్త్ర సిద్ధాంతంకాదు. శాస్త్రము మాత్రం ధర్మయుద్ధంలో చచ్చేవాళ్లకే స్వర్గం అని చెపుతోంది. కనుక సదాచారపరుల కొరకు రణ బాధను సహించినవారే శూరులని శాస్త్రం చెపుతోంది. మిగిలినవాళ్లు డాంబిక యుద్ధంలో చచ్చినవాళ్లే (డింభాహవహతులే) ఇట్టిశూరులకొరకే స్వర్గాంగనలు "మేము మీకు భార్యలమను"చు నభోమండలంలో ఎదురు చూస్తూ ఉంటారు. రామచంద్రా! ప్రస్తుత యుద్ధ సమయంలో విద్యాధర స్త్రీలు కమ్మగా పాడుచున్నారు. కొందరు మందార పూలమాలలు కట్టుచున్నారు. సిద్ధులు విమానములను తెచ్చిన భోమండలంలో సిద్ధంగా ఉన్నారు.

## 32 యుద్ధారంభము

ఈ స్థితిలో సభోమండలమందు వీరాగ్రేసరుల కొరకు ఉత్సాహ పడుతూ నాట్యమాడే అప్సరసలను చూచింది లీల. అడవులలో చతురంగ సైన్యముతో కూడిన తన భర్తగారి రాష్ట్రమండలమంతా అతి భయంకరంగా ఉన్నది. ఇరుప్రైపు సేనలు రెండు సముద్రములలాగ కలవరపడుచు మహా ఆడంబరం చేస్తున్నాయి, ప్రళయకాలాగ్ని యుద్ధ

సన్నద్ధమయినట్లున్నది రణరంగంలోని సైనికులను చూస్తే సేన, చక్ర వ్యూహ, గరుడవ్యూహ, శ్యేనవ్యూహములను పన్ని కోలాహలుచేస్తోంది. పరస్పర బాణ ప్రహార ధ్వనులు పెచ్చుపెరిగి ప్రళయానిలముచే సంక్షోభము చెందిన సముద్రములె కనుపడుచున్నది. అప్పుడే తెగగొట్టిన మేరు పర్వతము యొక్క రెక్కలవలె నున్నవి ఆ సేనలు. గాలికి కదలిన కాటుక కొండవలెను పాతాళకుహరమును భేదించుకొని వచ్చిన అంధకారబంధురమైన చక్రవాళ పర్వతము యొక్క చరియలవలెనూ, ఇరుసేనలు అగపడుచున్నవి. సముద్రము జలప్రవాహముతో ఏకార్ణవమొనర్ప సమకట్టెనదా? యనునట్లున్నది రణరంగము.

## 33 ప్రథమ యుద్ధము

ఆ సంగ్రామమును దర్శించుటకు ఆకసమున నొక విమానమును గల్పించుకొని లీలా సరస్వతీ దేవులు దాని నధిష్ఠించిరి. అంతలో లీలేశుడగు విదూరథుడు శత్రుసైన్యము నుండి వచ్చిపడుచున్న నొకభటుని యెదురురొమ్మున ముద్గరమను ఆయుధముతో గొట్టెను. పిదప ఇరుసైన్యములయందును శస్త్రసంపాతము (ఆయుధ ధారావర్షము) కురిసినది. శస్త్రధారలయొక్క కాంతిపుంజము ఆకాశము నలంకరించినది. ధనుష్టంకారములూ, బాణ ప్రహారముల కణకణ శబ్దములూ, మోగిపోవుచున్నవి. వేయేల! వర్ణింపనలవికానంతగ భయంకరముగ నున్నది రణరంగము. రామచంద్రా! అపుడు. ప్రళయకాలము ఆసన్నమైనట్లున్నది.

## 34 యుద్ధమును జూచెడి ప్రజల పలుకులు

వసిష్ఠుడు— శ్రీరామా! యుద్ధమాడు రాజులూ, భటులూ, మంత్రులూ, యుద్ధమును జూచు జనులూ వారి వారికి తోచినట్లు మాట్లాడుకున్నారు. శూరుల ఖండితమస్తకములు, కదలెడి పద్మములు, ఎగిరెడి హంసలు, ఉదయించెడి నక్షత్రములు, అని కొందరు, రక్త బిందువులతో గూడి వీచెడి గాలిచే, మధ్యాహ్నకాల సూర్యకిరణములు, మేఘములును సాయంకాల కిరణములవలెను, సాయంకాల మేఘముల

వలెను ఉన్నవని మరికొందరు. శూరులు ప్రయోగించిన బాణములను జూచి, ఇవి గద్దివాములని కొందరు. నల్లనికాంతిగల నిస్త్రింశమును జూచి, ఇది జయలక్ష్మి నేత్రమని మరికొందరు, రణశూరులను స్వర్గమునకు గొనిపోవ, ఆటపాటలతో దేవాంగనలునాట్య మాడుచున్నారని కొందరు, తాటిచెట్లవలె పొడుగాటి మొండెములు తాళానుకూలముగ నాట్యమాడుచున్నారని కొందరును, ఇట్లు అనేకమంది అనేకవిధముల చిత్రవిచిత్రముగ వర్ణించుకొనిరి.

## ౩౪ రణవర్ణనము

ఆ సంగ్రామ మొక సముద్రమనదగి, చతురంగ సైన్యముతో అతి భీషణముగ నుండెను. గుర్రములు తరంగములు. ఛత్రములు నురుగులు. శరములు (బాణములు) చేపలు. గుర్రపు సైనికులు తరంగములు. నానావిధాయుధములు నదీ బృందములు. సేనలు సుడిగుండములు. మదపుటేనుగులు కులశైలములు. పరాగపటలము మేఘములు. ఖడ్గకాంతులు నీరు. మకర్వ్యూహ భటులు నావలు. ఇవికొన్ని విరిగినవి, మరికొన్ని సగము విరిగినవి. బాణములు ప్రవాహజలము. అందు తిరిగెడి మేఘములు సుడిగుండములు. కోపసంరంభులగు సైనికులు తిమింగిలాది జంతువులు, సైనికుల తెగిపడెడి తలలు నీటిబొంపురులు వచ్చుచుపోవుచుండెడి ఛత్రపతాకాలు రణసముద్రమందలి నురుగు. రథములు రక్త ప్రవాహములో కొట్టుకొనిపోవు చెట్లు. ఇట్టి రణసముద్రము చూచువారలకు గంధర్వనగరమువలె ఆశ్చర్యమును కలిగించెను.

## ౩౬ నుంచి ౩౯ వరకు యుద్ధ వర్ణనము

ఇందు ఇరువైపుల సైనికులు అతి ఘోరముగ యుద్ధమును సాగించిరి. అట లీలా నాథుడగు పద్మునకు సాయమొనర్ప తూర్పుదిశనుండి, కోసల, కాశీ, మగధ, మిథిల, ఉత్కళ, మేఖల, కర్కర, మద్ర, ముఖ్యాహిమ. రుద్రముఖ్య, తామ్రలిప్త, ప్రాగ్జ్యోతిష, వాజిముఖ, అంబష్ఠ, పురుషాద, వర్ణకోష్ఠ, సవిశోత్ర, ఆమమీనాశనాది దేశపు రాజులేకాం

చిరి. ఇట్లే పాగ్దక్షిణ భాగమునుండి ఇరువదిపదు దేశముల రాజులు వచ్చిరి. దక్షిణ దిక్కునుండి అరువదిమూడు దేశముల వారరుదెంచిరి. పశ్చిమ దక్షిణ దిశల మధ్యభాగమునుండి, పందొమ్మిది దేశముల రాజులును, అచ్చటి పర్వతవాసులును, సముద్రతీరవాసులును వచ్చిరి, రామచంద్రా! ఇంక ఆతని ప్రతిపక్ష రాజులను చెప్పనే పనిలేదు. ఆ గుంపులు అనంతములుగా నున్నవి. రామా! నేనీ యుద్ధమును వర్ణింపజాలను. నేనే కాదు. వాసుకి కూడ తన వేయి నాలుకలు వినియోగించినను ఈ యుద్ధమును వర్ణింపలేదు. భయంకరంబైన ఆ రణరంగమున, యమదూతలూ పిశాచములూ, తమ తమ విధులను నిర్వర్తించుకున్నారు. భూతములు తమఃపిండములను చేతితో తీసికొని భక్షించుచు నాట్యమాడు చున్నవి. నలుదిక్కుల గాఢాంధకారము ప్రబలినది. ప్రాణులందరు నిద్రావస్థలో నున్నారు. అపుడు లీలా పతి ఉదారభావంతో మరురోజున చేయతగిన కార్యభారమును గూర్చి ఆలోచింపసాగినాడు. చంద్రమండల సదృశమగు గృహమందు చల్లని పాన్పుమీద పరుండి కనుమూసి కొంతతడవు నిద్రించాడు. ఆ లీలా సరస్వతులు గూడ, ఆ యాకాశమును వదలి, ఒకానొక రంధ్ర ద్వారము గుండా ఆ గృహమును చేరారు.

శ్రీరాముడు— మునీంద్రా! అతి స్థూలమగు వీరల శరీరము ఆ చిన్ని రంధ్రము కుండ లోపలికెట్లు వెళ్లెను,

వసిష్ఠుడు— రామచంద్రా! "నేను ఆధిభౌతికమగు దేహముగలవాడను" అను భ్రమ ఏరికుండునో వారి శరీరము చిన్న రంధ్రముగుండ లోనికి పోజాలదు. అది నేనొప్పుకొంటును. ఎవరికి స్థూల దేహమునందు "నేనను" బుద్ధిలేదో, ఎవరికి ఆతివాహిక దేహమునందు నిశ్చయమున్నదో, వారు మాత్రము తమ వాసనావశంచేత సూక్ష్మదేశములకు వెళ్లగలరు. మరల రాగలరు. వస్తు శక్తి నియతముగా నుండును గాని మారదు, బాహ్యవస్తువుల శక్తి యెట్లు నియతమో అట్లే ఆంతరవస్తువుల శక్తి కూడ నియతముగా నుండును. నీరు మెరకకు పారదు. నిప్పు క్రిందకు మండదు. అట్లే చైతన్యముయొక్క శక్తి కూడ మారదు. నీడనున్న వానికి ఎండతగలదు. పరమాత్మ సాక్షాత్కారముగలవానికి గూడ

దేహేంద్రియాదుల సంబంధమయిన నిరోధ దుఃఖముండదు. కనుక అధి ష్ఠానమైన సంవిత్తు (చైతన్యము) స్థూలము కాగలదు. సూక్ష్మము న్ను కాగలదు. దాని ననుసరించి, చిత్తము కూడ స్థూల సూక్ష్మదశలను పొందగలదు. చైతన్యము ననుసరించి యుండెడి చిత్తము యోగాభ్యా సము మున్నగు ప్రయత్నములచే అన్యధా భావమును చెందును, త్రాడు యందు కలిగిన సర్పజ్ఞానము, త్రాడుయొక్క తత్త్వజ్ఞానము కలిగిన తోడనే బలాత్కారముగా నశిస్తుంది. లేకపోతే ఆ భ్రాంతి అలాగే ఉంటుంది. చిత్తము చైతన్యమును అనుసరించినట్లు చేష్టలు చిత్తము ననుసరించి యుండును. ఇది లోక విదితము. ఆకాశ మాత్రాకారుడైన స్వప్న పురుషునీ, సంకల్ప పురుషుణ్ణీ ఎవరు అడ్డగించగలరు? అట్లే చిత్త మాత్రాకారముగల ఆతివాహికమును ఏదియు అడ్డుపరచలేదు. కాన లీలా సరస్వతుల సూక్ష్మదేహము చిన్న బిలము కుండలోనికి పోవుటలో ఆశ్చర్యంలేదు. భౌతిక శరీరము కూడ జ్ఞాన బలంచేత చిత్తరూపమును చెందును. చిత్తముకంటె నిజస్థితిలో భూతములు వేరుగావు. పరమాత్మ చిత్తవృత్తుల ననుసరించియే భూతములను పుట్టించు చున్నాడు. లయింపు చున్నాడు. సృష్టి ప్రారంభంలో అజ్ఞానమువల్ల బుట్టిన భూతములు పంచీకరణమును జెంది ఆవల స్థూలములగు చున్నవి. కార్యము కారణముకంటె వ్యతిరిక్తముకాదు. కనుక, భూతములు అజ్ఞానముకంటె వేరు కావు. అజ్ఞానమునగా అవ్యక్తమనవచ్చును. కాన అధిష్ఠానమైన చైత న్యము యొక్క సత్తవలనె చిత్తముకాని, అవ్యక్తముకాని స్ఫురించ నందున, ఈ రెండును శుద్ధచిత్తుకంటె వేరుకావు. కాబట్టి చిత్తాకాశ, చిదాకాశ, భూతాకాశములు మూడును ఒక్కటేయనవచ్చును. కావున రామచంద్రా! ఈ చిత్త శరీరము అన్నిటియందును ఇమిడి యుండును. ఏలనన, జ్ఞానేచ్ఛను అనుసరించియే జ్ఞానోదయమగు చున్నది. ఇది త్రస రేణువునందుండును. గగనోదరమందుండును. మొక్కలయందుండును. చిగురాకుయందుండును. జలమున తరంగరూపముతో నుండును. కొండ రాళ్లయందుండును. మేఘములయందు వర్షరూపముతో నుండును. పర్వత మధ్య భాగములందును, అనంతమగు ఆకాశ రూపముతో నుండును. పరమాణురూపముతో నుండును. దేహము లోపల నుండును.

బ్రహ్మాండములందుండును. ఈయిది ఇచ్ఛవచ్చినటుల ఆకాశమున తిరుగ గలదు. కొండ గుహలలో దూరగలదు. సముద్రముకంటె తరంగములు వేరుకావు. అట్లె ఈ అనంతకోటి బ్రహ్మాండములు చిత్తముకంటె వేరు గావు. ఈ చిత్తమే సృష్ట్యాదిలో ఉద్వేగరహితమైన విజ్ఞానరూపమై ప్రకాశించుచు, ఆకాశాది క్రమంచేత బ్రహ్మాండరూపమును జెంది, ఆవల ప్రారబ్ధ కర్మానుసారమైన ప్రవృత్తిని పొందుచున్నది. మరుభూమి యందు జలబుద్ధి ఉదయించినట్లు, గొడ్డురాలికి బిడ్డగలడని బుద్ధిగలిగినట్లు, చిదాకాశరూపుడైన పరమాత్మ, స్వాశ్రితమైన అజ్ఞానమువల్ల బ్రహ్మాండ రూపుడై విలసిల్లు చున్నాడు.

మహర్షీ! మీరు ప్రపంచమంతా మహోమయమన్నారు. అది అనంతశక్తియుక్తమన్నారు. దాని నిజస్థితిని గుర్తించి ప్రవర్తించినవాడు స్వతంత్రుడన్నారు. వానికి వ్యవహార దశలో అడ్డులేదన్నారు. దాని నిజ స్థితిని గుర్తించక ప్రవర్తించువాడు పరతంత్రుడన్నారు. అయితే అందరి చిత్తమునందూ అలాంటి శక్తి ఉండునా! లేక కొందరి చిత్తము (మనస్సు) నందే యుండునా! ఇందు మొదటి పక్షంలో అందరకు చిత్రవిచిత్రమైన ప్రపంచము గోచరించాలి. రెండవపక్షంలో ప్రపంచము మనోజన్యము కాకపోతుంది, మనస్సుకంటె వేరు కావలసివస్తుంది. లోకానుభవంకూడ మనస్సుకంటె ప్రపంచం వేరనియే ఉన్నది. అప్పుడు జ్ఞానంచేత మనో నాశం కలిగినా ప్రపంచ భ్రాంతి అనువృత్తము కాకమానదు. ఇంక తత్త్వజ్ఞానంవల్ల కలిగిన ఫలమేమి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! అందరి మనస్సుకూ ఆశక్తి ఉన్నది. కనుకనే అంద రకు చిత్రవిచిత్రమైన ప్రపంచం వేరువేరుగ గోచరిస్తోంది. క్షణంలో కొందరకు కొన్ని ప్రపంచాలు పుటుతూ ఉంటాయి. క్షణంలో నశిస్తూ ఉంటాయి. కొందరకు కల్పాంతంవరకు ఉంటాయి. దాని క్రమం అంతా చెప్తాను. వ్యష్టి ప్రపంచంలో వారివారి మరణం వారివారికి ప్రళయం. వారి వారి జన్మ వారి వారికి సృష్టి. ఈ సృష్టి ప్రళయాలు అందరకు వేరు. ఇవి స్వప్న సంకల్పముల వంటివి. అజ్ఞానంచేత కలుగుచున్నాయి. సమిష్టి మనోరూపుడైన హిరణ్యగర్భుడు సమిష్టి భోగ్యమైన ప్రపంచమును ఎట్లు

సృజించుచున్నాడో, అట్లే వ్యష్టి మనోరూపుడగు జీవుడుకూడ, తానను భవించదగిన స్వప్న సంకల్పాది వ్యష్టి ప్రపంచమును సృష్టించుచున్నాడు. కాబట్టి ప్రపంచం మనోజన్యమే. మనస్సుకంటె వేరుగాదు. తత్త్వజ్ఞానం చేత మనోనాశం కలిగితే ఇంక ప్రపంచభ్రాంతి అనువృత్తముకాదు. అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

మహర్షీ! "యద్ధిమనసాధ్యాయతి తద్వాచావదతి, తత్కర్మణాకరోతి" అను శ్రుతి, ప్రతివానికీ మనస్సంకల్పంలో ఉన్నది మాటలోకి వచ్చుననీ, అదే క్రియారూపమును తాల్చుననీ చెపుతోంది. లోకానుభవం కూడ ఇలాగే ఉన్నది. కనుక స్మృతి క్రియలు రెండూ ఏ వస్తు విషయములుగాని, భిన్నవస్తు విషయకములుగావు. అనగా స్మృతిలోలేనిది క్రియలో నుండదు. ఈ స్మృతి యథార్థమనీ అయథార్థమనీ రెండు విధములు. స్మృతికి కారణము అనుభవము. అది యథార్థమైతే స్మృతి యథార్థమవుతుంది. అయథార్థమయితే అయథార్థమవుతుంది. అనుభవగోచరమైన విషయము, యథార్థమైతే అనుభవము యథార్థమగును. అయథార్థమయితే అయథార్థమగును. కనుక అనుభవగోచరమైన విషయమును బట్టి స్మృతికి సత్యాసత్యములు ఏర్పడుచున్నవి. ఈ స్థితిలో మనము భ్రాంతి జ్ఞానాలతో కూడినవాండ్లము. మన సంకల్పములు అసత్యములు. అందువల్ల మన స్మృతులు అయథార్థములు (అసత్యములు) కనుక మనబోటివాండ్ల స్మృతివలన బుట్టిన స్వప్న సంకల్పాది ప్రపంచములు కొన్ని అసత్యములు కావచ్చును. హిరణ్యగర్భుడు సర్వజ్ఞుడు. సత్యసంకల్పుడు. ఆయనగారి స్మృతి సత్యమగును కాని అసత్యమెన్నటికీ కాదు. కనుక ఆయనగారి స్మృతివలన బుట్టిన ప్రపంచము సుతరాం మిథ్య (అసత్యము) కానేరదు. ఇంక మీరు ప్రపంచం మిథ్యయని ఎట్లు రుజువు చేయగలరు. ఇదీకాక, వ్యష్టి జీవులు తాము మరణించినవెంటనే తాము సృష్టించుకున్న ప్రపంచాన్ని స్మరించి అనుభవించుచున్నారు. అలాగే సమిష్టి జీవుడగు హిరణ్యగర్భుడు గూడ మహాప్రళయానంతరం యథార్థమగు తన స్మృతిచే, తాను లోగడ సృష్టించిన ప్రపంచమును అనుభవించుచున్నాడు. కనుక చతుర్ముఖ బ్రహ్మకు స్మృతిపథంలోనున్న ప్రాక్తన సత్యపదార్థములే, ఈ కల్పంలో కూడ సత్య ప్రపంచమునకు

కారణమగుచుండుటచే, ప్రపంచము కారణరహితమని కాని, బ్రహ్మ కంటె వేరు కారణము లేదని కాని మీరు చెప్పినదంతయు వ్యాఘాత మగుచున్నది. అన్నాడు శ్రీరాముడు.

రామచంద్రా! చతుర్ముఖ బ్రహ్మకు, పూర్వ సృష్టిలో (మొదటి సృష్టిలో) యథార్థానుభవముండి, దానివలన. ఉత్తర సృష్టికి హేతు వగు యథార్థ స్మృతి సంభవించే యడల నీవు చెప్పినట్లు ప్రపంచము బ్రహ్మాతిరిక్త కారణకమూ సత్యమూ అయ్యేడిది. అదేలేదు. మొట్ట మొదట హిరణ్యగర్భుని పదవిలోనికి వచ్చిన ఉపాసకునకు అట్టి యథా ర్థానుభవ జన్యస్మృతియే సంభవించదు. వానికి స్మృతి ఉపాసనోపనీత మైన సంస్కారమువల్ల కలిగినదికాని, యథార్థానుభవమువలన కలుగ లేదు. పాక్తనమైన ఆ ఉపాసన, వ్యష్టి వస్తువును సమిష్టి భావముతో ధ్యానించుటకాని, వేరుగాదు. అయ్యది యథార్థానుభవము కానేరదు. పైపెచ్చు అయథార్థానుభవ మనవచ్చును. కాన అయథార్థమయిన ఉపా సనా సంస్కారజన్య స్మృతివలన కలుగుటచే ప్రథమ సృష్టియే సత్యము కాదు. ద్వితీయ సృష్టి సమయంలో ప్రాచీనులైన సర్వజ్ఞులెవ్వరూలేరు. వారందరూ పూర్వకల్పంలోనే ముక్తిపొందినారు. కావున ద్వితీయ కల్పంలో మొదటి సృష్టికి కారణమైన స్మృతికి, పూర్వసర్గమునందలి, మిథ్యా భూతార్థ విషయకమగు అనుభవమే కారణము. వేరు కారణము లేదు. కాన అ స్మృతి అయథార్థము (అసత్యము) కాని, సత్యము ఎంత మాత్రము కాదు. కనుక ప్రపంచము సత్యమనుటకు ఎంత మాత్రము వీలులేదు. రామా! మహాప్రళయమున హరిహర విరించాదులు విదేహ ముక్తిని పొందెదరు. వారు సర్వజ్ఞులూ, అధికారికులునూ, వారి అధికా రము పూర్తికాగానే వారు తప్పక విదేహకైవల్యము నొందెదరు. తత్త్వ జ్ఞానము కలిగిన మనబోటి మానవులే శరీరత్యాగానంతరము విదేహ ముక్తిని బొందుచుండ, సర్వజ్ఞులైన హరిహరాదులు ముక్తిపొందకుందురా? ఇంక చావు పుట్టుకలుగల నీబోటి ఇతర జీవులకు మాత్రం మోక్షము లేనందున జన్మాంతర స్మృతి ఉండును. అయ్యది వెనుకటి జన్మయందలి మిథ్యాభూతమైన ప్రపంచానుభజన్య సంస్కారమువల్ల పుట్టినదే కాని

వేరుగాదు. వారు ఆ స్మృతివల్ల వారివారి భోగప్రపంచమును సృష్టించు కొందురు. కావున ప్రపంచము సత్యమనుటకు తావులేదు. మహా ప్రళయానంతరము సమష్టి జీవుడైన హిరణ్యగర్భుడు సమష్టి ప్రపంచ మును సృష్టించినట్లు, ఈ వ్యష్టి జీవులుగూడ మరణానంతరము, వారి వారి సంకల్పానుసారముగ వ్యష్టిభోగములను కల్పించుకొనుచున్నారు. సమష్టి జీవసృష్టికీ, వ్యష్టి జీవ సృష్టికీ భేదములేదు. ఇక్కడగూడ ప్రధాన మహత్తత్వాది క్రమమున్నది. జీవులు మరణానంతరము, లోపల స్మృతి సంస్కారములుండియు, పైకి వ్యక్తముకాకుండ, స్థూలాకారమును జెంద కుండ నుండుటయే ప్రధానావస్థ. దీనినే ఆకాశప్రకృతియనియు, అవ్యక్త మనియు, జడాజడ రూపమనియు నందురు. సృష్టి ప్రళయములకు ఎచ్చట నయినను క్రమ మిదియే. ఈ ప్రధానమున, (అవ్యక్తమున) చిద్వస్తువు ప్రతిఫలించినపుడు, అహంకారమూ, పంచతన్మాత్రలూ, దిక్కాలక్రియాది సూక్ష్మభూత భౌతిక వికారజాతమంతా క్రమంగా పుట్టుతుంది. ఇదియే మరికొంత వికాసమును జెంది, సూక్ష్మేంద్రియ పంచకమును పుట్టించును. పిదప చిరకాలాభ్యాసంచేత ఇదే ఆధిభౌతికమగు స్థూలదేహాభావమును చెందును. తరువాత ఆ స్థూలదేహమును ఆధారముగా జేసికొనియుండు చక్షురాదీంద్రియములు మున్నగునవి, వాయువునుండి స్పందనాది క్రియలు పుట్టినట్లు మిథ్యగా బుట్టును. ఇలా ప్రపంచ భ్రాంతి అంతా వ్యర్థంగా పెరిగిపోతోంది. ఇది కలలో కాంతతో రమించినట్లు వట్టి భ్రాంతి. అనుభవింపబడుచున్నను లేనిదానితో సమానము. జీవుడు మరణించిన వెంటనే వాని కిట్టి స్మృతి కలిగి మాయామయమగు ప్రపంచము గోచ రించును. ఇట్లు అతిసూక్ష్ముడగు జీవుడు జన్మమరణములులేనివాడైననూ, మిథ్యాభూతమయిన దేహాది భావనలకు లోబడి, తాను పుట్టినట్లు చచ్చి నట్లునూ, భ్రాంతి పడుచున్నాడు. ఈ భ్రాంతి చిత్రవిచిత్రములుగ అనేక రకములు "నేను ఫలానికి పుట్టితిని" "నాకు వాడు తండ్రి" "అతడు నాకు ఆప్తుడు" "ఆమె నా తల్లి" "ఇది నా ధనము" "ఇది నా పుణ్యము, నా పాపము" "నేనిదివరకు బాలుడను" ఇప్పుడు యువకుడనైతిని. అనుచు హృదయమునందెన్నియో భ్రాంతుల ననుభవించును. ఇట్లు ప్రతివారికిని కలిగెడి ప్రపంచ భ్రాంతియనునది యొక అడవి భూమి. ఇందు నక్షత్రములు

పుష్పాలు. నీలమేఘములు చిగురుటాకులు. తిరుగుచున్న మనుష్యులు మృగములు. సురాసురులు పక్షులు. వెలుతురు పుప్పొడి. చీకట్లు చొరరాని లతాగృహములు. సముద్రములు కోనేరులు. మేర్వాది పర్వతములు కొయ్య మొద్దులు. చిత్తములు పద్మబీజములు. అందున్న సంస్కారములు అంకురములు. జీవు డెచ్చట మరణించినా క్షణంలో ఇట్టి సంసారమను భూమిని దర్శించును. ఇట్లు బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, ఇంద్రుడు, మరుత్తులు, సూర్యులు, కొండలు, నదులు, సముద్రములు, ద్వీపములునూ, కోట్లకొలది అగపడిపోవుచున్నవి. వాటికి అంతులేదు. అసద్రూపములయిన ఇలాంటి బ్రహ్మాండాలు ఎన్నో గడచినవి. ఎన్నియో జరుగుచున్నవి. ఎన్నియో రానున్నవి. వీటిని ఎవరు నిరూపింపగలరు? ఇలా స్థూలరూపంగా కనిపించే ఈ ప్రపంచం మనస్సంకల్పం కంటె వేరు కాదు. మనస్సు స్వతసిద్ధముగ చంచలము. ప్రపంచం కూడా స్థిరంగా కనిపించుచున్నా, విచారించిచూస్తే మనస్సువలె అస్థిరస్వభావమైన దేకాని స్థిరస్వభావమయినదికాదు. మనస్సు ప్రసన్నంగా ఉంటే ప్రపంచం ప్రసన్నంగా ఉంటుంది. అది మలినంగా ఉంటె ఇది మలినంగా ఉంటుంది. ఇది లోకానుభవము. ఇప్పుడు నీకు కూడా నీ అనుభవమును బట్టి విచారించి చూచుకో. నీకే నిర్ణయం అవుతుంది.

సూక్ష్మదృష్టితో విచారిస్తే ఈ మనస్సు సాక్షి మాత్రము. సాక్షి బ్రహ్మమాత్రుడు. తుదకు అఖండా ద్వితీయ చిన్మాత్రము మిగులుచున్నది. నదిలోని జలమే ఆవర్తము. (సుడి) దానికి జలస్వరూపముకంటె వేరు రూపము లేదు. అట్లే ద్రష్టయే దృశ్యము. దృశ్యమునకు వేరు రూపములేదు. ఇంద్రజాలకుని చేతిలో మణి, ఆకాశమున ప్రకాశించుచుండగా, అచ్చట మనకు నానావిధములయిన గంధర్వనగరాది చిత్రములు తోచినట్లు, చిదాకాశము (చైతన్యము) ప్రపంచమునందంతటా ప్రకాశించుచుండ, అందు మాయచే మనకు నానారకములయిన జీవకోటులూ, వారి భోగపదార్థములతో గూడిన ప్రపంచమూ, స్ఫురించుచున్నది. అధిష్ఠాన సన్మాత్రము అహం శబ్దార్థము. ఆరోపిత ప్రపంచము త్వం శబ్దార్థము. ఇందు అహం శబ్దార్థమే సత్యము. త్వం శబ్దార్థము సత్యము కాదు. మిథ్య. త్వమహం శబ్దములను ప్రయోగించువాడు (ప్రమాత) కూడ,

అహం శబ్దార్థమగు సాక్షి చిన్మాత్ర స్వభావుడే కాని, నీ వనుకొనెడి జీవ స్వభావుడు కాడు. కనుక రామచంద్రా! చిత్తాకాశమాత్ర శరీరులగు లీలా సరస్వతులు నిరాఘాటముగ అతిసూక్ష్మమగు ఆ ఛిద్రము కుండ పద్మునిమందిరమును ప్రవేశించుటలో ఆశ్చర్యములేదు. స్థూల దేహము సూక్ష్మరంధ్రములయందు ఇనుడదు, చిదాకాశమున కట్టి అడ్డు లేదు. కనుక ఆ లీలా సరస్వతులు వారి ఇచ్ఛ వచ్చినటుల చిచ్ఛరీరముతో ఆవిర్భావతిరోభావములను పొందగలిగిరి. అందువల్ల పద్మని మందిరమున వారిరువురకు ప్రవేశము కలిగినది. అందు నీవు సందేహింప బనిలేదు.

## ౪౦, ౪౧ భ్రాంతి విచారము

వీరిరువురు చేరేసరికి ఆ ఇల్లు ఇద్దరు చంద్రు లుదయించినట్లు తెల్ల పడింది. మందార పూవుల పరిమళం ఇల్లంతా క్రమ్మినది. ఆ లీలా సరస్వతుల మహిమచే ఇతరు లందరూ నిద్రలో మునిగియున్నారు. అమృతమువలె చల్లనయిన వారి శరీరకాంతులచే స్నానమాడినవాడువలె పద్ముడనురాజు మాత్రము మేల్కొనినాడు. చెరొక ఆసనము మీాదనూ కూర్చున్న ఈ దివ్యస్త్రీలనిద్దరను చూచాడు. "మేరుశిఖరమున ఉదయించిన ఇద్దరు చంద్రులా! ఏమి వీరు" అని ఆశ్చర్యపోయాడు. ఒక్క నిముషం ఆలోచించాడు. శేషశయనము నుండి విష్ణువు లేచినట్లు పడకనుండి చటుక్కున లేచాడు. మెడలోని పూలహారములనూ, ఒంటిమీాది కట్టు బట్టను సవరించుకున్నాడు. తలవైపునున్న బుట్టనుంచి పూలను గ్రహించు కున్నాడు. పద్మాసనం వేసికొని నేలమీాద కూర్చున్నాడు. నమ్రుడై నమస్కరించి ఇలా అన్నాడు. "సాంసారిక తాపత్రయమును అణచుటలో చంద్రకాంతివంటి, ఓ దేవతలారా! లోపలి వెలుపలి అంధకారమును పారద్రోలుటలో సూర్యకాంతివంటి ఓ దేవతలారా! మీాకు జయమగు గాక" అని, ఆపైన వారిరువురి పాదములమీాద కుసుమాంజలిని ఉంచినాడు. అంతట లీలకు ఈ రాజుయొక్క జన్మవృత్తాంతమును చెప్పించదలచి, సరస్వతీదేవి, ఆ చెంతనున్న మంత్రిని సంకల్పముచే మేలుకొలిపినది. ఆతడు మేల్కొని ఈ అప్సరసలనుజూచి, నమస్కరించి, వారిపాదములపై దోసెలితో పూలనుంచి, వినమ్రుడై ముందుకు వెళ్లాడు. అతనితో

ఆ సరస్వతీదేవి, ఓ రాజా! నీ వెవరవు? ఎవరి కుమారుడవు? ఎప్పుడు ఇక్కడ పుట్టితివి? అని అన్నది. అది విని ఆ మంత్రి ఇలా జవాబు చెప్పాడు.

ఓ దేవతలారా! మీ అనుగ్రహంచేత నేను మీ ఎదుట మా ప్రభువుగారి జన్మవృత్తాంతం చెపుతాను. వినండి. "ఇక్ష్వాకు వంశంలో కుందరథుడనే రాజు ఉన్నాడు. అతనికి భద్రరథుడనే పుత్రుడు గలడు. అతని కొడుకు విశ్వరథుడు. వాని కొడుకు బృహద్రథుడు. వాని కొడుకు సింధురథుడు. వాని కొడుకు శైలరథుడు. వాని కొడుకు కామరథుడు. వాని కొడుకు మహారథుడు. వాని కొడుకు విష్ణురథుడు. వాని కొడుకు నభోరథుడు. ఆయన కొడుకు విదూరథుడు. ఈతడు నిర్మలాకారుడు. ప్రజలయందు స్నేహమాధుర్య ఔదార్యాదిగుణములుగలవాడు. మహాపుణ్యశాలి. ఇతడే మా ప్రభువు. ఈతని తల్లి సుమిత్ర. పార్వతికి కుమారస్వామివలె, ఈమె కీతడు జన్మించాడు. ఇతని తండ్రి ఈతని పదవ ఏటనే రాజ్యమిచ్చి విరక్తుడై అడవికి వెళ్లాడు. అప్పటినుంచి పరిపాలనా భారం ఇతని మీదనే పడినది. ధర్మమార్గమున ప్రజలను పాలించుచున్నాడు. నేటికి మా సుకృతము పండినది. మీరు సాక్షాత్కరించారు. వేయి సంవత్సరములు తపస్సు చేసినా మీ దర్శనముకాదు. కనుక ఇపుడు మీ దర్శనభాగ్యంచేత మా ప్రభువు విదూరథుడు పవిత్రమయినాడు." అని చెప్పి మంత్రి మౌనం వహించాడు. రాజు పద్మాసనం వేసికొని కూర్చుండి, దోసెలియొగ్గి నతముఖుడై ఉన్నాడు. అంతట సరస్వతీదేవి "రాజా! నీవు పూర్వజన్మ వృత్తాంతమును స్మరించుము" అని పలికి తన చేతితో ఆతని శిరోభాగ మును స్పృశించినది. అంతమాత్రమున ఆతని హృదయమందలి అజ్ఞానాంధకారము పటాపంచలైనది. హృదయము వికసించినది, కళ్లకు కట్టినట్లు పూర్వజన్మ వృత్తాంతమంతా జ్ఞప్తికి వచ్చినది. అతడు అఖండ భూమండలమునకు ఏకరాజయి యుండుట, లీలయను భార్య యుండుట, రాజ్యమును పరిత్యజించుట, దేహమును విడచుట, ఈ సరస్వతీ వృత్తాంతము, లీలావిలాసము. ఇదంతా తెలిసికొన్నాడు. ఆశ్చర్యసముద్రములో మునిగిపోయాడు. "ఆహా! ఈ ప్రపంచం ఎంత మాయతో కూడి ఉన్నది. ఇప్పుడు కదా నాకిది, ఈ దేవుల అనుగ్రహమున తెలిసినది."

అని మనస్సులో అనుకున్నాడు. ఓ దేవతలారా! నేనువచ్చి ఒక్కరోజేకదా అయినది. నావయస్సు డెబ్బదిసంవత్సరములు గడచినదే. ఇదెట్లు? నావెను కటిపనులన్నీ జ్ఞప్తికి వచ్చుచున్నవి. నా తాత తండ్రులనూ, నా బాల్య, యౌవనాది అవస్థలనూ, నా బంధుమిత్రాదులనూ అందరనూ స్మరించు చున్నాను. ఇది నాకాశ్చర్యముగానున్నది, అని అన్నాడు రాజు వారితో. సరస్వతీ దేవి ఆ రాజుతో ఇలా అంటుంది ఓ రాజా! నీవు ఎక్కడికో వెళ్లి, ఎక్కడి నుంచియో వచ్చి, నీ వృత్తాంతము ను నీవు స్మరించడంలేదు. అంతా నీ కధిష్ఠానమగు చిదాత్మలోనే చూస్తున్నావు. అదే నీకు నిజ మయిన స్వరూపం దాని యందే గిరిగ్రామ నివాసియగు విప్రుని గృహ మున్నది. అందులోనే పద్ముడనురాజు యొక్క లోకాంతరమున్నది. దానియందే రాజగృహముకలదు. అందే ప్రధాన గృహమున్నది. దాని లోపలి గృహాకాశమునందే ఈ బ్రహ్మాండ మండపము కలదు. ఇదంతా నీవు మరణించిన వెంటనే, అధిష్ఠాన చైతన్యము మాయాతిరోహితమయే సరికి, స్ఫురిస్తోంది. ఈ బ్రహ్మాండ మండపంలోనే నీ జన్మాది వృత్తాంతము నీకు ఆభాసగా వేరువేరుగా గోచరిస్తూ ఉంది. ఈ బ్రహ్మాండ మండ పంలో నీజీవుడు నన్ను ఉపాసించుచున్నాడు. ఇక్కడనే పద్మునిరాజ్యమూ, వాని గృహాదులును గలవు. నిర్మలమయిన ఆకాశముకంటె కూడ అతి నిర్మలమయిన నీచిదాకాశమందే, ఈ మహావిశాలమయిన వ్యవహారము నీకు భ్రాంతమవుచున్నది.

"నేను ఇక్ష్వాకువంశంలో పుట్టాను. నాకుఅనేకులుతాతలూ, తండ్రు లూ గడచారు. ఈజన్మలో నేను పదిసంవత్సరముల బాలుడనైయుండగా, నాతండ్రిసన్యసించి, రాజ్యమును నాకుఇచ్చి అడవికివెళ్లాడు. నేనుశత్రువు లజయించి దిగ్విజయంపొందాను. ఈమంత్రులతో, ఈపౌరులతోనూ, నిష్కంటకంగా రాజ్యమేలినాను. యజ్ఞయాగాలుఆచరిస్తూ, ధర్మమార్గము లో ప్రజలను పాలిస్తూ ఉండే నాకు ఇప్పటికి డెబ్బది సంవత్సరములు గడ చాయి. ఇప్పటికి శత్రువర్గము సంప్రాప్తమయింది. వారితో అతిదారుణమైన యుద్ధంచేశాను. ఇల్లు చేరాను. మామూలు స్థితిలో ఉన్నాను. నా ఇంటికి ఈయిద్దరు దేవులువచ్చారు. వారిని పూజించుచున్నాను. దేవతలనుపూజిస్తే కోరిన కోర్కెలను తీర్చెదరు. ఈ ఇద్దరిలో నొక ఆమె నాకు జన్మాంతర

స్మృతి సచ్చిదేజ్ఞానమును ప్రసాదించింది. సూర్యుడు పద్మమును వికసింప జేసినట్లు నా చిత్తమును వికసింపజేసింది. నేను కృతకృత్యుడను. నా సంశయాలు పోయినవి. నేను శాంతిని చెంది, నిరతిశయ సుఖసమృద్ధితో తులదూగెదను కేవల సుఖస్వరూపునిగా ఉండెదను.'' అని ఇలా నీకు మహా విశాలమయిన భ్రాంతి కలిగింది. నీవు మరణించిన మరుక్షణము నందే నీహృదయమున ఈ జ్ఞానము ఉదయించింది.

నదీప్రవాహము ఒకసుడిగుండమును విడిచి మరియొక సుడిగుండమును చేరినట్లు ఈ చిత్తవృత్తి ప్రవాహము కూడ ఒక దృశ్యమునువదిలి, మరి యొకదృశ్యమును చేరును. ఈసృష్టియొక్క విలాసము జాగ్రదవస్థలో ఇతర జీవులసృష్టితో కలసి ఉంటుంది. స్వప్నమునందు అట్లు కలియదు. అంతా తనయందే కల్పించుకొని వినోదిస్తుంది. విచారించిచూస్తే ఇది అంతా భ్రాంతి స్వప్నంలో ఒక్క నిముషకాలంలో కొన్ని సంవత్సరాలు గడచిపోతాయి. సంకల్పనిర్మాణంలో అనేకజన్మమరణములు గోచరిస్తాయి. ఆకాశమున గంధర్వనగరంలో గోడలుకనిపిస్తాయి. నీటిలోపడవవెళ్లుతూ ఉంటే ఒడ్డున ఉన్న చెట్లు కదలుచున్నట్లు గోచరిస్తాయి. శరీరంలోనిపిత్తధాతు ప్రకోపం చేతఅపూర్వంగా పర్వతం నాట్యమాడుచున్నట్లు కనిపిస్తుంది. తనస్వప్నం లో తనతల తెగినట్టు తోస్తుంది. ఇవిఅన్నీ వాస్తవములా? కావు. భ్రాంతులు. కానిఇవిలేతలేత భ్రాంతులు. ఈప్రపంచభ్రాంతి చాలాముదురుది. నిజస్థితిలో నీవుపుట్టలేదు చావలేదు. నీవు శుద్ధజ్ఞానరూపుడవు నీనిజరూపంలో నీవు ఉన్నావు. ఈప్రపంచం అంతాచూస్తూ ఉన్నా నీవు చూచువాడవుకావు. సర్వాత్మస్వరూపంతో ప్రకాశిస్తున్నావునీవు నిజస్థితిలో ఈభూమండలం లేదు. విదూరథుడనే నీదేహమూలేదు. ఈపర్వతములూ. ఈగ్రామము లూ, ఈ పరివారజనులూ, లేవు. మేముకూడా లేము. గిరిగ్రామ నివాసి యగు బ్రాహ్మణుని మండపమునందు, లీలాదేవితోడను ఆమెభర్తతోడను గూడినజగత్తు చక్కగా భాసించుచున్నది. ఆ గృహము రాజధానివలె ప్రకాశించుచున్నది. ఆ యింటిలోనే ఇప్పుడు మనమందరమూ, ఉంటున్నాము నిజంలో ఆమండపములన్నీ బ్రహ్మస్వరూపాలు అందులో. నేల లేదు పట్టణము లేదు. అడవులు నదులు, సముద్రములు, మేఘాలు ఏమీ లేవు. చిన్మాత్ర పూర్ణమయిన బ్రహ్మయందు మిథ్యాగృహాలు

భాసిస్తున్నాయి. అందులో జనులు తిరుగుతున్నట్లు భాసిస్తోంది. నిజంలో అక్కడ జనులుకాని, అమాత్యులుకాని, రాజులుకాని, పర్వతములుకాని ఏమీ లేవు. అంతా శూన్యము. అని అన్నది సరస్వతీదేవి. విన్నాడు విదూరథుడు, ఇలా అడిగాడు. దేవీ! అయితే, జీవాత్మతో కూడుకున్న నా భృత్యులందరూ, నావలె సత్స్వభావముగందే ఉన్నారా! లేక ఇంకొక వస్తువును ఆధారముగ జేసికొని ఉన్నారా? ప్రపంచం అంతా స్వప్నంగా భాసిస్తోంది. అందులోని మానవులందరూ స్వప్నపదార్థములవలె మిథ్యాభూతులు అనాలి. అలా అనేటట్లయితే వారు ఆత్మయందు మాత్రం సత్యస్వరూపులుగా ఎలా ఉంటారు? నిజంలో వారు ఆత్మరూపంలో కూడ సత్యములు కారా ఏమి? చెప్పు.

రాజా! నీవు "జీవులు సత్యస్వరూపులవునా? కాదా? అని, అజ్ఞ దృష్టిలో అడుగుచున్నావా? లేక తత్త్వదృష్టిలో అడుగుచున్నావా?" అనగా జైవరూపంలో వార్లయొక్క సత్యత్వమును అడుగుచున్నావా? లేక చిద్రూపంలో వారల సత్యత్వమును అడుగుచున్నావా? మొదటి పక్షంలో, జీవరూపంలో నీవూ నిజంకావు. వారూ నిజంకారు. అధిష్ఠాన చిద్రూపంతో నీవూ నిజమయినవాడవే. వారూ నిజమయినవారే. ప్రపంచ భ్రాంతి ఉన్నంతవరకు అందరూ అసత్యులే. అది తీరినతరువాత అందరూ సత్యరూపులే. ఇదీ ఇక్కడి పరిస్థితి. అని అన్నది సరస్వతి రాజుతో. వసిష్ఠుడు శ్రీరామునితో ఇంతవరకు ప్రసంగించే సరికి సూర్యుడస్తమించాడు. సభ లేచింది సాయంతనానుష్ఠానమునకు. మరల సూర్యోదయంతో కూడ మునిబృందము సభను అలంకరించింది.

— అయిదవరోజు ప్రసంగము ముగిసినది —

## ౪౨ స్వప్నపురుష సత్యత్వ నిరూపణము

6వ రోజు ప్రసంగము ప్రారంభమయింది. తత్త్వవేత్తలకు వార్ల దృష్టిలో ప్రపంచం ఎంతటి మిథ్యయో, అజ్ఞానులకు వార్ల దృష్టిలో ప్రపంచం అంత సత్యం అని చెప్పదలచాడు వసిష్ఠుడు. ఇలా అన్నాడు రామునితో.

రామా! మూర్ఖులకు ప్రపంచం వజ్రం అంతటి గట్టిది. అంతటి పరమార్థం. మతిచెడిన పిల్లవాడికి పట్టిన భేతాళుడు చచ్చేదాక దుఃఖం ఇస్తాడు. మూర్ఖునకు ఈ జగత్తుకూడా యావజ్జీవం దుఃఖం ఇస్తుంది. మరు భూమిలోని ఎండయే మృగాలకు నిజంగా నీరు అనే బుద్ధిని పుట్టిస్తుంది. కలలో తన మరణం తనకు దుఃఖాన్ని ఇస్తుంది. అలాగే మూర్ఖునకు అసత్యమయిన ఈ జగత్తు సత్యమయినదానివలె పనులను కలుగచేస్తుంది. తెలివితక్కువ వాడికి కటకమునందు (మురుగునందు) కటకమను జ్ఞానమే కాని, బంగారమను జ్ఞానం ఉండదు. అలాగే అజ్ఞానికి, ఇళ్లు కొండలు, చెట్లు, ఏనుగులు, పాములు అనే బుద్ధే ఉంటుంది కాని, పరమార్థ దృష్టి ఉండదు. (సర్వము బ్రహ్మము అను దృష్టి ఉండదు.) కంటిదోషముగల వాడికి ఆకాశంలో ముత్యములు, నెమలి పింఛము, వెంట్రుకల కొప్పు. మున్నగు అసత్య వస్తువులు గోచరించినట్లు మూర్ఖునకు ఈ జగత్తులో అసత్యవస్తువులే సత్యంగా గోచరిస్తాయి. కాబట్టి అహంకార మమకారా మలతో కూడిన ఈ ప్రపంచం దీర్ఘ స్వప్నం (చిరకాల స్వప్నం) అని తెలిసికో.

స్వప్నతుల్యమయిన ఈ ప్రపంచంలో, కలలోతన్న ఇతరపురుషుల వంటివారు మరికొందరు నిజంగా ఉన్నారు. (సత్యంగా ఉన్నారు.) వారు ఎలా సత్యస్వరూపులో చెపుతా విను. సర్వాధిష్ఠానము, నిరతిశయ సత్య స్వరూపము, నిర్మలము, శాంతము, చిన్మాత్రము, అగు పరమాత్మ వస్తువు ఒకటి ప్రపంచంలో ఉంది. అది సర్వత్ర (అంతట) వ్యాపించి యున్నది. అది మాయా శబలితమై, మాయచే, ఎచ్చచెట్చుట ఏయే పనులు చేయించడానికి ఆవిర్భవించ తలుస్తుందో, అచ్చటచ్చట అలా తయారవుతుంది. కనుక ఆ చైతన్యవస్తువు శరీరంలో ప్రవేశించి ఉండి, శరీరాభిమానంచేత, అవస్థాత్రయమును పొందుతూ ఉంటుంది. అందు స్వప్నదశలో, కలగాంచునపుడు, కలగాంచెడివాడు, (స్వప్న ద్రష్ట) స్వప్న దేహమునందు కొంతమంది మనుష్యులను చూస్తాడు. (తెలిసికొంటాడు) అప్పుడు వాళ్లు అక్కడ క్షణంలో మనో వాసనలను అనుసరించి తయా రవుతారు. వాళ్లవల్ల జరిగే పనులు జాగ్రదవస్థలో నంతటి స్థిరములు కాకున్ననూ, ఆయవస్థవరకు సత్యములని అంగీకరించాలి. కనుకనే వాళ్లతో

వ్యవహారిస్తూ ఉండగా సుఖదుఃఖాలు కలిగి పైకి నిజంగా సవ్వడము, ఏడ్వడము జరుగుతోంది. సత్య స్వప్రకాశ అపరోక్ష చైతన్యముతో, తాదాత్మ్య ధ్యానచేసిన స్వప్నజాగరముల రెంటియందునూ, అధ్యస్తములయిన వస్తువులూ, వాటి ధర్మములునూ, సత్యములనక తప్పదు. కాని ఇందులో కొంత అనృతత్వము కూడా ఉంది. అధ్యాస అంటేనే సత్యానృతముల యొక్క మిధునీ భావము (జంట) కనుక అధ్యాసవల్ల ఏర్పడిన వస్తువులందు, కొంత సత్యత్వమూ, కొంత అనృతత్వమూ, ఉన్నవని అంగీకరించక తప్పదు. కనుక స్వప్న వస్తువులందుగూడ కొంత సత్యము ఉన్నదని అంగీకరించి తీరాలి.

అయితే మహర్షి ! స్వప్నమునందు కనిపించే వస్తువులు కేవలము అసత్యములంటే తప్పేమి? జాగ్రదవస్థలోని పదార్థములు, అధిష్ఠానము యొక్క సత్తచే సత్యములనకపోతే, లోకవ్యవహారమునకు భంగం కలుగుతుంది. కర్మశాస్త్రానికి అప్రామాణ్యం వస్తుంది. అందువల్ల వాటిని సత్యములని అంగీకరించవలసిందే. స్వాప్నిక పదార్థాలు ఏ మాత్రమూ సత్యములేని మాయా మాత్రములని అంగీకరిస్తే ఏమి దోషము?

రామచంద్రా! విను. స్వప్న పురంలో (దేహంలో) కనిపించే వస్తువులు, బ్రహ్మవలె పరమార్థ సత్యములు కావు. అంతవరకు నేనును అంగీకరిస్తాను. కాని ప్రతిభాసించెడి కాలంలో, ప్రాతిభాసిక సత్యత్వము మాత్రము, వాటియందు ఉంది. అందు ప్రత్యక్షానుభవమే ప్రమాణము. ఆ మాత్రపు సత్యత్వముకూడ లేని వంధ్యాపుత్రాదులతో మనకు ఏలాటి వ్యవహారము జరుగుటలేదు. ఇక్కడ (స్వప్నమునందు) కొంత వ్యవహారము జరుగుతోంది. కాన కొంత సత్యం వీటియందు కలదు. అట్లు కాక స్వప్న ప్రపంచం కేవలం అత్యంత అసత్తు అయ్యే ఎడల, జాగ్రత్ప్రపంచంకూడ అలాగే అత్యంతా సత్తుకావాలి. జాగ్రత్ప్రపంచం కూడ హిరణ్యగర్భుని స్వప్నమే. ఇది వ్యష్టిజీవ స్వప్నము. అది (జాగ్రత్ప్రపంచం) సమష్టి జీవుడయిన చతుర్ముఖ బ్రహ్మయొక్క స్వప్నము. వ్యష్టి జీవ స్వప్నం బొత్తుగా శూన్యమయితే, సమష్టి జీవస్వప్నం కూడ బొత్తుగా శూన్యం కావలసిందే కదా? అలా అంగీకరించుచుంటిమా? లేదు. జాగ్రత్ప్రపంచం

నిజమనుకొనుచున్నాము. అలాగే స్వప్నం కూడా నిజం అనుకోవాలి. నీ స్వప్నంలో నీవు ఎవనితోనో మాట్లాడావు అనుకో. అప్పుడు నీవు నిజంగా ఉన్నావా? లేవా? నీవు లేవని నీ వెట్లు అనగలవు? అలాగే నాకు కలిగే స్వప్నంలో నేను కూడ నిజమే కదా? అట్లే ఇతర మానవులుకూడ వారి వారి అనుభవమునుబట్టి వారు వారు నిజమని అనకతప్పదు. స్వప్న పదార్థాలు కేవలం శూన్యములయితే, తదాకారంగా ఉన్న జాగ్రత్పదార్థాలు మాత్రం సత్యములు ఎలా అగును? కనుక ఈ మహా ప్రపంచంలో, నీవు నాకూ, నేను నీకూ, ఎలానిజమో, అలాగే స్వప్నంలో కూడా స్వప్న ద్రష్టకు, స్వప్నదృశ్యాలు అన్నీ, స్వప్నదశలో సత్యములని అంగీకరించాలి.

ఇంక, జాగ్రత్స్వప్నములు రెండూ సమానములు అయ్యే ఎడల, కలగన్న వానికి మెలకువవస్తే కలలో కనిపించిన వస్తువులు మెలకువ వచ్చిన అవస్థలో కూడ అలా ఉండవలసిందే కదా? అని నీవు అడగవచ్చును. విను సమాధానం. నేను ఆవిషయం అంగీకరిస్తాను. కలలోని వస్తువులు కూడ అధిష్ఠాన సన్మాత్ర స్వభావంతో సత్యములే. జాగ్రద్వస్తువులు కూడా సన్మాత్ర స్వభావంతోనే సత్యములు కాని, నీకు కనిపించే రూపంతో సత్యములు కావు. ఒకవేళ స్వప్న వస్తువులు కలలో కనిపించే రూపంతో జాగ్రత్తులో ఉండుట లేదుకదా? అనేటట్లయితే, అపుడు జాగ్రద్వస్తువులు కూడా, ఆ రూపంతో కలలో కనిపించడం లేదుకదా? అనే ప్రశ్న వెంటనే ఉంటుంది. కనుక స్వప్నకాలంలో ఉండే వస్తువులు జాగ్రత్కాలంలో లేకపోవడం, జాగ్రత్కాలంలో ఉండే వస్తువులు, అదే రూపంతో స్వప్న కాలంలో లేకపోవడం ఇది రెంటియందును సమానమే. అలాగే దేశాంతరానను వృత్తికూడ సమానము. అనగా స్వప్నపదార్థములు జాగ్రత్తులో బాహ్య దేశంలో బాహ్య కాలంలో లేవు కనుక అలీక (అసత్య) ములనే యెడల, జాగ్రత్పదార్థములు కూడ, స్వప్నదశలో, అంతఃకరణంలో స్వప్న ప్రదేశంలో, స్వప్నకాలంలో లేవందున అవి కూడ అలీకములనవలసి వస్తుంది. కాబట్టి స్వప్న జాగ్రద్వస్తువులు రెండునూ, అధిష్ఠాన సత్తచే సత్యములయినా, సర్వదేశకాలములందుండక పోవుటచే మిథ్యాత్వమనునది రెంటికి సమానము.

ఈ స్వప్న జాగ్రత్పదార్థములకు, అధిష్ఠానమయిన సంవిత్తు మాత్రము, సర్వదేశకాలములందుండుటచే సత్యము. మాయాశక్తి చే అంతట, అన్ని వస్తువుల రూపంతో ప్రకాశించే సామర్థ్యం కూడ ఆ సంవిత్తుకు నిజంగా కద్దు. ధనాగారంలో ఉన్న ద్రవ్యాన్ని ధనస్వామి తీసికుంటాడు. చిదాకాశంలో ఉన్న ప్రపంచాన్ని చిదాకాశమే అనుభవిస్తుంది. అని సరస్వతీదేవి విదూరథునకు తత్త్వబోధచేసి, "రాజా! విదూరథా! నీకు చెప్పిన ఈ తత్త్వం అంతా నీ భార్య అయిన లీలయొక్క తృప్తికొరకు ఉపదేశించాను. నీకు క్షేమమగుగాక. నీవు కోరినది నెరవేరుగాక. మేము వెళ్లి వస్తాము. ప్రపంచ మిథ్యాత్వం కొరకు నేను చెప్పిన దృష్టాంతాలన్నీ నీయింటిలోనే లీల చూచింది. బ్రహ్మాండ కల్పనలన్నీ అక్కడనే ప్రత్యక్షం చేసికొన్నది. అని చెప్పింది సరస్వతి విదూరథునితో.

రామా! ఈ మాటలన్నీ విని విదూరథుడు సరస్వతితో ఇలా అన్నాడు. "దేవి! మనుష్యమాత్రుడనయిన నాయొక్క దర్శనమే వ్యర్థం కాకపోతే, మహాఫలం ఇచ్చే మీబోటివారల దర్శనం వ్యర్థమవుతుందా, కాదు. ఇంక నేను ఈ దేహాన్ని విడిచి, నా నిజ (ప్రాక్తన) లోకానికి వెళ్లుతాను. శెలవిమ్ము. శరణాగతుణ్ణి. దయ ఉంచు. భక్తులయెడ ఉపేక్షాభావం మీబోంట్లకు తగదు. నేను వెళ్లే తావునకు, నా మంత్రీ, పెండ్లికాని ఈ నాకుమార్తె, ఈ యిద్దరు వచ్చేటట్టు దయతలచుము". అని సరస్వతి ఇందుకు జవాబు చెప్పింది. రాజా? ఈ లీలయొక్క భక్తిభాగ్యానికి తగిన విలాసలతో నిస్సందేహంగా రాజ్యమేలుము. మాబోటి వారలు ఎప్పుడూ, అర్థిజనులయొక్క. కోరికలను నిరాకరించరని గట్టిగా తెలిసికో.

## ౪3 అగ్నిదగ్ధమయిన గృహాదులను వర్ణించుట

రాజా! ఇపుడు జరుగనున్న యుద్ధంలో నీవు మరణించవలసి ఉన్నది. నీవు మరల నీ ప్రాక్తనమయిన శవశరీరమును పొందవలసి యున్నది. నీ మంత్రి, నీ కుమార్తెకూడ వారి వారి ప్రాక్తన శరీరాన్ని పొందుతారు. ఇది అంతా నీకు ప్రత్యక్షం కాగలదు. మే మిద్దరము వచ్చినదారి పట్టిపోతాము. మీరు మాత్రం ఆతివాహిక దేహంతో మీ మామూలు

తావును చేరండి. గుర్రాల నడక వేరు. గాడిదలనడక వేరు, ఒంటెలనడక వేరు. మదపుటేనుగుల నడక వేరు. మీ నడక వేరు. ఆతివాహిక దేహ గమనమునకూ, మనోరథ గమనమునకూ, దేశము విపులంగా నుండవలసిన పనిలేదు. అని ఇలా సరస్వతీ విదూరథులు మధురంగా ముచ్చటించు కుంటూ ఉండగా, ఒక పురుషుడు హఠాత్తుగా వచ్చి రాజసన్నిధిచేరి ఇలా అన్నాడు. మేడపైకి ఎక్కి రాత్రి పూట వెలపలి పురవృత్తాంతాన్నిచూచు వాడు వీడు. దేవా! "గొప్ప శత్రుసైన్యము సాయక, చక్ర, అసి, గదా, పరిఘాద్యాయుధములను కురిపించుచూ, సముద్రమువలె పొంగి మన పట్టణం ముట్టడించింది. అది ప్రళయకాల వాయువుకు ఎగిరిపోయిన కులశైలాలవలె ఉంది. గదా శక్తి భుశుండ్యాద్యాయుధములను కురిపిస్తోంది. పట్టణం అంతా నిప్పు ముట్టడించింది. పట్టణం తగలబడుతోంది. ఎక్కడ చూచినా చటచట ధ్వనులు వినిపిస్తున్నాయి. ప్రళయకాల మేఘాలవలె పొగలు కొండల ప్రక్కన పెరిగిపోయినాయి." అని.

రామచంద్రా! ఇలా అతడు చెప్పుచుండే సరికి పెద్ద కోలాహలం బయలుదేరింది. ధనుష్టంకారాలు, కరిబృంహితములు, (ఏనుగుల అరపులు) అగ్నిమంటల ధ్వనులు, తగలబడి పోయిన భార్యలను గూర్చి ఏడుస్తున్న భర్తల శోకారావాలు, దిక్కులు నిండిపోయాయి. లీలా సరస్వతులూ, మంత్రి, విదూరథరాజులూ, కిటికీలగుండా అర్ధరాత్రి ఆ మహాపురమును చూచారు. ఆ శత్రుసైన్యము వర్ణింపనలవికానంత భయంకరంగా ఉంది. అచ్చట విదూరథుడను రాజు తగలబడిపోయిన భార్యలను చూచుటకు పరుగెత్తుచూ తమ యోధులనుకొనెడి దీనాలాపములను వింటున్నాడు.

## ౪౪ అగ్నిదాహమను రాత్రి యుద్ధముఖ జగద్ద్రష్టా వర్ణనము

ఈ లోపుగా పట్టమహిషి రాజగృహాన్ని ప్రవేశించింది. లక్ష్మీదేవి వలె శోభాయమానంగా ఉంది. కూడా దాసీలు, చెలికత్తెలు ఉన్నారు. అందులో నొక చెలికత్తె రాజుతో ఇలా అన్నది. రాజా! "మనపట్టణమున బయలుదేరిన ఘోరసంగ్రామమునకు బయపడి పట్టమహిషి మమ్ము వెంటబెట్టుకొని మీ వద్దకు వచ్చింది. మిమ్ము శరణుజొచ్చింది. ఆయుధ

హస్తులయిన శత్రువులు మీ భార్యలను తీసికొని పోయారు. అంతఃపుర పాలకులను చావకొట్టారు. పట్టణం అంతా దోచుకున్నారు. ఆయుధ హస్తులై పట్టణం ముట్టడించారు. అంతఃపుర స్త్రీలను కొప్పు పట్టుకొని ఈడ్చుకుపోయారు. ఈ ఆపదనుంచి రక్షించే శక్తి మీకు తప్ప వేరెవరికిని లేదు. రక్షింపుడు" అని. రాజు ఈ మాటలు విన్నాడు. ఆ లీలా సరస్వతీ దేవులతో ఇలా అన్నాడు. "ఓ దేవులారా? నేను యుద్ధము చేయబోవు చున్నాను. నాభార్యను మీపాదాలయందుంచు తున్నాను. రక్షింపుడు" అని ఇంటినుంచి, గుహనుంచి బయలుదేరెడి సింహంవలె బయలు దేరాడు. అపుడు సరస్వతీదేవితోనున్న (ప్రబుద్ధ లీల) లీల, తనప్రతిబింబం వలె మనోహరంగా ఉన్న లీలను చూచింది. సరస్వతీదేవితో ఇలా అన్నది.

దేవీ! ఏమిటిది? ఈమె అచ్చగా నావలెనే ఉన్నదే? ఎక్కడనుంచి వచ్చింది? నేను మునుపున్నట్లే ఉన్నదే ఈమె. ఈ మంత్రులూ, పౌరులూ, యోధులూ, కూడా, వెనుకటివారివలెనే ఉన్నారే. వీరందరూ అక్కడ కూడా అద్దంలో ప్రతిబింబములవలె అగపడుచున్నారే? వీళ్లందరు సచేతను లేనా? విన్నది సరస్వతి. ఇలా అంటుంది. లీలా? చైతన్యముయొక్క శక్తి చాలా గొప్పది. మనము ఊహింపలేము. మనస్సులో జ్ఞానం కలిగినట్లే అనుభవం కూడా క్షణంలో కలుగుతుంది. మనస్సు స్వప్నంలో, జాగ్రదవస్థలో తానను భవించిన పదార్థములయొక్క ఆకారాన్ని ధరిస్తుంది. అలాగే చిత్తుకూడ అధ్యాసచేత చైత్య (విషయ)ములయొక్క ఆకారాన్ని ధరిస్తుంది. బాహ్యంలో ప్రపంచ పదార్థాలు ఏ ఆకారంతో ఉంటాయో, అదే ఆకారంతో చిత్తంలోను, చైతన్యంలోను, సంస్కారాత్మకంగా ఉంటాయి. అలాగే అవి మళ్లీ అనుభవంలోకి వస్తాయి. దానికి ప్రదేశం విశాలంగా ఉండాలనీ, కాలం దీర్ఘంగా ఉండాలనీ నియమంలేదు. ప్రపంచం అంతా చైతన్యమునందు అధ్యస్తమగుటచే లోపల ఉండియే, (ఆభ్యంతర మయియే) బాహ్యంగా, (వెలుపలనున్నట్లు) భాసిస్తుంది. బాహ్యప్రపంచం, స్వప్నంలో ఆభ్యంతరంగా (లోపలిదిగా) భాసించడమే, దీనికి నిదర్శనం. అదే చిదాభ్యాసంవల్ల వ్యక్తమయి సత్యంగా తోస్తుంది. నీ యింటిలో నీ భర్త ఏవాసనతో (ఏసంస్కారంతో) మరణించాడో, అదేవాసనచేత, అదే ఆకారంతో అక్కడనే పుట్టాడు. ఈ మంత్రి మున్నగు జీవులుకూడ

సమానమయిన కర్మవాసనవల్ల ఉద్బుద్ధమయినా . వీళ్లకుఆ కాలంలో సామ్యం ఉంది. అయినా వీళ్లు వేరుకాని వారు కాదు. నీవు ఎన్నిసారులు "వాళ్లే వాళ్లే" అని ప్రత్యభిజ్ఞచే అనుభవించినా, వారందరూ అలాంటి వారుకాని. కేవలం వారు మాత్రం కాదు. వీళ్లందరూ ఈ రాజుయొక్క చైతన్య సత్తచే సద్రూపులు. స్వప్న సంకల్ప పురుషులవంటివారు. నిజ మయిన సత్యరూపులు కారు. జాగ్రద్వస్తువులందు పురుషాంతర సంవాద మున్నది. స్వప్న వస్తువులందు అది లేదు. అంత మాత్రంచేత జాగ్ర ద్వస్తువులు సత్యములనీ, స్వప్నవస్తువులు మాత్రమే మిథ్య అనీ అనటానికి వీలు లేదు. అవి సంవాది సర్వార్థత్వమును (ఎవరికిని విరుద్ధ జ్ఞానము లేకుండుటను) పురస్కరించుకొని జాగ్రద్వస్తువులు సత్యములనేయెడల, ఇంద్రజాల వస్తువులు అందరికీ ఒకేరకంగా కనుపడుచున్నందున, అవి సంవాదిత్వము ఉన్నది కనుక వాటినికూడ సత్యములనాలి. ఇక స్వప్న వస్తువులు ఉత్తరకాలమందు, (జాగ్రత్కాలమందు) బాధింపబడును కాన అసత్యములనే యెడల, జాగ్రద్వస్తువులకు కూడ తత్త్వజ్ఞానోత్తర కాల మందు అదేగతి పడుతుంది. కనుక అవి కూడ అసత్యములనక తప్పదు. మరియు పరస్పరకాలమందు లేక పోవుట కూడ ఈ రెంటికి సమానము. జాగ్రత్తులో స్వప్న వస్తువులు లేవు. స్వప్నంలో జాగ్రద్వస్తువులు లేవు. అలాగే మృతియందు జన్మలేదు. జన్మయందు నాశములేదు. కాబట్టి పరస్పరకాలాసత్వము ఇక్కడ కూడ ఉంది. కాని అవయవ నాశంవల్ల నాశం కలుగుతుంది. తత్త్వానుభవంవల్ల బాధకలుగుతుంది. ఇంతే తేడా. కాబట్టి రామచంద్రా! వెనుక జాగ్రద్వస్తువులవలె స్వప్న వస్తువులు కూడ సత్యములని చెప్పినాము. ఇప్పుడు స్వప్నవస్తువులవలె జాగ్రద్వస్తువులు కూడ అసత్యములని చెప్పితిమి. దీనిని బట్టి నీవు ప్రపంచం అంతా, స్వప్నం కాని, జాగ్రత్తు కాని అనిర్వచనీయం అని గ్రహించు.

సృష్టికాలమందుగాని ప్రళయమునందుగాని, అవశిష్టమయిన (మిగిలిన) బ్రహ్మపదార్థము ఒక్కటే ఉంటుంది. అదే జగత్తు. దాని యందే సృష్టి ప్రళయాలనే భ్రాంతులు పుట్టుచున్నాయి. ఆకాశంలో వెంట్రుకల కొప్పులనే బుద్ధులూ, సముద్రంలో తరంగాలనే బుద్ధులూ ఎలాంటివో, పరమాత్మయందు సృష్టి ప్రళయాలనే బుద్ధులు కూడా

అలా టివే. కనుక భ్రాంతిమయమయిన ఈ సంసారమునందు ఆస్థ కూడదు. గట్టిచీకటిలో పిల్లవాడికి యక్ష భ్రాంతి (దయ్యమనే భ్రాంతి) కలుగుతుంది. అక్కడ ఉన్నది చీకటే కాని, దయ్యమున్నదా? లేదు. కనుక ఈ జన్మ మరణాలనేవి వట్టి మోహము. (అజ్ఞానము) అజ్ఞానము యొక్క ఆవరణ విక్షేపశక్తియే జగద్రూపంగా వ్యాప్తమైంది. ప్రపంచం అంతా బ్రహ్మజ్ఞానంచేత నశిస్తుంది. అప్పుడు మిగిలిఉండే బ్రహ్మ ఒకటే సత్యమైంది. అంతకంటె వేరు దృశ్యమనేది లేదు. ఉన్నట్లు భాసించినా అది సత్యమైంది కాదు. సత్యత్వాసత్యత్వములు రెండూ ఒకచోట ఉండవు. సూర్యోదయమునందు ఇంటిలో త్ర్యణుకములు తిరిగినట్లు పరమాత్మ అనే ఆకాశమునందు బ్రహ్మాండముల త్రసరేణువులు తిరుగుచున్నాయి. అగ్నిరూపుడు కాని ఉపాసకుడు, "అహమేవాగ్నిః" నేనే అగ్నిని అని ఉపాసనచేసి. భావనాక్రమంచేత తనయందు ఔష్ణ్యము ఆవిర్భవించినట్లు ఎలా తెలుసుకుంటాడో, అలాగే ఆత్మ చైతన్యము కూడా వాసనావశంచేత ప్రపంచమును తెలుసుకుంటూ ఉంది. అంతేకాని అది సత్యము కాదు. గాలియందు, చలన, పరిమళములూ, ఆకాశమునందు శూన్యత్వమూ, ఎలా ఉన్నవో, అలాగే పరమాత్మయందు జగత్తు కూడ పిండాకారము లేకుండా ఉన్నది. స్వతః స్థూల రూపము లేకుండా ఉన్నది. కనుపడు రూపము మిథ్యకాని సత్యముకాదు. కనుక ప్రపంచము అనిర్వచనీయము. దీనికి జీవులయొక్క భోగేచ్ఛయే కారణము. ఇందులో కొన్ని పూర్వానుభవంతో సమానంగా ఉంటాయి మరికొన్ని క్రొత్తగా అనుభవింపబడుతాయి. మరికొన్ని అచ్చుగా అవే ప్రకాశిస్తాయి. మరికొన్ని అర్ధసమములుగా ఉంటాయి. ఈ జీవానుభవములన్నీ అసత్యములు. అయినా సత్యముగా కనిపిస్తాయి. కులంలో ఆచారంలో, జన్మలో, పనులలో కూడ, ఈ సామ్యా సామ్యములు ఉంటాయి. కాబట్టి లీలా! ఇప్పుడు నీకు మంత్రులూ, పౌరులూ, కనిపిస్తున్నారని అన్నావు. వారందరు పారమార్థికమైన ఆత్మ స్వరూపంలో, పూర్తిగా వారే. భేదంలేదు. సత్యరూపులు కూడా. వారివారి దేశాల చేష్టలచే మాత్రం వేరు. వెనుకటి వారితో సమానులు. కాబట్టి ఈ విదూరథుడనే రాజుయొక్క ఆత్మయందు, సద్రూపమైన ప్రతిభ ఎలా

పుట్టిందో, అలాగే, అంతకు పూర్వమే, జీవులయొక్క అదృష్టవశమున సదూపుడయిన ఈశ్వరునియందు గూడ. సత్యసంకల్పరూపమైన ప్రతిభ పుట్టింది. కనుకనే అచ్చగా నీవలె నుండు లీల (ఈమె) తయారై కనిపించుచున్నది. కాబట్టి ఈ కనిపించే ప్రపంచం అంతా చిన్మాత్ర స్వభావము. తత్త్వజ్ఞులు దీని, నిజమును గ్రహించారు. లీలా! నీవు కూడ ఈ ప్రపంచం ప్రత్యగాపమాత్రమని గ్రహించి ప్రశాంతంగా ఉండు, అని సరస్వతి ప్రపంచం అంతా చిదాకాశరూపమని నిరూపించింది అన్నారు. వసిష్ఠులు శ్రీరామునితో–

## ४೫ సత్యకామ సత్యసంకల్పములను వర్ణించుట

రామా! ఇంకా సరస్వతి, రెండవ లీలతో ఇలా అన్నది. "లీలా! నీ భర్తయగు విదూరథుడు రణరంగంలో శరీరం త్యజించి, అంతఃపురంచేరి పద్మభూపాలుడను రాజు కాగలడు". అని, ఈ మాటలు విని, దోసెలియొగ్గి నమస్కరించి దేవిముందు నిలబడి రెండవలీల ఇట్లన్నది. దేవీ!" నేనుసరస్వతీ దేవిని నిత్యమూ పూజించుచుండేదాన్ని. ఆమె అప్పుడప్పుడు రాత్రి లందు కలలో దర్శన మిచ్చుచుండేది. నీవు కూడా అచ్చగా ఆమెవలెనే కనిపించుచున్నావు. కనుక నీవే ఆమె అయియుండవచ్చును. దయయుంచి వరమిమ్ము" అని. సరస్వతీదేవి విన్నది. ఆమె భక్తిభావమును, పూజాధర్మమును స్మరించుకున్నది. అనుగ్రహించి ఇలా అన్నది. ఓ లీలా! నీవొనర్చిన యావజ్జీవ సేవకు నేను సంతసించాను. నీకిష్టమైన వరమును కోరుము. ఇచ్చెదను. దేవీ! నాకింకేమి కావలెను? నా భర్త ఈ యుద్ధమున శరీరమును పరిత్యజించి ఇంకొకతావును జేరునంటిరికదా! నేను కూడ ఇదే శరీరంతో ఆ తావును జేరునట్లును. ఆతనికి భార్యనై ఉండునట్లును వరమొసగుము అని అన్నది. ఆ దేశ లీల (రెండవలీల). లీలా! నీవు చిరకాలం అనన్య సాధారణ భక్తితో చేసిన షోడశోపచార పూజలకు మెచ్చినాను. నీకోర్కె తప్పక నెరవేరును. పొమ్ము. అన్నది సరస్వతి. ఈమాట విని ఆ దేశ లీల (రెండవ లీల) వికసితముఖయైనది. మొదటి లీల మాత్రం కొంత సందేహించి ఇలా ప్రశ్నించింది. పూర్వలీల– దేవీ! మీబోటివారు సత్యకాములు. సత్యసంకల్పులు, బ్రహ్మస్వరూపులు. మీ

కోర్కెలు శీఘ్రంగా సిద్ధిస్తాయి. ఇట్టి స్థితిలో నన్ను పూర్వశరీరంతో లోకాంతరమందున్న ఈ గిరిగ్రామమను పురమునకు తీసికొని రాలేదేమి? ఇప్పుడు ఈమెకు ఇదే శరీరంతో భర్తృలోకానికి వెళ్లే వరమును ఇస్తిరే. ఇందుకు కారణమేమి?

సరస్వతి:– లీలా! నేను స్వయంగా చేసేదేమి లేదు. నాకు ఎవరి మీదను ఏవిధమయిన పక్షపాతమూ లేదు జీవులు వారి పనులను వారే నెరవేర్చుకుంటారు. అందులో మాబోటి వాళ్ల పెత్తనం అనవసరం. నేను వారి వారి సంవిత్తునకు అధిష్ఠాన దేవతను. ప్రాణులకు అభిలషిత మయిన (కావలసిన) భావిశుభమును, వరమిచ్చి ప్రకాశింప చేస్తాను. జీవులకు మాత్రం వేరు వేరుగ వారి వారి ప్రాక్తన కామ కర్మ వాసన లతో గూడిన. చిదాత్మకమయిన జీవశక్తి కలదు. అది మాయతో గూడి యుండును. అది అన్ని కార్యములకు బీజభూతము. (విత్తనమువంటిది.) ఆ జీవశక్తిని అనుసరించియే నేను ఫలమిత్తును. నీవు నన్ను ఆరాధించి నపుడు నీ జీవశక్తి ముక్తిని పొందాలనే కోర్కెతో నున్నది. నేను కూడ నీకు అట్లే జ్ఞానమును కలుగజేసితిని. ముక్తిని ఇస్తిని. నీకు అప్పుడు ముక్తి పొందాలనే భావం ఉండుటచే చిచ్ఛక్తి యొక్క మహిమవలన ముక్తినే పొందావు. ప్రతి వారును వారి వారి ప్రయత్నానికి అను కూలంగా యధాకాలమున ఫలమును పొందుతారు. మీమీచిచ్ఛక్తే, తపస్సో, దేవతో అయి ఫ ల ము ను ఇస్తుంది. కాని అవి మిథ్యా భూతములు. యధార్థములుకావు. ప్రతి ప్రాణికి ఫలసిద్ధి కలుగుటకు, పురుష ప్రయత్నము అవసరము. చైతన్యావచ్ఛిన్నమయిన (చిత్తుతో గూడిన) ప్రయత్నమే పౌరుషము. కనుక నీకు ఎలాంటి ఫలం కావలెనో అలాంటి కర్మను చేయుము. లీలా! లోకమంతటా వ్యాపించి అంతరాత్మ రూపంతో ఉన్నది చిత్సత్త. దాని ప్రయత్నాను సారముగనే ఫలసిద్ధి కలుగుతోంది. మొదట విహితకర్మను గూర్చి ప్రయత్నిస్తే ఉత్తర కాలంలో దాని కనుకూలమయిన ఫలం పుటుతుంది. నిషిద్ధకర్మను ఆచరిస్తే తదనుకూలమయిన ఫలమే పుటుతుంది. ఈ విచారణ అందరకు అవసరము. నీవు కూడ ఈ విచారణ చేసికొని పావనమయిన స్థానమును గుర్తించుకొని, దానికి ప్రయత్నించుము. అని అన్నది సరస్వతీదేవి

మొదటి లీలతో". ఇంతవరకు చెప్పాడు వసిష్ఠుడు. శ్రీరామునకు ఇచట నొక సందేహం కలిగింది. ఇలా అడిగాడు వసిష్ఠుణ్ణి.

## ౪౬ విదూరధ నిర్యాణము

శ్రీరాముడు:- మహర్షీ! ఇంతకుముందు విదూరధుడను రాజు క్రుద్ధుడై ఇంటినుంచి రణరంగానికి వెళ్ళినాడని చెపితిరే ఆ కథ ఏమయినది? ఆయనగారు వెళ్ళి ఏమి చేశాడు?

వసిష్ఠుడు:- రామచంద్రా! విదూరథుడు సేనాపరివృతుడై సర్వావయవములకు కవచములను ధరించి, జయ జయ ధ్వనులతో ఇల్లువెడలి, యోధబృందమును ఆజ్ఞాపించుచూ, వీరగణములనుంచి చూచుచూ, ఆకాశవిమానమువలె నున్న విమానమునెక్కి రణరంగమును చేరాడు. ఇరుసేనలు అతిఘోరంగా యుద్ధమును సాగిస్తూ ఉన్నాయి. సరస్వతీదేవి అనుగ్రహమున దివ్యదృష్టిని పొంది, ఆ లీల లిద్దరూ, విదూరథుని కుమార్తెయూ, యుద్ధమును చూస్తూ ఉన్నారు. విదూరథుడు స్వపక్ష పరపక్షములను గుర్తించుటకు సైన్యమధ్యమున ప్రవేశించాడు. అతి భయంకరంగా సంగ్రామము సాగుతోంది.

## ౪౭ విదూరధ సింధురాజుల సమాగమము

ఘోరసంగ్రామం ఇలా జరుగుతూ ఉండగా ఆ యిద్దరు లీలలు సరస్వతీదేవిని ఇలా అడిగారు. దేవీ! నీ అనుగ్రహమున్ననూ, మా భర్త ఈ రణరంగంలో జయమును పొందుట లేదే. ఏమి కారణం?

సరస్వతి:- ఓ పిల్లలారా! మీ భర్తగారి శత్రువగు సింధురాజు జయమునుగోరి నన్ను చాలకాలము ఆరాధించాడు. మీ భర్తయగు విదూరథుడు జయకామనతో నన్ను ఆరాధించలేదు. అందువలన నేను విదూరథునకు జయమును ఈయజాలను. సింధురాజు జయిస్తాడు. విదూరథుడోడిపోతాడు. నేను అందరి మనస్సులలోను ఉన్నాను. ఆరాధించిన వారి కోరికను బట్టి ఫలమిస్తూ ఉంటాను. పంచభూతముల

స్వభావము మారనట్లు నా స్వభావముకూడ మారదు. ఓ చిన్నదానా! నీ భర్త ముక్తుడు కావలెనను భావనతో నన్ను ఆరాధించాడు. అందువలన ఆతడు ముక్తి పొందగలడు. ఈతడి శత్రువగు సింధురాజు "నేను సంగ్రామంలో జయించవలెను" అని నన్ను పూజించాడు. కనుక ఆతడు జయిస్తాడు. మీ భర్తయగు విదూరథుడు, మీ యిద్దరితోను, ఈ కుమార్తెతోను కాలము ననుసరించి ముక్తుడు కాగలడు. ఈ సింధురాజు ఈతని జయించి వసుధాపీఠమున రాజ్యమునేలును. అని అన్నది సరస్వతి. ఇరుసేనలవారును యుద్ధమాడుచున్నారు. ఇంతలో సూర్యుడు ఉదయాద్రిని అధిష్ఠించాడు. ఈ ఆశ్చర్యం చూడాలని ఆయనకు కూడా ఆశ్చర్యం కలిగింది కాబోలు. వివిధాయుధములతో రెండువైపులవారును పోరాడుచున్నారు. ప్రళయకాల వాయువుచేపడిన రాళ్ల సమూహంవలె బాణాలు గుట్టలు గుట్టలుగా పడుచున్నాయి. రెండు సేనలూ రెండు ప్రళయకాల విజృంభిత సముద్రాలవలె ఉన్నాయి. వారిరువురి సమాగమము అతి భయంకరంగా ఉంది.

## ౪౦, ౪౯ ఆయుధ యుద్ధ వర్ణము

అంతట తల ఎత్తుకొని సింధురాజు ఎట్టయెదుటకు వచ్చాడు. విదూరథుడు మధ్యాహ్న సూర్యుడువలె మండి పడ్డాడు. ధనుష్టంకారం చేయ ప్రారంభించాడు. సింధురాజుకూడ ఇలాంటి సామర్థ్యముకలవాడే. పీఠభయులు విష్ణువు నారాధించి సమానమయిన శక్తిని పొందారు. వారు ప్రయోగించెడి ముసలాది ఆయుధములు కల్పాంత వజ్రాయుధములవలె భయంకరధ్వనిని కలిగించాయి. ఆకాశం అంతా బాణాలతో నిండిఉన్నది. విదూరథుడు కురిపించే బాణవర్షమును చూచింది ఆ పురవాసినియగు లీల. (రెండవ లీల). సరస్వతితో ఇలా అన్నది. దేవీ! ఇదిగో చూడు. నాభర్త జయించగలడు. ఇతడి బాణములచే మేరువు కూడ పొడి అవుతుంది అని మురిసుకున్నది. ఈ మాటలు విన్నారు ఆ లీలా సరస్వతులు. ఆమె వ్యామోహాన్ని కనిపెట్టారు. తమలో తాము నవ్వుకున్నారు. అంతలో విదూరథుని బాణసముద్రమును, సింధురాజు అను బడబాగ్ని త్రాగి నట్లయిపోయింది. అగస్త్యుడు సముద్రాన్ని మింగినట్లయింది. సింధురాజు

బాణవర్షంచేత విదూరథుని బాణాలను ముక్కలుచేసి పారవేశాడు. ఆ ముక్కలు ఎక్కడ పడ్డాయో తెలియదు. విదూరథుడు కూడా కొంత దూరం పోరాడినాడు. ఎంత సేపటికీ యుద్ధం తెగదు. అంతట సింధురాజు గంధర్వులవద్ద సంపాదించిన సంమోహనాస్త్రమును ప్రయోగించాడు. విదూరథుడు తప్ప అందరూ మోహంపోయారు. చిత్రపటం వలెనూ, చచ్చినవారివలెనూ పడిపోయారు. విదూరథుడు పరిస్థితిని కనిపెట్టి ప్రబోధాస్త్రమును ప్రయోగించాడు. దానిచే సైనికులందరు ప్రాతఃకాల పద్మాలవలె వికసితముఖులై లేచారు. సింధురాజునకు మరింత కోపం హెచ్చింది. అతడు నాగాస్త్రం ప్రయోగించాడు. ఆకాశం అంతా పాములతో నిండి పోయింది. విషజ్వాలలు కూడా దేశమంతా వ్యాపిస్తున్నాయి. చూచాడు విదూరథుడు. ఇతడూ అస్త్రకోవిదుడే. కాబట్టి గారుడాస్త్రమును ప్రయోగించాడు. నాలుగు దిక్కులా పర్వతములవలె గరుడపక్షులు తిరుగసాగాయి. ఆ సర్పములను అన్నిటినీ మ్రింగివేసినవి. అంతట నా గరుడపక్షులన్నియు అంతర్ధానమయినాయి. తరువాత సింధురాజు తమోస్త్రమును ప్రయోగించాడు. భూమ్యాకాశముల నడుమ భాగం అంతా చీకట్లు క్రమ్మినవి. ఏమీ కనిపించడం లేదు. యుద్ధవ్యవహారం ఆటకట్టింది. అంతట మంత్రవేత్త అయిన విదూరథుడు, సూర్యాస్త్రమును ప్రయోగించాడు. వేయికిరణములతో వెలుగు బయలు దేరింది. చీకట్లు పటాపంచలయినాయి. అంతట సింధురాజు మహా క్రుద్ధుడై భయంకరమయిన రాక్షసాస్త్రం ప్రయోగించాడు. రాక్షసులు కపిలజడలతో నలుదిక్కులా వ్యాపించారు. సాగరాశి లేచినట్లు ప్రపంచం అంతా అంధకారమయం అయింది. సైనికులను కబళప్రాయంగా మ్రింగుతున్నారు. ఇంతలో లీలా నాథుడగు విదూరథుడు నారాయణాస్త్రమును ప్రయోగించాడు. అంతట నా రాక్షసులు అంతరించారు. దేశము నీరాక్షసమయింది. (రాక్షసరహితమయింది.) శరత్కాలమునందువలె ఆకాశం నిర్మలమయింది. తర్వాత సింధురాజు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. దిక్కులవెంట ప్రళయకాలాగ్నులు లేచాయి. విదూరథుడు ఆ యాగ్నేయాస్త్రమును ఉపశమింపజేయుటకు వారుణాస్త్రమును ప్రయోగించాడు. నలువైపులా జలప్రవాహములు పారుచున్నాయి.

అంత నా యాగ్నేయాస్త్రము చల్లారినది. ఆ నీటి ప్రవాహంలో సింధు రాజు సైనికులూ, సేనా నాయకులూ, గడ్డిపరకలవలె తేలిపోయారు. రథములు మునిగిపోయినవి. ఇంతలో సింధురాజునకు శోషణాస్త్రము తలపుకువచ్చింది. దానిని ధనస్సున సంధించి ప్రయోగించాడు. దానివల్ల జలమయమయిన ఆ మాయ అంతరించింది. చచ్చిన వారు మాత్రం అట్లే పడియున్నారు. ఆశోషణాస్త్రమునకు విదూరథుని సైన్యము మూర్ఛ పొందినది, అప్పుడు విదూరథుడు అస్త్రాలాటివి ప్రయోగించి పర్జన్యాస్త్రమును ప్రయోగించాడు. నల్లని మేఘములు నలువైపులా లేచి, లోకమును చీకటిలో ముంచివైచి, ముసలధారలతో వర్షమును కురిపించాయి. ఆ వర్షధారలలో సింధురాజూ, అతని సైనికులునూ, మునిగిపోయారు. అపుడు సింధురాజు అతిభయంకరమైన వాయవ్యాస్త్రమును ప్రయో గించాడు. అది నలుదిక్కులా ప్రళయకాలపు గాలి వీచనారంభించింది.

౪౫ ఆ వాయు ప్రవాహంలోపడి విదూరథుని రథము తిరిగి పోవ సాగింది. విదూరథుడు అద్దానిని గ్రహించి పర్వతాస్త్రమును ప్రయో గించాడు. భూనభోంతరాళములు పర్వత రాశితో నిండిపోయినాయి. గాలి శాంతించినది. సింధురాజు చెట్లనుంచి రాలెడి ఎండాకులవలె వచ్చి పడుచున్న పర్వతసమూహాన్ని చూచాడు. వజ్రాస్త్రమును ప్రయో గించాడు అతడు. వజ్రాయుధములు విరివిగా వచ్చి పడుతున్నాయి. ఆ వజ్రధారలచే పర్వతాలు ముక్కలు ముక్కలు అయి చెట్ల పండ్లవలె పడిపోవుచున్నాయి. అంత విదూరథుడు ఈ వజ్రాస్త్రమునునివారించుటకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. అంతట వజ్రాస్త్ర బ్రహ్మాస్త్రములు రెండునూ ఒకేతడవ ఆగిపోయినాయి. పిదప సింధురాజు కారునలుపు అయిన పిశాచాస్త్రమును ప్రయోగించాడు. భయంకరమైన పిశాచాలు బయలుదేరాయి దానివల్ల. అవి విదూరథునీ, అతని సైన్యమునూ ఆక్రమింపసాగాయి. ఇది అంతా పైశాచికమాయ అని గ్రహించాడు విదూరథుడు. విదూరథుడు కూడా మాయా కోవిదుడుగనుక, ఆ పిశాచ సైన్యమును సింధురాజు సైన్యమునందే నియోగించాడు. అంతట తన సైన్యము పిశాచమాయనుండి తేలుకున్నది. పరసైన్యం పిశాచా విష్టమయింది. అంతట ఊరకుండక, దానికితోడుగ రూపికాస్త్రమును

(పూతనాస్త్రమును) ప్రయోగించాడు. దానిచే ఆకాశమునుండి పూతనా గణము బయలుదేరింది. ఆ గణము అతిభయంకరంగా ఉంది. ఆపూతనా బృందము, వెనుకటి పిశాచములను భర్తలుగా గ్రహించింది. రెండూ భార్యాభర్తృభావంతో ఏకమై పోయాయి. సింధురాజు విదూరథుని మాయా ప్రయోగమును గ్రహించాడు. దానిని రూపి కాస్త్రమును ఆపదలచాడు. భేతాళాస్త్రమును ప్రయోగించాడు. వెంటనే కోట్లకొలది మొండెపు శవములూ, తలలుగలవీ బయలుదేరాయి. అప్పుడు పిశాచ, పూతనా, భేతాళసైన్యములు మూడూ కలసి భూమిని మ్రింగినట్లు ఉన్నాయి. తర్వాత విదూరథుడు ఆ మాయను ఉపసంహరించి, రాక్షసాస్త్రమును ప్రయోగించగా. పర్వతసములయిన రాక్షసులు అసంఖ్యాకంగా బయలుదేరి, భేతాళగణముయొక్క మేదోమాంసములను నములుచు. రక్తమును త్రాగనారంభించారు.

## ౫౦ విదూరథ మరణము

రామచంద్రా! ఇలా ఘోరంగా యుద్ధం సాగుచుండగా, సింధురాజు కొంచెం ఆలోచించవలసి వచ్చింది. శత్రు సైన్యం నశించటానికీ, తన సైన్యాన్ని రక్షించుకోటానికీనీ, ఉపాయం ఆలోచించాడు సింధురాజు. వైష్ణవాస్త్రమును ప్రయోగించాడు. విదూరథుడుగూడా దానిని శాంతింప చేయుటకు వైష్ణవాస్త్రమునే ప్రయోగించాడు. ఈ రెంటి నుంచీ అంతులేని బాణరాశి తయారయింది. అగ్నిజ్వాలలతో ఆయాయుధములు పోరాడినవి. ఇట్లుండ సింధురాజు దీనిని పరిశీలించి, విదూరథుడు అ అస్త్రమును వారించుకుంటున్నాడు. ఇతని బలమెంత? ఇతడెంత"? అని చులకనగా చూస్తూ ఉన్నాడు. అంతలో విదూరథుడు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించాడు. అది సింధురాజు రథమును తగలబెట్టింది. సింధురాజు దానిని వారుణాస్త్రముచే వారించుకున్నాడు. వెంటనే క్రిందకుఉరికిఖడ్గము చేతబూని విదూరథునిరథాశ్వముయొక్క గిట్టలను నరికాడు. విదూరథుడుగూడ ఖడ్గమును చేతబూనినాడు. ఉభయులు సమానాస్త్రములను చేతబూని సేనా మండలంలో విహరించారు. ఆపైన విదూరథుడు కత్తిని విడచి శక్తి అనే ఆయుధం ప్రయోగించాడు. కాని

అది కూడ సింధు రాజును ఏమీ చేయలేక పోయింది. సింధురాజు మరణించలేదు. కేవలం రక్తధారలను కక్కుతున్నాడు. ఆ పరిస్థితిలో రెండవ లీల (ప్రబుద్ధ లీల) సింధురాజు మరణింపనున్నాడని యెంచి, తన భర్తయొక్క సామర్థ్యానికి సంతోషిస్తూ. మొదటి లీలతో ఇలా అన్నది. దేవీ! చూడు. నృసింహదేవుడు హిరణ్యకశిపుని చీల్చివేసినట్లు మన భర్త సింధురాజును హత మొనర్చినాడు." అని. ఇలా ఈమె ఆనందించుచుండగనే సింధురాజు తెప్పరిల్లుకుని, విదూరథుని రథమెక్కి అతని ధ్వజమును, రథమును, అశ్వములను, సారథిని, కోదండమును, కవచమును, ఛిన్నభిన్న మొనర్చినాడు. తుదకు ఆతని భుజములను నరికాడు. ఈ దృశ్యమును ప్రబుద్ధలీల చూచి భయపడి, మూర్ఛనంది నేల కూలినది. విదూరథుడు, ఛిన్నావయవుడై యుండ, సారథి అతనిని గొనిపోయి సరస్వతీదేవి యెదుట మరణశయ్యమీద నుంచాడు.

## ౫౧ సింధురాష్ట్ర వర్ణనము

రాజు (విదూరథుడు). మరణించాడనే వార్త పట్టణం పాకింది. రాష్ట్రమంతా భయాకులం అయింది. "ఏకచ్ఛత్రాధిపతియగు సింధురాజుకుజై" అను నినాదాలూ, జయభేరీధ్వనులూ బయలుదేరాయి. సింధురాజు యుగాంతమున ప్రజాసృష్టికి బయలుదేరిన అపరమనువువలె రాజధాని చేరాడు. దశదిశలనుండి ఏనుగులూ, గుర్రములూ, మున్నగునవి కానుకలుగా వచ్చిపడుచున్నాయి. మంగళకరమైన పనులు జరుగుచున్నాయి.

## ౫౨

రామచంద్రా! ఇంతలో ఇచ్చట లీల సరస్వతితో "దేవీ! నాభర్త యిప్పుడు, ప్రాణమును పరిత్యజింపనున్నాడు." అని అన్నది. సరస్వతి ఆమాట విని, లీలా! నీవిపుడు చూచిన ఘోరసంగ్రామంలో ఆవగింజంత అంశం కూడా నిజం లేదు. ఇదంతా కల. ఇది స్థిరమయినది కాదు. నీభర్తయొక్క. రాజ్యము, మీ అంతఃపురగృహంలోనే ఉన్నది. అద్యాది వసిష్ఠుడనే బ్రాహ్మణుని ఇంటిలోకలదు. "నీవు, నేను, ఈ లీల

విదూరథుడు, సాగరయుతమగు అవనీమండలము," ఇది అంతా గిరిగ్రామ మను పట్టణమందలి ఇంటిలోనే ఉంది. తన ఆత్మయే ఒక్కొకపుడు ఇలా వ్యర్థంగా ప్రకాశిస్తూ ఉంటాడు. మరొకపుడు ఏమీ ప్రకాశించడు. ఇది. (ఆత్మవస్తువు.) ఉత్పత్తి, వినాశరహితమయింది. ఈ చిదాకాశమే ఈ జరిగిన కార్యములన్నిటికీ కారణము. వాస్తవానికి ప్రపంచం అనేది లేదు. అది భ్రమ. భ్రమను చూచువాడొకడు ఉంటేకాని భ్రమ ఉండదు. కనుక వీడేనిత్యుడు. భ్రమ అనిత్యము. భ్రమ అనేది దృశ్యం. ద్రష్టయందు దృశ్యం ఉండజాలదు. ఈ రెండు ధర్మాలు ఒకదానికి విరుద్ధములు. కనుక ఆత్మ అద్వితీయమని సహజముగనే సిద్ధించుచున్నది. ఆ మండప గేహంలోని, జనులయొక్క స్వభావాన్ని అనుసరించి ఆత్మయే అలా స్ఫురించింది. వారు వారు వారి వారి ఇచ్ఛానుసారంగా ఉన్నారు. అక్కడ జగత్తు పుట్టిందీలేదు. అనుభవింపబడిందీలేదు. ఇది తత్వజ్ఞులకు తెలుసు. స్వప్నపురములవలె చిదణువునందు ఈ మాయా ప్రపంచాలు అన్నీ ఇమిడి యున్నవి. ఇలాంటి జగత్తులలో ఒకదానియందు పద్ముడను రాజుయొక్క శవమున్నది. నీసవతియగు లీల అచ్చటికి వెళ్ళింది. ఈ లీల నీ ముందట మూర్ఛపడినప్పుడే, పద్ముని జీవము ఆశవమువద్దకు వెళ్ళింది.

సరస్వతీ! ఈమె అచ్చట దేహాన్ని ఎలా ధరించింది? నేనామెకు సవతిని ఎట్లాయితిని? పద్ముని యింటిలోని వారు ఆమెను ఎట్లు చూచు చున్నారు? ఏమను చున్నారు? చెప్పు.

లీలా! నీ వడిగిన దానిని చెప్పుచున్నాను విను. నీ వృత్తాంతం అంతా విదూరథరూపుడూ, నీ భర్తా అయిన పద్ముడు ఆ శవ గృహాము నందే ఈ జగద్భ్రాంతిని చూచుచున్నాడు. ఈ యుద్ధమూ, ఈ జనులూ, ఈ మరణమూ, ఇదంతా భ్రాంతి. భ్రాంతివల్లనే లీల ఇతనికి భార్యగా కనపడింది. నీవూ మిథ్యే. ఆమే మిథ్యే. మీ భర్తకు ఇదంతా స్వప్న మయినట్లు, మీాకుకూడా ఇదంతా స్వప్నం. ఈ ప్రపంచం ఇలా కనిపిస్తూ ఉండబట్టే దీనికి దృశ్యమని పేరు వచ్చింది. ఈ తత్వం తెలుసుకుంటే ఇది నశిస్తుంది. కనుక అద్వితీయమగు ఆత్మయే పరిపూర్ణము. సత్యము అదియే సర్వ ప్రపంచాకారంగా వారివారి వాసనలను బట్టి గోచరిస్తూ.

ఉంటుంది. ఈ రాజులూ, మనమూ, ఈ ఆత్మ నుంచియే జన్మించినాము, రాజమహిషియగులీల కూడ ఇట్లే జన్మించినది. నీభర్త మరణించినవెంటనే ఆయనగారిచిత్తము ఈ లీలయొక్క ఆకారమునుదాల్చింది అంతుండిఈమె బయలు దేరినది మానవునిచిత్తము ఆధిభౌతికభావమును చెందినపుడు అది పరమార్థమనుకొనును. ఆతివాహికమును చెందినపుడుకల్పనయనుకొనును. ఆధిభౌతికమూ నిజము కాదనుకొనునపుడు ఆతివాహికము (సూక్ష్మము) నిజమనుకొనును. కనుక నీభర్త మరణించిన పిదప పునర్జన్మ భ్రాంతిలో పడి, వాసనారూపముతో లీలను పొందినాడు. అందువల్ల నీవే ఆ లీలపై కనిపించావు. నీతో ఆయన కలిసినాడు. చిదాత్మ సర్వవ్యాపకం కనుక, నీవుకూడ వాసనామయమైన ఇంకొంక శరీరాన్ని పొందావు. ఆ లీలకూడ నిన్ను వాసనా రూపంతోనే చూడగలిగింది. కనుక సర్వగతమయిన బ్రహ్మమందు ఏ రూపమయిన వాసనలు ఉంటే ఆ రూపమయిన వస్తువులు స్వప్నంవలె కనిపిస్తూ ఉంటాయి. ఈ దంపతు లిద్దరూ మరణానుకూల మూర్ఛానంతరమే, వారి వాసనాబలంచేత ఇట్లు సంకల్పించుకున్నారు. "వీరు మా తలిదండ్రులు. ఇది మా దేశము. ఇది మా ధనము. ఇది మా రాజ్యము. ఇది మా పరివార జనము. మే మిద్దరము వివాహము చేసికొని కలిసిపోతిమి" అని. కనుకనే కల్పితమయినా అనుభవించేవారి అదృష్టము యొక్క బలంచేత, వారికి ఇదంతా సత్యంగా కనిపించింది. లీలా! ఈ విషయంలో స్వప్నమే ప్రత్యక్షమయిన దృష్టాంతం ఈ లీల "నేను విధవను కాకుండునుగాక" అని కోరి నన్ను పూజించినది. నేనను గ్రహించి వరమిచ్చితిని. అందువలన భర్తకంటె పూర్వమే మరణించినది. నేను మీ చైతన్యములో ఇమిడియున్న ఒక చైతన్యరూపిణిని. మీకు కులదేవతను. సదా మీకు పూజ్యురాలను. స్వయముగనే మీకుపకరించే స్వభావముగల దానను. కనుక మీరుభయులు నన్ను పూజించి నా అను గ్రహమును పొందారు. అన్నది జ్ఞప్తిదేవి. పిదప ఆ లీలయొక్క జీవుడు దేహమునుంచి లేచాడు. ప్రాణవాయువుతో గలసి, మరణించిన వెంటనే తన సంకల్పానుసారము భర్తృ జీవునితో సుఖమనుభవింప ఆతని గలిసి కొన్నాడు.

సరస్వతి- లీలా! ఆత్మజ్ఞానం లేనివాళ్లు పుణ్యబలంవల్ల చేరదగిన లోకములను స్థూలదేహంతో వెళ్లజాలరు. సత్యము, అసత్యముతో కలియలేదు. నీడ ఎండను చేరలేదు. సత్యసంకల్పులైన హిరణ్యగర్భాదులు ఇలాంటి మర్యాదను (హద్దును) ఏర్పరచారు. మనస్సులో వేతాళుని (దయ్యమును) గురించిన సంకల్పం ఉన్నంతవరకూ "నాకు దయ్యం లేదను" బుద్ధిపుట్టదు. ఆత్మయందు (మనస్సునందు) అవివేకమనే జ్వర వేడిమి ఉన్నంతవరకూ, వివేకమనే చంద్రుని చల్లదనం ఉదయించటం ఎలా? "నేను పాంచభౌతిక శరీరురాలను నాకు ఆకాశమునందు తిరుగు శక్తి లేదు" అను జ్ఞానముగలవారు ఆకాశమున ఎట్లు తిరుగగలరు? కావున, జ్ఞానముచేతనూ, వివేకముచేతనూ, పుణ్యకర్మచేతనూ, వరముచేతనూ, పుణ్యదేహముతో, పరలోకమును చేరుదురు. ఎండు ఆకు నిప్పులో పడితే వెంటనే తగలపడుతుంది. ఇలాగే స్థూలదేహము అహంకార వాసనామాత్రమైన ఆతివాహిక దేహమును పొందగానే నశిస్తుంది. వరమూ, శాపమూ, ప్రాక్తన కర్మను అనుసరించే ఉంటాయి. ఆ ప్రాచీన కర్మకు ఈ వర, శాపములు ఉద్బోధకములు. ఎలాగంటే, ఒకడు వేదంలో కొన్ని పనసలు చెప్పుకున్నాడనుకోండి. అందులో ఒకటిజ్ఞాపకము రాలేదు. చాల దూరం ఆలోచించాడు. తుదకు మరొకడు మొదలు కొంచెం అందిచాడు. అప్పుడు ఆ మరచినవాడు జ్ఞాపకం చేసుకొని ఆ పనస అంతా చెప్పాడు. అక్కడ అందించినవాడు జ్ఞా ప క ం చేసిన వాడునూ, చెప్పినవాడు, స్మరించి (జ్ఞాపకం తెచ్చుకొని) చెప్పినవాడునూ అగుచున్నాడు. అలాగే దానికి ఉన్న కర్మలకు ఇవి ఉద్బోధకములగును.

అయితే సరస్వతీ! అర్థక్రియాకారియగు (కొన్నిపనులను నెరవేర్చు శక్తి) ఈ స్థూల దేహం తత్త్వజ్ఞానంచేత ఎలా నశిస్తుంది? సరస్వతి- లీలా! నశించక ఏం చేస్తుంది? త్రాటియందు కలిగిన సర్పబుద్ధి సర్పముయొక్క కార్యమును చేయగలదా! వీడికి కలిగే భయ కంపాదులు, వీడి భ్రాంతివి కాని సర్పానివికావు. తన స్వరూపమునందు లేనే లేని వస్తువు ఇంకా అది పని చేసేది ఏమిటి? అయితే సరస్వతీ! శరీరం అంత బొత్తుగా లేనిదైతే (శూన్యమయితే) దేహం మరణించిందని శోకానుభవం ఎట్లా పుట్టింది? అలాగా అదీ భ్రాంతే. వెనుకటి స ం స్కా ర ము యొక్క పుష్టివల్ల

"చచ్చింది శరీరం" అని అనుకుంటున్నారు. ఈ జగజ్జాలంలో మనం అనుభ వించే సంసార భ్రిమలన్నీ మన సంస్కారంవల్ల కల్పించుకున్న వేకాని, వరంవల్లకాని, శాపంవల్లకాని. హిరణ్యగర్భునివల్లకాని, ఈశ్వరునివల్ల కాని హఠాత్తుగా వచ్చిపడినవికావు.

లీల సరస్వతీ! ప్రపంచం, లోపలి వాసనామయమే అయితే స్వప్నంలోవలె లోపలనే (మనస్సులోనే) కనిపించక బయట ఎలా కనిపి స్తోంది? విను. బయటికి భాసించే ప్రపంచం కూడా లోపలిదేకాని, బయటిది కాదు. ఆకాశమున ద్విచంద్ర భ్రాంతి (ఇద్దరు చంద్రులను భ్రమ) కలిగిందంటే, ఆ రెండవ చంద్రుడు లోపలివాడు కాని, నిజంగా బయటవాడు కాడు, కాని వయటివాడివలె కనిపిస్తున్నాడు. అలాగే ఈ ప్రపంచం కూడా.

## ౫౪ మరణవిచారము

కనుక తత్త్వజ్ఞులూ, ధర్మపరులు మాత్రమే ఆతివాహిక లోకము లను పొందుతారు, ఇతరులు పొందలేరు. ఆధిభౌతిక దేహము (స్థూల దేహము) భ్రాంతిచేతపుట్టు. అది నిజమున నిలబడలేదు. నీడ ఎండలో నుండదు. స్థూలదేహముల ద్వారా ఆతివాహికములు సత్యములు కనుక ఆతివాహికములగు బ్రహ్మాదిలోకములందు ఆధిభౌతిక స్థూలదేహము లుండవు. మన లీల తత్త్వజ్ఞురాలు. యోగజన్యమగు పరమధర్మమును సంపాదించుకున్నది. కనుకనే భర్తృ కల్పితమైన నగరమునకు వెళ్ల గలి గింది. అన్నది సరస్వతి.

ప్రబుద్ధలీల— సరస్వతీ! నీవు చెప్పినదంతా తెలిసింది. అది అంతా అట్లే జరిగియుండుగాక. ఇప్పుడు నా భర్త మరణించ నున్నాడు. ఇచ్చట కారణమేమి? దీనిని నీవు ఎలా సమర్థించెదవు? జీవులకు సుఖదుఃఖములను ఇచ్చే అదృష్టములు రావడము ఎలా? అవి పోవడము ఎలా? ఇందు ఏమయినా ఒక నియమం ఉన్నదా? లేదా? లేక అది వాని స్వభావమనే టట్లయితే, ఆ స్వభావము మాత్రము వాటికి (పదార్థములకు) నియ తంగా ఎలా వస్తోంది? నిప్పునందు వేడి ఏల! నీటియందు చల్లదనమేల?

పృథివియందు గట్టితనమేల? మంచుగడ్డయందు అతి శీతమేల? కాలాకాశాదులయందు సత్తఏల? నిజమయిన వెండిని గ్రహింపనేల? అసత్యమైన శుక్తిరజతమును విడువనేల? పృథివ్యాదిభూతములందు స్థూలత్వమేల? మనస్సు మొదలగు ఇంద్రియాదులయందు సూక్ష్మత్వమేల? తృణగుల్మ నగాదులకు నిమ్నోన్నతాది ఆకారములేల? ఈ నియమములన్నీ స్వభావవాదంలో ఎలా కుదర్చగలరు? అని అడిగింది ప్రబుద్ధలీల.

సరస్వతి సమాధానం చెపుతుంది– లీలా! సమస్త పదార్థాలు అస్తమించిన మహాప్రళయంలో, సర్వవ్యాపక చిదాకాశ బ్రహ్మమాత్రమే మిగిలి ఉంది. ఆ బ్రహ్మ చైతన్యము చిద్వ్యాప్తమైన సూక్ష్మభూతములను నేనని అనుభవిస్తుంది. సంవిత్తు స్వప్నంలో ఆకాశగమనాదులను అనుభవించినట్లు చిద్వ్యాప్తమైన ఆ సూక్ష్మభూతము, ఆత్మభిన్నమగు జలాద్యావరణములలోపల స్థౌల్యమును చెందుతుంది అదే మనకు కనిపించే ఈ బ్రహ్మాండము. ఆ బ్రహ్మాండంలో ఉన్న హిరణ్యాగర్భుడు "నేను బ్రహ్మను" అని తెలుసుకుంటాడు. ప్రాణి కర్మానుగుణమయిన సృష్టి సంకల్పంచేత మనోరాజ్యమును తయారుచేస్తాడు. ఆయనగారి సత్యసంకల్పమైన మనోరాజ్యమే ఈ జగత్తు. సృష్టి ప్రారంభంలో హిరణ్యగర్భునకు ఎలాంటి సంకల్పాలు ఉన్నాయో, అవి ఇప్పటికీ అలాగే ఉన్నాయి. నియత సంకల్పాలు నియతములే, అనియత సంకల్పాలు అనియతములే. మనసు విచిత్రాకారమైన వాసనలకు నిలయం. వాటి ననుసరించి వృత్తులు కూడా విచిత్రాకారములే. ఆత్మచైతన్యము కూడా, స్వచ్ఛమైన ఉపాధిని అనుసరించే స్వభావం కలది. కనుక అది కూడా విచిత్రాకారాన్ని చెందుతుంది. కాబట్టి సృష్టికర్త అయిన హిరణ్యగర్భుని సంకల్పానుసారంగానే పదార్థాలు పుటుతున్నాయి కాని, అనియతంగా ఏవీ పుట్టడంలేదు. మాయాశబలమైన బ్రహ్మయందు, అనాదిసిద్ధంగా ప్రపంచం అంతా ఒక విధమయిన నియత రూపంతో ఉండే ఉన్నది. అలా ఉండే అది పుటుతోంది. బంగారము ఎప్పటికీ, కటకాకారముగానో, రుచకాకారముగానో. పిండాకారముగానో, ఉంటుందికాని, అన్ని ఆకారములనూ విడిచి ఎప్పుడూ ఉండదు, కాక

అన్ని ఆకారములూ దానియందు (బంగారమునందు) ఎప్పుడూ ఇమిడి ఉంటాయి అనే చెప్పాలి. కనుకనే ఎప్పుడు ఏ ఆకారంగా తయారు కావా లంటే అప్పుడు ఆ ఆకారంగా తయారవుతోంది. ఈ ఆకారాలన్నీ దాని యందు యిమిడి లేకపోతే మీకు కావలసిన ఆకారంగా అది తయారవ్వ టకే వీలులేదు. అలాగే ప్రళయమునందు కూడా అన్ని వస్తువులూ మాయా శబల బ్రహ్మయందు సూక్ష్మరూపంతో ఇమిడే యున్నవి. సర్వశూన్యమైన ప్రళయమే అసంభవము. కనుకనే సృష్ట్యాదిలో శీతంగా (చల్లగా) ఉన్న ఆ చైతన్యం, ఇప్పటికీ చల్లగానే ఉన్నది. వెచ్చగా ఉన్న చైతన్యం వెచ్చగానే ఉంటోంది. అదే అగ్ని. మరియు మాయా శబలమయిన బ్రహ్మ తన యొక్క ప్రపంచాధిష్ఠానసత్తను (ప్రపంచాధి ష్ఠానమగు ధర్మమును) విడిచిపెట్టే యడల, అపుడు మాయాంతర్గతమైన ప్రాపంచిక నియములు లేకపోయ్యేవి. అది అశక్యము. చైతన్యమునకు ప్రపంచాష్ఠానత్వమూ తప్పదు. ప్రపంచమునకు నియతిని (నియమమును) అనుసరించి పుట్టుకా తప్పదు. కాబట్టి ప్రపంచముయొక్క నియతిని తప్పించటం సాధ్యంకాదు. పంచభూతముల యొక్క స్థితియే. నియతి మారదనుటకు నిదర్శనము. ఎన్ని కల్పములకయినా నిప్పు నిప్పే. అది నీరు కాదు. చల్లగా నుండదు. నీరు నీరే. అది వెచ్చగా నుండదు. అట్లే మానవుల చావు బ్రతుకులు కూడ నియమమును అనుసరించే జరుగు తున్నాయి. మారటం లేదు. కర్మక్షయాన్ని అనుసరించే అందరికీచావు. కర్మానుభవాన్ని అనుసరించే అందరికీ పుట్టుక.

ఇది అంతా మాయా దృష్టిలో చెప్పాము. పరమార్థ దృష్టిలో జగత్తేలేదు. ఇంక దానికి నియమమెక్కడిది. మనము అనుభవించేద అంతా కలలోని ఆడుదానితో సంభోగం వంటిది. వట్టి మిథ్య. చిదా కాశము యొక్క లీల. సృష్ట్యాదిలో గగనాకారంగా ప్రకాశించిన చైత న్యమే గగనమనే భూతమయింది. జలాకారమును గ్రహించిన చైత న్యము జలమైంది. ద్రష్టయగు ఆత్మయందు దృశ్యములను కల్పించుకొన టం స్వప్నంలో మనకు అనుభవ సిద్ధమై ఉంది. కాబట్టి చిచ్చమత్కార మైన మాయ యొక్క చాతుర్యం చేతనే ఇలా లేనివాటిని, ఉన్నట్లుగా ఊహిస్తూ ఉంటాడు మానవుడు. పంచభూతములయొక్కయూ భౌతిక

పదార్థములయొక్క-యూ నియమం ఎలాంటిదో, జీవనియతి కూడా ఈశ్వర సంకల్పంచేత అలాగే తయారైంది. మరణంచేత ఆ నియమానికి భంగం లేదు. లీలా! ప్రారబ్ధ ఫలకర్మలు, మరణ పర్యంతమూ, సంచితకర్మలను అడ్డుపరుస్తాయి. అందువల్ల అవి మరణము వరకూ ఫలమును ఇయ్యలేవు. మరణించగానే ప్రతిబంధకం తొలగిపోతుంది. సంచిత కర్మలు ఫలారంభానికి ప్రారంభిస్తాయి. ఈ కథ అంతా చెపుతా విను. నీ సందేహాలు శాంతిస్తాయి. నీ ద్వారా ఈ విషయం లోకంలో ప్రఖ్యాతమవుతుంది. ఇతరులకు కూడా ఆస్తిక్య బుద్ధి కలుగుతుంది. కనుక ఈ విషయం చాలా శ్రేయస్కరమయింది. విను.

సృష్ట్యారంభంలో కృతాది యుగములందు ఆయుఃపరిమాణం ఇలా నియతంగా ఉంది. కృతయుగంలో 400 ల సంవత్సరాలు. త్రేతాయుగంలో 300 ల సంవత్సరాలు. ద్వాపరయుగంలో 200 ల సంవత్సరాలు, కలియుగంలో 100 నూరు సంవత్సరాలు. ఇదే పురుషుల యొక్క ఆయుఃపరిమాణం. ఈ నియతికి (ఈ పరిమాణ నియమానికి) హెచ్చుతగ్గులు కూడా కలవు. దానికి కారణాలు ఉన్నాయి. విను చెబుతా. ఆయుస్సునకు కర్మలు కారణాలు. అందువల్ల స్వధర్మానుష్ఠానము తగ్గితే ఆయుస్సు తగ్గుతుంది. అది పెరిగితే ఆయుస్సు పెరుగుతుంది. అది సమానంగా ఉంటే సమానంగా ఉంటుంది. అలాగే నిషిద్ధ కర్మానుష్ఠానంవల్ల ఆయుస్సు తరుగుతుంది. (నశిస్తుంది.) కొన్ని నిషిద్ధ కర్మలు బాల్యంలో మరణమును ఇస్తాయి. మరి కొన్ని యౌవనంలో. మరి కొన్ని వార్ధక్యంలో. యథాశాస్త్రంగా స్వధర్మానుష్ఠానం చేసేవాడు, యథాశాస్త్రంగా పరిపూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు. ఇలా మానవులు కర్మానుసారంగా చివరిదశను (మృతిని) పొందుతారు. అపుడు శరీరనాడులనుంచి ప్రాణాది ఇంద్రియాలు హృదయంలో ఉపసంహారాన్ని చెందుతాయి. (గుమికూడు కుంటాయి.) అపుడు మర్మచ్ఛేదమువల్ల వేయ్యి తేళ్లు కుట్టినంత బాధ కలుగుతుంది జీవులకు. అని అన్నది సరస్వతి.

ప్రబుద్ధలీల:- సరస్వతీ మరణాన్ని గురించి టూకీగా చెప్పావు. నీవు వర్ణించిన మరణ దుఃఖం అందరకీ సమానమా? లేక కొందరకి సుఖంకూడా

ఉందా? అందులో. మరణానంతరం గమనము అందరకూ సమానమా? లేక యోగుల విషయంలో విశేషమేమయినా ఉన్నదా? అని అడిగింది సరస్వతిని.

సరస్వతీదేవి సమాధానం చెబుతుంది. లీలా! దేహావసానము నందు మరణింపబోవు వారు మూడు రకాలు. ౧ మూర్ఖుడు. ౨ ధారణా భ్యాసి. అనగా, ప్రాణవాయువునూ, మనోవృత్తులనూ, నాభి, హృదయ, కంఠ, భ్రూమధ్యలయందు కొంతకాలం నిరోధించుటను అభ్యసించేవాడు. 3 యోగకుశలుడు. అనగా, పరకాయ ప్రవేశాదులయందు, తన కిష్టము వచ్చిన నాడీ కుండా లేచిపోవుటకు తగిన అభ్యాసంచేసి, అందులో ఆరితేరినవాడు. వీరి ముగ్గురికీ గమనంలో తేడా ఉంది. వీరిలో మధ్యము డయిన ధారణాసిద్ధుడు, క్రమంగా యోగాభ్యాసంచేసి, సుఖంగా శరీరం నుంచి లేచిపోతాడు. యోగయుక్తుడు అలాగే ఉండి సుఖంగా లేచి పోతాడు. ఈ రెండూ లేని మూర్ఖుడు (అజ్ఞుడు) మనస్సు స్వాధీనంలో లేనందున మృతికాలంలో మహా దుఃఖం అనుభవిస్తాడు. మనోవాసనలకు పరవశుడై తుంచి పారవేసిన పద్మంవలె, దీనుడవుతాడు. అందులో బ్రతికినన్నినాళ్లూ శాస్త్ర సంస్కారంలేక, విహితకర్మలు మాని, దుష్ట సహవాసం చేసినవాడు, మరణకాలంలో మంటలో పొర్లించినవాడివలె, లోపల దుఃఖాగ్నిచే తగలబడిపోతాడు. ఆ మంటవల్ల వాడి ఇంద్రియాలు అన్నీ కమిలిపోతాయి. గొంతులో గురగురధ్వని బయలుదేరుతుంది. పూర్వాపరజ్ఞానం ఉండదు. శ్వాసలు మెండు. స్మృతి శూన్యం. ఒళ్లు తెలియకుండా పోతుంది. మహా మోహంలో పడిపోతాడు. రాయివలె ఉంటాడు. అన్నది సరస్వతి.

ప్రబుద్ధలీల:_ సరస్వతీ! వీడికి కూడా శిరస్సూ, చేతులూ, కాళ్లూ, గుహ్యమూ, నాభీ, హృదయమూ, అనే ఎనిమిది అవయవాలూ ఉంటాయి కదా? ఇన్నీ ఉండి కూడా, తెలివితప్పిపోయి, మోహంలోపడి, ఇంతబాధ పడనేల? మూర్ఛాంతమనే మరణం పొందనేల? అని అడిగింది లీల. సరస్వతి జవాబు చెబుతుంది. సృష్ట్యాదిలో ఈశ్వరుడు స్వసంకల్పాత్మక మయిన కర్మను విధించాడు. ఏ యే సమయంలో ఎవడెవడు ఏ యే

రూపంగా ఎంతగా దుఃఖం అనుభవించాలో చూపించాడు. కర్మవశమున అది జరుగక తప్పదు. కనుక జీవుడు ఈశ్వర సంకల్పాత్మకమగు కర్మ ననుసరించి మృతిని పొందుతున్నాడు. ఇది తప్పనిది. ఈశ్వరుడు తన చిత్ విజృంభమువల్ల పుట్టిన దుఃఖాన్ని తానే జీవరూపంతో ఉపాధిలో ప్రవేశించి అనుభవిస్తున్నాడు. మరణదశలో నాడులు వాతపిత్తాది ధాతు వైషమ్యంచేత. అనుభవించిన అన్నపానరసమును విషమంగా గ్రహిస్తాయి. అప్పుడు సమానవాయువు, భుజించిన అన్నపానాదులను, సమీకరించే స్థితిని విడిచి పెటుతుంది. అపుడు నాడీద్వారములయందు వాయుసంచార ముండదు. అందువల్ల చక్షురాది ఇంద్రియములు పనిచెయ్యలేవు. లోపల (మనస్సులో) స్మృతిమాత్రం ఉంటుంది కాని, ఇంద్రియాలవల్ల విజ్ఞానము కలుగదు. నాడులలో వాయుసంచారం లేక పోయ్యేసరికి, ప్రాణవాయు సంచారం కూడా అడ్డిపోతుంది. నోటినుంచి కాని, ముక్కులనుంచి కాని గాలి బయటికి పోదు. అపుడు లింగ శరీరం తప్పక లేస్తుంది. వెంటనే మరణించాడని అంటారు. ఈ మరణమనేది వెనుక జెప్పిన చైతన్యము యొక్క సంకల్పరూపమయిన నియతి. ఇలాంటి నియతియే లేకపోతే, ప్రపంచ వ్యవస్థే కుదరదు. సంవిత్తు యొక్క బీజకళ అయిన మాయ మాత్రం, ముక్తి పర్యంతం నశించదు. కనుక సంవిత్తు యొక్క స్వభావ విశేషముకంటె జన్మ మరణములు వేరుకావు. నదిలో నీరు ఒకప్పుడు సుడిగలిగి ఉంటుంది. ఒకప్పుడు కలుషంగా ఉంటుంది. మరొకప్పుడు స్థిరంగాను. నిర్మలంగాను ఉంటుంది. అలాగే ఈ చైతన్యము కూడా ఒకపుడు సౌమ్యంగాను, ఒకపుడు జీవ ధర్మములయిన రాగద్వేషాదు లతో కలుషంగానూ ఉంటుంది. పొడుగాటి తీగకు మధ్య మధ్య కణుపు లున్నట్లు. చేతనము యొక్క సత్తకు కూడ మధ్య మధ్య జన్మ మరణము లుంటాయి. ఇది అవిద్యా దృష్టిలోని మాటలు. పరమార్థ దృష్టిలో చేతనుడయిన పురుషునకు జన్మమరణములే లేవు. ఇవి స్వప్నంవలె భ్రాంతి. పురుషుడు చిద్రూపు డంటామా? అతడు నశించడు. చేతన వ్యతిరిక్తుడంటామా? ఈ పక్షంలో దేహము పురుషుడా? ప్రాణము పురుషుడా? ఇంద్రియాలు పురుషుడా? మనస్సు పురుషుడా? బుద్ధియా? అహంకారమా? చిత్తమా? అవిద్యయా? ఇందులో ఏది పురుషుడు?

ఇవన్నీ జడాలు. వీటివల్ల పురుష కార్యము లేవీ జరుగవు. కనుక పరిశేష న్యాయ ప్రకారం చేతనా మాత్రమే పురుషుడనాలి. చేతనునికి మరణము అసంభవము. సాక్షి లేని మరణమును అంగీకరించకూడదు. అనాదిసిద్ధమయిన ఈ సంసారంలో మృతుడయిన చేతనుని ఎవరు చూచారు. కాక చేతనుడికి మరణం అనేది వినాశమా? లేక దేహాంతర ప్రాప్తియా? ఇందులో మొదటి పక్షంలో స్వతః నాశమా? పరతః నాశమా? తనయందు తనకు విరోధము ఉండదు కనుక తన్ను తాను నశింపజేసికొనడు. అసంగ అద్వితీయుడు కనుక ఇతరునివల్ల నాశముండదు. కాక దేహాలు లక్షలకొలది నశిస్తున్నాయి. అయినా చేతన వస్తువు నాశం లేకుండా ఉంది. అలా కాక. అది (చిద్వస్తువు) కూడా నశించేటట్లయితే ఉపాదాన కారణం లేకుండా జగత్తు ఉండటానికే వీలులేదు కనుక. ఉపాదాన కారణమయిన చేతనమే మరణించేయడల, సర్వప్రపంచమూ మరణించవలసివస్తుంది. అలా జరగటంలేదు. మట్టి ఉపాదాన కారణంగా గల మట్టి వస్తువులు, మట్టియే నశించేయడల ఇంక దేనిని ఆధారంగా చేసికొని ఉంటాయి? కాబట్టి ఏ విధంగానూ చైతన్యమునకు మరణం చెప్పటం కుదరదు. ఇక లోకప్రసిద్ధమయిన జన్మమరణాలు, వాసనా జాలానివి. ఈ వాసనాజాలాన్ని ఆధారంగా చేసికొనే జీవుడు బ్రతుకుతున్నాడు. కనుక లోకంలో ఏ జీవుడూ మరణించడంలేదు. ఏ జీవుడూ జన్మించడంలేదు. జీవుడు వాసనలు అనే సుడిగుండాలలో కేవలం పొర్లుచున్నాడు. దృశ్యమే బొత్తుగా లేదు. కాన దానికి సంబంధించిన వాసనలుకూడ లేవు అనే విచారంచేత అంతఃకరణమే నశిస్తోంది. కాబట్టి సంసారానికి భయపడాలి. విరక్తి కుదరాలి. గురువును ఆశ్రయించాలి శ్రవణమననాదులను అభ్యసించాలి. ప్రపంచం భ్రాంతిజన్యం అని తెలుసుకోవాలి. పరమార్థ సత్యమయిన బ్రహ్మ తత్త్వాన్ని గ్రహించాలి. ద్వైతవాసనలు నశించాలి. ముక్తి రావాలి. అని జవాబుచెప్పింది సరస్వతి

## ౫౫ జీవుని సంసారగతి వైచిత్ర్యము

అంతా విన్నది ప్రబుద్ధలీల. (రెండవలీల) జ్ఞానం అభివృద్ధి కావాలనుకుంది. జీవుల జన్మమరణాలను గురించి విస్తరించి చెప్పమన్నది

సరస్వతిని. సరస్వతీదేవి మళ్లీ అదే విషయాన్ని విపులంగా బోధించటం ప్రారంభించింది.

లీలా! మరణకాలంలో ప్రాణవాయువులు చలనస్వభావాన్ని విడిచి, శాంతించేటప్పటికి తెలివి తప్పుతుంది జీవులకు. "ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి నప్రేత్యసంజ్ఞాస్తి" అనే శ్రుతి ఈ విషయం చెప్పింది. నిజస్థితిలో తెలివి (చైతన్యం) అనే పదార్థానికి శాంతించటం (తప్పటం) అనేది లేదు. "అవినాశీవా అరేఽయమాత్మా అనుచ్ఛిత్తిధర్మా" అను శ్రుతి తెలివిరూపమయిన ఆత్మపదార్థానికి చావు లేదన్నది. అది స్థావరజంగమాది పదార్థములయందు ఎల్లకాలమూ ఉంటుంది. ప్రాణవాయువు ఆడకపోయేటప్పటికి చచ్చాడు అంటారు లోకులు. కనుక మరణం దేహధర్మంకాని, ఆత్మధర్మం కాదు. అప్పుడు వాగాది ఇంద్రియాలు మనస్సులో లీనమవుతాయి. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణము తేజస్సుయందు (జీవచైతన్యమునందు) లీనం అవుతుంది. తేజస్సు పరదేవత (పరమాత్మ) యందు లీనమవుతుంది. "అస్య సోమ్య ప్రయతః వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణః తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" అనే శ్రుతి ఈ విషయాన్ని చెబుతోంది. కాని మళ్లీ జన్మను ఇచ్చే వాసనలతో కూడి, పరిచ్ఛిన్నమయిన, అంతఃకరణమనే ఉపాధి ఉన్నందున ఈ జీవుడు పునర్జన్మకు పోవడం తటస్థించుచున్నది. ఆ ఉపాధికే జీవుడనే పేరు. ఇంతే కాని వస్తుతః జీవుడనే వాడు బ్రహ్మకంటె వేరుగా లేడు. కనుకనే వాసనావశంచేత తానున్నచోటనే పరలోక గమనాదులను అధ్యాస చేసికొని వ్యవహరించటం కుదురుతోంది. వాస్తవంలో గగనాదులుకూడ లేవు. కనుక ఈ మాత్రపు మరణంచేతనే జీవుణ్ణి ప్రేత అని అంటారు లోకులు. అయితే అసంగుడైన ఆత్మయందు ఈ వాసనలు ఎలా ఉంటాయి? వాసనలతో సంబంధం ఉంటే ఆత్మ ససంగుడయినట్లే కదా? అని శంకకలుగుతుంది. దానికిదే సమాధానం. గాలిలో పరిమళం ఉన్నదంటాము. ఎలా వచ్చింది? పరిమళం అనేది అతి సూక్ష్మమయిన పుష్పరేణువులయందు కదా ఉంటుంది. అది గాలిలో ఉన్నట్లు లోకంలో ప్రతీతి ఉందే. "సురభిఃవాయుః" (గాలి పరిమళమయినది) శైత్యసౌరభ్యమాంద్యములు గలది వాయువు అని.

కాబట్టి పరిమళంగల పుష్పరేణువులతో గాలి తాదాత్మ్యం చెందినట్లున్నట్లు ఆ పరిమళంతో మిశ్రమైయున్నది. అందువల్ల ఆ ప్రతీతి లోకంలో పుట్టింది. అలాగే ఇక్కడ కూడ జన్మాంతర వాసనలుగలది అంతః కరణము. దానితో తాదాత్మ్య సంసర్గాధ్యాస చెంది యున్నాడు జీవాత్మ (అనగా కలసిమెలసి యున్నాడు.) అందువల్ల వాసనావంతు డయినాడు. కనుక జీవునకు వాసనలతో సంబంధం ఆధ్యాసికంకాని వాస్తవం కాదు. అందువల్ల అతని సహజమయిన అసంగత్వమునకు భంగం లేదు.

జీవుడు కలలో జాగ్రచ్ఛరీరాన్ని విడిచి, మరియొకశరీరంతో వ్యవహరించినట్లు, మరణానంతరంకూడతనవాసనలతో పరలోకగమనంచేసిఅక్కడ ఇంకొక శరీరం కల్పించుకొని, భోగ్యాలను అనుభవిస్తూ ఉంటాడు. కాబట్టి కలలో స్వప్నశరీరకల్పన ఎలా గంటిదో, మరణానంతరం, పరలోకంలో కల్పించుకున్న శరీరం కూడా అలాంటిదే. అనంతమయిన ఆత్మా (చిదా) కాశమందు ఇమడని వస్తువులుండవు. అఘటన ఘటనాపటీయమగు మాయ వల్ల జరుగని పనులుండవు. కనుక మృతాత్మయందు పరలోక గమనాది కల్పనము ఉపపన్నము. ప్రేతలు ఆరువిధములుగా ఉన్నారు. ౧ సామాన్య పాపులూ, ౨ మధ్యమ పాపులూ, ౩ అతి పాపులూ, ౪ సామాన్య పుణ్యులూ, ౫ మధ్యమ పుణ్యులూ, ౬ ఉత్తమ పుణ్యులూ, అని. వీరిలో ఒకానొకనికి విశేషముకద్దు. ఎట్లన? ఒకానొకడు కొంతకాలం సామాన్య పాపిగా ఉండి తర్వాత మధ్యమ పాపిగాకాని అతిపాపిగా కాని అవుతాడు. కనుక ఒకానొకనికి రెండు భేదాలుకాని, మూడు భేదాలుకాని సంభవించ వచ్చును. ఇందులో మూడవవాడయిన మహాపాపి (ప్రేత) ఒక్క సంవత్సర కాలం స్మృతితప్పి పాషాణమువలె జడుడయి ఉంటాడు. తరువాత ప్రబుద్ధుడై (మెలకువనొంది) వాసనా గర్భంలో ఉండి చాలకాలం నరక దుఃఖాలు అనుభవిస్తాడు. ఇలా అనేక యోనులందు పుట్టుతూ ఉంటాడు. దుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడు. తరువాత గొంతకాలానికి ఈశ్వరాను గ్రహంవల్ల సంసారమనే స్వప్న భ్రాంతిలో నుంచి బయటపడుతాడు. లేదా మరణించి వెంటనే చెట్టో పుట్టో అయి పుట్టి దుఃఖశతాలు అనుభ విస్తాడు. మళ్లీ నరకానికి వెళ్లుతాడు. అక్కడ తన వాసనలకు అనుకూల

మయిన దుఃఖాలను మళ్లీ అనుభవిస్తాడు. తర్వాత చాల కాలానికి భూలోకానికి వస్తాడు. అనేక యోనులందు పుటతాడు. ఇదీ సుహా పాపులయిన ప్రేతల పరిస్థితి. ఇక మధ్యమ పాపులు, మరణించగనే, స్థావర జన్మనెత్తి, జడరూపంతో కొంతకాలం ఉంటారు. పిదప కొంతకాలానికి లేచి తిర్యగాది యోనులందు పుట్టి సంసారం అనుభవిస్తారు. ఇంక సామాన్య పాపి అగు మొదటి ప్రేత మరణించిన వెంటనే తన వాసనాను కూలమయిన మనుష్యాది జన్మను ధరిస్తాడు. స్వప్నప్రపంచాన్ని అనుభ వించినట్లు, ఈ జాగ్రత్ప్రపంచాన్ని కూడా అనుభవిస్తాడు. వానికి వెనుక చెప్పినట్లు వెంటనే స్మృతికూడ కలుగుతుంది. ఇక 6వ వారైన ఉత్తమ పుణ్యులు మరణానంతరం పుణ్యవాసనల యొక్క ఉద్బోధంచేత స్వర్గ లోకంలో విద్యాధరాది పురమును అనుభవిస్తారు. మహా పుణ్యము యొక్క భోగం అయిపోయిన తరువాత, ఏ యితర కొద్ది అయినా పాపం కాని పుణ్యంకాని ఉండేటట్లయితే దాని ఫలాన్ని ఇలా వృతకిం పురుషాది వర్షములందు అనుభవించి, ఆవల మనుష్యలోకంలో శ్రీమంతులయిన సజ్జనులకులంలో పుటతారు. మధ్యమపుణ్యులయిన 5 అయిదవవాస మరణించినవెంటనే ఆకాశవాయువుతో కలసి, వెళ్లి, కిన్నర కింపురుష యక్షాది శరీరంతో ఓషధులూ, చిగురుటాకులూ, ప్రధానంగాగల, నందనవనాన్ని కాని, చైత్రరథవనాన్ని కాని, పొందుతారు. అచట మనోహరమయిన స్వకర్మఫలమును అనుభవిస్తారు. ఆపైన గాలిద్వారా, వర్షముద్వారా, భూలోకంలో వ్రీహియవాములందు చేరుతారు. మానవు లకు ఆహారభూతులవుతారు. ఆ రూపంగా బ్రాహ్మణాదుల హృదయాన్ని ప్రవేశిస్తారు. రేతోనిషేక సమయమున (వీర్యమునుంచునపుడు) స్త్రీల గర్భంలో చేరి, ఆయాజాతి క్రమానికి అనుకూలమయిన జన్మను ధరిస్తారు. ఇలాగా ప్రేతలందరి పరిస్థితీ తమ వాసనలకు అనుకూలంగా ఉంటుంది. అది క్రమంగా ఉండవచ్చు. అక్రమంగానూ ఉండవచ్చును.

రామచంద్రా! మరణించినది మొదలు ప్రేతజీవుల పరిస్థితి అంతా క్రమంగా చెపుతా విను. మొట్టమొదట జీవులు మరణించగానే "మేము మరణించినాము" అని మాత్రమే గుర్తిస్తారు. ఆపైన "బంధువులు యిచ్చిన తిలోదకపిండ ప్రదానాదులవల్ల మనకు శరీరం తయారయింది"

అని అనుకుంటారు. తర్వాత "కాలపాశాన్వితులయిన యమభటులు నన్ను యమపురికి తీసికొనిపోతున్నారు." "నేను యమపురమును చేరుతున్నాను" అను కుంటారు. వీరిలో వీడు గొప్ప పుణ్యాత్ముడే కనుక అయ్యో యమ జల "ఏమి నాపుణ్యం కొద్దీ నాకీ దివ్యమయిన విమానాలు," "ఈ తోటలు," "మహా శోభాయమానంగా ఉన్నాయే". అని సంతోషిస్తాడు. వీడు మహా పాపి అయినట్లయితే "ఏమి? ముళ్లలాగ ఒంటికి గుచ్చుకునే ఈ మంచు గోతులు" ఏమి? "కత్తులలాగ కోసుకుపొయ్యే ఆకులుగల ఈ తోటలు" (అసిపత్రవనములు) ఇవి అన్నీ నేను చేసిన పాపకర్మవల్ల తయారయినవి కదా? అని అనుకుంటాడు. ఇంక మధ్యమరకమయిన పుణ్యాత్ముడు "ఈ త్రోవ నాకు సుఖంగా ఉంది" "కాళ్లతో నడవటానికి వీలుగా ఉంది." దట్టమయిన నీడ ఉంది. "అక్కడక్కడ దిగుడుబావులున్నాయి" "చల్లని పచ్చిగడ్డి ఉంది" ఇది నాభాగ్యం అనుకుంటాడు. తరువాత, నేను "యమపురం చేరాను." "సర్వలోక ప్రసిద్ధ యముడు వీడే" ఇక్కడ యమ సభయందు చిత్రగుప్తాదులు నా కర్మను విచారిస్తారు. అని అను కుంటారు. ఇది ప్రతివారికి భిన్నభిన్నంగా స్వప్న వృత్తాంతములవలె వారి వారికి సత్యంగా. ఆయా వస్తువులూ, ఆయా పనులూ భాసిస్తూ ఉంటాయి. ఇలా అక్కడ కూడా ఒక సంసారం క్రమంగా పెరుగుతుంది. కాని స్వరూపదృష్టితో విచారిస్తే ఆత్మకంటె వేరే ఏమీ లేదు. ఇది అంతా ఆరోపం. లేని దానిని ఉన్నదనుకొని నెత్తిన వేసుకోవడము. నేను నా కర్మఫలమును అనుభవించటానికి యమధర్మరాజు నన్ను ఈ దిక్కున ఉండమన్నాడు. ఆయనగారు ఆజ్ఞ ఇస్తే ఇక్కడనుంచి స్వర్గానికో, నరకానికో, వెళతాను శీఘ్రంగా. యముడు ఆదేశించిన స్వర్గసుఖాన్ని అనుభవించాను. నరకదుఃఖాన్ని అనుభవించాను. యముడు చూపిన పశ్వాది యోనులన్నీ ప్రత్యక్షంగా అనుభవించి చూచాను. ఇప్పుడు ఇంక మనుష్య సంసారంలో పుడతాను. ఇదిగో నేను ఈ వరిపైరును. "దానికాడ నేను" "దాని పొట్ట నేను" "అందులోని కంకె నేను" క్రమంగా పండిన ధాన్యం కూడా నేనే "నేనే వీటి అన్నిటి స్వరూపంగా ఉన్నాను." అని ముందు ఉత్తరకాలంలో కలగబొయ్యే మనుష్య శరీరంలో శ్రుతి స్మృతి పురాణాది జన్యమయిన ప్రబోధంతో (వివేకంతో) పుడతాడు.

ఇంతే కాని వీడికి ఈ వ్రీహ్యాది భావము స్వర్గ నరక భోగంవలె భోగంకాదు. వీడికిప్పుడు శరీరం లేదు. బాహ్యాంభ్యంతరములయిన ఇంద్రియములన్నీ నిద్రించి (ముకుళించుకుని) ఉంటాయి. అందువల్ల అది వీడికి అనుభవమనటానికి వీలులేదు. తరువాత తండ్రి తిన్న అన్నము ద్వారా తండ్రి శరీరంలో ప్రవేశించి రేతోభావాన్ని పొందుతాడు. ఆ రేతస్సు తల్లి యోనియందు ఉంచబడి, గర్భమగును. ఆ గర్భము పూర్వకర్మవాసనలను అనుసరించి, అందమైన శిశువుగానో, అదృష్ట వంతుడుగానో, దురదృష్ట వంతుడుగానో, పుడుతుంది. ఆపైన క్రమంగా పెరిగి చక్కని యౌవనాన్ని అనుభవిస్తాడు ఆ శిశువు. ఇంతలో పద్మం మీద మంచు అనే పిడుగు పడ్డట్లు వీడి మీద జర అనే పిడుగు పడుతుంది. దానిలో ఆధులూ, వ్యాధులూ, తర్వాత మరణమూ, మళ్లీ కలకన్నట్లు యాతనా శరీరమూ, యమలోకగమనమూ, అక్కడ సుఖదుఃఖములను అనుభవించడమూ, మళ్లీ భూలోకం చేరడమూ, ఇలా మాటిమాటికీ అనేక యోనులలో తిరగడం తప్పదు ఈ జీవులకు. ఈ గమనము లోకలోకాంతరాలనుగూర్చి తప్పదు వీళ్లకు మోక్షం వచ్చేంతవరకు. అన్నది సరస్వతి.

ప్రబుద్ధలీల:– దేవీ! నీవు చెప్పిన ప్రపంచ భ్రాంతి, త్వం పదార్థమైన జీవులవద్ద సరిపోతుంది. కాని, తత్పదార్థమైన ఈశ్వరునియందు సృష్ట్యారంభంలో ఎలా పొసగుతుంది? చెప్పు? జ్ఞానాభివృద్ధికొరకు మాటిమాటికి అడుగుతున్నాను. అనుగ్రహించి చెప్పు. అని అడిగింది లీల.

సరస్వతి:– లీలా! విను సమాధానం. ఈశ్వరుడికి భ్రాంతి లేదు. అతడు ప్రపంచాన్ని తనయందు ఆరోపించుకోడు. పరమార్థసత్యస్వరూపుడయిన ఈశ్వరుడు మాయవలన ప్రపంచ రూపంగా కనిపిస్తాడు. కాని తన స్వరూపానికి ఏ మాత్రం భంగం లేదు. తన స్వరూపానికి భంగం లేకుండా ఇతర పదార్థాకారంగా భాసించడం భ్రాంతి కాదు. అసత్యమైన వస్తువును, సత్యమైనదాన్నిగా తెలుసుకుంటేనే భ్రమ అని అంటారు. ఈశ్వరుడు ఎల్లపుడు సర్వజ్ఞుడు. కనుక సర్వపదార్థములు అతనికి భాసిస్తూ ఉంటాయి. అయినా అతనికి వాటియందు సత్యతాబుద్ధిలేదు. కొండలూ, చెట్లూ, భూమ్యాకాశములూ, అన్నీ పరమార్థ చిత్స్వరూపములు. శుద్ధ

చైతన్యమే ఇన్ని రూపములతో మాయా ప్రభావంచేత పుట్టినట్లు కనిపిస్తోంది. ఇది అంతా మన దృష్టిలో కాని అతని దృష్టిలో కాదు. అతడు సర్వవ్యాపి. ఎక్కడ ఏ రూపంతో భాసిస్తే అక్కడ ఆ రూపంతో వ్యవహరిస్తారు. ఈశ్వరుడు స్వప్నపురుషునివలె సృష్ట్యారంభంలో జీవ సమష్టి రూపుడై ఆదిప్రజాపతి అవుతాడు. పిదప తాను సృజింపదలచిన భూరాది లోకరూపంగా వివర్తమవుతాడు, ఇది అంతా అతని సంకల్పా యత్తము. ఆ సంకల్ప సత్తయే ఇప్పటికీ నిలిచి ఉంది. ఒకవేళ ప్రతిబింబ వాదాన్ని పుచ్చుకున్నా ఈ ప్రపంచం మిథ్యే అవుతుంది కాని, నిజం కానేరదు. బింబం సత్యం. ప్రతిబింబం ఉపాధి ఉన్నంతవరకు ఉండేది. ఇది లోకసిద్ధం. ఉపాధి నశిస్తే (తీసివేస్తే) ప్రతిబింబం ఉండదు. రోమ కూపాలనుంచి గాలి లోపలికిపోయి అవయవాలను కదల్చుతూ ఉంటుంది. దేహం కదిలితే బ్రతికి ఉన్నాడంటారు. ఇలాంటి దేహాలను జంగమాలు అంటారు లోకులు. చేతనములయినా ప్రయత్నములేని వృక్షాదులను స్థావరములంటారు. ఈ చిదాకాశుడయిన ఈశ్వరుడే. బుద్ధ్యాది ఉపాధు లతో కూడుకొని కాని, అందు ప్రతిబింబించి కాని, ఔపాధికంగా జీవ భావాన్ని చెందుతున్నాడు. ఉపాధులలోని సంవిదంశం మాత్రమే చేతనం. మిగిలిన ఉపాధిభాగం అంతా అధ్యారోపితం. అచేతనం, ఈ చైతన్యం బుద్ధిద్వారా స్థూల శరీరాన్ని చేరుతుంది. తాను అధిష్ఠించిన బుద్ధిని చక్షురాది గోలకస్థానాన్ని చేరుస్తుంది. ప్రత్యక్షాది, (చాక్షుషాది) బుద్ధివృత్తులను కలగజేస్తుంది. తద్వారా బాహ్యావస్తువులను తెలుసు కుంటుంది. చక్షురాది ఇంద్రియములు, చిదధ్యస్తములయినంత మాత్రాన చేతనములు కాజాలవు. బుద్ధి ఉపాధిగాగల జీవుడు ఉన్నప్పుడే ఆ యింద్రి యములు చేతనములై వ్యవహరిస్తాయి. లేనిచో చైతన్యమునందు అధ్యస్తములయినంత మాత్రాన ఘటాదులుకూడ చేతనములు కావలసి వస్తుంది. కనుక బుద్ధియే జీవుడికి ఉపాధి. ఇందు ఈశ్వర సంకల్పమే నియామకం. అన్ని పదార్థాలకు శక్తి, వ్యవస్థ చిత్సంకల్పం మీదనే ఆధార పడి ఉంది. ఆ చిద్వస్తువు, ఏది ఏలా ఉండాలని సంకల్పిస్తే అది అలా తయారవుతుంది. కాబట్టి చైతన్యముయొక్క సంకల్పమే స్థావర జంగ మాత్మకమయిన ప్రపంచం. సృష్ట్యారంభంలో ఆ పరమేశ్వరుడు, శిలా

తరుతృణాదులు ఏ రూపంలో ఉండాలని సంకల్పించాడో, అవి యిప్పటికీ అలాగే ఉంటున్నాయి. కనుక స్థావరజంగమ పదార్థములలో ఏవీ చైతన్య సత్తకు భిన్నంగా లేవు. సర్వప్రపంచము చిదేకరసం. అయితే "చిద్వస్తువులు చైతన్యంతో అభిన్నంగా ఉండవచ్చును గాని, జడవస్తువులు చైతన్యంతో అభిన్నంగా ఉండటం ఎలా? చిత్వ, జాడ్యములు విరుద్ధములు కదా? చీకటి వెలుతురుతో కలసి ఉండటం లోకంలో లేదే?" అని సందేహం కలుగుతుంది. స్థావరపదార్థాలలో ఉండే ప్రత్యక్చైతన్యానికి అవిద్యాధ్వస్తమయిన బుద్ధివల్లనే స్థావరత్వాది కల్పన చేయబడింది. కాని అందులో చైతన్యాన్ని పుచ్చుకుని కాదు. అనగా జడవస్తువుల యొక్క నామరూపాలు బుద్ధ్యాదులచే కల్పింపబడ్డాయికాని, పరమార్థములుకావు. అలాగే క్రిమికీటకాది జంగమ పదార్థాలలోకూడ బుద్ధ్యాది వికార భేదాలను బట్టియే వాటికి ఆ పేర్లు వచ్చినవి. ఉత్తర సముద్రతీరాన ఉన్నవారు దక్షిణ సముద్రతీరాన ఉన్నవారిని తెలుసుకోలేరు. అలాగే స్థావరజంగమ పదార్థాలు కూడా, ప్రత్యక్ చైతన్యంలో లీనమై ఉండి, స్వస్వరూపాన్ని గ్రహింపజాలవు. ఇతరుల బుద్ధికల్పనలు వాటికి గోచరించవు. కనుకనే వాటికి సముదాయ వ్యవహారంలో పరస్పర సంకేతం అవసరమయింది. రాతిలోని కప్ప బయటి కప్పను తెలుసుకోలేదు. బయటి కప్ప రాతిలో కప్పను తెలిసికోలేదు. అలాగే స్థావరజంగమ పదార్థాలుకూడా ఒకదానిని మరొకటి గ్రహింపజాలకుండా ఉన్నాయి. కనుక ప్రళయకాలంలో, మాయలో లీనమైయున్న సమష్టి చిత్తము, ప్రపంచముయొక్క సూక్ష్మావస్థా రూపము. సర్వప్రత్యగాత్మ అయిన చిదాకాశం దానిని సృష్ట్యారంభంలో ఎలా గుర్తించిందో (సంకల్పించిందో) ఇప్పటికీ అది అలాగే ఉంది. ఎండాకులూ, గడ్డిపోచలూ, గాలికి కదులుతాయి. శరీరాలు కూడా, శరీరరంధ్రాలనుండి లోపలికిపోయిన గాలివల్ల కదులుతున్నాయి. స్థావరజంగమ పదార్థాలలో వస్తుతః చిత్త్వం సమానంగానే ఉంది. ప్రాణవాయు స్పందము (చలనము) జంగమ పదార్థాలలో ఉంటుంది. స్థావర పదార్థాలలో ఉండదు. ఇదీ ఈ రెంటికీ తేడా. ఇలా సర్గాదిలోనే కొన్ని సక్రియ పదార్థాలు, మరి కొన్ని అక్రియ పదార్థాలు సంవిత్తులో బయలు దేరాయి. అవి ఇప్పటికీ అలాగే ఉన్నాయి. లీలా! ఇదీ ప్రపంచవస్తువుల

యొక్క స్వభావ విలాసం ఇది అసత్యం. అయినా సత్యంగా ప్రకాశిస్తుంది. ప్రసంగవశంచేత మధ్యలో నీవడిగినందున చెప్పాను నీకు. ఇంక అసలు విషయం చెప్తాను విను. బహుశా చనిపోయిన ఈ విదూరథుడనురాజు, పూలరాశిలో దాచబడి శవంగా ఉన్న నీ భర్త అయిన పద్మని (రాజు) యొక్క హృత్పద్మాన్ని చేరబోతున్నాడు. అన్నది సరస్వతి.

ప్రబుద్ధలీల:- సరస్వతీ! ఈ విదూరథుడు ఏ మార్గాన శవమంటే పాన్ని చేరుతున్నాడో చెప్పు. మనం కూడా ఆయన్ని చూచుకుంటూ త్వరగా అక్కడికి వెళ్ళుదాము అని అన్నది లీల.

సరస్వతి:- లీలా! చిన్మయుడయిన జీవుడు వాసనా మార్గాన కాని ఏ లోకానికీ పోలేడు. ఇతడు కూడా పద్మని శరీరంమీద ఉండే అహం వాసనతోనే ఆయనగారి హృత్పుండరీకాన్ని పొందబోతున్నాడు. జీవులకు లోకాంతర గమనానికి వాసనామార్గమే మార్గము. మనము కూడా అదే మార్గాన వెళ్ళుదాము. కోరిక చంపుకుంటే పరస్పర ప్రేమ పెరగదు. అన్నది సరస్వతి.

వసిష్ఠుడు:- రామచంద్రా! లీలయొక్క ఉదారమయిన మనస్సు, పరమార్థ ద్రుగూపమును గురించి చెప్పిన ఈ కథలచే నిర్మలమయింది. సర్వసంతాపములు రూపుమాసినవి. జ్ఞానరూపుడయిన సూర్యుడుదయించాడు. ఇంతలో విదూరథుని చిత్తం ప్రాజ్ఞాత్మలో విలీనమయింది. విదూరథుడు మూర్ఛచెందాడు.

## ౫౬ విదూరథుడు మరణించి యమపురి కరుగుట

గ్రుడ్లు తిరిగి పోయాయి. ప్రాణావశిష్టుడయినాడు. శ్వాసలు పుట్టాయి. అవయవాలన్నీ కట్టెలలాగ బిగుసుకుపోయాయి. రాతిమీద చెక్కిన బొమ్మవలె కొయ్య అయినాడు. శరీరాన్ని విడిచాడు. పడిపొయ్యే చెట్టుమీదనుంచి పక్షి లేచిపోయినట్లు ప్రాణం లేచిపోయింది. దివ్య దృష్టితో ఈ లీలా సరస్వతులు ఇద్దరూ, నభోగతమయిన ఆ జీవుణ్ణి చూస్తున్నారు. సుగంధరేణువులు గాలిలో చేరినట్లు, ప్రాణమయమయిన

సంవిత్తు ఈ జీవుణ్ణి అనుసరించివచ్చింది. ఆ జీవసంవిత్తు (చైతన్యం) అతి వాహిక రూపంతో వాసనానుసారంగా ఆకాశంలో దూరంగా ప్రయాణం సాగించింది. ఈ లీలా సరస్వతులు కూడా ఆ జీవసంవిత్తును అనుసరించి పోవసాగారు. రెండు ఆడతుమ్మెదలు గాలిలోని పరిమళాన్ని వెంటనంటి న్నట్లున్నారు వీరిద్దరు. ఇంతలో ముహూర్త మాత్రంలో మరణమూర్ఛ నము అంతా చల్లారింది. జీవుడు ఆ కా శ ం లో స్వప్న పురుషుడులాగ తయారయినాడు. యమభటులను చూచాడు. బంధువులు ఇచ్చిన పిండ ప్రదానంవల్ల తన కేర్పడ్డ శరీరాన్ని గుర్తించాడు. ఆ శరీరంతో యమ భటులద్వారా యమపురిని చేరాడు. అది కర్మఫలంతో కలకలలాడు తోంది. జంతుకోటితో క్రిక్కిరిసి ఉంది ఆ వైవస్వతపురము. యముడు చూచాడు ఇతణ్ణి. ఇలా అన్నాడు. "ఓ భటులారా! ఈతనివద్ద పాపాలు ఏమీలేవు. ఎప్పుడూ పరిశుద్ధమయిన పుణ్యకర్మలనే ఆచరించాడు ఇతడు. సరస్వతీదేవి వరంచేత ఇతని పూర్వశరీరం శవరూపంతో పూలరాశిలో సురక్షితంగా దాచబడి ఉంది. ఇతడు వెళ్లి ఆ శరీరాన్ని పొందుగాక. నేను చెప్పినదాన్ని మతిలో నుంచుకొని ఇతణ్ణి విడిచిపెట్టండి" అన్నాడు యముడు. వెంటనే యమభటులు అతణ్ణి విడిచిపెట్టారు. మరఫిరంగినుంచి ఇనుపగుండు పోయినట్లు రివ్వున పోతున్నాడు. ఈ లీలా సరస్వతు లిద్దరూ ప్రచ్ఛన్నంగా యమపురం ప్రవేశించారు. వెలుపల ఆయనగారి రాక నిరీక్షిస్తున్నారు. ఇంతలో యమభటులనుంచి విడువబడిన, విదూరథజీవుడు బయలుదేరాడు. ఆతని వెంట లీలా సరస్వతులు కూడా బయలుదేరారు. ముగ్గురూ నభోమండలంలో ఎగిరిపోతున్నారు. కాని ఈ విదూరథుని జీవరేఖ, రూపంతో ఉన్నా ఈ లీలా సరస్వతులను చూడలేదు. వీరిద్దరు (లీలా సరస్వతులు) మాత్రం ఆ జీవరేఖను చూచారు. ఇలా వాళ్లిద్దరూ ఆ జీవరేఖను అనుసరించి వెళ్లి నభోభాగాన్ని దాటారు. లోకాంతరా లను దాటారు. బ్రహ్మాండం నుంచి బయట పడ్డారు. రెండవ బ్రహ్మాండాన్ని పొందారు. భూమండలం చేరారు. ఆ జీవచైతన్యంతో కూడా కలసి పద్మరాజు పురమును ప్రవేశించారు. అందు లీలయొక్క అంతఃపుర మంటపాన్ని అలంకరించారు. ఇదంతా క్షణకాలంలో జరిగింది. సూర్యుని కిరణం పద్మాన్ని ప్రవేశించినట్లు, పరిమళం పవనాన్ని (గాలిని) చేరినట్లు చేరారు వీళ్ళు. అని అన్నాడు వసిష్ఠుడు రామునితో

విన్నాడు రాముడు ఇది అంతా. కొంత సందేహం కలిగింది. "ఈ రాజుయొక్క జీవుడు లీలాంతఃపురం చేరటానికి దారి చూపిందెవరు? ఇతనికి. వెనుక లీల తన భర్తయొద్దకు వెళ్లటానికి కూతురు దారిచూపినట్లు చెప్పాడు కదా? మహర్షి" అని సందేహించాడు. మహర్షీ! విదూరథుని జీవుడు శవశరీరంవద్దకు ఎలా వచ్చాడు? మృతజీవుడికి దారి ఎలా తెలిసింది ఇక్కడికి రావడానికి? అని అడిగాడు.

రామచంద్రా! పూర్వవాసన తీరక పూర్వమే బలవంతమయిన ప్రారబ్ధంచేత మధ్యలో మరోజన్మ రావచ్చు. భోగంచేత ఆజన్మ నశించ గానే మళ్లీ పూర్వవాసన ఉద్భవిస్తుంది. ఆ వాసనచేత పూర్వజన్మకు సంబంధించినవన్నీ స్ఫురణకు వస్తాయి. ఈ విదూరథుడికి పద్ముడనే రాజు యొక్క శరీరమునందు అహంభావ వాసన ఉంది. అది తీరలేదు. మధ్యలో బలవంతమయిన మరొక కర్మచేత మరొక జన్మ వచ్చింది. దాని అనుభవం పూర్తికాగానే ఆ జన్మ నశించింది. అంతట మళ్లీ పూర్వవాసన తల యెత్తింది. అదే పద్మశరీరమునందలి అహంభావ వాసన. దానియందు పద్ముని శవశరీరం ఉంది. కనుక ఆ వాసనచే విదూరథ జీవుడు ఈ శవ శరీరంవద్దకు రాగలిగాడు. ఇది అంతా వాడి మనస్సులో ఉన్నదే. క్రొత్తగా ఎక్కడ నుంచియో రాలేదు. అలారావనిలేదు. అంతులేని భ్రాంతి మాత్రమయిన ఈ జగత్తు అంతా జీవకణము (జీవుడి) యొక్క కడుపులోనే ఉంది. ఆవగింజ అంతటి సూక్ష్మమయిన మర్రిగింజలో మహా విశాలమయిన మర్రిచెట్టు ఉండటం అందరకు తెలిసే ఉంది. అలా మర్రిగింజ వంటిది, జీవోపాధి అయిన సూక్ష్మశరీరం. మర్రిచెట్టు వంటిది ప్రపంచం. ("జ్ఞాతతయా అజ్ఞాతతయావా") తెలిసి కాని తెలియక కాని మొత్తం ప్రపంచం అంతా సాక్షి చైతన్య భాస్యం, (సాక్షికి తెలిసి ఉంటుంది.) అని వేదాంత సిద్ధాంత రహస్యం. మానవుడు ఒకచోట ఉంటాడు. తాను మరోచోట ఎక్కడో ధనం పూడ్చిపెట్టి దాచుకుంటాడు. కాని వీడి మనస్సు ఎప్పుడూ దానిమీదనే ఉంటుంది. మనసా ఎప్పుడూ భావన చేస్తూనే ఉంటాడు. అది వీడికి కనిపిస్తూనే ఉంటుంది. విధురుడికి స్త్రీ లేదు అయినా స్త్రీని ఎప్పుడూ భావనచేస్తూ ఉంటాడు. భావనా బలంచేత వాడికి కామినీ సాక్షాత్కారం కలుగుతుంది. దీనిని బట్టి

ప్రపంచం మనోవాసనలమీాద ఆధారపడి ఉన్నదని నిర్ణయం అవుతోంది. అలాగే విదూరథ జీవుడికి కూడ మనస్సులో ఉండే వాసనాబలంచేత ఈ శవమార్గమూ, శవశరీరమూ గోచరించింది. ఎన్ని జన్మలు గడచినా, తానెక్కడనున్నా, వాసనాంతస్థమయిన అభీష్టవస్తువు తనకు ప్రత్యక్ష మవుతూనే ఉంటుంది. నూరు జన్మలు గడవనీ ఫలం ఇయ్యకుండా వాసనలు చావవు. అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! "బంధువులిచ్చిన పిండములవల్ల ప్రేతలకు శరీరం ఏర్పడు తుందని సెలవిచ్చారు లోగడ తాము. ఎవరయినా బంధువులు వారి ప్రేతలకు పిండములను ఇయ్యకపోతే ఆ ప్రేతలకు శరీరం ఎలా ఏర్పడు తుంది? వాళ్లకు వాసనలు ఎలా పుటతాయో చెప్పండి?" అని అడిగాడు రాముడు.

రామచంద్రా! బంధువులు ప్రేతలకు పిండాలను ఇవ్వనీ, ఇవ్వకపోనీ, మాకు మా బంధువులు పిండ ప్రదానాలు చేశారు అనే భావన వీళ్లకు ఉంటే అంతమాత్రంచేత ప్రేతలకు వాసనలు ఏర్పడుతాయి. ఆవాసనల వల్ల శరీరం ఏర్పడు తుంది. పిండదానాది విధి బంధువుల కర్తవ్యాన్ని బోధిస్తుంది. వస్తుతః బంధువులకు ఫలమును ఇస్తాయి పిండప్రదానాదులు, ప్రేతలకు "మాకు మా బంధువులు పిండ ప్రదానాలు చేశారు" అను వాసనలు కూడ ఏర్పడుతాయి. కాబట్టి పిండ ప్రదానాదులవల్ల ఫలము, ఇచ్చిన బంధువులకూ, ఉద్దేశించిన ప్రేతలకూ, ఉభయులకూ ఉంటుంది. ప్రతి జంతువూ (ప్రాణి) చిత్తవాసనలకు అనుకూలంగా మారుతూ ఉంటాడు. "శ్లో॥ చిత్తమేవహి సంసారః తచ్ఛయత్నేన శోధయేత్ యచ్చిత్తస్తన్మయోభవతి గుహ్యామే తత్సనాతనం॥" చిత్తమే సంసారము. కనుక దాన్ని ప్రయత్నపూర్వకంగా శుద్ధి చేసుకోవాలి. చిత్తం ఎలా ఉంటే మానవుడు అలా అవుతాడు. ఇది ప్రాచీనమైన శాస్త్రరహస్యము. అని ప్రమాణం ఉంది. ఈ నియమం జీవించి యున్న జీవులయందూ, మరణించిన జీవులయందూ, కూడా ఏమాత్రం తప్పదు. కాబట్టి వాసనలకు భావనా బలం చాలు. వస్తువుయొక్క ఉనికితో అంతగా నిమిత్తం లేదు. నేను పిండము కలవాడను అను జ్ఞానం ఉంటే, వాడు పిండరహితుడయినా

పిండముకలవాడే అవుతాడు. పిండము లేనివాడను అను జ్ఞానం ఉంటే, వాడు పిండముగలవాడైనా పిండములేనివాడే. కాని బంధువులు పిండ ప్రదానాలు చేసేయెడల ప్రేతలకు తప్పకుండా పిండప్రదానవాసన కలుగు తుంది. భావనను అనుసరించి పదార్థములు సత్యములవుతూ ఉంటాయి. భావన మాత్రం పదార్థములనే కారణాలవల్ల పుట్టుతూ ఉంటుంది. గారుడ మంత్రాన్ని ఉపాసనచేసేవాడికి "నేను గరుడుడను" అనే భావన ఏర్పడు తుంది. ఆభావనచేత సర్పాదుల విషంకూడా జీర్ణించిపోతుంది. ఎవడికైనా కాలిలో ముల్లు గుచ్చుకుంటే, వాడికది ముల్లు అని తెలియనపుడు, పాము కటిచిందని భ్రాంతి కలుగుతుంది. అది నిజమని భావనచేస్తాడు. ఆభావన వల్ల ఆ పాము అసత్యమయినా, వీడికి మాత్రం నిజంగా మరణమూర్ఛాది పనులు జరుగుతాయి. ఇక్కడ భావనాబలం కారణం అంటామా, లేక వస్తువు కారణం అంటామా! భావనా బలమే కారణం అనాలి. భావన మాత్రం కారణం లేనిదే పుట్టదు. ఆ కారణం నిజంకానీ, భ్రాంతికానీ. కారణం మాత్రం ఉండాలి. రామా! ఈ నియమం మాత్రం జ్ఞాపకం ఉంచుకో. కారణం లేకుండా కార్యం మాత్రం పుట్టదు. ఇది ప్రమాణ సిద్ధము. ప్రపంచోత్పత్తి మొదలుకొని మహాప్రళయంవరకూ కారణ లేకుండా ఏకార్యం పుట్టటంలేదు. అలా పుట్టినట్లు మనం కని విని ఎరుగము. నిత్యస్వయం ప్రకాశమయిన బ్రహ్మయెడల మాత్రం ఈ నియమం పట్టదు. అతనికి కారణంలేదు. బ్రహ్మకార్యరూపుడుగాడు కనుక కారణంతో అపేక్ష కూడా లేదు. కాబట్టి శుద్ధచిన్మాత్రమే భ్రాంతిచే వాసనాది ప్రపంచ రూపంగా భాసిస్తుంది. అదే స్వప్నప్రపంచమువలె కార్యకారి అవుతోంది. భ్రాంతి ప్రపంచంలోని వస్తువులే ఒకదానికొకటి కార్యకారణ భావాన్ని చెందుతున్నాయి. అన్నాడు వసిష్ఠుడు.

మహర్షి! "నాకేవిధమయిన ధర్మమూ (పుణ్యమూ) లేదనే వాసన ఉంటుంది. ఒకానొక ప్రేతకు. వాని స్నేహితుడు ఎక్కువ పుణ్యంచేసి సమర్పిస్తాడు ఆ ప్రేతకు. ఈ పరిస్థితిలో ప్రేతకు ధర్మవాసన లేదు కనుక స్నేహితుడిచ్చిన ధర్మం ఫలంలేకుండా నశిస్తుందంటారా? లేక స్నేహితుడికి "నేను ధర్మం సమర్పించాను" అనే వాసన ఉన్నందున, ఆ ధర్మం ఫలిస్తుందంటారా? ఇందులో సుహృద్వాసన సత్యార్థము (నిజమయిన

విషయముగలది.) స్నేహితుడు నిజంగా పుణ్యంచేసి సమర్పించాడు కనుక. ప్రేతవాసన అసత్యార్థము. ఉన్న ధర్మము లేదనుకొంటున్నాడు కనుక. కాబట్టి ఈ రెండు వాసనలలో ఏది ప్రబలం? ఏది దుర్బలం? అబద్ధమైనా అనుభవించేవాడియందున్న వాసన ప్రబలమా? నిజమయిన విషయంగల వాసన ప్రబలమా? ఇందు మొదటి పక్షంలో చేసిన పని వ్యర్థమవుతుంది. (కృతహానదోషము ప్రసక్తిస్తుంది.) రెండవ పక్షంలో నిజమయిన విషయముగల వాసనే ఫలిస్తుంది కాని, విషయము నిజం కాకపోతే వాసన ఫలించదని ఏర్పడుతుంది. అప్పుడు పదార్థముయొక్క సత్యత్వము ప్రబలం అనీ, వాసన దుర్బలం అనీ చెప్పినట్లవుతుంది. ఇది వెనుక మీరు చెప్పిన దానికి విరుద్ధం ఎలా చెప్పినా మెడకు ఉరి తప్పదు. కాబట్టి ఏమిటి మీ అభిప్రాయం ఇందులో. అని అడిగాడు రాముడు.

రామచంద్రా! విను సమాధానం. శాస్త్రోక్తమయిన దేశకాలాలలో శాస్త్రోక్త విధానాన్ని అనుసరించి స్నేహితుడు ధర్మం ఆచరించి ఉంటే, అక్కడ శాస్త్ర ప్రమాణ్యాన్ని బట్టి సుహృద్వాసనే ప్రబలం. "నాకేమీ ధర్మము లేదనే" ప్రేతవాసన కేవలం లౌకికం, కాబట్టి దుర్బలం. శాస్త్రమే వాసనా ప్రాబల్యానికి కారణం కాని, అర్థసత్యత్వము (పదార్థముయొక్క నిజస్థితి) వాసనా ప్రాబల్యానికి కారణంకాదు. స్నేహితుడు నిజంగా ధర్మం ఆచరించి ఉంటే, ధర్మమును ఆచరించమని చెప్పిన శాస్త్రముయొక్క బలంవల్ల, ప్రేతయొక్క అంతఃకరణలో తాత్కాలికంగా "నేను ధర్మవంతుడను" అనే వాసన పుటుతుందని మేము అంటాము. ఆ శాస్త్రబలంవల్లనే ప్రేతకు ఫలం కూడా లభిస్తుంది. ఇలా కాక అర్థ సత్యత్వమే వాసనా ప్రాబల్యానికి కారణమయ్యేయడల, శాస్త్రమునందు ప్రామాణ్య బుద్ధిలేనివాడికి, వేద విద్వేషికి, నాస్తికుడికి, పాపవాసనలతో కూడిన అంతఃకరణంగల పామరుడికి, స్నేహితులు ఎంతటి ధర్మదానం చేసినా, ఫలించటంలేదే ఏమి కారణము? పదార్థం నిజంగా ఉండటమే కారణమయితే, ఇక్కడ స్నేహితులిచ్చిన పుణ్యాలు (ధర్మాలు) నిజంగా ఉన్నవికదా? అవి ఫలించాలిసింది దేగా? అలా ఫలించటంలేదే నాస్తికుడివద్ద. కాబట్టి వాసనా ప్రాబల్యానికి కారణం శాస్త్రబలం కాని, అర్థసత్యత్వం కాదు. (పదార్థములయొక్క నిజస్థితి కాదు.) రామచంద్రా! కనుకనే,

నేను వెనుక పురుష ప్రయత్నమే ప్రబలం అని చెప్ప. శుభాభ్యాసమే ఎప్పుడూ అవసరమన్నాను. శుభవాసనలు ప్రబలమయితే అశుభ వాసనలు నశిస్తాయి. అశుభవాసనలు ప్రబలమయితే శుభవాసనలు నశిస్తాయి. ఇదీ ఇక్కడ పరిస్థితి. అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

మహర్షీ ! అయితే దేశకాలాది సహకారి కారణసంపత్తిచే ధర్మము నెరవేరుటకాని, తద్వాసనలు పుట్టుటకాని జరిగేయెడల, సృష్టికి ప్రాక్కాలంలో అద్వితీయమగు బ్రహ్మ ఒక్కడే కదా? ఉన్నది. దేశకాలాదులు లేవుకదా. అవి లేనిదే వాసనలు పుట్టవుకదా? అలాంటి అప్పుడు వాసనామయమయిన ఈ జగత్తు పుట్టటం ఎలా? జగత్తు పుట్టినట్లు "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతి చెబుతోందే? ఇది ఎలా పొసగుతుంది? అని అన్నాడు రాముడు.

వసిష్ఠుడు:- రామచంద్రా! మంచిమాట అడిగావు. ఇది నాకూ ఇష్టమే. మహాప్రళయానంతర సృష్టి ప్రారంభంలో దేశకాలాదులులేవు. సహకారి కారణాలు లేకపోతే దృశ్యమనే కార్యం పుట్టదు. కనిపించదు. దృశ్యం పుట్టటానికి ఎప్పుడు వీలులేదో, అప్పుడు కనిపించేది అంతా శుద్ధ చిద్రూపమయిన బ్రహ్మ అనాలిసిందే. ఈ విషయాన్ని "ననిరోధోనచోత్పత్తిః" "యత్తదద్రేశ్యమగ్రాహ్యం" "అథాత ఆదేశోనేనేతి" ఇత్యాది శ్రుతులు అనేకం నొక్కిచెబుతున్నాయి. ఇదంతా నీకు ముందు అనేక యుక్తులతో చెప్పబోతున్నాను నేను. అందుకే ఈ ప్రయత్నం అంతా. ప్రస్తుతం జరుగుతున్న లీలయొక్క కథ విను.

ఈ సరస్వతు లిద్దరూ, పద్మపురం చేరారు, అందు అతిసుందరమైన పద్మిని మందిరాన్ని చూచారు. అది పుష్పోపహారములతో వ్యాప్తమై ఉంది. అందులో మందార కుంద మాల్యాది పూలతో దాచబడియున్న పద్ముడనే రాజుయొక్క శవాన్ని చూచారు.

## ౩౭ స్వప్నవస్తు విచారము

అక్కడ ఆశవమునకు ఒకప్రక్కన, మొట్టమొదటనేవచ్చి మరణించియున్న విదూరథుని భార్య అయిన లీలను చూచారు. ఆమె వేషమూ,

నడవడీ, ఆకారమూ, అందమూ, అవయవాలూ, వస్త్రాభరణములూ, అన్నీ వెనుకటివలెనే ఉన్నవి. ఇక్కడ చచ్చిపడి ఉండటం మాత్రం ఒక్కటి క్రొత్తగా ఉంది. చేతిలో వింజామర ధరించింది. భర్తకు విసురు తోంది. మాటలేదు. ఎడమచేతిలో ముఖం పెట్టుకున్నది. భర్తయొక్క ముఖంమీాద దృష్టి నిలిపి ఉన్నది. ముఖం వాడినట్లు ఉన్నది. ఆమెను ఈ లీలా సరస్వతులు చూచారు. ఆమె (ఆ మృతలీల) మాత్రం వీళ్లను చూడలేదు. ఈ లీలా సరస్వతులు సత్యసంకల్పులు. అందువల్ల ఆమెను చూడగలిగారు. ఈమె అలాంటిది కాదు. అందువల్ల వీళ్లను గుర్తించ (చూడ) లేకపోయింది. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! ఆ మొదటి లీల ఇదేచోట తన శరీరాన్ని విడిచిపెట్టి, ధ్యానశరీరంతో (సూక్ష్మశరీరంతో) సరస్వతీదేవితో కూడ వెళ్లిందని వర్ణించారు వెనుక మీారు. ఇప్పుడు ఆ దేహాన్నిగురించి ఏమీా ముచ్చటించరు. ఆ దేహం ఏమయింది? ఎక్కడకు పోయింది? ఆ విషయం కొంచెం చెప్పండి. అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! లీలకు శరీరం ఎక్కడ? ఆ శరీరానికి సత్యత్వం ఏమిటి? ఇదంతా మరుమరీచికలయందు జలబుద్ధివలె భ్రాంతి. ఇదంతా ఆత్మస్వరూపమే. దీనియందు దేహాదిబుద్ధులు కల్పితాలు. మనం చూచేది అంతా సచ్చిదానంద స్వరూపమయిన బ్రహ్మపదార్థమే. లీలకు ఈ బ్రహ్మజ్ఞానం క్రమంగా అబ్బింది. దానివల్ల ఆమెకు శరీరాది భ్రాంతులు నశించాయి. ఆమె తత్త్వజ్ఞానంచేత, అతిసూక్ష్మమయిన సమష్టి మనో మాత్రరూపంగా ఏ దృశ్య ప్రపంచాన్ని చూస్తోందో, అదే అంతకు పూర్వం భ్రాంతివల్ల భూమ్యాకాశాది నామములతో ఆధిభౌతికంగా ఉన్నది. అంతేకాని వాస్తవంలో భూమ్యాది రూపంతో ఆధిభౌతికమనేది లేదు. ఆ శబ్దమూ అసత్యమే. దాని అర్థమూ అసత్యమే. లోకంలో ఎవడికయినా కలలో తాను "లేడి పిల్లను" అనే స్వప్నజ్ఞానం కలుగుతుందనుకోండి. అలాంటివాడికి మెలకువ వచ్చిన తరువాత కూడా, ఆ లేడి ఎక్కడ ఉన్నదని వెతుకుతూ ఉంటాడా? వాడు. భ్రాంతివల్ల లేని పోయినవి పుటుతూ ఉంటాయి. పోతూ ఉంటాయి. ఆ భ్రాంతి తొలిగిం తరువాత

కూడా అవి పుట్టడం అనేది అసంభవం. కనుక ఈ బ్రహ్మాండంలో, స్థూలప్రపంచం అనేది, అజ్ఞాన సహితమయిన సమష్టి మనస్సుచే కల్పితమై వృథా ప్రసిద్ధిని పొంది ఉన్నది కాబట్టి మిథ్య. జన్మమరణాలతో వస్తూ పోతూ ఉండే దేహాలుగల జీవులందరూ, స్వప్నతుల్యమైన ఈ ప్రపంచాన్ని అనుభవిస్తూనే ఉన్నారు. అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

మహర్షీ! యోగులకు ఆదిభౌతిక దేహం లేదంటారే మీరు. ఆ యోగి జీవించి ఉండి మనముందట ఆత్మస్వరూపాన్ని చెందుతున్నా, లేక మరణించినా. అతడి శరీరాన్ని లోకులు చూస్తూ ఉన్నారు. అది ఆతివాహికమయితే, (సూక్ష్మశరీరమయితే) లోకులకు కనిపించదు. ముక్తి కాలంలో మిగిలి ఉండదు. కాబట్టి దీన్ని మీరు ఆధిభౌతికం అంటారా? ఆతివాహికం అంటారా? అని ప్రశ్నించాడు శ్రీరాముడు.

రామచంద్రా! యోగులకు మరణము రెండు విధాలు. ఒకటి ప్రారబ్ధ భోగము కొరకు తన ఇచ్ఛవచ్చినట్లు అనేక దేహాలను కల్పించుకోవడము రెండు. ప్రారబ్ధం పూర్తిగా నశిస్తే విదేహకైవల్యం. ఇందులో మొదటి మరణంలో పూర్వశరీరం ఏమీ మిగిలి ఉండదు. రెండవరకమైన మరణంలో కూడా పూర్వ దేహం ఏమీ మిగలదు. కాని అది ఎండలో మంచు క్షీణించినట్లూ, శరత్కాలనభస్సులో, వెలిమబ్బులు విడిపోయినట్లూ, క్రమంగా మెల్లగా క్షీణిస్తుంది. అందువల్ల కొంచెం కాలం మిగిలి ఉన్నట్లు భ్రమ. ఇది అవశ్యం పరులకు కనిపిస్తుందనే నియమంకూడా లేదు. యోగి దేహం యోగులకే కనిపించదు. ఇతరులకేం కనిపిస్తుంది? కాబట్టి యోగులు జీవించి ఉన్న దశలో కూడా, "పిల్లు నన్నిటు చూతురుగాక" అనే సత్యసంకల్పంచేతనే ఇతరులు యోగి దేహాన్ని చూస్తున్నారు కాని, వాళ్ల దేహం ఆదిభౌతికం అగుటవల్ల కాదు. లేకపోతే, యోగులకు, వాళ్ల దృష్టిలో వాళ్ల శరీరం ఆతివాహికమనే అనుభవం ఉన్నా వాళ్లనుచూచి అనుభవించే అజ్ఞానుల దృష్టిలో, అది ఆధిభౌతికమనీ, మరణించినదనీ కల్పించుకోవడం జరుగుతోంది అని కూడా చెప్పవచ్చును. తమ తమ వాసనా రూపమయిన భ్రమ చేత యోగి మరణించాడని కొందరనుకుంటారు. జీవించి ఉన్నాడని కొందరనుకుంటారు. కనుకనే శుకుడు

విదేహముక్తుడయినా, పరీక్షిత్తు సభయందు పునర్దర్శనమూ, పరీక్షిత్తునకు భాగవతమును ఉపదేశించడమూ జరిగింది. కనుక ఇందులో విరోధమేమీ లేదు. కాక యోగులకు జ్ఞానోదయ కాలంలోనే దేహాదులు బాధితము లయినాయి. వాళ్లు జీవించి ఉన్నా, వాళ్ల దృష్టిలో దేహమనేది లేదు. రజ్జుతత్త్వజ్ఞానం కలవాడికి సర్పబుద్ధి నశించినట్లే. కాబట్టి దేహమనగా ఏది? ఉన్నదేది? నశించింది ఏది? నాశమనేది ఎలా వస్తుంది? ఎక్కడ నుంచి వస్తుంది? పరమార్థంలో ఏది ఉన్నదో అదే జ్ఞానంచేత సిద్ధించింది. అని జవాబు చెప్పాడు వసిష్ఠుడు.

మహర్షీ! యోగులకు ఆధిభౌతికమయిన స్థూలదేహమే, ఆతివాహికంగా మారుతూ ఉందా? లేక క్రొత్తగా ఆతివాహిక దేహం తయారవుతుందా? తత్త్వజ్ఞానంచేత బాధితమయిన దేహం మరోవిధంగా పరిణామం చెందటం ప్రమాణ విరుద్ధం. తత్త్వజ్ఞానం కలిగిన తర్వాతకూడ, క్రొత్తగా ఇంకొక ఆతివాహిక శరీరం వస్తుందంటే, మోక్షం గంగలో కలిసినట్లే. ఇంకొక శరీరం వస్తే ఇంకొక జన్మ వచ్చినట్లే జీవన్ముక్తి ఎక్కడిది? నేను ఈ సందేహ ప్రవాహంలో మునిగిపోయాను. దరిచేర్చండి. అన్నాడు రాముడు.

రామచంద్రా! చాలసార్లు చెప్పాను ఈ విషయం నీకు. అయినా నీవు గ్రహించలేకున్నావు. స్థూలశరీరమనేది లేదు. సూక్ష్మమే అభ్యాస పాటవంచేత స్థూలమవుతుంది. స్థూలబుద్ధి, వివేకంచేత నశిస్తే సూక్ష్మమే మిగిలి ఉంటుంది. "అయితే స్థూలమనేది ఒక నూతన పరిణామం కాక, సూక్ష్మశరీరమే ఇలా (స్థూలంగా) తయారయేయడల, సూక్ష్మశరీరంలో లేని, బరువు, గట్టితనం, మొదలయినవి స్థూలంలోకి ఎలా వచ్చాయి? స్థూలంలో ఉన్నవి తత్త్వజ్ఞానంచేత ఎలా పోతున్నాయి?" అని సందేహ పడతారు. కాని ఆ సందేహం సమంజసంకాదు. కలలో సూక్ష్మశరీరమే బరువూ, కఠినమూ, అయిన అనేక స్థూలశరీరముల ఆకారంగా వాసనా బలంచేత తయారవుతూఉంది. మళ్లీ మెలకువరాగానే స్వప్నశరీరాదులలో నున్న గురుత్వకాఠిన్యాలు అన్నీ నశిస్తాయి. అలాగే తత్త్వజ్ఞానంకలిగితే, జాగ్రద్దేహంలో ఉండే గురుత్వకాఠిన్యములు కూడా బాధితములవును.

అందులో సందేహం అవసరం లేదు. అనేక జన్మలలో దృఢమైన స్థూల వాసనగల అజ్ఞానులకు, స్థూలదేహము శవాకారమై, దహనసంస్కారం చేత నశించి, కనిపించకుండా పోతేనే, ప్రాక్తనమయిన సూక్ష్మదేహప్రాప్తి కలుగుతూ ఉండగా, వాసనారహితులైన తత్త్వజ్ఞానులకు మూలోచ్ఛేదన రూపమయిన స్థూలదేహ బాధ కలిగినప్పుడు, స్వాభావికమయిన సూక్ష్మ శరీరప్రాప్తి (అనగా చిచ్ఛరీర ప్రాప్తి) కలగటంలో అభ్యంతర మేమి? బోధాతిశయంవల్ల జీవించి ఉండగానే యోగులకు ఇలాంటి సూక్ష్మదేహ ప్రాప్తి అవశ్యం కలుగుతుంది. ఎవడికయినా కలలో "నేను సంకల్ప రూపుడను" "స్థూలాత్మనుకాను" అను స్మృతి కలిగితే వాడు, అలాగంటి సంకల్పశరీరుడే అవుతాడు. నభోవిహారసమర్థుడు (ఆకాశాన తిరుగనేర్చిన వాడు) అవుతాడు. అలాగే ప్రబోధంవల్లకూడా ఆతివాహిక శరీరుడవు తాడు. కాని ఇలాగంటి స్మృతి స్వప్నంలో పామరులకు కలగదు. ధ్యాన నిష్ఠలో ఆరితేరిన మొనగాళ్లకు కలుగుతుంది. రామా! "సర్వజనప్రియమైన దేహాన్ని పోగొట్టుకునే తత్త్వజ్ఞానం అనర్థకరం కదా?" అనే సంశయం నీకు అక్కరలేదు. శుక్తికయందు కలిగిన రజతము పోయిందని, రజతమునకు బాధకలిగినతరువాత ఎవ్వడూ ఏడ్వడు. అని అన్నాడు వసిష్ఠుడు.

అయితే మహర్షి! పూర్వ లీలా, అభినవలీలలు ఇద్దరూ పద్ముడనే రాజు ఇంటిలో సమావేశమైన తరువాత, ఆ యింటిలో ఉండే పరివార జనులు, ఈమెయొక్క సంకల్పబలంచేత, ఈమెను గుర్తించేయడల, ఈమె పాత లీల అని గుర్తించారా? క్రొత్తగా ఎవరో ఒక దేవత వచ్చినట్లు గుర్తించారా? ఏమి జరిగింది ఆపైన చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! ఈమెను పట్టమహిషియగు పూర్వ లీలనుగానే గుర్తించారు పరివారజనులు. రెండవ లీలను మాత్రం ఈమె చెలి కత్తెనుగా గుర్తించారు. ఈమెను గురించి ఇతరసందేహాలు ఏమీ వీళ్లకు కలగలేదు. వీళ్లు అందరూ అవివేకులు. కనిపించేదాన్ని కనిపించినట్లే గ్రహించి వ్యవహరించే వారు ఇలాంటి వాళ్లకు విచారణ అనేది కలగదు. ఎండు మట్టిముద్దను చెట్టుకు వేసి కొట్టితే, బాణమువలె చెట్టులోపలికి దూరదు. బురద మట్టిముద్దవలె చెట్టుకు అంటుకోదు. (అతుకుకోనదు)

రాతివలె చెట్టుకు కొంచెం దెబ్బకొట్టదు. తానే వెంటనే విడిపోయి క్రింద రాలిపోతుంది. అలాగే పుట్టినవాళ్లు పుట్టినట్లు పెరిగిన అజ్ఞానులు లోపలికిదిగి విచారించుటకు సమర్థులు కాలేరు. విచారణచేసే తత్త్వజ్ఞులకు ఆధిభౌతిక మగు ప్రపంచంలో భాగమే ఉండదు. ఇంక దానిని గురించిన సందేహా లుండవని చెప్ప పనిలేదు. మెలకువస్తే స్వప్నశరీరం ఎగిరిపోతుంది. తత్త్వ జ్ఞానం కలిగితే భౌతిక ప్రపంచం ఎగిరిపోతుంది. ఎక్కడికి పోతుందో తెలియదు. రామా! స్వప్నపదార్థాలూ, సంకల్పపదార్థాలూ, సంవిత్తులో జ్ఞానంలో లీనమై ఉంటాయి. చలనములన్నీ గాలిలో లీనమై ఉన్నట్లు. నిజమయిన స్వరూపంలేని ఈ వస్తువులు సంవిదావరకమయిన అజ్ఞానంలో దాగిపోతాయి. వివేకం కలిగిందంటే, సంవిత్తుకంటె వేరుగ స్వప్నవస్తువు లుండవు. సంవిత్తుకంటె వేరుగా కనిపించేది అంతా అజ్ఞానమే. అదే సంసారం. జ్ఞానం కలిగితే అజ్ఞానం ఉండదు. అజ్ఞానం లేకపోతే సంసారం లేదు. సహకారి కారణ సామగ్రి ఏమీ లేకుండా తయారయిన స్వప్న వస్తువులు నిజమనుకొనుట, కేవలము పొరపాటు. జాగ్రత్తాలీనవస్తువులకు సహకారి కారణ సామగ్రి ఉన్నట్లు కనిపిస్తూ ఉంది. కాని సృష్టి ప్రారం భంలో, అజ్ఞానోపహితమయిన హిరణ్యగర్భ సంవిత్తుకంటె వేరేమీ లేకుండగనే ఈ ప్రపంచం కూడా తయారయింది. అందువల్ల జాగ్రత్ప్ర పంచంకూడా స్వప్నం వంటిదే.

1. కాక ప్రపంచం సత్యం అయ్యేయెడల సంవిత్తువలె, ఇదికూడా చిత్తుకావలెను. అపుడు ప్రపంచం చిద్విషయం కావటానికి వీలు లేదు. ప్రపంచం అంతా చిత్తుకు విషయమవుతోంది కాని చిత్తుగా లేదు. కనుక సత్యం కాదు. 2. మరియు సంవిత్తు సత్తను (ఉనికిని) విడచుటలేదు. ప్రాపంచిక వస్తువులు మాత్రం సత్తను (ఉనికిని) విడచుచున్నవి. కనుక ప్రాపంచిక వస్తువులు సత్యములుకావు. 3. తత్త్వజ్ఞాన బాధ్యములగుట వల్లకూడ ప్రపంచ పదార్థములు సత్యములు గావు. అజ్ఞానోపహతులైన ప్రజలు, తమ తమ అజ్ఞానానుసారంగా. జ్ఞానులకు ఆతివాహిక శరీరాలను కల్పించుకొని, చూస్తూ ఉంటారు. అంతే కాని నిజంలో అవిజ్ఞానికి జ్ఞాని దృష్టిలో దేహాలు కావు. కనుక ద్వైతదృష్టులన్నీ అజ్ఞానంవల్ల పుట్టినందున మిథ్యాభూతములే కాని యథార్థములు కావు. ప్రాణోత్క్రమణమునకు

వెనుకటి క్షణంలో, ముందు అనుభవించబోయ్యే వస్తువులు భాసిస్తూ ఉంటాయి. అవన్నీ మనోమాత్రసిద్ధములై ఉండి, భ్రాంతివల్ల బాహ్యముల వలె కనిపిస్తూ ఉంటాయి. ఇంతే కాని నిజంలో మనస్సుకంటె వెలుపల లేవు. అవి నిజములూ కావు. అన్నాడు వసిష్ఠుడు.

## శిలా పద్మరాజు జీవించుట

ఇంతలో సరస్వతీదేవి విదూరథ జీవుణ్ణి తన సంకల్పంచేత నిరోధించింది. "ఈ యింటిలో ఈ మహీపాలుడు శవకారంగా ఉండగా, నేను సమాధిలో ఉండగా ఎంతకాలం గడిచిందని అడిగింది లీల సరస్వతిని. సరస్వతీదేవి ఇలా సమాధానం చెబుతుంది. లీలా! నీవు సమాధిలో ఉండి ఒక్క మాసం అయింది. మేము ఇక్కడ నీ శరీర రక్షణకొరకు దాసీలుగా నుండి ఇప్పుడే కనుమూసి నిద్రిస్తున్నాము. నీశరీరముయొక్క వృత్తాంతం చెబుతా విను. నీవు ప్రాణవాయు నిరోధం చేసి సమాధిలో ఉండగా పదునైదు రోజులకు నీ ఒంటికి వేడియెక్కి చెమట పట్టింది. క్రమంగా ఎండిపోయిన చిగురుటాకువలె నిర్జీవమై భూమిమీద పడిపోయింది. శరీరం అంతా చలవ కమ్మి కట్టెలాగ శవాకారమయింది. మంత్రులందరూవచ్చి ఒళ్లుపట్టుకుని చూచి మరణించినట్లు నిశ్చయించి, ఇంటినుంచి బయటికి తీశారు. రుద్రభూమికి చేర్చి మంచిగంధపు కట్టెలతో చితిపేర్చి, నెయ్యి పోసి దహనంచేశారు. మారాజ్ఞి (రాణి) మరణించనదని పెద్దగా అందరూ దుఃఖించారు. పరివారం అంతా నీకు చేయవలసిన ఔర్ధ్వదైహికకర్మను అంతా చేశారు. ఇప్పుడు ఈ శరీరంతో నీవు ఇక్కడకు వచ్చుటను చూచి పరలోకంనుంచి వచ్చినావని ఆశ్చర్యపోతోంది పరివారజనం. నీవు మాత్రం నీ సత్యసంకల్పబలంచేత మనుష్యులు చూడటానికి సాధ్యం కాని, అతి స్వచ్ఛమయిన ఆతివాహిక దేహంతో చూడబడుచున్నావు. ఇది చాలా చిత్రంగా ఉన్నది. నీవు ఎలాంటి శరీరం కావాలని సంకల్పిస్తావో అలాంటి శరీరం తయారవుతుంది. అదంతా ఆవాసనయొక్క బలం. వెనుకటి శరీరం వంటి శరీరం కావాలని సంకల్పించావు నీవు. మనస్సులో ఆ వాసన ఉంది నీకు. కాబట్టి ఆ ఆకారంగానే నీకు శరీరం తయారయింది. అందరూ తమ తమ వాసనలను అనుసరించే లోకాన్ని చూస్తూ ఉంటారు. ఇందుకు

దృష్టాంతం బాలవేతాళదర్శనమే (దయ్యమని అనుకున్న పిల్లవాడు దయ్యం పట్టినట్లుండడమే) నీవు తత్త్వజ్ఞాన సంపన్నురాలవు అయినావు. కనుక ఆతివాహిక దేహం వచ్చింది. కాని పూర్తిగా వాసనాక్షయం కాలేదు. అందువల్ల పూర్వదేహము యొక్క ఆకారం సిద్ధించింది. ఆతివాహిక భావము రూఢమయిన జ్ఞానికి ఆధిభౌతిక భావ ముండదు. పగలదృష్టిలో ఉన్నట్లు కనిపించినా వీని దృష్టిలో పూర్తిగా చల్లారి పోతుంది శరత్కాల మేఘంవలె. ఆతివాహిక భావము రూఢమయిన వాని దేహము, నీరులేని మేఘం వంటిదీ, వాసనలేని పుష్పం వంటిదీ అవుతుంది. పూర్తిగా వాసనాక్షయం కలిగేయడల ఆతివాహిక దేహకల్పన కూడా ఉండదు. (అసలు ఏ శరీరమూ ఉండదు.) ఏ మాత్రమైనా సద్వాసనలు శేషించి ఉంటేనే ఆతివాహిక దేహకల్పనము జరుగుతుంది. కనుక సద్వాసనలుగలవాడికి ఆతివాహిక జ్ఞానము రూఢమయితే ఆధిభౌతిక దేహము పూర్తిగా మరపుకు వస్తుంది. ఈ రోజు నీవు సమాధి పూని ముప్పదియొక్కటవరోజు. ఇప్పుడు మనం ఈ చిదాకాశంలో కలిసినాము. నీ పరిచారికలనిద్దరను నేను నిద్రచే మోహితులుగా జేసినాను. వారీ ఉదయం నిద్రించుచున్నారు. కాబట్టి లీలా! రమ్ము. మన మిప్పుడు, సంకల్ప ప్రభావంచేత, ఈ రెండవ లీలకు దర్శనమిద్దాము. యథోచితంగా వ్యవహరిద్దాము. అని చెప్పి వెంటనే "మమ్ముల నిద్దరనూ ఈ రెండవ లీల చూచుగాక" అని సంకల్పించింది జ్ఞప్తి దేవి. వెంటనే వారిద్దరూ (పూర్వ లీలా సరస్వతులు) ప్రకాశించుచు కనిపించసాగారు. వాళ్లిద్దరి తేజస్సువల్ల ప్రకాశమానంగా ఉన్న ఇంటిలో నలువైపుల చూడనారంభించింది రెండవదగు విదూరథుని లీల. ఈ లీలా సరస్వతుల నిద్దరినీ చూచింది. త్రుళ్లిపడి లేచి వాళ్లిద్దరి కాళ్ల మీద పడింది. "ఓ దేవులారా! మీరు నా మంచికొరకు ఇటకు వచ్చినారు. నాకు ప్రాణదాతలు. మీకు జయమగుగాక." నేను మీపరిచారికను. నేను మీకంటె ముందుగనే మీకు దారిచూపుతూ ఇచ్చటకు వచ్చినాను. దయచేయుడు. అని అంటూ ఉండగానే వీళ్లిద్దరూ సింహాసనములను అలంకరించారు. జ్ఞప్తి దేవి ఇలా అడిగింది ఆవిణ్ణి. పుత్రీ! నీవు మాకంటె ముందుగా ఇక్కడికి ఎలా వచ్చావు? నీకు త్రోవలో ఏమేమి ఆశ్చర్యం జరిగింది. నీవృత్తాంతం ఏమి? మొదటనుంచీ చెప్పు? అని అడిగింది.

విదూరథలీల జవాబు చెబుతోంది: దేవీ! ఆ విదూరథుని యింటిలో నేను విదియనాటి చంద్రకళవలె క్షీణించిపోయాను. మూర్ఛపోయాను. కళ్లు మూసుకుపోయినవి. తెలివితప్పింది. మరణించాను. వెంటనే ఆకాశ మార్గానికి ఎగిరిపోయాను అక్కడ వాయురథాన్ని ఎక్కాను. వెంటనే ఈ యిల్లు చేరాను. ఇట నా భర్త అయిన విదూరథుణ్ణి చూచాను. ఆయన పూలరాశిలో దాగి నిద్రించినట్లున్నాడు. యుద్ధ ప్రయాసవల్ల అలసి నిద్రిస్తున్నాడని నేను నిద్ర లేపలేదు. తరువాత మీరిద్దరూ ఇచటకే తెంచారు. ఇదీ నేననుభవించిన నా చరిత్ర. అన్నది విదూరథ లీల.

అంతట జ్ఞప్తి దేవి, పూర్వం తన సంకల్పంచేత నిరోధించియున్న విదూరథుని జీవిణ్ణి విడిచింది. ఓమందగమనలారా? సుందరలోచనులారా? శవతల్పమునుండి ఈ రాజును లేపతీద్దాము. అని చెప్పిందిఈ యిద్దరు లీలలతో. ఆ జీవుడు తన పూర్వవాసనలతో సహా శవ శరీరాన్ని ప్రవేశించాడు. క్రమంగా అవయవాలన్నీ రసవంతములుగా ప్రకాశించాయి. కళా పూర్ణుడయిన రాకా నిశాకరుడువలె వెలుగుతున్నాడు రాజు. పెరుగుచున్న వింధ్యాద్రివలె పైకి లేచాడు. "ఎవరక్కడ" అని గట్టిగా (బిగ్గరగా) పిలిచాడు. "స్వామీ! ఏమి ఆజ్ఞ? సెలవివ్వండి" అని ఈ యిద్దరు లీలలు అన్నారు. రాజు అతి నమ్రతగా ఉన్న ఈ లీలా ద్వయాన్ని చూచాడు. ఇద్దరూ, ఆకారంలో, అందంలో, ఎత్తులో, నడతలో, మాటలో, పనిలో ఆనందంలో, సమానంగా ఉన్నారే! ఎవరు వీళ్లు అని సందేహించాడు. "ఎవరు నీవు? ఈమె ఎవరు? ఎటనుంచి వంచింది యీామె?" అని అడిగాడు పూర్వలీలను పూర్వలీల ఇలా జవాబు చెప్పింది. దేవా? వినం. నేను మీకు సహధర్మచారిణి అయిన మొదటి భార్యను. శబ్దార్థములవలె మీతో కలసిమెలసి యున్నదానను. ఈ రెండవ లీలను నేను మీకొరకు భోగపత్నినిగా సంపాదించాను. ఈమె అచ్చగా నాకు నకలు. మా నెత్తిమీద బంగారపు సింహాసనం అలంకరించి యున్న ఈమె ముల్లోక జననియగు సరస్వతీదేవి. మన పూర్వ పుణ్యంవల్ల ఇక్కడకు సాక్షాత్కరించింది. ఈమె వల్లనే మేమిద్దరమూ, మరొక బ్రహ్మాండంనుంచి యిక్కడకు తీసుకు రాబడినాము" అని అన్నది పూర్వ లీల రాజుతో.

ఈ మాటలు విని రాజు వెంటనేలేచి సరస్వతీదేవి పాదాలవీూద పడ్డాడు. "దేవీ! నీకు నమస్కారము. నాకు పరమార్థమును గ్రహించునట్టి మేధాశక్తిని యిమ్ము. దీర్ఘాయుస్సును, ధనములను ఒసగుము. నీవు వరములనిచ్చే మహాతల్లివి" అని అన్నాడు రాజు. (విదూరథుడు.) ఆతణ్ణి సరస్వతీదేవి చేతితో స్పృశించింది. కుమారా! నీవు "ధనధాన్యాది సకల ఐహిక సంపదలతో తులదూగుచూ, చిరాయువుగా నుండుము" నీకు పారమార్థికమయిన ఆత్మస్వరూపస్థితి లభించుగాక "నీకు ఆపదలన్నీ అడుగంటుగాక" "పాపబుద్ధులు నశించుగాక" "అంతులేని అభ్యుదయసుఖములు చేకూరుగాక" "నీరాజ్యంలోని ప్రజలు నిత్యం సుఖంగా నుండుగాక" "వారలకు సకలసంపదలూ సంభవించుగాక."

## ౫౯ పద్మని నిర్వాణము

అని ఆశీర్వదించి జ్ఞప్తిదేవి ఆరాజసదనమునసే అంతర్ధానమయింది. తెల్లవారుసరికి జనం అంతా మేలుకొన్నారు. లీలను కౌగలించుకున్నారు. లీలకూడా చచ్చి మళ్లీ పుట్టిన భర్తను మహానందంతో కౌగలించుకున్నది. ఆనందపరవశులయినారు రాజసదనంలోనివారంతా. పరివారజనంతోనూ, రాజును చూడవచ్చిన రాజబృందంతోనూ, పౌర జానపదులతోనూ, రాజగృహాంగణము సంకులమయి ఉంది. పూర్వలీల పరలోకమునుండి మరొక లీలను తన భర్తకు పట్టమహిషినిగా తెచ్చిందనీ, భర్తనుగూడ మరణించినవాడిని పరలోకంనుంచి తెచ్చుకున్నదనీ, అనేకమంది అనేక తీరుల కథలుగా చెప్పుకున్నారు దేశాంతరంలోనివారు. పద్మరాజు తన మరణవార్తను సంక్షేపంగా విని, తెచ్చిన చతుస్సముద్రోదకములచే స్నానమాడాడు. మంత్రులూ, సామంతరాజులూ, పరలోకం నుంచి వచ్చాడని, మళ్లీ పట్టాభిషేకం చేశారు. నహుషుడు పడిపోయిన తరువాత మళ్లీ స్వారాజ్యస్థానానికి వచ్చిన ఇంద్రుణ్ణి దేవతలు పట్టాభిషేకం చేసినట్లు అయింది ఇతడికి. ఈ యిద్దరు లీలలూ, రాజూ, జీవన్ముక్తులుగానుండి పూర్వ వృత్తాంతాలు చెప్పుకుంటూ సుఖంగా రమించారు. ఇలా తన పురుషప్రయత్నంచేత సరస్వతీదేవిని ఆరాధించి ఆమె అనుగ్రహంపొంది, దానిచే పునర్జీవనమునూ, రాజ్యాన్నీ పొందాడు పద్మడు. సరస్వతీదేవి

ప్రసాదించిన జ్ఞానంచేత ఆత్మతత్త్వాన్ని తెలిసికొని, యిద్దరు లీలలతో ఎనభై వేల సంవత్సరాలు నిర్దుష్టంగా రాజ్యమేలాడు. పరినిష్ఠితమయిన ఆత్మబోధను ఆర్జించుకున్నారు. ముగ్గురూ విదేహముక్తిని పొందారు.

## ౬౦ లీలోపాఖ్యాన ప్రయోజనము

రామచంద్రా! లీలోపాఖ్యానం అంతా నీకు చెప్పాను. మనస్సులో ఉన్న దృశ్యదోషం నివర్తించటం దీని ఫలం. అది నీకు మొట్టమొదట ఉత్పత్తి ప్రకరణంలోనే చెప్పాను. "దృశ్యం నాస్తీతిబోధేన మనసో దృశ్య మార్జనం। సంపన్నంచేత్తదాప్తాపరా నిర్వాణ నిర్వృతిః॥" "మనస్సులో, దృశ్యప్రపంచంలేదనే జ్ఞానంకలిగి, మనస్సు దృశ్యవాసనారహితమయితే, నీకు మోక్ష సుఖం లభిస్తుంది" అని. కనుక ప్రపంచం సత్యమనే మాట మానుకో. ఎంతవరకు ప్రపంచమునందు సత్యత్వబుద్ధి ఉంటుందో, అంతవరకు ఆబుద్ధిని తుడిచిపెట్టుకుంటూ ఉండాలి యుక్తులచే. మిథ్యాత్వ నిర్ణయం కలిగితే ఆపైన యీ ప్రయాస అక్కరలేదు. తత్త్వజ్ఞుడు జ్ఞేయమయిన దృశ్యప్రపంచాన్ని జ్ఞానాకారంగానే చూస్తాడు. ఆది సృష్టిలో చిన్మాత్రరూపుడయిన స్వయంభువు తనయందే ఈ ప్రపంచ వివర్తకల్పనను చేసికొన్నాడు. అందువల్ల అది మళ్ళీ చిదేకరసం కాగలదు. కరకమనే మంచునీరే కాఠిన్యాన్ని చెంది, రాయి అయింది. అది మళ్ళీ కరిగి నీరవుతుంది. అలాగే ఈ ప్రపంచంకూడా లయించేటప్పుడు చిదేక రసం అవడంలో అభ్యంతరం లేదు. కాని అందుకు మన ప్రయత్నం మాత్రం కొంత అవసరం. ప్రపంచ విషయంలో చతుర్ముఖ బ్రహ్మ చైతన్యం అనేది ఒక మహానది. అందులో ఏకదేశం (ఒకభాగం) ఈ జీవ చైతన్యం. ఇది ప్రవృత్తి మార్గమనే ప్రవాహంతో, ఆయా దేహేంద్రియాలను ధరించి, వాటితో సుఖదుఃఖాలను అనుభవించటానికి ప్రయత్నిస్తూ బయలుదేరింది. అలాంటి జీవచైతన్యం తాను మళ్ళీ దానికి విరుద్ధప్రయత్నం లేకపోతే వెనుకకు మళ్ళదు. కాబట్టి ఇక్కడ ప్రయత్నం అవసరం. మంచుగడ్డ మాత్రం ఏ ప్రయత్నంలేకుండా ఊరకున్నా, వెనుకకు తిరిగి నీరు అవుతుంది. అయితే బ్రహ్మ సృష్టమయిన ప్రపంచం, జీవ ప్రయత్నంచేత నివర్తించటం సబబా? మహారాజుగారి ఆజ్ఞవల్ల సిద్ధించిన

అధికారం, ప్రాకృతజనుల ప్రయత్నంచేత మారుతుందా? అని ప్రశ్న కలుగుతుంది. కాని ఆ దృష్టాంతం ఇక్కడ సరిపడదు. ప్రపంచం బ్రహ్మ సృష్టమే. అందులో సందేహం లేదు. కాని అది అపరిచ్ఛిన్నమయిన బ్రహ్మభావంగల ఆ బ్రహ్మకు (ఆ జీవునకు) ప్రపంచంగా కనిపించదు. బుద్ధ్యాది పరిచ్ఛిన్నమయిన జీవులకే ఇది ప్రపంచంగా గోచరిస్తుంది. వీళ్లు (జీవులు) చేసుకున్న పుణ్యాపుణ్యకర్మలయొక్క ఫలం అనుభవించటానికే బ్రహ్మయందు ప్రపంచం ఆరోపితం అయింది. కాబట్టి వాళ్ల ప్రయత్నం వల్లకలిగిన జ్ఞానంచేతనే, వాళ్లకు ప్రపంచ నివృత్తి కావాలి. వేరే ఉపాయం లేదు. దురద ఒకడికయితే గోకుడు మరొకడికి లాభం లేదు. దురదగల వాడికి గోకుడు లేకపోయినా లాభంలేదు. వాడిగోకుడువల్లనే వాడిదురద పోవాలి. కాబట్టి సత్తానియతివాసనలు, ఏవీ దృశ్య ప్రపంచాన్ని సంరక్షించలేవు. భ్రాంతి సిద్ధమయిన ప్రపంచానికి సత్తా ఏమిటి? వాసన ఏమిటి? నియతి యేమిటి? అవశ్యం భావిత్వం ఏమిటి? మాయా దృష్టిలో ఇది ఇలా కనిపిస్తున్నా పరమార్థ దృష్టిలో ఏమీ లేదు. సృష్టి అంతా మాయా కార్యము. మాయ అనేది ఉన్నది. ఏది లేదో అదే మాయ. అని అన్నాడు వసిష్ఠుడు.

శ్రీరాముడు మహా శ్రద్ధగా విన్నాడు. ఆనందించాడు. స్వామీ! "గొప్ప పరమార్థదృష్టిని ప్రసాదించారు. దావాగ్ని దగ్ధమయిన రెల్లు గుబురులకు చంద్రకలవలె ఉంది మీ ఉపదేశం. అవి చంద్రకళవల్ల మళ్లీ పచ్చగా అంకురిస్తాయి. ఈ ఉపదేశంవల్ల (ఈ తత్త్వజ్ఞానంవల్ల) సంసార తాపతప్తులకు వివేక శాంతి మొలకలు పుడతాయి. అబ్బా! ఎంతకాలానికి తెలుసుకున్నాను? తత్త్వబోధకు, ప్రకార, స్వరూప, దృష్టాంత, ప్రమాణ, కాల, ములనేవి అయిదూ అవసరమంటారు పెద్దలు. ఆ అయిదూ చక్కగా తెలిసినవి. తత్త్వముయొక్క రీతి ఎలాంటిదో, స్వరూపం ఎలాంటిదో, దీనికి దృష్టాంతం ఏదో; దీనిని తెలియపరచే ప్రమాణం ఏదో; ఎప్పుడు తెలుసుకోవలెనో, ఈ అయిదూ వివరంగా ప్రతిపాదించారు. జగత్త్వత్త్వాన్ని విచారించుకున్నాను. ఉపాధి శాంతిచే శాంతించిన వానివలె ఉన్నాను. ముక్తునివలె నున్నాను. ఈ లీలోపాఖ్యానము అత్యాశ్చర్యము. శ్రుతులకు ఉపబృంహణము. కాని నాకు ఒక్క సంశయం ఉంది. ఎంత విన్నా

ఇంకా మీ వాక్కు వినాలనే అనిపిస్తోంది. కాన ఈ ఒక్క సందేహాన్ని తీర్చండి. అదేమంటే? ఈ రాజును, వసిష్ఠుడనే బ్రాహ్మణుడుగా ఒక జన్మ, పద్ముడనే రాజుగా ఇంకొక జన్మ, విదూరథుడనే రాజుగా మరొక జన్మ. మూడు జన్మలు గడచాయి అన్నారు మీరు. ఈ మూడు సృష్టులందూ (జన్మలందూ) గడచినకాలం కూడా తమరే తెలవిచ్చారు. వసిష్ఠ జన్మలో ఎనిమిది రోజులు అనీ, పాద్మసృష్టిలో మాసమాత్రమనీ, వైదూరథసృష్టిలో అనేక సంవత్సరాలు అనీ, ఒక బ్రహ్మాండమునందు మనుష్యులకు ఒక సంవత్సరకాలము దేవతలకు ఒక్కదినమనీ, అదేకాలం క్షుద్రజంతువులకు అతిదీర్ఘకాలమనీ, స్వయంభువునకు, మనసంవత్సరాలు ఒక క్షణమనీ, సూచించారు. ఒకేకాలం దేశకాల భేదంచేత ఇలా విరుద్ధ రూపంగా ఉన్నదా ఏమి? లేకపోతే ఏకరూపంగా ఉన్న వస్తువునకు ఈ ప్రతీతి భేదం ఇన్నిరకాల ఎలా వచ్చింది? అనుగ్రహించి ఈ సందేహాన్ని తీర్చండి. ఒక్కమాటు విన్నంత మాత్రంచేత నామనస్సు విశ్రాంతిచెందటం లేదు. ఎండిన మట్టిముద్దమీద ఒక్క నీటిచుక్కవేస్తే కనిపించదు. ధారగా పోస్తే కాని అది తడపదు. అని అన్నాడు శ్రీరాముడు.

రామచంద్రా! వస్తువును అనుసరించి ప్రతీతి కలిగేటట్లయితే ఈ విరోధం తటస్థించును. ప్రతీతిని అనుసరించి వస్తువుయొక్క ఉనికిని కల్పించు కుంటారు మానవులు. కాబట్టి వారివారి ప్రతీతినిబట్టి వారివారికి వస్తువులు వేరయిపోతాయి. అప్పుడు ఈ కాలవైషమ్యం దోషంకాదు. ఎవడెవడు, ఏయేదానిని, ఎట్లెట్లు తెలుసుకుంటే, వాడు వాడు, ఆయాదానిని అట్లట్లు అనుభవిస్తాడు. ఇది లోకసహజం. విషకృములు (విషపురుగులు) విషమే తమకు జీవనహేతువని దృఢమయిన జ్ఞానం కలిగి ఉండేసరికి వాటికి విషం అమృతం అయిపోతోంది. విషంతోనే అవి బ్రతుకుచున్నాయి. కాని ఎవరయినా మానవులు ప్రమాదంవల్ల విషం భుజించి మరణిస్తున్నారంటే వాళ్లకు విషపురుగులకువలె "విషం జీవనహేతువనే" దృఢాభ్యస్తమయిన జ్ఞానం లేనందువల్లనేకాని వేరు కారణంకాదు. పైపెచ్చు ఆ మానవులకు విషం మరణహేతువనే నిశ్చయజ్ఞానం కూడా ఉంటుంది. మిత్రుడుగా చూచుకుంటే శత్రువుకూడా మిత్రుడవుతాడు. సంవిత్తునకు (చైతన్యమునకు) పదార్థములయొక్క విశేషాకారాన్ని చెందటం స్వభావం. అది ద్రష్టల

యొక్క సంస్కారాన్ని అనుసరించి ఉంటుంది. కాబట్టి ఒకే సంవిత్తునందు ఒకానొకడు తన సంస్కారాన్ని అనుసరించి నిమేషత్వమును, (రెప్పపాటు కాలమును) ఆరోపించుకుంటాడు. మరొకడు వాడి సంస్కార ప్రకారంగా కల్పాదులను ఆరోపించుకుంటాడు. ఒకానొకడు ఒక్క నిముషం ఒకకల్పం అనుకుంటాడు, వాడికి ఆ నిముషం కల్పమే అవుతుంది. మరొకడు కల్ప కాలాన్ని నిముషం అనుకుంటాడు. వాడికది అలాగే అవుతుంది. నిండు దుఃఖంలో ఉన్న వాడికి ఒక్క రాత్రి ఒక్క కల్పం. అదేకాలం పూర్తి సుఖంలో ఉన్న వాడికి ఒక్క క్షణం. స్వప్నంలో ఒక్క క్షణకాలం కల్పం అవుతుంది. కల్పకాలం క్షణమవుతుంది. ఒకానొకనికి, "తాను మరణించి మళ్లీ పుట్టినట్లూ, యౌవన వయస్సు వచ్చినట్లూ, నూరామడనడిచినట్లూ" స్వప్నం వస్తుంది. హరిశ్చంద్రుడు ఒక్క రాత్రికాలంలో పన్నెండు సంవత్సరములుగడిపినట్లు అనుభవించాడు. లవణుడనేరాజు నూరేండ్ల ఆయువును, ఒక్క రాత్రిలో అనుభవించాడు. ప్రజాపతియొక్క ముహూర్తకాలం, మనువునకు పూర్ణజీవితకాలం. బ్రహ్మయొక్క జీవితకాలం విష్ణువుకొకదినం. విష్ణువుయొక్క జీవితకాలం శివునకు ఒకరోజు. ధ్యానంచేత చిత్తనాశం చేసికొన్న నిర్వికల్ప సమాధి యోగికి. రాత్రింబవళ్లు అనుభేదంలేదు. అతడి దృష్టిలో పదార్థాలులేవు. జగత్తూలేదు. ప్రియమైన విషయాలను వైరాగ్య వాసనచే భావనచేస్తే అవి కూడా అప్రియములవుతాయి. ఇంద్రియ ప్రాణ మనో నిరోధాది కష్టవిషయములను, ఆత్మసుఖమునిచ్చు ప్రియములుగా భావనచేస్తే మిక్కిలి ప్రియములవుతాయి. విషయలంపటత్వాన్ని ద్వేషించే గురుశాస్త్రాదులను, అప్తతములను బుద్ధితో సేవించేయడల మిక్కిలి ఆప్తతములవును. కాబట్టి లోకమంతా వాడివాడి సంస్కారాన్ని అనుసరించి కలిగే జ్ఞానంమీద ఆధారపడి ఉన్నది. అభ్యాసం లేకపోతే శాస్త్ర పాఠమూ, జపతపాదులూ, కఠినంగా కనపడతాయి. గట్టిగా అభ్యాసం చేస్తే అవే చులకనవుతాయి. (స్వాధీనమవుతాయి.) ఓడమీద ప్రయాణం చేసేవాడికి, ఒడ్డున ఉన్న చెట్లు కదలినట్లు భ్రమచేత కనిపిస్తూ ఉంటాయి. ఒడ్డున ఉన్నవాడికి మాత్రం ఆ భ్రమలేనందున, అలా తిరుగుతున్నట్లు కనిపించవు. కలగన్న వాళ్లకి ఆకాశం క్రిక్కిరిసి ఉన్నట్లు కనపడుతుంది. దృష్టిదోషంవల్ల పచ్చనివస్తువు, నల్లగానో, తెల్లగానో, కనిపిస్తుంది.

పిల్లవాళ్లు పుట్టినరోజు పండుగనాడుకూడా విపరీతంగా ఏడుస్తూ ఉంటారు. వాళ్లకు ఆ రోజు శుభదినమనే జ్ఞానం ఉండదు. తుదకు ఆరోజును ఆపద సమయంగా గడుపుతారు. విచారరహితుడికి గట్టిగోడ వట్టి ఆకాశం అవుతుంది. మూఢులకు లేని దయ్యం కూడా భ్రాంతివల్ల ప్రాణాలు తీస్తుంది. వారి వారి భ్రాంతివల్ల (అజ్ఞానంవల్ల) కలలో కనిపించిన ఆడుది కూడా మెలకువకలిగి, తనతో రతి సలుపుచున్నట్లు గోచరిస్తుంది. కనుక అవ్యాకృతమయిన చిదాకాశమే ఇలా చిత్రవిచిత్రములుగా జగన్నాటకం జరుపుతోంది. కాబట్టి ప్రపంచం అంతా పిల్లవాడు భ్రాంతివల్ల కల్పించు కున్న పిశాచచేష్టవంటిది. మనోమాత్రమే దీని ఆకారం. కనుక మిధ్య. కలలోకలకనే వాడి ప్రక్కన మరియొక మనుష్యుడు రక్షకభటులచే కొట్టి, తిట్టి బాధింపబడుతూ ఉంటాడు. వాడు మేలుకొన్నవాడు బాధపడునట్లే బాధపడుతూ ఉంటాడు. అయినా ఆ పురుషుడు అజ్ఞానరూపుడే కాని యదార్థరూపుడు కాడు. అలాగే ఈ ప్రపంచం ఎంతటి వ్యవహార సమర్థంగా (అర్థక్రియాకారిగా) కనిపిస్తూ ఉన్నా మాయా మాత్రమే (అసత్యమే) కాని యదార్థం (సత్యం) కాదు. ఫాల్గుణ మాసాంతంలో చెట్లయొక్క ఆకులన్నీ రాలిపోతూ ఉంటాయి. చైత్రమాసంలో మళ్లీ తృణగుల్మ లతాదులు చిగురాకులతోను, పూతపిందెలతోను తులదూ గుతూ ఉంటాయి. వీటిని మళ్లీ చిగిరింపచేసే రసం భూమినుంచే వాటికి వచ్చింది. అలాగే ఈ ప్రపంచం అంతా రసస్వరూపుడైన పరమాత్మ నుంచే వస్తోంది. బంగారంలో మనకు కనిపించకుండా ద్రవత్వం ఉంది. పరమాత్మలో ప్రతి అణువులోనూ, జీవసంఘం అనుభవించదగిన ప్రపంచం ఉంది. ఇకముందు ఉండగలదు కూడా. అవయవములు అవయవికంటె వ్యతిరేకములు (భిన్నములు) కావు. ప్రపంచం బ్రహ్మకంటె వేరుకాదు. ఇంత మాత్రంచేత ప్రపంచ బ్రహ్మలకు అవయవావయవి భావము గ్రహించకూడదు. ప్రపంచం బ్రహ్మ భిన్నం అనుటలోనే ఈ దృష్టాంతం. ఒకనికి కలలో మరొకనితో యుద్ధం తటస్థించితే, వాడికప్పుడు ఆ యుద్ధ మాడేవాడు నిజంగా ఉన్నట్లు తోచినా, ఇతరులకు మాత్రం వాడు లేని వాడే. అయినా ఆ యుద్ధమాడేవాడు, ఆ స్వప్నదశలో, కలగాంచువాని యొక్క ఆత్మరూపుడే కాని వేరుకాదు. అలాగే మాయికమయిన

ప్రపంచం మాయికునిద్వారా సత్యంగా గోచరించినా, తత్త్వవేత్తల దృష్టిలో లేనిదే. మాయికుల దృష్టిలో ఉన్నట్లు కనిపించింది కూడా పరమాత్మ స్వరూపంగా ఉన్న దేకాని, పృథక్స్వరూపంతో ఉన్నది కాదు. ప్రపంచం మహా ప్రళయంలోనూ, సృష్టి ప్రారంభంలోనూ, (ఆద్యంత కాలములందు) సద్రూప బ్రహ్మ మాత్రము. కనుక మధ్యకాలంలో (స్థితికాలంలో) కూడ సద్రూప బ్రహ్మ మాత్రమే. సృష్ట్యనంతరం పరస్పర కారణత్వం కూడా (ఒకదాని కొకటి కారణమగుట కూడా) కల్పితంకాని వాస్తవం కాదు. సర్వప్రపంచాకారంగా పరిణమించిన పూర్వ పూర్వ హిరణ్యగర్భుల యొక్క స్మృతికల్పితము కనుక ఈ ప్రపంచం అధిష్ఠాన సన్మాత్రమనక తప్పదు. అన్నాడు వసిష్ఠుడు.

మహాత్మా! విదూరథుని వంశక్రమమూ, అతని మంత్రి ముఖ్యులకూ, పురజనులకూ, ఏకరూపంగానే గోచరించుటకు కారణమేమి? ప్రాణులకు వాసనలు విచిత్రంగా ఉండటం సహజం కదా? వాసనా భేదాన్ని బట్టి జ్ఞాన భేదమూ, క్రియాభేదమూ అనివార్యం కదా? అది ఎందుకు ఇచట లేదు. అని అడిగాడు శ్రీరాముడు మళ్లీ.

రామచంద్రా! విను సమాధానం. పెద్దగాలిని అనుసరించే పోతాయి సామాన్యగాలులన్నీ, తూర్పునుంచి పడమరకు ఒక పెద్దగాలి వీస్తూ ఉంటే చిన్నగాలి దాని కెదురుగా వీచలేదు. అలాగే ప్రధాన జీవులయొక్క సంవిత్తును (జ్ఞానమును) అనుసరించే ఇతర జీవుల సంవిత్తు కూడా (జ్ఞానం కూడా) ఉంటుంది. అది సృష్టి యొక్క సంకల్పబలం. అది తప్పదు. ప్రజాపాలుడూ, ప్రజలూ, పురవాసులూ, మంత్రులూ, ఒకరినొకరు అనుసరించి ఉండే ఏకరూపమయిన అదృష్టం ఉంటుంది. దానివల్ల వాళ్లందరకూ ఐకమత్యం సిద్ధిస్తుంది. విదూరథుని పురంలో ఉండేవారంతా ఇలాంటివారు. కనుకనే మంత్రులకునూ, పౌరులకునూ వంశపరంపర ఒక్క తీరుగనే కనిపించింది. అయితే ఉదాసీనమయిన అధిష్ఠాన చైతన్యం, ఇట్లు అధ్యస్త విషయాకారంగా ప్రకాశించటానికి కారణమేమి? అని ఒక ప్రశ్న పుట్టుతుంది. కాని ఆ ప్రశ్న వేయతగింది కాదు. చైతన్యము యొక్క ప్రకాశనుగురించి కారణాన్వేషణ మనం చేయతగదు. దానికి

ప్రకాశం అనేది సహజం. విచిత్ర విషయాకారంగా ప్రకాశించటానికి కారణం మాత్రం అడగవచ్చు. ఎలాగంటే "చింతామణి ప్రకాశించటం ఎందుకు" అని ప్రశ్న అనవసరం. మణికి ప్రకాశించటం అనేది సహజం. కాని అది మానవుల చిత్రవిచిత్రములయిన కోర్కెలను తీర్చుటేల? అని ప్రశ్నించవచ్చు. అప్పుట కోరువారియొక్క మనోరథవైచిత్ర్యమే కారణ మని సమాధానం. చింతామణి కోర్కెలను తీర్చినట్లు చిన్మణి కూడా "నేను రాజుగా పుట్టుదునుగాక" అనే విదూరథుని కోర్కెను తీర్చింది. ఒక అద్దంలోని ప్రతిబింబాన్ని మరొక అద్దం గ్రహిస్తుంది. అలాగే ఒక జీవచైతన్యంలోని విషయాలను మరొక జీవచైతన్యం ఆరోపించుకుంటుంది. ఆ జీవ సంవిత్తులలో ఏది చాలకాలము బ్రహ్మాకార వృత్తికలదై, విషయ దోషాలచే కదలకుండా, మోక్షపర్యంతం ఏకరూపంగా ఉంటుందో, ఆ జీవ సంవిత్తు స్థిరమయిన మోక్షాన్ని పొందుతుంది. కనుక జీవచైతన్యంలో ప్రపంచాకార వాసనలు వేగంగా ఉంటే ప్రపంచాకారం ఏర్పడుతుంది జీవుడికి. బ్రహ్మాకార వాసనలు వేగంగా ఉంటే మోక్షం సిద్ధిస్తుంది. అయితే ప్రపంచాభిముఖుడయిన జీవుడికి, ప్రాపంచిక చిద్విలాసాలే చిరాభ్యాసంలో ఉంటాయి. అందువల్ల వీడికింక మోక్షంయొక్క ఆశయే ఉండదుకదా? అనే శంక కలుగుతుంది. కాని అది సరియయినదికాదు. ప్రయత్నరహితమయిన పూర్వ జన్మ వాసనల వేగం కంటె ప్రయత్న సంపాదితమయిన బ్రహ్మాకార వాసనా వేగం ప్రబలం. కనుక బ్రహ్మా కార వాసనావేగమే, ప్రపంచాకార చిద్విలాస వేగాన్ని జయిస్తుంది. కాక సత్యవస్తువును ఆధారపరచుకున్నది బ్రహ్మాకార వాసన. ఇది ప్రబలం. అసత్యవస్తువును ఆధారపరచుకున్నది ప్రపంచాకారవాసన. ఇది దుర్బలం. కనుక బ్రహ్మాకార సంవిత్తులే (చిద్విలాసములే) జీవుణ్ణి స్వాధీనపరచు కుంటాయి. సముద్రమునుగూర్చి వెళ్లే మహానది, తనలో చేరిన పిల్లనదులను తాను స్వాధీనపరచుకుంటుంది. వాటిని సముద్రానికి తీసికొని పోతుంది. అదే చందం ఇక్కడ కూడ. "బ్రహ్మాకార వృత్తులు తీవ్రవేగంలో ఉన్నపుడు ఇలాంటి జయం తటస్థించవచ్చు. అవి తీవ్రవేగంలో లేని మంద మధ్యమాధికారుల గతియేమి? వాళ్ల చిత్తం స్థిరపడలేదుకదా బ్రహ్మాకార వృత్తిలో. అప్పుడప్పుడు బ్రహ్మాకార వృత్తులూ, అప్పుడప్పుడు ప్రపంచా

కార వృత్తులూ సమానంగా కలుగుతూ ఉంటాయికదా? వాళ్లు మోక్షం పొందటం ఎలా?" అని సందేహిస్తారు కొందరు. వాళ్లకు సమాధానం ఇది. అలాంటి మధ్యమాధికారులు ఎల్లకాలం తూక ప్రకారం సమాన వేగంగల వృత్తులుగలవాళ్లుగానే ఉండరు. వాళ్లు నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉంటారు. బ్రహ్మాకార వృత్తి చిత్తంలో స్థిరపడేంతవరకు శ్రవణమననాదులను ఆ వృత్తి చేస్తూనే ఉంటారు. ఇలా అభ్యాసంచేయగా వాళ్ల చిత్తంలోకూడా క్రమంగా బ్రహ్మాకార వృత్తి తీవ్రవేగాన్ని జెందుతుంది. ప్రపంచాకారవృత్తులు జయించబడతాయి దానిచే. మోక్షం సిద్ధిస్తుంది. జీవులందరూ ఔపాధికంగా పరిచ్ఛేదాన్ని ఆరోపించుకున్నారు. అలాంటి జీవసంఘాలతో సమంగానూ, విషమంగానూ. అనేకవేల సృష్టులు జరిగాయి, జరుగుతున్నాయి, ఇంకా జరుగనున్నాయి. కాని పరమార్థ దృష్టిలో విచారిస్తే ఏ జీవుడూ ఎంత పరుగెత్తినా పొందేదేమీ లేదు. ఉదాసీనంగా ఊరకున్న జీవునకు పోయిందీ లేదు. నిజస్థితిలో వీడే లేకపోతే వీడికి పొయ్యేదేమిటి? వచ్చేదేమిటి? కాబట్టి పరమార్థంలో ప్రపంచం ప్రశాంతమయిన చిదాకాశరూపం. వ్యవహారంలో నిద్రలేని స్వప్నంగా భాసిస్తోంది. ఆత్మబోధ అనుభవంలో ఉన్నా లేనిది అయింది. ఒకేచెట్టు పత్రపుష్ప ఫలాంశాలతో ఉన్నట్లు, ఒకే ఆత్మ అనంతశక్తులతో నిండి ఉన్నాడు. ఇలాంటి ఆత్మతత్త్వం తెలిసికొంటే మాత్రం ఎవడికీ, ఎన్నటికీ మరపుకురాదు. రాదగిన కారణం కూడా లేదు. తెలిసికొనునంతవరకూ భిన్నంగా గోచరిస్తూ ఉంటుంది. అజ్ఞానమును ప్రకాశింపజేసేదీ, దేశకాల రూపములుగలదైనా పరిశుద్ధమైనదీ, ఉదయాస్తమయములు లేనిదీ, ఆత్మ వస్తువు ఒక్కటే. నిర్మలమయిన నీరు అలలతో కదులుతూ ఉన్నా, నిశ్చలంగా ఉన్నా, జలస్వరూపంలో భేదం లేదు. కాబట్టి అది ఒక్కటే. అలాగే పరమాత్మ ప్రపంచాకారంగా భాసిస్తూ ఉన్నా, ప్రశాంతంగా ఉన్నా ఆత్మరూపంలో అద్వితీయమే. విశుద్ధ బోధ స్వరూపమయిన బ్రహ్మప్రకాశమే, సంకల్ప వికల్పాత్మకమయిన మనస్సువల్లనూ, దానికి మూలకారణమయిన అవిద్యా కామకర్మవాసనలవల్లనూ, "నేను" "నీవు" అనే కల్పిత ప్రపంచాకారాన్ని చెందుతోంది. ఆకాశంలోని ఒక భాగంలో ఉన్న శూన్యత్వమే, ప్రదేశంగానూ, మలినంగానూ, మాళిక్తకంగానూ,

వెంట్రుకల కొప్పుగానూ, కటాహాకారంగానూ (గంగాళము) భాసిస్తూ ఉంది. అన్నాడు వసిష్ఠుడు.

## ౬౧ జగత్స్వరూప వర్ణనము

స్వామీ! అనాత్మలయిన దేహాదులందు, ఆత్మభావనకు తగిన కారణం లేదు. అయినా "అహం" అనే భ్రాంతి పుడుతోంది. పరమాణువు యొక్క ఉదరంలో విశాలమయిన ప్రపంచం ఉండటానికి కారణం లేక పోయినా ఉన్నట్లు భ్రాంతి కలుగుతోంది. ఒక్క క్షణకాలంలో అనేక వేల సంవత్సరాలు జగత్తు ఉన్నట్లు భ్రాంతి కలుగుతోంది. ఈ భ్రాంతులకు (ఈ కల్పనలకు) క్రమం ఏమిటి? యుక్తి ఏమిటి? విపులంగా, నా మనస్సుకు పట్టే యుక్తులతోటి ప్రతిపాదించి చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! భ్రాంతులన్నీ ఆత్మస్వరూప చైతన్యంలోనే కలుగుతున్నాయి. ఎల్లప్పుడూ అక్కడనే తెలుసుకుంటున్నాడు భ్రాంతుడు. ఒక్కటికూడా ఆత్మచైతన్యమునకు వెలుపల, కలగడంలేదు. కనుక సర్వ ప్రపంచమూ సర్వాత్మకమయిన పరమాత్మే. అతడే నిజంగా ఉన్నవాడు. ప్రపంచ భ్రాంతి నిష్కారణంగానే బయలుదేరుతోంది. భ్రాంతిలో విషయములగు శబ్దార్థములు వేరయినా, వాటి జ్ఞానం మాత్రం సమానాకారమే. దానికి భేదం లేదు. అలాంటి అభిన్నజ్ఞానమే బ్రహ్మపదార్థం. బంగారంకంటె కటకత్వమూ, జలముకంటె తరంగత్వమూ, వేరుకాదు. అలాగే ఈశ్వరునికంటె ప్రపంచం కూడా వేరుకాదు. వేరుగా ఉన్నపుడు కారణాన్ని అన్వేషించాలి. వివర్తమగు వస్తువునకు పృథక్కుగా ఉనికి లేదు. నిజమయిన వస్తువులతో బ్రహ్మ తాదాత్మ్యం చెందటం కుదరదు కాని, అనృతములు ఎన్ని అయినా వానితోటి తాదాత్మ్యం బ్రహ్మకు విరుద్ధము కాదు. సర్వప్రాణులకు అంతఃకరణములోనున్న బ్రహ్మస్వరూప జ్ఞానమే, ప్రపంచమనీ, నేననీ భిన్నంగాభాసిస్తోంది. స్ఫటిక శిలోదరమందు, వనపంక్తుల ప్రతిబింబములు ఎన్ని అయినా సమావేశము కావచ్చును. అలాగే చిద్ఘన పదార్థమందు, స్వాభిన్నమయిన ప్రపంచ భ్రాంతులు ఎన్ని అయినా చేరుటలో విరోధం లేదు. నీటిలో తరంగములు తరంగ

స్వరూపాన్ని విడచి. జలస్వరూపంతో ఉన్నట్లు, సృష్టిశబ్దార్థములు లేకుండా సృష్టులన్నీ పరమాత్మయందు ఉన్నాయి. నిజం విచారిస్తే ప్రపంచంలో పరమాత్మ లేదు. పరమాత్మలో ప్రపంచం లేదు. పరమార్థ చిద్రూపుడగు బ్రహ్మ అజ్ఞాన ప్రతిఫలితమయిన స్వసంవిత్తిచే ముందు తనను అజ్ఞానావృతునిగా కల్పించుకుంటాడు. ఆపైన క్రమంగా శబ్దతన్మాత్రాది కల్పనలతోటి పంచభూతముల సృష్టి కల్పన యావత్తూ జరిగింది. ఈ సృష్టి యావత్తూ లేనిదయినా, మూలాజ్ఞానంలోని అధిష్ఠాన సత్తచే సత్కల్పముగా (ఉన్నట్లుగా) భాసిస్తుంది. తేజస్సునందలి భాస్వరత్వము (ప్రకాశము) భిన్నంగా చూస్తే, అసత్యము. అభిన్నంగా చూస్తే సత్యము. బురదమట్టిలో తయారుచేయని బొమ్మ ఉన్నట్లూ, కొయ్యలో చెక్కని బొమ్మ ఉన్నట్లూ, మసిబొగ్గులో నలుపురంగు ఉన్నట్లునూ, ప్రపంచ సృష్టులు పరమాత్మయందు ఉన్నవి. బ్రహ్మతత్త్వమనే మరుభూమిలో, ప్రపంచమనే మృగతృష్ణిక, లేనిదే ఉన్నట్లు భాసిస్తోంది. పాలకు, మాధుర్యమూ, సూర్యకిరణములకు, వేడిమీ, నీటికి ద్రవత్వమూ, గాలికి చలనమూ, భిన్నము కాదు. అభిన్నము. కాబట్టి ఈ ప్రపంచానికి కారణం లేదు. వాసనావాసితమయిన మనస్సుచే తెలియబడుతూ ఉన్నది. మనో నాశం అయితే నశిస్తుంది. మనోనాశమునకు జ్ఞానయోగమును దృఢంగా అభ్యసించే పురుషప్రయత్నం అవసరం. ఈజ్ఞానం ఉదయాస్తమయములు లేనిది. పరమశాంతము, అజము. రాతివలె అతిఘనము. వాసనావాసితమయిన చిత్తం ఉన్నంతవరకూ పరమాణువుయొక్క కడుపులోదాగి సృష్టి పరంపర తప్పదు. కనుక ప్రపంచ పరిస్థితి అంతా మిథ్య కాని, సత్యమెన్నటికినీ కాదు. వైరాగ్యసంపద గట్టిగా ఉన్నట్లయితే, జ్ఞాన యోగాభ్యాసంలోని పురుషప్రయత్నం పూర్ణంగా ఫలిస్తుంది. కనుక ముందు వైరాగ్యం అత్యవసరం. ఇందుకు ప్రమాణంగా అనేక శ్రుతి స్మృతులు కలవు. శ్రు॥ కామాన్యః కామయతే మన్యమానః సకామభిర్జాయతే తత్రతత్ర । పర్యాప్త కామస్య కృతాత్మనశ్చ ఇహైవసర్వే ప్రవిలీయంతి కామాః ॥ కోరికలను కోరువాడు, కోరికలనుకూలంగా అక్కడక్కడ పుటుతూ ఉంటాడు. విరాగునకు అన్ని కోరికలు ఇక్కడనే నశిస్తాయి స్మృ॥ "నివర్తనాద్ధి సర్వతో నవేత్తి దుఃఖమణ్వపి" అన్నిటినుంచి నివృత్తి

డయినవానికి దుఃఖము లేశముకూడ ఉండదు. కనుక తత్త్వం పదార్థముల యొక్క అఖండైక్యజ్ఞానమే, అజ్ఞానాన్ని రూపుమాపుతుంది. మిగిలిన జ్ఞానములకు ఆ శక్తి లేదు. ఈ జ్ఞానం కలవాళ్లే ప్రపంచాన్ని జయిస్తారు.

## ౬౨ దైవ శబ్దార్థ నిరూపణము

రామచంద్రా! పరమాణువు యొక్క లక్ష భాగంలో కొన్ని వేల బ్రహ్మాండాలు ఇమిడి ఉంటున్నాయి. నిముషము యొక్క లక్షభాగంలో కొన్ని వేల కల్పములు గడచిపోతున్నాయి. ఇదంతా కల్పనామాత్రమైన భ్రాంతి కాని సత్యము కాదు. అన్నారు వసిష్ఠులు.

విన్నాడు శ్రీరాముడు. ప్రపంచం మిథ్య అనే నిర్ణయానికి తాను కూడా వచ్చాడు. అది తత్త్వజ్ఞానం చేత కాని నశించదనుకున్నాడు. ఆ పైన ఇలా అడిగాడు. "స్వామీ! సమ్యగ్విచారణవల్ల, అద్వితీయ నిర్వికల్పాత్మక విజ్ఞానం కలిగితే అలాంటి తత్త్వవేత్తలకు కూడా దేహాలు ఇంకా ఎందుకు నిలిచి ఉంటున్నాయి. దేహేంద్రియాదులు దైవాధీనములు కదా! తత్త్వ వేత్త విషయంలో దైవం ఏమి చేయగలదు? "తస్యహాన దేవాశ్చనాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాంసభవతి" తత్త్వవేత్త దేవతలకు కూడ ఆత్మరూపుడు కనుక, వారుకూడ ఇతనికి విఘ్నములు కలుగచెయ్యలేరు. అని శ్రుతి చెబుతోందికదా! దైవానికి తత్త్వవేత్తల విషయంలో ఏమీ సామర్థ్యం లేదని శ్రుతి చెబుతూ ఉండగా తత్త్వవేత్తల శరీరాలు ఇంక దేనిని అధారపరచుకుని ఉన్నాయి? సెలవివ్వండి" అన్నాడు రాముడు.

రామచంద్రా! లోకంలో ప్రాణుల అదృష్టమనే (పురాకృతశుభాశుభ కర్మ అనే) వస్తువు సహకారిగా చేసికొన్న ఈశ్వర సంకల్పంవల్లనే సర్వ వ్యవహారము జరుగుతోంది. దీనికే నియతి అనిపేరు. ఇట్టి నియతికి వశంమయియే తత్త్వవేత్తల శరీరాలు కూడా నిలిచి ఉన్నాయి. ఆది సృష్టిలో పరబ్రహ్మ, నిప్పు వెచ్చగా ఉండాలి. నీరు చల్లగా ఉండాలి. నేల గట్టిగా ఉండాలి? గాలి కదలుతూ ఉండాలి, ఆకాశం శూన్యంగా ఉండాలి. లోకాలూ లౌక్యవస్తువులూ ఇలా ఇలా ఉండాలి" అని సంకల్పిం

చాడు. ఆయనగారి మహా సంకల్పానికే నియతి అనే పేరు పెట్టారు. ఇదంతా వ్యవహార దృష్టిలో కాని పరమార్థ దృష్టిలో బ్రహ్మసత్తయే కాని మరేమీలేదు సుమా! బ్రహ్మ అన్నా, నియతి అన్నా, సృష్టి అన్నా తత్త్వజ్ఞుల దృష్టిలో శబ్దభేదంకాని, అర్థభేదం కాని ఏమీలేదు. అంతా బ్రహ్మ స్వరూపమే. ఇలాంటి నియతిని చతుర్ముఖ బ్రహ్మ గ్రహించి తదనురూపంగా ప్రపంచం సృష్టించాడు. ఇలాంటి నియతిని దైవం అని అంటారు పెద్దలు శాస్త్రజ్ఞులు. దీని నిజరూపం అజ్ఞానానాస్కందితమైన (అజ్ఞానంతో కూడియుండని) చైతన్యమే. ఇదే సర్వకాలములందునూ, సర్వపదార్థాలనూ ఆక్రమించి జగద్వ్యవస్థను ఏర్పరచుచున్నది. ఇది ప్రాణుల అదృష్టాన్ని సహాయంగా చేసుకుంటుంది. ఆ అదృష్టం ఈ నియతిని సహాయంగా చేసికొంటుంది. ఈ రెండూ అన్యోన్య సహాయం చేత త్రిభువనములు ఉండునంతవరకు, వ్యవహరిస్తూ ఉంటాయి. ప్రళయంలో ఈ రెండూ ఏకమై పోతాయి. (ఏకరూపంగా ఉంటాయి) ఈ నియతి అదృష్టములు రెండూ పురుష ప్రయత్నాన్ని అనుసరించే ఉంటవి. ఈశ్వర సంకల్పం అలా ఉన్నది. రామా! పెక్కు మాటలెందుకు? నీవు నన్ను శిష్యుడుగా అడుగుట, నేను నీకు గురువుగానుండి చెప్పుట, నేను చెప్పినట్లు నీవనుష్ఠించుట, ఇదంతా నియతివల్లనే జరుగుతోంది. ఏవ్వడేని యొకడు దైవాన్నే నమ్మి పురుష ప్రయత్నం చేయకుండా, ఆజగరవ్రతమును, అవలంబించి ఉండేటట్లయితే, వాడు అలా ఉండటానికి తగిన పురాతన కర్మ వుండి, దానివల్ల ఉద్బుద్ధమయిన నియతివల్లనే అని గ్రహించు. లోకంలో ఎవ్వడైనా "నాకు దైవమే అన్నం పెడుతుందని" ప్రయత్నంలేకుండా వుండే యడల, వాడికి పురాకృత కర్మ సహకృతమైన నియతివల్లనే ఆ నిశ్చయం కలిగిందనాలి. కాబట్టి నియతికి వశములై ఈ పదార్థాలన్నీ ఇలా ఉంటున్నవి. దీనిని తప్పించుకొనుట రుద్రాదులకు గూడ సాధ్యము కాదు. అయిననూ, దీనిని ఆధారంగా జేసికొని పురుష ప్రయత్నాన్ని మానుకోకూడదు. పురుష ప్రయత్న రూపంతోనే నియతి లోకాన్ని నియమిస్తూ ఉంది. పురుష ప్రయత్నాకారాన్ని చెందని ఈశ్వరసంకల్పం నియతి అనబడుతుంది. పురుష ప్రయత్నాకారాన్ని చెందిన నియతి పౌరుషమనబడుతుంది. పురుష

ప్రియత్నరూపంగా పరిణమించలేకపోతే నియతి వ్యర్థమవుతుంది. తద్రూపంగా పరిణమిస్తే ఫలిస్తుంది. నియతిని నమ్మి తన ప్రయత్నం మానుకొని, నిష్క్రియంగా ఉన్నవాడు, ఏమీ ఫలం పొందలేడు. ఆకలిగొన్నవాడు కూడా, అన్నానికి ప్రయత్నించకుండా, కొంతకాలం బ్రతికి ఉన్నాడంటే, అది కూడా ప్రాణచలనానికి అనుకూలమైన పురుషప్రయత్నం ఉంటేనే జరుగుతుంది. ఎవ్వడయినా ప్రాణనిరోధంచేసి నిర్వికల్ప సమాధివల్ల మోక్షం పొందినాడంటే, అది (ప్రాణవాయు నిరోధము) మొదలయిన పురుషప్రయత్నం యొక్క ఫలమనే గ్రహించాలి. శాస్త్రీయమయిన పురుష ప్రయత్నానికి అభిముఖుడగుట సాధనరూపంలో శ్రేయస్సు. అకర్తృత్వ లక్షణమైన మోక్షము ఫలరూపమున శ్రేయస్సు. ఈ సాధ్య సాధన శ్రేయస్సులచే జ్ఞానులయొక్క పక్షమే ఉత్తమము. ఇదియే దుఃఖరహితమయిన స్థితి. ఇది జ్ఞానులయొక్క నియతి. ఇలాంటి దుఃఖాత్యంతా భావరూపమయిన నియతియే బ్రహ్మసత్తా స్ఫూర్తి. దానియందు మానవుడు ప్రయత్నించి స్థిరపడితే, మోక్షము కరతలామలకమవును.

## 63 చిత్త వికార వర్ణనము

ఈ మాయాశబలమయిన బ్రహ్మతత్త్వమే, సర్వవస్తువులందూ, సర్వకాలములందూ, సర్వదేశములందూ, సర్వశక్తులూ కలిగి, సర్వాకారమై, సర్వజ్ఞమై, సర్వప్రపంచమును నియమించుచున్నది. ఈయది సర్వశక్తులూ కలదగుటచే ఒకానొకచో అంతఃకరణోపాధియందు జీవ భావంతో ప్రవేశించి, చిచ్ఛక్తిని ప్రకటించుచున్నది. సాత్త్వికోపాధియందు శమదమాది సంపత్తునూ, తామసోపాధియందు జడశక్తినీ, రాజసోపాధులందు రాగలోభాదులనూ, ఒకానొకచోట విశేషించి చెప్పనలవికాని చిత్రము నూ, ప్రకటిస్తూ ఉంది. సుషుప్తి ప్రళయములందు మాత్రము దేనినీ ప్రకటించదు. ఇందు ఇతని సత్యసంకల్పమే కారణము. ఈ చిచ్ఛక్తి యొక్క ఆవిర్భావతిరోభావములను బట్టియే ప్రపంచ స్థితి యొక్క వైచిత్ర్యం జరుగుతోంది. శక్తీ శక్తిమంతుడూ అనే భేదం వ్యావహారికం కాని పారమార్థికం కాదు, ఈ వికల్పజాలం అంతా లోకంలో వ్యవహారం కొరకు బుద్ధిమంతులచే కల్పింపబడినది కాని పరమార్థం కాదు. ఊర్మితరంగ

పయస్సులకు సముద్రముతోనూ, కటకఅంగదకేయూరములకు బంగారముతోనూ, అవయవావయవులకునూ, భేదము వ్యుత్పాదకులయొక్క బుద్ధిచే కల్పితముకాని, యధార్థముకాదు. ఏలయన ఏయే రజ్జ్వాదులు సర్పాదులుగ తెలియబడుచున్నవో ఆయారజ్జ్వాదులే ఆయాసర్పాదులుగ వివర్తమగుచున్నవి కాని, పరమార్థముగ పాము మున్నగునవి అచటలేవు. సాక్షి చైతన్యమే, అను భావుకుల అదృష్టముచే ఉద్బుద్ధమై ఒకానొకచోట ఒకానొకదానిని భ్రాంతిచే చూస్తూ ఉంటుంది. అంతటా అన్నిటినీ చూడదు. తన స్వరూపాన్ని తాను గ్రహించదు. పరమార్థంగా విశాలమయిన ఈ ప్రపంచం అంతా బ్రహ్మాకారమే. ఆ బ్రహ్మము శక్తి విశిష్టము కాదు. ప్రపంచము అవయముగా కలదియుకాదు. శక్తి శక్తిమద్భావమూ, అవయవావయవి భావమూ మిథ్యాజ్ఞానులచే కల్పింపబడినది కాని, నిజంలో ఉన్నవి కావు. కనుక, మిథ్యాజ్ఞానోపహితమైన చిత్తు (చైతన్యము) శాస్త్రానుగుణమైన దానిని కాని, శాస్త్ర ప్రతికూలమైనదానిని కాని దేనిని అనుష్ఠించదలచి సంకల్పిస్తుందో, దానియందు పట్టుదలతో ప్రయత్నం చేస్తుంది. విహిత నిషిద్ధకర్మలను ఆచరిస్తుంది. ఫలానుభవకాలంలో ఆయా దానిని తెలిసికొంటుంది. కనుక ప్రథమ సృష్టి సంకల్పము మొదలుకొని, భూత, భౌతిక దేహ, భోగ్యసృష్టితో పురుషులయొక్క భోగమువరకు నుండు సకలప్రపంచాకారంగా బ్రహ్మచైతన్యమే ప్రకాశిస్తోంది. వేరొకటి లేదు.

## ఉళ ఉత్పత్తి బీజాంకుర నిర్ణయము

సర్వవ్యాపకుడయిన పరమాత్మయే, నిర్మలుడై ఆనందరూపుడై ఆద్యంతరహితుడై ఉన్నాడు. వానినుండి మొట్టమొదట జీవోపాధి అయిన లింగసమష్టి ఉపాధి పుట్టి, ఆపైన జీవుడు పుట్టాడు. ఆ జీవుడే ఉపాధికి ప్రాధాన్యముచే చిత్తమనబడుచున్నాడు. దాని నుండియే జగత్తు అంతా బయలుదేరుతోంది. అన్నారు వసిష్ఠులు.

స్వామీ! అఖండాద్వితీయ స్వప్రకాశమయిన బ్రహ్మయందు, సఖండ సద్వితీయమైన జీవునికి ఉనికి ఎలా కలిగింది. ఇది బ్రహ్మత్వానికి విరుద్ధం కదా? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! అవిద్యారహితమైన బ్రహ్మయందు పరమార్థ దృష్టిలో జీవునకు ఉనికి లేదు. అవిద్యాదశలో మాత్రం జీవుడికి సత్త (ఉనికి) కలదు. పరమార్థంలో ద్వైత ప్రత్యయరహితమూ, సర్వ వ్యాపకమూ, చిద్ఘనమూ, అనాత్మయోగులకు భయంకరమూ, అను బ్రహ్మపదార్థ మొక్కటే ఉంది. ఆ బ్రహ్మ పదార్థానికి తనయందున్న కర్మ బీజములచే, ఉపాధి స్వభావాన్ని అనుసరించి చలనం ఏర్పడుతుంది. దానివలన ప్రాణధారణకళ కలిగి జీవసంజ్ఞ ఏర్పడుతుంది. కనుక నిశ్చలమైన సముద్రమువలె పరిపూర్ణమయిన బ్రహ్మకు స్పందము కలగడమే జీవత్వము. దీనిచే కించిజ్ఞత్వము ఏర్పడుతుంది. ఇలాంటి జీవభావము మోక్ష పర్యంతమూ తప్పదు. గాలికి చలనము తప్పదు. నిప్పుకు వేడిమి తప్పదు. మంచుకు చల్లదనము తప్పదు. ఆత్మకు అవిద్యాదశలో జీవత్వమూ తప్పదు. ఇతనికి వాసనలు దృఢంగా ఉంటే అహంకారం ముదురుతుంది. అగ్నికణానికి, ప్రజ్వలింపజేసే కాష్ఠాదులు దగ్గర ఉంటే, మంట పెరుగు తుంది. మనము పైకి (ఆకాశానికి) చూస్తూ ఉంటే, మన కన్ను ఆ నభో మార్గంలో ఎంతవరకు చూడగలుగుతుందో, అంతవరకూ మనకు నలుపు తనము గోచరించదు. తెల్లగానే కనిపిస్తూ ఉంటుంది. ఎంతవరకు వెళ్ళి కన్ను ఇంక చూడలేక కుంటుపడుతుందో, అక్కడ నుంచి ఆ పైభాగంలో నలుపురంగు లేకపోయినా, ఈకంటికి ఆకాశమునందు నలుపుతనం స్ఫురిస్తూ ఉంటుంది. ఇదేచందంగా, తన స్వరూపం తనకు గోచరించేటప్పుడు తనకు అహంభావన (నేను అను బుద్ధి) కలుగదు. తనస్వరూపం తనకు గోచరించక పోయేసరికి తనయందు అహమను భావన కలుగుతుంది. ఇది ఘనమైన పూర్వజన్మ సంస్కారంవల్ల కలిగినవింత. ఆకాశం నలుపు అనుకొనుటకూ, జీవుడు "అహమ్" ("నేను") అనుకొనుటకూ భేదంలేదు. ఈఅహమధ్యాసను నిమిత్తంగా చేసికొని, చిత్తమూ, మనస్సూ, జీవుడూ, మాయా, ప్రకృతీ అనే పేర్లతో అనేక అధ్యాసలు కలుగుచున్నవి. తరువాత సంకల్పాత్మక మయిన చిత్తం, భూత తన్మాత్ర కల్పనను చెంది. పంచత్వాన్ని చెందుతోంది (అయిదు విధములవుతోంది) క్రమంగా హైమమయిన అండమూ, హిరణ్యగర్భుడూ, స్థూల సమష్టి రూపుడయిన విరాట్టుగానూ తయారవుతోంది. వ్యష్టిలో స్థూలదేహ భావాన్ని చెందు

తోంది. పుణ్యవాసనలతో దేహాది దేహభావాన్ని చెంది అమరావతీపురం చేరుతోంది. పాపవాసనలతో స్థావరత్వాన్ని చెందుతోంది. క్రమంగా యక్ష రక్షః పిశాచాదులుగానూ, పశుపక్ష్యాదులుగానూ, జలచర జంతువులుగానూ, అదే చిత్తం సంకల్పాత్మకమై బ్రహ్మగా తయారవుతోంది సూక్ష్మదేహ సమష్టి ఉపాధికుడగు ఆత్మ (విరించి జీవుడు) తనసంకల్పం వలననే ప్రపంచమును సృష్టించుచున్నాడు. అతడు వెనుకటి జన్మయందు చేసిన ఆత్మోపాసనాబలంవల్లనే సత్యసంకల్పుడయినాడు. ప్రపంచానికి రెండు ధర్మాలు సహజములు. ఒకటి ప్రకాశించుట (కనిపించుట) రెండు, చలనాది వికారములను పొందుట. ఇందు, చిదాత్మ (జీవుడు) ప్రపంచ స్ఫురణకు కారణం. అతడుచేసిన కర్మ చలనాది వికారములకు కారణం. నీటిలోని నురుగుముద్దయే, నీటిలోనున్న పడవలకు కట్టే మోకు (త్రాడు) వల్ల అడ్డగింపబడుతుంది కాని, నీరు అడ్డగింపబడలేదు. అనగా ఆ త్రాడు వల్ల నీటిమీది నురుగు అడ్డుతుందికాని, నీరు అడ్డదు. అలాగే దేహముతో చేసిన కర్మలవల్ల చిత్తమే బంధింపబడుతుంది కాని, ఆత్మ బంధింపబడదు. లోకంలో కూడా కుమ్మరి మొదలయినవారు సంకల్ప పూర్వకంగానే పనిచేసి ఘటాదులను తయారు చేస్తారు. కనుక జీవుడు సంకల్పరూపుడనక తప్పదు. నిష్క్రియాత్మనుంచి లేచివచ్చి జీవుడు క్రమంగా కర్మలు చేస్తున్నాడు. విత్తనంలో చెట్టుయొక్క పత్రపుష్ప ఫలాంకురాది రూపం అంతా ఇమిడి ఉంది. అలాగే జీవునియొక్క దేహాద్యాకారం కూడా తన వాసనలలోనే ఇమిడి ఉంది. దానినే జీవుడు జన్మజన్మకూ ధరిస్తున్నాడు. ఇతడు జన్మమరణములకు కారణములయిన తన కర్మలచేత ఊర్ధ్వాధో లోకములకు తిరుగుతూ ఉంటాడు. కర్మ అనగా చిత్స్పందము అనగా చైతన్యముయొక్క చలనము ఇదే దైవం. ఇదే చిత్తం ఇదే శుభాశుభ కర్మ. దీనినుంచే భోక్తలగు ప్రాణులకు అనుభవయోగ్యములైన ముల్లోకములు మాటిమాటికి పుట్టుచున్నవి. జీవుడికివి బీజాంకుర న్యాయ సిద్ధములు.

## ౭౫ జీవ విచారము

రామచంద్రా! ఈ ద్వైతాభాసము అంతా మనోఽధీనము. మనస్సుయందలి సంకల్పాలు నశిస్తే మనఃకల్పితమయిన భేదం అంతా నశిస్తుంది.

ఆపైన అనంతమయిన ఆత్మస్వరూపమే మిగులుతుంది. సత్యాసత్య వస్తువులలో అసత్యవస్తువుకు బాధకలిగితే సత్యవస్తువు మిగిలి ఉంటుంది. స్వప్నంలో చూచిన అసత్యవస్తువులు జాగ్రదవస్థలో బాధితములుకాగా స్థిరమయిన స్వప్నద్రష్ట (కలగన్నవాడు) మిగిలి ఉంటున్నాడు. ఇది లోకానుభవం. కనుకనే ప్రపంచము కేవలం అసత్తు (శూన్యం) కాదు. అనిర్వాచనీయం. మిథ్య. కేవల శూన్యానికి బాధ (నాశము) ఉండదు. ఒకానొక గుంపులోచేరి, ఇంద్రజాల మాయావృతులయిన వాళ్లందరికీ, వస్తువునందు సమానాకారమయిన భ్రమ ఉంటుంది. ఆ ఇంద్రజాలకుని మాయసోకిన వాళ్లందరికీ గచ్చకాయ రూపాయిగానే కనిపిస్తుంది. అలాగే దైవమాయలో మునిగిన వాళ్లందరికీ మాయికములైన ప్రాపంచిక వస్తువులు ఏకాకారం (సమానాకారం) గానే కనిపిస్తూ ఉంటాయి. కాబట్టి ప్రపంచం అనేది ఒక దీర్ఘస్వప్నం. ఇది మనోబలంచేత ఇంత దీర్ఘకాలం ఉంటుంది. స్వస్వరూప జ్ఞానంలేని కారణంచేతనూ, అనాత్మవస్తువులను చూచుచున్న కారణంచేతనూ, తనను చెడగొట్టే చిత్తాన్ని గూర్చి పరితాపపడడు జీవుడు. దుఃఖించడు. దయ్యం పట్టినవాడు, ఆస్థితిలో తనకు ఆవహించిన దయ్యాన్ని గూర్చి దుఃఖించడు. కనుక చైతన్యం విషయాభిముఖం అవడమే కారణం ఈ సంసారానర్థానికి. దేహేంద్రియాదులందు అహం మమాభిమానం వల్లనే స్వర్గనరకాలూ, బంధమోక్షాలూ ఏర్పడుతున్నాయి జీవుడికి. కర్మవల్ల దేహం, దేహంవల్ల కర్మ, ఇది బీజాంకుర న్యాయం అయింది వీడికి (జీవుడికి) కాబట్టి రామచంద్రా! జీవబ్రహ్మలకు భేదం లేదు. అలాగే జీవచిత్తములకు కూడా భేదం లేదు. అలాగే దేహ కర్మలకు గూడ భేదం లేదు. కర్మే దేహము. దేహమే చిత్తము. చిత్తమే అహంభావముగల జీవుడు. జీవుడే ఈశ్వరుడు. అతడే పరమాత్మ. కనుక అంతా పరమేశ్వరుడే. ఒక్కటే మాట చెప్పాను నేను. ఇది సకలశాస్త్ర విచార రహస్యము.

## ౭౭ సంసారస్థితి

చైతన్యము ఉపాధి భేదంచేత భిన్నమయినది. అగ్నికట్టెల భేదంచేత వేరవుతుంది. "అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టోరూపం రూపం ప్రతిరూపో బభూవ" అని శ్రుతి. చిత్తాధీనమయిన జీవత్వ కల్పనచేతనే, ఆత్మకు

బంధము. చిత్తాధీనమయిన, విచార తత్త్వజ్ఞానాలచేతనే ఆత్మకు మోక్షము. విచారంవల్ల ఆత్మజ్ఞానం కలిగితే సంసారదుఃఖం ఉండదు. "తరతిశోకం ఆత్మవిత్" ఆత్మజ్ఞానంకలవాడు దుఃఖమును దాటుతాడు. అని శ్రుతి చెబుతోంది. ఆకులూ, మట్టలూ, అందులో ఉండేదంటూ. ఇదే అరటి చెట్టు. ఇంతకంటె అరటి అనే శబ్దానికి అర్థం వేరేలేదు. చిత్తభ్రాంతులే జగత్తు అంతకంటె వేరే జగత్తు లేదు. జన్మమరణాలూ, బాల్య యౌవన కౌమారవార్ధక్యాలూ, స్వర్గనరకాలూ, ఇవన్నీ భ్రాంతమయిన చిత్తము యొక్క నాట్య విలాసాలు. కల్లుతాగినవాడికి చెట్లు కదులుతున్నట్లు కనిపిస్తుంది. అది వీడిలో ఉన్న మదదోషం. ప్రపంచం వేరుగ ఉన్నట్లు కనిపించడం కూడా వీడి చిత్తదోషం. చిత్తంలో ఉన్న అజ్ఞానాంధకార మనే దోషంపోతే ప్రపంచం లేదు. కట్టె విడదీస్తే మంట చల్లారుతుంది. విషయాలు తీసివేస్తే చిత్తం శాంతిస్తుంది. అపుడు జీవుడు చిద్ఘను డవుతాడు. అదే జీవన్ముక్తి. ఈ పరిస్థితి జ్ఞానమాత్రంచేత సంభవిస్తుంది. కనుక ముందు విషయాభిలాష తీసివేసుకోవలెను, దానివల్ల ఇంద్రియ నిగ్రహం కుదురుతుంది. ఆపైన సమాధి సిద్ధిస్తుంది. పిదప జ్ఞానం దృఢపడు తుంది. తరువాత జీవన్ముక్తి ఏర్పడుతుంది. అపుడు ద్వంద్వాలకు లొంగడు నిర్వికారంగా ఉంటాడు జీవుడు. దొరకినదానికి ఉబ్బడు. పోయినదానినిగూర్చి దుఃఖించడు. నిర్లిప్తుడుగా ఉంటాడు. ప్రాణాలుకూడా తృణప్రాయంగా చూస్తాడు. కోరికలు చచ్చినవాడు అన్నిట నిస్సంగుడే. ఇలాంటి మహానుభావుడికి మోక్షం అరచేతిలోని మారేడు పండు వంటిది. కనుక ఈ స్థితిని సంపాదించుకోవాలి. అన్నారు వసిష్ఠులు.

—: లీలోపాఖ్యానము సమాప్తము :—

## ౬౭ సత్యోపదేశము

రామచంద్రుడు విన్నాడు. ఈ కథ అంతా, సమష్టి జీవునివిషయంలో చెప్పిన దానిని వ్యష్టిజీవులలోకూడ స్పష్టంగా తెలుసుకోవాలనుకున్నాడు. ఇలా ప్రశ్నించాడు. స్వామీ! మనోమయుడైన ఈ జీవుడు పరమాత్మకు ఏమి అవుతాడు? అంశమా? కార్యమా? లేక అచ్చగా పరమాత్మయేనా? పరమాత్మే అయితే అతనియందు పుట్టటం ఎలా జీవుడు? ఒకవేళ పుట్టినా,

పరిణామ రూపంగా పుట్టాడా? వివర్త రూపంగా పుట్టాడా? పరిణామ రూపంతో పుట్టటం అంటే, మట్టికుండగా తయారుకావడం. వివర్త రూపంతో పుట్టడం అంటే, తాడు పాముగా కనిపించడం. పరిణామ రూపంతో అంటారా జీవుడు అనిత్యుడవుతాడు. వివర్త రూపంతో పుట్టాడంటారా? అపుడు ప్రపంచంవలె ఈ జీవుడు కూడ మిథ్యారూపుడై తత్త్వజ్ఞానంచేత బాధ్యుడు కావాలి. అసలు పుట్టనే లేదంటారా, భోగ్యవస్తువులను అనుభవించే భోక్తయే లేకపోతాడు. ఎందువల్ల అంటే, బ్రహ్మ ఆశనాయాద్యతీతుడు. ఆకలిదప్పికలు లేనివాడు. జీవుడా పుట్టలేదు. ఇంక ఈ భోజ్య వస్తువులు ఎందుకు? లేక పరమాత్మకంటె జీవుడు వేరా? వేరయితే ఆయనతో సజాతీయుడా? విజాతీయుడా? ఏదీ కుదిరేటట్లు కనిపించదే అన్నాడు రాముడు.

రామచంద్రా! విను సమాధానం. బ్రహ్మయందు, బ్రహ్మ స్వరూపంతో అభిన్నంగా ఒక శక్తి ఉంది. అదే మాయ. ఆ శక్తి ఊహించనలవికాని అనంత శక్తులు కలది. ఆ శక్తిచేత తాను పరమార్థంలో అభిన్నుడైనా, భేదాన్ని కల్పించుకుంటాడు బ్రహ్మ. ఔపాధికములైన వికారాలను తనయందే ఆరోపించుకుంటాడు. జీవవేషాన్ని, ఈశ్వర వేషాన్ని వేసుకుంటాడు. సర్వజ్ఞుడై క్రీడిస్తాడు. ఇలా బ్రహ్మ మొట్ట మొదట ద్వైత్వాన్ని చెందడమే (రెండు కావడమే) ఉత్తరత్ర సంసార ప్రవృత్తికి ముఖ్య కారణం. తరువాత జరిగే జరామరణాది ప్రపంచ వైచిత్ర్యానికి మాత్రం, పూర్వ సంకల్ప కర్మ వాసనలతో కూడుకున్న జీవ చైతన్యం కారణం అవుతాడు. అన్నారు వసిష్ఠులు.

మహర్షీ! ప్రపంచ వైచిత్ర్యానికి జీవులయొక్క కర్మవాసనలు (కర్మ సంస్కారములు) కారణం అంటిరికదా? దైవం అంటే ఏమిటి? కర్మ అంటె ఏమిటి? కారణం అంటె ఏమిటి? వివరించండి అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! రజోగుణ ప్రధానమైన మాయోపహిత చైతన్యమునకు స్పందము చెందే (చలించే) స్వభావం ఉన్నది. అలాంటి చైతన్యము చిత్తాకారమును చెందటమే స్పందము, దృశ్యాకారాన్ని చెందటం

అస్పందము. స్పందమువల్ల సృష్టికి ఉన్ముఖమవుతుంది చైతన్యము. అస్పందము శుద్ధము. అయ్యది నిష్ప్రపంచము. కనుక ఈ చిత్ స్పందమే (చైతన్యముయొక్క చలనమే) కర్మ, దైవము, కారణము, అనే పేరులతో చెప్పబడుతోంది. అందులో, ప్రాణస్పందము కారణము, శరీరేంద్రియాదుల స్పందము (చలనము) కర్మ, ఆ కర్మే సూక్ష్మావస్థలో చాలకాలం ఉంది. ఫలారంభానికి తయారై, దైవం అనబడుతోంది. ఇది అంతయూ పరబ్రహ్మ యొక్క స్వరూపంతో ఉండే, తన పనులను నెరవేర్చుకొంటూ ఉంది. ఈ చిత్ స్పందమే సృష్టికి అంతకు కారణమవుతోంది. జీవులు వాళ్లె వాళ్ల కర్మానుసారంగా, మరణకాలంలో వాళ్లవాళ్ల బుద్ధియందు ఉన్న దేవ, నర, తిర్యగాది దేహాలను ధరిస్తారు. పూర్వజన్మ వాసనలను అనుసరించి ఆయా భోగ్య పదార్థాలను అనుసరిస్తారు. ఇలా చాల కాలం అనేక వేల యోనులందు పుట్టుచూ, చచ్చుచూ ఉండే జీవులలో ఎవ్వడేని మెల్లగా శాస్త్రీయమైన ప్రవృత్తిలోకి వచ్చే యడల, అలాంటి చిత్స్పందము (జీవుడు) చాల కాలానికి ముక్తి పొందుతాడు. మరొకడు జన్మ సహస్రాలకు ముక్తి పొందుతాడు. ఒకానొకడు ఒక జన్మలోనే ముక్తి పొందుతాడు. వాడి వాడి అధికార తారతమ్యాన్ని పట్టి ఉంటుంది ఇది.

చైతన్యము ఏ ఉపాధితో సంబంధించునో, ఆ ఉపాధి యొక్క రూపంతో ప్రకాశిస్తూ ఉంటుంది. సూర్యుని ప్రకాశ, నల్లగుడ్డ మీద నలుపు రూపంగా ఉంటుంది. ఎర్రగుడ్డమీద ఎరుపు రూపంగా ఉంటుంది. పచ్చగుడ్డ మీద పచ్చని రూపంగా ఉంటుంది. కనుక అలాంటి స్వభావం గల చైతన్యం దేహం పుట్టటానికి కారణమైన అన్న రసముల ఆకారం చెంది, తద్వారా తలిదండ్రుల శరీరంలో ప్రవేశించి, వారితో అభేదం చెంది, క్రమంగా శుక్రశోణితాది రూపాన్ని పొంది, తదుపరి, స్వర్గమోక్ష, నరకాదులకు కారణమైన దేహం అవుతుంది. కనుక తండ్రియొక్క ఉపాధిని, (శరీరమును) కొడుకు యొక్క ఉపాధిని (శరీరమును) కలిపి చూచే యెడల వాళ్ల ఇద్దరకు భేదము కనిపించదు. ఆ ఇద్దరి ఉపాధులను విడదీసి చూస్తే మాత్రం భేదం గోచరిస్తుంది. కనుక ఉపాధులకే పరస్పరము భేదముగాని, జీవులకు పరస్పరము భేదము లేదు. లోకంలో తోచే పర

స్వర భేదము ఉపాధుల (శరీరముల) ధర్మంగాని, చైతన్యము యొక్క ధర్మంకాదు. ఇట్లు ఆత్మ భేదము మిథ్య అయినా "నేను పుట్టితిని" "నేను చచ్చితిని" అనే జన్మాది భేద ప్రతీతి మనోభ్రాంతికాని నిజంకాదు. ఈ భేద జ్ఞానాలకు "నీవు నేను" అనే భేద కల్పన కారణము. దానికి ఆత్మ స్వరూప జ్ఞానము లేకపోవుట కారణము. ఆత్మ స్వరూపాఽజ్ఞానానికి భోగాశ (తృష్ణ) కారణము. ఈ తృష్ణకు వాసనలు (సంస్కారములు) కారణము. ఈ అంశము నేను నీకు ముందు చెప్పబోయే "లవణోపాఖ్యానము" వల్ల రుజువవుతుంది. కనుక రామా! ఈ ప్రపంచ పరిస్థితిఅంతా మనోభ్రాంతి విజృంభణము. జలతరంగములవంటిది. నీటిలోని బుడగల వంటిది. బ్రహ్మ మాయా విలాసము. చిదాభాసవల్ల జీవుడనీ, సంకల్ప వృత్తివల్ల మనస్సు అనీ, నిశ్చయాత్మక వృత్తివల్ల బుద్ధి అనీ, స్మరణాత్మక వృత్తివల్ల చిత్తమనీ, అభిమానంవల్ల అహంకారమనీ, విక్షేపమనీ, విక్షేప శక్తిచే మాయ అనీ, ఉపాధులు ఏర్పడుచున్నవి. ఇట్లే జగత్కల్పన కూడా మనోభ్రాంతి కాని వేరుకాదు. ఇంద్రియముల ద్వారా బాహ్య ప్రపంచాన్ని చూడడము జాగ్రత్తు. లోపల అహంభావన వాసితమై హృదయము నుంచి కంఠపర్యంతమైన సంసారము స్వప్నము. వాసనా మాత్రనే మిగిలి హృదయమునందుండుట సుషుప్తి. ఈ స్థితిని కూడా అతిక్రమించుట తురీయము. ఆ పైన శోధితమైనతత్వం పదార్థము బ్రహ్మ యందు చేరిపోవుట తుర్యాతీతము. ఈ స్థితికి వచ్చిన జీవుడు ఇంక సంసార దుఃఖమును పొందడు. ఇట్టి బ్రహ్మయందే సమస్త ప్రపంచమూ పుట్టు చున్నది. అతనియందే లయించుచున్నది. కాని దానియందు ఇతడులేడు. ఇతనియందు అది (జగత్తు) లేదు. వాతప్రకోపముకలవానికి కంటి యెదుట ఆకాశమునందు ముత్యాలపంక్తి కనిపిస్తూ ఉంటుంది) కంటిలో ముత్యాల పంక్తి కనిపించినట్లే. అంతే ఈ ప్రపంచ దర్శనము కూడా. ఇంతటి అసంగుడైన పరమేశ్వరుడు జగత్కారణ మగుట యెట్లని అడుగు తారు కొందరు. వాళ్లకు ఇదే సమాధానం. చెట్టు పెరగటానికి ఆకాశం ఎలా కారణమో, ప్రపంచం పుట్టటానికి కూడా బ్రహ్మ అలాగే కారణము. చెట్టును నిరోధించకుండా (అడ్డగించకుండా) ఉండటమే ఆకాశము నకు కారణత్వము. అలాగే మాయవల్ల జరిగే సృష్టిని, నిరోధించకుండా

ఉండడమే బ్రహ్మకు జగత్కర్తృత్వము. అనగా ఆకాశం అడ్డంగా లేదు కనుక చెట్టు పెరుగుతోంది. బ్రహ్మ నివారించడం లేదు కనుక మాయ ప్రపంచాన్ని సృష్టిస్తోంది అని భావము. అద్దము ప్రతిబింబానికి కారణ మయినట్లు, బ్రహ్మకూడ కర్త కాకున్నా సాన్నిధ్యంలో ఉన్నంతమాత్రాన కర్త అని అంటున్నారు. అయితే అద్దంలో ప్రతిబింబానికి క్రమం ఉండదు. మొత్తం బింబం అంతా ఒకేదఫా ప్రతిబింబిస్తుంది. అలాగే జగత్తు అంతా ఈ చిదాదర్శంలో (చిద్దర్పణంలో) ఒకేతూరి కనిపించవచ్చుకదా? అని అంటారు. అది న్యాయముకాదు. విత్తనపు గింజలో చెట్టుయొక్క సూక్ష్మరూపం ఇమిడి యున్నా, మొత్తం చెట్టు అంతా ఒకేదఫా స్థూల రూపంలోకిరాదు. ముందు అంకురము (రెండు ఆకులుగల మొలక) తరువాత ఆకులు, కొమ్మలు, స్కంధము, పూత, పిందె, కాయ, పండు, అనే క్రమంగానే స్థూలరూపాన్ని చెందుతుంది. చైతన్యంకూడా చిత్తము, జీవుడు, మనస్సు, ఇంద్రియములు, శరీరము అని క్రమంగానే ప్రకాశిస్తాడు. ఇది అనాది సిద్ధమయిన నియతి.

అయితే ప్రళయంలో సర్వప్రపంచమూ నశించినది కదా? అపుడు చైతన్యం ప్రశాంతంగా (స్వస్థంగా) ఉన్నది కదా? అలాగే ఎల్లపుడూ ఉండిపోక మళ్లీ ఈ సృష్టికి ఎందుకు దిగింది? అని అడుగవచ్చు. కాని ఆ ప్రశ్న సరియయినది కాదు. వర్షబిందువులలో కొన్ని కర్మ సంస్కార ములతో కూడియున్న జీవచైతన్యంతో కూడుకొని ఉంటాయి. అవి, క్రమంగా వృక్షాదులను, సస్యాదులను ప్రవేశించి క్రమంగా మళ్లీ బీజం అవుతూ ఉంటాయి. అలాగే జీవవాసనలతో కూడుకున్న చిత్తుకూడా. చిత్తమూ, మనస్సు, అహంకారము, మొదలగు ప్రపంచాకారంగా మళ్లీ ప్రళయాంతంలో తయారవుతూ ఉంటుంది, స్వస్థంగా ఉండదు. ఆ వర్ష బిందు అలా ఊరకుండరాదూ? ఊరకుండదే. అది దానికి నైజము. ఈ జీవచైతన్యమునకు కూడా అంతే. ఇది కూడా స్వస్థంగా ఉండదు.

అయితే, గింజలో సూక్ష్మంగా ఉండే చెట్టునుగాని, ఆ గింజనుగాని జ్ఞానంకలిగినా. చెట్టుగా తయారయేశక్తి నశించదు. జ్ఞానం కలగకపోయినా ఆ శక్తి తొలగదు. దాని సాదృశ్యం జగద్బ్రహ్మలకు చెప్పేయడల,

ఇక్కడకూడా బోధాబోధలలో విశేషం లేకపోవలసివస్తుంది. అప్పుడు తత్త్వబోధ వ్యర్థం అవుతుంది అనే ప్రశ్న ఉంది ఇక్కడ. కాని యిచ్చట దృష్టాంత దార్ష్టాంతికములకు తేడా ఉంది. బీజబోధచేతగాని, సూక్ష్మ తరుబోధచేతగాని, వాటియొక్క తాత్త్వికరూపం వ్యక్తంకాదు. బ్రహ్మ జ్ఞానంవల్ల మాత్రం ఆత్మయొక్క నిజరూపం వ్యక్తమవుతుంది. దీపంచేత, ఉన్నరూపం స్పష్టంగా కనిపించినట్లు. కనుక ఈ భేదం ఉన్నందున ఇక్కడ తత్త్వబోధ వ్యర్థంకాదు. దృష్టాంతంలో తత్త్వబోధ వ్యర్థమయితే అగుగాక. భూమి త్రవ్వినకొద్దీ ఆకాశం బయటపడుతుంది. విద్యవిచారణ చేసి కొద్దీ తత్త్వాన్ని వ్యక్తపరుస్తుంది. కనుక ఆత్మబోధకు ఇలాంటి సామర్థ్యం ఉంది. స్ఫటికశిలలో వనభూమి ప్రతిఫలించి ఉన్నా, అది శిలా రూపమేకాని, వృక్షరూపంకాదు. అది తెలియనివాడు అందులో వనము ఉన్నట్లు భ్రమిస్తాడు. అలాగే బ్రహ్మయొక్క ఉదరంలో ఉన్న జగత్తు బ్రహ్మ భిన్నమే. అయినా అజ్ఞానంచేత భిన్నంగా గోచరిస్తుంది. కనుక చెట్టుకు బీజం ఎలాంటిదో, జగత్తుకు బ్రహ్మ అలాంటిది. అన్నారు వసిష్ఠులు. ప్రపంచ మిథ్యాత్వమును నిరూపించారు.

విన్నాడు శ్రీరాముడు. గురువుగారి మాటలమీాద తనకు పూర్ణ విశ్వాసం కలిగింది. ప్రపంచ మిథ్యాత్వాన్ని తాను కూడ అనుమోదించాడు. ఇలా అన్నాడు. స్వామీ! ఎంత ఆశ్చర్యము? లేని ప్రపంచము ఉన్నట్లు కనిపిస్తూ ఎంత మోసం చేస్తోంది? అబ్బా! ఈ ప్రపంచం ఎంత గొప్పది? (ఎంత పెద్దది?) ఎంత స్వస్థంగా ఉన్నది? ఎంత స్ఫుటంగా ఉంది? మంచుబిందువులవంటి తన్మాత్రలతో గూడి ఈ బ్రహ్మాండం ఎలా ప్రకాశిస్తూ ఉన్నదో విన్నాను. ఇప్పుడు నాకు, సమష్టి వ్యష్టిరూపాన్ని ఇది ఎలా చెందినదో? పరమాత్మనుంచి వ్యష్టి సమష్టి స్థూల ప్రపంచాన్ని అనుభవించే వైశ్వానరాదులు ఎలా పుట్టిరో? చెప్పండి. అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! విను సమాధానం. పిల్లవాడి హృదయంలో వేతాళుడు, (పిశాచము) రూపం లేకుండగనే పుట్టుచున్నాడు. అలాగే పరబ్రహ్మయందు జీవుడు రూపం లేకుండగనే తయారవుతున్నాడు. అతడు

సంకల్పవాసనవల్ల మనస్సు అవుతున్నాడు. ఆ మనస్సుతో తన్మాత్రలను మననం చేస్తాడు. తానే అతిసూక్ష్మమయిన తన్మాత్రరూపుడై చిదాకాశంలో ప్రకాశిస్తాడు, ఆపైన సృష్టికాలవశంచేత, పంచీకరణద్వారా అపరిచ్ఛిన్నమయిన చైతన్యముద్వారా, మంచుబిందువువలె అతి సూక్ష్మముగా నుండు, మనుష్యాది దేహరూపమయిన బ్రహ్మాండమును చూస్తాడు. ఆ బ్రహ్మాండంమీద తనకు విశేషాకారజ్ఞానం ఉండదు మొదట. అప్పుడు ప్రాక్తన జన్మల స్మృతి కలుగుతుంది. దానివల్ల జగత్తత్వాన్ని సంవిత్తత్వాన్ని తెలుసుకుంటాడు. ఆపైన ఆపిండమునందు అహంభావన గట్టిపడుతుంది. క్రమంగా ఈ అహంభావనవల్ల ఇంద్రియ కల్పన, సూక్ష్మ స్థూల దేహకల్పన ఏర్పడుతుంది. ఇది అంతా తుదకు పరమార్థ సత్యమైన పరమాత్మభావనచేత నశిస్తుంది. ఇందు స్థూలశరీరాభిమాని, వైశ్వానరుడు, సూక్ష్మ శరీరాభిమాని, తైజసుడు, కారణ శరీరాభిమాని, ప్రాజ్ఞుడు. అన్నారు వసిష్ఠులు.

అయితే స్వామీ! చిదేకరసమయిన బ్రహ్మయందు అజ్ఞానమే సంభవించదుకదా? ఇంక జీవ భేద కల్పనము ఎట్లు కలుగును? బ్రహ్మైకత్వము. (జీవబ్రహ్మ భేదము) స్వతస్సిద్ధమయి యుండగా, ఇంక మోక్షమనే ఫలమునకు సంభవమే లేదు. అందుకొరకు ఆత్మవిచారాదులు చేయవలసిన ప్రసక్తియే లేదు. అలాంటి అప్పుడు మానవులు మోక్షం కొరకు పాకులాడుట కాని, ఆత్మవిచారాదులకు ఆశపడుటగాని వ్యర్థము కదా? అని అడిగాడు శ్రీరాముడు.

రామచంద్రా! నీవు తత్త్వదృష్టిలో అడుగుచున్నావా? వ్యవహార దృష్టిలో అడుగుచున్నావా? మొదటి పక్షంలో నీవు అన్నది నిజము. పరమార్థదశలో బంధమూ లేదు. మోక్షమూ లేదు. "ననిరోధోనచోత్పత్తిర్నబద్ధో నచసాధకః । నముముక్షుః నవైముక్తః ఇత్యేషా పరమార్థతా॥" అని గౌడపాదులవారు ఎన్నడో చెప్పారు. వ్యవహారదశలో ఈ ప్రశ్న కుదరదు. ఏ దశలో ఏ మాట చెల్లునో ఆమాటయే మాటాడవలయును. వ్యవహారదశలో "మోక్షంలేదు" "బంధంలేదు" "జ్ఞానంలేదు" అనటము హాస్యాస్పదము. అకాలంలో పుష్పించిన పూలమాల యెంత అందంగా

ఉన్నా అది శోభించదు. దానిని మెచ్చరు లోకులు. "ఏదో ఒక కీడు ఉన్నది దేశానికి" అనే అనర్థాశంకను కలిగిస్తుంది. కనుక ఆ పూలమాల అంది మంతా వ్యర్థం. అలాగే వ్యవహారదశలో నీమాటకూడ అంతే. వ్యవహార దశలో అజ్ఞానం ఉన్నది ప్రపంచం ఉన్నది. బంధం ఉన్నది. విచారము ఉన్నది. ముక్తి ఉన్నది. ప్రపంచోత్పత్తికి కారణమయిన పితామహుడే (చతుర్ముఖుడే) మిథ్యాభూతుడు. స్వప్నతుల్యమయిన సమష్టి సూక్ష్మ ప్రపంచమును అభిమానించినవాడు. అతడు ఓంకారోచ్చారణ పూర్వ కంగా సృష్టించిన ప్రపంచం కూడా మిథ్యే. జీవులకు జీవత్వము కూడ మిథ్యాభూతము. పుణ్యపరిపాకముయొక్క ఉత్కర్షకు పరమావధి ఫలము, హిరణ్యగర్భజన్మ. పాపపరిపాకముయొక్క ఉత్కర్షకు పరమావధి ఫలము కీటకజన్మ. వీళ్ల యిద్దరి జన్మలో పుణ్యపాప వైచిత్ర్య భేదము ఉన్నది. కాని యిద్దరికీ ద్వైతభ్రాంతి అజ్ఞాన ప్రయుక్తము (అజ్ఞానమువల్ల ఏర్పడినది) అనక తప్పదు. కనుక వ్యవహారదశలో ప్రపంచము అజ్ఞాన కల్పితము. దానివల్ల జీవులు బద్ధులవుతున్నారు. బంధ నివృత్తి వారల కవసరము. అందుకు తత్త్వవిచారము ఆవశ్యకము. తత్త్వవిచార జన్మమయిన జ్ఞానం చేత అజ్ఞానం నశిస్తే, సంసారబంధము తొలగి, జీవులు మోక్షమును పొందుటకూడ సంభవమే. కాబట్టి నీవు ఇందు ప్రశ్నించవలసిన పనిలేదు.

## ౬౭ సూచికోపాఖ్యానము (కర్కటి అనే రాక్షసి చరిత్ర)

ఈ విషయమునందు నీకు కర్కటీ అనే రాక్షసియొక్క సంవాదం చెబుతా విను. హిమవత్పర్వతమునకు ఉత్తర వైపున "కర్కటీ" అనే ఒక రాక్షసి కలదు, కాటుకకొండరాతితో తయారుచేసిన బొమ్మవలె నల్లగా ఉంటుంది అది. "విషూచిక" అనే మారుపేరు కూడ కలదు ఆ రాక్షసికి. మనుష్యులను బాధించడంలో ఈ పేరు సార్థకమయింది. దాని శరీరానికి తగిన ఆహారం దానికి కులవృత్తిలో దొరకలేదు. జఠరాగ్ని మహాపెద్దది. బడబానలానికి సముద్రాన్ని మింగినా తనివితీరనట్లు దీనికి ఎంతటి ఆహారమయినా చాలటంలేదు. ఒకనాడు ఇలా అనుకున్నది. "జంబూద్వీపంలో ఉన్న జనులందరినీ ఒక్కమాటు మింగేటట్లయితే నా ఆకలి తీరుతుంది." "దానికి ఉపాయం తపస్సు తప్ప వేరే నాకు తోచలేదు.

కనుక తపస్సు చేస్తాను" "ఉగ్రమయిన తపస్సుకు సాధ్యం కానిది ఏదీ లేదు." అని ఆలోచించి హిమవత్పర్వత శిఖరము చేరింది. తపస్సు చేయు టానికి. అక్కడ స్నానంచేసి, ఒంటికాలితో నిలిచి, సూర్యచంద్రులవలె ప్రకాశించెడి చూపుతో తపస్సు ఆరంభించింది. కొన్ని సంవత్సరాలు గడచాయి. భయంకరమయిన ఆకారం దాల్చి ఉన్నది. వెయ్యి సంవత్స రాలు గడచిన తరువాత, బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయినాడు వరమిచ్చుటకు.

## ౬౫ విషూచికా మంత్ర కథనము

తపస్సిద్ధి కలిగితే విషము అమృతం అవుతుంది అగ్ని చల్లనవుతుంది. ఆ రాక్షసి బ్రహ్మను మనస్సుతో నమస్కరించింది. అనుగదలచిన వరమును నిర్ణయించుకోలేక అలాగే నిలబడి ఉంది. తుదకొకనిర్ణయానికి వచ్చింది. "నేను వ్యాధియు, లోహమయమును అగు జీవసూచికను అవుతాను." (ప్రాణముగలసూదిని అవుతాను) అని. ఈ వరమహిమచేత అందరి హృదయములలో ప్రవేశించి నా యిష్టమువచ్చినటుల ప్రపంచ మును మ్రింగుతాను. క్రమంగా నా ఆకలి తీరుతుంది. ఇంతకంటే నాకు సుఖమేమున్నది? అని ఆలోచించుకుంటూ ఉంది. బ్రహ్మదేవుడు దానిని చూచి. "పుత్రీ? కర్కటికా? లెమ్ము నీ తపస్సుకు నేను మెచ్చితిని. వరమును కోరుము" అన్నాడు. "ఓ భగవంతుడా!" నేను రోగరూపమైన ఇనుపసూదిని అయి జీవముతోనుండు లాగున వరమిమ్ము అని కోరినది కర్కటి. బ్రహ్మదేవుడు అట్లేయని అంగీకరించి, కర్కటికా? నీవు "వి" అనే ఉపసర్గతో గూడిన సూచికవు (విషూచికవు) అగుదువు. ఇదియే కలరావ్యాధి. దీనితో నీవు సమస్త ప్రపంచమును హింసింతువు. నిషిద్ధా హారులను, అపక్వాహారులను, అకాలభోజనులను, అతిభోజనులను, పరాప కారపరులను, అశాస్త్రీయ మార్గస్థులను, హింసించగలవు. ప్రాణుల హృదయంలో ప్రవేశించి మర్మస్థలములను బాధించి పీడించగలవు. భేదమును గుర్తింపలేక గుణవంతులను, గుణరహితులనుగూడ బాధింప గలవు. గుణవంతులకు రోగప్రతిక్రియయగు మంత్రమును నేను ఉపదేశించు చున్నాను. "ఓం హ్రీం హ్రాం రీం రాం విష్ణుశక్తయేనమః । ఓం నమో

భగవతి విష్ణుశక్తి మేనాం ఓం హార హార నయ నయ పచ పచ మథ మథ ఉత్సాదయ దూరేకురు స్వాహా హిమవంతం గచ్ఛజీవ సః సః సః చంద్ర మండల గతోఽసి స్వాహా॥" అను మంత్రమును మంత్రించి మాంత్రికుడు ఎడమ చేతిలో నీళ్లు పోసికొని రోగగ్రస్తుడిమీద చల్లి ఆ చేతితో తుడవవలెను. పిదప విషూచిక హిమవత్పర్వతమునకు పరుగెత్తినట్లు ధ్యానించవలెను. ఈ మంత్రమును ప్రతివారు సమాహిత చిత్తులై శౌచాచమన పూర్వకముగ పఠించవలెను. అట్లు చేసినచో విషూచికావ్యాధి నశించును. అని చెప్పి బ్రహ్మదేవుడు గగనమండలమున శక్రాది దేవతలచే నమస్కరింపబడి, సత్యలోకమును చేరెను.

## ౭౦ సూచీ వ్యవహార వర్ణనము

అంతట కొండ శిఖరమువలెనుండు, ఆ నల్లటి రాక్షసి క్రమంగా సన్నగిల నారంభించినది. మొదట నల్లటి మేఘమువలె అయినది. తరువాత చెట్టుకొమ్మ అంత ప్రమాణం అయింది. పిదప ఒకపురుషుడంతటి ప్రమాణం అయింది. తరువాత బారెడు లోడితెడు, వేలెడు, తుదకు మినప గింజమీద పొట్టు అంతటిది అయింది. ఆపైన సూది అయింది. ఇది అంతా ఈ రాక్షసి యొక్క సంకల్పంవల్ల తయారైన సూక్ష్మరూపము కాని వేరు కాదు. చిన్న సూదిగా కనిపిస్తుంది ఆ రాక్షసి. కాని అందు ఇనుము రేయే మాత్రము లేదు. మనో భ్రాంతులలో ఇది కూడా ఒకానొక భ్రాంతి. ఈ రాక్షసి మితిమీరిన ఆకలిచే లోకాలను భక్షించాలని ఆశ పడిందిగాని ఉపయోగించలేదు. కడుపులేని సూదితో తినాలనే కోరిక తీరటం దుర్ఘటమయింది. రామచంద్రా! చూడు ఆ రాక్షసి యొక్క మూర్ఖత. ప్రపంచం భక్షించాలనుకున్నది గాని, సూది జన్మ నిరర్థకమని గ్రహించలేదు అది. దాని చిత్తము కోరికగల వస్తువును గూర్చియే ఆలోచించినది కాని గుణదోషాలను విచారించలేదు. అందువల్ల నిరర్థకమైంది. అనర్థాన్ని ఆలోచించే వాళ్లకు పూర్వాపర విచారణ ఉండదు. స్వార్థాభిలాషచే ఉత్తమ మానవుల చిత్తము కూడా కలుషితమవుతుంది. తన స్థూల శరీరం విడిచి సూచి జన్మను యెత్తిన ఈ రాక్షసికి మరణం కూడా సుఖకరమైనది. అబ్బా ఒకే వస్తువునందు గాఢానురాగంగలవాళ్ల

స్థితి చెప్పనలవికాదుకదా! ఆ రాక్షసి శరీరాన్ని కూడా గడ్డిపోచవలె విడిచి పెట్టింది. ఆహారమునందలి గాఢానురాగం చేత ఒక వస్తువు నందున్న పేరాసచే జ్ఞానసంపద మంటకలుస్తుంది. గ్రిసవాసన చే రాక్షసి శరీర నాశనం కూడా చూడలేదు. ఒకే వస్తువునందు అనురాగము గలవానికి మరణము కూడ సుఖమవుతుంది. శరీరంపోయినా సూచిజన్మ యెత్తి రాక్షసి సంతోషించింది. ఇక దీని వెంటనంటిన జీవసూచి అనే వ్యాధియొక్క పరిస్థితి. లింగ శరీరమే దాని యాకారము, స్థూలశరీరము లేదు. అతి సూక్ష్మము. ప్రాణతంతుమయము. కుండలినీ శక్తివలె నుండును. చంద్ర సూర్యుల కిరణములవలె ప్రకాశించుచున్నది. కత్తి అంచువలె అతిక్ష్యారము. పూల పరిమళమువలె అతి సూక్ష్మమై ప్రాణి దేహములను చొచ్చి, హింసించటంలో మహా నేర్పుగలది. పర ప్రాణాలను చూరగొనటమే దాని వ్రతము. ఇలా రెండు శరీరాలను ధరించింది ఆ రాక్షసి. ఒకటి ఇనుప సూచి (సూది) రూపము. రెండు విషూచిక అనే వ్యాధి రూపము. ఈ రెండు శరీరములతో మానవుల హృదయాలను ప్రవేశించి, బాధిస్తూ పది దిక్కులూ తిరిగింది. రామచంద్రా! సంకల్పము అఘటిత ఘటనా సామర్థ్యము కలదనుటలో ఈ రాక్షసి చరిత్రే నిదర్శనం, అందరు వారి వారి సంకల్పవశంచేత, చులకనవుతారు. బరువు అవుతారు. కర్కటి ఘోర తపస్సును కూడ విడచి అతి తుచ్ఛ సూది జన్మను అంగీకరించింది. నీచులు అతి తుచ్ఛ విషయాలను కూడ కోరుతారు. రాక్షసి తపస్సుచేత విషూచిక వ్యాధి అనే పిశాచత్వాన్ని సాధించుకుంది. ఎంత పుణ్యాకరమయిన తపస్సుచేసినా, రాక్షసజాతికి సంబంధించిన వాసన దానికి వదలలేదు. అది దిగంతాలు తిరగడంలో దాని స్థూల శరీరం శరత్కాల మేఘంవలె విడిపోయింది. అది సూక్ష్మ దేహంతో అదివరకే రోగంతో తీసికొనే వాని హృదయంలో ప్రవేశించి విషూచిక అనే రోగంతో బాధించినది కొందరిని. మరియొకడు సన్నగా ఉండి స్వస్థ శరీరుడుగాను, బుద్ధిమంతుడుగాను ఉంటే వాడి హృదయంలో ప్రవేశించి వాడికి దుర్బుద్ధి పుట్టించింది. ఇలా దుర్బుద్ధితో ఒకానొక పురుషునియందు తృప్తిచెందటం, మరొకనియందు, మంత్ర, ఔషధ, తపస్సులచేత నివారింపబడటం జరుగుతూ ఉంది. ఈ రెండు శరీరము

లతో, భూలోకంలోను; అంతరిక్ష లోకంలోను తిరుగుతూ చాల సంవత్స రాలు గడిపింది. భూమి మీద పరాగమూ చాటున, చేతిలో వ్రేళ్ల చాటున, అంతరిక్షంలో ఎండచాటున, గుడ్డలో దారంచాటున, దాగి ఉండేది.

మరిన్ని శరీరంలోని నాడులు, వ్యభిచార దోషముచే చెడిపోయిన ఉపస్థేంద్రియం. మకిలమైన అవయవాలు, రక్తక్షీణమై ఎండిపోయిన కాళ్లు, చేతులు, సన్నని వెంట్రుకలు, దౌర్భాగ్యుల శరీరాలు, తేజస్సు లేని అవయవాలు, దుర్గంధ వాయువులచే కలుషితమైన పచ్చిక తావులు, అమంగళకరమయిన చెట్లు మనుష్యులయొక్కయూ, పశువుల యొక్కయు ఎముకలుగలవల్లకాడులు ఈదురుగాలి కొట్టుతావులు, అనాత్మజ్ఞులు (మూఢులు) ఉండుతావులు, మురికి గుడ్డలుండు చోట్లు, వాటిని ధరించే వాళ్లనివాసములు చెట్ల తొర్రలు, నరికిన కొమ్మలుగల చెట్లయందు, క్రమంగా విశ్రాంతిచెంది యున్న తేనె టీగలు, కోకిలలు, కాకులుగల తావులు. ఎండగాలులుగల చోట్లు, మంచుపట్టుతావులు, కుష్ఠురోగులు, వికలాంగులు ఉండుతావులు, ఎత్తయిన పుట్టలు, ఊసరక్షేత్రాలు, పెద్ద పులులు. ఎలుగుబంట్లు, అజగరములు. (పెద్దపాములు) ఉండు అడవులు, మార్గస్థులు భయపడే తావులు, పిశాచాలు తిరుగు తావులు, ఎండాకు రాలి కుళ్లియున్న నీటిమడుగులు. మురికి కాలువలు, జనసంఘం చేరు చోట్లు, పేలుతిని నెమరువేసే కోతుల దవడలు, పిప్పిగోళ్లుగలవాళ్ల చేతులు ఇలాంటి ప్రదేశాలు ఆ రాక్షసికి (సూచికా జన్మధారిణికి) విహార భూములు అయినవి.

ఇలాంటిచోట్ల మకాం పెట్టుకొని, అప్పుడప్పుడు, చిత్రవిచిత్రము లైన నగరములందు, గ్రామములందునూ, రాకపోకలచే అలసిపోయినది. ఇది సూది జన్మ కనుక, నగరాలలోను గ్రామాలలోనూ, చినిగినగుడ్డల యందు. వాటికి పొదిగిన మణి వికారమయిన ఆభరణశాలయందు ఇత రులు తీసికోటానికి సాధ్యంకాకుండా సన్నగా దాగి ఉండేది. పీనుగుల శరీరాలతో నిండిన అడవులలో ఎద్దుల కొమ్ములతో ఆట ఆడి నట్లు ఆడుతూ ఉండేది ఆ శవ శరీరాలతో. జనులు సూదితో బట్టలు

కుట్టుకొనే టప్పుడు, చేతినుంచి జారిపడి, వి శ్రాం తి చెందటానికా? అన్నట్లు కనిపించకుండా పొయ్యేది. కాని అది సూది అయినా బట్టలు కుట్టే వాళ్ల చేతులను మాత్రం కుట్ట (గుచ్చ) లేదు. దానికి ఇతరులను భాధించడమే ఆనందంకాని, తనను పట్టుకున్నవాళ్లను బాధించడంలో ఆనందం లేదు. అలావాళ్లను బాధించే యడల తనను తాను బాధించు కున్నది అయ్యేది. రామా! అయినుప సూది మనస్సూచితో (జీవసూచితో) కూడుకొని, దిక్కులన్నీ తిరిగింది. ఎంత ముసలదయినా విసుకు జెందలేదు. జనులు గుడ్డలు కుట్టుకునే టప్పుడు. నరాల యొక్క సూక్ష్మ భాగాన్ని భక్షిస్తూ తృప్తిపడేది. ఇతరులను బాధించడానికి తపస్సుచేసిన దీనికీ వృత్తి తగి ఉన్నది, దరిద్రులను చూస్తే ఎంతటి కౄరులకైనా దయగలుగుతుంది. సహాయం చేస్తారు ఆలాగే యీ సూదికి కూడా చినిగిన గుడ్డలను చూస్తే చాలా దయ, క్షణకాలంలో ఆ రెండు పీలికలను ఏకం చేస్తుంది. (కుడుతుంది) సూర్యకాంతి మణివలె ప్రకాశించే ఈ రాక్షసి తపస్సుచేసి చినిగిన పాత గుడ్డలను కలిపే శక్తిని సంపాదించు కున్నది. కనుక దానికాపని తగినదే. కాని ఆ తపస్సు తన భోగానికే మాత్రము ఉపయోగించలేదు. అందువల్ల హృదయంలో కొంత పరితాప పడింది. అయినా నదీప్రవాహ వేగంవలె ఉన్న తన రాక్షస స్వభావాన్ని విడిచిపెట్టలేక, సూదికి స్వభావమైన పరబాధయందు పట్టుదల గలిగి ఆ పనే చేస్తోంది కాని. దానిని మానుకోలేక పోయింది. మానవులు భార్యా పుత్రాదులయందుండే వాసన అనే దారాన్ని తన మరణకాలంలో కూడా, వాళ్లమీద వ్యాపింప చేస్తారు. ఆలాగే యీ సూచిక (సూది) దారాన్ని వస్త్రములయందు ప్రవేశపెడుతోంది. మూఢునకు గుణ దోషాలు రెండూ సమానమే. దీనికి కూడ మెత్తని పట్టుగుడ్డ, ముతక గుడ్డా రెండు సమానములే. సూది కుట్టేవాళ్ల వ్రేళ్లతో నలిగి తన పేగులు బయటి కక్కుతున్నట్లు దారాన్ని బయటికి తీస్తుంది. దీనికి ఉత్తములు నీచులు సమానం. ఆ తేడాలేదు. ఇది ఏమీ తప్పుచేయకున్నా, ముక్కుకు తాడుపోసి లాగినట్లు, దాని నోట్లో దారం ఉంటుంది. ఇతరులను బాధించె సామర్థ్యం ఉన్నా అది యెప్పుడూ ఇతరుల చేతులలో నలిగి బాధపడు తూనే ఉంటుంది. దానికి ముక్కుక్రింద చిల్లి ఉన్నా, అది హృదయంలో

కిజ్మ్రరాదు. ఉదరంలోకీజ్మ్రరాదు. రాజుగారి కూతురే. అయితే ఏం. దురదృష్టవంతురాలు అన్నట్లు అయింది. ఇతరులు తనకు అపకారం చేయకున్నా వాళ్లను గుచ్చి బాధపెడుతుంది. ఆ పాపానికి ఫలితం దీనికీ బాధ ఎప్పుడూ దారంతో వ్రేళ్లాడటం. కుట్టేవాడి చేతిలోనుంచి జారి పడిపోవడి, వాడి అధోరోమాలలో దాక్కుంటుంది. ఇది సహజమే ఎవరి సహవాసాన్ని వారు విడుస్తారా? నీచులకు నీచసహవాసమే రుచిస్తుంది. ఇది కమ్మరి వాళ్లచేతుల్లోపడిందా, వాళ్లు కొలిమిలోపెట్టికాచేసరికి, కరిగి, తిత్తి గాలిచేకదలి, కనిపించకుండా పలాయనం చెపుతుంది. ప్రాణాది వాయువులద్వారా ప్రాణుల శరీరంలో ప్రవేశించి బాధిస్తుంది. పూల మాలలు గుచ్చేటప్పుడు పూలరసంతో ఆనందిస్తుంది. కాలిలో జొర పడ్డప్పుడు రక్తపానం చేసి విస్మయం చెందుతుంది. బురదగుంటలోపడి చాలకాలం అధోముఖంతో ఉంటుంది. అనుకూలమయిన తావుదొరికితే ఎవరు విడుస్తారు? ఎప్పుడూ ఇతరులను బాధిస్తూ ఉంటేనే దాని కానందము. నీచులకు ఉత్సవంకంటే కలహం సుఖం. భూతాలయొక్క అహంకారం చమత్కారంగా ఉంటుంది. సూదికి నెత్తురు చుక్క ఒక్క రవ్వ రుచిచూచినా ఎంతో ఆనందం. దరిద్రుడికి గవ్వ దొరికితే మహా సంతోషం. లోహసూచిక, జీవసూచిక. అనే రెండు శరీరాలతో గర్వించి ఇది మనుష్యులను బాధ పెట్టసాగింది. గుడ్డను ఎంత సులభంగా కుటు తుందో, ప్రాణాలను కూడా అంత సులభంగా తీస్తుంది. వాడుక లేకపోతే ఇది తుప్పుపడుతుంది. ఇతరులను బాధించకపోతే దీనికి రోగం వస్తుంది. గుడ్డను గుచ్చినంత మాత్రంచేత ఎంతో ఆనందిస్తుంది. దుష్టులకు పరుల వినాశం అంటే మహా ప్రీతి. అన్నాడు వసిష్ఠుడు.

ఇంతలో అస్తమయం అయింది. సభ లేచింది స్నానసంధ్యలకు. రాత్రి గడచింది. సూర్యోదయంతో మళ్లీ సభ అలంకరించారు సభ్యులు.

—: ఆరవరోజు ప్రసంగం ముగిసింది :—

## ౭౧ సూచీ పరిదేవనము

రామచంద్రా! ఇలా కొన్ని ఏండ్లు గడచాయి. అన్ని జాతుల

మానవుల మాంసములనూ రుచి చూచింది ఈ కర్కటీ అనే రాక్షసి. తృప్తి కలగలేదు. నిజమయిన సూదికి ఒక్క నెత్తురు చుక్క చాలు. అందులో అది మునిగిపోతుంది. కాని ఇది తృష్ణసూచి. (ఆశ అనే సూది). దీన్ని తృప్తిపరచడం మహా కష్టం అయింది. ఇలా పరితాపపడింది. అబ్బా! ఎంతకష్టం? నే నెందుకు ఇంత చిన్న సూది జన్మ ఎత్తితిని? ఏ వస్తువునూ తినే సామర్థ్యం లేదుకదా? ఒక్క కబళము (ముద్ద) అయినా నా పొట్టలో యిమడదు కదా? విశాలమయిన నా అవయవములన్నీ ఎక్కడకు పోయినవి? ఎక్కడనయినా బురదలో మునుగుతాను. గోతుల్లో పడిచస్తాను. మానవుల కాళ్ల క్రిందపడి నలిగి ప్రాణం విడుస్తాను. ప్రాణుల యొక్క రేతోధాతువుచే మలినమయినాను. ఎవరు నాకు దిక్కు? ఎవరు నన్ను ఓదార్చువారు? ఎవరు నాకాధారము? అంతకంతకు సంకటాలల్లో పడుతున్నాను. దుఃఖాలల్లో మునిగిపోతున్నాను. నాకు చెలికత్తెలా? దాసీలా? తల్లియా? తండ్రియా? చుట్టాలా? పక్కాలా? అన్నలా? తమ్ములా? కొడుకులా? కూతుళ్లా? ఇల్లా? వాకిలా? వళ్లా? కళ్లా? ఏమి ఉంది? ఒక్కచోట ఉండటం నోచుకోలేదు కదా? అడవిలో ఎండాకువలె గాలికి తిరగవలసిందే కదా? ఘోరాపదలో పడపోయినాను. చస్తే బాగుండునని కోరుకుంటు న్నాను. ఆ చావుకూడా నాకు సంభవించేటట్టులేదు. మూఢుడు, చేతులో ఉన్న చింతామణిని గాజుముక్క అని పారవేసినట్లు, దుర్బుద్ధిచే ఉన్న దేహాన్ని ఊడ్చి పెట్టుకున్నాను. అవివేకంలో పడిన మనస్సు ముందు దుర్బుద్ధిని యిస్తుంది. ఆపైన దుఃఖసహస్రాలను ప్రసాదిస్తుంది. ఏమి నా బ్రతుకు? అందరి శరీరంలో ఉండే రక్తమాంసాలమీద ఆశ. దానితో అందరినీ గుచ్చటమేకాని, తినటానికి నోరూ లేదు. నాకటానికి నాలుకా లేదు. ఏమి లాభం? నా బ్రతుకు శాంతి కర్మలో భేతాళుడు పుట్టినట్లు అయింది. పరిశుద్ధమయిన తపస్సుచేత నేను సర్వం నాశనం చేసుకున్నాను చక్కని శరీరం పాడుచేసుకున్నాను. దౌర్భాగ్యులను నాశనానికి అను కూలంగా దుర్బుద్ధి పుటుతుంది. నేను కర్మం చాలక మట్టిలోపడితే ఎవరు నన్ను పైకి తీసేవాళ్లు? కాలిక్రిందపడ్డ పురుగులను ఎవరు పైకి తీస్తున్నారు? అంతకంటె యింకా సూక్ష్మంగా ఉంటానే నేను. నన్నెవ్వరు చూస్తారు? నేను ఎవరికి కనిపిస్తాను?.

"నాపూజయద్గణేశానం సూచీ సృష్ట్వా స విశ్వసృట్।
నాపసూత్రాం తతస్సూచీం నష్టాం విందతి మానవః॥"

బ్రహ్మదేవుడు సూదిని సృష్టించేటప్పుడు విఘ్నేశ్వరపూజ చెయ్య లేదట. అందువల్ల దారంలేని సూది క్రిందపడితే కనిపించదట అని అంటారు పెద్దలు. పోనీ స్థూల దృష్టులయిన మానవులకు కనిపించకపోతే, సూక్ష్మ దృష్టిగల యోగులకయినా కనిపిస్తానేమో అనుకుంటే ఆ ఆశాలేదు. పరిశుద్ధమయిన మనస్సుగల యోగుల బుద్ధిలో మాబోటి దౌర్భాగ్యులు ప్రవేశిస్తారా? పర్వతశిఖరంమీద ఉన్నవాళ్లకు క్రింది గ్రామాలలోను, దోవలలోను ఉన్న గడ్డిపోచలు గోచరించవు కదా? కనుక అలాంటి మహానుభావులు మా బోంట్లను స్మరించరు. అజ్ఞాన వారధిలో మునిగిన నేను పైకి లేవడము సున్న. గ్రుడ్డివాడికి వస్తుజ్ఞానం కలగదు. నేను ఇలా ఇంక ఎన్ని నాళ్లు దుఃఖనరకంలో ఉండాలో బోధపడటంలేదు. నేను కాటుక కొండవలె విశాలమయిన దేహంతో ఎప్పుడు తయారవుతానో కదా? విశాలమయిన భుజములు, మెరపువంటి నేత్రాలు, మంచువంటి వస్త్రాలు, ఆకసమునంటునంతటి పొడవైన వెంట్రుకలు, నల్లని శరీరం, వ్రేళ్లాడె పొట్ట, పొడవైన కుచములు, కలిగి, నేను యమధర్మరాజును మింగునంతటి భయంకరంగా ఎన్నడు ఉందునో కదా? ఆహా? నా మొదటి శరీరం నాకు ఎప్పుడు లభించునోకదా? నానఖపంక్తి నాకెప్పుడు ప్రాప్తించు నోకదా? లోకంలో ప్రాణులను హింసించి వారి రక్తపానంచేత మత్తురాలనై ఎప్పుడు నిద్రింతునో కదా? దుఃఖప్రదమైన తపస్సుతో బంగారం వంటి నా శరీరాన్ని నేనే తగలవేసుకున్నాను కదా? పనికిమాలిన సూది జన్మ ఎత్తాను. నా మొదటి శరీరం ఎక్కడ? ఇది యెక్కడ? మూర్ఖునకు బంగారపు వస్తువు ఇస్తే విసిరి నేలకు కొట్టినట్లు నా దివ్యదేహాన్ని నేను తగలవేసుకున్నాను. వింధ్యపర్వతం యొక్క గుహవంటి ఓ ఉదరమా? నీవు సింహంవలె ప్రత్యక్షమై, ఏనుగులవంటి నా దుఃఖాలను రూపు మాపవేం? కొండగుహలవంటి ఓ చేతులారా? మీరు అర్ధచంద్రునివలె ఉన్న గోళ్లతో పురోడాశపు ముద్దవలె ఉన్న చంద్రుణ్ణి లాగివెయ్యరేం? కొండచరియవంటి వక్షస్థలమా? నీవు సింహాలను పీక్కుతినే పేలగుంపుగల రోమవనమును ధరించవేం? కృష్ణపక్ష రాత్రివలె నల్లనయిన నేత్రము

లారా? మీరు చూపులనే జ్వాలా మాలచే దిక్కులను అలంకరించరేం? ఓ స్కంధమా? నీవు నశించావు. భూలోకాన్ని విడిచావు. కాలంచే మ్రింగపడ్డావు. రాతిమీద పడి పొడి అయినావు. ప్రళయకాలాగ్నిచే దగ్ధమయిన చంద్రబింబమువంటి ముఖమా? నీవు కిరణములతో ప్రకాశించవేం? ఓ చేతులారా? మీరు ఏమయితిరి? ఎచటకేగితిరి? నాకీ సూది జన్మ వచ్చినది. తుమ్మెదల కాలిగోళ్లకు కూడ కదలి పోతున్నాను. అంతటి చులకనయినాను. పెద్దచెట్టు త్రవ్వినగోతివలె నుండు భగమా? నిన్ను గూర్చి దుఃఖించుచున్నాను. వింధ్యాద్రివలె విపులమయిన ఓ నితంబమా? నిన్ను గూర్చి దుఃఖించుచున్నాను. అని పరితపించింది కర్కటి.

## ౭౨ సూచి యొక్క తపఃప్రభావము

కొంతసేపు మౌనం వహించింది. ఏకాగ్రతతో ఆలోచించింది. ప్రాణులను హింసించుట మానుకుంది. మళ్లీ మామూలు శరీరాన్ని పొందాలనుకుంది. మళ్లీ తపస్సు చేయటానికి అదే హిమవచ్ఛిఖరానికి పోవసంకల్పించింది. మొదటి తన మనఃకల్పిత మయిన సూచిత్వమును చూచుకున్నది. ప్రాణవాయు రూపమయిన జీవసూచి, తనకు ఉపాధి భూతములయిన ప్రాణములతో, మనఃకల్పితమయిన లోహ సూచిని ప్రవేశించింది. ఇలా లోహ జీవ సూచులు రెండూ అన్యోన్యాధ్యాస జెందినవి, ఈ రూపంగా ఈ రాక్షసి (కర్కటి) ప్రాణవాయువుగల శరీరాన్ని ధరించింది. క్రియాశక్తిని పొందినది. హిమవచ్ఛిఖరానికి వెళ్లింది. దావాగ్ని గల తావున, జనసంచారములేని తావున, ఇంద్రనీలమణివలె నల్లనయిన తావున, దుమ్ముగలతావున, నిలబడిందిఈ రాక్షసి. ఊషరక్షేత్రమునందు పుట్టిన ఎండిన గడ్డిపరకవలె ఉన్నది. అక్కడ ఒంటికాలితో తపస్సు చేయడం ప్రారంభించింది. స్థిరంగా నిలిచి ఉన్నది. దాని వెనకాల దాని నీడయే దానికి సహాయం అయింది. దీని తపోనుష్ఠానమువల్ల పక్షులకు గూడ సద్బుద్ధి కలిగింది. అచేతములయిన చెట్లు తీగలు కూడ అచ్చెరువొందినవి. చల్లని గాలినీ, పుప్పొడినీ కానుకగా నిచ్చి దానిని తృప్తిపరచినవి. ఇంతలో మహేంద్రుడు, తపోభంగానికి ఆమిషకణములను పంపాడు. అవి సూది బెజ్జంలో ప్రవేశించినవి కాని లోపలికి పోలేదు.

(అది ప్రమింగలేదు.) పుష్పాదినికూడ భక్షింపదలచలేదు. మేరువునుకూడ చలింపచేయు వాయువునకు మహా ఆశ్చర్యం కలిగింది. తలవరకు మట్టి పుట్టలు కట్టినా, నీరు నిండినా, పెనుగాలి సోకినా, దవాగ్ని తగలపెట్టినా, వడగంటి రాళ్లచే ఒళ్లు పగిలినా, మెరపులతో మెరిసే మేఘాలు గర్జించి భయపెట్టినా, ఏమాత్రాం తొణకలేదు ఆరాకుసి, ఇలా అనేక సంవత్స రాలు గడచాయి. రామచంద్రా! బాహ్యచేష్టలుడిగి, ఆత్మవిచారం చేసినందున దానికి మితిలేని ఆత్మబోధ కలిగింది. సర్వజ్ఞురాలయింది. పాపం తపస్సుచే తగ్గేసరికి ఆత్మసాక్షాత్కారం కలిగింది. ఇలా ఏడువేల సంవత్సరాలు తపస్సు చేసింది. పదునాల్గు లోకాలు అదిరిపోయాయి ఆ వేడికి. ఆ పర్వతం అంతా మండిపోయింది. ప్రపంచం అంతా తగల పడుతోంది. రామా! అపుడు దేవేంద్రుడు నారదునితో ఇలా అన్నాడు. నారదమహర్షీ? ఎవరి తపస్సుచే ఈ ముల్లోకాలు ఇలా మండిపోవు చున్నాయి? అని. దేవేంద్రా! మహా తపస్వినియగు కర్కటి యేడువేల సంవత్సరాలనుంచి తపస్సు చేస్తోంది. ఇప్పుడది విజ్ఞానమయ దేహాన్ని ధరించింది. అదీ ఈ వేడి. దాని తపోవేడిమిచే, పాములు దీర్ఘంగా నిట్టూర్పు విడుచుచున్నాయి. పర్వతాలు వణకుతున్నాయి. దేవతలు విమానాలనుంచి క్రిందకు పడుచున్నారు. సముద్రాలూ, మేఘాలూ ఎండి పోతున్నాయి. దిక్కులు సూర్యుడితోకూడ మలినమైనాయి. దేవేంద్రా! నాకు చూడ ఇది; ఈశ్వరుని యొక్క ప్రపంచోప సంహారశక్తి ఇలా విజృంభించిందా? అన్నట్లున్నది. అన్నాడు నారదుడు.

## 83 నారదుడు సూచీ తపోవైభవమును వర్ణించి చెప్పుట

దేవేంద్రుడు విన్నాడు దీని చరిత్ర టూకీగా. ఇంకా వినాలని కుతూహలం కలిగింది. పిశాచంవలె కనిపించని జీవసూచి అయి, అది అనుభవించిన భోగాలను విపులంగా చెప్పమని అడిగాడు నారదుణ్ణి. నారదుడు ఇలా బదులు చెప్పాడు దేవేంద్రుడికి. దేవేంద్రా? ఆ కర్కటి తపోమహిమచేత, "ప్రాణం ఉన్న ఇనుప సూది జన్మను" కోరుకున్నది. వరమునుపొంది అలాగే అయింది. తరువాత లోహవికారమయిన సూది యొక్క ఆశ్రయం విడిచి, ఆ జీవసూచి, ఆకాశమునందు, వాయువసే

రథాన్నియెక్కి, పాపాత్ముల శరీరంలో ప్రవేశించింది. వాళ్ల పేగులు, నాడులు, మేదస్సు, రక్తనాళాలలో చేరింది. వాళ్లను పీల్చి పిప్పిచేసింది. వాళ్లవాళ్ల శరీరేంద్రియములద్వారా, వాళ్లు తిన్న ఆహారం అంతా అనుభవించింది. తుదకు వాళ్ల రక్తమాంసాలనుకూడా పూర్తిచేసింది. చక్కగా అలంకృతులయిన ముగ్ధబాలికలలో ప్రవేశించింది. ఆ బాలిక సుఖం అంతా అనుభవించింది. పక్షి శరీరంలో ప్రవేశించి అత్యధిక సుగంధ బంధురములయిన పూదోటలలో విహరించిది. ఆడతుమ్మెదలలో చేరి మగతుమ్మెదలతో క్రీడా విలాసాలు ఆచరించింది. ఉద్యానవనములలో పూతేనెలను ఆస్వాదించింది. గద్దలలోచేరి శవశరీరములను భక్షించినది. సమస్త ప్రాణుల శరీరంలోను స్వేచ్ఛగా విహరించింది. సర్వప్రాణులందును చిచ్ఛక్తులు ఉపాధిని అనుసరించి భిన్న భిన్నంగా స్ఫురిస్తూ ఉంటాయి. దీనివల్లగాని ఇతరశక్తులు సఫలంకావు. విష్ణుభగవానుడు ఆదిశేషుని తలలపై పరుండినట్లు, ఇది అందరి శరీరములలోను నివాసం ఏర్పరచుకుంది. అన్ని భోగాలు అనుభవించింది. మంత్ర, ఔషధ, తపో, దాన, దేవపూజాదులు, తనకు అడ్డుతగిలినప్పుడు తాను పలాయనం చెప్పేది. తనకు మించిన ఆపద తటస్థించినపుడు ఆ జీవసూచిక, లోహ సూచికను (యినుపసూదిని) ఆశ్రయించేది. ఇలా పదిదిక్కులూ స్వేచ్ఛగా తిరిగినా దానికి మనస్తృప్తే కాని, శారీరక తృప్తి కలగలేదు. శరీరమే లేనపుడు శరీరతృప్తి కలగడం అసంభవము. అందువల్ల మళ్లీ తనవెనుకటి రాక్షస దేహాన్ని స్మరించింది. శారీర సుఖం పొందాలనుకుంది. పూర్వ శరీరం ప్రాప్తించటానికి ఘోరతపస్సుచేయ నిర్ణయించుకున్నది, అందుకు తగినచోటును చేరుటకు ఒక గద్దయొక్క హృదయంలో ప్రవేశించింది. ఆ గద్ద ఆ జీవసూచికను కొనిపోయి, నిర్జనమయిన నొక గొప్ప అరణ్యంలో ప్రవేశపెట్టింది. ఆ గద్దపక్షి, ఆ జీవసూచికను హిమవచ్ఛిఖరమున ప్రతిష్ఠింపచేసేసరికి ఒక దేవతా ప్రతిమవలె స్థిరమయిన లోహ సూచి అయినది. దానిని చూచింది జీవసూచిక. ఆ పక్షి శరీరంలోనుంచి బయటకు రాదలచింది. గాలినుంచి పరిమళం వచ్చినట్లు బయటికి వచ్చింది. అంతట ఆ గద్ద బరువు దించుకున్నట్లు సుఖించి స్వస్థానం చేరింది. రోగం నివర్తించిన పురుషుడువలె స్వస్థపడింది. అంతట ఆ జీవసూచిక, లోహ

సూచికను ఆధారంగా జేసికొని, తపస్సు ఆరంభించింది. దేవేంద్రా! అప్పటినుండీ ఆ రాక్షసి సూచికా రూపముతో ఆ అరణ్యంలో అనేక సంవత్సరాలు తపస్సు చేస్తోంది. కనుక దానికి వరమునిమ్ము. లేకపోతే లోకాలను తగలబెటుతుంది. అని అన్నాడు నారదుడు.

రామచంద్రా! ఆ మాట విని దేవేంద్రుడు, ఆ జీవసూచికను వెతకుటకు పదిదిక్కులకు వాయువును (గాలిని) పంపాడు. ఆ వాయువు తనదివ్యదృష్టిచే వెతకటం ప్రారంభించింది. నభోమార్గంనుంచి దిగి వచ్చింది. భూలోకంలో వెతకటం ప్రారంభించింది. దాని (ఆ వాయువు) యొక్క దివ్యజ్ఞానం ప్రపంచం అంతటా బ్రహ్మజ్యోతివలె నిండినది. సప్తసముద్రాలను వెతకింది. తీపి నీటిసముద్రంతో చుట్టి ఉన్న పుష్కర ద్వీపంలో వెతికింది. మదిరా సముద్రవేష్టితమయిన గోమేదక ద్వీపంలో వెతకినది. ఇక్షు సముద్రముచే ఆవరింపబడిన క్రౌంచద్వీపం గాలించింది. క్షీరసాగరపరీతమయిన, విష్ణునివాసమయిన శ్వేతద్వీపంలో అన్వేషించింది. ఘృతసముద్రపరీతమయిన కుశద్వీపం గాలించింది. దధిసముద్రవేష్టితమైన శాకద్వీపం చూచింది. క్షారసముద్రపరీతమైన జంబూదీపం పరికించింది. తుదకు ఈ ద్వీపంలో తపస్సు చేసే సూచిక యున్న హిమవత్పర్వత శిఖరాన్ని చేరింది. తపోవనంలో ప్రవేశించింది. ఆ ప్రదేశము తృణరహితము, ధూళిధూసరితము, మృగతృష్ణా నదీయుతము. ఇంద్రధనస్సువలె చిత్రవర్ణితము. లోకపాలురకు నయిలము అగోచరావధికము. అచ్చోట అలసి ఆ వాయువు కొంతతడవు విశ్రమించాడు.

## ౭౪ సూచీ తపఃపరిపాక వర్ణనము

ఆ తపోవనమునందు ఎత్తైన పర్వతశిఖరంమీద నిలబడిన అగ్నిజ్వాలవలె ఉన్న జీవసూచిని చూచింది వాయుదేవత. తపోనియమాలచే నిండా కృశించి ఉంది అది. చూచి వాయువు ఆశ్చర్యపోయాడు. నమస్కరించాడు. చాలసేపు పరికించి చూచాడు. భయపడుతూ భయపడుతూ దగ్గరకు చేరాడు. కాని దాన్ని ఏమీ అడగలేకపోయాడు. దాని తపశ్చర్యను మెచ్చుకుంటూ ఆకాశానికి ఎగిరి, మేఘమార్గం, వాయుమార్గంకుండా, సిద్ధసాధ్యుల, లోకాలుదాటి, సూర్యలోకాన్ని చేరాడు. తరువాత విమా

నాలద్వారా అమరావతి చేరాడు. సూచీ దర్శనంచే పవిత్రమయిన ఆ వాయువును కౌగలించుకున్నాడు ఇంద్రుడు. విషయం అడిగాడు. వృత్తాంతం అంతా తెలిసికొని వచ్చినానని చెప్పాడు దేవేంద్రుడుతో వాయువు. విషయం వివరంగా చెప్పటం ప్రారంభించాడు. దేవేంద్రా? "జంబూద్వీపంలో హిమవత్పర్వతముయొక్క ఉత్తరవైపు శిఖరం మీద నిలబడి ఆ సూచి దారుణమయిన తపస్సు చేసింది. నేనేమిచెప్పేది? గాలిని కూడా పీల్చకుండా ఉండాలని తనశరీరం లోహమయం (ఇనుమువికారం) చేసుకుంది. చిన్న చిల్లి ఉంటే ఆ కాస్త దుమ్ముతో పూడ్చివేసింది. దాని తపోవేడిమిచే మంచుకొండకూడ వెచ్చబడింది. రాళ్లు అన్నీ ఆ అగ్నికి ద్రవించి అగ్న్యాకారములయ్యాయి. కాబట్టి తొందరగా మనమందరము కలసి దానికి వరమిప్పించటానికి బ్రహ్మదేవుని వద్దకు పోదాము. దాని తపస్సు లోకానర్థంకొరకె అని గ్రహించు అన్నాడు వాయువు. ఇంద్రుడు దేవతానీకంతో కూడి బ్రహ్మలోకానికి వెళ్లాడు. సూచికి వరమిమ్మని ప్రార్థించాడు బ్రహ్మను. బ్రహ్మకూడ సూచికకు వరమిచ్చుటకై హిమవత్పర్వతమునకు వెళ్లుచున్నానని ప్రతిజ్ఞ చేశాడు. ఇంద్రుడంతట స్వర్గం చేరాడు. ఇంతలో ఏడువేల సంవత్సరాలు తపస్సుచేసి ఆ సూచిక చాల పవిత్ర అయినది. ఆ నిర్జనవనంలో దానినీడ దానికి తప్ప మరెవ్వరూ దానికి సహాయం లేరు. ఈ సూచిక (సూది) పట్టుదారమంతటి తేలికది. అయినా స్థైర్యంలో మేరుపర్వతాన్ని మించింది. కనుకనే ఆ సూదియొక్క నీడ ఉదయకాలమందు, సాయంకాలమందునూ, ఓడిపోయిన మేరుపర్వతాన్ని చూడపోతున్నదా? ఏమి అన్నట్లు ప్రాకవు అవుతోంది. మధ్యాహ్న కాలంలో ఎండకు భయపడి ఆ సూచిక ప్రాంతాలలో చేరుతోంది. మిగిలిన సమయాలలో ఆ సూచికను చూస్తూనే ఉంది. ఇలా ఛాయాసూచి, జీవసూచి, లోహసూచి, యీ మూడును గంగా, యమునా, సరస్వతీ నదులవలె, యెరుపు, నలుపు, తెలుపు వర్ణములుగలిగి ఆ మధ్యప్రదేశమును పవిత్రంచేసే పుణ్యక్షేత్రాలవలె ఉన్నాయి.

## ౭౫ సూచి పూర్వశరీరాన్ని పొందుట

రామచంద్రా! దానికి కొంతకాలానికి జ్ఞానోదయం అయింది.

తపస్సునుంచి లేచింది. వెయ్యిసంవత్సరాలు గడచినతర్వాత బ్రహ్మదేవుడు సూచివద్దకు పోయాడు. వరమడగమన్నాడు ఆకాశంనుంచి. ఆమాట మాత్రం తెలిసింది ఆ సూచికకు. కాని కర్మేంద్రియాలు లేనందువల్ల బదులు చెప్పలేక పోయింది. మనస్సులో మాత్రం ఇలాంటి నిశ్చయంలో ఉన్నది. "ఓ బ్రహ్మదేవుడా? నా సందేహాలన్నీ పోయాయి. నేను పూర్ణురాలనయినాను. నాకింక వరాలతో పనిలేదు. శాంతంగా ఉన్నాను. తృప్తిగా ఉన్నాను. ఆనందంగా ఉన్నాను. తెలుసుకోవలసినది తెలిసింది. వివేకోదయం కలిగింది. ఇంకనాకితరముతో ప్రయోజనంలేదు. ఇలాగే ముందుకూడా ఉండాలని ఉన్నది. పరమార్థ సత్యస్వరూపురాలయిన నాకు మిథ్యావస్తువులతో ప్రయోజనం లేదు. ఇంతవరకు నేను అవివేకంచేత దుఃఖపడుచున్నాను. ఆ అవివేకం శాంతించింది ఆత్మవిచారంచేత. నాకు ఇష్టమయినది అయిష్టమయినది ఏదీలేదు" అని. ఇలా నిశ్చయించుకొని, కర్మేంద్రియాలు లేనందువల్ల మౌనంగా ఉన్న సూచిని బ్రహ్మచూచాడు. అనుగ్రహించాడు. ఇలా అన్నాడు దానితో. ఓ పుత్రీ! నీవు ఇంకా కొంత కాలం భూలోకంలో భోగాలు అనుభవిస్తూ ఉండు. పిదప బ్రహ్మపదము చేరుతావు. ఇది ఈశ్వరనియతి. (సంకల్పము.) దీనిని మేముకూడా మార్చ లేము. ఈ తపస్సుచే నీ సంకల్పం నెరవేరుతుంది. మళ్లీ నీవు విశాలమైన శరీరాన్ని పొంది హిమాచలంమీద రాక్షసివయి సంచరించు. నీ స్థూల శరీరం అంతా, నీసూక్ష్మశరీరంలోనే ఇమిడి ఉంది. విత్తులో చెట్టు సూక్ష్మ రూపంతో ఇమిడి ఉంటుంది. నీకు ఈ తపస్సుచే చిత్తశుద్ధి కలిగింది. పరబ్రహ్మ తెలిసినాడు. ఇంక నీవు వెనకటివలె స్థూలదేహాన్ని పొందినా లోకాన్ని బాధించవు. నీ వెప్పుడూ నిర్వికల్ప సమాధిలోనే ఉంటావు. ఎప్పుడైనా వ్యుత్థానం కలిగితే అందరూ ఆత్మస్వరూపంగా గోచరిస్తారు నీకు. వ్యవహారదశలో నీవు ధారణాధ్యానములలో ఉంటావు. గాలికి చలనం ఎలాంటిదో నీ స్థూలదేహానికి స్పందం (చలనం) కూడా అలాంటిదే. నీవు నీరాక్షస కులవృత్తిని నిరోధిస్తావు. న్యాయ్యంగా తున్న వృత్తి చేసికుంటావు. న్యాయాన్ని అతిక్రమించిన ప్రాణులను మాత్రమే హింసించెదవు. జీవ న్ముక్తురాలవై సంచరిస్తావు." అని అన్నాడు బ్రహ్మదేవుడు ఆకాశం నుంచి. మళ్లీ సత్యలోకం చేరాడు. బ్రహ్మచెప్పిన విషయం మీద దీనికి

రాగ ద్వేషాలు రెండూ ఉదయించలేదు. ఆయనగారి వాక్యాన్ని నివారించలేదు. క్రమంగా తనపూర్వశరీరాకారాన్ని చింతించింది. మొదట అంగుష్ఠ పరిమాణం, తరువాత మూరెడు, బారెడు, అయి తుదకు చెట్టు అంత దయి, క్రమంగా మేఘాకారం అయింది. నిముషకాలంలో పెద్ద విశాలమైన చెట్టంత దయింది.

## ౭౬, ౭౭ కర్కటి న్యాయముగా జీవించుట

రామచంద్రా! ఆ కర్కటి వర్షకాల మేఘంవలె క్రమంగా పెరిగి పెద్దదయినది. కాని తత్త్వజ్ఞానం అబ్బినందువల్ల తన సహజమయిన గొప్ప రాక్షసస్వభావాన్ని విడిచిపెట్టింది పాము కూసమువిడిచినట్లు. అవివేకంతో అక్కడనే పద్మాసనంవేసికొని ఆత్మజ్ఞానం చేస్తూఉన్నది. ఆరు మాసాలు గడచింతరువాత ధ్యానంలో నుంచి లేచింది. వర్షకాల మేఘగర్జితానికి నెమలి లేచినట్లు. వెంటనే ఆకలి వెంటబడింది. శరీరం ఉన్నంతవరకూ శరీర ధర్మాలు తప్పవు ఎవరికీ. "ఇపుడు నాకు ఆహారమేమి?" "ఇతరులను తిని బ్రతకవలసినదే" అన్యాయంగా బ్రతకటం నా కిష్టంలేదు. అన్యాయ బ్రతుకును పెద్దలు నిందించారు. అంతకంటె మరణం మేలు అన్నారు. న్యాయార్జితమైన అన్నం దొరకకపోతే చావనైనా చస్తాను. అన్యాయంగా సంపాదించే అన్నం విషంతో సమానం. లోకసంమతంకాని భోజనం చేసి ఏం ఫలం? నాకు జన్మమరణాలతో ఫలంలేదు. నేను మనోమయ రూపు రాలను. (సంకల్పమాత్రురాలను) దీనికి దేహాది భ్రాంతులు విలాసాలు. ఆత్మజ్ఞానంచేత ఆ భ్రాంతులు నశించాయి. ఇంక నాకు దేహాదేహజ్ఞానం లేదు. (జన్మ. మరణమూ,) అనే జ్ఞానంలేదు. రామచంద్రా! ఇలా తలుస్తూ మతిలో, మౌనంగా కొంతసేపు ఉండేసరికి, గగనమండలంలో సంచరించే వాయువు సంతోషించి ఇలా అన్నాడు. "ఓ కర్కటీ? నీవు అజ్ఞానులకు జ్ఞానోపదేశం చేయుము. మూఢులను తరింపచేయడమే మహాత్ముల స్వభావం. అలా నీవు ఆత్మతత్త్వాన్ని బోధించినా, ఎవడికి ఆబోధ మతికి పట్టదో, ఎవడు దానికి అభిముఖుడుకాడో, వాడు ఆత్మనాశంకొరకే పుట్టాడు కనుక, వాణ్ణి తినటం నీకు న్యాయమే. అదే నీకు న్యాయమైన ఆహారం" అని అన్నాడు వాయుదేవత. ఆమాట విన్నది యీ రాక్షసి.

"నీవు నన్ను అనుగ్రహించావు" అని ఆ పర్వత శిఖరంనుంచి లేచిదిగింది. ఆ ప్రాంతీయ అడవులను దాటింది. ఆ ప్రాంత పర్వతములమీద నున్న కిరాతుల రాజ్యం చేరింది. ఆ ప్రదేశం, సస్యసమృద్ధమై ఉన్నది. పశు సంపదతో తులతూగుతోంది. వివిధములయిన కందమూలాదులతో విరాజిల్లుతోంది. కీట, మృగపక్ష్యాదులతో శోభిల్లుతోంది. అపుడు రాత్రి పూట, అంధకారంలో, ఆ కిరాతపట్టణం ప్రవేశించింది. పట్టణం అంతా గాఢాంధకారబంధురంగా ఉంది. మహా భయంకరంగా ఉంది. ఆ సమయంలో మహావీరుడయిన, విక్రముడనే కిరాతరాజు నగరవాసులు నిద్రిస్తూ ఉండగా, దొంగతనానికీ, దారిదోపిడికీ, ప్రాణహింసకూ, బయలుదేరాడు మంత్రితో సహా. ఈ కర్కటి అనే రాక్షసి, రాజమంత్రులను ఇద్దరనూ చూచింది, వీళ్లు మూఢులు, ఆత్మజ్ఞానశూన్యులు. వీరి శరీరము భూమికి చేటు (భూభారము) ఇలాంటి మూర్ఖులు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ, దుఃఖం అనుభవించటానికే బ్రతుకుతూ ఉంటూరు. తన నిజ రూపమును తాను ఎరుగని మూఢుడు బ్రతుకుటకంటె చచ్చుటమేలు. వీళ్లు లోకానికి అనర్థకరులు. వీళ్లను ప్రయత్న పూర్వకంగా చంపాలి. సృష్ట్యారంభంలో అనాత్మజ్ఞులయిన మూఢులను చంపమనియే మాబోటి వాండ్లను నియమించాడు. కనుక వీళ్లను తప్పక భక్షించితీరాలి. దొరకిన అన్నం విడిచినవాడు మూఢుడంటూరు లోకులు. వీళ్లు ఒకవేళ ఆత్మజ్ఞానం గల మహాత్ములే అయినచో వాళ్లను చంపకూడదు. అలా చంపుట నాకు స్వభావంకూడా కాదు. కాబట్టి వీళ్లను పరీక్షించాలి. ఉత్తమ సుఖం కోరేవాళ్లనూ, ఆయుఃకీర్తులను వాంఛించే వాళ్లనూ, కోరిన వస్తువులను ఇచ్చి పూజించాలంటూరు పెద్దలు, నాశరీరం నశించినాసరే గుణవంతులను మాత్రం నేను చంపను. సజ్జనులు ప్రాణంకంటె గొప్పవారు. ప్రాణం ఇచ్చి అయినా సరే గుణవంతుని రక్షించాలి. రాక్షసి అయిన నేనే గుణవంతులను రక్షిస్తే, ఇంక అలాంటివారిని అందరూ పూజిస్తారు. గుణవంతులను తిరస్కరించడమే మృత్యువు. వాళ్లను ఆశ్రయించి యుండటమే జీవితము. కాబట్టి వీళ్ల యిద్దరను ఎంతమాత్రం జ్ఞానంకలవారో, కొంత ప్రశ్నించి చూస్తాను. తరువాత విశేషంగా ప్రశ్నిస్తాను. తరువాత నిర్ణయించుకుని దండిస్తాను. అని ఆలోచించు కున్నది కర్కటి.

# ౭౨ కర్కటి భయంకరోక్తులు

మేఘ గర్జన కావించి, రాళ్లవర్షంవలె నిష్ఠురంగా ఇలా అన్నది ఆ రాజ మంత్రి లిద్దరితో "ఓ దుష్టులారా! ఈ భీకరారణ్యంలో సూర్య చంద్రులవలె మెరుస్తున్నారు. చూడబోతే అజ్ఞానులుగా గోచరిస్తున్నారు. ఎవరు మీరు? ఎందుకు వచ్చారు ఇక్కడికి? ఇప్పుడు ఒక్క క్షణంలో మృత్యువు నోట్లో పడెదరు" అని అన్నది. ఆ రాజమంత్రులు కూడ సామాన్యులు కారు, వాళ్లు కూడా ఎదిరించి మాట్లాడినారు. "నీ వెవ్వరో చెప్పమన్నారు. తుమ్మెద రొదవంటి నీ అరపుకు భయపడమన్నారు. నీ సామర్థ్యం చూపమన్నారు. నీకోపమూ, నీపటాటోపమూ కట్టిపెట్టమన్నారు. త్వరగా ఎదుటకు రమ్మన్నారు. ఆలసించటం నీ చావుకే నన్నారు." ఆరాక్షసికూడ ఆ రాజు మాటలు విన్నది. తనరూపం బయటపెట్టదలచింది. ధైర్యసాహసాలు చూపదలచింది. మందహాసంతో గర్జించింది. ఆమోతకు దిక్కులపిక్కటిల్లి పోయాయి. దానిదంతకాంతులచే దాని ఆకారం వ్యక్తమయింది. ఆ రాజమంత్రు లిద్దరు దాన్ని చూచారు. కాని ఏమాత్రము చలించలేదు. నిజానిజములు వివేచించు వారలు చప్పున బెదరరు. ఇలా ఉండగా మంత్రి ఆ రాక్షసితో ఇలా అన్నాడు. ఓ మహారాక్షసీ! నీకీ క్రోధం ఎందుకు? నీచులు, కొద్దిదానికికూడ పెద్దగా కోపిస్తూ ఉంటారు. బుద్ధిమంతులకు ఇంతటి క్రోధం పనికిరాదు. వాళ్లు ఎప్పుడూ కార్యసాధకులుగా ఉంటారు. ఓ చిన్నదానా? నీ బోటి చిన్న పురుగులు వేలకొలది, మాధైర్యమనే గాలికి ఎగిరిపోతాయి. బుద్ధిమంతులకు ఆడంబరం ప్రధానంకాదు. కార్యసాధనే ప్రధానం. పని నెరవేరినా? నెరవేరకున్నా? మొట్టమొదట సామోపాయమే ప్రవేశపెట్టాలి. ఇది నియతి సిద్ధమయిన పద్ధతి. నీకోరిక ఏమిటో చెప్పుము. ఇంతవరకు ఏయాచకుడూ, మానుంచి వృథాగా పోలేదు. అందరూ వారి వారి కోర్కెలను తీర్చుకునే పోయారు. అని అన్నాడు మంత్రి.

విన్నది మంత్రిగారి మాటలన్నీ రాక్షసి. తనలో తాను ఇలా ఆలోచించుకుంది. "ఔరా! వీళ్లబుద్ధి ఎంత నిర్మలమయింది? ఎంతటిధీసులు వీరు? ఎంతటి బుద్ధిబలంగలవాళ్లు? వీళ్లు సాధారణమానవులు కారు. వీళ్ల చరిత్ర

చమత్కారంగా ఉంది. వీళ్ళచూపు, ముఖవర్చస్సు, మాటలనుబట్టియే వీళ్లు తత్త్వవేత్తలని తెలుస్తోంది. నదులు రెండూ కలిస్తే వాటి నీళ్లు ఏక మవుతాయి. అలాగే మాట, చూపు, ముఖవర్చస్సు కలిస్తే లోపల బుద్ధి కూడ వాటికి కలిసే ఉంటుంది. ఇపుడు మేము ఒకరి అభిప్రాయాన్ని ఒకరు గుర్తించాము. వీళ్లను చంపుట తగదు. ఆత్మదృష్టిగల వీళ్లు నాశ రహితులు. చావు అంటే నిర్భయంగా ఉండేవాళ్లు తత్త్వవేత్తలని నిర్ణ యించాలి. అది తప్పదు. కాబట్టి వీళ్లవల్ల నా సందేహాలు కొన్ని తీర్చు కుంటాను. ప్రాజ్ఞులు దొరికినప్పుడు తెలుసుకోనివాళ్లు నరాధములు.". అని, ఇలా ఆలోచించి, అడిగే సమయం కనిపెట్టి, నవ్వి ఆపుకొని అడి గింది. "ఓ ధీరులారా! ఎవరు మీరు? చెప్పండి. నిర్మలాంతఃకరణుల దర్శనం చేత మైత్రి చేకూరునుకదా!" అని మంత్రి జవాబు చెబుతాడు. "ఈయన గారు కిరాత రాజు నేను ఆయనగారికి మంత్రిని. మేమిద్దరం నీబోటి దురాత్ములను సంహరించడానికి రాత్రికాలంలో తిరుగుతూ ఉంటాము. రాజులకు దుష్టశిక్షణ, శిష్టరక్షణయే ముఖ్యకర్తవ్యము. స్వధర్మాన్ని యెవరూ విడువకూడదు. అది పెద్దతప్పు. అని అన్నాడు మంత్రి. మంత్రి మాటలు విన్నది రాకసి. "ఓ రాజా? నీ మంత్రి చాలా దురాత్ముడుగా ఉన్నాడు. ఇలాంటివాడు మంత్రిగా ఉన్న రాజు, రాజుగా అంగీకరించ బడడు. ఉత్తమ మంత్రిగలరాజే రాజు. ఎప్పుడూ రాజు తన వివేకంచేత ఆలోచించుకొని మంత్రిని మంచివాణ్ణిగా ఏర్పరచుకోవాలి, రాజు కీర్తి మంత్రిమీద ఆధారపడి ఉన్నది. రాజు ఎలా ఉంటే ప్రజలుకూడా అలాగే ఉంటారు. అన్ని గుణాలలోను, ఆత్మజ్ఞానం ఉత్తమము. అది గల రాజే రాజు. అది గల మంత్రే మంత్రి. రాజవిద్యయయిన ఆత్మజ్ఞానంగల ప్రభువే సమదృష్టితో పరిపాలించగలుగుతాడు. రాజవిద్య ఎరుగని మంత్రి మంత్రి కాడు. అట్టి రాజు రాజుకాడు, మీయుభయులకు రాజవిద్య (ఆత్మజ్ఞానం) ఉన్నచో, మీరు ధన్యులే. మీకు శ్రేయస్సు కలుగుతుంది. అది లేకపోతే మీవల్ల లోకానికి అనర్థం తప్పదు. అలాంటి అప్పుడు నావల్ల మీకు చావూ తప్పదు, కాబట్టి మిమ్ముల మ్రింగుతాను. నా ప్రశ్నలకు సారాన్ని మీరు స్వబుద్ధిచే విచారించుకోండి. ఓ రాజా? ఓ మంత్రీ? నేను అడుగ బోయే ప్రశ్నలకు సరియయిన జవాబు ఇవ్వండి, ఇదే నా కోర్కె.

నాకోర్కె తీర్చెదమని మీరు ముందుగా ప్రతిజ్ఞ చేసి యున్నారు. చెప్పినట్లు చేయనివాడు వ్యర్థుడు. అన్నది రాక్షసి.

## 83 కర్కటి అను రాక్షసి రాజ మంత్రులను ప్రశ్నించుట

రామచంద్రా! రాక్షసియొక్క మాటలు విన్నాడు కిరాతరాజు. అడుగుమని అనుజ్ఞయిచ్చాడు. ఇర్వదిరెండు ప్రశ్నలు అడిగింది రాక్షసి, క్రమంగా చెబుతా విను వాటిని.

1. ఉపాధిభేదంచేత అనేకమై, సముద్రమువలె అనంతమై, దుర్లక్ష మగుటచే అణువై, లక్షలకొలది బ్రహ్మాండములు నీటి బుడగలవలె పుట్టి లయించుటకు ఆధారమైనది ఏది?
2. శూన్యముకాని ఆకాశమేది?
3. ఏదియు కానిది, ఏదో ఒకటయినది ఏది?
4. నేను నేననుకొను వాడెవరు?
5. నీవు నేననుకొను వాడెవరు?
6. వెళ్లుచున్నను వెళ్లని వాడెవరు?
7. వెళ్లుట మానకున్నను మానిన వాడెవడు?
8. చేతనుడయినను అచేతనుడు (పాషాణము) ఎవరు?
9. చిదాకాశమునందు విచిత్రమును చిత్రించు వాడెవడు?
10. దహనశక్తిని విడువకయే, దహింపచేయలేని వహ్ని ఏది?
11. రాజా? వహ్నికాని ఏ వహ్నినుండి ఎప్పుడూ మంటలు బయలుదేరుచున్నవి?
12. సూర్యచంద్రాగ్ని నక్షత్రములు కాకున్ననూ, తరగని వెలుతురిచ్చేది ఏది?
13. కంటికి గోచరించకుండా కంటికి చూపునిచ్చున దేది?
14. తరుగుల్మలతాదులను, జాత్యంధులను, ఇంద్రియములులేని ఇతర జీవులను ప్రకాశింపజేయున దేది?

15. ఆకాశాది భూతములను పుట్టించున దేది?
16. వాటికి ఉనికిని ఇచ్చున దేది?
17. ప్రపంచమునకు రత్నాలపెట్టె ఏది?
18. ఏమణికి జగత్తు (ప్రపంచము) పెట్టె?
19. చీకటి వెలుతురు అగు సూక్ష్మ వస్తువేది?
20. ఉండి లేకుండునట్లుండు సూక్ష్మ వస్తువేది?
21. దూరముననుదగ్గరను ఉండు సూక్ష్మ వస్తువేది?
22. అణువై పెద్దకొండంతగా నుండున దేవి?
23. నిముషమై కల్పమగున దేది?
24. కల్పముగా నుండి నిముషమగునది ఏది?
25. ప్రత్యక్షంగా భాసించుచున్నను లేనట్లు గోచరించున దేది?
26. చేతనమయినను అచేతనమగునది ఏది?
27. వాయువగుచు వాయువుకాని వాడెవడు?
28. శబ్దమగుచు శబ్దముకాని వాడెవడు?
29. అంతా తానే అయి ఏదీ కాని వాడెవడు?
30. అహంభావ రూపముగాను అనహంభావ రూపముగాను ఉండు వాడెవడు?
31. అనేక జన్మలలో పొందియున్నను ప్రయత్న బాహుళ్యచే పొందదగినది ఏది?
32. ఏమాత్రము పొందబడనిది యేది?
33. పూర్ణముగా పొందబడనిది ఏది?
34. హాయిగా విషయసుఖములను అనుభవింపచు ఉచ్ఛస్థితిలో నుండి తనను తాను నశింపజేసికొను వాడెవడు?
35. ఏ అణువస్తువుచే మేరుపర్వతము తనలో ఇముడ్చుకొనబడినది?
36. ఏ అణువస్తువుచే ముల్లోకములు గడ్డిపోచగా జేయబడినది?
37. ఏ అణువస్తువుచే నూరామడ వ్యాపింపబడినది?

38. ఏది అణువయియే వందలకొలది ఆమడలలో ఇముడుటలేదు?

39. దేని ఆలోకనముచే (ప్రకాశముచే) ప్రపంచమనే బాలుడు నాట్యమాడించబడుచున్నాడు.

40. ఏ అణువస్తువు యొక్క ఉదరమునందు పర్వతముల రాసులున్నవి?

41. అణుత్వమును విడువకయే మేరువుకంటె స్థూలమగునది ఏది?

42. వెంట్రుకయొక్క చివరిభాగంలో నూరవవంతుగా చిన్నదగు ఏ వస్తువు పెద్ద కొండవలె స్థూలమై ఉన్నది?

43. వెలుతురును చీకటిని కనుపరచు అణువస్తువేది?

44. సృష్టి జ్ఞానములన్నియు ఏ అణువస్తువులో నున్నవి?

45. మధురాదిరసములు లేకున్ననూ తియ్యగా (రుచిగా) నుండునదేది?

46. అన్నిటినీ విడిచిననూ అన్నిటిని ఆశ్రయించిన అణువస్తువేది?

47. తనను తాను ఆచ్ఛాదించుకొనలేకున్ననూ, ప్రపంచమంతయును ఆచ్ఛాదించి యున్నదేది?

48. జగత్తు లయించి కనిపించకున్నను, ఏ అణుపదార్థముయొక్క సత్తా సామాన్యముతో స్వరూపముగానుండి మరల సృష్టిలో తల యెత్తుచున్నది?

49. అవయవములు లేకున్నను, అనేక చేతులు కాళ్లుగలది యేది?

50. నూరుకోట్ల అవాంతర కల్పములకు, మహాకల్పమునకు సాటియగు నిముషమేది?

51. విత్తునందు చెట్టువలె లోకములన్నీ ప్రళయంలో ఏ అణువునందున్నవి?

52. అవ్యక్తావధికములయిన ప్రపంచ బీజములు, సృష్టికాలంలో ప్రపంచరూపంగా వికసించినవైనను, ఎవనియందు ఎప్పుడూ పుట్టుటలేదు?

53. ఏ నిమేషముయొక్క లోపల ప్రళయమున్నది?

54. కారకములను ప్రవర్తింపజేయకున్నను, అన్నిటికి కర్త యగువాడెవడు?

55. భోగ్యవస్తువులు తయారగుటకు తానే దృశ్యరూపంగా మారుచు, తననే దృశ్యముగా జూచుచు, నేత్రములు లేకున్నను బాహ్యప్రపంచమును చూచు ద్రష్ట యెవడు?

56. దృశ్యమిథ్యాత్వసిద్ధికొరకు, ప్రపంచమును జ్ఞానముచే దిగమ్రింగినట్లు చూచుచు, ఎదుటనున్న ప్రపంచమునుకూడ చూడనివా డెవడు?

57. ద్రష్టృదృశ్య దర్శనములుఅను త్రిపుటిని భాసింపజేయువా డెవడు?

58. కటకాదులు బంగారముచే వ్యాప్తమయినట్లు, ఎవనిచే త్రిపుటి వ్యాప్తమగుచున్నది?

59. సముద్రముకంటె తరంగములు వేరుకానట్లు ప్రపంచము ఎవనికంటె వేరుకాదు?

60. మరియు సముద్రముకంటె తరంగము వేరుగ కనిపించుచున్నట్లు ప్రపంచము ఎవని ఇచ్ఛచే వేరుగ కనిపించుచున్నది?

61. నీటికంటె ద్రవత్వము వేరుకానట్లు, దేశకాలాపరిచ్ఛిన్నమును, అసత్కల్పమును, సద్రూపమును అగు ఏ వస్తువుకంటె ఈప్రపంచము వేరుకాదు? (ఏవస్తువుతో అభిన్నమగుచున్నది.)

62. బీజము తనలోనున్న చెట్టువలె త్రిపుటితోగూడి సదసద్రూపమైయున్న నీప్రపంచమును ఎవరు త్రికాలములందును ధరించియున్నారు?

63. భూతభవిష్యద్వర్తమాన కాలికమగు ఈమిథ్యాప్రపంచము అంతా ఏవస్తువునందు ఎల్లపుడు కలదు?

64. బీజము వృక్షరూపముగాను, వృక్షము బీజరూపముగాను, వికారము చెందినట్లు, తన ముఖ్యరూపమును తాను విడువకుండా, తాను నిర్వికారుడయినను, ప్రపంచరూపముగ పుట్టిన (వికారమును చెందిన) వాడెవడు?

65. తామరకాడలోని దారము ఏ వస్తువుద్వారా మహామేరువు? లేక ఏ వస్తువుద్వారా మహామేరువుకూడ బిసతంతువు. అనగా తామరకాడ అంతట దార్ఢ్యము లేనిది?

66. ఎవనియొక్క ఉదరమునందు మేరుమందరాది పర్వతములు కోట్లకొలది కలవు?

63. అనేకమంది చేతనులుగల ఈప్రపంచము ఎవరిచే సృష్టిక్రియచేత విస్తరింపజేయబడినది?

68. నీవు ఎవని రూపము నిజరూపముగా గలవాడవగుచు ప్రపంచ వ్యవహారములందు వ్యవహరించుచుంటివి?

69. ఎవరి బలముచే ప్రజలను పాలించుచుంటివి?

70. ఎవరి బలముచే వధ్యులను వధించుచుంటివి?

71. నీవు ఎవని సాక్షాత్కారముచే నిర్మలమయిన దృగ్రూపుడవగుచు వానితో అభిన్నుడ వగుచున్నావు?

72. నీవు ఎల్లపుడు నిజముగ ఎవని రూపుడవు?

'నీవు నాకు ఆవస్తువును చెప్పుము. నీ మృత్యువును తప్పించుకొనుము. రాజా! నీ సమాధానములచే నాసంశయములు నివారణ కావలెను. ఈ సంశయములను తీర్చనివాడు అజ్ఞానియే. పండితుడు కాడు. ఈ సంశయములను తీర్చనిచో నీవు నాజఠరాగ్నిలో హుతమగుదువు. తరువాత నీరాజ్యంలోని ప్రజలందరు హుతమగుదురు. కనుక నాప్రశ్నలకు తగు సమాధానము నిచ్చి నిన్ను నీప్రజలను కాపాడుకొనుము' అన్నది రాక్షసి—

## ౮౦. రాక్షసిప్రశ్నలకు మంత్రి సమాధానము చెప్పుట.

మంత్రి - రాక్షసీ! నీప్రశ్నలన్నిటికి నేను సరియయిన యుక్తులతో సమాధాన మిత్తును. అన్ని ప్రశ్నలూ పరమాత్మకు సంబంధించి ఉన్నవి.

ప్ర॥ ౧ కి సమాధానము:- మాటలకు విషయము కానివాడు, మనసుకు అందనివాడు - జ్ఞానేంద్రియము లయిదింటికి అంతుచిక్కనివాడు - ఆకాశముకంటె సూక్ష్మమయినవాడు, చిద్రూపుడయినవాడు పరమాత్మ. అతడే అణువు - అతనియందే ఈ అనంతబ్రహ్మాండములు, సదసద్రూపములుగా, విత్తునందు చెట్టువలెనున్నవి. దీనివలన, "ఏ అణువునందు జగత్తులు బీజమునందు వృక్షమువలె నున్నవి?" అను 56వ ప్రశ్నకుకూడ జవాబు వచ్చినది - సర్వవస్తువుల సత్త (ఉనికి) చైతన్యసత్తాధీనమయినందున, స్వతస్సిద్ధమయిన సత్తగల ఆత్మచైతన్యమునుంచియే సమస్త పదార్థములు సత్తను పొందుచున్నవి. కనుక "సత్తాయాః కః స్వభావః" అన్ని వస్తువులకూ సత్తాస్వభావము నిచ్చువాడెవడు? అను 16వ ప్రశ్నకుకూడ సమాధాన మిచ్చటనే వచ్చినది.

ప్ర॥ ౨ కు సమాధానము: పరమాత్మ బాహ్యంలోలేడు కనుక ఆకాశము. అన్నిటిలోపల చిద్రూపముతో ఉన్నాడు కనుక, అనాకాశము.

ప్ర 3 కు స॥ ము:- ఇంద్రియగోచరముకానందున ఆచిదణువు ఏదీకాదు - అదే సర్వాత్మకముకాన దానిని (ఆచిద్వస్తువును) సాక్షాత్కారంచేసికొని అనుభవిస్తే ఇంక మిగిలినదేదియునుండదు. ఈచిద్వస్తువు అద్వితీయము. భ్రాంతిచే అనేకముగా భాసించును. బంగారమునందు కటకాదులు ఎట్లు భ్రాంతివిలసితములో అట్లే. పరమాత్మయందు ప్రపంచము భ్రాంతి విలసితము. దీనివలన 59వ ప్రశ్న సమాహితమగుచున్నది.

ప్ర॥ ౪ స॥ ము:-మనము ఉభయులము "నేను" "నేను" అను జ్ఞానవస్తువు ఈ చిదణువేకాని వేరొకటికాదు. ఓ కర్కటీ! నీవు

అచ్చటచ్చట కొన్ని ప్రశ్నలందు అణుశబ్దమును పలుమారు ప్రయోగించిఉన్నావు. ఆ అణుశబ్దమునకు సర్వాత్మకమై, అయిదు జ్ఞానేంద్రియములకూ మనసునకూ అగోచరమై, అతిసూక్ష్మమైయుండు పరమాకాశమే (చిదాకాశమే) అర్థము – మరియు, "కోఽణుర స్తిచ నా స్తిచ" అను ప్రశ్నయందు, ఆ చిదణువస్తువువిషయమై, "నా స్తిచ" "లేనివాడు" అను అంశమును ఉదాహరించియున్నావు. ఆ యంశము నిలువదు. ఏలయన! "ఉన్నాడు" "లేడు" అని చెప్పే పురుషుడే ఆత్మ – వాడు ఉన్నట్లు వాడి అనుభవమే చెప్పుచున్నది. వాడే లేకపోతే, వాడు "లేడని" చెప్పుటయే పొసగదు. తాను లేనని తాను చెప్పుకొనుట కుదురునదికాదు. కనుక ఏ యుక్తివల్లనూ సద్వస్తువునకు అసత్త్వము (ఉన్నదానికి లేకపోవుట) కుదరదు. కర్పూరమును గుడ్డను కట్టి దాచియుంచినపుడు కొంత కాలమునకు హరించిపోయి అది స్వరూపముతో కనిపించకున్ననూ, దాని సుగంధముతో (పరిమళముతో) అది గోచరిస్తూనే ఉంటుంది. అలాగే పరమాత్మ నిష్కృష్టరూపంతో కనిపించకున్ననూ, అంతటా అనుస్యూతమై యున్న సద్రూపముతో ప్రత్యగ్రూపముతోనూ, కనిపించుచునే యున్నాడు. కనుక మొదటి ప్రశ్నలో నీవు ఉదాహరించిన అణుశబ్దార్థ నిర్ణయమునుబట్టి అణుశబ్దార్థమునకు సంబంధించిన 19, 20 ప్రశ్నలుకూడ సమాహితము లగుచున్నవి. ఈచిదణువే సర్వవ్యాపకమై ఉన్నది. మనస్సుతో పరిచ్ఛిన్నమై నానాత్వమును చెందుచున్నది. ఈ పరిచ్ఛేదరూపముతో సర్వమూ అగును. అపరిచ్ఛిన్నమయిన స్వాభావికరూపంతో "నకించిత్" ఏదీకాదు – ఇదే అభిప్రాయముతో నీవు "కఃసర్వం నచ కించిచ్చ" అని ప్రశ్నించియున్నావు. కనుక ఆ 30 ముప్పదవ ప్రశ్నకూడ తీరిపోయినది. నీవు మొట్టమొదటి ప్రశ్నలో "ఏకస్యానేకసంఖ్యస్య" అని అడుగుటలో కూడ నీ అభిప్రాయమిదియే. ఆ సందేహమును దీనితో దీర్చుకొనుము.

ప్ర॥ 17–64 లకు సమాధానము – ఈచిదణునే, నిరుపాధిక రూపముతో ఏకము అద్వితీయము – భిన్నభిన్నోపాధులందు ప్రత్యగాత్మరూపముతో గోచరించుటచే భిన్నము, ఇతడే సత్యప్రపంచ

మును ధరించియున్నాడు. ఇతడే జగత్కోశము, కనుక ఈ ప్రసంగ వశమున "నిత్యం సమస్యకస్యాంతః" "కోజగద్రత్నకోశః" అను 64, 17 ప్రశ్నలుకూడ గతప్రాయములు.

ప్ర॥ 59-60 ప్రశ్నలకు సమాధానము:- ముల్లోకములు అను తరంగములన్నీ చిత్తవికల్పరూపములు. అయ్యవి చిత్తరూపముగ పరిణమించిన చిత్సముద్రముకంటె వేరుకావు. ఆ చైతన్యముయొక్క సంకల్పంచేతనే అవి వేరుగ గోచరించుచున్నవి.

ప్ర॥ 61 కు సమాధానము:- దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమయిన ఈచిదణువు, మనస్సు మొదలగు ఆరు యింద్రియములకు లభ్యముకానందున అసత్తునూ (శూన్యమును) అందరకు "అహం" "అహం" "నేను" "నేను" అని ఆత్మానుభవముండుటచే సత్తునూ (అశూన్యమునూ) అగుచున్నది. ఇద్దానికంటె ప్రపంచము వేరు కాదు. మొదటి ప్రశ్నయొక్క సమాధాన ప్రసంగంతో దానికి సంబంధించిన మరికొన్ని ప్రశ్నలకు సమాధానమిచ్చి ఇంక యథాక్రమముగ సమాధానమిచ్చుచున్నాడు.

ప్ర॥ 4 కు స॥ ము:- అద్వైతజ్ఞానము సిద్ధించుటవలన నేను నీ ఆత్మరూపుడ నయినందున నీవే అగుచున్నాను. నీవుకూడ నా ఆత్మరూపుడవయినందున "నేను" అగుచున్నావు. 'నీవు-నేను' అనునవి వ్యవహారదశలోకాని, పరమార్థంలోనివి కావు.- పరమార్థంలో అపరిచ్ఛిన్నాత్మరూపులము - తత్త్వజ్ఞానంవల్ల త్వత్తా అహంతలు (నీవు-నేను అనుబుద్ధులు) నశించే యెడల నీవూ లేవు, నేనూ లేను, సర్వమూ లేదు, అంతా తానే అవుతాడు.

ప్ర॥ 6 కు స॥ ము:- ఆ చైతన్యము, ఆకాశమువలె కొన్నివేల ఆమడలు వ్యాపించియున్ననూ, వెళ్ళునదికాదు. దేశవైశాల్యమను నది ఆ చైతన్యమునందు స్వప్నమువలె కల్పితము.

ప్ర॥ 7 కు స॥ ము:- ఈపరమాత్మ వెళ్ళినా, వెళ్ళినవాడు కాడు - వచ్చిననూ, వచ్చినవాడు కాడు - దేశకాలములనునవి ఆత్మసత్తాకోశములోనివికాని, తద్భిన్నములుగావు - ఘొందదగిన (వెళ్ళ

తగిన) దేశాంతరము వాని శరీరములోనేఉంటే, వాడు యింకెచటికి వెళ్ళును? తన పైటకొంగుచాటున పాలుతాగు పిల్లవానిని తల్లి మరొకచోట వెదకునా? అలాగే వెళ్ళతగిన మహావిశాలదేశమంతయు, ఉత్పత్తి ప్రళయముల రెంటియందునూ, నిఖిలప్రపంచ సృష్టికర్తఅయిన పరమాత్మయొక్క స్వరూపంలోనే ఉంటే, ఇంక నాపరమాత్మ యెచటికేగును? కుండయొక్క మూతికి గట్టి గుడ్డతో వాసెన కట్టి మరొక చోటికి తీసికొనిపోవుచో, ఆ కుండలోని ఆకాశము మరొకచోటునకుపోయినదా? లేదు. అట్లే ఆత్మకుకూడ దేశాంతర గమనాదులు లేవు.

ప్ర॥ 8 కు సమాధానము:- "కశ్చేతనోపి పాషాణః" అను ప్రశ్నకు చిద్రూపుడయిననూ, జడరూపుడగువాడెవడు? అని యర్థమగుచున్నది. ఇందుకు సమాధానము – జడమయిన దేహాదులకు ఆత్మతాదాత్మ్యాధ్యాస వలన చేతనత్వము కలిగినందున, ప్రకాశ స్వభావము అబ్బినది. వస్తుతః జడములు కనుక జడత్వమున్నది. ఈ రెండును అనుభవగోచరమగుచున్నవి. వివేకజ్ఞానం లేనందున ఆత్మ జడబోధోభయరూపు డగుచున్నాడు – రాక్షసీ! "చేతనుడయిననూ, రాయివలె, ఘనమైన (బరువయిన) వాడెవడు? అని నీ ప్రశ్నకర్థమగుచో, అపుడు, పారమార్థికాత్మరూపమయిన చిద్ఘనమే ఆ పాషాణము" అని సమాధానము.

ప్ర॥ 9 కు స॥ ము:- అనాద్యంతమయిన పరమాకాశమందు, చిన్మాత్రుడగు పరమాత్మచే విచిత్రమయిన జగచ్చిత్రము నిర్మింపబడుచున్నది. నిజస్థితిలో అది మిథ్యయగుటచే చేయబడినదికాదు.

ప్ర॥ 10 కు స॥ ము:- ఆత్మసత్తయే వహ్నిసత్త. ఆత్మసత్త అంతటా కలదు. కనుక వహ్నిసత్తకూడ అంతటా ఉన్నట్లే. కాని అంతటా తగలపెట్టుటలేదు. అంతమాత్రంచేత, ఆసత్త అంతటా లేదనటానికి వీలులేదు. ప్రపంచంలోని అన్ని వస్తువులనూ, అగ్నివలె ప్రకాశింపజేయునది ఆ ఆత్మవస్తువే.

ప్ర॥ 11 కు స॥ ము:- ప్రజ్వలించు సూర్యునివంటి ఆకారము లనాదును, ఆకాశమునకంటె నిర్మలుడగువాడు, పరమాత్మ. అతడు

నిజంలో వహ్నికాడు. అతనినుంచి వహ్ని (అగ్ని) అనే భూతము పుట్టుచున్నది.

ప్ర॥ 12 వ స॥ ము:- భారూపుడై, సూర్యాగ్నిచంద్రాదులనుగూడ ప్రకాశింపజేయువాడు పరమాత్మ - ఎన్ని మహాకల్పములు గడచినా ఆతని ప్రకాశము తరగదు. ఆత్మచైతన్యము బుద్ధిగుహయందు దీపము వంటిది. హృదయాకాశమును ప్రకాశింపజేయును. ఆ ప్రకాశము నేత్రాదీంద్రియ లభ్యముకాదు. అయ్యది అనుభవ రూపము. దానినుంచియే సర్వము ప్రకాశము నొందుచున్నది. కావున నది పరమప్రకాశము. మనకు గలిగెడి అహంకారాది ప్రత్యయంతయు (నేనను జ్ఞానము) మనస్సు మున్నగు ఆరు యింద్రియములకు ఆవలనుండు ఈ ఆత్మనుంచియే కలుగుచున్నది. గాఢాంధకారంలో ఉన్నవానినికూడా "నీ వెక్కడనుంటివి" అని అడిగితే "నే నిక్కడనే ఉంటిని" అని జవాబు చెప్పును. వాని కా యంధకారమున "నేను" ఇక్కడ ఉన్నాను అను జ్ఞానము ఈ ఆత్మ ప్రకాశవల్లనే కలుగుచున్నది.

ప్ర॥ 14 వ స॥ ము:- లతాగుల్మాంకురాదులను, జాత్యంధులను, ఇంద్రియములులేని యితర జీవులను పోషించువాడు, సర్వసాక్షియగు ఈ పరమాత్మ.

ప్ర॥ 15 వ స॥ ము:- ఆకాశాది భూతములకు కర్త ఈపరమాత్మ.

ప్ర॥ 16 వ స॥ ము:- అన్ని వస్తువులకు సత్తాస్వభావము నిచ్చువాడు ఈ పరమాత్మ.

ప్ర॥ 17 వ స॥ ము - అణువయిన ఈపరమాత్మయే ప్రపంచమునకు మణిమయమయిన పెట్టె.

ప్ర॥ 18 వ స॥ ము:- మాతృ, మాన, మేయాత్మకమయిన జగత్తు అద్వితీయాత్మయందు లేదు. ఆ అద్వితీయాత్మయే ప్రపంచంతో అంతటా ప్రకాశిస్తున్నాడు - కనుక పరమాత్మ అనే గొప్ప రత్నమునకు ప్రపంచమనేది పెట్టె (కోశము).

ప్ర॥ 19 కు స॥ ము:- ఆ చిదణువు తెలియబడదు కనుక చీకటి. చిన్మాత్రుడు కనుక ప్రకాశరూపుడు (వెలుతురు).

ప్ర॥ 20 కు స॥ ము:- అతడు సంవిద్రూపుడు కనుక ఉన్నాడు. ఇంద్రియాతీతుడు కనుక లేడు.

ప్ర॥ 21 కు స॥ ము:- అతడు, ఇంద్రియ గోచరుడు కాడు కనుక దూరుడు. చిద్రూపుడు కనుక సన్నిహితుడు.

ప్ర॥ 22 కు స॥ ము:- ఆ చిదణువే, కారణము లేకుండగనే అందరిచేతను "నేను నేను" అని తన ముందటనున్న కొండవలె ప్రత్యక్షముగా తెలియబడుచుండుట వలన నీవు దానిని "మహాగిరి" అని యంటివి. ఆత్మచైతన్యమాత్రమే ప్రపంచరూపముగా భాసిస్తున్నది. నిజంలో శైలాదులు లేవు. కనుక ఆ చిదణువునందే మేర్వాది శైలములు కల్పితములు. కనుక నీవు ఆ చిదణువును మహామేరు వంటివి.

ప్ర॥ 23-24 కు స॥ ము:- నిముషముగా ప్రతిభాసించుట (తోచుట) నిముషమనీ, కల్పముగాతోచుట (ప్రతిభాసించుట) కల్పమనీ అంటున్నారు లోకులు. ఒక్క నిముషకాలంలో ఒక్క కల్పములో కాదగిన పనులు నెరవేరినట్లు భాసించును. అప్పుడా నిముషము కల్పమనదగును. అనేక కోట్ల ఆమడల విశాలమయిన మహాపట్టణము అణువైన మనస్సునందు గోచరించును. నిర్మలమయిన అద్దంలో మహానగర నిర్మాణము గోచరించును. నిమేషములూ, కల్పములూ, శైలాదులూ, కోట్లకొలది ఆమడలను దేశవైశాల్యమూ, ఇవన్నీ ఏ చిదణువునందు మిథ్యారూపంతో భాసించుచున్నవో, అచ్చట భేదాభేదములుకూడ మిథ్యగానే ఉండవచ్చును. దుఃఖసమయంలో కొద్దికాలం అతిదీర్ఘమవును. సుఖసమయంలో అతిదీర్ఘకాలం చాల కొద్దిదవును. హరిశ్చంద్రునకు ఒక్కరాత్రి పన్నెండు సంవత్సరములయినదట. కాబట్టి ఇవన్నీ చిత్తవృత్తులను అనుసరించిన చిద్విలాసములు, యదార్థములు కావు. నిజస్థితిలో నిమేషమూ, కల్పమూ, దూరమూ, సమీపమూ, అనేవి లేవు. చిదణువుయొక్క ప్రతిభయే

ఇలా భిన్నభిన్నవస్తువులుగా గోచరించుచున్నది. అధిష్ఠానచైతన్య రూపంతో వీటికి పరస్పర విరోధంకాని భేదంకాని లేదు.

ప్ర॥ 25 వ స॥ ము:- బాహ్యాభ్యంతర ఇంద్రియములకు తమతమ విషయములను గోచరింపజేసికొను శక్తి నిచ్చుటచే పరమాత్మ ప్రత్యక్షము – ఆ ఇంద్రియములకు గోచరుడు కానందున అప్రత్యక్షము- ఇతడే సర్వప్రపంచానుస్యూతమయిన సద్రూపముతో ప్రకాశించుటవలన సద్రూపుడు, నిష్కృష్టరూపముతో ప్రకాశించనందున అసద్రూపుడు. – సువర్ణమునందు కటకమను బుద్ధి యుండునంతవరకు సువర్ణ మను బుద్ధి యుండదు. అలాగే బ్రహ్మ యందు దృశ్యబుద్ధి యుండునంతవరకు, వాస్తవమయిన చిదేకరసాత్మ బుద్ధి కలుగదు. కటకమనుబుద్ధి నివర్తించినచో సువర్ణమనుబుద్ధి విస్తరించును. దృశ్యబుద్ధి (ప్రపంచబుద్ధి) నివర్తించినచో నిర్మలాద్వితీయ బ్రహ్మసాక్షాత్కారము ఉదయించును.

ప్ర॥ 26 వ స॥ ము:- పరమాత్మ చేతనాత్మకుడు ( చేతన రూపుడు ) కనుక చేతనుడు. చేత్యుడు (చిత్తమునకు గోచరుడు) కాడు కనుక అచేతనుడు అని నీ యభిప్రాయము. ప్రపంచము చిత్తుయొక్క చమత్కారము. చిత్తుయొక్క ప్రతిభారూపము. దానిలో చిత్తు, చైత్యము, అను భేదమును కల్పింప వలనుపడదు. మిక్కిలి ఎండ యొక్క ప్రకాశ మృగతృష్ణిక- అతిప్రచురమయిన అద్వితీయచైతన్య భానము జగత్తు – సంధ్యాకాలమున నభోమండలమందు సోకిన సూర్యకిరణముల వలన ఆకసము బంగారమువలె ఎర్రగానుండ- నది బంగార మనుకొనుట యెట్టిదో, జగద్భానముకూడ నట్టిదే – ఇందు "చిత్తు, చైత్యము" అను విషయవిభాగము భ్రాంతము. స్వప్న గంధర్వనగరమందు, సంకల్పనగరమందును, గోడలున్న వనుకొనుట యెట్టిదో ప్రపంచము ఉన్నదనుకొనుటకూడ అట్టిదే – ఇలాంటియుక్తులచే ప్రపంచమిథ్యాత్వము అబ్బి, బ్రహ్మసాక్షాత్కారం అయితే మళ్ళీ వాడికి సంసార సంబంధముండదు. ఇంతవరకు కొన్ని ప్రశ్నలకు మంత్రి జవాబు చెప్పాడు. మిగిలిన ప్రశ్నలను రాజుకు వదిలాడు సమాధానమిచ్చుటకు – వాటిలో రెండుమూడు ప్రశ్నలకు కలిపి

సమాధానమివ్వదలచాడు - అందులో ద్వైతమిథ్యాత్వ ప్రసంగ మునుబట్టి "ద్వైతమయినను ఎవనికంటె వేరుగాదు?" అను 61వ ప్రశ్నకు సమాధాన మిచ్చుచున్నాడు, మంత్రి.

ప్ర॥ 61 కు స॥ ము:- భేదసంస్కార సంస్కృతమయిన బుద్ధి వృత్తిలోని ఆత్మ ప్రకాశముయొక్క చమత్కారంవల్ల ద్వైతం తోస్తుంది. అయినా అది చిత్ప్రకాశముకంటె వేరుకాదు.

ప్ర॥ 62 కు స॥ ము:- ఒకేరూపముగల విత్తనము అంతర్గత మయిన వృక్షాకారము కలదిగ ఎట్లున్నదో, అట్లే ఏకరూపమయిన బ్రహ్మ అసంఖ్యాకమయిన జగద్రూపముగ నున్నది. 'ఓ రాక్షసీ! ఇట్లే మిగిలిన నీప్రశ్నలన్నిటికీ పరమతాత్పర్యవిషయము, అద్వితీయ చిన్మాత్రముతప్ప వేరుకాదు' - అని ముగించాడు మంత్రి.

## ౬౧. రాజు రాక్షసిప్రశ్నలకు సమాధాన మిచ్చుట.

రాజా! నీమంత్రివాగ్వైఖరి చాలాపవిత్రము - ఇందు నీయభి ప్రాయ మేమి? అన్నది రాక్షసి.

రాజు:- రాక్షసీ!- పరమాత్మ జాగ్రదాద్యవస్థాత్రయాతీతము - అవస్థాత్రయసాక్షి - తురీయము - చిత్పదార్థము - దీనిని ఆశ్రయిం చిన చిత్తము సర్వసంకల్పములను విడచును. ఈతడు సంకోచము చెందిన,ప్రపంచము ప్రళయము నొందును. ఈతడు వికసించిన ప్రపంచ సృష్టి జరుగును. ఇది వేదాంత వాక్యములకు పరమలక్ష్యము - వాచామగోచరము - ఇది "సత్త్వము, అసత్త్వము, భానము, అభా నము" (ఉండుట, లేకుండుట, కనిపించుట, కనిపించకుండుట), అను కోటిద్వయరూపము ఈచరాచరప్రపంచము. ఇతనియొక్క చిత్తమగు హిరణ్యగర్భునియొక్క లీల - ఈతని అఖండాకారము ఖండితము కాదు. ఇట్టి శాశ్వత సన్మాత్ర పరబ్రహ్మనుగూర్చి నీవు ప్రశ్నించి తివి ఇంక మామంత్రిమిగిల్చిన ప్రశ్నలకు జబాబును చెప్పెదవినుము.

రాక్షసి ప్రశ్న 27:- వాయువగుచు వాయువుకానివా డెవడు?

రాజు - సమాధానము:- ఈ అణురూపుడగు బ్రహ్మ లేక

యందే వాయుత్వమును ఆరోపించుకొనుటవలన భ్రాంతిచే వాయువు- పరమార్థంలో అవాయువు (వాయువుకాదు) శుద్ధచేతనుడు.

రాక్షసి ప్ర॥ 28:- శబ్దమగుచు శబ్దముకానివా డెవడు?

రాజు స॥ ము:- భ్రాంతిచే తనయందు శబ్దమును కల్పించుకొనుటవలన బ్రహ్మ శబ్దమగుచున్నాడు. నిజంలో చేతనుడుకాని శబ్దరూపుడుకాడు.

రాక్షసి ప్ర॥ 29:- అంతా తానే అయి ఏదీ కానిదేది?

రాజు - స॥ ము:- ఆ బ్రహ్మణువే భ్రాంతిదశలో సర్వప్రపంచమయి, పరమార్థదశలో కేవలుడు గనుక ఏదియునుగాడు.

రాక్షసి ప్ర॥ 30-31 - అహంభావరూపముగాను అనహంభావరూపముగాను ఉండునదేది?

రాజు - స॥ ము:- అహంభావానహంభావరూపముతో నుండునదికూడ ఆ బ్రహ్మమే. అహంకారమును వేరుగ నిష్కర్షించుచో (విడదీయుచో) అహంకారరూపుడు, ఆ అహంకారముకూడ బ్రహ్మస్వరూప మనుకొనుచో, బ్రహ్మ అనహంకారరూపుడే. - ఈ రెండు భావములకు భ్రాంతి ప్రతిభాశక్తి, వాస్తవ ప్రతిభాశక్తులే కారణములు.

రాక్షసి ప్ర॥ 32-33:- ప్రయత్నబాహుళ్యముచే పొందదగినదేది? పొందియున్నందున ఇంక ప్రయత్నబాహుళ్యముచే - పొందదగినది, లేని దేది?

రాజు - స॥ ము:- ప్రయత్నబాహుళ్యముచే పొందదగినవాడు పరమాత్మ. అతడు ఆత్మరూపుడుగా ఇంతకుమున్నే యున్నందున ఇపుడు ప్రయత్నముచే పొందిన విశేషమేమియు లేదు. కాన ప్రయత్నము నిష్ఫలమని నీయభిప్రాయము.

రాక్షసి ప్ర॥ 34:- పొందినను, పూర్ణముగా పొందబడనిది యేది?

రాజు - స॥ ము:- సంసారమూలమయిన అజ్ఞానము నశించునంతవరకు ఆత్మ పొందబడియున్నను, పూర్ణముగా పొందబడినవాడు కాడు, జ్ఞానముచే అజ్ఞానము నశించగా ఆత్మ పూర్ణముగా పొంద

బడును. కాబట్టి జ్ఞానమునుగూర్చిచేయు ప్రయత్నము వ్యర్థముకాదు. అజ్ఞాన నాశముకొరకు ప్రియత్నము అవసరము.

రాక్షసి ప్రి॥ 35:- హాయిగా విషయసుఖములను అనుభవించుచూ తనను తాను నశింపజేసికొను నదేది?

రాజు - స॥ ము:- ఊసరక్షేత్రమునందు ప్రసరించిన గ్రీష్మ తాపము (వేసవి ఎండ) నీటిసాకారమును ధరించినట్లు. ఈ చిదణువు సాకారభావమును దాల్చి వాస్తవమయిన తనదు చిద్రూపమును పోగొట్టుకొనుచున్నాడు.

రాక్షసి ప్రి॥ 36-37 - ఏ అణువస్తువుచే మేరుపర్వతము లోపల ఇముడ్చుకొన బడినది? ఎవనిచే ముల్లోకములు గడ్డిపోచవలె చేయబడినవి?

రాజు - స॥ ము:- ఈ చిదణువుచే మేరుపర్వతము, లోపల ఇముడ్చుకొనబడినది. ఈచిదణువుచేతనే ముల్లోకములు గడ్డిపోచవలె చేయబడినవి. కాని ఆరెంటిని, లోపలివాటిని బయటికి కక్కినట్లుగ బాహ్యమున చూచుచున్నాడు. సాంకల్పికస్త్రీకాని, తదాలింగనము కాని, లోపల మనస్సులోనివి అయినను, దానికి బాహ్యసంస్కారము కారణమయినందున బాహ్యమునందు జరిగినట్లు చూస్తారు కాముకులు.

రాక్షసి ప్రి॥ 38 - అణువయినను, అనేకవందల ఆమడలు నిండియున్నదేది?

రాజు - స॥ ము:- పరమాత్మ పరమాణువు అయినను, చిన్మాత్ర రూపముతో విశ్వమంతయు నిండియున్నాడు.

రాక్షసి ప్రి॥ 39 - ఏది అణువయినను వందల ఆమడల ప్రిదేశంలోకూడ ఇముడుటలేదు?

రాజు - స॥ ము:- ఆత్మ సర్వవ్యాపకుడగుటవలననూ, ఆది మధ్యాంతములు లేనందువలననూ, రూపరహితుడగుటవలననూ, నిరా కారుడగుటవలననూ, అణువైనను వందల ఆమడలలోకూడ ఇము డుట లేదు,

రాక్షసి ప్రి॥ 40 - ఎవని చూపుచే ప్రిపంచబాలుడు నాట్యమాడుచున్నాడు?

రాజు - స॥ ము:- ధూర్తుడయిన విటునిచేత స్త్రీలు భ్రూవికార ములచేతను, చూపులచేతను, చేష్టలచేతను తకతకలాడుచున్నారు.

అలాగే చిదాలోకముచేతకూడ జగద్బాలుడు వశపరచుకొని నాట్య మాడించబడుచున్నాడు.

రాక్షసి ప్ర॥ 41 - ఏ అణువుయొక్క ఉదరమునందు మేర్వాది పర్వతములున్నవి?

రాజు – ప॥ ము:- పరమాత్మ అణువయినను, అనంతుడు (అపరిచ్ఛిన్నుడు) కనుక, అతనియందు మేర్వాది పర్వతములన్నియు నున్నవి.

రాక్షసి ప్ర॥ 42 - తనయందలి అణుత్వమును విడువకుండా మేరుపర్వతముకంటె స్థూలమయిన అణువేది?

రాజు – స॥ ము:- పరమాత్మ అణువయినను, సూక్ష్మమయినను, దేశకాలవస్తు పరిచ్ఛేదరహితుడయినందున, తనయందలి అణుత్వమును విడువకుండగనే మేరువుకంటె స్థూలమయినాడు. కర్కటీ! నీవు ప్రతి ప్రశ్నలోనూ పరమాత్మయందు ప్రయోగించిన అణుశబ్దమునకు మామంత్రి "పరమాత్మ ఆకాశముకంటెకూడ సూక్ష్మము కనుక" అణువని అర్థమును చెప్పెను. నీ వద్దానిని అంగీకరించితివి, అది తగదు. అతిసూక్ష్మమయినంత మాత్రమున పరమాత్మ అణువని చెప్పుట యొప్పదు. పరమాత్మకు పరమాణువుతో సాదృశ్యమును జెప్పుట, ఆవగింజకు మేరుపర్వతముతో పోలిక చెప్పినట్లుండును. అపరిచ్ఛిన్నమయిన పరమాత్మను సూక్ష్మముగా ఉన్నంతమాత్రం చేత పరిచ్ఛేదంలో పరమావధి స్థానాన్ని అలంకరించిన పరమాణువుతో పోల్చి, అణువని ప్రయోగించుట ఉచితముకాదు. "అణోరణీయాన్" "ఏషోఽణురాత్మా" ఇత్యాదిశ్రుతులందు మాత్రము మాయాకల్పితమయిన పరమాత్మయందలి అణుత్వమును నిమిత్తముగా జేసికొని ముఖ్యవృత్తితోడనే బాధబడినది. సామ్యమును పురస్కరించుకొనికాదు.

రాక్షసి ప్ర॥ 43 - వెంట్రుకయొక్క చివర భాగంలో నూరవవంతు చిన్నదిగానుండి, పెద్దకొండవలె స్థూలమయినదేది?

రాజు – స॥ ము:- అత్యంత సూక్ష్మముగానున్నను అతిస్థూలముగ నున్నాడు పరమాత్మ.

రాక్షసి ప్ర॥ 44 – చీకటి వెలుతురులను కనుపరచు అణువస్తువేది?

రాజు – స॥ ము:– చిద్రూపమయిన ఆత్మదీపముచే చీకటి, వెలుతురు ప్రకాశించుచున్నవి. ఈ ఆత్మదీప మనేదియే లేక ప్రకాశము కాని మరొకటికాని లోకంలో కలిగేయెడల వాటికి స్వరూపనాశమే కలిగేది. అనగా ప్రతివస్తువునకూ ఆత్మసత్తయే సత్త – ప్రత్యేక సత్త ఏవస్తువునకులేదు. అట్టియెడ ఆత్మదీపములేని వస్తువులకు ప్రత్యేకముగ సత్త (ఉనికి) లేనందున అవి అసద్రూపములు అగును. ఆత్మదీపమే లేనియెడల ప్రపంచము గుడ్డిది అయ్యేది. అందరిలోనుండే శుద్ధచిన్మాత్రమే బాహ్యప్రపంచంలో తేజస్సులోకూడ ఉండి వహ్ని అయినది. ఆత్మదీపములేనిదే సూర్యచంద్రాగ్నులుకూడ లోకమును ప్రకాశింపచేయలేవు. అవికూడ ఆత్మప్రకాశంవల్లనే ప్రకాశించుచున్నవి. కనుక ఒక్క చిదాదిత్యుడే రాత్రింబవళ్ళు అలసటచెందక లోపల, వెలుపల, ప్రకాశించుచున్నాడు. తుదకు రాతిలోకూడ అతడే ప్రకాశించుచున్నాడు. అతనివల్లనే ముల్లోకములు ప్రకాశించుచున్నవి. వెలుగుచున్న సూర్యునిచేతనే పద్మోత్పలములు రెండూ ప్రకటింపబడుచున్నవి. చైతన్యముచేతనే ప్రకాశతమస్సులు రెండూ ప్రకటింపబడుచున్నవి. సూర్యుడు అహోరాత్రులను చేయుచూ, వస్తువుల ఆకారమును చూపుచున్నాడు. చైతన్యము, సదసత్పదార్థములను తయారుచేసి, వాటి యాకారమును చూపించుచున్నది.

రాక్షసి ప్ర॥ 45 – వృత్తి (అనుభవ) జ్ఞానములన్నియు,
ఏ అణుపదార్థములోనున్నవి?

రాజు – స॥ ము:– పత్రపుష్పఫలాదుల రసములు తేనెటీగలు కూర్చిన తేనెలో నున్నట్లు, వృత్తిజ్ఞానములన్నియు చిదణువునందే ఉన్నవి.

రాక్షసి ప్ర॥ 46 – మధురాదిరసములు లేకున్నను తియ్యగానుండున దేది?

రాజు – స॥ ము:– మధురాదిరసములు లేకున్నను తియ్యగా నుండునది రసరూపుడయిన పరమాత్మ.

రాక్షసి ప్ర॥ 47 – ఏ అణువుచే అన్నీ విడువబడినవి?
ఏ అణువుచే అన్ని ఆశ్రయింపబడినవి?

రాజు – స॥ ము:– చిదణువుచే సర్వమూ విడువబడినది అదిక

ణువుచే సర్వమూ ఆశ్రయించబడినది. పరమాత్మ ఆప్రకాశతో సర్వమును విడిచాడు. ప్రకాశతో సర్వమును ఆశ్రయించాడు.

రాక్షసి ప్ర॥ 48 - తనను తాను అచ్ఛాదించుకొనలేని ఏ అణువుచే జగత్తుఅంతయు అచ్ఛాదింపబడినది?

రాజు- స॥ ము:- ఆకాశమువలె సర్వవ్యాపకుడయిన పరమాత్మ తనను అచ్ఛాదింపజేసికొనుటలో (దాచుకొనుటలో) అసమర్థుడయినాడు. సర్వవ్యాపకమయిన చైతన్యముతో ప్రపంచమును అచ్ఛాదించుటలో సమర్థుడయినాడు. గడ్డిమాత్రము మొలచియున్న అడవిలో ఏనుగు తనను దాచుకొనలేదు. అట్లే ఆకాశమువలె సర్వవ్యాపకుడయిన పరమాత్మ తనను దాచుకొనజాలడు. అయిననూ ఆత్మ తన నిజరూపమును తాను తెలిసికొని తనను కాపాడుకొనుచున్నాడు. పిల్లవాడు మెలకువతో నున్నపుడు పొలంలోని ధాన్యమును కాపాడుకొనగలడు. నిద్రలో కాపాడుకొనలేడు. ఇంతటి స్వప్రకాశపరిపూర్ణాత్మకుకూడ ఘనమయిన మాయాశక్తివల్ల ఆత్మవిస్మృతి (నిజరూపమును మరచుట) కలుగుతుంది.

రాక్షసి ప్ర॥ 49 - ప్రపంచము ప్రళయంలో నశించిననూ, ఎవని సత్తాచేత జీవించియున్నది?

రాజు - స॥ ము:- ప్రళయములో లయం చెందిన ప్రపంచము చైతన్యముయొక్క సత్తను ఆధారముగ జేసికొని జీవించియున్నది. (సంస్కార రూపముతోనున్నది) వనముయొక్క శోభ వసంతకాల రసమును ఆధారపరచుకొనియుండును. వసంతఋతువునందలి పల్లవపుష్పలతాదులు, వసంతరసములే - అట్లే ప్రపంచము చిన్మయమే.

రాక్షసి ప్ర॥ 50-అవయవములు లేకున్నా అనేక చేతులూ, కాళ్ళూ గలవాడెవడు?

రాజు - స॥ ము:- నాలుగు విధములయిన భూతజాలములకూ పరమాత్మ ఆత్మరూపుడు కనుక అతనికి స్వయముగ అవయములు లేకున్ననూ, భూతజాలముయొక్క అవయవములతో పరమాత్మ అవయవములు కలవాడగుచున్నాడు.

రాక్షసి ప్రశ్న॥ 50 – అనేక అవాంతర కల్పములు, మహాకల్పములూ ఎవనికి నిముషములు?

రాజు – స॥ ము:– స్వప్నంలో వార్ధక్య బాల్యములు తనకు తనయందే ప్రతిభాసించినట్లు, చిదణువుయొక్క ప్రతిభావిశేషాలు, కల్ప మహాకల్పములు అవి అతనియందు నిముషమాత్రము లగును. నిముషకాలపు స్వప్నంలో కొన్ని కల్పములు చరిత్ర భాసించును. కనుక చిదణువుయొక్క నిముషకాలము మహాకల్పప్రాయము. కలలో అన్నము తిననివానికి తినినట్లు భాసించును. అట్లే ఒక్క నిముష కాలం ఒక్క కల్పంగా భాసిస్తుంది. ఇది అంతయు ప్రతిభాస మాత్రము.

రాక్షసి ప్ర॥ 52 – విత్తునందు చెట్టువలె, ఏ అణువునందు ప్రపంచములుండును?

రాజు – స॥ ము:– చిదాత్మ అను పరమాణువునందు ప్రపంచములు ఇమిడియున్నవి. ఆతని నుంచియే మరల పుట్టుచున్నవి.

రాక్షసి ప్ర॥ 53 – సృష్టికాలంలో ప్రపంచరూపంగా స్పష్టపడెడి సకలప్రాణిబీజములూ ఎవనియందు ఎల్లప్పుడు ఉంటున్నవి?

రాజు – స॥ ము:– అతీతానాగత వర్తమానభూతములన్నీ చిదాత్మయందే ఎల్లప్పుడూ ఉంటున్నవి.

రాక్షసి ప్ర॥ 54 – నిమేషకల్పములు ఎవనియందున్నవి?

రాజు – స॥ ము:– బియ్యపుగింజ, పైపొట్టు (ఊకచే) చుట్టబడియున్నట్లు, నిముషకల్పములచే ఈ చిదణువు చుట్టబడియున్నాడు.

రాక్షసి ప్ర॥ 55 – ప్రయోజనం లేకుండా సాధనములను ప్రవర్తింపజేయకుండా అన్నిటికి కర్తయగువా డెవడు?

రాజు – స॥ ము:– పరమాత్మ ఉదాసీనుడు. వేనిని ప్రవర్తింపజేయడు. కర్తృత్వభోక్తృత్వములతో అంటడు – అయినను, అన్నిటికీ ఆత్మరూపుడు కనుక కర్త. ప్రపంచముయొక్క ఉత్పత్తి, సత్త, ఈరెండును శుద్ధచిత్పరమాణువునుంచియే కలుగుచున్నవి. కాని పరమాత్మకు క్రియాసంబంధం లేకుండా కర్తృత్వమూ, భోగసంబంధం లేకుండా భోక్తృత్వమూ, అధ్యాసచే కల్పింపబడుచున్నది. ప్రపంచము

కూడ అధ్యాసికము. నిజంలో లేదు - వ్యవహారదశలో ఉన్నదను కొనుచున్నారు. కనుక వేదాంతములు లేదని నిషేధించుచున్నవి. రాక్షసీ! శాస్త్రసిద్ధాంతంలో ప్రపంచం మిథ్య - "వాచారంభణం వికారోనామధేయం..." అను శ్రుతి యిందుకు ప్రమాణము.

రాక్షసి ప్ర॥ ౫౨ - భోగ్యవస్తువులు తయారగుటకు తానే దృశ్యరూపంగా మారి (కనిపించి) తనను తానే దృశ్యముగా జూచుకొనుచూ, నేత్రములు లేకున్ననూ బాహ్యప్రపంచమును చూచు ద్రష్ట యెవరు?

రాజు స॥ ము:- చిదణువగు పరమాత్మయే దృశ్యప్రపంచము నెరవేరుటకు తనలోపలనున్న చిద్వ్యాప్తమయిన మాయాశక్తిని ప్రసరింపచేసి, బాహ్యప్రపంచాకారమును ధరించాడు - చిద్రూప మయిన ప్రపంచంలో లోపల వెలుపల అను శబ్దములు అధికారు లయిన మానవులకు ఉపదేశించుటకు కల్పించబడిన శబ్దములుగాని, అందు నిజమైన అర్థములేదు - ఆత్మ అవిద్యావరణము లేనివాడుకనుక నిత్యాపరోక్షుడు (ఎల్లప్పుడు ప్రకాశించువాడు). అంతఃకరణతోకూడి యెల్లప్పుడు ప్రకాశించుచు, అంతఃకరణమునందలి యభిమానముచే ద్రష్టఅగుచున్నాడు. అతడే బాహ్యవిషయములతోకూడి విషయుడై (దృశ్యమై) ఇంద్రియగోచరు డగుచున్నాడు. నేత్రగోలకముద్వారా [illegible]వచ్చిన మనోవృత్తిద్వారా బయటికి వచ్చినవాడై, సద్రూప మైన ఆత్మతత్వమును, అసత్తులైన ఘటాదుల రూపమువలె నున్న ఆత్మనుగా, తనచైతన్యముతోనే తాను జూచుచున్నాడు. ఇంతే కాని నేత్రముతో చూచుటలేదు. నేత్రముద్వారమాత్రము. అందు వలన నీవు నేత్రములేకుండా చూచువాడెవడని అడిగితివి. సద్రూపు డైన ఆత్మ అసద్రూపుడు ఎన్నటికిని కాడు. ఆత్మకు ద్రష్టృత్వము కూడ మిథ్యాభూతములైన దృశ్యములను అపేక్షించియున్నందున మిథ్యయేకాని వాస్తవంకాదు. ద్రష్టృత్వ దృశ్యత్వములు పరస్పరాపే క్షములు. తండ్రిలేనిదే కొడుకు ఉండడు. కొడుకులేనిదే తండ్రికాడు. భోక్తలేనిదే భోగ్యముకాదు. భోగ్యములేనిదే వీడు భోక్త కాడు. అల్లాగే ద్రష్టలేనిదే దృశ్యముండదు. దృశ్యంలేనిదే ద్రష్ట ఉండడు. ఇలా ఈ రెండూ పరస్పరాపేక్షకలవైనందున రెండూ మిథ్యయే

అనాలి. ద్రష్టృదృశ్యములను నిర్మించుటయందు శుద్ధచైతన్యమునకు శక్తి కలదు. స్వచ్ఛమైన సువర్ణమునకు కటకాదులను నిర్మించుశక్తి యున్నది. జడమయిన దృశ్యమునకు మాత్రము ద్రష్టను తయారు జేయు (నిర్మించు) శక్తి లేదు. చైతన్యము లేనిపోని దృశ్యములను నిర్మించి వాటియందు సత్యత్వబుద్ధిని (భ్రాంతిని) పుట్టించుచున్నది. బంగారము కటకాదులను తయారుచేసి వానియందు కటకాదిబుద్ధిని పుట్టించుచున్నది. "ఇది కలకము (మురుగు)" అను బుద్ధిఉన్నంత వరకు, అదిబంగారమైననూ, బంగారమనుబుద్ధిపుట్టదు. అలాగే ద్రష్ట దృశ్యంగా ఉన్నా, దానియందు దృశ్యమనేబుద్ధి ఉన్నంతవరకుద్రష్ట స్ఫురించదు. దూరస్థమైన వస్తువునుచూచి, అది మనుష్యుడా? పశువా అని సందేహించినపుడు, "ఇది పశువు" అను బుద్ధి పుట్టినచో అపుడు మళ్లీ మనుష్యుడను బుద్ధి పుట్టదు. మనుష్యుడను బుద్ధి పుట్టినచో, పశువను బుద్ధి పుట్టదు. ఇదే దీనికి దృష్టాంతము. జీవుడు బహిర్ముఖుడైనపుడు దృశ్యము స్ఫురించును. అంతర్ముఖుడైనపుడు ద్రష్ట స్ఫురించును. ఈ ఉభయముఖత్వము ఒకేకాలమున ఎవ్వనికిని కలుగదు. కనుక దృశ్యబుద్ధి దశలో ద్రష్టృబుద్ధి పుట్టదు. ద్రష్టృబుద్ధిదశలో దృశ్యబుద్ధి పుట్టదు.

రాక్షసి ప్రః 57 దృశ్యమిధ్యాత్వసద్ధి కొరకు తనను దృశ్యరహితమైన పరిపూర్ణాత్మనుగా జూచుకొనుచూ ఎదుటనున్న దృశ్యప్రపంచమును చూడనివాడెవడు?

రాజు – సః ముః– తత్త్వజ్ఞానంవల్ల దృశ్యదృష్టి నశించగా ద్రష్టయొక్క నిజరూప సాక్షాత్కారం అవుతుంది. కటకబుద్ధి నశిస్తే కేవల సువర్ణబుద్ధి పుట్టినట్లు. అపుడు ఆత్మ తన పరిపూర్ణరూపమును సాక్షాత్కారం చేసుకుంటూ ఉంటాడు.

రాక్షసి ప్రః 58 – ద్రష్టృ, దృశ్య, దర్శనములను త్రిపుటిని భాసింపజేయువాడెవడు?

రాజు – సః ముః– చిన్మాత్రమైన పరమాత్మయే త్రిపుటిని భాసింపజేయుచున్నాడు.

రాక్షసి ప్ర॥ 59 - బంగారము కటకాదులను వ్యాపించినట్లు జగత్రియమును వ్యాపించినవా డెవడు ?

రాజు - స॥ ము :- బంగారము కటకాదులను వ్యాపించినట్లు పరమాత్మయే జగత్రియమును వ్యాపించియున్నాడు.

రాక్షసి ప్రశ్న॥ 60 - సముద్రముకంటె తరంగములు వేరుకానట్లు ఈప్రపంచము ఎవనికంటె వేరుకాదు?

రాజు స॥ ము :- భూతములకంటె భౌతికపదార్థము లెట్లు వేరుకావో అట్లే సర్వవ్యాపీ,సర్వానుభవరూపుడూ అయిన పరమాత్మ కంటె ప్రపంచము వేరుకాదు.

రాక్షసి ప్ర॥ 61 - సముద్రముకంటె తరంగములు వేరుగ కనిపించినట్లు ఈప్రపంచము ఎవని యిచ్ఛచే వేరుగా కనిపించుచున్నది ?

రాజు - స॥ ము :- రాజు ఈప్రశ్నను దూషించుచున్నాడు. రాక్షసీ! ఈపరమాత్మయొక్క ఇచ్ఛచేతనే తరంగములు సముద్రము కంటె వేరుగలేనట్లు, ప్రపంచముకూడా పరమాత్మకంటె వేరుగలేదు.

రాక్షసి ప్ర॥ 62 - నీటికంటె ద్రవత్వము వేరుకానట్లు, దేశకాలాపరిచ్ఛిన్నమై అసత్కల్పమై (లేనిదానితో సమానమై) నద్రూపమయిన, ఏవస్తువుతో ద్వైత ప్రపంచము అభిన్నము ?

రాజు - స॥ ము :- పరమాత్మ సమస్త భూతములకు ఆత్మ రూపుడు. సర్వానుభవరూపుడు (చిద్రూపుడు) అద్వితీయుడు. దేశ కాలవస్తు పరిచ్ఛేదరహితుడు, సద్రూపుడు. కాని, కంటితో చూచి ననూ మనస్సుతో ఆలోచించిననూ, తెలియబడడు. కనుక శ్రుతి యందు ఈతడు అసద్రూపుడని చెప్పబడినది.ఇంతేకాని వాస్తవంగా అసద్రూపుడనే అభిప్రాయముచేకాదు. కనుక సర్వప్రపంచ రూపు డయిన పరమాత్మయందు ద్వైతాద్వైతము లనునవి లేవు. రెండవ వస్తువుయొక్క వ్యావృత్తి (భేదము) కొరకు కల్పింపబడినందున మిథ్యయే అగుచున్నది. ద్వైతాద్వైతము లనునవి పరస్పరాపేక్ష ములు - ఎండనీడలవంటివి. ద్వితీయ వస్తువులేనిదే ఏకత్వ ముండదు,

ఏకత్వములేనిచే ద్వయమనేది సున్న. ఇట్లుండ, ( నిజస్థితిలో పరమాత్మయందు ద్వైతాద్వైతములు లేకపోవుచుండగా) ద్వైతాద్వైతములు కలవానివలె తోచుచున్నాడు పరమాత్మ. అతనికంటె ప్రపంచము వేరుకాదు. అభిన్నము.

రాక్షసి ప్ర॥ 63 - బీజము తనలోనున్న చెట్టునువలె, సదసద్రూపమై త్రిపుటీరూపమయిన యీ ప్రపంచమును ఎవడు త్రికాలములయందును ధరించియున్నాడు ?

రాజు - స॥ ము :- విత్తులో చెట్టుఉన్నట్లు ప్రశాంతమయిన బ్రహ్మయందు నానారంభవిలాసమయిన ప్రపంచమున్నది. బంగారముకంటె కటకాదులు వేరుకానట్లు బ్రహ్మకంటె ఈ ద్వైతప్రపంచము వేరుకాదు. సమ్యగ్జ్ఞానముగలవానికి ఈద్వైతము జ్ఞానాత్మకమేకాని వేరుకాదు. అజ్ఞానముకూడ సద్రూపమేకాని సన్మయము కాదు. నీటికంటె ద్రవత్వమూ, గాలికంటె చలనమూ, ఆకాశముకంటె శూన్యమూ వేరుకానట్లు ఈశ్వరునికంటె ద్వైతము వేరు కాదు. ద్వైతాద్వైతజ్ఞానము ప్రవృత్తిమార్గమునకేకాని, నివృత్తిమార్గమున కుపకరించదు. ప్రవృత్తిమార్గము దుఃఖప్రదమేకాని సుఖము నీయదు. ఈరెంటిని పూర్తిగా మరచుటయే నిపుణత - ద్వైతాద్వైతములతో అంటనివాడే పరమాత్మ.

రాక్షసి ప్ర॥ 64 - భూతభవిష్యద్వర్తమానకాలికమగు ఈ మిథ్యా ప్రపంచము ఏవస్తువునందు ఎల్లప్పుడు కలదు?

రాజు- స॥ ము:- భూతభవిష్యద్వర్తమానకాలికమూ మాతృమానప్రమేయాత్మకమూ, ద్రష్టృదృశ్యదర్శనాత్మకమునగు ఈప్రపంచము సాక్షిచైతన్యమునందు ఎల్లకాలము కలదు. ఈ ప్రపంచాణువు మేరుపర్వతమువంటి పరమాత్మచే తనయందు కల్పించుకొనబడు చున్నది. తనయందే లయింపచేసికొనబడుచున్నది. అద్దములో కనిపించె కొండవలె పరమాత్మోదరంలో భాసించే యీ ప్రపంచము కేవలముభ్రాంతిము. కనుకనే ఇదిబృహదభ్రమయని నీవంటివి. రాక్షసీ! ఈ ప్రపంచభ్రాంతి ఒక పెద్దమాయ. అద్వైతవాదంలో మాయ

కూడ లేదుకదా? అనే పక్షంలో ఈజగత్తు చిదణువేకాని వేరుకాదు. కనుక ప్రపంచ ప్రత్యయము (జ్ఞానము) కేవలము భ్రమ - మాయిక మయిన ఈప్రపంచము చిన్మాత్ర పరమాణువునందే కల్పింపబడినది. పత్రపుష్పఫలాదులతో విస్తృతమగు వృక్షము బీజము (గింజ) నందే వున్నది. పారమార్థికదృష్టి కలవానికి చిదణువుయొక్క ఉదరమునందే ఈ ప్రపంచమంతయు భాసించును. శాఖాఫలపుష్పములతో కూడిన తరువు తనరూపమును విడువకయే బీజకోటరమునందున్నది. అట్లే వికసితమయినట్టి (విస్తృతమయిన) ఈ జగత్తుకూడ చిదణువునందే భాసించుచున్నది.

రా॥ప్ర॥ 65 - విత్తనము చెట్టుగానూ, చెట్టు విత్తనముగానూ అయినట్లు
తన రూపమును తాను విడువకుండా తాను పుట్టకున్నను
జగద్రూపమున పుట్టినవా డెవడు?

రాజు - స॥ ము:- బీజకోశమునందు వృక్షమువలె ద్వైతాద్వైతప్రపంచము చిదణువునందు కలదని గుర్తించినవాడే వివేకి (జ్ఞాని). నిజస్థితిలో ద్వైతంలేదు, అద్వైతంలేదు. బీజంలేదు- వృక్షం లేదు. స్థూలంలేదు, సూక్ష్మంలేదు - పుట్టిందిలేదు - చచ్చిందిలేదు- ఉన్నదీలేదు - పోయిందీలేదు - ప్రశాంతనుయినదీలేదు - సంక్షోభం చెందినదీలేదు. ఈ త్రిజగత్తులు చిదణువులోనివే. అంతకంటె వేరుగ వాయ్వాకాశాదులుకూడలేవు. ప్రపంచాప్రపంచములు సున్న ఆనందరసరూపమగు ఆ పరాచిత్తుమాత్రమే ఉన్నవస్తువు. అదియే సర్వము. ఆ చిత్తు పూర్వాపూర్వవాసనానుగుణముగా ప్రతిభాసించు చుండును. స్వాత్మరూపమయిన సృష్టి ప్రతిభాసతో విజృంభించినప్పటికి, నిష్ప్రపంచమగు స్వరూపాకాశమునందు, ఏకాత్మరూపముతో నుండియే సమగ్రాత్మరూపముతో (నిఖిలప్రపంచరూపముతో) నున్నది. ఇంతియెకాని భిన్నరూపముతో నుండికాదు. ఇందుకు దృష్టాంతము- చెట్టు విత్తనములను (గింజలను) కాయుచూ, తన వృక్షధర్మమును విడువకుండగనే, విత్తనరూపముతో ఆవిర్భవించి (పుట్టి) నేల మీద పడుచున్నది. మరల కొంతకాలమునకు అదే వృక్షరూపముగా తయారవుచున్నది. అట్లే పరతత్త్వముకూడ జగద్భంగితో ఉదయించు

చున్నది. చావుపుట్టుకలనే కల్పనలను పొందుచున్నది. కాని ఈ రెంటికి కొంతభేదము కలదు. అదేమన? చెట్టు తన నిజస్థితిని (తన వృక్షరూపమును) విడిచి బీజరూపమును చెందుటలేదు. వృక్షరూపముతో గూడ వికారమును చెందుచున్నది. చిదాత్మాణువుమాత్రము అట్లు కాదు. సర్వాత్మాస్వరూపము, అద్వితీయము, సర్వప్రపంచాను గతమయిన సద్రూపమగుటవలన నిర్వికారముగనే ఎల్లప్పుడుండును.

రాక్షసి ప్ర॥ 66 – రాజా! తామరకాడలోని దారము దేనిద్వారా మహామేరువంతటి స్థూలమగుచున్నది?

రాజు – స॥ ము:– రాక్షసీ! పరమాణువుద్వారా బిసతంతువు (తామరకాడలోని దారము) మహామేరు వగుచున్నది. బిసతంతువు కంటికి కనిపించును. దృశ్యమువును. పరమాణువు కంటికి కనుపించదు. అట్టి పరమాణువుయొక్క లోపలకూడ నుండువాడు పరమాత్మ (పరబ్రహ్మ). అలాంటి పరమాత్మలో మేరుమందరాది పర్వతములు కోట్లకొలది చిద్ఘనములుగా (పరమాత్మ చైతన్యస్వభావములుగా) నున్నవి.

రాక్షసి ప్ర॥ 67 – ఉపాధిభేదముచే అనేకమునుండి చేతనులతోగూడిన ఈప్రపంచము ఎవరిచే వ్యాపించబడినది?

రాజు – స॥ ము:– రాక్షసీ! నేనింతవరకు నిరూపించియున్న అద్వితీయ, సర్వవ్యాపక చిదాత్మచేతనే యీప్రపంచము వ్యాప్తమై యున్నది. రాక్షసీ! నీవడిగిన ప్రశ్నలో " తతమ్ " అని యున్నది. దానిని "ప్రపంచము ఏరూపముతో విస్తరింపచేయబడినది" అని అర్థమగుచో, అపుడు 'తతం, విరచితం, జనితం, కృతంచ!' అని నాలుగు రకాల సమాధానము: పరమాత్మచే అపంచీకృత పంచభూతముల రూపముతో విస్తరింపచేయబడినది. ఆ భూతములను పంచీకరణము చేసి బ్రహ్మాండములుగను, చతుర్దశభువనములుగను చేయబడినది. అందు దేవతలు, నరులు, సురలు, తిర్యగ్జంతువులు అనుభేదమున కొందరు ప్రాణులు పుట్టింపబడినవి. వారలకు సుఖదుఃఖానుభవము కొరకు విషయభేదము ఏర్పరుపబడినది. ఆకాశము శూన్యమైననూ, చిత్రవిచిత్రమయిన గంధర్వనగరాది దృశ్యమును కనుపరుస్తుంది.

అయిననూ, అదిమాత్రం శూన్యమయిన ఆకసముగానే ఉంటుంది- అట్లే యీ పరమాత్మకూడ.

రాక్షసీ! దీనిచేతనే ప్ర॥ "68, 69, 70," నీవు ఏవస్తువు యొక్క సారంచేత అన్ని వ్యవహారములందును ప్రవర్తించుచుంటివి? "పాలించుచుంటివి?" "వధించుచుంటివి?" అనునవికూడ సమాహితములగుచున్నవి.

రాక్షసి ప్ర॥ 71 – నీవు ఎవనిని సాక్షాత్కారముచేసికొని, నిర్మలమయిన చిన్మాత్రుడవగుచూ, వానితో అభిన్నుడ వయితివి?

రాజు – స॥ ము:– రాక్షసీ! నేను యథాస్థితమగు ఆత్మతత్వ సాక్షాత్కారంచేత శుద్ధజ్ఞానరూపుడనై ప్రపంచరూపమును వదలి పరమాత్మతో అభిన్నుడనయితిని.

రాక్షసి ప్ర॥ 72 – లేక నీవు ఎల్లప్పుడు నిజముగ ఎవనిరూపుడవు?

రాజు – స॥ ము:– రాక్షసీ! నేను ఎల్లప్పుడూ అద్వితీయ బ్రహ్మరూపుడనే అగుచున్నాను. అని జవాబు చెప్పాడు కిరాతరాజు కర్కటి అనే రాక్షసికి–

కిరాతరాజు నోటినుంచి విషయమంతా విన్నది కర్కటి. ఆత్మ తత్త్వాన్ని గ్రహించింది. తనజాతిచాపల్యాన్ని విడిచిపెట్టింది. మాత్సర్యాన్ని రూపుమాపుకుంది. సంసారతాపమును పారద్రోలుకుంది. వర్షకాలపు నెమలివలెనూ, వెన్నెలసోకిన కుముద్వతి (కలువల కొలను) వలెనూ మనస్సును చల్లపరుచుకుంది. పరమానందమును పొందింది. ఇలా అన్నది రాజుతో. "ఆహా! రాజా! మీ బుద్ధి ఎంత పవిత్రమైనది. అస్తమయములేని వివేకభానునిచే భాసిస్తోంది. చంద్రమండలమునుండి ప్రసరించెడి వెన్నెలవలె చల్లగావుంది. స్వచ్ఛంగా వుంది. సమరసంగా వుంది. నీ హృదయమునుండి వెలువడిన వివేకామృతకణికను గ్రోలి నేను నీబోటి వివేకవంతులే ముముక్షువులకు శరణ్యు లని నిర్ణయించుకున్నాను. మీబోటి సజ్జనుల సాంగత్యమున మనస్సు వికసిస్తుంది. చంద్రునివల్ల కుముద్వతి వికసిస్తుంది. పుష్పసాంగత్యమున పరిమళ మబ్బును. సత్సాంగత్యమున

శుభమబ్బును. సూర్యసంపర్కమున పద్మాకరము శోభిల్లును. మీ బోటి మహాత్ముల సాంగత్యము దొరికినచో సంసారదుఃఖము ఇంక తలయెత్తదు. (బాధించదు) దీపము చేతిలో గలవానిని చీకటి ఏమీ చెయ్యలేదు. ఈ అడవిలో భూలోకభాస్కరులవలె సంప్రాప్తమైన మీ యిరువురు నాకు పూజనీయులు. మీ శుభమయిన కోర్కెను సెలవిండు. దానిని తీర్చి నేను ధన్యురాల నయ్యెదను.'' అని అన్నది కర్కటి.

రాజు:-రాక్షసీ! ఈప్రదేశములో జనసమూహాన్ని విషూచికా వ్యాధి (మహామారి)మిక్కిలి బాధిస్తోంది. కనుక నే ఈరాత్రికాలంలో నేనిచట తిరుగుచున్నాను. మానవులహృదయశూలము మందులతో తగ్గదు. మీబోటి మహనీయులనుండి మంత్రమును తెలుసుకొనుటకే నేను బయలుదేరాను. అజ్ఞానులను వధించుటలో ఆరితేరిన మీబోటి వార్లను నిగ్రహించడమే యిపుడు నాపని. ఆ సంకల్పము యిపుడు సిద్ధించినది 'రాక్షసీ! ఇంక నీవు యేజీవినీ హింసించనని ఒప్పుకో'' అన్నాడు రాజు. రాక్షసి అందుకు అంగీకరించింది. ఇకముందెన్నడు ఏప్రాణినీ హింసించనని ప్రతిజ్ఞ చేసింది. రాజు దానిని ఇలాఅడిగాడు. ''రాక్షసీ! పరుల రక్తమాంసాలను భుజించి కాలమును గడిపే నీకు ఇప్పుడు ఈ అహింసావ్రతము ఎలా సాధ్యపడుతుంది? ఎటుందుబ్రతుకు తెరువు ఎలా నీకు?'' అన్నాడు.

రాక్షసి:—రాజా! ఈపర్వతంమీద ఆరునెలలు సమాధిలో ఉండి ఇప్పుడే సమాధినుంచి లేచాను. భోజనసంకల్పం కలిగింది. ఈకోరిక పుట్టింది.మళ్ళీఇప్పుడు కొండశిఖరంచేరి నిశ్చలధ్యానంలో కొయ్యబొమ్మవలెఉంటాను. పరమాత్మను ధ్యానిస్తూవుంటాను.ధారణా యోగంలో ఉంటాను.తరువాత నాకు కోరికగలిగినప్పుడు శరీరాన్ని విడిచిపెడతాను.శరీరత్యాగపర్యంతమూ, (నేనుబ్రతికియున్నంతవరకు)ఏప్రాణినీ చంపను. ఇప్పుడు నేనుచెప్పే విషయాన్ని విను. ఇక్కడ ఉత్తర దిక్కుగా హిమవత్పర్వతం వుంది. తూర్పుసముద్రంనుంచి పడమటి సముద్రంవరకు వ్యాపించి ఉంది. శరత్కాలచంద్రునివలె తెల్లగా ఉంటుంది.దానిమీద బంగారుశిఖరంలో ఒకానొక గుహలోఉంటాను

నేను. నాపేరు కర్కటి. నేను రాక్షసిని. రూపం ఇనుముతో తయారైన మేఘమువలె ఉంటుంది నాది. 'అయ్యా! నేను జనసమూహాన్ని చంపాలనే కోరికతో బ్రహ్మనుగూర్చి తపస్సుచేశాను. బ్రహ్మగారివల్ల వరం పొందాను. సూదిరూపంగానూ విషూచికా(మహామారి)అనే వ్యాధిరూపంగాను తయారయినాను నేను. బ్రహ్మగారివరంవల్ల. అనేకసంవత్సరాలు విషూచిక అనే వ్యాధిరూపంతో అనేకమంది జీవులను హింసించాను, భక్షించాను. ఇంతవరకు కాలం గడిపాను. గుణవంతులను మాత్రం చంపవద్దని బ్రహ్మగారు నన్ను నియమించాడు. అందుకై మంత్రమునుకూడ ప్రసాదించాడు. ఆమంత్రానికి వశమైపోయాను నేను. బ్రహ్మదత్తమయిన ఆమంత్రాన్ని నీకు యిస్తున్నాను తీసికో. దీనితో ప్రపంచంలోగల వ్యాధులన్నీ నశిస్తాయి. నావల్లకలిగే బాధనుగూర్చి చెప్పనేపనిలేదు. ఇదివరలో నేను చాలకాలం హింసాకాండలో ప్రవేశించాను. చాలమంది ప్రాణుల హృదయనాడులను పీల్చిపిప్పిచేశాను. వారిరక్తమాంసాలు చూరగొన్నాను. వారంతా నిస్సారంగా ఉన్నారు. వారిసంతానం కూడ అలాగే తయారవుతుంది. కనుక 'రాజా! ఈవిషూచికామంత్రాన్ని నీవు గ్రహించు, నీకిది సిద్ధిస్తుంది. మహాత్ములకు సాధ్యం కానిది లేదు. కనుక ఈనదీతీరానికి పోదాము రండి, అందులో స్నానంచేసి మీయిద్దరు పరమనిష్ఠలో ఉండగా మీఉభయులకూ మంత్రోపదేశం చేస్తాను. తొందరగా రండి' అని అన్నది రాక్షసి.

వసిష్ఠుడు:- రామచంద్రా! ఆరాత్రి ముగ్గురూ సుహృద్భావంతో నదీతీరం చేరారు. రాక్షసియొక్క భావాన్ని అన్వయవ్యతిరేకాలతో నిర్ణయించుకున్నారు. స్నానం చేశారు. ఆచమనం చేశారు. శిష్యులులాగ నిలబడ్డారు. రాక్షసి బ్రహ్మోపదిష్టమయిన మంత్రాన్ని ఉపదేశించింది. వారిద్దరినీ విడిచి తనస్థానానికి వెళ్లతలచింది. అప్పుడు రాజు ఇలా అన్నాడు. "రాక్షసీ! నీవు యిప్పుడు మాకు గురువు అయ్యావు, స్నేహితురాలవుకూడా. నీకింత ఆతిథ్యమును యియ్యదలచాము మేము. మాస్నేహాన్నీ మాకోరికనూ వ్యర్థపుచ్చకు - మహాత్ములదర్శనమాత్రంచేతనే ప్రేమ (సౌహార్దము)

పెరుగుతుందంటారు. నీశరీరాన్ని తగ్గించుకొని సుందరంగా, అలంకారయుక్తంగా తయారయి మాయింటికి రమ్మ' న్నాడు రాజు. ఆరాక్షసి రాజుమాట విని ఇలా అంటుంది.'రాజా! అందమైన ఆడవేషం వేసుకున్న నాకు భోజనంపెట్టగలవుకాని, రాక్షసాకారాన్ని ధరించిన నన్ను నీవు దేనితో తృప్తిపరుస్తావు? నాకు రాక్షసాహారమే (రక్తమాంసాదులే) రుచిస్తాయికాని, ఇతరమయిన ఆహారం రుచించదు. జన్మసిద్ధమయిన నారాక్షసస్వభావం నేను చచ్చేటంతవరకు మారదు' అని అన్నది. అయితే 'రాక్షసీ! నీవు చక్కని బంగారు ఆభరణాలతో శోభిస్తూ కొన్నిరోజులు మాయింట్లో ఉండు. నారాజ్యంలోని దుర్మార్గులనీ, దొంగలనీ చంపదగిన పాపాత్ములను అందరినీ తెచ్చి నీకోరికతీర ఆహారంగా అర్పిస్తాను. అప్పుడు నీవు అందమైన ఆడరూపాన్ని విడిచి రాక్షసశరీరం ధరించి, ఈవధ్యులందరినీ హిమవత్పర్వతశిఖరానికి తీసికొనిపోయి సుఖంగా ఏకాంతంలో భోంచెయ్యి. తృప్తితీర భోంచేసి కొంతసేపు నిద్రించి, భుక్తాయాసం తీరినతర్వాత సమాధిలోకి పో. సమాధినుంచి లేచినతరువాత మళ్ళీ అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చి మిగిలినపాపులను (చంపదగిన పాపులను) తీసికొనిపోతూ ఉందుగానివి. ఇలాంటివాళ్ళను చంపితే హింసాదోషం లేదు. ధర్మయుక్తమయినహింస దయతో సమానం. కనుక సమాధినుంచి లేచినతరువాత ఇక్కడకు తప్పకరా. దుర్మార్గులతోనయినా స్నేహం స్థిరపడితే ఇంక తొలగదంటారు. పెద్దలు' అన్నాడు రాజు. 'రాజా! నీవు మంచిమాట చెప్పావు అలాగే చేస్తాను. సుహృద్భావంతో చెప్పినమాటను ఎవరు అంగీకరించరు?' అన్నది రాక్షసి.

వ॥ రామచంద్రా! ఆకర్కటి అనే రాక్షసి ఇలా అని, బంగారు దండకడియాలూ, బంగారు మురుగులూ, ముత్యాల హారాలూ, పట్టుచీర, పూలమాలలూ, ధరించిన అందకత్తెగా తయారయింది. ఆరాజమంత్రులను "పోదాము రండి" అని హెచ్చరించింది. ఆరాత్రి పూటనే వాళ్ళిద్దరూ ముందు బయలుదేరారు. ఈమెకూడ వెంట నడిచింది. ముగ్గురూ ఆరాత్రి రాజగృహాన్ని చేరి, ఖులాసామాటలతో రాత్రి అంతా గడిపారు - తెల్లవారింది. రాక్షసి పట్టమహిషి

లాగ అంతఃపురంలో ఉంది. రాజమంత్రులుమాత్రం తమతమ పను లలో నిమగ్నులయ్యారు. ఆరురోజులలో ఆరాజు ఇతరదేశాలనుంచీ, తనదేశంలోనూ మూడువేలమందిని చంపదగినవాళ్ళను సంపాదించి ఇచ్చాడు. ఆనాటిరాత్రికాలంలో ఆరాక్షసి మళ్ళీ బ్రహ్మాండమైన నల్లటి రాక్షసి అయింది. ఈమూడువేలమందినీ కావిడివేసికుంది (భుజమండలంలో ఇముడ్చుకున్నది). ఆరాజుతో చెప్పి హిమత్పర్వ తానికి తీసికొనిపోయింది. దరిద్రుడికి బంగారం దొరికినట్లుంది దీని కిది. తృప్తితీర భోంచేసింది యింతమందినీ. మూడురోజులు సుఖంగా నిద్రపోయింది లేచినతరువాత. 5, 6 సంవత్సరాలు మళ్ళీ సమాధిలో ఉన్నది. సమాధినుంచి లేచినతరువాత మళ్ళీ ఆకిరాతరాజుయొక్క- దేశానికి వస్తూఉండేది. అక్కడ కొంతకాలం సుఖంగా ఇష్టాగో ష్టితో కాలం గడపి, కొంతమంది వధ్యులను తీసికొని మళ్ళీ స్వస్థానం చేరుతూ ఉండేది. రామచంద్రా! ఆకర్కటి అనే రాక్షసి ఇప్పటికీ జీవన్ముక్తులధర్మంతో, మెలగుతూ ఉంది సమాధినుంచి లేచినపుడు వ్యవహారమార్గం అవలంబించడమూ, సమాధిలోఉన్నప్పుడు నిశ్చల మయిన బ్రహ్మధ్యానమూ, ఇదీ దీనిపరిస్థితి. ఇలాఉండగా కొంత కాలానికి ఆకిరాతరాజు అన్నికోరికలనూ విడిచి, విదేహకైవల్యాన్ని పొందాడు. వాని సంతతివారు ఆరాజ్యానికి అధికారు లయ్యారు. వాళ్ళతోకూడా స్నేహం సంపాదించుకున్నది. మామూలుమాదిరిగా తనకు ఆహారమయిన వధ్యులను వాళ్ళద్వారా తెచ్చుకుని తింటూ చాలాకాలము ఉన్నది.

## ౮౩. కందరా పూజనము.

ఆకిరాతమండలంలోఉండే రాజులందరితోను పరిచయం సంపా దించుకున్నది అక్కడకలిగే గొప్పగొప్ప ఉత్పాతాలను రూపు మాపేది. పిశాచాది భయాలను మంటగలిపేది. యోగసిద్ధికలది కాన, ఇతరరోగాలనుకూడ నివారింపచేసేది. అనేకసంవత్సరాలు గడిచినతర్వాత సమాధినుంచి లేచి, ఈకిరాతరాజ్యానికి వచ్చి, వధ్యు లను సంపాదించుకుని భక్షిస్తూఉండేది.ఇప్పటికీకూడా అక్కడిరాజులు

ఆ ఆచారాన్ని విడువకుండా జరుపుతున్నారు. వధ్యులను ఆహారంగా అర్పిస్తూనే ఉన్నారు దానికి (ఆ రాక్షసికి). ఎప్పుడయినా ఆ రాక్షసికి సమాధిలో ఉండి యీకిరాతజనమండలానికి రావడము ఆలస్యమయ్యే యెడల, ఆకిరాతుల ఉత్పాతాదిభయములు శాంతించడానికి ఆ రాక్షసియొక్క ప్రతిమను తయారుచేసి, ఎత్తయినదేశంలో ప్రతిష్ఠ చేసి పూజిస్తూ ఉండేవాళ్ళు ఆకిరాతులు. దానికి "కందరాదేవి" అనే పేరుపెట్టారు. "మంగలా" అనికూడ మరోపేరుకద్దు దానికి. "అమంగలా" అనికూడ కొందరందురు "కం శిరః దారయతి వధ్యానాం" వధ్యులతలను పగలకొట్టినది కాన కందరా అనునామము దానికి సార్థకమయినది. అది హింసారూపముకాన "అమంగల"యను నామముకూడ సార్థకము. ఈవధ జనుల ఉత్పాతములు శాంతించటానికి చేస్తూఉన్నందున జనుల కది మంగళముకాన మంగళయను నామంకూడా సార్థకము. ఎవరు తమగ్రామంలో కందరాదేవిని ప్రతిష్ఠించి పూజించరో వారికి ఉపద్రవాలు అధికమవుతూ ఉండేవి. ప్రజలలో ఒకరి నొకర చంపుకుంటూ ఉండేవారు. ఉపద్రవశాంతి, రోగశాంతివగయిరా ఫలములు కందరాదేవిపూజవల్లనే కలుగుతూ ఉండేవి ప్రజలకు. - తమ మనోవాసనలనుబట్టి పూజించకపోతే అనర్థాన్ని పొందేవాళ్ళు - రామా? ఆదేవీప్రతిమ (బొమ్మ) విగ్రహము ఇప్పటికిని అక్కడ కలదు. బోధరూపురాలగు ఆ రాక్షసి ఆకిరాతులకు చిరకాలదేవత అయింది. సస్యాదిసకలసంపదలనూ ఇస్తూ ఉండేది. పాపులను వధిస్తూ ఉండేది.

## ౮౪. మనోంకురోత్పత్తి వర్ణనము.

ఇందులో మనస్సువల్లనే ప్రపంచము పుట్టునని వర్ణింపబడును. రామచంద్రా! ఇదీ కర్కటి అనే రాక్షసికథ. అది నల్లగా ఉండుటకూ కర్కటిఅనే పేరుపెట్టుటకూ కారణం విను చెబుతాను - సహజంగా రాక్షసులలో అనేకరకాలవాళ్ళు ఉంటారు. కొందరు తెల్లగా ఉంటారు మరికొందరు నల్లగా ఉంటారు - కొందరు పచ్చగా ఉంటారు - అందులో ఈరాక్షసితండ్రి పెద్దఎండ్రికాయతో పోల్చిన

శరీరాకారం కలవాడు కనుక కర్కటు డనేపేరు వచ్చింది వానికి - ఇతడికి పొట్ట పెద్దది. చేతులూ కాళ్ళూ పొడవు. రూపం మహా నలుపు. అతని కూతురుకనుకనూ, అలాటి ఆకారమే కలదికనుకనూ, దీనికికూడా "కర్కటీ" అనేపేరే వచ్చింది. నీకు నేను జగత్తత్త్వ మును నిరూపించుటలో అధ్యాత్మం ఉపదేశించవలసివచ్చింది. ఆ ప్రసంగంలో ఈకర్కటియొక్క ప్రశ్నలు జ్ఞాకమునకు వచ్చి ఈకథ అంతా చెప్పాను నీకు. చంచలమయిన తరంగాలు నీటితో భిన్నములు గానూ, అభిన్నములుగానూ ఉన్నట్లు, తిరుగుచూ ఉండే యీ కాలత్రియస్సృష్టులన్నీ పరబ్రహ్మతో భిన్నములుగానూ, అభిన్నము లుగానూ ఉన్నవి - అంతేకాని పరమార్థంగా బ్రహ్మనుండి పుట్టినదీ లేదు. చచ్చినదీ లేదు. కట్టెలో నిప్పు యథార్థంగా ఉన్నట్లు భావించే కోతులకు, ఆకట్టె నిప్పుయొక్క పనిని చేస్తుంది, శీతబాధను పోగొట్టు తుంది. అలాగే ఈప్రపంచంకూడా భావనావశంచేత అర్థక్రియాకారి (కొన్నిపనులను నెరవేర్చునది) అవుతోంది. కొయ్యమీద బొమ్మ అనేబుద్ధి పుట్టినట్లూ, బీజమునందు ఫలవృక్షాదిబుద్ధి పుట్టినట్లున్నూ, చైతన్యమునందే ఈప్రపంచబుద్ధి పుట్టుతోంది. అజ్ఞానముచే అది భిన్నముగా గోచరించినా; ఆభేదము నిలువనేరదు. ఆత్మవిచారణ వల్ల నశిస్తుంది. రఘుకులచంద్రమా! ఈప్రపంచభ్రాంతి ఎలా పుట్టిందో అలాగే నశిస్తుంది. నీవు వివేకం తెచ్చుకో - భ్రాంతిని విడువు - బ్రహ్మసాక్షాత్కారం అవుతుంది నీకు. నాఉపదేశంచేత హృదయగ్రంథులు తెగిపోతాయి. మహావాక్యలక్ష్యార్థము సాక్షాత్క రిస్తుంది. ఈప్రపంచానర్థం అంతా మనస్సువల్లనే కలుగుతోంది. అది తొలగిపోవడానికి నాఉపదేశమే మందు - అన్నాడు వసిష్ఠుడు.

మహర్షీ! 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః' అను శ్రుతి ప్రపంచం ఆత్మనల్ల పుట్టిందని చెబుతోంది. ఈసృష్టి శ్రుతియందలి "యతః" అనే పంచమీవిభక్తివల్ల జగద్బ్రహ్మలకు భేదం ఉన్నట్లు అర్థమవుతోంది. జగద్బ్రహ్మలకు భేదమే లేకపోతే "బ్రహ్మవల్ల సర్వమూ పుట్టినదను" మీ మాటలోకాని, "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" అనుశ్రుతిలోని ఉన్న పంచమీ

విభక్తి ఎలా పొసగుతుంది? ఇప్పుడుకూడ "సర్వం దేవేశా దభిన్నః" (అంతా బ్రహ్మాభిన్నము) అని అనుచున్నారే తమరు. ఇందులో మాత్రం "దేవేశాత్" అను పంచమీవిభక్తి ఎలాకుదురుతుంది? అడిగాడు శ్రీరాముడు—

వ॥ రామచంద్రా! వ్యవహారసిద్ధమయిన భేదాన్ని అనుసరించి సృష్టి శ్రుతి అలాచెప్పింది. నాఉపదేశముకూడా అలాంటి భేదాన్ని పుచ్చుకునే కుదురుతుంది. వాస్తవమయినభేదంతో పనిలేదు. శబ్దప్రయోగమునకుకూడా కల్పితభేదము (వ్యావహారికభేదము) చాలును. ఈవ్యవహారముకూడ ఉపదేశింపతగినవాడు అజ్ఞానదశలో ఉన్నపుడే కాని, ప్రబోధదశలో ఉన్నపుడు కాదు. కనుకనే శాస్త్రం "జ్ఞాతే ద్వైతం నవిద్యతే" ఆత్మతత్త్వం తెలిస్తే ద్వైతప్రపంచం లేదని చెబుతోంది. భేదఘటితమయిన సంబంధాలన్నీ అజ్ఞానులకొరకు కల్పింపబడినవికాని, బ్రహ్మయందు వాస్తవంగా ఉన్నవికావు. అజ్ఞానులు తమతమ ఊహలచే తగాదా పడుతూఉంటారు. అవి తత్త్వోపదేశానికి పూర్వమే చెల్లునుగాని, అనంతరం చెల్లవు. ద్వైతం ఉన్నపుడే పదములకు వాచ్యవాచకభావసంబంధం ఉంటుంది. కాని ద్వైతం పరమార్థంకాదు. కాబట్టి మౌనమే శరణ్యము – కనుక రామచంద్రా! "యతోవా ఇమాని భూతాని జాయంతే" మొదలగు సృష్టిశ్రుతులవలన కలిగెడి భేదబుద్ధిని వదిలి, తత్త్వమస్యాదిమహావాక్యములకు లక్ష్యమయిన అఖండబ్రహ్మస్వరూపమునందు నీచిత్తమును నిలుపుము. నేను చెప్పునది వినుము.

ఈప్రపంచమాయ అంతా మనస్సువల్లనే తయారవుతోంది. దృష్టాంతం చూపుతా విను. నీకే నిశ్చయమవుతుంది. ప్రపంచం భ్రాంతిమాత్రం అని – అంతా విడిచి ప్రశాంతంగా ఉంటావు నీవు. వివేకమను ఔషధముచే మనోవ్యాధిని రూపుమాపుకుంటావు. రాగద్వేషాదిక్లేశములతో కూడిన చిత్తమే సంసారం – అవిలేని చిత్తమే మోక్షము. లోకంలోని సకలపదార్థాలూ చిత్తవిలాసములేకాని వేరుకాదు. చిత్తంలో ఛిద్భావము అహంకారము – అందులోని

జడభాగము ప్రపంచము (దృశ్యము) నిరాకారుడయిన బ్రహ్మ దేవుడు ఆదిసృష్టిలో అయథార్థములయిన ఈపంచమహాభూతములను కలమాదిరిగా చూస్తూఉంటాడు. సాక్షిసంవిత్తుచే సృష్టిస్థితిలయము లనూ, అహంభావనారూపమయిన వైశ్వానరజ్ఞానముచే, స్థూల ప్రపంచమునూ, సూక్ష్మసంవిత్తుచే సూక్ష్మసమిష్ట్యాత్మకమయిన హిరణ్యగర్భదేహమునూ చూస్తూ ఉంటాడు. ఒకానొకప్పుడు వీటిని వేటినీ చూడడు. రామచంద్రా! ఆత్మతత్త్వము ద్వైతాద్వైత భ్రాంతిని పుట్టించే దృశ్యరూపాన్ని ఎలాచెందిందో ముందుకథలలో చెబుతావిను. మనోరంజకమయిన ఉపమానాలతోనూ, యుక్తులతోను, మధురమైన పదములతోనూ, సరసమయిన అర్థములతోనూ, చెప్పినవిషయమే అన్నిసందేహాలను రూపుమాపి మనస్సుకు పట్టుకుంది - నీటిలోవేసిన నూనెబొట్టు నీరంతా వ్యాపించినట్లు హృదయమంతా వ్యాపిస్తుంది. దృష్టాంతాదులులేని వాక్యములు వినువానిహృదయమును ఆనందపరచవు. ఇలాంటివాక్యాలను శ్రమపడి చెప్పినా బూడిదలో హోమంచేసిన ఆజ్యంవలె వ్యర్థమవు తాయి. మహాభారతాది ఆఖ్యాయికాగ్రంథములుకాని, ఇతరకథా గ్రంథములుకాని, మనోహరమయిన కావ్యనాటక, అధ్యాత్మికాది గ్రంథములుకాని, శబ్దార్థములయందు లోకప్రసిద్ధమయిన దృష్టాం తాదులను చూపి ఉపదేశించుటవలననే చంద్రునివలె శ్రోతనహృద యాలను ఆనందపరుస్తూ ఉన్నవి. లేనిచో విసుకుపుట్టించేవి అని అన్నాడు వసిష్ఠుడు.

— కర్కటీఉపాఖ్యానము ముగిసినది —



౮౫. ఐందవోపాఖ్యానము.

## బ్రహ్మాదిత్యుల సమాగమము.

వ॥ రామచంద్రా! నేను పూర్వం ఒకానొకప్పుడు భగవంతు డగు కమలసంభవుణ్ణిగూర్చి "ఈప్రపంచసృష్టులు ఎలాజరుగుచున్నాయి" అని ప్రశ్నించాను. ఆయనగారు నాకు ఐందవోపాఖ్యానం చెబుతూ నాప్రశ్నకు జబాబు చెప్పాడు. అది చాలా అర్థవంతమైన ఆఖ్యానము, విను చెబుతా నీకు' అని అన్నాడు వసిష్ఠుడు. బ్రహ్మ తనకు చెప్పినకథను చెప్పడం ప్రారంభించాడు.

బ్రహ్మ:- వసిష్ఠా! సీటిమడుగులోని నీరు సుడిగుండాలుగా తిరుగుచున్నట్లు, మనస్సే ఈప్రపంచాకారంగా తయారవుతోంది. పూర్వకల్పంతో సృష్ట్యారంభమునందు, ప్రపంచాన్ని సృష్టించదలచుకొని ఉండగా నాకు ఏమిజరిగిందో విన్నావా? నాఆయుర్దాయంలో ఒకపగటికాలం పూర్తిఅయింది. రాత్రికాలం తటస్థించింది. ప్రపంచం అంతా లయించింది. నేను ఒక్కడనే ఉన్నాను. రాత్రికాలం పూర్తికావచ్చింది. పగటికాలం ప్రారంభం కానున్నది. నాకు మెలకువ వచ్చింది కళ్ళు తెరచాను. యథావిధిగా స్నానసంధ్యలు ఆచరించాను. కళ్ళు విప్పి ఆకాశంవంక నలువైపులా చూచాను. ప్రజల సృష్టించా లనుకున్నాను. నాకు చీకటీ కనిపించలేదు, వెలుతురూ కనిపించలేదు. ఆకాశం అంతా అఖండంగా శూన్యంగా ఉంది. సృష్టిని సంకల్పిద్దామని నిర్ణయించుకొని, ప్రపంచాన్ని గూర్చి సూక్ష్మదృష్టితో ఆలోచించాను. ఆలోచించగా, ఆలోచించగా, విశాలమయిన మహాకాశంలో, (అవ్యక్తాకాశంలో) వేర్వేరుగా ఉన్న గొప్పగొప్ప బ్రహ్మాండాలు అనేకం నామనస్సుకు గోచరించాయి. వాటినికూడా బ్రహ్మ సృష్టిస్తున్నాడు. విష్ణువు పాలిస్తున్నాడు. అందువల్ల నిర్మలంగా ఉన్నాయి అవికూడా. ఆబ్రహ్మాండములలో, రాజహంసారూఢులయినవారూ, పద్మకోశములందున్నవారూ, అచ్చగా నాకు నకలుగా ఉన్నబ్రహ్మలు పదిమంది కనిపించారు. వాటిలోకూడా అండజాది నాలుగురకాల ప్రాణులతో

కూడిన భిన్నభిన్నసృష్టులున్నాయి. అందులోనూ, నదులు ప్రవహి స్తున్నాయి. సముద్రాలు ఘోషిస్తున్నాయి.సూర్యకిరణాలు మండు చున్నాయి. గాలులు వీస్తున్నాయి. స్వర్గంలో దేవతలు క్రీడిస్తు న్నారు. భూమిమీద మానవులు క్రీడిస్తున్నారు. దానవులూ, నాగులూ, పాతాళలోకములందు సంచరిస్తున్నారు. వసంతాదిఋతు వులన్నీ వాటి వాటి ధర్మములతో పూత, పిందె, కాయ, పండ్లతో తులతూగుచూ భూమండలాన్ని అలంకరిస్తున్నాయి. విధినిషేధము లను తెలిపెడి స్మృతిగ్రంథములు నలువైపులా అన్నిజాతులవారి యందూ, నిరూఢములై కనిపిస్తున్నాయి. భూతకోటులన్నీ కాలాను సారంగా, భోగములను కోరేవారు భోగప్రదమయిన పనులనూ, మోక్షమును కోరేవారు మోక్షప్రదమయిన పనులనూ, ఆచరిస్తు న్నారు. సప్తలోకములూ, సప్తద్వీపములూ, సప్తసముద్రములూ, సప్తకులశైలములూ, ప్రళయకాలాన్ని నిరీక్షిస్తున్ననూ, ఉన్నంత వరకూ తమ ఆడంబరాన్ని తాము సాగిస్తూనే ఉన్నాయి. ఒకచోట గాఢాంధకారము, మరొకచోట వెలుగు, ఇంకొకచోట ఈరెండూ కొద్దికొద్దిగా కలిసిమెలిసి ఉన్నట్లు కనిపిస్తున్నాయి. మేర్వాది పర్వత కుంజములందు మంచు నట్టంగా కనిపించింది. ప్రపంచం అంతా ఒక సరోవరంలాగ గోచరించింది. భూదేవి ఆబ్రహ్మాండంలో అంతః పురాంగనవలె శోభిల్లుతూఉంది.ఆకాశము చాలమనోహరంగా ఉంది. ఇలాంటి బ్రహ్మాండాలను పరిశుద్ధమయిన చిత్తంతో ఆలోచించి చూచాను. ఆశ్చర్యపోయాను. ఇవి ఎలాపుట్టినవా? అని అనుకు న్నాను. మాంసమయమయిన కంటికి గోచరించని యీమాయా జాలం అంతా, మనస్సుకు ఆకాశంలో ఎలాగోచరించిందా? అని చాలాకాలం ఆలోచించాను. తుదకు, ఆజగజ్జాలంలోనే చాలాకాలా నికి ఒకసూర్యుని నాసంకల్పబలంచేత వెతకిపట్టుకున్నాను. ఆయన గారికి స్వాగతవాక్యములను చెప్పాను."దేవదేవా!భాస్కరా!నీవెవరు? నీప్రపంచమూ,ఈప్రపంచములూ ఎలాపుట్టాయి? మీకు తెలిసిఉంటే కొంచెం చెప్పండి" అని అడిగాను. అతడు ఆలోచించి,నన్నుగుర్తించి నాకు నమస్కరించి, మృదువయిన మాటలతో ఇలా అన్నాడు.

'పరమేశ్వరా! ఈదృశ్య ప్రపంచానికి ఎల్లప్పుడూ కారణమయిన మీకు ఈవిషయం ఎలా తెలియలేదు? నన్ను అడుగుతారేమి? ఒకవేళ నావాక్యసందర్భాన్ని వినాలని మీకు కుతూహలంగా ఉంటే, మీరు సంకల్పించని నాపుట్టుకను నేను చెప్తాను. వినండి సావధానంగా.

అనిసూర్యుడు తనకథను చెప్పడం ప్రారంభించాడు.

## ౮౯. ఐందవుని సమాధానము.

సూర్యుడు—దేవా! పూర్వం కైలాసపర్వతం క్రిందిభాగంలో జంబూద్వీపమునందు "సువర్ణజట" అనే పేరుగల ప్రదేశం ఉంది. అక్కడ మరీచ్యాదులు నీపుత్రులు ప్రజాసృష్టి చేయదలచి, తాము నివసించుటకు రమణీయమైన స్థానాన్ని నిర్మించుకున్నారు. అచ్చోట, బ్రహ్మవేత్తఅయిన బ్రాహ్మణుడు ఇందువను పేరుగలవాడు ఒకడుండెను. అతడు ధర్మాత్ముడు, కశ్యపకులోద్భవుడు. అతడికి ప్రాణసమురాలగు భార్యఉన్నది. ఆమెకు సంతానం లేదు. గడ్డిమొలవని ఊసరక్షేత్రమయింది ఆమెగతి. ఆదంపతు లిద్దరూ చాలాకాలం ఖేదపడి సంతానార్థమై తపస్సు చేయ సంకల్పించారు. కైలాసగిరిమీద విజనప్రదేశం చూచుకుని ఘోరమయిన తపస్సును ఆరంభించారు. అక్కడ ప్రతిరోజూసాయం కాలం ఒకదోసెడు నీరు త్రాగుచూ కాలం గడిపారు. కేవలం తరువ్రతమును అవలంబించారు. ఇలా త్రేతాద్వాపరయుగములు రెండూ గడిచాయి. అప్పటికి ఈశ్వరుడు సంతోషించాడు. ఆదంపతుల యెదుటకు వచ్చి సాక్షాత్కరించాడు - వాళ్ళుఇద్దరూ వృషభారూఢుడూ, చంద్రచూడుడూ, అర్ధనారీశ్వరుడూ అగు పరమేశ్వరుని దర్శించారు. వికసితముఖులై నమస్కరించారు. ఆసదాశివుడు, మందహాసమున వారలతో "ఓబ్రాహ్మణోత్తమా! నేను మీతపస్సునకు మెచ్చినాను, నీకిష్టమైన వరమును కోరుకొనుము ఇచ్చెదను. నీవు వసంతకాలవృక్షమువలె శోభిల్లుచుండుము" అన్నాడు. ఆబ్రాహ్మణుడు ఈశ్వరునిమాట విని "పరమేశ్వరా! బుద్ధిమంతులగు పుత్రులను పదిమందిని ఇమ్ము. ఇంక నాకు పుత్రులులేరను దుఃఖం ఉండదు" అని కోరాడు. శివుడు సమ్మతించి, వరమిచ్చి, అంతర్ధానం

అయ్యాడు. ఆదంపతులునూ సంతసించి, వరమును పొంది, భూలోకానికి అవతరించిన పార్వతీపరమేశ్వరులవలె ఇల్లు చేరారు. కొంత కాలానికి ఆబ్రాహ్మణునిభార్య గర్భవతి అయినది. పదిమంది కుమారులను కన్నది. వారందరూ జాతకర్మాదిసంస్కారములను సకాలంలో పొంది చక్కగా తేజశ్శాలులై వృద్ధిపొందారు. ఏడుసంవత్సరములు వచ్చుసరికే సర్వశాస్త్రములను అభ్యసించారు. ఇట్లుండ కొంతకాలానికి తత్త్వవేత్తలయినవారి తలిదండ్రులిద్దరూ, శరీరము త్యజించి విదేహముక్తు లయినారు. ఆపదిమంది కుమారులునూ, తలిదండ్రులు లేనందుకు పరితాపపడి, యిల్లువిడిచి, కైలాసపర్వతమున కేగి, ఇలా సంభాషించుకున్నారు. "సోదరులారా! లోకంలో గొప్ప సుఖమును ఇచ్చునది ఏది? పరిణామంలో దుఃఖాన్ని ఇయ్యకుండా సుఖమును ఇచ్చేఉపాయం లోకంలో ఏది? అని సామాన్యంగా విమర్శించుకొని విశేషవిమర్శలోకి దిగారు. ఒకరు గృహాధిపతిసుఖం గొప్పదన్నారు. మరొకరు గ్రామాధిపతిసుఖం గొప్పదన్నారు, ఇంకొకరు మండలాధిపతియొక్క సుఖం గొప్పదన్నారు. మరొకరు, దేశాధిపతులయినరాజుల ఐశ్వర్యం గొప్పదన్నారు. ఇంకొకరు సమ్రాట్టుల ఐశ్వర్యం గొప్పదన్నారు దేవేంద్రునిది మహదైశ్వరం అన్నారు కొందరు. ఇలా సోదరులందరూ పరస్పరం మాట్లాడుకొనుచుండగా, వార్లలో పెద్దవాడయిన పెద్దన్నగారు,గంభీరమయినమాట చెప్పాడు. ఇతనిపేరు మహామతి. ఇతడు పూర్వజన్మలో హిరణ్యగర్భోపాసన చేశాడు. కొన్నివిఘ్నాలవల్ల మధ్యలో ఆగిపోయిందిఉపాసన. దాని వల్ల ఉత్తమజన్మ ప్రాప్తించింది. ఇప్పుడు తనతమ్ములసంభాషణ వల్ల వెనుకటి ఉపాసనాసంస్కారం ఉద్బుద్ధమయింది. (మనస్సులో తలపుకు వచ్చింది). తాను అనుష్ఠించిన ఉపాసనాక్రమాన్ని తమ్ములకు చెప్పదలచాడు. ఇలా అన్నాడు "ఓసోదరులారా! ఐశ్వర్యములలో ప్రాకృతప్రలయపర్యంతం నశించని ఐశ్వర్యం ఏదో అదే ఐశ్వర్యమని నా అభిప్రాయం. అయ్యది హిరణ్యగర్భప్రాప్తియేకాని మరొకటికాదు." అన్నాడు. అన్నగారిమాట విన్నారు మిగతా తమ్ములందరూ – బాగున్నదని ప్రశంసించారు. అందరూ అంగీక

రించారు. అదృష్టవశాన అందరికీ హిరణ్యగర్భలోకంమీాద ఆశకలిగింది. అది ప్రాప్తించే ఉపాయం చెప్పమని అన్నగారిని అడిగారు. "సోదరులారా! నేను చెప్పినట్లు మీారు చేయండి. మీా కది సులభంగా ప్రాప్తిస్తుంది. "పద్మాసనుడయిన బ్రహ్మను నేనే. "నేనే ప్రపంచాన్ని సృష్టించుచున్నాను, సంహరించుచున్నాను" అనే భావనతో చాలాకాలం ధ్యానంచేయండి. భ్రమరకీటన్యాయప్రకారం మీారంతా బ్రహ్మలవుతారు" – అని అహంగ్రహోపాసనను ఉపదేశించాడు అన్నగారు. తమ్ములందరూ అంగీకరించి అన్నగారితో సహా అందరూ ధ్యానంలో నిమగ్నులయినారు. గట్టికోరికతో, పటములోని బొమ్మలవలె నిశ్చలంగా ఉన్నారు. బాహ్యవృత్తులను నిరోధించారు. చిత్తాన్ని అంతర్ముఖం చేసుకున్నారు. బ్రహ్మను ధ్యానించారు. తామే నిఖిలప్రపంచరూపులని భావించారు. ఇట్లు ఐందవులు పదిమందీ, చెక్కడు రాతిబొమ్మవలె నిశ్చలంగా ధ్యానంలో నిలచిపోయారు.

## ౮౭. పది బ్రహ్మాండముల వర్ణన

ఇట్లుండ కొంతకాలానికి వారలశరీరాలు ఎండకు శుష్కించి గాలికి ఎండాకులవలె క్రిందకు రాలినవి. మాంసాహారులు పొర్లించి పొర్లించి భక్షింపసాగారు. కల్పక్షయపర్యంతమూ ఇట్లు ఉన్నారు. కల్పాంతమందు సూర్యులు తీక్ష్ణంగా తపింపచేసినా, మేఘము ఉరుములతో వర్షించినా, ప్రళయకాలపు గాలులు వీచినా, ప్రాణికోటులు నశించినా, ప్రపంచము జలార్ణవమయినా, ఈఐందవులు అట్లే ధ్యాననిష్ఠలో నిలబడ్డారు 'ఓబ్రహ్మదేవుడా! సర్వసంహారమయి నీవు నిలచియున్నపుడుకూడ వారలు అట్లే ఉండియున్నారు. ఇప్పుడు నీవు మేల్కొని సృష్టిని ప్రారంభించదలచావు కాని వాళ్ళుమాత్రము ఇప్పటికీ ధ్యానంలోనే ఉన్నారు. ఆబ్రాహ్మణపుత్రులు పదిమందీ కాలక్రమమున బ్రహ్మలయినారు.ఆపదిబ్రహ్మండాలూ వారిచిత్తాకాశంలోనే ఉన్నాయి. ఆబ్రహ్మండములలో ఒకదానియందు నేను

కాలవిభాగంచేయటానికి సూర్యుడుగా నియమింపబడ్డాను. ఇదీ నీమనస్సుకు గోచరించిన పదిబ్రహ్మాండాలచరిత్ర. పైన మీచిత్తం. ఈదృశ్యం అంతా కేవలం మనోభ్రాంతిమాత్రంకాని యథార్థం కాదు అన్నాడు, సూర్యుడు.

## ౭౭. ఐందవుని నిశ్చయకథనము

బ్రహ్మవిద్వరిష్ఠుడ వగు వసిష్ఠా! ఆపదిమంది బ్రహ్మలు బ్రాహ్మణపుత్రులని, సూర్యుడు నాతో చెప్పి ఊరుకున్నాడు. నేనిదంతా విన్నాను, చాలకాలం ఆలోచించాను. ఇలాఅన్నాను సూర్యుడితో, "భాస్కరా! ఈపదిమంది బ్రహ్మలున్నారుకదా! ఇంక నేనేమి సృజించేది? నాసృష్టితో ప్రయోజనమేమి? కొంచెం ఆలోచించి చెప్పు? అన్నాను. సూర్యుడు చాలసేపు ఆలోచించాడు. తుదకు నాప్రశ్నకు ఇలా జవాబు చెప్పాడు. "స్వామీ! దేవదేవా! మీరు నిరీహులు, నిష్కాములు. మీకు సృష్టితో పనిలేదు మీకీసృష్టి విలాసమాత్రం. సూర్యునివలన జలాదిత్యుడనే సూర్యప్రతిబింబం తయారయినట్లు, నిష్కాములయిన మీనుంచి యీసృష్టి పుట్టుచున్నది. శరీరమును విడచుటలోనూ, స్వీకరించుటలోనూ మీకేవిధమగు అభిప్రాయమునూ లేదు. కనుక నిష్కాముడవు. నీవు దేనినీ కోరుట లేదు విడచుట లేదు, ఈప్రపంచాన్ని వినోదంకొరకు పుట్టిస్తున్నావు, సంహరిస్తున్నావు. సూర్యుడివలె ఉంది నీచరిత్ర. సూర్యుడు పగటికాలాన్ని తయారుచేస్తున్నాడు.ఏమిటి అతడికి ఫలం రవ్వంత ఉపయోగంఉందా? అతనికి ఆలాగే నీవుకూడా కర్తవ్యమనే భావంతో ప్రపంచాన్ని పుట్టిస్తున్నావుకాని, స్వార్థాభిలాషతోకాదు. మీ రీప్రపంచాన్ని సృష్టించడం మానుకుంటే, నిత్యకర్మను పరిత్యజించిన (విడిచిన) వా రవుతారు. అంతకంటె మీరు కొత్తగా పొందేది ఏమీలేదు. అంతమాత్రంచే మానుకోటానికి వీలులేదు. చేయవలసిన పనులను కోరికలేకుండా చేసితీరాలి. అద్దం ప్రతిబింబాన్ని తయారుచేస్తుంది, ఏమిటి దానికి కోరిక? ఏమిటిఫలం? ఏమీ

లేదు. దానివిధి అది. — అలాగే మీకుకూడా — బుద్ధిమంతులకు కర్మలుచేయటంలో కోరికలేదు. వాటిని విడవటములోనూ కోరిక ఉండదు. కాబట్టి పరమార్థదృష్టితో ఏపనీచేయకూడదు. ప్రాతీతిక (మిధ్యా) దృష్టితో చెయ్యాలి. నీవు ఈ ఐందవపుత్రులను సృష్టించి సంతోషిస్తున్నావు. వాళ్ళుకూడా ముందు నిన్ను సంతోష పెట్టగలరు. కాని ఇంతమాత్రంచే నీసృష్టి గతార్థం కాలేదు. నీవు ఇతరబ్రహ్మలసృష్టిని మనోనేత్రంతో చూడగలవుకాని, చర్మ నేత్రముతో చూడలేవు. తాను సృష్టించినదానినే తాను కంటితో చూడగలడు. కనుక నీకంటితో నీవు చూడదగిన ప్రపంచసృష్టి యొకటి నీ కవసరము. ఐందవపుత్రులు చేసిన సృష్టిని నీవుకంటితో చూడలేవు. వాడు సృష్టించినదానినే వాడు కంటితో చూడ నేర్చును. నీకు ప్రతికూలముకదా అని నీవు ఈ ఐందవసృష్టిని నశింప జేయ ప్రయత్నించకుము. ప్రయత్నించినా నీవు ఆ ఐందవబ్రహ్మలను నశింపచేయజాలవు. దృఢమయిన వారు చిత్తముచే స్థిరపడి ఉన్నారు. కర్మేంద్రియాలతో చేసినపనిని ఎవడయినా చెరచగలడుకాని, మనో నిశ్చయాన్ని యెవడూ మార్చలేడు. బహుకాలం అభ్యసిస్తేకాని మనస్సులో దృఢమయిన నిశ్చయం కలగదు. కలిగినతర్వాత అది శపించినా పోదు. శరీరం నశించినా పోదు. మనస్సునందలి దృఢమయిన నిశ్చితరూపమునే మానవుడు పొందగలుగుతాడు. ఇతరమును పొందలేడు. మరియు సంసారదుఃఖనివృత్తి ఆత్మబోధచే కలుగుతుందికాని వేరుదానిచే కలగదు. ఇతరోపాయములన్నీ రాళ్ళగుట్టను నీటితో తడుపుటవలె నిష్ఫలములు. అవి మెత్తపడి మొలకరించునా? లేదు. అంతే ఇక్కడకూడ.

## ౮౯. కృత్రిమ ఇంద్రాహల్యల అనురాగ వర్ణనము

మఱియు, జగములను సృష్టించేది మనస్సు. లోకంలో చేయబడేపని అంతా మనస్సువలననేకాని శరీరంవల్ల కాదు. ఈఐందవపుత్రులు మామూలు బ్రాహ్మణులుగా ఉండి మనోభావనచేతకదా! బ్రహ్మత్వము పొందగలిగారు, మనస్సుయొక్క భావనచేతనే జీవుడు

దేహాన్ని ధరిస్తున్నాడు. మనస్సుకు దేహభావనే లేకపోతే, వానిని దేహధర్మములయిన జననమరణాదులు బాధించనేలేవు. బాహ్య దృష్టిగలవానికే సుఖదుఃఖాదులు ఉంటాయి. అంతర్ముఖుడయిన యోగికి దేహధర్మములయిన సుఖదుఃఖాలు ఉండవు. కనుక ఈప్రపంచంలోని భ్రాంతులన్నిటికీ మనస్సే కారణము. ఇందుకు ఇంద్రఅహల్యలవృత్తాంతమే మీకు నిదర్శనము అన్నాడు సూర్యుడు - "భాస్కరా! ఎవరు ఆ యహల్య? ఎవ రా యింద్రుడు, వారలవృత్తాంతము పవిత్రమైనదనీ, వినాలనీ అనిపిస్తోంది నాకు. దయచేసి చెప్పుము" అని అడిగాడు బ్రహ్మ.

సూర్యుడు - 'ఓచతుర్ముఖా! పూర్వకాలంలో ఇంద్రద్యుమ్నుడనేరాజు మగధదేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు చంద్రబింబమువంటి ముఖముగల అహల్య అనే భార్యకలదు. ఆపత్తనంలోనే ఇంద్రుడనే పేరుగల జారుడు ఒక బ్రాహ్మణపిల్లవా డుండెను. గౌతముని భార్య అయిన అహల్య ఇంద్రుని మోహించినదని పురాణాదులలో కథాప్రసంగవశమున విన్నది ఈయహల్య. ఈమెకూడా (ఇంద్రద్యుమ్నుని భార్యఅగు అహల్యకూడ) ఇంద్రుడనే పేరుగల బ్రాహ్మణపిల్లవానిని ప్రేమించింది. "నేను అహల్యనుకదా! అతడు ఇంద్రుడుకదా! అతడు నాయందు అనురాగం కలిగి ఏలరాడు" అని అనుకుంటూఉండేది మనస్సులో - దుఃఖంచేది. తుదకు సిగ్గువిడిచి "ఇంద్రుడా - ఇంద్రుడా" అని అరవడముకూడా ప్రారంభించింది. ఆమెదీనావస్థను ఆలకించి ఆమెమీదప్రేమగల ఒకానొక చెలికత్తె, "నేను ఇంద్రుని తెత్తు"నని చెప్పింది. ఈ అహల్య ఆమాటవిని ఆచెలికత్తెయొక్క పాదములమీదపడి నమస్కరించింది. మరునాడురాత్రి ఆసఖి ఆబ్రాహ్మణకుమారుని (ఇంద్రుని) యొద్దకుబోయి ఈవృత్తాంతమంతా ఆతనికిచెప్పి అతణ్ణి యీఅహల్యవద్దకు తెచ్చింది. పిదప ఈఅహల్య పూలమాలలతో చక్కగా అలంకరించుకొని, రహస్యస్థలమందు, ఆఇంద్రుని (జారుని)తో రతిసలిపినది. అతనియందున్న అనురాగంచేత ప్రపంచంఅంతా ఇంద్రమయంగా తలంచింది. అతనియందలిప్రేమచే సుగుణఖనియగు తనభర్తను చులకనగా చూడసా

గింది. కొంతకాలానికి ఆరాజసింహుడగు ప్రద్యుమ్నుడు, తనభార్యకు ఆ బ్రాహ్మణపిల్లవానియందుగల అనురాగము గుర్తించాడు. ఇట్లే ఆఇంద్రుడుకూడ ఈ అహల్యయందు అధికముగ అనురక్తుడై ఒక్క క్షణముకూడ ఆమెతో వియోగం సహించలేకపోయాడు. వీరిరువురి అవినయప్రవృత్తి రాజుకు మిగులకష్టమును కలిగించినది. విచ్చలవిడిగ తిరుగుచున్నారని గ్రహించాడు రాజు - విన్నాడు విషయమంతా క్రమంగా. సహించలేకపోయాడు - పలువిధముల దండించాడు - మంచుకాలంలో (హేమంతఋతువులో) వీళ్ళయిద్దరినీ నీటిలోవిడిచి పెట్టాడు, వారలు అక్కడ సంతోషిస్తూఉన్నారు కాని, ఏమాత్రమూ దుఃఖించలేదు - కష్టపడలేదు. ఆనీటిమడుగునుంచి లేవతీసి వాళ్ళని అడిగాడు "మీరేల కష్టపడలేదు" అని. వారు ఇలా బదులుచెప్పారు. "రాజా! మేము ఒకరినొకరు స్మరించుకుంటూ ఉన్నాము. పరస్పరము అనురాగమును పెంచుకున్నాము, మాశరీరముమీద మాకు అభిమానంలేదు. మాశరీరమే మేము మరచాము. మా మనస్సంబంధము అంతగట్టిగా ఉంది. అందువల్ల మేము ఆనందమునే పొందుచున్నాము. మమ్మల్ని నరికినా మేము సంతోషిస్తూఉంటాము" అని అన్నారు. తరువాత వాళ్లిద్దరినీ, అగ్నిలోపడవేశాడు రాజు. ఏనుగులచే తొక్కించాడు. కొరడాలచే కొట్టించాడు. ఏమాత్రము కష్టపడలేదు. మామూలు సుఖంలోనే ఉన్నారు. అడిగితే మళ్ళీమళ్ళీ అలాగే జవాబుచెప్పారు. పైగా నాకు అంతా అహల్యామయంగా ఉందన్నాడు ఇంద్రుడు. ఆస్త్రీకి ఇంద్రమయంగాఉంది యీప్రపంచం అన్నాడు. అందుచే మీదండనలు మమ్ము బాధింపవన్నాడు - ఇంకా ఇలాఅన్నాడు ఇంద్రుడు ఆరాజుతో, "రాజా! నేను మనోమాత్రుడను, మనస్సే పురుషుడు - ఈదేహము మనఃకల్పితము - మనస్సును ఎవ్వరూభేదింపజాలరు. శరీరము వృద్ధిపొందనీ, ముక్కలుముక్కలుగా చేయబడి నశించనీ, ఏమయినా మనస్సుమాత్రం అలాగేఉంటుంది. మనస్సు చిరకాలము దేనియందు లగ్నమగునో, దాని ఆకారమును చెందును. దృఢమైన అభినివేశముచే వాంఛితమైనదానినే మనస్సు స్మరిస్తూఉంటుంది. శరీరచేష్టలను స్మరించదు. శాపములుకాని వర

ములుకాని దానిని ఏమీచేయజాలవు. దేవాలయంలో దేవతావిగ్రహం ప్రతిష్ఠింపబడినట్లు నామనఃకోశంలో ఈస్త్రీ ప్రతిష్ఠింపబడిఉన్నది. తీవ్రాభిలాషగలదానిని మనస్సునుంచి ఎవ్వరూ తొలగించలేరు. తొలికారుమేఘపంక్తిచే పర్వతమునకు గ్రీష్మతాపము(ఎండబాధ)ఉండదు. నామనోలగ్నమయిన ఈస్త్రీవల్ల నాకేవిధమయిన దుఃఖమూ సోకదు. ఈపరిస్థితిని యెవరును మార్చజాలరు. శరీరము మనస్సుకు కారణము కాదు. మనస్సే శరీరమునకు కారణము. జీవాత్మకు మనస్సే ప్రథమ శరీరము. మనస్సువల్లనే ప్రాణికోటుల స్థూలశరీరాలు కల్పింపబడు చున్నవి. రాజా! జీవత్వమునకు మొదటిమొలక మనస్సు. దానినుండే ఇతర శరీరములు పుట్టుచున్నవి. మనస్సు నశించినచో ఇతర శరీరములు తప్పక నశించును. చెట్టు ఒకటిఉంటే దానికి చిగురుటాకులు, పూత, పిందె, కాయలు, వగయిరా పుట్టుచుండును. అది లేకపోతే ఇవి యేవీ ఉండవు. చెట్టు నశిస్తే ఇవన్నీ నశిస్తాయి. ఇవి నశిస్తే చెట్టు చావదు. అదేచందం మనస్సుకూ ఇతర శరీరాలకూ - దేహం నశించినా మనస్సుఉంటే మళ్ళీ క్రొత్తక్రొత్త శరీరాలు పుటుతూ ఉంటాయి మనస్సు (చిత్తము) నశించిందంటె ఇంక శరీరాలు పుట్టవు - కైవల్యమే - మళ్ళీ జన్మలేదు కాబట్టి రాజా! మనస్సే ప్రధానము. మనస్సు అనే రత్నాన్ని రక్షించుకో - వృథాగా దానిని కామక్రోధాదులపాలు చేయబోకు. రాజా! నేను ప్రతిదిక్కునా ఈచిన్నదానినే చూస్తున్నాను. ఈమెయందు మనస్సు లగ్నమై నిత్యమూ ఆనందిస్తున్నాను - నీరాజ్యంలోని ప్రధానమంత్రులుకాని, నీసేవక భటులుకాని నాకిచ్చేదుఃఖం, క్షణకాలండుండేదేకాని చిరకాలముండదుసుమా!" అని అన్నాడు ఆ కృత్రిమఇంద్రుడు రాజుతో.

సూర్యుడు:- ఓబ్రహ్మదేవుడా! బ్రాహ్మణపుత్రుడగు ఇంద్రుడు చెప్పినమాటలను విని, ఆరాజు తనచెంతనున్న భరతు డనుమునితో ఇలా అన్నాడు. "మునిసత్తమా! ఈదురాత్ముని నోటివెంట, ఇంకా బింకపుమాటలే వచ్చుచున్నవి. శీఘ్రముగా వీనికి తగిన శాపమును యిమ్ము - చంపదగనివానిని చంపిన యెంతటిపాపమో, చంపతగిన వానిని చంపకున్నా అంతే పాపం అంటారు పెద్దలు" అని - అంతట

నాముని దీర్ఘముగ ఆలోచించి "ఈదురాత్మురాలితోసహా నీవు నశింపు"మని శపించాడు. ఆశాపవచనమును విని, ఆయింద్రాహల్యలు ఈ రాజ, భరతమునులతో ఇలాఅన్నారు. "అయ్యా! మీరు అల్పబుద్ధులు - దురాత్ములు. మమ్ములను శపించి మీతపస్సును మీరు మంటగలుపుకున్నారు. మీశాపమువల్ల మాకేమీ చెఱుపులేదు. మాస్థూలదేహము నశించినా, మనోరూపము నశించదు. అది అతి సూక్ష్మము - చిన్మయము - అగోచరము- దానిని యెవరును నశింపజేయలేరని నమ్మండి" వెంటనే గాలికిరాలిన ఎండాకులవలె నేల మీదపడి మరణించారు. వెంటనే ఈఅనురాగవ్యసనంలో లేడిజన్మ యెత్తి ఆపైన పక్షిజన్మను ఎత్తినారు. దేవా! మనసృష్టిలో వాళ్లిద్దరూ తపస్సంపన్నులయిన బ్రాహ్మణదంపతులుగా పుట్టారు. ఇప్పటికీ ఎక్కడపుట్టినా అక్కడ స్త్రీపురుషులుగానే పుట్టుచున్నారు. వారి సహజప్రేమనూ, అత్యధికస్నేహమునూ పరికించి, అచేతనములయిన చెట్లుకూడా శృంగారచేష్టలను ప్రారంభించాయి.

## ౯౧. జీవావతరణక్రమము.

కాబట్టి, బ్రహ్మదేవా! మనస్సుఅనేది దుష్కరమయిన శాపాలకుగూడ భేద్యముకాదు కనుక ఐందవుల సృష్టిక్రమాలను నశింపజేయుట సాధ్యంకాదు - మీబోటివాండ్లకు తగదుకూడా. బ్రహ్మాండములను సృష్టించుటకు మనస్సే కారణము - మణియొక్క ప్రతిబింబాన్ని చెడగొట్టలేము. దృఢమయిన మనోనిశ్చయాన్ని మార్పు చేయలేము - కనుక ఈఐందవులూ, వీరిసృష్టులూ ఇలాగేఉండనీ. నీవు నీబుద్ధ్యాకాశమందు ప్రజలను సృష్టించు. బుద్ధ్యాకాశమనేది అనంతము (అపారము). నీకు సృష్టికి అవకాశము లేకపోలేదు. చిత్తాకాశమూ, చిదాకాశమూ, భూతాకాశమూ అని ఆకాశము మూడు రకాలు. ఈమూడున్ను అనంతములు, సాక్షిచైతన్యముచే ప్రకాశింపజేయబడుచుండును. నీయిచ్ఛవచ్చినటుల ఒకటో, రెండో, మూడో బ్రహ్మాండాలను సృష్టించు. నీఆత్మరూపంలో నీవుండుము నీసొత్తును ఐందవులేమియు అపహరించలేదుకదా! అని అన్నాడు సూర్యుడు.

బ్రహ్మ:- వసిష్ఠా! ఐందవుల బ్రహ్మాండసృష్టులనుగూర్చి సూర్యుడు చెప్పినమాటలను విని, చాలకాలము ఆలోచించి ఇలా అన్నాను సూర్యునితో నేను. "భాస్కరా! నీవు మంచిమాటచెప్పావు. భూతాకాశ, చిత్తాకాశ, చిదాకాశములు (చిదాభాసాకాశములు) మూడూ అతివిస్తృతములు. వీనిలో నాఇచ్ఛానుసారం, నాడ్యూటీని (నిత్యకర్మను) నేను చేస్తాను. భూతజాలమును సృష్టిస్తాను. నీవే నాకు మొదటి మనువుగానుండుము. నాప్రేరణచే సృష్టినిచేయుము" అని - వసిష్ఠా! సూర్యుడు నామాట అంగీకరించి, తనరూపాన్ని రెండుగా జేసికొని. ఒంకొక శరీరముతో ఆకాశమునందు సూర్యుడుగాఉండి పగటికాలమును జేయుచూ, రెండవ రూపముతో మనువుగానుండి నాకభిమతమైన సృష్టిఅంతయును నెరవేర్చాడు. కనుక వసిష్ఠమహర్షి! మనస్సుయొక్క సామర్థ్యమూ, దానికిగల సర్వకర్తృత్వమూ, నీకు తెలిపాను. చిత్తమునందు ప్రతిభాసించిన విషయమే వ్యక్తమై, స్థిరమై, సఫలమవును. సామాన్య బ్రాహ్మణులుగానుండి ఐందవులు బ్రహ్మత్వమును పొందినది మనస్సుయొక్క శక్తివల్లనేకదా! అలాగే మనముకూడ మనశ్శక్తివల్లనే హిరణ్యగర్భస్థానమును పొందగలుగుదుము. చిత్తమే దేహాదిరూపంతో ప్రకాశిస్తోంది - దేహేంద్రియాదులు చిత్తముకంటె వేరుకావు. మిరపగింజ కారంగానూ, వేపగింజ చేదుగానూ, ద్రాక్ష తియ్యగానూ ఉన్నట్లు చిత్తముకూడ, కామకర్మవాసనలతోకూడి వివిధరూపములతో తన చమత్కారాన్ని చూపిస్తుంది - సూక్ష్మవాసనలతోగూడిన ఈచిత్తాన్ని జీవుడంటారు.స్థూలమయిన ఈచిత్తాన్ని దేహమంటారు. శరీరత్రయముయొక్క చమత్కారం శాంతిస్తే ఇదే పరబ్రహ్మ - మునీంద్రా! దారములకంటె పటము వేరుకానట్లు చిత్తముకంటె దేహము వేరుకాదు. ఇది (చిత్తము) నిజస్థితిలో లేనిదయినా ఉన్నదానివలె వ్యవహరిస్తుంది. ఐందవుల మనస్సే బహ్మమయినట్లు, మనమందరమూ మనస్సంకల్పముచే బ్రహ్మలై యున్నాము. ఈప్రపంచముకూడ సంకల్పరూపముతోనే భాసిస్తోంది. సర్వప్రపంచశూన్యమగు పరమాత్మయే. దేహాదిభావమున వేరుగా భాసిస్తున్నాడు. ఐందవసృష్టికూడ పరమాత్మస్వరూపమే. పరమార్థశుద్ధచైతన్యమే భావనా (సంస్కార) వశమున

జీవుడై, మనస్సు అయి, లేని (అసత్తులై) దేహాదులను తెలియుచున్నాడు. అజ్ఞానమువల్లబుట్టిన స్వప్నము దీర్ఘమగుచూ (చిరకాల ముండుచూ) జాగ్రద్రూపంగా భాసించుచున్నట్లు చిద్రూపుడగు పరమాత్మే సర్వ ప్రపంచాకారంగా భాసిస్తున్నాడు. ప్రపంచము ద్విచంద్రభ్రమాకారము. తన్మాత్రాధ్యాసవల్ల పుట్టింది. చిత్తమువలన నిరూఢమయినది. ఇది (చిత్తము) సదసద్రూపము. బ్రహ్మరూపంతో సత్తు తన రూపంతో అసత్తు, అట్లే జడమూ అజడమును అగుచున్నది. ప్రపంచమును జూచునపుడు ఇది సత్యముగా గోచరించును కాని బ్రహ్మానుభవకాలంలో బ్రహ్మకంటె వేరుకాదు. కటకాదులు సువర్ణదృష్టిలో సువర్ణముకంటె వేరుకావు. బ్రహ్మాదిస్థావరాంతమయిన ప్రపంచము యుక్తిచే జడాజడరూపంగాఉన్ననూ పరమార్థదృష్టిలో జాడ్యచైతన్య ధర్మములు కలదికాదు. ప్రమాణచైతన్యము ప్రమేయచైతన్యమూ ఈరెండూ వృత్తిద్వారమున అభేదమును పొందినపుడే విషయములకు ప్రత్యక్షత్వ మేర్పడుచున్నది. ఇట్టిస్థితిలో కట్టె మొదలగు వస్తువులు కేవలము జడములే అయితే ప్రమేయచైతన్యమనునదే లేదు. కాన వాటిప్రత్యక్షమే కుదరదు. ఎప్పుడు ప్రమేయములగు విషయములకు (వస్తువులకు) ఉపలంభము (ప్రత్యక్షత్వము) అంగీకరించుచుంటిమో అప్పుడు, ప్రపంచమంతా అజడములనియే తెలియవలెను. ఏలయన రెండు చైతన్యములకు ఐక్యసంబంధ మున్నపుడే వస్తూపలబ్ధి (వస్తుప్రత్యక్షము) పుట్టునని యంగీకరించుటవలన-కనుక జడము, చైతన్యము" అను విభాగము మనఃకల్పితముకాని వేరుకాదు. చైతన్యము చైత్యాకారమును (విషయాకారమును) జెందుటయే మనస్త్వము (మనస్సు). ఇందులో చిద్భాగము అజడము. చైత్యభాగము జడము. జ్ఞానాంశము చిద్భాగమనీ, చైత్యము (చిద్విషయము) జడభాగమనీ గ్రహించవలయును- ఈస్థితిలో జీవులందరూ. చిదాత్మభాగమును మరచి, జడాత్మలై ప్రపంచమనే భ్రాంతిలో మునిగినారు. కనుక ప్రపంచము శుద్ధచిదాత్మరూపమేకాని అంతకంటె వేరుకాదు. జడవస్తువులందు అవబోధము ( చిద్భాగము ) ఉన్నట్లు చేతనమునందు అహంతయను

భాగముకూడ కలదు. ఇలా ప్రతీతి కనిపిస్తోంది. చిదేకరసమయిన జడత్వమునందు అహంతాదులుండుటకు ఏమాత్రం వీలులేదు. లోక

ప్రతీతి భ్రాంతికల్పితము. కల్పన మనస్సుయొక్క పని. కనుక ప్రపంచము అంతా మనఃకల్పిత మనవలసివచ్చినది. సర్వద్వైతబాధకు అవధియగు ఆత్మవస్తువు అహంతకు ఆశ్రయముకాదు. చిత్స్వభావమే వాసనచే (సంస్కారముచే) గట్టిపడితే అహంతాదిరూపమునుగా గ్రహించుచున్నారు జనులు. నీటిలోని చల్లదనము (శైత్యము) గట్టిపడితే మంచుగడ్డ అని అనుకున్నట్లు. లవణరసము తనకు కలలో స్ఫురించినట్లు చైతన్యమే భ్రాంతివల్ల జడరూపముతో స్ఫురిస్తోంది. తత్త్వజ్ఞానము దృఢపడిననే కాని సర్వసమమయిన బ్రహ్మస్వరూపము అలవడదు. సాధనచతుష్టయ సంపత్తిగల జీవుడు శరీరత్రయభ్రాంతిని విడిచిపెట్టి చిత్తము (మనస్సు) చేతనే పారిభాసికమగు చిత్తమునుగూర్చి విచారించవలయును. రాగిని శుద్ధిచేస్తే బంగారమగును. చిత్తమును శుద్ధిచేస్తే పరమార్థమయిన నిరతిశయానందరూపమవును. అప్పైన శరీరాలు అనే రాతిముక్కలకు ఏడ్వవలసిన పనిలేదు. సత్యవస్తువునుగూర్చి విచారించవలెను. అసత్యవస్తువునుగూర్చి విచారించతగదు. ఆకాశవృక్షముల గూర్చి యెవడూ విచారం చేయడు. అసత్యార్థమునందు అభినివేశముగల దేహాత్మవాదులగు చార్వాకాదులు పారమార్థికమగు వస్తువును గూర్చి ఉపదేశించుచో వాళ్ళు పశుప్రాయులు అనాలి. కనుక రామచంద్రా!చిత్తముఎలాభావనచేస్తేఒకక్షణకాలంలో అదిఅలాగే అవును అహల్యాకృత్రిమేంద్రుల మనోనిశ్చయమే యిందుకు దృష్టాంతము. కాబట్టి ఈ దేహమూ లేదు. "అహమ్"అని అనుకునే అహంకారము న్నూ లేదు. విజ్ఞానైకరసమగు నీనిజరూపమును గుర్తించుకొని నిరీహుడవుగా నుండుము. బాలుడు భే(వే)తాళునిశరీరముతో సంబంధములేనివాడయినా, కల్పించుకుని భయపడి, నశించినట్లు జీవుడు భ్రాంతిచే భోగ, భోగ్య భోగాయతన (దేహ) ములను కల్పించుకొని ఆ దేహాదులు నశించిన తోడనే తానుకూడ నశించినట్లు భావించుచున్నాడు. అజ్ఞానం నశించగా భ్రాంతికల్పనలు నశించి, ముక్తి లభించును. అని అన్నాడు బ్రహ్మదేవుడు.

## ౯౨. మనోమాహాత్మ్య వర్ణనము.

వసిష్ఠుడు ! రామచంద్రా! బ్రహ్మదేవుడు చెప్పినదంతా విన్నాను. నాకు దానిమీద చాలా సందేహాలు తోచాయి. ఇలా అడిగాను మళ్ళీ ఆయన్ని. దేవదేవా! శాపమంత్రాదులశక్తులు అమోఘములని చెప్పారు లోగడ మీరు. ఇప్పుడు అవి మనస్సును ఏమీ చేయలేవు అని అంటున్నారు. ఇది పరస్పర విరుద్ధము. శాపం చేతనూ, మంత్రసత్తాచేతనూ మనస్సూ, బుద్ధీ, ఇంద్రియాలూ చెడిపోవుట ప్రాణులయందు కనిపిస్తోంది. ౧ నహుషుడు శాపవశమున అజగరమై (పెద్దపామై) మతిచెడి తన వంశంలో బుట్టిన భీముని మ్రింగబోయాడు. ౨ ధార్మికుడయిన సౌదాసుడు శాపమువల్ల రాక్షసుడై మతిచెడి బ్రాహ్మణవధయందు ప్రవర్తించాడు. 3 గంధర్వ రాజునకు శాపవశమున ధృతరాష్ట్రజన్మలో కండ్లుపోయాయి. ఇలా మరికొన్ని దృష్టాంతాలుకూడా కలవు. మరియు వాయుచలనములూ తిలతైలములూ, అగ్న్యౌష్ణ్యములూ, వేరు కానట్లు శరీర మనస్సులు కూడా వేరు కావన్నారు. అట్టిస్థితిలో వరశాపాదులు మనస్సును ఏమీ చేయలేకపోతే, తదభిన్నమయిన దేహాన్నిమాత్రము ఏమి చేయగలవు? కాక దేహము వాస్తవంలో లేదనీ, అది మనఃకల్పిత మనీ ఎండమావులవలెనూ, ద్విచంద్రభ్రాంతివలెనూ, మిథ్యగా అనుభవింపబడుచున్నదనీ అన్నారు. మనోదేహములు రెండూ సమానసత్తా కలవైనపుడు. ఒకటి నశించితే రెండవది నశించవలసి ఉంటుంది. ఈస్థితిలో శాపాదులచేత స్థూలదేహము నశిస్తే మనస్సుకూడా నశించవలసిందేకదా? శాపమువలన మనస్సు ఏల నశించదు? శరీరముమాత్రము ఏల నశిస్తోంది? సెలవిండు'' అన్నాను;

బ్రహ్మదేవుడు:— వసిష్ఠా మంచికర్మను అనుసరించిన పురుష ప్రయత్నముచేత లోకంలో మానవులకు ఏదీ దుర్లభంకాదు – బ్రహ్మాదిస్తంబపర్యంతమయిన దేహధారులందరకూ మనోమయశరీరమూ, మాంసమయశరీరమూ, అని రెండుశరీరాలున్నవి. ఇందు మొదటిది స్థిరమయినది. శీఘ్రకారి రెండవది అకించిత్కరము (ఏమీ చేయలేనిది). అందరకూ కనిపించేది మాంసమయదేహము, ఇదిజడము,

అసమర్థము, క్షణికము. తామరాకుచివర నీటిచుక్కవలె చంచలము, కడుదీనము. ఇది శాపములచేతనూ, అభిచారవిద్యలచేతనూ, శస్త్రాదులచేతనూ బాధింపబడుతుంది. ప్రారబ్ధకర్మచేతనూ, రాజదండనచేత కూడా బాధపడుతుంది. రెండవదగు మనశ్శరీరము స్వతంత్రమూ, అస్వతంత్రమూ, కూడ నగును. పౌరుషమును ఆశ్రయించి, ధైర్యమును అవలంబించినచో దుఃఖములను పొందదు. ఈయది ప్రయత్నానుసారముగ ఫలమును పొందును. మాంసమయదేహము యొక్క ప్రయత్నము అట్లు ఫలించదు. పవిత్రమయిన భావనతో నున్న మనస్సును శాపాదులు ఏమీచెయ్యలేవు. స్థూలశరీరము నీటిలో పడనీ, నిప్పులోతగలపడనీ, బురదలో దిగపడనీ,మనస్సుమాత్రం తాను అనుసంధానము చేసెడిదానిని వెంటనే పొందియే తీరును. కృత్రిమ ఇంద్రుడు తనపురుషప్రయత్నంచేతనే, తనమనస్సు ప్రియాయత్తంచేసికొని దుఃఖంలేశముకూడ లేకుండా జీవించాడు. మాండవ్యమహాముని పురుష ప్రయత్నంచేతనే శూలాగ్రభాగమున నిలబెట్టినా ఏవిధమయినక్లేశమూ లేకుండా జయించాడు. దీర్ఘతపుడను ఋషి అంధకూపంలోఉండి కూడా మానసయజ్ఞాలు చేసి యింద్రుడయినాడు. ఇందువనే బ్రహ్మణునికుమారులు మానసికమయిన బ్రహ్మధ్యానముచేతనే బ్రహ్మపదమును (హిరణ్యగర్భస్థానము) ను పొందారు. వాళ్ళను తొలగించుటకు నాకుకూడా చేతకాకుండా ఉన్నది. ఇంకా యితరులు దేవతలూ ఋషులూ సావధానులై, తమతమ చిత్తైకాగ్రతను విడువరు.ఆధులూ,వ్యాధులూ శాపములూ, రాక్షసులూ ఏకాగ్రచిత్తమును బాధింపజాలవు. తామరపద్మాలతో కొట్టితె, రాతికి దెబ్బతగలదు. ఒకవేళ ఎవరయినా సౌదాస నహుష విశ్వామిత్రాదులు శాపాదులవల్ల బాధపడ్డారుఅంటే, వాళ్ళచిత్తం వివేకజ్ఞానానికి యోగ్యంకాదనీ, వార్ల ప్రయత్నం అంతగట్టిదికాదని అనాలి. వివేకజ్ఞానంకలవారూ, గట్టి పురుష ప్రయత్నంకలవారూ, జాగ్రత్తలోకాని, స్వప్నంలోకాని దోషజాలములచే బాధపడరు. కనుక మానవుడు పురుష ప్రయత్నమును అవలంబించి మనస్సుచేతనే మనస్సును, మంచిత్రోవలో ఉంచవలెను. మనస్సునందు స్ఫురించిన విషయము భావనచే దృఢపడి, క్రమంగా స్థూలమై సత్యముగా

తోచి కంటియెదుట ప్రత్యక్షమగును. కుమ్మరివాని పని జరిగినవెంటనే ఘటము మృత్పిండాకారమును విడచినట్లు మానవుల మనస్సుకూడ, దృఢమయిన ఉత్తరకాలవాసనలచే, పూర్వవాసనలను విడచును. కనుక ఐందవులు పూర్వమందున్న మనుష్యవాసనచే మనుష్యరూపము ఏల బొందలేదని శంకించపనిలేదు. అంతకంటె ఉత్తరకాల బ్రహ్మవాసన ప్రబలమయింది. కనుక అదే ఫలించింది. వశిష్ఠా! మనస్సు క్షణకాలంలో భావితాకారమును చెందును. అందుకు దృష్టాంతమునుచూడు. నీరు ప్రవహిస్తూ ప్రవహిస్తూ ఉండియే ఒక్క క్షణంలో ఉత్తుంగ తరంగాకారాన్ని చెందుతుంది. గట్టిభావన చేత మనస్సు సూర్యబింబంలోకూడా చీకటిని, (రాత్రిని) చూడగలదు. కంటిదోషముగలవాడు చంద్రునియందు ద్విత్వమును చూచినట్లే. కనుక మనస్సే కర్త. మనస్సే భోక్త. ఇది తన భావనచేత ఊసర క్షేత్రంలో నీటిని చూస్తుంది. తాగుతుంది. తృప్తిపడి నాట్యమాడుతుంది. మనస్సుయొక్క మహిమ చెప్ప నలవికాదు. కనుక మహర్షీ! దానిచే కల్పితమయిన భేదభావమును విడచి అభిన్నాత్మ స్వరూపమును పొందుము " అన్నాడు బ్రహ్మదేవుడు.

## 83, 84 లు. ప్రపంచోత్పత్తి వర్ణనము.

వశి:- రామచంద్రా! బ్రహ్మదేవుడు పూర్వము నాకు చెప్పిన విషయమును చెప్పాను నీకు. అవ్యాకృత నామరూపుడగు బ్రహ్మ నుండి, అవ్యాకృత నామరూపమయిన ప్రపంచము పుట్టింది. అది కాల క్రమంచేత గట్టిపడి మనస్సు అయింది. దానినుండి తన్మాత్రలు పుట్టినవి. వానినుండి సమష్టి సూక్ష్మశరీరాభిమానియగు తైజస పురుషుడు ఉదయించాడు. ఇతడే బ్రహ్మ. కాబట్టి రామా! బ్రహ్మదేవుడే మనస్తత్వమని గ్రహించు. మనస్తత్వాకారుడగు బ్రహ్మదేవిని సంకల్పిస్తే అది తయారవుతుంది. ఆ బ్రహ్మ సంకల్పసిద్ధుడు. కనుక అనాత్మయందు ఆత్మాభిమానమును కలిగించే అవిద్యను సృష్టించాడు. దానిచే గిరి, తరు, గుల్మ, లతా, జలధియుక్తమగు ఈ ప్రపంచమును సృష్టించాడు. ఇట్లు చిదేకరసమయిన బ్రహ్మ తత్త్వమునుండివచ్చిన ఈ ప్రపంచసృష్టి ప్రధానపరమాణ్వాదులనుండి

వచ్చినదని తార్కికాదులు అభిప్రాయపడుచున్నారు. రామా! ఒక్కొక్క వస్తువునకు అనేకములయిన పరమాణువులు ఉపాదాన కారణములని కల్పించుట గౌరవదోషగ్రస్తముకాన పరమాణుకారణతావాదము పనికిరాదు. చేతనుడయినకర్త లేనిదే జడమయిన ప్రధానము విచిత్రమగుజగత్తును నిర్మింపలేదుకాన ప్రధానకారణవాదము కూడ చెల్లదు. చైతన్యము జడాకారముగ పరిణమించుట చెల్లదుకాన విజ్ఞానవాదము పొసగదు. శూన్యము దేనికీ కారణమగుట లోకములో కనిపించనందున శూన్యం కారణమనువాదం కుదరదు. కనుక శ్రుతి ప్రామాణ్యంవల్లను, లాఘవమువలనూ, అనిర్వచనీయమాయాశక్తియుక్త బ్రహ్మవివర్తవాదమే నిలుస్తుంది. కనుక రామా! ముల్లోకములందలి వస్తువులన్నీ బ్రహ్మమునుండియే పుట్టినవని గ్రహించు. పరమార్థంలో జగత్తు పుట్టలేదు. బ్రహ్మవివర్తము ప్రపంచము. చిచ్ఛక్తి అహంకారసమష్టి ఉపాధియందు ప్రవేశించి బ్రహ్మను కల్పించుకొని హిరణ్యగర్భుడయినది. వ్యష్టిఉపాధులందలి చిదాభాసశక్తులన్నీ బ్రహ్మాభిన్నములుకాని వేరు కావు. అవిఅన్నీ మొట్టమొదట పితామహరూపమయిన సమష్టిమనోభావంతోనే ఉన్నాయి. వివర్తభావాన్ని పొందిన ఈ చిదాభాసశక్తులన్నీ జీవులనబడుచున్నాయి. చిదాకాశమునుండి బయలుదేరిన ఆ జీవులు మాయాకాశమునందు పంచభూతతన్మాత్రోపాధులతో కూడుకొని, పదునాల్గు లోకములలోనూ, కర్మవాసనలను అనుసరించి ఆయాజాతి ప్రాణులందు ప్రాణశక్తిద్వారా ప్రవేశించి, రేతోరక్తాది రూపమయిన బీజత్వమును పొందుచున్నారు. తరువాత ఆయా యోనులందు పుట్టుచున్నారు. కాకతాలీయముగ వారివారిసంస్కారమునుబట్టి కర్మఫలములను అనుభవించుచున్నారు. కర్మపాశబద్ధులై లింగశరీరముతో కూడుకొని తిరుగుచూ, ఉత్తమలోకముల కెగురుచున్నారు. ఒకప్పుడు నరకములందు పడుచున్నారు. కర్మలకూ, తద్వాసనలకూ కామమే కారణము. కనుక జీవులందరూ కామమయులు. "కామమయఏవాఽయం పురుషః" అని శ్రుతి ఉన్నది.

కొంతమంది జీవులు, అడవిలోని ఆకులవలె ఎండుచూ రాలుచూ, అనేకజన్మల నెత్తుచుందురు. కర్మఫలములను అనుభవించు

చుందురు. తత్వజ్ఞానపర్యంతమూ వీరి కీయవస్థ తప్పదు. మరికొందరు పాపజన్మలను అనుభవముచే పారద్రోలుకొని, యిప్పుడు శుభకర్మపరాయణులై విహరింతురు. ఇట్టివారు కొద్దిజన్మలలో జ్ఞానమునొంది ముక్తిని బడయగలరు. మరికొందరు గాలి కెగిరిన సముద్రబిందువులు సముద్రమధ్యమును చేరినట్లు, తత్వజ్ఞానము నొంది పరమపదింతురు. వీరందరూ మొదట బ్రహ్మనుండియే ఫుట్టుచున్నారు. సకలానర్థములకు కారణమగు మనస్సనును విషలతను సంసారమను అడవియందు తత్త్వజ్ఞానమను గండ్రగొడ్డలిచే నరికినచో మరల వీరు ఫుట్టరుసుమా! కనుక శ్రీరామా! సమష్టిమనస్తత్త్వమే హిరణ్యగర్భుడు. అతడివల్ల సృష్టి జరిగింది. అంటే మనస్సువల్ల సృష్టి జరిగిం దన్నమాట. సృష్టి మానసికము, సంకల్పాత్మకము, కనుక మనస్సు నశిస్తే ప్రపంచం లేదు.

రామచంద్రా! సాత్త్విక రాజస తామసభేదముచేత, జీవోపాధులు మూడు రకములు. వానిపుట్టుకను గూర్చిన విభాగమును జెప్పెద వినుము. 1 ఇదంప్రథమతా. 2 గుణపీవరీ. 3 ససత్వా. 4 అధమసత్త్వా 5 అత్యంతతామసీ. 6 రాజసీ. 7 రాజససాత్త్వికీ. 8 రాజసరాజసీ. 9 రాజసతామసీ. 10 రాజసాత్యంతతామసీ. 11 తామసీ. 12 తామససత్త్వా 13 తమోరాజసీ 14. అత్యంతతామసీ. అని పదునాలుగు రకాలు. ఇందులో పదునాల్గవది అయిదవభేదములోనూ, 13 వది 9 వ దానిలోనూ, అంతర్భావమును చెందగా పన్నెండు రకములు మిగులును.

(1) ఇదంప్రథమతా: ఏ జీవుడు పూర్వకల్పమునందు గడచిన జన్మలలో ఆఖరి జన్మయందు శమదమాది గుణసంపత్తి యున్నా శ్రవణాదులు లభించనందువలనగాని, బలవత్తరమయిన ప్రతిబంధమువల్లగాని, తత్త్వజ్ఞానము కలుగక ఈ కల్పంలో మొట్టమొదట జన్మించి ఆ జన్మలోనే శమాదిగుణసంపన్నుడుగానూ, జ్ఞానయోగ్యుడుగానూ పుట్టునో ఆ జీవజాతి ఇదంప్రథమతా అను విభాగమునకు చెందును.

(2) గుణపీవరీ : పూర్వజన్మలో తీవ్ర వైరాగ్యములేక పుణ్య లోకాలయందలి కోరికచే ఉపాసనాకర్మల నాచరించి విచిత్రప్రపంచ వాసనలచే భోగములను అనుభవించుచూ ఇకముందు పది అయిదు జన్మలలో మోక్షమును పొందువారు రెండవతెగకు జెందుదురు.

(3) ససత్త్వా : సుఖదుఃఖముల నిచ్చేడి పుణ్యాపాపములు గల వారై, క్రమంగా సత్త్వసంపత్తి పెరిగి నూరుజన్మలకు ముక్తిపొందు వారు ఈ తెగకు చెందుదురు.

(4) అధమసత్త్వా : విచిత్రమయిన ప్రపంచవాసనలతో వ్యవహరించుచూ, మలినాంతఃకరణులై సుఖదుఃఖానుభవముచే పుణ్యాపుణ్యములు కలవారను ఊహకు తావిచ్చుచూ, అనేకవేలజన్మ లకు జ్ఞానము నొందువారు ఈ తెగకు జెందుదురు.

(5) అత్యంతతామసీ : వెనుకటివారి లక్షణములు గలిగి తత్త్వశాస్త్రమునకు (అధ్యాత్మశాస్త్రమునకు) విముఖులయినందున ఈకల్పంలో మోక్షము సందిగ్ధమగువారు అత్యంత తామసులు.

(6) రాజసీ : పూర్వకల్పవాసనలను అనుసరించి విచిత్రకర్మ లను ఆచరిస్తూ ఈకల్పంలో రెండుమూడు జన్మలకు మనుష్యులై పుట్టి స్వర్గనరకములకు అనుకూలమయిన కర్మలను చేయుచూ, మోక్షము సంశయాస్పదమగువారు రాజసులు.

(7) రాజససాత్త్వికీ : సంసారదుఃఖమును అనుభవించినందున వైరాగ్యము కుదిరి జ్ఞానప్రాప్తి కలుగు జన్మసమీపములోనుండి తదనుకూలమయిన కర్మాచరణ చేయువారు రాజస సాత్త్వికు లన బడుదురు.

(8) రాజసరాజసీ : మనుష్యాతిరిక్తమయిన యక్షగంధర్వాది జన్మలలో కొద్ది జన్మలతో ముక్తి జెందువారు ఈ తెగకు జెందుదురు.

(9) రాజసతామసీ : అనేకవందల జన్మలకు మోక్షమును పొందువారున్నూ, మందప్రయత్నము గలవారున్నూ రాజస తామసులు.

(10) రాజసాత్యంతతామసీ ; ఎన్నివేల జన్మలకయినన్నూ

మోక్షమును పొందక అజ్ఞానావృతులై కర్మలను మెల్లగా ఆచరించు వారు ఈ తెగకు జెందుదురు.

(11) తామసీ : ఆయా కల్పములందు అనేకవేలపర్యాయ ములు హిరణ్యగర్భునినుండి పుట్టి చిరకాలమునకు మోక్షమును బొందువారు తామసు లనబడుదురు.

(12) తామసనత్వా– వారు తామసప్రధానమగు మొదటిజన్మ యందే మోక్షార్హులై తదనుకూలమయిన కర్మలను ఆచరించుచో తామససత్వులు అనబడుదురు. (తామసమగు దానవ, రాక్షస, పిశా చాది జన్మలయందు, ప్రహ్లాదుడూ, కర్కటీ మున్నగువారు జ్ఞానమును సంపాదించుకొని మోక్షమును పొందారు. ఈతెగకు వీరే నిదర్శనము.

(13) తామసరాజసీ – అట్టివారిలో కొన్నిజన్మలయినతరువాత ముక్తి పొందువారు తామసరాజసులు.

(14) అత్యంతతామసీ–వెనుక లక్షజన్మలు యెత్తి ఇకముందు లక్ష జన్మలు యెత్తనుండి యెన్నటికీ మోక్షార్హులు కానివారు అత్యంతతా మసులు. 'రామచంద్రా! భిన్నభిన్న ఉపాధులుగల ఈ జీవజాతు లన్నియు, బ్రహ్మనుంచియే పుట్టినవని గ్రహించు. సముద్రమునుండి తరంగములూ, దీపమునుండి కిరణములూ, మండుచున్న అగ్నినుండి మిణుగురులూ, చంద్రబింబమునుండి తెల్లని,చల్లనికిరణములూ, చెట్టు నుండి చిత్రవిచిత్రములయిన శాఖోపశాఖలూ, సువర్ణమునుండి కటక కేయూరా ద్యాభరణములూ, సెలయేటినుండి నీటితుంపురులూ, మహాకాశమునుండి ఘటాద్యాకాశములూ, నీటినుండి బిందువులూ, ఆవర్తములూ, తరంగములూ, సూర్యతేజస్సునుండి ఎండమావులూ, చంద్రునినుండి చంద్రికా (వెన్నెలా), పుట్టినట్లు బ్రహ్మనుండి పలు విధములయిన భూతజాతులు పుట్టినవిసుమా! ఎక్కడనుంచి పుట్టు చున్నవో అక్కడనే లయిస్తున్నాయి.కొన్ని చిరకాలానికి(అనేకజన్మ లకు) యిస్తున్నాయి. మఱికొన్ని కొద్దికాలానికే (కొలదిజన్మలకే) లయిస్తున్నాయి. యథార్థంలో జగద్బ్రహ్మలకు భేదంలేదు. ఉపా ధులవల్లనే భేదము – కనుక ప్రపంచంఅంతా ఉత్పత్తిస్థితిలయకాలము లందు బ్రహ్మస్వరూపమే అని గుర్తించు' అన్నాడు వసిష్ఠుడు.

## ౯౫. కర్మ - కర్తలకు అభేదమును ప్రతిపాదించుట.

'మహర్షీ! కల్పారంభములో జీవరాసులన్నీ బ్రహ్మనుండి ఆవిర్భవించినట్లు చెప్పారు మీరు. అంటే బ్రహ్మయే ఉపాధులందు జీవభావముతో ప్రవేశించాడని చెప్పినట్లు అనగా బ్రహ్మకు జీవభావము ఆగంతుకమని తేలింది. ఇంక దీనికి ప్రాక్తనకర్మ నిమిత్త (కారణ)మని చెప్పవీలులేదు. కర్మను ఒప్పుకుంటే ఆ కర్మకు పూర్వము కర్తను అంగీకరించాలి. కర్త లేనిదే కర్మ పుట్టదు. కనుక అందుకోరకు జీవుడు అనాది అని అంగీకరించేటట్లయితే బ్రహ్మకు జీవభావము ఔపాధికమని వెనుక చెప్పినది కుదరదు. దానిని సమర్థింప సాధ్యపడదు. కనుక ఎటులనయిననూ దోషము తప్పునట్లు లేదు" అను ప్రశ్నను మనస్సులో పెట్టుకున్నాడు శ్రీరాముడు. గ్రహించాడు మహా వసిష్ఠుడు ఎట్లనో. రాముని సందేహం తీర్చాలనుకున్నాడు. సమాధానం అంతా కడుపులో పెట్టుకున్నాడు. తుదకు కర్త కర్మలు రెండూ ఒకేదభా పుట్టాయి అనే అభిప్రాయంతో ప్రారంభించాడు మహర్షి.

వసి॥ రామచంద్రా! కర్మ, కర్త, అను రెంటికీ భేదం లేదు. రెండూ ఒకటే (రెండూ అభిన్న[illegible]లు) కనుకనే పరబ్రహ్మనుండి ఒకేదభా బయటుదేరాయి ఆ రెండూ. చెట్టునుండి పువ్వూ, దాని పరిమళమూ రెండూ ఒకేదభా బయలుదేరుచున్నవి. ఇది మనకు ప్రత్యక్షము. పుష్పమే పరిమళము. పరిమళమే పుష్పము. ఈ రెంటికీ అన్యోన్యాధ్యాస. కర్మ కర్తలకు కూడ అట్లే. ఈ రెండునూ ఇట్లావిర్భవించుటకుగాని తాదాత్మ్యాధ్యాస చెందుటకుగాని జీవులయొక్క స్వభావమే కారణము. స్వభావమనగా అజ్ఞానము. కనుకనే గీతలలో శ్రీకృష్ణుడు "స్వభావస్తు ప్రవర్తతే" అని అన్నాడు. కనుకనే ఈ సృష్టివాదము అజ్ఞజనసమ్మతమూ, వ్యవహారదశామాత్రగోచరమును. విజ్ఞసమ్మతము కాదు. పరమార్థదశలో నిలువదు. ఇందుకు "ననిరోధో నచోత్పత్తిః ఇత్యాది గౌడపాదకారికయే ప్రమాణము" "తదేతద్బ్రహ్మ అపూర్వ మనపర మనంతర మబాహ్య మయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" అను శ్రుతిసిద్ధాంతమును బట్టి జగత్తు లేదు, జీవులు లేరు, కర్మలు లేవు. ఇవి పుట్టుటయూ లేదు. వీనిని నిషేధించుటా లేదు, "అయితే పరమార్థాన్ని ఉపదేశించవలసిన

ఈశాస్త్రంలో అజ్ఞానులు అంగీకరించిన సృష్టియొక్క ప్రసక్తి యెందుకు ? ఎందుకు ప్రపంచోత్పత్తినిగూర్చి చెప్పుచుంటిరి” అని నీవడిగెదవు. విను చెబుతాను. వ్యవహారదశలో ద్వైతకల్పనను అంగీకరిస్తేకాని, ఉపదేశ్య ఉపదేశకభావము, (నీవడుగుటా, నేనుచెప్పుటా) కుదరదు. అది శోభించదు. అందుకొరకు శోచ్యమైన నీ ద్వైతకల్పనను అంగీకరించి చెప్పాను. ఇలాంటి భేదదృష్టిని అనుసరించే లోకంలో “బ్రహ్మ, ప్రపంచమూ, జీవులూ” అనే మాటలు మాట్లాడు చున్నారు. అయితే ద్వైతప్రపంచాన్ని నిషేధించడం ఎందుకని ప్రశ్న పుడుతుంది. విను సమాధానం. “యద్యస్మాజ్జాయతేయత్రచ లీయతే తత్తదుపాదానకం యద్యదుపాదానకం తత్తదభిన్నం” ఏది దేనివల్ల పుట్టునో దేనియందు లయించునో అది, అది ఉపాదాన కారణముగా గలది. ఏది, ఏది ఉపాదానకారణముగా కలదో, అది దానితో అభిన్నము అనున్యాయము కలదు. దీనిచే బ్రహ్మవల్లబుట్టి, బ్రహ్మయందు లయించి, బ్రహ్మ ఉపాదానకారణముగాగల ప్రపంచము బ్రహ్మాభిన్నము. బ్రహ్మకంటె వేరుకాదు. అజ్ఞానమువల్ల బ్రహ్మకంటె వేరుగావున్నట్లు కనిపించుచున్నది. అజ్ఞానమువల్ల భాసించే (కనిపించే) వస్తువులకు బాధ (నిషేధము) తప్పదు. అందువల్ల ప్రపంచము నిషేధించబడుచున్నది. అనంతములయిన జీవరాసులన్నియూ త్రికాలమందునూ, బ్రహ్మనుండి పుట్టుచూ, లయించుచూ, స్థితిని చెందుచున్నవి. కనుక బ్రహ్మోపాదానకము లనక తప్పదు. కనుక రామా! పురుషుడు, కర్మ, అనునవి రెండూ, పుష్పపరిమళములవలె అభిన్నములు. అవి చెట్టునుండి పుట్టినట్లు ఇవి పరమేశ్వరునినుండి పుట్టుచున్నవి. మెల్లగా అతనియందే లయించుచున్నవి. ఇది లోకప్రత్యక్షము. దైత్యులూ, ఉరగులూ, నరులూ, అమరులూ, వారివారి భావములతోడనే, వారివారి కర్మవాసనలతోకూడిన భూతమాత్రోపాధులతోడనే పుట్టుచున్నారు. ఆయా ఉపాధులతో అభిన్నముగా వ్యవహరిస్తున్నారు. కాబట్టి ఆయాజీవుల ఉత్పత్తికి కర్మలు కారణము కాదు. మరొకటీ కారణముకాదు. పరిశేషన్యాయముచే అజ్ఞానమొక్కటే కారణము.

రామచంద్రా! నామనస్సులోని అభిప్రాయం బయట పెడతాను విను. నీ సందేహం తీరుతుంది. కర్తయగు పురుషుడు అనాది అనుటకు వీలులేదు. వాడు అనాదిఅంటే వాడికి కర్తృత్వము స్వాభావికమా? ఔపాధికమా? అనే వికల్పం పుడుతుంది. స్వాభావికం అయ్యేయెడల, స్వాభావికమయిన అగ్నియొక్క ఔష్ణ్యము ఎన్ని ఉపాయములచేతనూ పోదుకనుక, వీడికి ఈ కర్తృత్వముకూడాపోదు. కనుక ఇంక మోక్షం ఉండదు. ఇక ఔపాధికం అంటె ఆ ఉపాధి అవిద్యయేనా ? లేక మరొకటియా ? అవిద్యయే అనేయెడల ఇప్పుడు మేముచేసిన సిద్ధాంతపక్షంలోనే చేరుతుంది యీవాదంకూడా. కాక ఆ అవిద్యకు, ఆత్మయందు కర్తృత్వమును తెచ్చిపెట్టేశక్తి స్వతస్సిద్ధమా ? ఇతర సాపేక్షమా ? స్వతస్సిద్ధ మనటానికి వీలులేదు. సుషుప్తి, మూర్ఛా, ప్రళయములందు అవిద్యఉన్నా, ఆత్మయందు కర్తృత్వము కనిపించుటలేదు. కనుక ఇంక ఇతరసాపేక్ష మనేయెడల, దేనిని అపేక్షించి అవిద్య ఆత్మకు కర్తృత్వమును ఆపాదించుచున్నదో(తెచ్చిపెడుతున్నదో) అదే ఉపాధి అవును కాని, ఈ అవిద్య ఉపాధికాదు. కాక ఉపాధికి మరోఉపాధి ఉండటం అసంభవం. ఒకవేళ ఈ ఉపాధిని అంగీకరించినా, ఇది అవిద్యాకార్యమా? స్వతంత్రమా ? స్వతంత్రమనేపక్షంలో అనాదియా ? సాదియా ? అనాది అనేయెడల నిద్రా ప్రళయములందుకూడా ఆత్మకు కర్తృత్వాన్ని తెచ్చిపెట్టాలి. అది కనిపించటంలేదు. ఇంక సాది అనినచో, అట్టి ఉపాధితో ఉపహితమైన(కూడిన)కర్తకూడా సాదియే అగునుగానఅనాదియగుకర్త సిద్ధించడు. ఇంక ఆ ఉపాధి అవిద్యాకార్యమనే పక్షంలో కూడ అది అనాదియా? సాదియా? అనే వికల్పాలూ, అందు ఈదోషాలూ తప్పవు-కనుక నిత్యుడయిన ఆత్మకుకూడ, కర్తృత్వవిశిష్టమైన ఉపాధియొక్క సంబంధము ప్రతికల్పమునందునూ, ప్రతిదినమునందును భిన్నముగా నుండుటవలన, అట్టి ఉపాధిసంబంధాధీనమయిన ఉపహిత కర్తృరూపమునకు కర్మతోటికూడా పుట్టుకా, క్రియాశక్తి విశిష్టమైన ఉపాధితో తాదాత్మ్యమూ అవశ్యం అంగీకరించవలెను. అందుకు కారణమూ అజ్ఞానమేకాని మరొకటికాదు. ఈ పక్షమే యుక్తికి పట్టి

పోవుచున్నది. "ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి" అను శ్రుతికూడ ఈ యర్థమునందే అనుకూలపడుచున్నది. అన్నారు వసిష్ఠులు. శ్రీరాముడు ఇదంతా విని యిదికూడా కుదరదని నిరూపించదలచాడు. దానికనుకూలంగా ప్రణాళికను తయారుచేసికొన్నాడు మనస్సులో. ఇలా అన్నాడు. మహర్షీ! మన్వాదిప్రజాపతులు అలౌకికమయిన ధర్మబ్రహ్మలయందు వేదసమ్మతమయిన ప్రమాణబుద్ధిగలవారు. వారు జైమినితంత్రసిద్ధమయిన న్యాయకలాపంచేత అర్థమును నిర్ణయించి, స్మృత్యాదులను రచించారు. కనుక శ్రుతులును, తన్మూలములయిన స్మృత్యాదులును అలౌకికార్థమునందు ప్రమాణములన్నమాట. సత్వగుణోపేతులూ, విషయవిముఖులూ, బ్రహ్మసాక్షాత్కారకుశలులూ, అగువారు సాధువులు. అట్టివారి ఆచారం కూడా అలౌకికార్థమునందు ప్రమాణము. కనుక సత్పురుషుల ఆచారమూ, శ్రుతిస్మృతిరూపమయిన శాస్త్రమూ– ఈ రెండూ రెండు నేత్రములు తత్త్వము తెలియని శిష్టులకు. – శాస్త్రమును అనుసరించి నడవనివారలను శిష్టులు బహిష్కరింతురు. అట్టివారు దుఃఖమును గూడ బొందుదురు కనుక మహాత్మా! లోకంలోనూ, వేదమునందునూ (ప్రతీతి) కలదు. "కర్మ, కర్తలు క్రమంగా కలుగుదురు" "ఈ రెండూ ఒక్కమాటు పుట్టవు" అని. కర్మవల్ల కర్త పుడతాడు. కర్తవల్ల కర్మ తయారవుతున్నది. ఈ బీజాంకుర న్యాయము లోకసిద్ధము, వేద ప్రతిపాదితమును. విత్తువల్ల మొలక పుట్టినట్లు కర్మవల్ల జంతువు(కర్త) పుడతాడు. మొక్కవల్ల క్రమంగా విత్తు(బీజము) పుట్టినట్లు జంతువువల్ల క్రమంగా కర్మ తయారవుతుంది. పూర్వజన్మవాసనకూడా కర్మరూపమే. అదే కర్తకు కారణము. దాని కనుకూలమయిన ఫలమునే జీవులు అనుభవిస్తూ ఉంటారు. పరిస్థితి అంతా ఇలాఉంటే తమరు, జీవులు కర్మ అనే బీజము లేకుండగనే బ్రహ్మవల్ల పుట్టుచున్నారని ఎలాచెప్పిరి? ఈమాట "సాధుకారీ సాధుఃభవతి పాపకారీ పాపోభవతి పుణ్యోవై పుణ్యేన కర్మణా పాపః పాపేన" మంచిచేసినవాడు మంచివాడూ, చెడ్డు చేసినవాడు చెడువాడూ, పుణ్యకర్మచే పుణ్యాత్ముడూ, పాపకర్మచే పాపాత్ముడూ, అవునని చెప్పెడి శ్రుతులకు విరుద్ధమే కదా?

మీరుచెప్పిన ఈ సహోత్పత్తిపక్షముచేత లోకసిద్ధమూ ప్రమాణ నిరూఢమూ అయిన కర్మజీవులకుగల పరస్పర హేతుఫలభావము (కార్యకారణభావము) తిరస్కరింపబడినది (చెడగొట్టబడినది). కారణరహితమై, మాయాశబలమైన బ్రహ్మమందు కర్మఫలమగు ఆకాశాది స్థూలదేహాంతసృష్టి కలదనియు కర్మఫలభూతులయిన బ్రహ్మాదులందు హిరణ్యగర్భాదిసూక్ష్మ స్థూలోపాధులందు భోగసామగ్రి సృష్టి కలదనియు లోకంలో రెండు ప్రతీతులు కలవు. ఈ రెండును మీరు తుడిచిపెట్టారు. కాక మీరు చెప్పినట్లు కర్మలు ఫలములనీయకుండా వ్యర్థములగునని అంగీకరించినచో పాపకర్మవల్ల నరకంవస్తుందనే భయం లోకంలో ఎవరికీ ఉండదు. ఇంక బలవంతులు బలహీనులను పీడించుట అను మాత్స్యన్యాయము ప్రబలుతుంది. లోకంలో దానితో సర్వనాశం తటస్థించును. కనుక బ్రహ్మర్షి సత్తమా! నిజంగా చెప్పండి. చేసినకర్మ ఫలాన్ని ఇస్తుందంటారా, ఇయ్యదంటారా? ఈ సందేహంనాకుగొప్పగాఉంది. దీన్నితీర్చండి అన్నాడు శ్రీరాముడు. వసిష్ఠుడు శ్రీరాముని ప్రశ్నను మెచ్చుకున్నాడు. అదిప్రామాణికమని సంతోషించాడు. తనవాదంలో దోషంలేదని నిరూపించదలచాడు. ఇలా అన్నాడు. శ్రీరామా! 'యద్ధిమనసా ధ్యాయతి తద్వాచా వదతి, తత్కర్మణాకరోతి' అని శ్రుతిచెబుతోంది. మనసుచే సంకల్పించినదాన్ని నోటితో చెబుతాడు. దానినే క్రియతో చేస్తాడు' అని అర్థము. మనోవికాసమే కర్మలకు కారణమని తేలింది. ఇలాంటి మనఃపూర్వకమైన క్రియలకే ఫలమున్నదని చెబుతోంది శ్రుతి. ఆదిసృష్టిలో పరబ్రహ్మనుండి యెప్పుడు మనస్సులోవస్తువుపుట్టిందో, అప్పుడే అది ఉపాధిగాగలసమిష్టి వ్యష్టి జీవులకర్మకూడా పుట్టింది. జీవుడు పూర్వవాసనల ననుసరించిన దేహముకలవాడగుటచే, ఆ దేహమునందు నేననుభావంతో ఉన్నాడు "తన్మనోఽకురుత ఆత్మన్వీస్యామితి" "సోర్చన్నాచరత్ యద్యద్భవంతి తత్తదాభవంతి" అను శ్రుతులు కర్మఅంతా మనోధీనమని చెబుతున్నాయి. కనుకనే నేను మనస్సే కర్తగాని ఆత్మ కర్తగాడని చెప్పుటకు కర్మకర్తలు రెండూ ఒకేదభాపుడతాయి అనే సహోత్పత్తి పక్షమును, బయటపెట్టాను. కర్తకర్మలకు అభేదంచెప్పటంలో నా తాత్పర్యం.

కర్మ మనోధర్మమేగాని ఆత్మధర్మం కాదనియే అందుకొరకే కుసుమా మోద దృష్టాంతమును చూపాను. పుష్పమూ దానిపరిమళము వేరుగా కనిపిస్తున్నా నిజంలో ఎలా వేరుకావో, అలాగే కర్మ మనస్సులు వేరుగా గోచరిస్తున్నా అవి వేరుకావు. క్రియాస్పందమే లోకంలో కర్మ అని చెప్పబడుతోంది. అది కర్మసంస్కారమనే రూపంతో మనస్సులో ఉండి అదృష్టఫలరూపంతో ఆవిర్భవించి దేహరూపంగానూ స్వర్గనరకాది రూపంగానూ తయారవుతోంది. కనుక అట్టికర్మకు ఆశ్రయము మనస్సేకాని ఆత్మకాదు. సవిజ్ఞానవాన్ భవతి సవిజ్ఞానమేవ అన్వవక్రామతి” అనుశ్రుతి, భావిదేహాకారమయిన అభిమానాన్ని పొందే పూర్వశరీరమునుండి బయలుదేరుతోంది, అని చెబుతోంది. అందుచే కర్మమనే ధర్మము కలదికనుక మనస్సే కర్మ మనఃకల్పితమయిన (కార్యమయిన) ప్రపంచం. అంతా కర్మఫలమేకనుక కర్మలు నిష్ఫలములనే దోషంకూడా లేదు. చేసినకర్మలకు ఫలంలేని వస్తువే లోకంలోలేదు. ఐహికంకాని పురాతనంకాని చేసినకర్మ యావత్తూ పురుషప్రయత్నరూపమే. అది ఎన్నటికీ నిష్ఫలంకాదు. పురుషుడంటే మనోమయుడు. రామచంద్రా! నాసిద్ధాంతంలో నిష్కృష్టమైన నా అభిప్రాయం చెబుతావిను. అవిద్యాజన్యమయిన మనస్సే క్రియాశక్తి విశిష్టమగుటవల్లనూ చిదాత్మకు ఉపాధియగుటవలననూ కర్తయు భోక్తయు అగుచున్నది. అన్నమయం సోమ్యమనః తన్మనో కురుత, త్రిణ్యాత్మనే అకురుత, మనోవాంఛం ప్రాణం” ఇత్యాది శ్రుతియు వెనుక జెప్పినయుక్తిజాలమును ఈ విషయమునందు ప్రమాణములు. ఈమనస్సు ప్రతికల్పమునందూ, ప్రతిరోజునా, పుటుతోంది, చస్తోంది అనగా ఆవిర్భావ తిరోభావములను చెందుతోంది. అనగా బయటకి వస్తోంది. చాటుకు పోతోంది. అయినా ఇది అనాది అనవచ్చును. ఎందువల్లంటే ప్రతిరోజూ గోడనీడ పగటిపూట ఆవిర్భవించి(కనిపించి) రాత్రిచీకటికాలంలో తిరోభావం చెందుతూ (కన్పించకుండాపోతూ) ఉంటుంది. అలాగే ముఖప్రతిబింబంకూడా అద్దందగ్గరగా ఎదురుకుండా ఉంటే ఆవిర్భవిస్తుంది. అద్దమును తీసివేస్తే తిరోభావం చెందుతుంది ( కనిపించకుండా పోతుంది. ) అయినా ఇది మాగోడనీడ, ఇది

నామఃఖప్రతిబింబము అనిగుర్తించబడుతునే ఉన్నది. అలాగే ఈ మన స్సుకూడా నామనస్సు అని బాధలేకుండా గుర్తించబడుచుండుటవల ననూ, ఉపహితమయిన ఆత్మతో అభిన్నమగుటవలననూ, వేరుకాదు. పైగాఅనాదికూడా అవుతోంది.కాక,'నాశమంటే శూన్యమవుటఅనీ, పుట్టుటఅంటే లేనిది పుట్టుటఅనీ''అర్థంకాదు.అలాగయితే ప్రతిరోజూ మనస్సుసుషుప్తిలో నశిస్తోందికనుక,జాగ్రత్తలోమనసుభిన్నమయ్యేది. మాది సత్కార్యవాదము.అవిద్యాబీజరూపంతో ఉన్న ప్రాక్తనకర్మ కర్మలూ, తత్ఫలమయిన వియదాది ప్రపంచమూ, ఒకేదభా పుట్టాయి అని అంగీకరించినా, కృతహానాకృతాభ్యాగమము లనే దోషములు లేవు. శాస్త్రప్రామాణ్యమునకు బాధయూ లేదు. మాత్స్యన్యాయ ప్రసంగమూ లేదు. జన్మకర్మలకుగల అవినాభావ నియమమున నేను తుడిచిపెట్టినదీ లేదు. ఆవిర్భావ తిరోభావావస్థలుగల మనస్సే అవిద్య అని అంగీకరించుటచే, పరిశేషన్యాయముచే ప్రపంచోత్పత్తికి కార ణము. ఆత్మవిస్మరణమే అనగా అవిద్యయే యను మాటకూడ విరుద్ధము కాదు.

కనుక కర్మమనస్సులు రెండూ ఒకటే అయినందున ఈ రెంటిలో ఏదో ఒకటి నశించాలి అని కోరేవాడు. సవిందాత్మక (చలనాత్మక) మయిన ప్రాణముయొక్క నిరోధరూపమయిన హఠ యోగమునుగాని, మనోనిరోధరూపమయిన రాజయోగమునుగాని అభ్యర్థించాలి. కర్మ నశిస్తే మనస్సు నశిస్తుంది. మనస్సు నశించితే కర్మ నశిస్తుంది. యోగమువల్ల తత్త్వసాక్షాత్కారము కలిగి అవిద్య నశించితే యీ రెండూ నశిస్తాయి. " వెలుతురు, వేడిమి " యీ రెండూ ఎలా కలిసివున్నవో అలాగే కర్మమనస్సులు రెండూ కలసి వున్నవి. ఈ రెంటిలో ఒకటి లయించితే రెండూ లయించినట్లే. కాబట్టి రామచంద్రా! స్పందముయొక్క విలాసము చిత్తము. స్పంద రూపము కర్మ. కనుక యీ రెండూ వేరుకావు.

## ౯౭. మనస్సంజ్ఞావిచారము.

రామచంద్రా! ఇంకను ఈ మనస్సుకుగల సంజ్ఞా భేదములను జెప్పెద వినుము. సంకల్ప క్రియా పదములు మూడున్నూ దీని రూపములు. సర్వశక్తియుక్తుడయిన మహాయోగిబల బ్రహ్మయొక్క దృఢమయిన మొట్టమొదటి సంకల్ప శక్తియే మనస్సు. సందేహావస్థలో డోలాయమానమై తిరుగునది మనస్సు. స్వయంప్రకాశమానమయిన ఆత్మతత్త్వాన్ని గుర్తించలేనిది యీ మనస్సు. అకర్తయందు కర్తృత్వబుద్ధిని పుట్టించునది మనస్సు. (ఊరకున్నవాని యందు ఏమోచేస్తున్నాడనే భావమును కలుగజేయునది ఈ మనస్సు.) కల్పనారహితమయిన మనస్సుఅనేది ఉండదు. గుణములులేని గుణవంతుడు ఉండడు. అగ్ని ఔష్ణ్యములవలె కర్మమనస్సులూ, జీవ మనస్సులూ అభిన్నములు. సంకల్పశరీరమయిన యీమనస్సే విస్తరించి విశ్వమును అంతా వ్యాపించింది. వాసనాపుంజమనే చెట్టుకు కర్మ విత్తనము. మనస్సు శరీరము. చిత్రవిచిత్రములయిన వివిధ క్రియలు కొమ్మలు. అనుభవించే సుఖదుఃఖములు ఫలములు. మనస్సు కోరిన దానినే కర్మేంద్రియవ్యాపారములు సంపాదిస్తాయి. కనుక మనస్సే కర్మ అని అన్నారు. రామా! దీనికే, 1 మనస్సూ, 2 బుద్ధీ, 3 అహంకారమూ, 4 చిత్తమూ, 5 కర్మా, 6 కల్పనా, 7 సంస్మృతి, 8 వాసనా, 9 విద్య, 10 ప్రయత్నమూ, 11 స్మృతీ, 12 ఇంద్రియమూ, 13 ప్రకృతీ, 14 మాయా, 15 క్రియా అని చిత్రవిచిత్రములయిన పేర్లు పదున్నైదు కలవు. హఠాత్తుగా స్వస్వరూపమును మరచిన చిదేకరసాకారమే విషయములకు అభిముఖమై ఈ కల్పనలను పొందినది. శుద్ధచైతన్యము ఈ విచిత్రములయిన పర్యాయవృత్తులు కలగటానికి కారణమేమని నీకు సందేహము కలుగుతుంది. క్రమంగా దీనికి ఇన్ని పేర్లు రావడానికి కారణం చెబుతావిను. (1) శుద్ధచైతన్యము. అవిద్యచే కలుషితమైనదివలె నుండి యెప్పుడు వికల్పములచే అనేకరూపవ లను చెందినదో అప్పుడు అది మనస్సు అనుపేరును పొందినది. (2) ఈ వికల్పానంతరము ఎప్పుడు "ఇది యిట్లే" అను నిర్ణయానికి

వచ్చినదో అప్పుడు ఆ సంవిత్తు బుద్ధి అయినది. (3) మిథ్యాభూతము లయిన దేహాదులందు ఆత్మాభిమానము కలిగి తనకు స్వయముగ సత్త (ఉనికి) కలదని తలచునో అప్పుడు అహంకారాభిమానముచే అహంకారమయినది. ఇదే సర్వానర్థములకూ బీజము. (4) విచారణ చేయకుండా ఒకవిషయాన్ని విడిచి మరొక విషయాన్ని స్మరించు నపుడు చిత్తమనిపించుకొనుచున్నది. (5) అదే సంవిత్తు (చైతన్యము) చలనధర్మము కలదై, అసద్వస్తువులనే గోచరింపచేయుచూ, శరీరేంద్రియాదులను దేశాంతరం చేర్చుటకు ప్రవర్తించునపుడు కర్మ అన బడుతుంది. (6) తన పూర్ణస్వరూపాన్ని విడిచి పరిచ్ఛిన్నభావమును కల్పించుకొనునపుడు "కల్పన" అను పేరును బొందును. (7) పూర్వము అనుభవించినదానినికాని, అనుభవించని దానినిగాని, అనుభవించవలె నను నిర్ణయంతో ఎపుడు లోపల కోరుతూ ఉంటుందో అపుడు సంసృతి అనబడును. (8) అనుభవించిన పదార్థములయొక్క సంస్కారము కలిగి చేష్టారహితమై సూక్ష్మరూపముతో నుండగా ఆ చైతన్యమే వాసన అనబడును. (9) ఆత్మతత్త్వ మొక్కటే నిర్మలమయినది. నిజమైనది. ద్వైత బుద్ధి అవిద్యచే కలిగినదను జ్ఞానమున్నపుడు ఆ చైతన్యమే విద్య అన బడును. (10) ఆత్మనాశముకొరకు (అదర్శనముకొరకు) ప్రయత్నించు నపుడు ప్రయత్న మనబడును. (11) నానావిధముల స్మరింపజేయు నపుడు స్మృతి యనబడును. (12) ఈ మనోభూతమగు చైతన్యము శ్రవణ స్పర్శన దర్శనాదులచేత జీవభావమును జెందిన పరమేశ్వరుని యెపుడు ఆనందపరచునో అపుడు ఇంద్రియ మనబడును. (13) దృశ్య జాలమంతయును, అభిన్న నిమిత్తోపాదానకారణత్వముచే నిర్మించి నందున ఆ చైతన్యమే ప్రకృతి అనబడుచున్నది. 14. ఉన్నదానిని లేనట్లునూ, లేనిదానిని ఉన్నట్లునూ చేయుచున్నందున ఇదే మాయ అనబడుచున్నది. (15) దర్శన స్పర్శన శ్రవణాదిక్రియలచే లోకంలో కారణరూపమును జెందినందున క్రియ అనబడుచున్నది. ఇలా చైత న్యమే చైత్యములకు అభిముఖమై క్రమంగా సంకల్పాది కల్పనా శక్తులచేత భోగమోక్షాధమగు నామములను బొందినది. పరమాత్మ

స్వరూపంనుంచి దిగజారి కలంకమును జెందిన చైతన్యమునకే ఈ వివిధనామములను బెట్టిరి పండితులు, అన్నారు వశిష్ఠులు.

శ్రీరాముడు:— 'మునీంద్రా! మనస్సు జడమా? చేతనమా? నాకు నిశ్చయం కలుగలేదు. ఈవిషయంలో తేల్చి చెప్పండి' అని అడిగాడు శ్రీరామచంద్రుడు.

వశి:- రామచంద్రా! మనస్సు జడముకాదు. చేతనమూ కాదు. చిదచిద్విలక్షణము. సదసద్విలక్షణము. అవిద్యచే కళంకము జెందినచైతన్యమే మనస్సు (చిత్తం) అనబడుతోంది. దీనికి అహంకారమనోబుద్ధి జీవాది నామము లనేకములు కలిగినవి. నటుడు అనేక వేషములను ధరించుచున్నట్లు ఈ మనస్సు క్రియాభేదముచేత అనేక నామములను పొందుచున్నది. రామచంద్రా! నేను నీకు మనస్సుకు గల నామములను చాలవరకు చెప్పాను. వీనినే ఆయా మతములవారు వారివారి బుద్ధికి దోచిన ఊహలచే అనేకతీరుల జెప్పుచున్నారు. నైయాయికులు అహంకారము ద్రవ్యవిశేషమనీ, జీవాత్మ సర్వవ్యాపకుడనీ, మనస్సు అణువనీ, ఇది (మనస్సు) ఆత్మసాక్షాత్కారమునందు కారణమనీ, బుద్ధి జీవునియొక్క గుణమనీ, ఇది రెండుమూడు క్షణములుమాత్రమే ఉండుననీ అందురు. వాస్తవంలో ఇది నిజం కాదు. సాంఖ్యులు మరోవిధంగా చెబుతారు. బుద్ధి త్రిగుణాత్మకమైన ప్రకృతియొక్క కార్యమయిన మహత్తత్వమనీ, అహంకారము మహత్తత్వమునకు కార్యమనీ, మనస్సు పదకొండు ఇంద్రియాలలో చేరినదనీ, అంటారు. చార్వాకులు: చైతన్యము శరీరముయొక్క గుణమనీ, బుద్ధి శరీరాంతర్గతమనీ అహంకారమే ఆత్మఅనీ మనస్సు పూర్వాపర విచారముచేయునదనీ, అందురు. జైమినీయులు కొందరు: మనస్సు విభుద్రవ్యమనీ, మరికొందరు అన్నమయమనీ, చిజ్జడాత్మకమయిన అహంకారరూపుడయిన ఆత్మయొక్క చిదంశము బుద్ధి అనీ అంటారు. జైనులు: మధ్యమపరిమాణమూ చిద్రూపమూ, అగు జీవాస్తికాయమే అహంకారమనీ, దానికిగల విషయాభిలాష మనస్సు అనీ అర్థప్రద (ప్రకాశమే) బుద్ధి అనీ అంటారు. బౌద్ధులు: క్షణికమయిన

ఆలయవిజ్ఞానమే బుద్ధి అనీ, అదే ఆత్మ అనీ, అదే అహంకారమనీ, ప్రవృత్తి విజ్ఞానరూపమయిన బుద్ధి అయితే బాహ్యాకారమనీ, దానిపరిణామమగు అతీతానంతరప్రత్యయములు మనస్సు అనీ అంటారు. వైశేషికులు అహంకారమనస్సులను నైయాయికులవలెనే నిర్వచించారు. బుద్ధిమాత్రము స్మృతిప్రత్యక్షము, అనుమానము, తర్కము, విపర్యయము, వికల్పము, అను భేదములచే అయిదు విధములని అందురు. పాంచరాత్రులు వాసుదేవుడనే పరమాత్మనుంచి సంకర్షణుడనే జీవుడు పుట్టాడనీ, వీడే అహంకారమని వానినుండి ప్రద్యుమ్నుడనే మనస్సు పుట్టిందనీ, దానినుండి అనిరుద్ధమనే పేరుగల బుద్ధిపుట్టినదనీ అంటారు. ఇట్లే యోగులూ, మాహేశ్వరులూ నకులేశ్వరులూ మున్నగువారు వారివారికి తోచినట్లు కల్పించుకున్నారు. కాని వీళ్ళందరికి పొందదగినది పారమార్థికమయిన పరమాత్మతత్వము ఒక్కటే. భిన్నభిన్న దేశకాలములందు బయలుదేరిన బాటసారులు ఒకేపట్టణమును వేరు వేరుగ జూచునట్లు, ఒకేపరమాత్మనుగూర్చి వీరు వివిధరీతుల పేర్కొన్నారు. తత్వమును గ్రహించలేని అజ్ఞానమువల్ల వీరికీ తగాదాలు ఏర్పడినవి. ఆయా వాదులు వారివారి మార్గమును మెచ్చుకుంటారు. వీరికల్పనలన్నీ స్వకపోలకల్పితములుకాని, ప్రమాణమూర్ధన్యమయిన ఉపనిషత్సమ్మతములు గావు. పనులయొక్క భేదమునుబట్టి కర్తకు నామము మారుచుండును, పాచకుడూ, గణకుడూ, పాఠకుడూ, అని. అలాగే క్రియాభేదమునుబట్టి మనస్సుకు పేర్లు మారుచున్నవి. శుభాశుభవస్తువులనుగూర్చివిన్నా, తాకినా, చూచినా, తిన్నా, ఆఘ్రాణించినా, లోపల హర్షవిషాదాలను మనస్సుగలవాడే పొందుతున్నాడు. లేనివాడు చూచుచున్నా చూడనివాడే. వినుచున్నా విననివాడే. ఇది లోకానుభవము. కనుక సర్వప్రపంచమూ మనోమయము (చిత్తమయము). రూపం కనిపించటానికి వెలుతురు కారణం. వస్తువులు కనిపించటానికి మనస్సు కారణం. వాసనాసహితమయిన చిత్తముగలవాడు బద్ధుడవును. వాసనారహితమయిన చిత్తముగలవాడు ముక్తినొందును. మనస్సు జడమని చెప్పెడివాడు మూఢులలో మొదటివాడు. మనస్సు జడమైతే ఏవస్తువునూ గ్రహింపజాలదు. కేవలము చేతన

మైతే జడత్వమును చెందదు. వారివారి వాసననుబట్టి ఉండును అది. కాబట్టి ఇది జడమూకాదు, చేతనమూకాదు. ఇది ఎప్పుడు వ్యక్త మయినదో (పుట్టినదో) అప్పుడే విచిత్ర సుఖదుఃఖములు గల ప్రపంచము పుట్టినది. మనస్సు అద్వితీయ బ్రహ్మాకారమయితే సంసారమే లేదు. మలినమగు చైతన్యముగల మనస్సే సంసారమునకు కారణము. కాబట్టి 'రామచంద్రా! కేవలము చేతనమయిన మనస్సు సంసారహేతువుకాదు. కేవలము రాతివలె జడమయినదియు సంసారహేతువు కాదు. కాబట్టి రామా! మనస్సు జడమూకాదు, చేతనమూకాదు. చిజ్జడవిలక్షణము. ఇట్టిమనస్సే లేకపోతే ప్రపంచమే లేదు. చిత్తం లయిస్తే ప్రపంచం అంతా లయించినట్లే. కనుక చిత్తమాత్రమే జగత్తు. ఋతుభేదంచేత కాలం మారినట్లు, క్రియాభేదంచేత మనస్సు నామములను పొందుచున్నది. మనస్సంబంధంలేకుండా, అహంకార ఇంద్రియాదులు శరీరముకు బాధించేయెడల అప్పుడు జీవ, అహంకారాదులూ, ఈమనస్సూ వేరు అయ్యేడివి. అదే లేదు, అయితే ఆయా వాదులు వారివారి దర్శనములందు, మనోబుద్ధి చిత్తాహంకారాదులు వేరని చెప్పియుండిరిగదా! అని నీ వడుగవచ్చును. కాని వారికి తత్త్వము తెలియదు.

తత్త్వజ్ఞులగు వ్యాసాదులచే శిక్షింపబడలేదు. కనుక వారివి కుతర్కములు. మనస్సుయొక్క శక్తి సర్వవ్యాపకము. కుతర్కమనే శక్తికూడా మనస్సు అనే దేవునియందుండునదే. శుద్ధ చైతన్యమువలన ఎప్పుడు కలుషమైన శక్తి పుట్టిందో అప్పుడే ఈ ప్రపంచ వైచిత్ర్యము యేర్పడింది. వారివారి కుతర్కములందు వారివారికి శ్రద్ధాబాహుళ్యములుండుటవల్ల వారివారికి మతివైచిత్ర్యము ఏర్పడింది. రామా! మహామతము ప్రమాణమూర్ధన్యమయిన ఉపనిషన్మతము కాన ఇందు దోషము లేదు. "యథోర్ణనాభి సృజతే గృహ్ణతేచ" ఇత్యాది శ్రుతి మహాప్రమాణము. ఆ వాదులకు శ్రుతులయందు ఆదరణ లేదు, కనుక వారి స్వభావానుసారంగానే వారి మనస్సు స్థిరపడుకొన్నారు. అందుకు ప్రపంచమునూ, చైతన్యముయొక్క పర్యాయవృత్తులునూ చిత్తుకంటె భిన్నంగా తలచిరి. కనుక రామా!

నిర్మలమయిన చైతన్యమే జీవ మనోబుద్ధ్యహంకార రూపమును చెందినది. అదియే లోకంలో వివిధ నామములచే పిలువబడుతోంది. ఇందు నీకు సంశయ మక్కరలేదు. వివాదమూ పనిలేదు, అన్నారు వసిష్ఠులు.

## ౯౩. చిదాకాశ మహాత్మ్యము.

మునీంద్రా! మనస్సునుండియే బ్రహ్మాండమంతా పుట్టుచున్నదని మీ మాటలవల్ల నాకు బోధపడినది. అది అట్లే యందురా? లేదా? అని అడిగాడు శ్రీరాముడు. వసిష్ఠుడు శ్రీరాముని అభిప్రాయాన్ని గ్రహించి, వెనుక చెప్పినదానిని బలపరుస్తూ అదే విషయాన్ని సంక్షేపవిస్తరములచే మళ్ళీ చెప్పారు. మనస్సే వివిధ జీవసమూహరూపంగానూ, నానా చరాచరరూపంగానూ, విజృంభించిందన్నాడు. స్థూలములయిన దేహాదులను గూర్చి విచారించి లాభం లేదన్నాడు. మనస్సునుగూర్చియే విచారించాలి అన్నాడు. మనోలయం వలననే మోక్షం సిద్ధించునన్నాడు. మనోనాశం అయిననే జీవుడు ముక్తుడవు నన్నాడు. అతనికి మరల జన్మ లేదన్నాడు. ఇంతవరకు వసిష్ఠుని చెప్పనిచ్చి అడ్డు తగిలాడు శ్రీరాముడు. 'మహర్షీ! సాత్విక రాజస తామస భేదములచే మూడు విధములగు జీవరాసులకు సదసదాత్మకమయిన మనస్సు కారణమన్నారు. అంతవరకు నే నంగీకరింతును. కాని ఆ మనస్సు శుద్ధ చైతన్యమునుండి పుట్టిన దన్నారు మీరు. ఆ విషయముమాత్రము నాకు నచ్చలేదు. సృష్టి బుద్ధిపూర్వకము. అనగా బుద్ధి వుంటేగాని సృష్టి జరగదు. బుద్ధి అధ్యవసాయాత్మకము (నిశ్చయాత్మకము). ఇది మనస్సు పుట్టకపూర్వమే పుట్టుట అసంభవము. అమతమగు (అసంకల్పితమగు) అర్థమునందు అధ్యవసాయము (నిశ్చయము) ఉండదు. కనుక బుద్ధి రహితమయిన శుద్ధ చైతన్యమునుండి విచిత్ర జగన్నిర్మాణమును చేయు మనస్సు ఎలా పుట్టింది? అది ఎలా ప్రపంచాకారంగా విజృంభించింది?' అని అడిగాడు శ్రీరాముడు.

వసిష్ఠుడు : రామచంద్రా! చిత్తాకాశము, చిదాకాశము, భూతాకాశము అని ఆకాశము మూడు విధములు. ఈమూడు సర్వ

సామాన్యములు. అన్నిపనులందూ అనుగతములయి వుంటాయి ఇందులో చిదాకాశ భూతాకాశములు రెండూ, శుద్ధ చైతన్యము యొక్క సత్తామీదనే ఆధారపడి యుండును. వాటికి వేరే ఉనికి లేదు. చిదాకాశము లోపలా, వెలుపలా నిండియుండును. సమస్తభూతముల రాకపోకలకు సాక్షి. అభ్యంతరములయిన బుద్ధ్యాది వృత్తులకు సాక్షి. మాయాశబలము. అన్నిపనులకు కారణమగుటవలన సర్వభూతములకు ఇష్టమయినదీ, కార్యకారణముల నన్నిటినీ నియమించునట్టి దగుటచే శ్రేష్ఠమయినదీ, తన కల్పనచే ప్రపంచమంతా విస్తరించినదీ చిత్తాకాశము. దశదిక్కులూ నిండియుండి వాయువునకూ, మేఘాలకూ, ఆశ్రయమై, భూతములలో చేరినది భూతాకాశము. భూతాకాశ చిత్తాకాశములు రెండూ చిదాకాశముయొక్క బలంవల్ల పుట్టినవి. కార్యజాతమునకు ఘటికాలము ఎలా నిమిత్తమో, అలాగే చిదాకాశములోని చిదంశము ప్రపంచసృష్టికి నిమిత్తము. మాయాశబలమయిన బ్రహ్మమే మనోరూపమును జెందును. ఆ మనస్సు వలననే ఆకాశాది భూతభౌతిక సృష్టి జరుగుచున్నది. కావున రామచంద్రా! మేము సత్కార్యవాదులము. కార్యజాతము మాయాశబలమయిన బ్రహ్మయందు సూక్ష్మరూపంతో ఉండియే పుట్టుచుండునని మేమందుము. కనుక బుద్ధితత్త్వ విరహితమైన శుద్ధ చైతన్యమునుండి మనస్తత్త్వమెట్లు పుట్టినదను నీప్రశ్న పొసగదు. మనస్సు మొదలగు ప్రపంచ సృష్టిఅంతా అజ్ఞులకు సత్త్వబోధకొరకుగాని, విజ్ఞులకుగాదు. పరమార్థ దృష్టిలో చిద్రూపపరమాత్మనుండి పుట్టినదీ లేదు, చచ్చినదీలేదు. పరమాత్మ ఒక్కడే ప్రపంచం అంతా నిండియున్నాడు. భేదవాక్యములచే అజ్ఞానులు ఉపదేశింపబడుచున్నారు జ్ఞానికి ఆ మాటలు పనికిరావు. కాబట్టి నీవుకూడ తత్త్వమును తెలిసికొనునంతవరకే ఆకాశత్రయ కల్పన. అంతవరకే నేను నీ కుపదేశించుట. అడవిని కాల్చెడి అగ్నిమంటలవల్ల మరు మరీచికలు (ఎండమావులు) బయలు దేరినట్లు మాయాశబలిత (కలుషిత) మయిన చైతన్యమునుండి చిత్తమూ, ముల్లోకసృష్టీ తయారవుతోంది. కనుక రామా! బంధ రూపమయిన ఈ సంసారము అంతా అజ్ఞానదశలోనిదే. పరమార్థ దశలో ఆత్మ నిత్యముక్తుడే కాని బద్ధుడు కాడు.

# ౯౮. చిత్తాఖ్యానము.

వశి:- రామచంద్రా! నీవు చిత్తము ఎవరినుండి పుట్టినదా? దానిస్వరూపము ఏమిటా? అనే గొడవలోకి దిగబోకు. దాన్ని మోక్షంకొరకు మాత్రం వినియోగించుకో. పరమాత్మయందు లగ్నమయిన చిత్తము వాసనారహితమై, కల్పనాశూన్యమై ఆత్మస్వరూపమును జెందును. చరాచరప్రపంచమంతా చిత్తాధీనము. బంధమోక్షములు కూడా చిత్తాధీనములు. ఈవిషయంలో నీకొక చిత్తాఖ్యానం అనే కథ చెబుతా విను. అతివిశాలమయిన అడవి ఒకటి ఉన్నది. అందులో మృగములు మొదలగు క్రూరజంతువులు లేవు. అయినా భయంకరము. నూరామడ ఉంటుంది. కాని ఒక్క అణుమాత్రంగా కనిపిస్తుంది. అడవిలో ఒకపురుషు డున్నాడు. వాడికి వెయ్యిచేతులు, వెయ్యికళ్ళు, విశాలమయిన ఆకారము, చిత్తవ్యాకులుడు. అతిభయంకరంగా ఉంటాడు వాడు తన వెయ్యిచేతులతోనూ పెద్దలాటీకర్రలు పుచ్చుకొని వీపుమీద బాదుకుంటూ ఆ అడవిలో పరుగెత్తుచు ఉంటాడు. తన్నుతానుకొట్టుకుంటూ అనేక ఆమడలదూరం పరుగెత్తుచుండేవాడు. అరచుచూ పరుగెత్తుకొని చాలాదూరంపోయి, అలసటచెంది, కాళ్లుచేతులు విరిగినట్లుఅయి, తెలివితప్పి కటికచీకటిగల బావిలోపడ్డాడు. కొంతకాలానికి అక్కడనుంచి లేచాడు. మళ్ళీకొట్టుకుంటూ, పరుగెత్తాడు. చాలాదూరం పోయిపోయి, కానుగచెట్లగుబురుగల అడవిలో పడ్డాడు. అక్కడనుంచి మళ్ళీ బాదుకుంటూపోయి చల్లని అరటితోటలో ప్రవేశించాడు. అక్కడనుంచి లేచి మళ్ళీ కొట్టుకుంటూ పరుగెత్తుకొనిపోయి వెనుకటి పాడుచీకటిబావిలోనే పడ్డాడు. అక్కడనుంచి కొంతసేపటికి లేచి, అరటితోటలో చేరాడు. అక్కడనుండి లేచి మళ్ళీ చెట్ల గుబురులో ప్రవేశించాడు. గానుగ అడవినుండి పాడుబావికీ, బావినుండి అరటితోటకూ, తోటనుండి పాడుబావికీ ఇలా తనను తాను కొట్టుకొంటూనే పోవడం ప్రారంభించాడు. ఇలా ఉండగా నేనుచూచి, ఒక ముహూర్తకాలం త్రోవలో అడ్డగించి, 'నీవెవరవు? ఎందుకు యిలా తిరుగుచున్నావు? నీకోరిక ఏమి? ఏందుకీ ఖేద్ నీకు?' అని అడిగా నేను. అంతట్ల అతడు ఇలా అన్నాడు నాతో,

నేను ఎవడనుకాను. నేనేమి చేయుటలేదు. నీవు నన్ను చెడగొట్టావు. నాకు పరమ శత్రువు నీవు. నీవు నన్ను చూడగానే నేను సుఖదుఃఖాలకు రెంటికీ కొలకాకుండా పోయినాను" అని అన్నాడు. ఇలా అని శిథిలమయిన తన అవయవాలను జూచి ఘోరువ దుఃఖించాడు. మళ్ళీ క్షణమాత్రంలో ఏడ్పు మానాడు. తన అవయవాలను చూచుకొన్నాడు. నవ్వి పరిపూర్ణానందం పొందాడు. అప్పైన నాయెదుట తన అవయవాలను అన్నిటినీ విడిచిపెట్టాడు. మొట్టమొదట శిరస్సు క్రింద పడింది. తరువాత చేతులుపడ్డాయి. పిదప వక్షస్థలమూ, ఉదరభాగమూ క్రిందపడినవి. క్షణకాలంలో అన్ని అవయవాలనూ విడిచిపెట్టి పిదప ఎక్కడకో పోదలచాడు. తరువాత నేను మరొకచోట ఏకాంత ప్రదేశంలో ఇలాంటివానినే మరొకనిని చూచాను. వీని పరిస్థితికూడ వెనుకటివానివలెనే ఉంది. తన్నుతాను కొట్టుకొనుట, పరుగెత్తుట, పాడునూతిలో పడుట, కానుగచెట్ల అడవికి చేరుట, అరటితోటలో ప్రవేశించుట, ఇవి అన్నీ మొదటివానివలెనే ఉన్నవి. కొంతసేపు దుఃఖించడమూ, కొంతసేపు సంతసించడమూ, తనను తాను బాధించుకొనడమూ చూచి నేను ఆశ్చర్యపోయి దారిలో ఆపి వెనుకటివలె ప్రశ్నించాను. కాని అతడు నవ్వుచూ, ఏడ్చుచూ, కొంతసేపు ఆలోచించి, తుదకు అవయవములన్నీ శిథిలమైపోగా, అదృశ్యమయి యెక్కడకో పోవనారంభించాడు. పరుగెత్తుకొనిపోతూ ఒక పెద్ద అంధకూపంలో (చీకటిబావిలో) పడ్డాడు. నేను చాలసేపు వాని కొరకు నిరీక్షించాను. ఆ మూర్ఖుడు ఎంతకాలానికీ బయటికి రాలేదు. ఇంక నేను లేచి పోదలచాను. ఇంతలో అతడు రావడమును చూచాను. ఇంతలో మళ్ళీ ఆ అంధఃకూపంలో పడబోవుచుండగా వానిని ఆపి మళ్ళీ వానికి ప్రశ్నరూపంగా కొంత బోధచేశాను, కాని వాడు నా ప్రశ్నల కర్థమును గుర్తించలేదు. పైగా నన్ను 'మూర్ఖుడా!' అని అన్నాడు. నాకేమి తెలియదన్నాడు, 'పాపాత్ముడా! దుష్టబ్రాహ్మణుడా!' అని అరుస్తూ తన పనిమీద తాను వెళ్ళాడు. నేనుమాత్రం ఆ మహారణ్యంలో తిరుగుతూ ఇలాటివాళ్ళను అనేకమందిని చూచాను, వారలలో కొందరుమాత్రమే నా ప్రశ్నప్రతివచనముల యర్థమును గ్రహించి, మిథ్యాభూతమయిన దేహమును విడిచి

భగా శాంతిని పొందారు. నా మాటలను అంగీకరించక మరికొందరు అంధకూపంలో పడుతూ, లేస్తూ ఉన్నారు. కొందరు అరటితోట లోనే చాలాసేపు ఉన్నారు. మరికొందరు కరంజలతాగుల్మములందే లయించిపోవుచుండిరి. మరికొందరు కామ్యకర్మాసక్తులై దేనితోనూ శాంతిని పొందకున్నారు ఆ మహారణ్యం ఇలా ఉన్నది రామా! ఆ మహారణ్యం యిప్పటికీ అలాగే వున్నది. ఆ పురుషులూ అలాగే వున్నారు. ఆ వ్యవహారమంతా నీవు చూచియే యున్నావు. కాని బుద్ధిసూక్ష్మత లేనందున నీవు అద్దానిని స్మరించ లేకపోతున్నావు, అన్నారు వసిష్ఠులు.

## ౯౯. చిత్తోపాఖ్యానమునందలి తాత్పర్యార్థము.

శ్రీరాముడు ఈ కథ అంతా విని, "మహర్షీ! శూన్యమయిన ఆ అడవి ఏమిటి? నేను ఎప్పుడు దాన్ని చూచాను? ఆ పురుషులు ఎవరు? వాళ్లు చేయదలచిన పనియేమి? అని అడిగాడు వశిష్ఠుణ్ని. వసిష్ఠుడు యథాక్రమంగానూ కొన్నిచోట్ల క్రమంమార్చియూ జవాబుచెబు తాడు. రామచంద్రా! అది అడవికాదు. అదిఎక్కడో దూరంగాలేదు, వాళ్ళు మానవులూకారు. అదిసంసారము. ఇదే అడవి అని చెప్పాను. ఇందులో నిజంలో ఏమీలేదు కనుక శూన్యమన్నాను. భ్రాంతిదశలో వస్తుజాలం చాలా ఉన్నదికనుక పెద్దఅడవిఅన్నాను. అద్వితీయమయిన ఆత్మతత్వంతో నిండిఉన్నందున కేవలమన్నాను. ఆ అడవిలోపురుషు లు అంటే దుఃఖంలో మునిగియున్న మనస్సులు. వానినిచూచిన "నేను, అనగా వివేకము అనగా ఆత్మవిచారము. నేను ఆ మనస్సులకు వివేక మును బోధించాను. నావల్ల ప్రబోధమును పొంది కొంతమంది మన స్సులు పరమశాంతిని పొందినవి. కొన్నిమనస్సులు అవివేకమువల్ల నన్ను గుర్తింపలేక తిరస్కరించి అంధకూపమున బడినవి. అంధకూప ములు అనగా నరకములు. అరటితోటలుఅంటే స్వర్గములు. అరటిలో ప్రవేశించిన పురుషులు అంటే స్వర్గాభిలాషగల పురుషులని యర్థము. అంధకూపంలోబడి బయటకురానివా రంటె మహాపాతకంలోకూడిన చిత్తమని యర్థము, అరటితోటలో ప్రవేశించి రానివారంటే పుణ్యాత్మ

శయముతో కూడినచిత్తము లని యర్థము. కానుగ (కరంజ) అడవిలో చేరి బయటకిరాని పురుషులనగా మనుష్యజాతిలో పుట్టినచిత్తము అని అర్థము. అందులో కొన్నిచిత్తము లు సంప్రబద్ధములు అంటే వివేకము కలిగి(జ్ఞానముకలిగి) సంసారబంధవిముక్తులయిన వారని యర్థము. కొన్నిచిత్తములు అనేక ఉపాధులను పొంది ఒకయోనినుండి మరొక యోనిని చేరుతూ, స్వర్గనరకములకు తిరుగుచున్నవి. కరంజగహన మనగా (కానుగగుబురు అనగా) భార్యాపుత్రాదులయందలి అనురాగము. కరంజ గుబురును ప్రవేశించి రనగా, కొన్నిమనస్సులు విషయరసాస్వాదపరములని అర్థము. చంద్రకిరణములవలె చల్లనయిన కదలీకానన మనగా మనోహ్లాదకరమగు స్వర్గము. కొందరు శాస్త్రవిహితమయిన ఉపాసనామార్గమున గ్రహ, సప్తర్షి, ధ్రువాది పదములను పొందుచున్నారు. అట్టివారు తేజస్సంపన్నులై తత్త్వజ్ఞానముచే అత్యంతిక శ్రేయస్సును పొందుచున్నారు. నేను కొందరిచే తిరస్కరింపబడితి ననగా, ఆత్మజ్ఞానములేని మనస్సులచే వివేకము తిరస్కరింపబడినదని యర్థము. "నిన్ను చూచుటతోడనే నశించితిని" నీవు నాకు శత్రువు" "మహాకష్టము" అనగా తత్త్వజ్ఞానమువల్ల నశించుచున్నమనస్సు యొక్క పరిదేవనము(ఏడుపు). ఆర్తనాదముతో బిగ్గరగా ఏడ్చినవాడు అనగా భోగజాలమును విడిచిపెట్టి మనస్సు దుఃఖించుట అనియర్థము. వివేకజ్ఞానమును సగముపొంది బ్రహ్మపదమును పొందిన మనస్సు భోగములను విడచునప్పుడు మిక్కిలి దుఃఖించును."ఏడ్చుచూ తన అవయవములను తాను చూచుకొన్నాడు" అనగా అల్ప వివేకముగలచిత్తము స్త్రీ,పుత్రాదులనుకరుణదృష్టితో చూచి,"అయ్యో!వీరలవిడిచిపోవుచుంటిగదా అని దుఃఖించుచున్నాడని అర్థము. నన్నుగుర్తించి యొకానొక పురుషుడు నవ్వెను"అనగా వివేకమును పొంది ఆనందించెనని యర్థము. పూర్ణజ్ఞానమును బొంది, సంసారమును విడచునట్టి చిత్తమునకు ఆనందము వృద్ధినొందును. "ఆపురుషుడు నవ్వుచూ తన అవయవములను చూచుకొనుచున్నాడు. అనగా తనను వంచించునట్టి స్నేహాలోభాదులనుగూర్చి తాను (చిత్తము) పరిహాసించుట మిథ్యాకల్పితములయిన విషయములచే నేను చాలకాలము మోసపోతినికదా! అని చిత్తము పరిహాసించెననియర్థము, "అంధకూపంలోపడుచుండ్రేవాన్ని నేనుఆప్రశ్న

చితిని'' అనగా వివేకబలముచే చిత్తముని గ్రహింపబడెనని భావము. అవయవములన్నీ ముక్కలు ముక్కలై చూస్తూఉండగా రాలిపోయి నవి'' అనగా, చిత్తము నశిస్తే అర్థాశ (విషయాభిలాషలు) శాంతించు నని అర్థము. ఆపురుషుడు వెయ్యిచేతులు, వెయ్యినేత్రములు కలవాడు అనగా మనస్సునకు అనేక కారణములు కలవని అర్థము. “తనను తాను కొట్టుకొనెను'' అనగా దుష్టసంకల్పములచేత మనస్సు తన్ను తాను బాధించుకొనునని భావము. “తన్ను తాను కొట్టుకొంటూ పరుగెత్తెను'' అనగా తనలో ఉన్నవాసనలచే తాను కొట్టబడుచూ పరుగెత్తెనని భావము. ఆహా! అజ్ఞానముయొక్క విలాసము, చిత్తము తనకోరికచే తనను బాధించుకొనుచు పరుగెత్తుచున్నదికదా? మనస్సులు బ్రహ్మపదమును గుర్తించుటకు ఉద్యుక్తములైనా ఈ విధముగా వాసనాజాలుచేత క్షోభపెట్టబడుచూ పరుగెత్తుచునే ఉండునుకదా? ప్రతివారికి మనస్సే దుఃఖాన్ని పెంచుతోంది. ఆదుఃఖము అనుభవించలేక మళ్ళీ అదే ఖేదమును జెంది పరుగెత్తు తోంది. పిల్లవాడు ముందువచ్చే దుఃఖమెరుగక వాడిచాపల్యంతో ఆడుచూ అనర్థమును బొందినట్లు మనస్సు తన అనర్థాన్ని తాను గుర్తించకనే సంచరిస్తుంది. ఈమనస్సు యొక్కచరిత్ర చూడగా “కీలోత్పాటిత వానరము'' యొక్కచరిత్రవలె ఉన్నది. (వానరము అడవిలో సగము పగలకొట్టి అందులో మేకుకొట్టిన కొయ్యమీద కూర్చొని తన అండములను ఆపగులులో జారవిడచి, తరువాత మేకు ఊడదీయగా, అండములు నలిగి చచ్చెనట.) అట్లున్నది యీ మనస్సుచరిత్ర. కనుక రామచంద్రా! చిరకాలము సమాధ్యభ్యాస చేయగా ఆత్మభావన దృఢపడి మనస్సు సుఖించును. మనస్సుయొక్క ప్రమాదంవల్ల జీవులకు దుఃఖము కొండలపట్టు పెరుగుచున్నది. మళ్ళీ దానివల్లనే అవి అన్నీ మంచుకరగినట్లు నశించుచున్నవి.

## ౧౦౦. చిత్తోత్పత్తి కథనము.

రామచంద్రా! ఈ చిత్తము పరబ్రహ్మమునుంచి బయలు దేరింది. ఇది అజ్ఞానవికారము. (కార్యము సద్బ్రహ్మయొక్క విశ

త్తము- తరంగము. నీటియొక్క వికారము. జలసత్త యొక్క (నీటి యునికియొక్క) వివర్తము - అంతా నీరే అని గుర్తించేవాడికి సముద్రముకంటె తరంగము వేరుకాదు, అలాగే అంతా బ్రహ్మమే అను జ్ఞానముగలవానికి మనస్సు బ్రహ్మకంటె వేరుకాదు. ఈ జ్ఞానములేని వాళ్ళకుమాత్రము మనస్సు బంధహేతు వగును. జలసామాన్యబుద్ధి లేనివానికి నీరు వేరు, తరంగము వేరు. అజ్ఞానులను కడతేర్చుటకూ, వారికి జ్ఞానోపదేశము చేయుటకూ వాచ్యమూ, వాచకమూ, అను భేదము కల్పింపబడినది. పరమాత్మ సర్వశక్తియుతుడు. అవ్యయుడు. అంతటా నిండియున్నాడు. అతడియందులేని వస్తువే లేదు. భగవంతుడు సర్వశక్తియుక్తుడు కనుకనే అతనియందలి శక్తులను ఆయా కార్యములందు విస్తరింపజేశాడు. శరీరములందు చిచ్ఛక్తి, గాలియందు చలనశక్తి, రాతియందు జడశక్తి, నీటియందు ద్రవత్వశక్తి (జారుట), అగ్నియందు, ప్రకాశశక్తి, ఆకాశమునందు శూన్యశక్తి, సంసారమునందు భావశక్తి (వ్యవహారయోగ్యత) వినాశవస్తువులందు నాశశక్తి,దుఃఖించువారలందు శోకశక్తి, సంతోషించేవాళ్ళయందు ఆనందశక్తి. భటునియందు పరాక్రమశక్తి, సృష్టులయందు సృష్టించేశక్తి, ప్రళయమందు సంహారశక్తి, ఈశక్తులన్నీ బ్రహ్మశక్తులు. పదిదిక్కులా ఆయావస్తువులందు వ్యాపించి ఉన్నవి. ఫల పుష్ప లతాపత్ర శాఖ విటపమూలములుగల వృక్షము విత్తనమునందున్న ఈ శక్తులన్నీ బ్రహ్మయందే కలవు. దృశ్య ప్రపంచమంతా శుద్ధచైతన్యముయొక్క వివర్తము. జీవు డనుపేరుగల చిదాభాసుడుకూడా శుద్ధచైతన్యమునందే కలడు. కనుక రామా! ఈ ప్రపంచమూ "నేనని" అనుకొను జీవత్వమూ పరబ్రహ్మస్వరూపమేనని గ్రహించుము. ఆకాశమునందు నెమలిపింఛమనే భ్రాంతి కలిగినట్లునూ, నీటియందు సుడిగుండమనే బుద్ధికలిగినట్లునూ, బ్రహ్మయందే మనస్సూ, జీవుడూ, అనే బుద్ధులు కలుగుచున్నవి. కాన - మనన రూపముగ మనస్సు బ్రహ్మనుంచియే పుట్టుచున్నది. మదనశక్తి బ్రహ్మశక్తి కనుక మనస్సుఅంటే బ్రహ్మమే అని గ్రహించు" "ఇది, అది నేను, నీవు." అనే విభాగమంతా మనోభ్రాంతి- కాబట్టి ద్వైత ప్రపంచానికి కారణం బ్రహ్మశక్తి అయిన మనస్సేకాని మరొకటి

కాదు. కామ కర్మవాసనలు ద్వైతబుద్ధికి హేతువులని అంటారు కొందరు. కాని అవికూడ మనస్సునందే ఆవిర్భావ తిరోభావము లను చెందుచుండుటచే, సదసదాత్మకమగు బ్రహ్మశక్తులే. కనుక బ్రహ్మస్వరూపములే యగును అయితే మనోధర్మములయిన కామ, కర్మ వాసనలు, మనస్సునందుండునుగాని, బ్రహ్మయం దెట్లుండును? బ్రహ్మశక్తులు ఎట్లగును ? అని ప్రశ్న కలుగుతుంది. విను సమా ధానము. బ్రహ్మసత్త సంసర్గాధ్యాసచే మనస్సుయం దున్నది. కనుక మనస్సుయందు కలిగెడి కామకర్మవాసనలుకూడ బ్రహ్మయం దున్న వగును. వసంతాది ఋతువులయొక్క శక్తులు వృక్షాదులయందు ఉన్నట్లు, మనోధర్మములుకూడ బ్రహ్మయం దుండును. అన్ని ఋతు వులయందును పుష్పించెడి పుష్పములను పుష్పింపజేయుశక్తి భూమి యందున్ననూ, భూమి ఆయాప్రదేశములయందు ఆయాకాలము లందునూ, బీజభేదమువల్లగాని, సంస్కారవిధాన భేదమువల్లకాని, ఒకానొక వ్యవస్థను అనుసరించే పుష్పింపచేస్తోంది. అలాగే బ్రహ్మ సర్వశక్తియుక్తుడయిననూ ఆయాచిత్తములందు వాటివాటి సంస్కా రములనుబట్టి ఆయాశక్తులనే పోషింపచేస్తున్నాడు. ఆయాభూమిలో ఉండే భేదమునుబట్టి, ఆయా పైరులు ఫలించుచున్నవి. ఆయాచిత్త ముల సంస్కారవిశేషమునుబట్టి ఆయాశక్తులు విస్తరిస్తున్నాయి. కాన సర్వం మనోమయము, బ్రహ్మమయము. ప్రపంచమును వేరుగాచూచెడి జీవుడే బ్రహ్మకంటె వేరుకాదు. అట్టిస్థితిలో అతనిచే చూడబడే ప్రపం చము సుతరాం బ్రహ్మకంటె వేరుకాదు. కనుక రామా ! సర్వమును బ్రహ్మస్వరూపమని నిర్ణయించుకొనుము. భేదప్రపంచమంతయూ మిథ్య, కేవలం మనోభ్రాంతి. బంధమోక్షములుకూడ కల్పితములు కాని వాస్తవములు కావు. మనస్సువల్లజరిగే కల్పనకూడ కల్పితమే (మిథ్యయే). కాన జ్ఞానులదృష్టిలో మోక్షకల్పనకూడ మిథ్యయగు చున్నది. జ్ఞానులదృష్టిలో ప్రపంచము తుచ్ఛము (శూన్యము); అజ్ఞా నులదృష్టిలో అనిర్వచనీయము. బంధస్థితియావత్తూ బాలకాఖ్యాయిక వంటిది. అన్నారు వసిష్ఠులు.

## ౧౦౧. బాలకాఖ్యాయిక

శ్రీరా:—స్వామీ! బాలకాఖ్యాయికయొక్క క్రమ మేమి? మీరు ఎందుకు మనస్సు ఇంతటి శ్రమతో వర్ణించుచున్నారు? క్రమంగా చెప్పండి - అని అడిగాడు. శ్రీరాముడు. వశి:- రామచంద్రా! మూఢుడగు ఒక బాలుడు తమను పెంచే ధాత్రితో (పెంపుడుకత్తెతో) వినోదమయిన కథ యొక్కటి చెప్పమని అడిగాడు. ఆధాత్రి, ఆపిల్ల వానికి వినోదకరమయిన కథను చెప్పినది. విను దానిని చెబుతాను. ధాత్రి:- బాలకా! ఒకానొక శూన్యనగరంలో ధార్మికులయిన రాజపుత్రులు ముగ్గురు ఉన్నారు. వారిలో ఇద్దరు పుట్టనే లేదు. మరొకడు తల్లిగర్భంలోనే ప్రవేశించలేదు. దైవవశమున వారలబంధువులు మరణించినందున దుఃఖాక్రాంతులై అందరూ కలసి నిర్ణయించుకొని యింతకంటె సుఖంగా ఉండటానికి మరొక నగరానికి బయలు దేరారు. ఆ పాద్యోత్రివలో మూడుచెట్లను చూచారు. ఆమూటిలో రెండుచెట్లు పుట్టలేదు. మూడవచెట్టునకు విత్తనమే నాటలేదు. వాటిలో ఒకచెట్టుక్రింద ఈముగ్గురూ విశ్రమించారు. వాటిపండ్లను తిని, రసంత్రాగి, పూలమాలలు ధరించి, చాలసేపు విశ్రమించి మళ్ళీ బయలుదేరారు. చాలాదూరంపోయి మిట్టమధ్యాహ్నంలో మూడునదులు చూచారు. వాటిలో ఒకనదిలో నీరు ఎప్పుడూ శుష్కించి ఉంటుంది. మిగిలినరెంటిలో నీరు ఏమాత్రంలేదు. ఎండిన నీరుగల ఆనదిలో ఎండకు బాధపడి ఈ ముగ్గురు స్నానంచేశారు, జలక్రీడలాడారు. నీరుత్రాగారు. ప్రసన్నులయ్యారు. తిరిగి భవిష్యన్నగరానికిబయలుదేరారు. అందులో(ఆభవిష్యన్నగరంలో)మంచిభవనములను మూటిని చూచారు. ఆమూటిలో రెంటిని నిర్మించనే లేదు. ఒకదానికి గోడలే లేవు. ఆగోడలులేని యింటిలో ఈముగ్గురు రాజపుత్రులూ ప్రవేశించారు. అందులో మేలిమిబంగారముతో తయారయి మూడుపాత్రలను (గిన్నెలను) చూచారు. వానిలో రెండుగిన్నెలు ముక్కలై ఉన్నాయి. ఒకటి పొడిపొడి అయిపోయిఉన్నది. ఆచూర్ణమయిన పాత్రను తీసికొని నూరుద్రోణములు (పదిశేర్లు) తక్కువగా నూరుద్రోణములు అన్నమునూ దానికి తగినశాకాదులను వండారు.

ఆముగ్గురురాజపుత్రులూ ముగ్గురు బ్రాహ్మణులను భోజనానికి పిలిచారు. వారిలో యిద్దరకు శరీరంలేదు. ఒకరికి ముఖంలేదు, ఆ ముఖం (నోరు) లేని బ్రాహ్మణుడు ఈ నూరుద్రోణముల (10సేర్లు) అన్నమును తిన్నాడు. మిగిలినఅన్నమును ఈముగ్గురూ తిన్నారు. దానితో తృప్తిపడి ఆరాజపుత్రులు వేటాడపోయారు. వారు యిప్పటికీ సుఖంగానే ఉన్నారు. బాలకా! ఇదీ కథ. చాలా గొప్పది. మరచి పోకుండా మనస్సులో పెట్టుకో. గొప్ప పండితుడవు అవుతావు, అన్నది ధాత్రి. రామచంద్రా! ఇదీ ధాత్రి(పెంపుడుకత్తె) చెప్పిన బాలకాఖ్యాయిక. దీనితో ఆపిల్లవాడు సంతోషించాడు. చిత్తాఖ్యానము చెప్పినతరువాత ప్రపంచం అంతా మనోభ్రాంతి, (మిధ్య) అని చూపుటకు,దృష్టాంతంగా నీకు నేను చెప్పాను. ఆకథను. ఈ ప్రపంచం పరిస్థితి అంతా ఈకథవలె సంకల్పనచే దృఢపడి ఉంది. ప్రపంచం అంతా సంకల్పమాత్రమే కాని అంతకంటె వేరుకాదు. పరమాత్మ నుండి మొట్టమొదట సంకల్పమాత్రంగా పుట్టి తర్వాత స్థూలరూపంగా విస్తరించింది ఈప్రపంచం. కనుక రామా! ఈప్రపంచం అంతా సంకల్పమాత్రమే! అని గ్రహించు. నిర్వికల్పసమాధిని బూని సంకల్ప రహితుడవై శాంతిని బొందు. అన్నారు వసిష్ఠులు.

## ౧౦౨. వశిష్ఠోపదేశము.

వశి:- రామచంద్రా! అజ్ఞాని తనసంకల్పమువల్లనే మోసపోతున్నాడు. నాశములేనివస్తువు నశిస్తుందని భయపడుతున్నాడు. అవిద్యోపహితమయిన పరమాత్మయే అహంకారమనే పేరును ధరించి నశ్వరాత్మ అయినాడు. (అనిత్యుడయినాడు). ఈఅహంకారమనేది పీడకొకదయ్యమువంటిది. పరమాత్మవస్తువు ప్రపంచమంతా నిండిఉంటే ఇంక ఈఅహంకారమనేదానికి తావెక్కడ? ఇది ఎలాపుట్టింది? కనుక నిజస్థితిలో అహంకారమనేది లేదు. తీవ్రమయిన ఎండలో మృగతృష్ణానదీభ్రాంతివలె పరమాత్మయందు భ్రాంతిచే కల్పితమయింది అహంకారము.కనుక ఈసంసారము మనస్సు అనే చింతామణియొక్క విలాసము- నిరాశ్రయము- దీనిని నమ్మవద్దు. అసమ్యగ్జ్ఞానాన్ని

విడిచిపెట్టు. సమ్యగ్జ్ఞానాన్ని ఆశ్రయించు. నిజానిజములను వివేక బుద్ధితో విచారించుకొను. అసత్యమయినదానిని విడిచిపెట్టు - బద్ధుడవుకాని నీవు బద్ధుడనని ఏర్పడినచో ఏమిలాభం? అనంతమయిన ఆత్మతత్త్వము కేనచే బద్ధమవును? అంతా బ్రహ్మతత్త్వమయితే బద్ధమేది? ముక్తమేది? కాళ్ళుచేతులు విరిగితే, కలిగినది ఆర్తి- దేహానిది, ఆత్మదికాదు. అయినా ఆత్మ ఆర్తి(బాధ) కలవాడుగా దుఃఖిస్తాడు. దేహం క్షీణిస్తే ఆత్మకేమి? కొలిమిలోని తిత్తి కాలితే అందులోని గాలి కేమిబాధ? అలాగే దేహంఉండనీ పోనీ ఆత్మకేమి చెరుపు? పువ్వు చెడిపోతే ఆకాశంలో ఉన్నదాని పరిమళానికి ఏమి నష్టం? అలాగే దేహము పడిపోనీ, పుట్టనీ, గగనమండలానికి వెళ్ళనీ, తద్విలక్షణమయిన నాకేమి నష్టం? రామా! గాలికీ మేఘానికీ, తుమ్మెదకు పద్మానికీ- ఏలాటిసంబంధమో, అంతే నీశరీరానికీ నీకు కూడా. సమస్తప్రపంచానికీ మనస్సే శరీరం (స్వరూపము). అది మొదటికారణము. దానికి పైవాడు చిదాత్మ. వాడు నశిస్తాడనే భ్రాంతి బొత్తిగా కూడదు. ఇలాగంటి ఆత్మను గూర్చి పరితాపము వ్యర్థము. మేఘము విడిపోతే గాలి ఆకాశం చేరుతుంది. పద్మము ఎండిపోతే తుమ్మెద ఆకాశానికి ఎగురుతుంది. దేహం నశిస్తే ఆత్మ పరమాత్మను చేరుతాడు. ఈసంసారంలో విహరించేవాడికి జ్ఞానమనే అగ్ని లేకపోతే మనస్సే నశించదు. అలాంటప్పుడు ఇంక ఆత్మ నాశము విషయంలో ముచ్చట ఏమిటి? కుండబదరములకూ(రేగుపండు ఘటఆకాశములకు, ఏమిన్యాయమో! అదేన్యాయం శరీరాత్మలకు కూడ. కుండపగిలితే రేగుపండు చేతులోకి వస్తుంది. కుండపగిలితే ఘటాకాశము మహాకాశంలో చేరుతుంది. అలాగే దేహం నశిస్తే జీవాత్మ వాసనాకాశాన్ని చేరుతాడు. కనుక దేహంనశించినా ఆత్మ నిరామయుడై ఉంటాడు. జీవులయొక్క మనోదేహము మరణమనే గుడ్డచే కప్పబడి దేశకాలములచే తిరోహితమై ఉంటుంది. ఎంతటి మూఢుడయినా ఒకానొకడు ఊరికి వెళ్లినపుడు భయపడుతున్నాడా? అంతే మరణంలోకూడా. రామా! నీవు మిథ్యాభూతమయిన వాసనను నేను అనుకొంటున్నావు. దానిని విడిచిపెట్టు. ఇది యొక పెద్ద భ్రాంతి. అజ్ఞానము. దుఃఖానికే పెరుగుతోంది ఇది. రాగద్వేష

ములచే విషయములందు అభినివేశాన్ని పుట్టిస్తుంది. మిథ్యాపదార్థములు కంటికి కనిపించుట, మనస్సుకు స్ఫురించుట, తప్ప వాటినిర్మాణవిధానము మనకు గోచరించదు. అంతే మనస్సువల్లకలిగే జగన్నిర్మాణవిధానముకూడ.ఎండకు మంచుగడ్డ కరుగుతుంది. విచారణవల్ల ప్రపంచస్వరూపం(మనస్సు)లయిస్తుంది. సూర్యుడు మంచు నశించాలని కోరుతాడు. తత్త్వవిచారపరుడు మనోనాశాన్ని కోరుతాడు. ఆత్మతత్త్వమును తెలియనివానికి అవిద్య అనేక అనర్థాలను తెచ్చిపెడుతుంది. శంబరాసురుని వంటిది. ఇది బంగారమును కురిపిస్తుంది. తెలుసుకుంటే అంతులేకుండా పోతుంది. ఈమనస్సే "ఆత్మవస" అనే నాటకం వేస్తుంది.దానిచావును అదే చేసికొంటుంది. తను చావటానికే ఆత్మనుగూర్చి విచారిస్తుంది. దాని కెంత దుర్బుద్ధో కాని తనచావును తాను తెలుసుకోలేదు. వివేకసంస్కారము గల మనస్సు తన సంకల్పవికల్పాలను విడిచిపెట్టుతుంది. ఆత్మసాక్షాత్కారవృత్త్యాకారముగా తనను పరిణమింపచేసుకొంటుంది. మనోనాశమే పరమ పురుషార్థలాభము, సర్వదుఃఖధ్వంసము. కాబట్టి రామా! నీవు మనోనాశంవిషయమై ప్రయత్నించు. మానసికమయిన బాహ్యవ్యాపారంలో తలదూర్చవద్దు. వివేకహీనమయిన మనస్సు మహత్తరమయిన ఆపదలకు కారణముసుమా! అని ఉపదేశించారు వసిష్ఠులు. ఇలా ఉపదేశించుచుండగా సూర్యాస్తమయం అయింది. సభాసదులు సాయంకాలానుష్ఠానానికి లేచారు. మరల పొద్దుననే సూర్యోదయంతో సభను అలంకరించారు.

ఇట్లు ఎనిమిదవరోజు ప్రసంగము ముగిసింది.

## ౧౦౩. చిత్తమాహాత్మ్యము.

వశి: రామా! పరమాత్మవల్ల పుట్టిన ఈ మనస్సే విస్తృతమయిన ప్రపంచాన్ని తయారుచేస్తోంది. పొట్టి పొడుగు చేస్తుంది, పొడుగు పొట్టిచేస్తుంది. తనను ఇతరముగా చేస్తుంది.ఇతరమును తనను గా చేస్తుంది. ప్రాదేశమాత్రమయిన (అత్యల్పమయిన) వస్తువును భావనామాత్రముచేత పెద్దకొండవలె కంటికి కనుపరుస్తుంది, ఒక్క

క్షణంలో కొన్ని బ్రహ్మాండాలను పుట్టించి పూర్తి (నాశం) చేస్తుంది. నటునివలె అనేక వేషాలను వేస్తుంది. ఉన్నదానిని లేకుండా చేస్తుంది. లేనిదానిని ఉన్నట్లు కనుపరుస్తుంది. మనస్సు ఎలా సంకల్పిస్తే దాని కనుకూలంగా చేతులూ కాళ్ళు మొదలగు ఇంద్రియాలు అన్నీ సంచరిస్తాయి. పిల్లవాడు మట్టితో బొమ్మను తయారుచేయునట్లు జగత్తును తయారుచేస్తుంది ఇది. కాలము ఋతుభేదంచే వృక్షాదులను వేరు పరుస్తుంది ఇది. పదార్థాలను వాసనాభేదంచేత భిన్నం చేస్తుంది. మనోరథ, స్వప్న, సంకల్పాదులందు అనేక ఆమడలను గోష్పాదమంతగా చేస్తుంది. ఒకకల్పం క్షణంచేస్తుంది, క్షణాన్ని కల్పంచేస్తుంది. ఇది రజోగుణం అధికంగా ఉంటే తీవ్రంగా ప్రవర్తిస్తుంది. తమోగుణం అధికంగా ఉంటే మందంగా ప్రవర్తిస్తుంది. సముద్రమంతా జలమే. అగ్నిఅంతా వేడిమియే. సంసారమంతా మనస్సే. త్రిపుటి యావత్తూ ఈ మనోమాత్రము కాని వేరుకాదు.

## ౧౦౪' ౧౦౫. ఇంద్రజాలోపాఖ్యానము.

ప్రపంచమంతా ఇంద్రజాలము (మాయ). ఇది చిత్తమునకు స్వాధీనమై ఉంది. ఈ విషయంలో నీకొక కథ చెబుతా విను. ఈ భూమండలంలో ఉత్తరాపాండవము అనే ఒక పెద్దరాజ్యమున్నది. అది అన్నిటా మహాశోభాయమానంగా ఉంటుంది. పరమధార్మికుడయిన లవణుడనే రాజు దానిని పాలించుచున్నాడు. అతనికీర్తి కొండలపట్టున పెరిగియున్నది. మహాపరాక్రమశాలి. పుణ్యచరితుడు. స్వర్గాంగనలు కూడ ఇతనికీర్తిని ఆనందంగా గానంచేస్తూ ఉండేవారు. ఇంద్రాది లోకపాలురు వినుచుండేవారు. ఈ గానమును విని బ్రహ్మగారి హంస కూడ వంతబలుకుట ఆరంభించేది రామా! ఈ రాజుచరిత్ర కలలో కూడా ఇతరరాజుల చరిత్రవంటిది కాదు. అతడియందు దైన్యముకాని మఱి యే ఇతరదోషముకాని కనివిని యెరుగము. కౌటిల్యము లేదు. అతనియందు అవినీతిలేదు. గొప్ప ఉదారుడు. ఒకానొకనాడు ఆ రాజు నాలుగుగడియల ప్రొద్దు యెక్కినతరువాత కొలువుకూటంలో సింహాసనంమీద కూర్చున్నాడు. పన్నుచెల్లించే సామంతరాజులు వచ్చియున్నారు. ఆడువారు చక్కగా పాడుచున్నారు. వీణా, మురళీ

మున్నగువాద్యములను వాదించుచున్నారు. వింజామరలు వీచుచు న్నారు. బృహస్పతి, శుక్రాచార్యులవంటి మేధావులైన మహామంత్రు లున్నారు. దూతలు దేశవార్తలను అందజేస్తున్నారు. పురాణేతిహా సాది కాలక్షేపాలు జరుగుచున్నవి. వందిమాగధులు స్తుతిపాఠములను చదువుచున్నారు. ఈసమయంలో ఒకానొక ఐంద్రజాలికుడు ఆసభను ప్రవేశించాడు. వేషభాషలు చాలా పటాటోపంగా ఉన్నాయి అతడికి. రాజుకు నమస్కరించాడు. ఎదురుగా కూర్చున్నాడు. రాజుతో ఇలా అన్నాడు. "రాజా! ఆకాశంనుంచీ చంద్రుడు భూమిని చూచు నట్లు, తమరు సింహాసనంమీద కూర్చుండియే, ఆశ్చర్యమయిన ఒక ఇంద్రజాలమును చూడండి" అని చెప్పి నెమలిపింఛమును చేతబూని ఇటూ అటూ త్రిప్పాడు. ఇంద్రధనస్సువలె నానారంగులతో ప్రకా శిస్తున్న ఆ పింఛమును చూచాడు రాజు. అదేక్షణంలో, అశ్వపాల కుడు ఆసభలో ప్రవేశించాడు. వానివెంట ఒక గుర్రము ఉన్నది. ఆ అశ్వమును తీసికొని అశ్వపాలకుడు ఆరాజుతో ఇలా అన్నాడు. "ఓరాజా! ఇది ఉచ్చైశ్రవమను గుర్రముతో సమానమయినది, మిక్కిలి శ్రేష్ఠమయినది. వాయువుతో సమానముగా పోవునది. దీనిని మాప్రభువు మీకిమ్మని పంపాడు. మీబోటిమహానీయులవద్ద ఉంటేనే దీనికి అలంకారము" అన్నాడు. అశ్వపాలకుడు రాజుతో ఇలా అంటూ ఉండగా ఐంద్రజాలకుడు రాజుతో ఇలా అన్నాడు. "రాజా! ఈగుర్రము చాలమంచిది. దీనినెక్కి మీరు భూలోకం అంతాతిరగండి" అని అంటూఉండగా రాజు గుర్రాన్ని చూశాడు. క్షణంలో నిశ్చే ష్టుడై స్తంభించిపోయాడు. నాలుగుగడియలసేపు అలాగే ఉండిపో యాడు. సభలోనివారంతాకూడా అలాగే స్తంభించిపోయారు. చేష్టా రహితులయినారు. ఎవ్వరూ ఈ రాజును మాట్లాడించలేకపోయారు. సభ అంతా నిశ్శబ్దమై ఉంది. మంత్రులందరూ దుఃఖాక్రాంతు లయినారు.

నాలుగుగడియలకు క్రమంగా మేల్కొన్నాడు రాజు. శరీర మును కదల్చి సింహాసనంమీద ఊగాడు. పడిపోవునేమోనని ఎదుట నున్నవారు పట్టుకున్నారు. అంతట రాజు వార్లతో "ఈ సభ యేమిటి, మనమిప్పుడు ఎక్కడఉన్నాము" అని అన్నాడు. ఆ సభాసదులు

"రాజా మీరు ఇట్లు చింతాక్రాంతులగుటకు కారణమేమి? ఏల శరీరము తెలియకుండా బోతిరి? మేమందరము చాలభయపడితిమికదా! ఎంతటి దృఢచిత్తులనుగూడ భ్రాంతి అనేది చెడగొట్టునుకదా! ఈ భోగములన్నీ ఆపాతరమణీయములుకదా! ( విచారించనివారలకు అందముగా కన్పడునట్టివికదా! ) అట్టితుచ్ఛభోగములందు మీ చిత్తము లగ్నముకాదే, ఏల వ్యామోహితులైతిరి? ఉత్తమగాథలను విని ప్రశాంతమయిన మీమనస్సు ఇట్లు తొట్రుపడుటకు కారణమేమి? పరిశుద్ధమయిన మనస్సునకు ఇదితగదే! అజ్ఞానులకు ఇది యుచితము కావచ్చును. మీబోటివారి చిత్తములకు ఇదితగదు. ఎంత ఆశ్చర్యము! వివేకయుక్తమయిన మీ బోంట్లచిత్తము తుచ్ఛ భోగములను ఆశ్రయించదు- అని ప్రియవచనములను పలికిరి" రాజు ఈమాటలచే తెప్పరిల్లుకొన్నాడు. తనపరిస్థితినిగూర్చి విచారించుకున్నాడు. నవ్వుతూ ఐంద్రజాలికునితో ఇలా అన్నాడు. ఐంద్రజాలికుడా! ప్రశాంతమయిన సముద్రమునుగూడ క్షణకాలంలో కలవరపరచునట్టి యీ మాయాశక్తి ఎక్కడ సంపాదించావు? మంత్రములందలి ఈశ్వరశక్తి అమోఘముకదా? మాబోటివార్ల చిత్తమునుగూడ వ్యామోహములో ముంచితివికదా! లోకవ్యవహారమునందు అరితేరిన మే మెక్కడ? మనోభ్రాంతికలిగించే ఈ ఆపదలెక్కడ? వివేకయుక్తమగు మనస్సుకూడ క్షణంలో మోహపోవునుకదా? ఓసభ్యులారా! ఈ శాంబర విద్యాకుశలుడు క్షణంలో నాకుజూపిన విచిత్ర వృత్తాంతమును చెబుతా వినండి. "వెనకటికాలంలో, దేవేంద్రుడు నిస్సహాయుడుగా నుండగా బలిచక్రవర్తి బలాత్కారంగా నిగ్రహించి తీసుకుపోదలచాడు. దేవేంద్రుడు తనమాయాశక్తిచే కొంతసైన్యాన్ని సృష్టించి బలిని మోహింపజేశాడు మాయాబంధంచేత. బలిచక్రవర్తి దానిని విడిపించుకోటానికి స్తుతించి బ్రహ్మదేవుని అనుగ్రహపరచుకున్నాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయి దేవేంద్రుని మాయాసృష్టిని ధ్వంసంచేయదలచాడు. వెంటనే దేవేంద్రుడు మొరపెట్టుకున్నాడు. అంతట బ్రహ్మదేవుడు క్షణకాలం ఏమీచేయకుండా ఆదేవేంద్రుని మాయాసృష్టిని చూస్తూఉన్నాడు. అలా అయింది నాపని. అనేక చిత్రవిచిత్రాలను చూచాను యీ ఇంద్రజాలంలో- అని చెప్పుతూఉండగా సభ్యులు

వినటానికి చెవులు దోరపెట్టుకున్నారు. రాజు నవ్వుతూ తాను చూచిన విచిత్రవృత్తాంతమును చెప్పనారంభించాడు.

## ౧౦౬. ఇంద్రజాలోపాఖ్యానమున చండాలీ వివాహము.

ఓ సభికులారా! మనము నివసించే ఈ వనప్రదేశము అనేక నదీనదములతోను, కులశైలములతోను కూడి భూమండలమునకు తమ్ముని వలె నున్నది. దీనికి నేను ప్రభువుగా ఉన్నాను. ఈ సభాస్థలి యందు సింహాసనంమీద కూర్చున్నాను. ఇంతలో పాతాళలోకము నుండి, మయుడను రాక్షసుడు వచ్చినట్లు ఈయింద్రజాలికుడు వచ్చి నాడు. ఇంద్రధనస్సువంటి నెమలిపింఛమును త్రిప్పినాడు. అదిచూచి నేను భ్రాంతిపడి యెదుటఉన్న గుర్రమును ఎక్కినాను. వేటకొరకు బహువేగంగా పోయాను. అతిభయంకరమయిన నొక యడవిని చేరి నాను. గుర్రము అలసిపోయింది ఆహారంలేనందున. నేను చాల ఖేద పడినాను. త్రాగుటకు నీరుకూడ దుర్లభమయింది. సూర్యాస్త మయంవరకు ఆ అడవిలోనే తిరిగాను. ఎలాగో ఆ యడవిదాటి మరో అడవిచేరాను. అలసినగుర్రంమీదనే - వెనుకటి అరణ్యంకంటె ఇది కొంచెం సుఖంగా ఉంది. మరణంకంటె రోగం మెరుగు అన్నట్లు అయింది నాగతి. అందులో ఒక నేరేడుచెట్టుక్రిందకు చేరాను. ఆ చెట్టుకు అల్లుకున్న తీగ నాకంఠానికి తగులుకున్నది. దానితో నేను వ్రేళ్ళాడుతూ ఉండగా గుర్రము నన్నువిడిచిపోయింది. నేనుమాత్రము ఆచెట్టుక్రింద చాలసేపు విశ్రమించాను. ఆ అరణ్యం అంతా అంధ కారబంధురమయింది. నే నొకచెట్టుతొర్రలో దాగుకొని యున్నాను. ఆ రాత్రి నాకొక కల్పమయింది. స్నానం లేదు - పూజలేదు- భోజనం లేదు - ఎలాగో ఆరాత్రి గడిపాను అతికష్టంమీద- అంతట కొంతసేపటికి అరుణోదయమయిన తూర్పుదిక్కునకు చూచాను. క్షణంలో సూర్యభగవానుని చూచాను. నేను లేచి నాపక్కనూ, దుప్పటినీ దులిపాను. మళ్ళీ అడవిత్రోవనుబట్టి నడవసాగాను. ఎక్కడా మనుష్యసంచారం కనిపించలేదు. పండ్లులేనిచెట్లుమీద కూతకూయుచున్న పక్షులుమాత్రం కనిపించాయి. అక్కడ తిరుగు

తూఉండగా చేతులలో అన్నముపెట్టుకొని యున్న నొక కన్నెయను చూచాను. దగ్గరకుబోయినాను, చేతులోని అన్నముపెట్టుమని అడిగాను. ఆకలి భరించలేకున్నాను. బ్రతిమాలుకున్నాను. కాని ఉపయోగించలేదు - అన్నము పెట్టలేదు. అయినా నేనామెను విడువలేదు - నీడవలె వెంటబడ్డాను. ఆవనమునుండి మరోవనమునకు పోయాను. అప్పుడు ఆమె నాతో ఇలా అన్నది "రాజా! నేను చండాలకన్యను. పసుమాంసమును భక్షించుదానను. స్వభావంలో రాక్షసివంటి దానను. నీవు రాచకులమున బుట్టినవాడవు. ఉత్తమాహారమును తినువాడవు. నీకీ ఆహారము ఉచితముకాదు. అయినా నీవు ఊరక నా వెంటవచ్చినంతమాత్రమున నీకు ఆహారము లభింపదు' అని చెప్పి విలాసంగా లతలచాటుకు. పొదలచాటుకు పోయి దాగుకొంటూ, కడగంటిచూపుతో చూస్తూ తన భావం వెల్లడింపసాగింది. త్రోవలో ఇలా అన్నది "రాజా! నీవు నాకు భర్తవైతే నేను నీకు ఈ అన్నమును పెట్టుదును. మాబోటి సామాన్యులు ఫలంలేకపోతే ఉపకారం చెయ్యరు. చండాలుడగు నా తండ్రి దగ్గరలో పొలము దున్నుకొనుచున్నాడు. ఈఅన్నం అతనికొరకు తీసికొని పోతున్నాను. అయినా నీవు నాకు పతివైతే ఈ అన్నమును పెట్టగలను. స్త్రీలకి ప్రాణములకంటె నెక్కువ ప్రియుడు పతి" అని అన్నది. ఆపత్కాలం కనుక ధర్మం విచారించలేక నేను. అంగీకరించాను. అంతట నామె ఆ అన్నంలో సగంపెట్టింది. అంతే చాలనుకొని తృప్తిగా తిన్నాను. కొంచెముసేపు విశ్రమించాను. ఆమె నన్ను విడిచి తన తండ్రి యొద్దకు వెళ్ళింది. నా వివాహవిషయం చెప్పింది. అంగీకరించమని కోరింది తండ్రిని. తండ్రి సమ్మతించాడు. మేము ముగ్గురమూ ఆ అడవిలో సంచరించాము. పొద్దుగుంకు సమయానికి ఆ అడవిని దాటి మాలపల్లె చేరినాము. ఆ పల్లెలో కోతులను, కోళ్ళను, కాకులను కోసిన మాంసపుముక్కలున్నాయి. నేల నెత్తురుతో తడిసి ఉంది. దోమలు మూగిఉన్నవి. ఎండబెట్టిన తడిపేగులమీద పక్షులు వ్రాలుచున్నాయి. చూడను అసహ్యంగా ఉంది. ఆపల్లె ఆచండాలగృహం ప్రవేశించాను. నూతన శ్వశురగృహంలో కొత్త అల్లుణ్ణికనుక అరటి ఆకులమీద కూర్చుండబెట్టారు. కొంతసేపు విశ్రమించి

కృష్ణాజినంమీద కూర్చుని వారి ఆహారం భుజించాను. వాళ్ళుచెప్పిన ప్రణయవాక్యాలు విన్నాను. తదుపరి ఆకన్నెనిచ్చి నాకు వివాహం చేశారు. అందులో అక్కడి చండాలులు అందరూ బాగా తాగి డప్పులువాయించి చప్పట్లుచేశారు. అరచారు. నాట్యమాడారు.

## ౧౦౭. ఆపద్వర్ణనము.

సభ్యులారా! పెక్కుమాటలేల? ఆసందర్భంలో నేనుకూడా ఒకపెద్దమాలను అయినాను. ఆ వివాహమహోత్సవం ఏడురోజులు సాగింది. తరువాత క్రమంగా ఆచండాలకన్నెక ఋతుమతి అయి గర్భవతి అయింది. ఆడపిల్లను కన్నది. మూడుసంవత్సరాలు గడిచిన తరువాత మగపిల్లవానిని కన్నది. వాడు వట్టి దౌర్భాగ్యుడు. మళ్ళీ ఒక ఆడపిల్లా, ఒకమగపిల్లవాడూ కలిగారు. ఇలా ఆకుటుంబం వృద్ధి పొందింది. ఆమెతో నేను చాలాసంవత్సరాలు గడిపాను. కుటుంబాన్ని భరించలేక బాధపడ్డాను. చినిగిన గుడ్డలు కట్టుకుని గడ్డిమోపులు మోశాను. కట్టగుడ్డ లేక గోచిపెట్టుకుని చెట్టుక్రింద పండుకున్నాను, కుటుంబాన్ని పోషించలేక ఏడ్చాను. ఆకలికి పందిమాంసమును గూడ తిన్నాను. భార్యతో కలహించాను. పసిపిల్లలను వెంటబెట్టుకొని మరొక చండాలునియింటికి పోయి కాలం గడిపాను. పడరానిపాట్లు పడ్డాను. చేయరాని కృత్యాలు చేశాను. ఎంతదుష్కృత్యాని కయినా నామనస్సు వెనకాడలేదు. నిర్దుష్టమగు రాజకులంలో బుట్టిన నేను ఇలా అరవై సంవత్సరాలు గడిపాను. నాకు అవి అరవై కల్పము లయినవి. సభ్యులారా! దుష్టవాసనలచే నేను ఆమాలపల్లెలో పడి అనేక మందిని తిట్టాను. ఆఫదలయందు ఏడ్చాను. నీచాన్నమును భుజించాను. నీచస్థానముల నివశించాను.

## ౧౦౮. ఆకాండ దుర్భిక్షవర్ణనము.

ఇలా కాలం గడుస్తూ ఉండగా, ముసలితనం నావెంట పడింది. శరీరం కృశించింది. మీసాలు తెల్లపడ్డాయి. ముంచుకురిసిన గడ్డిపరకల్లాగ తయారయినాయి అవి. కుటుంబకలహాల్లు పెరిగిపోయి దుఃఖాలు

వెంటపడ్డాయి. సుడిగుండంలో పడిన గడ్డిపోచవలె కాలసాగరంలో కొట్టుకుని పోతున్నా నేను ఈ రీతిగా. ఒక్క సంవత్సరం గడిచింది. దుర్భిక్షం (కఱువు) ప్రారంభమయింది. చండాలులకు నివాసస్థానమయిన ఆప్రదేశమునకు ఈ కరువు ప్రపంచానికి ప్రళయంవంటిదీ, ఒడ్డుకు సముద్రతరంగమువంటిదీ, ఎండినచెట్టుకు పిడుగువంటిదీ, అయింది. మేఘాలు వర్షించడం మానుకున్నాయి. గాలులు నిప్పులు కురిపిస్తున్నాయి. చూచినది చూచినట్లు నశిస్తోంది. అన్నపానీయాలు లేక దేశం అంతా జనశూన్యమయింది. పశువులు మృగతృష్ణ నదిలో బడి చచ్చుచున్నవి. ఎవరిని వారే తినటం ప్రారంభించారు. చిన్న చిన్న రాతిముక్కలనుగూడ తినటం సాగించారు. తల్లీ పిల్లలూ ఒకరిమీద ఒకరు పడి చస్తూన్నారు. ఒకరిరక్తం ఒకరు త్రాగుతున్నారు. అగ్నిజ్వాలలు సంధ్యాకాలమేఘములవలె ఆకాశమును కప్పుచున్నవి. ఆ వేడిగాలికి ప్రాణులందరూ బాధపడ్డారు. ఈ వింధ్యప్రాంతము శని, అగ్ని, సూర్యులకు నివాసమయినదా యేమి? అన్నట్లు ఉన్నది.

## ౧౦౯. చండాలజన్మ పోవుట.

ఈ స్థితిలో కొందరు కుటుంబాలతోసహా దేశాంతరం వెళ్లారు. మరికొందఱు అక్కడనే ఉండి నశించారు. కొందరు పోతుండగా వ్యాఘ్రాదులచే భక్షించబడ్డారు. కొందరు మంటలో పడి కాలిపోయారు. నేను మాత్రము నాకొడుకులను భుజముమీద నెక్కించుకొని ఒకతాటిచెట్టుక్రింద విశ్రమించాను. ఆచెట్టుక్రిందనే తనపిల్లల నిద్దరిని కౌగలించుకొని, నాభార్య(మాలపిల్ల) నిద్రపోవుచుండ, మాకు ముద్దు అయిన చిన్నపిల్లవాడు, (ప్రచ్ఛకుడు,) ఏడుస్తూ, తినడానికి అన్నమూ తాగటానికి రక్తమూ యియ్యమని దీనంగా అడిగాడు. చాలసార్లు అడిగాడు. నేను పలుమార్లు మాంసంలేదని చెప్పాను. అయినా వాడి పట్టు వాడు విడువలేదు. అంతట నేను పుత్రవాత్సల్యంచేత, నామాంసమును భుజింపమన్నాను. అదే యియ్యమన్నాడు. తుదకు నా మాంసమును గూడ తినదలచాడు. నేను నాపిల్లవాని ఆకలిబాధ చూచి

సహింపజాలక మరణింప నిశ్చయించుకున్నాను. చితుకులను దెచ్చి చితిపేర్చి, అగ్ని ముట్టించి అందులో నేను పడబోవుసరికి, ఇక్కడ సింహాసనమునుండి క్రిందకు బడుచున్నాను. అప్పుడు నాకు జయ జయ ధ్వనులు వినిపించినవి. మెలకువ వచ్చినది. ఈ విధంగా నన్ను మోహపరచాడు యీ ఇంద్రజాలకుడు' అని అన్నాడు లవణుడను రాజు సభికులతో. ఇంతలో ఇంద్రజాలకుడు అంతర్ధానమయినాడు. సభికులు ఆశ్చర్యపోయారు. నేత్రములు పెద్దవి జేసికొన్నారు. ఇలా అన్నారు రాజుతో. రాజా! ఇతడు ఐంద్రజాలకుడు గాడు. ఇతనికి ధనాశలేదు. ఇదియొక దైవమాయ. ప్రపంచస్థితి అంతా ఇంతటిదని బోధింపదలచి దైవమాయ ఈ ఐంద్రజాలకుడనే వేషంతో వచ్చింది. దీనివల్ల ప్రపంచం మనోమాత్రమని మన అందరకు అర్థమయింది. భగవంతునియొక్క మనస్సేకదా జగత్తు! పరమాత్మ సర్వశక్తి యుక్తుడు. తన మాయాశక్తిచే ఎవ్వరినయిననూ మోసపుచ్చగలడు. రాజా! మీరెక్కడ? ఈ భ్రాంతి యెక్కడ? ఐంద్రజాలకులు ప్రజలను రంజింపజేసి డబ్బు సంపాదింతురుగాని ఇలా ప్రజలను మోహపెట్టరు. ఇది అంతర్ధానం కాదు కనుక 'రాజా! వీడు ఐంద్రజాలకుడుగాదని మా సందేహము. ఇందు మేమొకనిర్ణయానికి రాజాలకున్నాము. అని అన్నారు సభికులు.

వశిష్ఠుడు:— రామా! పూర్వము ఆ రాజసభయందు నేనుగూడ ఉన్నాను. ఇది అంతా నేను స్వయంగా చూచానుకాని, ఇతరులవల్ల విన్నదికాదు— అన్నాడు వసిష్ఠుడు.

## ౧౧౦. చిత్తవర్ణనము.

రామచంద్రా! అజ్ఞానముచే చిత్తము విషయాభిముఖ మవుతోంది విషయదోషాలచే మలినమవుతోంది. మనస్సుకుభ్రాంతిజ్ఞానము దృఢపడేసరికి చైతన్యము తనపూర్ణరూపమును మరచి జననమరణాదులచే మోహమును చెందుతోంది. సూర్యకాంతి చీకటిని పారద్రోలినట్లు వాసనారహితమయిన మనస్సు దుఃఖజాలమును రూపుమాపుతుంది. వాసనాయుక్తమగు మనస్సు ఎంతటిపని అయినా చేస్తుంది.

అభయమునందు భయమును, భయమునందు అభయమును పుట్టిస్తుంది. స్వప్నమంతటి పనిని జాగ్రత్తలోకూడ చేస్తుంది. జాగ్రత్తుకూడ నిజంలో స్వప్నంవంటిదే. తత్త్వవిచారము చేయనివానికి వాసనా త్యాగం కలదు. అట్టివానికి జ్ఞానము ఉదయించదు. కాబట్టి రామా! మనస్సే మనుష్యుడు. జడమయిన దేహము మనుష్యుడుకాదు. మనస్సు చిజ్జడవిలక్షణము. మనస్సుతో చేసినపనియే చేసినట్లగును. మనస్సుచే విడచినదే విడిచినట్లగును. మనస్సే ప్రపంచము. మనస్సే భూమి, అదే ఆకాశము. అదే వాయువు. మనస్సు వస్తువునుగురించి ప్రవర్తించక పోతే సూర్యాదులుకూడ ఆవస్తువును కనుపరచలేరు. కనుక మనస్సే మోహమును చెందును. మనస్సు మూఢమగునుగాని, దేహముకాదు. శవశరీరమును మూఢమని ఎవ్వరూ అనరు. మనస్సే కన్ను, మనస్సే చెవ్వు. మనస్సే చర్మము. మనస్సే ముక్కు. మనస్సే నాలుక. చిత్ర విచిత్రములయిన వృత్తులను అదే చేస్తుంది. ఈ మనస్సుయొక్క ప్రతిభాస (స్ఫురణము) వల్లనే స్వప్నంలో హరిశ్చంద్రుడికి ఒకరాత్రి పన్నెండు సంవత్సరాలు అయింది. ఇంద్రద్యుమ్నునకు ఒక్కక్షణంలో యుగం గడిచింది. మనస్సు ఒక్కటి జయింపబడితే అన్ని యింద్రియాలూ జయించినట్లే. దారం తెగితే మాల అంతా శిథిలమయినట్లే. రామా? ఎంతటి విపరీతకల్పనలకయిననూ ఇది వెనుదీయదు. సర్వవ్యాపకము, స్వచ్ఛము, నిర్వికారము, సూక్ష్మము, నిత్యము, వాగతీతము, అయిన బ్రహ్మమును దేహంతో అభేదంచేసి దానిని జడముగ తయారుచేస్తుంది. అమృతమును విషంగా తయారుచేస్తుంది. విషాన్ని అమృతంగా తయారుచేస్తుంది. తన కభిమతమయిన వస్తువులయొక్క ఆకారాన్ని ధరిస్తుంది. మనస్సు ఇతరత్ర లగ్నమైయుంటే ఇతర ఇంద్రియాలతో పనిచేసినా చేసినట్లే ఉండదు. ఇంద్రియములవల్ల మనస్సుకు ఉపకారం ఉంది. మనస్సువల్ల ఇంద్రియాలకు ఉపకారం ఉంది. అయినా ఇంద్రియములకంటె మనస్సే గొప్పది. స్వప్నమునందు ఈ మనస్సు తన విలాసమును చూపేసరికి చిత్రవిచిత్రమయిన పదార్థాలు కనిపిస్తాయి. లవణుడను రాజునకు చండాలత్వము మనశ్శక్తి వల్లనే కలిగింది. ఇలాగే దేవత్వాది జన్మలనుగూడ సాధిస్తుంది. నువ్వులలో నూనె ఉన్నది. మనస్సులో సుఖదుఃఖము లున్నవి. కనుక

రామా! ఎవడు తనమనస్సునందు విషయచింతనకు తావివ్వడో అట్టి వాని మనస్సు క్రమంగా శాంతిని పొందుతుంది. సంసారమనే విష వృక్షమునకు మనోవృత్తులే మొలకలు కనుక మనస్సును నిర్మలపరచు కున్నవాడు కాని కడ తేరడు.

## ౧౧౧. చిత్తచికిత్సా వర్ణనము.

రామచంద్రా! చిత్తమనే మహావ్యాధికి మందు ఆత్మ సాక్షా త్కారము. బాహ్యవస్తువులను విడిచి, మనస్సు ఆత్మమాత్రాకార వృత్తిధారారూపమును చెందేయెడల చిత్తము సులభముగా జయింప బడుతుంది. ఇది ప్రతివారికి పురుషప్రయత్నసాధ్యము. దీనికి వైరా గ్యము మొదటిమెట్టు. కోరికగల వస్తువులను విడువవలెను. చిత్తము నిరామయంగా (రాగాదిరహితంగా) ఉంటే జయింపబడినట్లే. ఇందుకు శాస్త్రాభ్యాసము, సత్సాంగత్యమూ, తోడ్పడును. పిల్లవానిని భయ పెట్టీ బుజ్జగించియూ. మంచిపనియందు ప్రవేశపెట్టినట్లు చిత్తమును వైరాగ్యంచేతను, సత్సాంగత్యంచేతను ఆత్మాకారవృత్తియందు ప్రవేశపెట్టాలి. ఇందులో దుష్కరమేమీ లేదు. దీనికంతకు పురుష ప్రయత్నం అవసరం. అది ప్రతివారికి వారిచేతులో పని. వైరాగ్యము లేని మనుజుడు ఒకపురుగుక్రింద లెక్క. తనస్వాధీనములో ఉన్న మనో నిగ్రహమును తాను ఆచరించలేకపోతే, వాడు నిజమయిన మను ష్యుడు కాడు. మనుష్యరూపమును ధరించిన నక్క. మనోనిగ్రహము కంటె సద్గతికి గొప్పఉపాయము లేదు. మనోనిగ్రహములేనిచో, గురూ పదేశమూ, శాస్త్రార్థవిచారమూ, మంత్రజపతపములూ, అన్నీ నిరర్థ కములు. సంకల్పాలు నశిస్తే చిత్తము నిర్మూలమగును. రామా! కనుక నీవు పురుషప్రయత్నమును గట్టిగా ఆశ్రయించు. ఆత్మసాక్షాత్కారా భ్యాసమును చిరకాలము చేయుము. అంతిమసాక్షాత్కారవృత్తిచే అవిద్య పూర్తిగా నశించి ముక్తిపొందెదవు. మనస్సు నిగ్రహించు కొనజాలనివాడు లోకవ్యవహారంలోకూడా పనికిరాడు. లౌకికసుఖాలగు కల్పనలన్నీ చపలచిత్తముయొక్క వృత్తులు. ముక్తికి మనోనాశము, సంకల్పరాహిత్యము పరమోపాయమని తత్త్వవేత్తలందరూ అంగీకరిం చారు బాహ్యవస్తువులన్నీ మనస్సుయొక్క అంగములు. వాటిని

భావించకుండా ఉంటే విచ్ఛిన్నమైపోతవి. కనుక రామచంద్రా! నీవు నిస్సంకల్పస్థితిలో నుండి, అత్యుత్తమమయిన ఆత్మపదమును బొందుము. నిరతిశయానందము నొందుము. అమనస్కము ఆత్మవేత్తలకు సంమ్మతము, పరమపవిత్రము, దుఃఖరహితము సుమా!

## ౧౧౭. చిత్తక్షయోపాయ కథనము

రామా! మనోనాశమునకు వాసనాత్యాగమే ముఖ్యోపాయము. ద్వైతప్రపంచమునందు మనస్సుకు తీవ్రవేగాన్ని నిరోధించి, వేగాన్ని చిన్మాత్రాకారమునందు ప్రవేశపెట్టాలి. మనస్సు సహజంగా ఏవస్తువును కోరుతుందో ఆవస్తువునందు తీవ్రమయిన వేగంతో వాలుతుంది. నీటిలో బుడగలు లేచుట సహజము, మనస్సు తీవ్రముగా ప్రవర్తించడం సహజం. మంచుకు చల్లదనమూ, కాటుకకు నలుపుతనమూ, మనస్సుకు తీవ్రత్వమూ ఇవి సహజములు. అయితే మహర్షీ! ఇంత వేగంగల మనస్సును నిరోధించటం ఎలా కుదురుతుంది? రామా! చలించకుండా మనస్సు ఎప్పుడూ ఉండదు. దానిధర్మమే అది. (చలించుట) మనస్సు అంటేనే మాయాశబలమయిన చిత్తత్వమందున్న స్పందశక్తి. అనగా చలనశక్తి. ఈశక్తియే మనోరూపంగా పరిణమించిన దని గ్రహించు. స్పందాస్పందములను విడిచి గాలి అనేది లేదు. చాంచల్యమును విడిచి మనసు అనేది లేదు. చలనములేని మనస్సు నశించిన దనవచ్చును. ఈ మనోనాశమే తపస్సుఅనీ, మోక్షమనీ, శాస్త్రసిద్ధాంతము. మనోనాశంచేత దుఃఖశాంతి. మనోమననంచేత దుఃఖప్రాప్తి. చిత్తమనే రాక్షసుడు విజృంభించినచో అన్నీ దుఃఖాలే. మోక్షసుఖం అనుభవించాలంటే వాడిని బలాత్కారంగా పడగొట్టాలి. ఈమనశ్చాంచల్యమే అవిద్య. ఇదియే వాసనలకు నిలయము. ఆత్మవిచారంచేత దీనిని రూపుమాపాలి. జడపదార్థములను చింతన చేసిన, మనస్సు కలుషితమై జడమవును. చిత్ పదార్థమును చింతన చేసిన మనస్సు చిద్రూపమగును. శాస్త్రీయమయిన ప్రయత్నముచేత మనస్సు దేనియందు ప్రవేశపెట్టబడునో అభ్యాసపాటవం చేత ఆవస్తుస్వరూపాన్ని పొందుతుంది అది. కాబట్టి రామా! పురుష

ప్రయత్నంచేత మనోనాశము జేసికొనుము. ఇంతకంటె ముక్తికి వేరొండు నుపాయము లేదు. రాజే రాజును ఓడించగలడు. మనస్సే మనస్సును నిగ్రహించగలదు. ఇతరమునకా శక్తి లేదు. క్రమక్రమముగా వాసనలను రూపుమాపుకుంటే మనస్సు నశిస్తుంది. దానిచే అవిద్యకూడ నాశమొందగలదు. రామా! ముందు భోగవాసనలను విడువవలెను. పిదప భేదవాసనను, తరువాత విషయవాసనలను విడువవలెను. తలచినకొలదీ వాసనలు పెరుగును. మరచినకొలదీ వాసనలు తరుగును. కనుక విషయములను మరచుటయే మనోనాశము. ఇదియే అవిద్యానాశము. విషయానుభవమే సంసారదుఃఖము. విషయానుభవమును విడచుటయే నిర్వాణము. (మోక్షము). విషయానుభవత్యాగము పురుషప్రయత్నంచేత క్షణంలో సిద్ధించగలదు. కాన పురుషప్రయత్నమును అవశ్యము ఆశ్రయించుము.

## ౧౧౩. అవిద్యావర్ణనము

రామచంద్రా! నిజముగాఉన్న ప్రపంచవాసనలు నశించుట దుర్లభమని అంటారు కొందరు. అవి నిజమయిన వయితే వారన్నది యథార్థమే. అవి నిజమయినవి కావు, అసత్యములు. అవిద్యవల్ల వాసనలు బయలుదేరుచున్నవి. అవిద్య మిథ్యారూపముయినదికాని యథార్థరూపమయినదికాదు. కనుక ఈ వాసనలుకూడ యథార్థములుకావు. కనుక వాసనాక్షయము అసంభవముకాదు. రామా! అవిద్య ద్విచంద్రభ్రాంతివంటిది. మిథ్యాభూతము. ప్రపంచంలో బ్రహ్మతత్త్వమొక్కటే పరమార్థము. మిగిలినవన్నీ సంకల్పవికల్పాత్మకములు. వీటిని పరిశుద్ధాత్మయందు ఆరోపించుట తగదు. కర్తృత్వ అకర్తృత్వాభిమానములు. అజ్ఞానప్రయుక్తములు. ఇవి జ్ఞానికుండవు. నీకివి తగవు. మాయామయమయిన ఈ ప్రపంచంలో హేయమేది? ఉపాదేయమేది? రామా! సంసారవృక్షమునకు విత్తనపుగింజ అవిద్య. తాను లేకపోయినా, ఉన్నట్లు కనిపించేశక్తి దీనియందు మెండు. మహామోసకత్తె. అనేకవేషాలు వేస్తుంది. అనేకరకాల భాసిస్తుంది. మనస్సును క్షణమైనా నిలకడలేకుండా ఆడించేది అభ్యాసమే. ప్రయత్న

పూర్వకంగా వెదకి పట్టుకుంటుంది ప్రజలను. వద్దంటే వచ్చి పడు తుంది. ఎంతమరచినా మరపుకు రాదు. లవణుడను రాజుకు ఒక ముహూర్తమాత్రం కొన్ని సంవత్సరాలుగా చేసింది యీ అవిద్యయే. భార్యావియుక్తులకు ఒక్కరాత్రి సంవత్సరం చేస్తుంది. సుఖితులకు ఒక్కసంవత్సరం క్షణంలో లాగేస్తుంది. పటములో ఉన్న నిఖిలావ యవములు గలస్త్రీ ఎట్టిదో, ఈ అవిద్యకూడ అలాంటిదే.ఆస్త్రీ ఇంటి పనుల కుపయోగించదు. ఈ అవిద్యాస్త్రీ పారమార్థిక కృత్యాలకు ఉపయోగించదు. అడవిలో ఎండమావులవంటిది దీనిరూపము. నీటి మీదినురుగువంటిది దీనిరూపము మంచుగుడ్డ(నీహారపటము) వంటిదిదీ నిరూపం.ఇట్టి అవిద్యచే కలుషితమైన మనస్సుగలవాడు చిరకాలము సంసారభ్రాంతిలో ఉంటాడు.అప్పుడే వీనికి ప్రపంచంఅంతా అతిరమణీ యంగా గోచరిస్తుంది. ఇంక ఎన్నియో భ్రాంతులను కలిగించి ప్రాణులను సంసారములో బంధింపచేస్తోంది యీఅవిద్య. కాన బుద్ధిమంతుడయి నవాడు చిత్తమును విషయములనుండి మరల్చి క్రమంగా అవిద్యను రూపుమాపవలెను. అన్నారు వశిష్ఠులు,

విన్నాడు శ్రీరాముడు.అవిద్యయొక్క మహిమ అంతా. ఆశ్చ ర్యం కలిగింది అతనికి. ఇలా అన్నాడు వశిష్ఠునితో. 'మహర్షి! తుచ్ఛ మయిన ఈఅవిద్యమిథ్యా భావనచేత ప్రపంచాన్ని కల్పించినదికదా! మోసపుచ్చినదికదా! పగటిపూట సంచరించలేక, రాత్రిపూట సంచ రించు గుడ్లగూబవలె జ్ఞానులయెడ తన ఆట సాగక అజ్ఞానులయెడ చిందులు త్రొక్కునట్టి యీ అవిద్య ఎంతమోసము చేయుచున్నది! ఆహా ఏమిచిత్రము! నీచస్వభావురాలు అసద్రూపురాలు, కామక్రో ధాద్యవయవ వంతురాలు, స్త్రీరూపురాలు, అగు నీఅవిద్య పురుషు లను ఎంత చెడగొట్టుచున్నది? మహాత్మా! ఈ దుర్మార్గురాలు నశించు ఉపాయమెద్ది? అన్నాడు శ్రీరాముడు.

## ౧౧౪. దోషపరిహారోపదేశము.

వశి:- రామా! సూర్యరశ్మికి మంచు విరిగిపోవును. ఆత్మసాక్షా త్కారంచేత అవిద్య నశించును. ఆత్మసాక్షాత్కారమందు గట్టికోరి

కలుగునంతవరకు ఈ అవిద్య జీవుని సంసారశిఖరికి ఎక్కించుచునే యుండును. సూర్యోదయంవల్ల చీకటిపోయినట్లు వివేకోదయంవల్ల అవిద్యాంధకారము పోవును. ఇచ్ఛయే అవిద్య. ఇచ్ఛానాశమే మోక్షము. ఇది సంకల్పరాహిత్యంవల్ల సిద్ధిస్తుంది. అని అన్నారు వశిష్ఠులు.

శ్రీరా:- స్వామీ! అవిద్యాత్మకమయిన ప్రపంచము ఆత్మ భావనచే నశించునంటిరి మీరు. అయితే ఆ ఆత్మస్వరూపము ఎట్టిది? సెలవివ్వండి అన్నాడు శ్రీరాముడు. రామా! విషయవివర్జితమూ, అవిద్యారహితమూ, సర్వవ్యాపకమూ అగు చిత్తత్త్వము ఆత్మ. బ్రహ్మాదిస్తంబపర్యంతము ప్రపంచమంతా ఈ ఆత్మతత్త్వమొక్కటే కాని, అవిద్య అనేది లేదు. పరమార్థంలో మనస్సు అనేదికూడా లేదు. నిజంలో పుట్టేదికాని చచ్చేదికాని లేవు. అంతా బ్రహ్మ పదార్థమే నిండి నిబిడీకృతమై ఉన్నది. ఇట్టి చిత్తత్త్వము విషయాభి ముఖమగుసరికి మనస్సు అనేది కలుషితమగుచున్నది. ఈ బ్రహ్మ తత్త్వమునుండియే ప్రపంచకల్పన జరుగుతోంది. అవిద్య అనేదికూడ ఆపరమాత్మనుండియే సంకల్పమాత్రంవల్ల తయారవుతోంది. సంక ల్పమువల్లనే నశిస్తోంది. గాలివల్ల బుట్టిన అగ్నిజ్వాల గాలివల్లనే నశి స్తుంది. కనుక పురుషప్రయత్నాయత్తమయిన సంకల్పత్యాగము వల్లనే అవిద్య నశించును.

"నాహం బ్రహ్మ" అను సంకల్పంవల్ల మనస్సుకు బంధము. 'సర్వంబ్రహ్మ' అను సంకల్పంవల్ల మనస్సుకు మోక్షము. "నేను కృశించినవాడను" "నేను దుఃఖిని" "నేను బద్ధుడను" "చేతులు కాళ్లు గలవాడను" అని మనస్సుచే భావించువాడు బద్ధుడవును. "నేను మాంసమయమయిన దేహముకాదు," "నేను దేహేంద్రియాది విలక్షణుడను" అను నిశ్చయమున్నచో అవిద్య వెంటనే నశించును. అనాత్మయందు ఆత్మభావనే అవిద్య. అది కల్పితముకాని వాస్త వము కాదు. ఆకాశమునందలి నలుపుతనమును చూచి మేరుపర్వతము యొక్క నీలమణిశిఖరకాంతి అనికాని, లేక బ్రహ్మాండముయొక్క

ఊర్ధ్వభాగమందలి చీకటి అనికాని కల్పించుకున్నట్లు. ఈ కల్పన అజ్ఞానకు కలుగును. విజ్ఞునకు కలగదు. అన్నారు వసిష్ఠులు.

శ్రీరా:- స్వామీ! ఆకాశమునందలి నలుపుతనము నీలమణి శిఖరముయొక్క కాంతికాదు. అంధకారకాంతియు కాదు. ఏలయన మేరువుయొక్క శిఖరంమీద పద్మరాగాదిమణులు ఉండును. కాన ఆకాశము రక్తవర్ణముకలదిగా నుండవలెను. రెండోపక్షంలో బ్రహ్మాండముయొక్క రెండుభాగములు సువర్ణమయము లని ప్రతీతికద్దు. మరియు సత్యలోకములు మొదలగు ఊర్ధ్వలోకములు ప్రకాశవంతములుగా నుండ, ఆకసమునందు నలుపుతన మెట్లుండును? అని అడిగాడు శ్రీరాముడు.

వశి:- రామచంద్రా! నీవు చెప్పినది నిజము. ఆకాశమునందలి నలుపుతనము మణులకాంతి కాదు. చీకటియుకాదు. కేవల శూన్యత్వము. కల్పితము ఈబుద్ధికూడ అవిద్యవు చెలికత్తె. దృష్టికిగోచరించని తావున నలుపుతనము గోచరించుట సహజము. అదియే ఇచట నలుపురంగుగా కల్పించుకొనబడినది అజ్ఞానులచే. ఇట్లే అవిద్యాకల్పన కూడ అని గ్రహించు. కనుక అవిద్యానాశమున కుపాయము సంకల్పాభావమేకాని వేరొండు లేదు. కనుక మనస్సుచే విషయానుసంధానము చేయనివాడే ఎన్నటికైనా ముక్తి పొందుతాడు. లేనివాడు పొందడు. కనుక రామా! శాస్త్రసంస్కృతమయిన బుద్ధిచే పురుషప్రయత్నాన్ని అవలంబించి చిత్తమును నశింపజేసికొనుము. ఇందుకు వాసనాత్యాగమే ఉపాయము. జరామరణములకు కారణమై ఆశాపాశములను పెంచునది వాసన యనబడును. "నా పుత్రులు", "నా ధనము", "నాయిల్లు", "నాపొలము", అను భ్రాంతులన్నీ వాసన వల్లనే ఏర్పడుచున్నవి. అవియివి యననేల? ప్రపంచమునందలి సర్వానర్థములును వాసనలవలననే కలుగుచున్నవి. కనుక రామా! సంసారబంధమును కలిగించెడి వాసనను విడిచి, నీమనస్సును శుద్ధస్ఫటికమువలె నిర్మలపరచుకొనుము. బ్రహ్మవేత్తలసాంగత్యము చేయుము, ఆత్మవిచారణ సలుపుము, ఆసక్తిరహితుడవై వ్యవహరింపుము,

నిత్యముక్తుడ వగుదువు. ఇంక నీకు హరిహరాదులుగూడ సాటికాలేరు అని అన్నారు వశిష్ఠులు.

## ౧౧౫. సుఖదుఃఖ భోక్తృత్వోపదేశము.

వాల్మీకి:- భరద్వాజా! మహానుభావుడగు వశిష్ఠుడు ఈకథలన్నీ చెప్పి తత్త్వబోధ చేసేసరికి శ్రీరామునిమనస్సు సూర్యకిరణాలవల్ల పద్మమువలె వికసించింది. ఆశ్చర్యపోయాడు రాముడు. మందస్మితంతో ఇలా అన్నాడు మహర్షితో. "స్వామీ! ఈఅవిద్యకు పుట్టగతులు లేకున్నా, మూడులోకాలను వశపరచుకున్నదికదా? మిథ్యాప్రపంచాన్ని సత్యంగా కనుపరుస్తోందికదా (1) ఈమాయానదియొక్క అంతు ఇంకా తెలుసుకోవలెనని నాకు కోరికగా ఉన్నది. దయచేసి విస్తరించి చెప్పండి. కాక మరోసంశయముకూడా ఉంది నాకు. (2) మహానుభావుడయిన లవణునకు ఏకారణంవల్ల ఇలాగంటి ఆపద సంభవించింది? (3) లక్క కర్రవలె పరస్పరం కలిసిఉన్న దేహాత్మలలో కర్మఫల మనుభవించేది యెవరు? (4) లవణునకు అంతటి ఆపదనిచ్చిన యింద్రజాలకుడు ఏమయినాడు?" అని అన్నాడు రాముడు. ఇందులో నాలుగు ప్రశ్నలు తేలినవి (1) మాయయొక్క స్వరూపం చెప్పమనీ, (2) లవణుడు ఎందువల్ల ఆపదను పొందాడనీ, (3) దేహాత్మలలో కర్మఫలభోక్త యెవ్వడనీ? (4)ఇంద్రజాలికు డేమయినాడనీ- ఈనాల్గింటిలో ముందు మూడవప్రశ్నకు జవాబు చెప్పాచున్నాడు వసిష్ఠుడు. రామా! చిదాభాసతో తాదాత్మ్యమును చెందిన చిత్తమే కర్మఫలమును అనుభవించుచున్నది. దానికే జీవుడనీ, భోక్త అనీ అహంకారమనీ, అనేకపేర్లు ఏర్పడినవి. సుఖదుఃఖములు అజ్ఞానియొక్క చిత్తమునకుగాని జ్ఞానియొక్క చిత్తమునకు గావు. చిత్తము అజ్ఞానావృతమయినంతవరకు దీనికి భ్రాంతులు తప్పవు. భ్రాంతులు కలుగునంతవరకు సుఖదుఃఖములు తప్పవు. జడమగు దేహమునకు దుఃఖముండదు. దేహియగు ఆత్మయే అజ్ఞానమువల్ల సుఖదుఃఖముల నొందును. కాన అజ్ఞానమే సుఖదుఃఖములకు కారణము. అజ్ఞానమువల్ల అవిచారమూ, అవిచారముఫలవ దుఃఖమూ,

కలుగుచుండును. . ఇంటిలోని యజమాని ఆయాపనులయందు వ్యవహారిస్తూ ఉంటాడుకాని యిల్లు వ్యవహరించదు. అలాగే దేహముగల జీవుడు (దేహి) సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడుకాని, దేహము అనుభవించదు. దేహి అనగా చిచ్ఛక్తితో తాదాత్మ్యమును పొందిన చిత్తమేకాని వేరుకాదు. కనుక మనస్సే కర్త, అదే భోక్త అని గ్రహించు. ఈవిషయంలో నీకు లవణుని వృత్తాంతమే ప్రమాణము. విను చెబుతాను. హరిశ్చంద్రునికులంలో బుట్టిన లవణుడు రహస్యంగా కూర్చొని "నాతాత రాజసూయయాగం చేశాడుకదా! ఆకులంలో బుట్టి నేనెందుకు చేయకూడదు? నాకు తగినంత పరికర సామగ్రి లేదు. కనుక నేను మనస్సుతో చేస్తాను" అని ఆలోచించాడు. ఇలా ఆలోచించి అతని మనస్సులోనే సంభారాలను సంకల్పించుకొని యజ్ఞదీక్షను స్వీకరించాడు. ఋత్విక్కులను పిలచాడు. దేవతలను ఆహ్వానించాడు. అగ్నిలో ఆహుతుల నుంచాడు. ఇదంతా మానసికమే. ఇలా మానసికయజ్ఞము ఒక్కసంవత్సరం గడచింది. యజ్ఞం పూర్తిఅయింది. సర్వస్వమూ ఋత్విక్కులకు దక్షిణగా యిచ్చాడు. తరువాత బాహ్యదృష్టిలోకి వచ్చాడు. యజ్ఞమంతా పూర్తిఅయినట్లు సంతోషించాడు. దానిఫలమును అనుభవించాడు. అదే యీచండాలజన్మ. కనుక రామా! కర్తృత్వభోక్తృత్వములు చిత్తానివికాని, దేహానివికావు. చిత్తమే "దేహి," "జీవుడు" అని అనబడుతోంది. కనుక కర్తృత్వభోక్తృత్వములయొక్క ప్రవాహమే మాయానదియొక్క స్వరూపం అని మొదటిప్రశ్నకూడ సమాహితమని యెరుంగుము. కావున ఓబుధజనులారా! ఈమనస్సు అపరిచ్ఛిన్నాత్మవస్తువును ఆశ్రయించినచో మానవుడు పరిపూర్ణుడు కాగలడు. పరిచ్ఛిన్నమయిన దేహాదులను ఆశ్రయించినచో వినాశము నొందగలడు. కనుక దేహాత్మభావంకలవాళ్ళవల్ల లోకంలో ఏమాత్రం ప్రయోజనంలేదు – అన్నారు వశిష్ఠులు.

## ౧౧౬. సాధక జన్మావతారము,

శ్రీరా:– స్వామీ! లవణునకు చండాలజన్మ రాజసూయ యాగఫలమని యెట్లు అనగలరు? అందుకు ప్రమాణ మేమి! కావున

చండాల్రి! ఇంద్రజాలికుడు లవణమహారాజుసభకు వచ్చినప్పుడు నేను అక్కడ ఉన్నాను. ప్రత్యక్షంగా చూచాను ఇదిఅంతా. ఆశాంబరికుడు అంతర్థానమయినతరువాత అచ్చటి సభ్యులూ, లవణుడును, ఈమాయ అంతా ఏమిటని అడిగారు నన్ను. నేను యోగబలంచేత విషయం పూర్తిగా తెలిసికొని ఆసభ్యులకు చెప్పాను. అదే నీకు కూడా చెబుతాను విను. రాజసూయయాగమును చేయువారు పండ్రెండు సంవత్సరములవరకు నానావిధములగు దుఃఖాలను పొందుతారు. లవణునకు దుఃఖమిచ్చుటకు దేవేంద్రునిచే పంపబడిన దేవదూత యీ ఇంద్రజాలకుడు. అతడు ఇతనికి యీ చండాలజన్మయందలి దుఃఖమును (అరవై సంవత్సరములు భ్రాంతిలో పడియుండుటను) ఇచ్చి అంతర్థానమయినాడు. కనుక రామా! ఇదిఅంతా నాకు ప్రత్యక్షము. ఇందులో సందేహమేమీ లేదు. మనస్సే అన్నిపనులకూ కర్త. అన్ని ఫలములకూ భోక్త. దానిని హఠయోగముచే ఒరసి, రాజయోగముచే శోధించి, నిర్వికల్పసమాధిచే లయమొనర్చినచో తత్త్వసాక్షాత్కారంచేత ముక్తిని పొందగలుగుదువు. చిత్తమే అవిద్య. అవిద్యా, చిత్త, జీవ, బుద్ధి, శబ్దములకు అర్థభేదము లేదు. ఇది గుర్తెరిగి చిత్తమును వికల్పరహిత మొనర్చుము. చిత్తమునకునుక బాగా నిర్మలమయితే ఇంక పొందరాని ఫలముండదు. ఈచిత్తమే సర్వవికల్పములను తయారుచేస్తోంది. అట్టి సంకల్పరహితమయితే సర్వమూ బ్రహ్మముగనే గోచరించును. పచ్చికుండలు నీటిలో పెట్టితే ఐక్యము చెందినట్లు దృశ్యప్రపంచం అంతా మనోలయమయినవానికి బ్రహ్మస్వరూపమే అగును. కాని అతిచంచలమయిన మనస్సుకు ఈలయావస్థ సంభవించదని నీకు సందేహము కలుగవచ్చును. విను అందుకు సమాధానం చెబుతాను. సాత్విక, రాజస, తామస, భేదములచే సృష్టి మూడు రకములు. ఈ మూడురకములసృష్టి హిరణ్యగర్భునివల్ల జరుగుతోంది. హిరణ్యగర్భుడనగా సమష్టిమనస్తత్త్వము ఇదే సృష్టికి మూలకారణం. ఇదే కల్పాంతంలో లయిస్తోంది. అట్టిస్థితిలో దీనికార్యములయిన వ్యష్టిమనస్తత్వములు లయించుటలో ఆశ్చర్యంలేదు కాని మన ప్రయత్నముమాత్రం అవసరము. కనుక చంచలమయిన మనస్తత్త్వము లయించుటెట్లను సంశయము నీకు అనవసరము. ఈ జీవో

సాధులన్నీ ప్రళయకాలంలో అవ్యాకృతాకాశంలో లీనమైఉంటుంది, క్రమంగా భూతతన్మాత్రరూపంగా వ్యక్తమై తుదకు తల్లిగర్భమున ప్రవేశించి, పురుషులై పుట్టి,కర్మజ్ఞానములకు అధికారి యగుచున్నవి. అట్టి పురుషుడు, చిన్నతనమునుంచీ తత్త్వవేత్తలగు గురువుల నాశ్రయించవలెను. క్రమంగా సాధనసంపత్తిని సంపాదించుకొని తత్త్వజ్ఞానమును పొంది, ముక్తిని పొందవలెను. ఈరీతిగ వివేకసంపన్నుడగువానికి క్రమంగా సప్తభూమికలు సంప్రాప్తమగును. అన్నారు వశిష్ఠులు.

## ౧౧౩. అజ్ఞానభూమికావర్ణనము.

శ్రీరా:- స్వామీ! సప్తభూమికలు యేవి? (యోగభూమికలు) సంగ్రహంగా చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు. వశిష్ఠుడు జ్ఞానభూమికలతోపాటు అజ్ఞానభూమికలనుగూడ చెప్పదలచాడు. అజ్ఞానభూమికలను తెలిసికొంటేకాని జ్ఞానభూమికలు తెలియవనుకున్నాడు. ముందు అజ్ఞానభూమికలను వివరిస్తున్నాడు వశిష్ఠుడు. రామా! అజ్ఞానభూమికలు జ్ఞానభూమికలు, అని, భూమికలు రెండువిధములు. ఈ రెంటికి వేరువేరు కారణాలు ఉన్నవి. క్రమంగా చెబుతా విను. తన ఇచ్ఛ వచ్చినట్లు ప్రవర్తించడమనే పురుషప్రయత్నమూ, విషయభోగము లందుదృఢమయిన అనురాగరూపమయిన అభినివేశమూ ఈ రెండునూ అజ్ఞానభూమికలు స్థిరపడటానికి ప్రధానహేతువులు. శాస్త్రీయమయిన సాధనచతుష్టయ సంపత్తితో శ్రవణమననాదిప్రయత్నమూ, దృఢమయిన ముముక్షుత్వమూ, ఈ రెండునూ, జ్ఞానభూమికలు స్థిరపడుటకు అసాధారణమైన హేతువులు. అధిష్ఠానబ్రహ్మసత్తాధీనమయిన స్వసత్త (తనయొక్క ఉనికి) అనునది ఈ రెంటికీ సాధారణమయిన కారణము. ఈ కారణాలవల్ల ఈ రెండుభూమికలూ తమతమ పనులను నెరవేర్చుకొంటవి. ఒకటి సంసారదుఃఖమును పెంచుతుంది. రెండవది ముక్తిని ఇస్తుంది. ఇందులో అజ్ఞానభూమికలు, దుఃఖబహుళములయిన అధోలోకములవంటివి. సుఖతారతమ్యముగల ఊర్ధ్వలోకములవంటివి జ్ఞానభూమికలు. ఈ రెండుభూమికలలో ముందు అజ్ఞానభూమికలను

చెబుతాను. తరువాత జ్ఞానభూమికలనుగూర్చి తెలిసికొందువు. శుద్ధ సన్మాత్రచైతన్యరూపమునుండి దిగజారని వారును, రాగద్వేషాది రహితులును జ్ఞానులు. వీరు - అజ్ఞానభూమికలలోకి రారు. స్వస్వరూపమునుండి దిగజారి చైతన్యము విషయాభిముఖ మగుటయే గొప్ప మోహము (అవివేకము). ఇంతటిమోహము మరొకటి లేదు. ఉండబోదు. చిత్తమునందు ఒకవిషయమును మననంచేసి అదిమానుకొని, మరొకవిషయమునుమననము చేయకముం దుండు స్థితియే స్వరూపస్థితి. ఏవిషయమును మననంచేయని స్థితియే స్వరూపస్థితి. అన్ని సంకల్పములు అడుగంటి జాడ్యనిద్రలు రెండూ కాక నశించి రాతియొక్క మధ్యభాగంవలె నుండు స్థితియే స్వరూపస్థితి. జడముకానిదీ, స్వప్రకాశమయినదీ అగు చైతన్యమే స్వస్వరూపస్థితి. అట్టి చైతన్యమునందు అనాదినుండి అధ్యస్థమైఉన్నది అజ్ఞానము. దాని భూమికలు (అవస్థలు) చెబుతా విను. (1) బీజజాగ్రత్తు (2)జాగ్రత్తు (3)మహాజాగ్రత్తు, (4) జాగ్రత్స్వప్నము, (5) స్వప్నము, (6) స్వప్నజాగ్రత్తు, (7) సుషుప్తము అని ఏడువిధములు అజ్ఞానము, ఇవి యొకదానితో మరొకటి కలసి అనేకరూపములగును. (1) మాయాశబలచైతన్యము యొక్క మొట్టమొదటి ఆభాసరూపము బీజజాగ్రత్తు అనబడును. (ఇది ముందుజాగ్రదవస్థకు కారణముకనుక బీజజాగ్రత్తు అనబడుచున్నది ) ఇది సమష్టిలో సృష్ట్యాదియందునూ, వ్యష్టిలో జాగ్రదవస్థయొక్క ప్రారంభమందునూ ఉండును. ఇదియే శుద్ధచైతన్యమునకు ఒక నూతనావస్థ. (2) "ఈ స్థూలదేహమే నేను" "దీనితో అనుభవింపదగిన భోగ్యజాతము నాది" అను ప్రత్యయము (జ్ఞానము) జాగ్రత్తు. (3) "దేహమే నేను" "ఇవి నావి" అను జాగ్రత్ప్రత్యయములు జన్మాంతరాభ్యాసపాటవమువలన దృఢపడిఉంటే అది మహాజాగ్రత్తు అనబడును. (అదెట్లన బ్రాహ్మణాదిజన్మ సాధారణమయిననూ కొందరకుమాత్రమే బ్రాహ్మణాదిక్రియలలో దృఢమయిన అభినివేశము ఉంటుంది. అందరకు నుండదు. అట్లు దృఢాభినివేశము గల ప్రత్యయమే మహాజాగ్రత్తు (4) అభ్యాసములేనందునగాని, దృఢమయిన అభ్యాసములేనందునగాని, జాగ్రద్దశయందుండు మనోరాజ్యమే జాగ్రత్స్వప్నము (ద్విచంద్రభ్రాంతి, శుక్తిరూప్యభ్రాంతి,

మృగతృష్ణికాభ్రాంతి-మున్నగునవి జాగ్రత్స్వప్నంలోని భేదములు) (5) నిద్రలోకాని, నిద్రామధ్యమునగాని, నిద్రాంతమునగాని కలిగెడి ప్రత్యయము స్వప్నము. (ఈయది స్థూలశరీరంలో కంఠముమొదలు హృదయమువరకు నుండు భాగములో కలుగును.) (6) దృఢాభిమానముపలనగాని, చిరకాల ముండునను కల్పనవల్లగాని, నిరూఢమయిన స్వప్నప్రత్యయము స్వప్నజాగ్రత్తు అనబడును. (హరిశ్చంద్రునకు కలిగిన ఒక్క-రాత్రి పన్నెండు సంవత్సరములను జ్ఞానము ఇందుకుదాహరణము. ఇది దేహము నశించినను, నశింపకున్ననూ కలుగును.) (7) ఈ ఆరు అవస్థలను విడచి, ముందు అనుభవింపబోవు దుఃఖములకు కారణమయిన కర్మవాసనతోకూడిన స్థితియే సుషుప్తము. (పై ఆరుఅవస్థలును కర్మఫలభోగభూములుకనుక కర్మజములు. (ఈ సుషుప్తి అనేది పూర్వకర్మలన్నీ భోగముచే నశించగా. ఉత్తరకర్మలు యింకా పుట్టని మధ్యకాలంలో నుండు స్థితి. స్థూల సూక్ష్మ ప్రపంచము లయించగా, అజ్ఞానముమాత్రమే మిగిలియుండి తదుపహితమగు ఆత్మమాత్రము మిగిలిన స్థితియని అర్థము.) ఈయవస్థలో జీవుడు తృణ, లోష్ఠ, కాష్ఠాదులవలె జడరూపముగ నుండును. రామా! ఈయేడునూ, అజ్ఞానభూమికలు. వీనిని దెల్పితిని. ఇవి అన్నియు పరస్పరము ఒకదానితో నొకటి కలసి అనేకవిధము లగుచున్నవి. నీవు ఆత్మవిచారం చేసి, తత్త్వజ్ఞానమును సంపాదించుకొని ఆత్మసాక్షాత్కారమును పొందితివేని వీటిని (అజ్ఞానభూమికలను) దాటినవాడ వగుదువు.

## ౧౧౮. జ్ఞానభూమికోపదేశము.

ఇక జ్ఞానభూమికలను జెప్పెద వినుము. ఇవికూడ పలువిధములు - మోక్షప్రదములు - నా కత్యంతప్రియములు. ఇవి అజ్ఞాననివర్తకములయినందున జ్ఞానరూపములు. వీనికి ఆవలిది ముక్తి. అది జ్ఞేయము. (ఈమాట ఔపచారికముకాని యథార్థముకాదు. బ్రహ్మస్వరూపమయిన ముక్తి జ్ఞేయము కానేరదు). సచ్చిదానందస్వరూప జ్ఞానమూ, మోక్షమూ ఈరెండునూ పర్యాయపదములు. ఈజ్ఞానముగల జీవునకు పునర్జన్మ లేదు. (1) శుభేచ్ఛ. (2) విచారణ. (3)తను

మానస. (4) సత్త్వాపత్తి. (5) అసంసక్తి. (6) పదార్థాభావన. (7) తుర్యగ-అని జ్ఞానభూమికలు ఏడు. రామా! విను వీనిలక్షణము- 1. "నేనింకనూ మూఢునిగానే ఉంటిని" "శాస్త్రవిచారణ చేసెదను" "సజ్జనసాంగత్య మాచరింతును" అను వైరాగ్యపూర్వకమయినకోరిక శుభేచ్ఛ. 2. శాస్త్రాభ్యాసమూ, సజ్జనసాంగత్యమూ, వైరాగ్యములతోఁగూడిన, శ్రవణమననాదులందలి ప్రవృత్తి విచారణ - 3. పై రెంటివలన విషయములందు కలిగెడి అరతి (అనాసక్తి) తనుమానస - 4. పై మూడుభూమికలను అభ్యసించినందున సర్వాధిష్ఠాన సన్మాత్ర పరమాత్మయందు కలిగిన నిర్వికల్పక సమాధి రూపమగు స్థితి సత్త్వాపత్తి - 5. పై నాల్గుభూమికలను బాగా అభ్యసించుటచేత బాహ్యావిషయములందు చిత్తము ఏమాత్రము అంటక, నిరతిశయానంద బ్రహ్మాత్మభావనచే ఆత్మసాక్షాత్కారము కలిగియుండుట అసంసక్తి (ఈభూమికలోకి వచ్చినవాడు బ్రహ్మవిద్వరుడు). పై అయిదుభూమికలను బాగా అభ్యసించుటచేతనూ, ఆత్మారాముడుగానుండుటవలననూ, బాహ్యపదార్థములను భావింపకుండుటవలననూ, పరప్రేరణచేఁతన్మాత్రముగ పదార్థమునుభావించుట పదార్థాభావన- 7. పై ఆరుభూమికలను అభ్యసించుటచే భేదభావము నశించి, స్వస్వరూపమునం దుండిపోవుట తుర్యగము. ఈయది జీవన్ముక్తులలో తురీయావస్థ - దీనికి ఆవలది విదేహకైవల్యావస్థ. రామా, ఏడవ భూమికలోకి వచ్చిన మహానుభావులు గొప్పపదవిని పొందుదురు. జీవన్ముక్తులు సుఖదుఃఖాదులందు ఆసక్తులుకారు. ఆరవభూమికలోని వారు దేహరక్షణకు ఏదేని చేయుచుందురు. ఏడవభూమికలోనివారు మాత్రము అట్లు చేయరు- పరప్రబోధమువలన వర్ణాశ్రమధర్మములను మాత్రము అనాసక్తులై ఆచరింతురు. యథేష్టాచరణపరులు కారు. 'విదితబ్రహ్మతత్త్వస్య యథేష్టాచరణం యది। శునాం తత్త్వవిదాం చైవ కో భేదోఽశుచిభక్షణే॥' బ్రహ్మవేత్తలకు యథేచ్ఛాచరణము ఉండునెడల, అపరిశుద్ధాహారమును భక్షించుటలో కుక్కలకూ వీరికీ భేదమేమి? ఆత్మారాములగు వీరిని జగద్వ్యాపారములేవియు సుఖపరుపజాలవు. ఈ యేడుభూమికలును, బుద్ధిమంతులగు మానవులకే అబ్బునుగాని, పశుపక్షిస్థావరాదులకును, దేహాత్మభావముగల మ్లేచ్ఛా

దులకును అబ్బుట దుర్ఘటము. ఒకవేళ పశుమ్లేచ్ఛాదులుకూడ ఇలాంటి జ్ఞానదశను పొందినచో, వారు సదేహులయినా, విదేహు లయినా ముక్తినిపొందుదురనుటకు సందియములేదు. (ఇందుకుపశువు లలో హనుమదాదులును, మ్లేచ్ఛులలో ధర్మవ్యాధాదులును, ఆది పదముచే ప్రహ్లాద కర్కటీప్రభృతులగు అసురులునూ, ఉదాహర ణముగ గ్రహింపదగుదురు). ఇందులో కొందరు ఒకేజన్మయందు క్రమంగా అన్నిభూమికలయందును ఉందురు. కొందరు రెండు మూడు భూమికలయందుమాత్రమే ఉందురు. మరికొందరు ఆరు భూమికలందు ఉందురు. మరికొందరు (సనకాదులు) ఏడవభూమిక యందొక్కదానియందే ఉందురు. కొందరు మూటిని, కొందరు నాల్గింటిని, మరికొందరు రెంటిని, కొందరు నాల్గవవంతు భూమికను, కొందరు సగముభూమికను, కొందరు మూడువంతుల భూమికను పొందగల్గుదురు. ఈభూమికలను పొంది అంతశ్శత్రువులను జయించు వారే సర్వోత్తములు – ఆత్మప్రాప్తికలవానికి మిగిలినప్రపంచసుఖ మంతయు తృణప్రాయముగ నుండును – కనుక జ్ఞానభూమికలను పొంది ఆత్మజ్ఞానముచే నిరతిశయానందమును పొందుటయే ఉత్తమ పురుషార్థము.

## ౧౧౯. సువర్ణోర్మ్యుపదేశము

(బంగారు ఉంగరమును దృష్టాంతముగ ఉపదేశించుట)

కాని,బంగారము తననిజరూపమును మరచి,తాను ఉంగరమను బుద్ధిని కల్పించుకొని నేను బంగారముకాదని యేడ్చినట్లు, ఆత్మ తన నిజరూపమును (చిదానందరూపమును) మరచి, అహంకారమును కల్పించుకొని, దానిచే దుఃఖించుచున్నాడు – అన్నారు వసిష్ఠులు. స్వామీ? బంగారమునకు ఉంగర మను బుద్ధి ఎట్లు కలిగినది? ఆత్మకు అహం (నేను) అను బుద్ధి యెట్లు కలిగినది? చెప్పండి అని అడిగాడు శ్రీరాముడు.

వశి:– రామా! నిజంగా ఉన్నదానియొక్క ఉత్పత్తినాశము లను అడుగవచ్చునుగాని, లేనిదాని చావుపుట్టుకలనుగూర్చి అడుగ

రాదు - అహంతా ఊర్మికాత్వములు ఉన్నవికావు. వాటినిగూర్చి అడుగరాదు - బంగారమునుగాని, బంగారుఉంగరమునుగాని ఖరీదు కిమ్మని (అమ్మమని) మధ్యస్థుడు అమ్మువానితో అనగా, ఉంగరము గల విక్రేత (అమ్మువాడు) ఎక్కువ ఖరీదు తీసికొని దేనిని ఇచ్చు చున్నాడో అది పరమార్థంలో ఉన్నది. ఉంగరమును అమ్మిననూ, అమ్మువాడు బంగారమునకు సరియయినవెల పుచ్చుకొనుచున్నాడు కాని, ఉంగరముకదా అని తక్కువఖరీదుపుచ్చుకొనుట లేదు. ఉంగర రూపముకాని బంగారమును అమ్మినను అదేఖరీదు పుచ్చుకొను చున్నాడు. కనుక ఉంగరంలో నిజంగా ఉన్నది బంగారమేకాని మరొకటికాదు. కనుక బంగారమే నిజమయినది. ఉంగరము కల్పి తము. ఇందులో సందేహంలేదు. అలాగే అహంకారాదులందు కూడ నిజంగాఉన్నది బ్రహ్మమేకాని వేరువస్తువుకాదు. ఆబ్రహ్మ పదార్థమే సర్వవ్యవహారములందును గోచరమగుచున్నది. అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరా :- మహర్షీ! క్రియవిక్రియాదివ్యవహారములందు బంగా రమే విషయమయ్యేయెడల, ఊర్మికాదులందు (ఉంగరము మొదలగు వానియందు) బంగారముకంటె అతిరిక్తమయిన స్వరూప మేమి కలదు? అది యెట్లుండును? దేనిని మనము ఉంగర మనుచున్నాము? సెలవివ్వండి. ఈ నిదర్శనంచేత బ్రహ్మతత్త్వాన్నికూడా నిర్ణయిం చుకుంటాను - అని అడిగాడు శ్రీరాముడు.

వశి:- రామచంద్రా ! గొడ్డురాలిబిడ్డయొక్క ఆకారం ఎలా ఉంటుందో, వానిగుణాలు ఎలాఉంటాయో నీవుచెప్పు? చూతాం - ఏమీ చెప్పలేవు. అలాగే ఊర్మికాత్వముకూడ భ్రాంతి, మిథ్య, మాయ. అవిచారకాలమందు ఉండుటయే మాయయొక్కరూపం. దీనిని నీవు విచారకాలంలో అడిగితే నేనేమిచెప్పేది? ఎండమావుల నీటియందునూ, ద్విచంద్రాదులందునూ, అహంతాదులందునూ. శుక్తిరజతాదులందునూ, ఉన్నరూపం ఇలాంటిదే. ( అజ్ఞానదశలో భాసించడమే) కనుక లేనివస్తువే తత్త్వము తెలియనికారణంచేత ఉన్నదానివలె గోచరించును, వస్తువుఉండనీ, లేకపోనీ, హృదయ

ములో నిరూఢమయితే అది అలాగే పనిచేస్తుంది. అమృతభావన చేత విషంకూడా అమృతముయొక్క పనిని చేస్తుంది. కనుక ప్రపంచమంతా మాయ. లేనిదానిని ఉన్నట్లు కనుపరచడమే దీనిపని. లేని అహంతాదులను ఆత్మయందు కల్పించుచున్నది. బంగారమునందు అంగుళీయత్వము లేదు. ఆత్మయందు అహంకారాదులు లేవు రామా! ప్రపంచంలో, సనాతనత్వము, కాని, బ్రహ్మత్వముకాని, బ్రహ్మాండత్వముకాని, ప్రజాపతిత్వముకాని, లోకాంతరములుకాని, స్వర్గాదులుకాని మేరుత్వముకాని, అసురత్వముకాని, మహాభూతత్వముకాని. భావాభావవస్తుత్వముకాని, త్వత్తాఽహంతా ఆత్మతా సత్తా అసత్తులుకాని, భేదకల్పనకాని, రాగముకాని, రంజన (ఆసక్తి) కాని ఏవీలేవు - సర్వము శాంతము, నిరాలంబము, సత్తామాత్ర స్వరూపము, శాశ్వతము, శివము, అనామయము, మనోవాగతీతము, శూన్యముకంటె శూన్యము, సుఖముకంటె సుఖము, అగు బ్రహ్మ మొక్కటే ప్రపంచంలో పరమార్థస్వరూపము అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ సర్వవ్యాపకమయిన బ్రహ్మతత్త్వము నాకు తెలిసినది. కాని జ్ఞానంచేత అజ్ఞానంనశిస్తే దానివల్ల పుట్టిన ప్రపంచంకూడా నశించిందికదా! మరల ఈప్రపంచం ఎలా కనిపిస్తోందో చెప్పండి? అని అడిగాడు శ్రీరాముడు.

వశి:- రామా! బ్రహ్మకంటె వేరుగ సృష్టి అనేది లేదు. మహాసముద్రమే జలము - సముద్రముకంటె జలము వేరుగ లేదు - కనుక సృష్టిఅనేది పరమాత్మకు పేరేకాని, పరమాత్మస్వరూపము కంటె భిన్నంగా సృష్టిఅనేదిలేదు. చిత్తము శాంతించినచో (లయించినచో) సృష్టిఅంతా పరబ్రహ్మరూపమే అగును. అభిమానముతో కూడిన చిత్తమే యీసృష్టిభ్రాంతి. శిల్పియొక్క నేర్పుచే తయారు చేయబడిన మట్టిసైన్యము నిజంలో మట్టియే అయిననూ, సైన్యరూపంగా కనిపించినట్లు, బ్రహ్మకంటె భిన్నముకాని యీప్రపంచము, జ్ఞానికిగూడ వ్యుత్థానకాలంలో భిన్నంగా గోచరిస్తుంది - కనుక రామా? నీకు కనిపించె ఋూపప్రపంచము బ్రహ్మమేకాని

బ్రహ్మకంటె వేరుకాదు – ఇతనికిదూరము దగ్గర అనునవి లేవు. అద్దంలో ప్రతిఫలించిన నగరమునందు, దూరత్వసామీప్యములు రెండూ ఉన్నట్లు పరిపూర్ణమయినబ్రహ్మయందుగూడ ఈరెండూ కలవు – కాబట్టి ద్విచంద్రభ్రాంతివలె భాసించెడి యీసృష్టి ఏమాత్రమూ సత్యముకాదు – ఇది బ్రహ్మవిచారమనే అగ్నిచే ఎంత వరకుసమూలముతగలపడదో అంతవరకు అధికముగా చిగుర్చుచునే యుండును. కాన బ్రహ్మవిచారము అవిద్యాలతానాశమునకు అత్యంతావశ్యకము.

## ౧౭౦. చండాలీ శోచనము.

రామా! మిథ్యాభూతమైన అవిద్యయొక్క మహిమ ఇంకా చెబుతా విను – ఎలాఉంటుందో – లవణుడను రాజు అంతటిభ్రమను అనుభవించి మరునాడే మళ్ళీ ఆఅరణ్యానికి పోదలచాడు. మనస్సులో ఇలా అనుకున్నాడు. నేను ఘోరదుఃఖమును అనుభవించిన అరణ్యము నాకిపుడు మరల తలపుకు వచ్చుచున్నది. ఆదుఃఖము నామదిలో నాటిఉన్నది. ఇప్పుడు మళ్ళీ వింధ్యాద్రికి బోయినచో వెనుకటిచిత్తాదర్శంలోని ఆచోటు లభించునేమో" అని తలచాడు. తుదకుపోవ నిశ్చయించుకొన్నాడు – మంత్రులతోకూడ బయలుదేరాడు. దిగ్విజయయాత్రకుపోవువానివలె దక్షిణమార్గమున వింధ్యాద్రిని చేరాడు. తూర్పు, దక్షిణ, పడమటి సముద్రముల ప్రాంతమునంతయు సంచరించాడు. అంత నొకచోట మహాభీకరమైన అరణ్యమును చూచాడు. అక్కడ తిరుగుచూ వెనుకటి విషయములన్నింటినీ అడిగి తెలుసుకొన్నాడు – ఆశ్చర్యపోయాడు. అచ్చటి చండాలులను గుర్తించాడు – బోయలను గుర్తించాడు. ఇలా తిరుగుచూ తిరుగుచూ, వెనుక తాను చండాలుడయినట్లు భ్రమచెందిన గ్రామం చేరాడు. వెనుక తాను చూచిన మనుజులను, స్త్రీలను, ఆకుటీరములను చూచాడు. తాను వెనుకచూచిన తోటలు దొడ్లు చెట్లు చామలను అన్నీ తిలకించాడు. అచ్చట తన అత్తయగు ముసలిచండాల స్త్రీ ఏడ్చుచుండగా చూచాడు. దానిచుట్టూ మరికొంత ముసలి ఆడవారు ఏడుస్తూ ఉన్నారు. క్షామబాధచే నశించిన తనబంధువుల

గూర్చి ఆ_ర్తనాదములతో దుఃఖములను తలపోయుచున్నారు. అక్కడ తన అ_త్త, కూతురునుగూర్చి, అల్లునిగూర్చి, పలువిధములదుఃఖిస్తోంది. ఆయేడుపును సావధానంగా విన్నాడు రాజు (లవణుడు) - ఆముసలి దానిదొద్దకు వెళ్ళి "నీవు ఎవతెవు? నీకూతు రెవరు? నీకొడు కెవరు? నీఅల్లు డెవరు? అని అడిగాడు. ఆముసలిది (ఈతనిఅ_త్త) ఇలా బదులుచెప్పింది - కన్నీరుకారుస్తూ - "రాజా! ఇక్కడ పుష్కస ఘోషమనే గ్రామం ఒక్కటి ఉన్నది. అందులో పుష్కసు డను వాడు నాభ_ర్త - మాయిద్దరకు చంద్రసమానయగు ఆడపిల్లఉండేది. ఆకన్నియ దైవయోగంవల్ల యిచ్చటకు దయచేసిన రాజును ఒకనిని వివాహమాడినది - చిరకాలము ఆపె భ_ర్తతో సుఖమును అనుభ వించినది. ఆరాజువల్ల సంతానమును కన్నది. ఈఅడవిలోనే చెట్టుకు పాకిన సారతీగవలె వృద్ధిపొందినది.

౧౨౧.

చం. స్త్రీ॥ మహారాజా! ఇట్లుండ కొంతకాలానికి ఆగ్రామంలో అతిభయంకరమైన క్షామంతటస్థించినది అనావృష్టిదోషంచేత - ఆదుఃఖాన్ని భరించలేక గ్రామంలోనివారంతా ఎచ్చటికో పోయి తుదకు మరణించారు. ఆకారణంచేత బంధువియోగమును చెందిన మేము ఇలాదుఃఖిస్తున్నాము. అని అన్నది చండాలస్త్రీ - దానినోటి నుండి విషయం అంతావిని ఆశ్చర్యపోయి మంత్రులముఖం చూచి నిశ్చేష్టుడయినాడు రాజు - అత్యాశ్చర్యమయిన ఈవృత్తాంతమును గూర్చి మాటికి పలుమార్లు అడిగితెలుసుకున్నాడు. తుదకు ఆమాదిగ స్త్రీలకు దానసన్మానములు చేశాడు. ఓదార్చాడు - చాలకాలం అక్కడఉన్నాడు. దైవగతి ఇంత విచిత్రంగా ఉంటుందికదా? అని విమర్శించుకున్నాడు. ఊరుచేరాడు. పౌరులచే స్తుతించబడుచూ ఇల్లుచేరాడు. మరునాడుప్రొద్దున సభాస్థానంలో "మునీంద్రా! నాకు కలఅంతా నిజమయినదే ఏమి ఈఆశ్చర్యము?" అని ఆశ్చర్యచకితుడై నన్నుఅడిగాడు - నేనతనికి తగుసమాధానమును చెప్పి అతనిసంశ యము తీర్చాను - కనుక రామచంద్రా! అవిద్య అనునది యింతటి భ్రమలను కలుగుజేస్తుంది. లేనిదానిని ఉన్నట్లునూ, ఉన్నదానిని లేనట్లునూ చేయుప్రజ్ఞ దానికున్నది - అని అన్నారు వసిష్ఠులు.

శ్రీరా॥ స్వామీ! ఇదేమి? కల్పనా నిజమయింది? చాలా ఆశ్చ ర్యముగ నున్నదే! నాకు నమ్మిక చిక్కటలేదే మీమాటలలో. అన్నాడు శ్రీరాముడు.

వశి :- రామచంద్రా! ఇందులో నీవు ఆశ్చర్యపడవలసిన పని లేదు. అవిద్య ఎంతటిపనిని అయినా చేస్తుంది. స్వప్నసంభ్రమంలో గుడ్డ కుండగా కనిపిస్తుంది. కుండ గుడ్డగా కనిపిస్తుంది. దూరం దగ్గర అవుతుంది. దగ్గర దూరం అవుతుంది. చిరం శీఘ్రమవుతుంది. అసత్తు సత్తు అవుతుంది. సత్తు అసత్తు అవుతుంది. అసంభవం సంభవ మవుతుంది. సంభవం అసంభవం అవుతుంది. స్థిరంగా ఉన్నది చలి స్తుంది. పదార్థం సత్యమైనా, శూన్యమయినా అవిద్యావాసన ఎట్లా ఉంటే, అలా చప్పున అనుభవంలోకి వస్తుంది. కనుక అవిద్యయొక్క మహిమ చెప్పనలవికాదు. ఇట్టి అవిద్యతోకూడనే ఆదిమధ్యాంత ములులేని భ్రమలు అనంతములుగా పెరుగుచున్నవి. భ్రమయనగా ప్రతిభాస (అనగా లేనిది ఉన్నట్లు కనిపించుట). దీనివల్లనే పదార్థ ములన్నీ పరిణమించుతూన్నవి. క్షణము కల్పముగానూ, కల్పము క్షణముగానూ అగుచున్నది. విపరీతబుద్ధిగలవాడు తనను మేకగా భావిస్తాడు. అవిద్యవల్ల మేక సింహంగా తోస్తుంది. అవిద్య, మోహము, అహంతా, ఈ మూడును ఒకే తరగతిలోనివి. చిత్త విపర్యాసమునకు సమాన హేతువులు. లోకంలో అన్నీ కల్పితములే అయినా, ప్రమాణాంతర సంవాదమున్నప్పుడు సత్యములనీ, అది లేన పుడు మిథ్యాభూతములనీ వ్యవహరిస్తున్నారు లోకులు. ఒకానొక రాజునకు చండాలకన్యావివాహము జరిగినది. ఆ వృత్తాంతము ఈ లవణునియొక్క మనస్సులో భాసించినది - అనుభవించినదానిని మరచినట్లు అనుభవించనిదానినికూడ స్మరించవచ్చును. లవణునకు ఈవృత్తాంతము భ్రాంతిసిద్ధమయిన అనుభవమే కాని, స్మృతికాదు. అయిననూ స్మృత్యనుభవములకు భేదము కల్పనామాత్రమే కాని విమర్శకు నిలవదు. లేక ఈ చండాలీవివాహోదంతము లవణుని యొక్క మనస్సునందునూ, ఆపుష్కసుని చిత్తమునందునూ ఒకే తూటు ప్రతిభాసించవచ్చును. ఒకానొక సమస్యనుగూర్చి అడిగిన

వాని యభిప్రాయమును ఊహించి పద్యమును అల్లుటలో ఒకానొక్క పుడు అనేకమంది కవులకు శబ్దమువలనను, అర్థమువలనను సమాన మయిన మాటలు పడవచ్చును. అలాగే ఒకేరకమయిన భ్రాంతి యిద్దరి చిత్తమునందు ఒకేదభా కలుగవచ్చును. ప్రపంచము అవిద్యక మయినంతమాత్రమున అత్యంతాసత్తు అని భయపడరాదు. అధిష్ఠాన సత్తుకంటె వేరుసత్తాకలది కాదనియే గ్రహించవలెను. నిజంలో ఈ అవిద్య అనేదికూడ బ్రహ్మకంటె వేరుగలేదు. కటకమునందు బంగా రముకంటె వేరువస్తువు ఉన్నదా లేదు– అట్లుండుటకుకూడ వీలులేదు. అట్లుండుటకు అవిద్యా ఆత్మలకు సంబంధమును చెప్పవలెను. అది కుదరదు. సదృశమయిన వాటికి సంబంధముండునుగాని అసదృశము లకు సంబంధము కుదరదు. అవిద్యాత్మలు రెండూ అసదృశములు అయితే పార్థివత్వ ద్రవత్వములచే అసదృశములయిన జతుకాష్ఠము లకు (లక్క– కర్రలకు) సంబంధమున్నదికదా ? అని అడుగవచ్చును. ఆ దృష్టాంతము సరిపోదు. అవి రెండునూ అవిద్యకములు. అవిద్య కము లను ధర్మములో రెండూ సమానములేకాని అసమానములు కావు. దార్ష్టాంతికమందుగూడ అవిద్య చిదధిష్ఠానకమే కనుక చిన్మయమే యని, రెంటికి సామ్యము చెప్పేయెడల అపుడు ప్రపంచ మంతా అధిష్ఠానమయిన ప్రకాశ చిన్మాత్రరూపంగా భాసించ వలెను గాని, వేరేచైతన్య సంబంధమువల్ల భాసించుటకు వీలులేదు. కనుక ప్రపంచం అంతా అఖండ స్వప్రకాశ బ్రహ్మాత్మమేకాని వేరు కాదు. కొందరు మూఢులు చిచ్చైత్యములు రెండూకలసి దృశ్య ముగా భాసించుచున్నవని యందురు. ఆరెండును కలియుటకు సంబం ధము అభేదమా ? భేదమా ? అనునది వారు నిరూపించలేరు. విలక్షణములయిన చిజ్జడములకు అభేదసంబంధము అసంభవము. ఇట్లే భేదసంబంధముకూడ కుదరదు. చిజ్జడములు రెండును ఒక చిత్రవు నందు కలిసి ఎక్కడా లేవు. ఇక చిన్మయములుకనుక చిత్తుతో సంబంధము కలవని యన్నను, అపుడు చిద్రూపములుగా భాసించ వలెగాని, దృశ్య ( వేద్య ) రూపములుగా భాసింప వీలులేదు. దారు పాషాణ మృదాదులు జడములయిననూ ఈమొత్తము కలసి ఒక యింటిలో చేరి యిల్లు అను వ్యవహారమును పొందుచున్నవి. అలాగే

చిదంశంలో సామ్యమున్నందున దృక్కునకు దృశ్యముతో సంబంధము ఉండుగాక అని యందురు. అదీ పొసగదు. దారుపాషాణాదులు పరిణామిపదార్థములు. చిత్తు పరిణామికాదు. అందువల్ల దార్వాదుల దృష్టాంతము ఇట చెల్లదు. - కనుక జడచేతనములకు సంబంధ మనునది యేపక్షమందును కుదరదు. కనుక చిత్తుయే ఉపలకుడ్యాది రూపము కలదగుచు పరమార్థంలో అభిన్నమయినది - దీనియందు ద్రిష్టృదృశ్యాది భేదముమాత్రము భ్రాంతి. కనుక తత్త్వవేత్తలలో అగ్రేసరుడవగు రామచంద్రా! ప్రపంచమంతా సన్మాత్రమని యెరుంగుము - ఇది గ్రహించలేనివాడు అనేకలక్షల భ్రాంతులకు లోనగుచున్నాడు. ఇది అద్వైతన్యముయొక్క చమత్కారము. దృగ్దర్శన మనుబుద్ధి పోతే అవిద్య అనునది లేదు. మృత్తికాసైన్యమంతా మృత్తు. తరంగబాష్పాదులన్నీ జలమాత్రము. కొయ్యబొమ్మలన్నీ కొయ్య. - ఘటశరావాదులన్నీ మృణ్మాత్రము. త్రిజగద్భ్రాంతి అంతా బ్రహ్మమాత్రము కాబట్టి, రామా! నీవు చిదేకఘనుడవగుము. ఈ ప్రపంచంలో ఎనడికీ ఏదీ ఫుట్టింది లేదు-చచ్చిందీ లేదు. కనుక స్వస్థముగా నుండుట మంచిది. ఇంద్రియవృత్తులకు లోబడకూడదు. రాబోవుదానియందు చిత్తమునకు ఎట్లు ఆసక్తి ఉండదో అంతే వర్తమానమగు దానియందుగూడ మిథ్యాత్వదృష్టిచే అనాసక్తితో నుండవలెను. నీ చిత్తమును నీవు దూరదేశము వెళ్ళిన మనుష్యుడుగ తలచుము - కొయ్యవలె రాయివలె తలంచుము. రాతిలో నీరు లేదు. నీటిలో నిప్పు లేదు. జీవాత్మయందు చిత్తములేదు. ఇంక పరమాత్మయం దదెట్లుండును? చిత్తమే లేనిదయితే చిత్తకార్యములు లేవని వేరుగచెప్పనేల? పరిశుద్ధమయిన ఆత్మకు అశుద్ధమగు చిత్తమును అనుసరించుట ఉచితముకాదు. అతిహేయము. శ్రోత్రియులకు మ్లేచ్ఛుల ననుసరించుట తగదు. కనుక చిత్తమనే మాలవానిని ఫూర్తిగా విడిచిన నీవు స్వస్వరూపమునం దుండుము. మట్టితో తయారుచేసిన బొమ్మవలె స్వస్థముగా నుండుము. చిత్తము లేదనుకొనుట ముఖ్యపక్షము. అది మిథ్యయనుకొనుట రెండవపక్షము (గౌణపక్షము). ఆత్మవిచారణ చేసినచో చిత్తమనేది లేదు. లేని ఘోరమైన యీ చిత్తమనే దయ్యముచే ఎవరు స్వాధీనపరచుకొనబడిరో

వార్లకు చంద్రునివల్ల పిడుగు పుట్టినట్లు. కనుక రామా! చిత్తమును దూరముగా పారద్రోలి స్థిరముగా నుండుము. శ్రవణ మనన నిదిధ్యాసలచే ముక్తుడ వగుము – అసద్రూపమయిన చిత్తమును అనుసరించి ప్రవర్తింపగోరువారు ఆకాశమును చంపదలచి కాలమును గడుపు మూఢులతో సమానులు. ఛీ వాళ్ళముఖము చూడరాదు.

## ౧౨౨ వ సర్గము

వశి :– రామచంద్రా! పుట్టిన మానవులందరూ ఈ జన్మయందుగాని జన్మాంతరమందుగాని అనుష్ఠించిన నిష్కామకర్మలచే చిత్తశుద్ధిని సంపాదించుకొని సత్సాంగత్యపరులై ఉండవలెను – అవిద్యానదీప్రవాహము ఎప్పుడూ ఎడతెరిపిలేనిది. శాస్త్రాభ్యాసమూ, సజ్జనసాంగత్యమూ లేనిదే ఇది దాటతరము కాదు. సత్సాంగత్యముచేత హేయోపాదేయ విచారము కలుగును. (అనగా గ్రహింపతగినది ఏదో, త్యజింపతగినది ఏదో తెలిసికొనవలెనను విచారము కలుగును.) అపుడు ఆపురుషుడు శుభేచ్ఛయను జ్ఞానభూమికను పొందును. పిదప వివేకవశంచేత విచారణచేయగా, సమ్యగ్జ్ఞానము కలిగి అజ్ఞాన వాసనలను వదలి ప్రపంచవాసనలనుండి మనస్సు సన్నగిల్లును. అపుడు సాధకుడు తనుమానస మను భూమికను చేరును. ఆపైన సమ్యగ్జ్ఞానము కలిగినతోడనే సత్త్వాపత్తియను చతుర్థభూమిక సంప్రాప్తమగును. దానిచే ప్రపంచవాసనలు పూర్తిగా క్షీణించగా అసంసక్తి యను పంచమభూమిక ప్రాప్తించును. ఇట్టివాడు కర్మఫలబద్ధుడుగాడు. క్రమంగా నేనే బ్రహ్మ నను భావన వృద్ధిచెంది బాహ్యార్థములను విస్మరించును. ఇట్టివాడు సమాధియందున్ననూ, వ్యుత్థితుడయిననూ, బాహ్యములయిన స్నానభోజనాదుల చేయుచున్నను చేస్తున్నానని అనుకోడు. రుచితో సేవించడు. వాటిని స్మరించడు. పిల్లవాడివలెనూ, పిచ్చివాడివలెనూ, పరేచ్ఛచేత స్నానభోజనాదులను చేస్తూ ఉంటాడు. తరువాత పదార్థభావనయను ఆరవభూమికను పొందుతాడు. పిదప కొన్ని సంవత్సరములు అభ్యసించి తుదకు తుర్యాత్మ యను ఏడవభూమికకు వస్తాడు. జీవన్ముక్తిసుఖము ఈ భూమికయందే ముఖ్యము. మిగిలిన భూమికలందు

అంతముఖ్యము కాదు. ఈ భూమికలో నున్నవాడు దొరికినదానిని గూర్చి సంతసించడు. దొరకనిదానిని గూర్చి దుఃఖించడు. ప్రాప్తించిన దానితో తృప్తిపడుచుండును – 'రామా! నీవుకూడ తెలియదగిన తత్త్వమును తెలిసికొన్నావు. అన్నిటియందునూ వాసనలు క్షీణించినవి. నీకు నీవు సమాధిలో నుండుము. అథవా లోకసంగ్రహార్థమై లోకవ్యవహారమందైనను ఉండుము. హర్షశోకములను మాత్రము పొందకుము. పరిశుద్ధాత్మస్వరూపుడ వయిన నీకు సుఖదుఃఖము లెక్కడివి? అద్వితీయుడవయిన నీకు బంధువు లెవరు? అవినాశుడవగు నీకు వినాశమేమిటి? అమృత్యువుకు స్థానమయిన నీకు మృత్యువేమిటి! కుండపగిలి పెంకులు అయినంతమాత్రంచేత అందలి ఘటాకాశము నశించదు. నిరర్థకమయిన భ్రాంతిమాత్రం పుట్టుచున్నది నీకు. ఆత్మవ్యతిరిక్తమయిన వస్తువేదియు లేదు; సర్వశక్తియుక్తుడగు ఆత్మయందే అన్నిశక్తులును గలవు. మనస్సువల్ల తయారయిన ఈ ప్రపంచం మనోనాశమయితే నశిస్తుంది. సంసారమనే యంత్రమును నడపునట్టి వాసన అనే రజ్జువును (రబ్బరు పట్టాను) పురుషప్రయత్నంచేత తెగగొట్టుము. నిజతత్త్వం తెలుసుకోకపోతే మహామోసం చేస్తుంది ఇది. నిజతత్త్వం తెలుసుకొంటిమా, బ్రహ్మసుఖాన్ని ఇస్తుంది. ఈ మాయ బ్రహ్మమునుండి వచ్చింది. లీలామాత్రంచేత సంసారమును అనుభవించింది – మళ్ళీ బ్రహ్మను స్మరించింది. సంసారాన్ని నాశనం చేసింది. తాను మళ్ళీ బ్రహ్మతో లయిస్తోంది. రామా! నీరూపుడూ, అప్రమేయుడూ, నిరామయుడూ అయిన పరశివునినుండి సకలభూతములు పుట్టుచున్నవి. అగ్నివల్ల వెలుతురు పుట్టినట్లే. ఆకులో సన్నని రేఖలూ, నీటిలో తరంగములూ, బంగారమునందు కటకాదులూ, అగ్నియందు వేడి వెలుతుర్లూ, ఎట్లో– అట్లే. వాసనావచ్ఛిన్నమయిన బ్రహ్మయందు ఈముల్లోకములూ ఉన్నవి. అతనినుంచి పుట్టినవి. అరూపముతోనే ఉన్నవి. అతడే సర్వభూతములకు ఆత్మరూపుడు. అతడే బ్రహ్మ. అతడు తెలిసినచో ప్రపంచమంతా తెలియును. భువనత్రయమందును అతడొక్కడే జ్ఞాత. శాస్త్రమునందు వ్యవహరించుటకుగాను సర్వవ్యాపకమయిన పరమాత్మకు చిత్తు అనీ, బ్రహ్మ అనీ, ఆత్మ అనీ నామములు

శాస్త్రకర్తలచే కల్పింపబడినవి. ఇష్టానిష్టవస్తువులకు ఇంద్రియములతో సంబంధము కలిగినపుడు హర్షామర్షములులేని శుద్ధచైతన్యమే ఆత్మ. ఆకాశముకంటె మిక్కిలి స్వచ్ఛమయిన ఈచిదాత్మయందు ఈప్రపంచము తనలోనే తనకంటె వేరుగ నున్నట్లు ప్రతిబింబించుచున్నది. ప్రపంచమూ, ప్రపంచమను జ్ఞానమూ, తత్ప్రయుక్తములయిన లోభ మోహాదులూ నిజంలో లేనివయియే, ఆచిదాత్మయందు వేరువేరుగ ప్రతిబింబించినవి. పరమార్థంలో అవి అన్నీ ఆత్మరూపములే – అద్దమునందు కనిపించెడి పర్వత వన నద్యాదులు అద్దముకంటె నిజంలో భిన్నములు కావు. కనుక రామా! శరీరరహితుడవై, నిర్వికల్ప చిదాకారుడవగు నీకు లజ్జాభయవిషాదాదులవల్ల మోహమేల? దేహము లేని నీవు దేహమువల్ల బుట్టిన లజ్జాదివికల్పములచేత, మూఢునివలె తిరస్కరింపబడుట ఏల? అఖండ చిద్రూపుడయిన ఆత్మయొక్క దేహము కోసి ముక్కలుచేస్తే అజ్ఞానియగు ఆత్మకే నాశము (చావు) లేదే? ఇంక జ్ఞానికేముండును? ఎక్కడా రాకపోకలకు అడ్డులేని చిత్తమే శరీరమునందుండి పురుషు డనబడుతోంది. అంతేగాని శరీరముకాదు పురుషుడు–శరీరము ఉన్ననూ, లేకున్ననూ, చిత్తను అనే పురుషుడుమాత్రము జగత్రయమందు జ్ఞానిగానో అజ్ఞానిగానో ఉన్నాడు. దేహము నశించినా ఆపురుషుడు నశించడు. మన మనుభవించెడి చిత్రవిచిత్రములయిన దుఃఖములన్నీ దేహమునకూ దేహమునందలి చిత్తమను పురుషునకూగాని చిదాత్మకు గావు. మనో మార్గమునకు గోచరముకానందున ఏచిత్పదార్థము శూన్యమువలె (లేనిదివలె) నున్నదో అట్టి చిత్పదార్థము సుఖదుఃఖములచే ఎట్లు వ్యాప్తమగును? – ఈజీవుడు నశించిన దేహపంజరమునుండి లేచి, దానియం దభిమానమును విడచి, తనకు అధిష్ఠానమయిన పరమాత్మను పొందుతున్నాడు. "మనఃప్రాణే ప్రాణస్తేజసి తేజఃపరస్యాం దేవతాయాం" అను శ్రుతి యిందు ప్రమాణము. – పద్మమునుండి తుమ్మెద లేచి ఆకాశమును చేరినట్లే– కాని భేదవాసనలకు మూలమైన అజ్ఞానాన్ని పోగొట్టే జ్ఞానం కలగనందున ముక్తుడగుట లేదు. రామా! ఒకవేళ నీవు జీవుడు ప్రతిబింబరూపుడనీ, ప్రతిబింబానికి ఉపాధికంటె వేరుగ ఉనికి లేదనీ, అందువల్ల ప్రతిబింబరూపుడగు

జీవుడు ఉపాధినాశంవల్ల నశిస్తాడనీ అనుకున్నా, దేహనాశంవల్ల నీకు దుఃఖము అవసరము లేదు. జీవునకు అంతఃకరణము ఉపాధికాని స్థూల దేహము ఉపాధికాదు. అంతఃకరణమునందు ప్రతిఫలించినదికాని, చైతన్యము స్థూలదేహమునందు ప్రతిబింబించలేదు. అందువల్ల స్థూలదేహము నశించినందువల్ల జీవునకు నాశము లేదు. కనుక దేహ నాశమును అనుసరించి దుఃఖింప పనిలేదు. అథవా — నీవు జీవుడవు కావు. పరమాత్మవు కనుక ఉపాధినాశంవల్ల జీవుడు పోయినందున నీకు పోయినదేమీ లేదు. నిజస్థితిలో ప్రతిబింబము బింబమేకాని బింబముకంటె వేరుకాదు. బింబమే ఉపాధిలో ప్రవేశించినట్లునూ, భిన్నమయినట్లునూ కల్పించుకొని ప్రతిబింబమును గ్రహించుచు న్నారు. ఇట్లు చిదాభాసుడు బింబరూపుడుకాక, జడమయిన ఉపాధి యొక్క కార్యమే అయినచో ఇతడుకూడ జడమే యగునుకాన, ఇతనికి సంసారభానమూ, సుఖదుఃఖానుభవమూ ఉండేదికాదు. అందుచేత నీవు ఉపాధిని విడిచి, జీవుడు సత్యమయిన బ్రహ్మ అనియే భావించుము. భ్రాంతి కల్పితమయిన దేహాదిభావమును భావింప కుము. దేహాదులు నశ్వరములు, అసద్రూపములు, పరిపూర్ణ బ్రహ్మ రూపుడనయిన నీకు ఏవిధమయిన కోరికయు లేదు. సాక్షిమాత్ర మయిన నిరీక్షకస్వచిదాత్మయందు లోకములు అద్దమునందు ముఖా దులవలె కోరకున్ననూ ప్రతిఫలించినవి. మణియందు కిరణములు కనిపించినట్లు సాక్షిచైతన్యమునందు లోకములు కనిపించుచున్నవి. అద్దానికీ బింబానికీ కోరికలేకున్నా సంబంధ మెట్లు కలదో, ఆత్మజగ త్తులకుగూడ అట్లే సంబంధము. సూర్యుడిసాన్నిధ్యమాత్రంచేత లోకవ్యవహారములు జరుగుచున్నట్లు చిత్సత్తామాత్రంచేత ప్రపంచం తయారవుతోంది. కనుక రామా! నేను చెప్పిన ఉపదేశక్రమంచేత ప్రపంచమునకు మూర్తమగు ఆకారము ఎగిరిపోయింది. ప్రపంచస్థితి అంతా ఆకాశమయింది (శూన్యమయింది). ఓ ఇతరసభ్యులారా! మీచిత్తమునందుకూడ ఇదే విషయమును భావించుడు. దీపము ఉన్నంతమాత్రంచేత వెలుతురు సహజంగా ప్రసరించినట్లు, చిత్త త్వము ఉన్నంతమాత్రంచేత స్వభావతః ప్రపంచస్థితి నెరవేరుతోంది. రామా! పరమాత్మతత్త్వమునుండి మొదట మనస్సు పుట్టింది.

తరువాత వికల్పజాలముతో సహా ప్రపంచం పుట్టింది. శూన్యమయిన ఆకాశమునందు శూన్యమయిన నీలత్వము లోకవాడుకలో గోచరించి నట్లుంది మనస్సువల్ల ఈజగత్తు పుట్టడము. – కనుకనే సంకల్పములు నశిస్తే చిత్తం నశిస్తుంది. చిత్తం నశిస్తే సంసారమోహామనే మంచుబిందువులు ఎగిరిపోతాయి. అపుడు శరత్కాలంవస్తే ఆకాశం నిర్మలంగా ఉన్నట్లు అజరామరము, అద్వితీయము అగు బ్రహ్మ మాత్రము ఒక్కటే ప్రకాశిస్తుంది. సకలప్రాణికర్మసమస్త్యాత్మకము, సమిష్టిక్రియాశక్తిప్రధానము అగు మనస్సు మొట్టమొదట పుట్టుచు న్నది. తరువాత దానియందు చిత్తు ప్రతిబింబించుటవలన హిరణ్య గర్భ బ్రహ్మ మన్వాది ప్రజాపతులు మున్నగు సృష్టికర్తల శరీర ములు పుట్టుచున్నవి. ఆపైన ఈమిథ్యాప్రపంచం అంతా తయారవు తోంది. కనుక దృశ్యమయిన ప్రపంచం అంతా వ్యష్టిసమిష్టిభేద ముచే కల్పితమై మనోమాత్రమేకాని అంతకంటె వేరుకాదు. ఆమనస్సు అసమాప్రమయిన అజ్ఞానముయొక్క కార్యము. ఆ అజ్ఞా నము అధిష్ఠాన సాక్షిచైతన్యముయొక్క సత్తాస్ఫూర్తినల్ల స్ఫురి స్తోంది. కనుక ఈ క్రమంగా బ్రహ్మయే జగజ్జన్మాదులకు వివర్తో పాదానకారణ మని తేలినది. కాబట్టి రామా! నిష్ప్రపంచ సచ్చిదా నందైకరస పూర్ణబ్రహ్మమే పరమార్థము. మిగిలిన ప్రపంచమంతా మిథ్య, కల్పితము. ఇదియే సకల సృష్టిశ్రుతులకూ తాత్పర్యార్థము- అన్నారు వసిష్ఠులు.

౧౨౨వ సర్గ సమాప్తము.

—♦ ఇట్లు ఉత్పత్తిప్రకరణము సమాప్తము ♦—

ఆంధ్రవాసిష్ఠరామాయణమునందు వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి ప్రకరణములుగల ప్రథమభాగము సమాప్తము.

—♦ ఓమ్ శివమ్ ♦—



# —• తప్పొప్పుల పట్టిక •—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 7 | సురుచినే | సురుచిఅనే |
| 6 | 20 | వాష్టనామ | వసిష్ఠనామ |
| 7 | 19 | జ్ఞానమనే | అజ్ఞానమనే |
| 9 | 3 | చెయ్యాలా | చెయ్యాలా ! |
| ,, | 4 | జిజ్ఞాసను | జిజ్ఞాసను |
| ,, | 9 | యాంగ్నస | యావన్నస |
| ,, | 26 | నదీ | నది |
| ,, | 28 | మీంద | మీంది |
| 12 | 6 | అక్షావా | అక్షౌహి |
| ,, | 19 | కానేష్టలు | కానేష్టులు |
| ,, | 26 | శస్త్ర | శత్రు |
| ,, | 30 | గ్రహింపు | గ్రహింపు |
| 18 | 10 | వాసం | వాసం |
| 28 | 10 | యిద | ఇది |
| ,, | 19 | దీని | దీన్ని |
| ,, | 28 | జాస్ర | జావ్వి |
| 31 | 16 | బస్థ | బడ్జే |
| 39 | 20 | తృణగ్రి | తృణాగ్ర |
| 40 | 13 | మైున | మైనా |
| ,, | 24 | ఇంద్రియాలనేఉన్న | ఉన్న ఇంద్రియాలనే |
| 42 | 12 | పిస | పైన |
| ,, | 15 | బహ్మ | బ్రహ్మ |
| ,, | 19 | చడు | చదు |
| 47 | 9 | శతృ | శత్రు |
| 51 | 22 | తత్వ | తత్త్వ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 66 | 28 | ద్వ్యాపారం | ద్వ్యాపరం |
| 67 | 19 | న్మక్తి ఙ్ఞ | న్మక్తి |
| 70 | 20 | అవిద్య | అవిద్యా |
| ,, | 28 | నిర్మ్రణ | నిర్మాణ |
| 71 | 26 | మారు | మార్పు |
| 75 | 29 | పాపిషి | పాపిష్ఠి |
| 79 | 11 | శుశ్రూషప్మాడు | శుశ్రూషాదు |
| 81 | 9 | లేడు | లేదు |
| 83 | 5 | దేవ | దైవ |
| 84 | 22 | షాకారానకే | షకారానికే |
| 88 | 9 | ప్రాబ్ధ | ప్రారబ్ధ |
| 91 | 24 | వడి | పడి |
| 96 | 1 | వచ్ఛిక | వృచ్ఛిక |
| 98 | 10 | స్వీకారావ | స్వీకారా |
| ,, | 13 | పదాల్ని | పదాన్ని |
| 102 | 14 | న్నమాటే | అన్నమాటే |
| ,, | 15 | మంవ | మంట |
| 104 | 2 | మాటాడం | మాటాడటం |
| ,, | 16 | చెప్పించదాని | చెప్పినదా |
| 107 | 9 | చుంచు | చించు |
| 111 | 25 | సవివే | సవిశే |
| 117 | 12 | జ్మలో | జన్మలో |
| 119 | 7 | పరశ | పరవశ |
| 121 | 16 | ఉంటి | ఉంటే |
| 120 | 25 | పాంశవః | పాంసవః |
| 123 | 3 | సారము | సారసము |
| 125 | 12 | చెప్పిని | చెప్పిన |
| 126 | 19 | యాశక్తి | యాసక్తి |
| 127 | 6 | సరమ్సు | సరస్సు |
| 132 | 19 | ఎత్తియున | ఎత్తయిన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 144 | 26 | త్రివుటి | త్రిపుటి |
| 145 | 21 | నాసనం | నాశనం |
| 148 | 9 | నిరూపణం | నిరూపణము |
| 151 | 12 | జానం | జ్ఞానం |
| 152 | 12 | కిమదం | కిమిదం |
| 158 | 15 | పార్థిరము | పార్థము |
| 159 | 9 | అత్మ | ఆత్మ |
| 164 | 20 | సమధానం | సమాధానం |
| 166 | 18 | మృదూత్రిములు | మృదూత్రిపములు |
| 169 | 6 | నీరెండు | నీరెండ |
| 172 | 22 | కొమ్మ్వ | కొమ్మ్మ |
| 179 | 11 | లేదసి | లేరని |
| 184 | 27 | వికాసములు | వికాసాదులు |
| 189 | 10 | సంకల్పం | సంకల్పింప |
| ,, | 14 | మయిన | మయిన |
| 190 | 24 | తపస్సూ | తమస్సూ |
| 195 | 21 | విదర్త | వివర్త |
| 198 | 19 | యివి | యిది |
| 202 | 20 | కారము | కాలము |
| ,, | 21 | ఇది | ఇవి |
| 262 | 7 | సలెనూ | నలెనూ |
| ,, | 14 | మెకు | మెదురు |
| 267 | 9 | ఏవస్తు | ఏకవస్తు |
| 302 | 16 | వ్యవస్తే | వ్యవస్థే |
| 310 | 14 | ప్రిత్యల్ | ప్రిత్యక్ |
| 328 | 18 | ఉన్నది | లేనిది |
| 345 | 21 | అవుతాడు | అవుతుంది |
| 354 | 10 | మిళము | మళము |
| ,, | 11 | విఘూచిక | విషూచిక |
| 358 | 16 | పడ | పడి |